# విక్రం - ఐ.ఏ.ఎస్.



ప్రొఫెసర్. పి.వి. రెడ్డి, Ph.D. (U.S.A.)

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

అబిడ్స్, హైదరాబాదు - 500 001.

Vikram-I.A.S. - A Novel - By: Prof. P.V. Reddy

ప్రథమ ముద్రణ : డిశంబరు, 1996.



ముఖచిత్రం : శ్రీనివాస్

వెల : రు. 90-00

ప్రతులకు:

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి.

అక్షరకూర్పు: ట్వంటీ ఫస్ట్ సెంచరీ, హైదరాబాద్. ఫోన్. 4066986
ముద్రితము : శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, 3-5-323, విఠల్‌వాడి,
నారాయణగూడ, హైదరాబాదు-500 029 * ఫోన్ : 597831

# అంకితం



పి. దమయంతి రెడ్డి

1956లో నా భార్యగా నా జీవితంలో ప్రవేశించి ముప్పది
ఆరు సంవత్సరాలు జీవితాన్ని పంచుకొని 1992లో
నన్ను వీడి ఎవరూ మళ్ళీ తిరిగి రాని ఏ లోకాలకో
వెళ్ళిపోయిన నా అర్ధాంగి దమయంతి దేవికి
అశ్రుతర్పణములతో...

పి.వి. రెడ్డి, Ph.D.(USA)

## ఒక్క క్షణం

ఈ పుస్తకం అమెరికాలో కూర్చొని వ్రాసింది.
ఇది కేవలం నా కల్పితమే.
ఏ కల్పనలోనైనా స్వీయానుభవము అచ్చటచ్చట
మిళితం కాక తప్పదనుకుంటా.
అదే యిందులో కూడ జరిగిందనుకుంటాను.

పి.వి. రెడ్డి, పిహెచ్.డి. (యు.ఎస్.ఎ.)

# విక్రం - ఐ.ఏ.ఎస్.

ఇదొక పల్లెటూరు. యీవూరిలో ధర్మారాయుడు /పెద్ద రైతు, మునసబు. తండ్రి ధర్మారావుకు 18 సంవత్సరాలు నిండగానె తండ్రి అకాలమరణానికి గురి అయినాడు. తండ్రి చావుతో సంసారభారమంతా ధర్మారావుపైననే పడింది. అనుభవములేని ధర్మారాయుడు ఆ భారాన్నంత మోయవలసి వచ్చింది. యితనికి తోడు నీడగా యీతని తండ్రికి పరమమిత్రుడైన గోపాలరాయుడు నిలిచిపోయినాడు. తన కుమారుని వలెనే ఆ గోపాలరాయుడు ధర్మారాయునికి సరైన మార్గదర్శము యిస్తూ వచ్చినాడు. తండ్రి మరణించిన నాలుగు సంవత్సరాలకే ధర్మారాయుడికి ఒక కొడుకు జనించినాడు. ఇతని పేరు విక్రం అని పెట్టుకున్నారు ధర్మారావు, శ్రీలత దంపతులు.

ఈ ధర్మారాయుడు తనకు చదువుటకు వీలులేకుండె కాబట్టి యీ చిన్నారి పొన్నారి తన బాబునైన మంచిగా పెద్ద చదువులు చదివించాలె అని యితని ప్రగాఢవాంఛ. అందుకే అంత చిన్న వయస్సుననె ఒక తురక వస్తాదుకు నెలకు జీతము నిర్ణయించి, తన చిన్నారి తనయుని చదువు రెండేళ్లప్రాయముననే మొదలిడినాడు. అయితే ఈయనను అందరు వూరి వాళ్లు "వస్తాద్" అని పిలిచేవారట. వస్తాదంటే గురువని అర్థము లేదా చదువు నేర్పించే పంతులు అని అర్థము. ఈ చిన్నారి బాబును ఆ తురక వస్తాదు తిండి తినిపించినప్పటినుంచి సాయంత్రం పడుకునే వేళ వరకు తరిఫీదు యిస్తూవుండేవాడు. అక్షరాభ్యాసము చేయించింది ఈ వస్తాదేనట. శ్రీకారము కూడా ఈయనే జరిపించెనట. ఆ కాలంలో పిల్లల చదువుకొరకు యిటువంటి పంతుళ్లు తప్ప ప్రభుత్వ పారశాలలు లేకుండెను. తమ పిల్లలకు చదువు నేర్పించుకోరు. వారు యేదో అక్షరాస్యులుగల వారికి ఇంత వేతనముల నిర్ణయించి తమ పిల్లలను యిట్టి ప్రైవేట్ పారశాలకు పంపువారు.

ఈ ధర్మారావు బాగా భూములు పంటలున్న మనిషి కాబట్టి అతనే యీ వస్తాదుకు జీతం యిచ్చి తనకుమారుని చదువుకై నియమించెను. ఈ బాలునితో సహా వేరే రైతులు, కోమట్లు మరియు బ్రాహ్మణుల పిల్లలు కూడా వస్తాదు వద్దనే విద్యాభ్యాసము కావించుచుండిరి. ధర్మారావుగారు ఆయన కుమారుని విద్య ప్రథమ దశకు పునాదులు ఈ విధంగా పడినవి. అయితే ఆ కాలంలో ఒక పంతులు ఒకవూళ్ళో యెల్లకాలము పంతులుగా వుండాలని యెచటనున్నది. తనస్వకుటుంబ విషయాల కొరకు లేక వేరే వూళ్లలో మంచి అవకాశము దొరికినందులకు మరి అనేక కారణాల వల్ల ఈ ఉద్యోగానికి స్వస్తి చెప్పి పోయెడివారు. ఈ వస్తాదు కూడా అదే చేసినాడు. అంటే ధర్మారావుగారు మరొక పంతులుకై వెదకనారంభించెను. కాని

యీసారి అనుకోకుండానే ధర్మారావు తనయునికి వేరే ఉపాధ్యాయుడు చదువునేర్ప ప్రారంభించెను.

ధర్మారావు చిన్నప్పటి స్నేహితుడు పక్కవూరి సుదర్శన్‌రావు. వారు వాళ్ల వూరికి చిన్న జాగిర్దారు లేదా దేశపాండేలు. వారి కొడుకు ఈ ధర్మారావు కొడుకుకు వయస్సులో ఒక సంవత్సరము వ్యత్యాసము. ధర్మారావువలెనె యీ సుదర్శన్‌రావుగారు కూడా 4, 5వ తరగతి వరకు చదువుకున్న రంగనాథశాస్త్రిగారిని అయన పుత్రునికి ఉపాధ్యాయులుగా నియమింపచేసిరి. రెండు గ్రామాలు ప్రక్కప్రక్కనే కాబట్టి ధర్మారావు మనుషులలో ఒకతను రోజూ ఉదయం గుర్రం పైన ధర్మారావు తనయుడగు విక్రంని సుదర్శన్‌రావు యింట్లో విడిచి, మళ్లీ సాయంకాలం ధర్మారావుగారి యింటికి తెచ్చుచుండెను. ఈ విధంగా సుదర్శన్‌రావుగారి తనయుడు పరమేశ్వర్‌రావు మరి విక్రం రావు మరి యితర పిల్లలు సుదర్శన్‌రావు గారి యింటిలో విద్యాభ్యాసము చేయించుచుండిరి.

సుదర్శన్‌రావుగారు చాల నీతి నిజాయితిగల మనిషి. ఈయన సతీమణి కల్పవల్లి. తల్లిగారి ఇల్లు ధర్మారావుగారి వూరే. ఈమె చాలా మంచిదని ధర్మారావుగారు అనుచుండెడివారు. రూపురేఖలలో గుణగణాలలో ఈమెకు ఈమెయే సాటి. సుదర్శన్‌రావుగారామెను పరిణయమాడిన కొన్ని సంవత్సరాలకే ఈమె తండ్రి మరణించినాడు. యిప్పుడు ఆమెకు మిగిలినది విధవరాలగు తల్లి మరి ఒక తమ్ముడు. తమ్ముడు చురుకైన వాడే కాని, అ చురుకుదనాన్ని మంచిదారిలో ఉపయోగించక బీదరైతులను మోసగించి, దానితో వచ్చిన ధనంతో కారుకొని వేరే దుర్వ్యసనాలకు ఉపయోగించేవాడు. యితడు రాజకీయ నాయకుడు కాలేదుగాని ఆ వృత్తికి చాలా తగిన వాడని వీరి వలలోపడ్డ కొందరు రైతులు మాటాడుకొనువారు. ఆయన భార్య చాలా సద్గుణరాశి కాని రూపవతి కాకుండుట వలన, ఈతడు మరి కొందరితో సంబంధాలు పెంచి వారితోట కాపురము చేయుచుండెను. మొదటి భార్య లోలోన కృంగిపోయినా ప్రపంచానికి నవ్వుచునే ప్రత్యక్షమయ్యేది. దురదృష్టవశాత్తు ఆమెకు సంతానము కూడ కాలేదు.

ఈయన అక్కగారు కల్పవల్లికి, ఈ తమ్మునిగారికి యేమాత్రము గుణములో పోలికలే లేవు. రూపాలు యేకమైనా ఒకే తల్లిదండ్రి సంతానమైనా అక్కతమ్ములకు భూమికి, ఆకాశానికి వున్నంత వ్యత్యాసముండేది. కాని కల్పవల్లి పెద్ద అయినందువలన తమ్ముడు అక్కమాటను తరచుగా కాదనడు. కల్పవల్లి పరమేశ్వరరావుని, విక్రంరావుని తన స్వంత కొడుకుల వలెనే చూసేది. విక్రంరావు రోజూ తన తండ్రి ధర్మారావు యింటికే వెళ్ళేవాడు కాని ప్రొద్దునంత సుదర్శనరావు గారింట్లోని పరమేశ్వరరావుగారి గురువు వద్దనే చదువుకునేది. పరమేశ్వరరావు టీ త్రాగినప్పుడు విక్రంరావుగారికి కూడా టీ సిద్ధమే. వర్షాలు జోరుగా వచ్చిన రోజు విక్రంరావు పరమేశ్వరరావు యింట్లోనే ఉండిపోయేవాడు. కల్పవల్లి విక్రంకు యేకొరత లేకుండ తన యింట్లోనే అన్నివసతులు కల్పించేది. ఈ విధంగా విక్రం పరమేశ్వరులు అన్నదమ్ములవలె ఒకే గురువు వద్ద విద్యాభ్యాసము చేయుచుండిరి.

ఆ కాలంలో పల్లెటూళ్ళలో సర్కారు పాఠశాలలు లేకుండెను. ధర్మారావుగారి వూరు, సుదర్శనరావుగారి వూరు ఒకే జిల్లాకు చెందినవి. ఈ జిల్లా నిజాం సర్కారుకు చెందిన 16 జిల్లాల్లో యిది ఒక జిల్లా. కాని, ఈ జిల్లాకు ఒక ప్రత్యేకత వుంది. ఈ జిల్లాపేరు సర్వెకాసు. అంటే దీనిలో వచ్చిన ఆదాయము అంటె, పన్నులతో సహా నిజాం గారి స్వంత ఖర్చులకే కాబట్టి, ఈ జిల్లా అభివృద్ధికి ఒక కాని కూడ నిజాంగారు వెచ్చించి యెరుగరు. తక్కిన జిల్లాల్లో కొంతైనా అభివృద్ధి జరిగి యుండవచ్చు. కాని సర్వెకాసు జిల్లా భాగ్యరేఖలో అదిలే దని చెప్పాలి. అందుమూలంగా ప్రభుత్వ పాఠశాలలే లేకుండెను. చదువుకు సర్కారువారి ప్రోత్సాహమే లేకుండె, కాబట్టి చదువుకొన్నవారంత ప్రైవేట్ పంతుళ్ళ వద్దనే చదువుకొనవలె. యెవరో కొంతమంది డబ్బున్నవారు చదువుకున్న పంతులుని తమ పిల్లల చదువుకై నెలకు ఇంత జీతము అని యేర్పాటు చేసికొని బడిని తెరచి తమ పిల్లలకు చదువు నేర్పించేవారు. ఈ పిల్లలకు ఆ గురువుగారి కొచ్చినంత చదువు రాగానే, వసతి వున్నవారు పిల్లలను పట్టణాలకు లేదా జిల్లాలకు పంపించి పై చదువులు చదివించే వారు. లేదా వచ్చినంత చదువే చాలని వారిని కరణముగానో, పటేలుగానో పని చేయించెడివారు. లేదా వ్యవసాయ పనులకో పంపెడువారు.

సుదర్శన్‌రావుగారున్ను, ధర్మారావుగారున్ను తమ సంతానానికి విద్య నేర్పించుటకు కొద్దిగా చదువుకున్న వారిని తమ పిల్లల చదువులకై నియోగించేవారు. ఆ కాలమున మగపిల్లల చదువులకే శ్రద్ధలేని తల్లిదండ్రులు ఆడపిల్లల చదువులకంత శ్రద్ధ చేసేడివారు కారు. అందుకే స్త్రీ విద్య అభివృద్ధి నొందినదికాదు. ఆడపిల్లలకు 9–10 సంవత్సరాలు రాగానే ఒక చదువుకున్న పిల్లవానిని చూచి వారి కుటుంబం మంచిదా ఆస్తి అంతస్తులు వున్నావా లేవా చూచి ఆ అమ్మాయిల పెళ్ళిళ్లు చేసి కాపురానికి అత్తవారింటికి పంపెడివారు. అది ఆకాలపు ఆచారము. అదే విధంగా సుదర్శన్‌రావు తన కుమార్తె శ్రీలతను 10 యేళ్ళ వయస్సురాగానే ఘనంగా పెండ్లి చేసి అత్తవారింటికి తగిన మర్యాదలతో పంపించినారు. కాని ఆమె యుక్తవయస్సు రాగానే భర్తగారు ఆమెను గ్రహించక వేరే ఒక స్త్రీతో కాపురము పెట్టినాడు. అనాటికి యీనాటికి హిందూ సంఘంలో స్త్రీకి భర్త ఆదరణ లేనిది నరకయాతన. ఈ సమాజంలో వేరే సమాజాలవలె విడాకులు లేవు. స్త్రీ తల్లిగారింటినుండి పల్లకిపైన అత్తవారింటికి ప్రవేశించిన పిమ్మట మళ్లి పాడెపైననే అత్తవారింటినుండి వెళ్లగలదని ఒక నమ్మకము. ఈ కాలంలో ఆ పట్టింపులు ఇంకా పాటిస్తూన్నారో లేదో తెలియదు.

కొన్నాళ్లకు హటాత్తుగా, అనుకోకుండా సుదర్శన్‌రావు గుండెనొప్పితో చనిపో యినాడు. కల్పవల్లి, కరుణామయి. ఆమెకు అనుకోకుండ తన భర్తగారి మరణంతో ఆమె లోకం తలక్రిందులయ్యింది. పరమేశ్వరరావు చిన్నవాడు. శ్రీలత చిన్నదైన అత్తవారింట్లోనే వుంది. ఆమె భర్త శ్రీలతకు యేమి సంసార సుఖాలనిస్తు లేడని కల్పవల్లికి తెలుసు, కాని భార్యభర్తలు ఇంకా ప్రపంచానుభవము లేనివారు కాబట్టి కొంత వయస్సురాగానే ప్రపంచానుభవము రాగానే సర్దుకుంటారన్న ఆశతో భర్తగారి నీడలో అంత ఆనందంతో కాకున్నా కొంత కొంత ఆనందంతో ఉంటుందని ఆశించింది.

యేకైక పుత్రుడగు పరమేశ్వరునితో భర్తతో కాపురం చేస్తూవుండే కాని యిప్పుడు అనుకోకుండా భర్త ఆ లోకాన్ని వీడి పోవడంవల్ల తన లోకమంత తలకిందులైనది. తండ్రి అంతిమక్రియలకు కూతురు తన భర్త వెంకటరావుతో వూరు చేరుకుంది. అందరు బంధువులు తమ్ముడు, తల్లితో సహా చేరుకున్నారు. ధర్మారావు కూడా విచ్చేసినాడు. సుదర్శన్‌రావు అంత్యక్రియలుకాగానే కల్పవల్లి భవిష్యత్తు గురించి అందరు మాట్లాడినారు. తమ్ముడు, తల్లి, కల్పవల్లి ఒక నిర్ణయానికి వచ్చినారు. అది యేమిటంటే భర్తగారి వూరిలో తనను తన చిన్నారి తనయుడు పరమేశ్వరునికి యెట్టి సహాయపడే వారుండరని తన తమ్ముడగు శ్రీనివాసు, తల్లియగు లక్ష్మమ్మతో తండ్రిగారి యింటనే ఉండుట మంచిదని నిర్ణయించుకొన్నారు. కల్పవల్లి తండ్రిగారు మరి ధర్మారావుగారు ఒకే వూరి వారవుటచేత విక్రం మరి పరమేశ్వరులు వేరుకావలసి రాలేదు. కాని ధర్మారావుగారు మరి శ్రీనివాసుగారు ఒక పంతులుకై వెదికినారు. 5th standard పాసై ఉద్యోగానికై వెదుకుతున్న రామయ్యగారు వీరికి ఉపాధ్యాయులుగా నియమితులైనారు. విక్రం పరమేశ్వరులు చిన్నబాలురు కావున రామయ్య నాయుడు తగిన సమర్థుడే అని నిర్ణయించి వారిని ఈ యిద్దరు బాలురకు విద్యాబోధకులుగా నియమించినారు.

రామయ్యనాయుడు చిత్రగిరికి 6 మైళ్ల దూరములో నున్న రామపుర నివాసి. తల్లిగారు చిన్నపుడే యీయనను మరి యిద్దరి తమ్ముండ్రను విడిచి చనిపోయినదట. తండ్రి మరో పెండ్లి చేసుకొన్నందువల్ల ముగ్గురు అన్నదమ్ములు యేదో ఒక ఉద్యోగము చేసుకొని బ్రతుకుచుండెడివారు. రామయ్యనాయుడు గారు గతనాలుగు మాసములనుండి నిరుద్యోగిగానుండెను. అందువల్ల ఈ ఉద్యోగాన్ని దేవుడిచ్చిన వరముగా గ్రహించి శ్రద్ధతో పరమేశ్వరునికి విక్రంకు మరి యితర వూరి పిల్లలకు కూడా బోధన మొదలు పెట్టెను. రామయ్యనాయుడు గారు 5 వ తరగతి వరకు చదివి వీలులేనందున చదువు విడిచి పెట్టెను. యిప్పుడు చిత్రగిరిలో నివసిస్తున్నాడు. అతనికి వూరిలో కొంతమందితో స్నేహము కలిగింది. వుదయము 9 గంటలనుంచి సాయంకాలము 5 గంటల వరకు బడిలో, పిమ్మట యింట్లోను స్నేహితులతోను కాలము గడుపుచుండెడివాడు.

పిల్లలంతా బడిలో చాపలపైన కూర్చుండెడివారు. నాయుడుగారు మాత్రమే కుర్చీలో కూర్చుండెడివాడు. యెవరన్న పిల్లల తండ్రులు వస్తే కూర్చోవడానికి తన పక్కన ఒక పాత బెంచ్ తన కుర్చీ ముందర ఒక పాత బల్ల యివి ఆ బడిలోని ఫర్నిచర్. విక్రం పరమేశ్వరులు కూడ చాపమీదనే కూర్చొనెడి వారు తక్కిన పిల్లల వలె. ఈ విధంగా చదువుకొనే బడిలో బీద, ధనికుడు అను బేధము లేకుండా పిల్లలంతా సామ్యవాద సిద్ధాంతాన్ని పాటిస్తుండేవారు. నాయుడిగారి ఇంగ్లీషు కూడా 5వ తరగతి ఇంగ్లీషే. యేమి తెలియని పిల్లలకు యీ ఇంగ్లీషు ఒక గొప్ప చదువే. పిల్లలకు నిజాం రాజ్యములో తెలుగు, ఉర్దు మరి ఇంగ్లీషు నేర్పుట ఆచారముగా నుండెను. ఇంగ్లీషు text book Rapid reader అని మొదలుపెట్టించినాడు. ఉర్దూలో పహిలి, దూస్రీ యింకా కొత్త పార్సీ అరబ్బీతో కూడుకొనిన ఇంకో పుస్తకం రుక్కాయత్‌యినా యతలలి అను పుస్తకము. మరి తెలుగులో

వాచకాలు శతకాలు, లెక్కలలో గిద్దెల యెరుసులు మొదలగునవి నేర్పించెడువాడు. ఎక్కాలు, బొట్ల యెరుసులు, గిద్దల యెరుసులు, చెప్పిన పద్యము వ్రాయుట.

ఈ పల్లెటూరి బడిలో పిల్లలు (ఆడ మొగ) ఉదయమంతా నిన్నచెప్పిన పాఠాలన్ని నేర్చుకొనుచుండెడివారు. అవి నేర్వగానే మధ్యాహ్నము పంతులు దగ్గరకు వెళ్లి, నిన్నటి పాఠాలన్నీ పంతులుగారికి వప్పజెప్పి అడిగిన ప్రశ్నలకు సమాధానమిచ్చిన పిమ్మట, మళ్లి కొత్తపాఠాలను పంతులుగారితో చెప్పించుకొని తమ తమ చోటులకు వెళ్లి కూర్చొని మళ్లి వేరే Subject లోని పాఠాలను నేర్చుకొనెడివారు. యీవిధంగా అన్నిపాఠాలు పూర్తి అవగానే శతక పద్యాలతో అనాటి బడి పని పూర్తి. తర్వాత అందరూ తమ తమ యిండ్లకు వెళ్లేవారు.

పిల్లలది విచిత్రమైన ప్రకృతి. యింట్లో పెద్దలుచేసే పనులు పిల్లలు వాటిని ఆటలలో ఆ పద్ధతులనే అవలంబించెడివారు. విక్రం చిన్నగా నున్నప్పుడు రామయ్య నాయుడు అనాడేదో పనిమీద బయటికి పోయినాడు. ఇప్పుడు బడిలో పిల్లల రాజ్యమే. అందరికన్న పెద్దది అనంతలక్ష్మి, సరోజని. పెద్ద పిల్లలు ఆటలు యేమాడవలెనో నిర్ణయించిరి. భార్యా భర్తల సంసారము చేసేటి ఆట ఆడాలని యీ ఇద్దరు నిర్ణయించిరి. భార్య యెవరు, భర్త యెవరు అని నిర్ణయించిరి. పిమ్మట భార్యా భర్తలు సంతాన ప్రాప్తికై దేవుని వేడుకొనిరి. అనంతలక్ష్మి గర్భవతాయెను. ఆమెకు విక్రం జనించెను. అంటే ఆ ఆటలలో విక్రంకు అనంతలక్ష్మి తల్లి అయ్యెను. అల్లరిచేసినప్పుడు తల్లి పిల్లవానిని యెలా అదుపులో వుంచవలెనో ఆ తల్లి అందరకు చూపించెను. ఆ విధంగా రామానాయుడు మళ్లీ బడికి వచ్చేవరకు వీరు ఆ ఆటకొనసాగుతూనే వుండెను. నాయుడుగారు (పంతులు) రాగానే మళ్ళీ యెవరి చాపపైన వాళ్లు కూర్చొని యేమి జరుగనట్లుగా తమ పాఠాలు వల్లించుచుండిరి. అంటే పంతులుగారు లేకున్న పిల్లలు బాధ్యతను గుర్తించి తమ విధులని నిర్వర్తిస్తున్నారని పంతులు అనుకొనుటకు.

యీ పల్లెటూరిలో అనాడు యీ చిన్నబడి ఒక విజ్ఞానకేంద్రమనే చెప్పాలి. యెందుకనగా అవూరిలో చాలామంది (95%) నిరక్షరాస్యులే అందువల్ల యెవరికైనా యేదో ఒకచోటి నుండి ఉత్తరము వచ్చిందనుకో. వాళ్లు సామాన్యంగా ఆ వుత్తరము తీసుకొని యీ బడికి ప్రత్యక్షమవడమే. పంతులునో లేదా చదువుతున్న విద్యార్థులలో యెవరినో ఒకరిని బతిమాలి యేమి వ్రాసిందో ఆ ఉత్తరములో చదివి వినిపించమని, చదివి వినిపించగానే, మళ్లి మరుసటినాడు ఒక ఉత్తరము తెచ్చి దానికి జవాబు వ్రాయమని వ్రాయించుకొని పోయెడివారు. అయితే ఆ కాలంలో ఊళ్లలో విద్యా సౌకర్యాలే కాక తపాలా సౌకర్యాలుకూడా లేకుండెను. బ్యాంకులు మరియు సర్కారువారు యీనాడు నెలకొల్పిన యే సౌకర్యాలు లేకుండెను. యిక రెండవది చిన్నకారు రైతులు, గొల్ల, గౌండ్ల వారు డబ్బు మిత్తీలకు యిచ్చుచుండెడివారు. అయితే యెవరైతే అప్పులు తీసుకొనుచుండిరో వారినుండి ఒక పత్రం డబ్బు అప్పుగా యిచ్చువారికి యివ్వవలసి యుండెనుకదా అది కూడా యీ పంతులుగారు మరింకెవరైనా పత్రాలు వ్రాయగలగునంత చదువు వచ్చు వారు వ్రాసి అప్పు తీసుకున్న వాళ్ల సంతకం తీసుకొని (అంటె బొటన వ్రేలి ముద్ర) అప్పు

యిచ్చిన వారికి యిచ్చేవారు. అప్పు యిచ్చేవారికి యీ పత్రం సమర్పించేముందు అందులో యేమని వ్రాపింది విపులముగా చదివి చెప్పిన మీదటనే వ్రేలిముద్ర వేసి పత్రాన్ని సమర్పించెడివారు. యీ నిరక్షరాస్యత మూలంగా కొందరు అప్పే తప్పు మిత్తీలు అసలు వ్రాయించుకొని వాళ్ల ఆస్తిని కూడా కాజేసిన మోసకారులు అవాడు చాలామంది ఉండిరని విన్నాము. యిందులో చాలామట్టుకు సత్యముందనియే ఊహింపవచ్చుకాని, ధర్మారావు మాత్రము యీ తెగకు చెందినవాడు కాదు. పేరుకు దగ్గట్టుగా యీయన ధర్మాత్ముడు. యెవరి వద్ద యేదీ తీసుకున్న పాపాన యీయన పోలేదు. అంతేకాకుండా బీదవారికి చాలామందికి ధర్మ పుస్తెలు చేయించి వారి పెండ్లిళ్ళలో యిచ్చేవారు. అది మంచిదా చెడ్డదా అనేది ప్రశ్నకాదు. కాని ఆయన యేదో ఒక విధంగా బీదలకు సహాయము చేసి తృప్తి పడెదువాడు.

విక్రం ధర్మారావుకు యేకైక పుత్రుడు. అందువల్ల చాలా గారాబంగా పెరిగినాడు. ధర్మారావుకు యెల్లప్పుడూ కుమారుని పైననే మనసు లగ్నమై ఉండెడిది. బయటకు వెళ్లినప్పుడు యేదైన కొని తెచ్చి పెట్టెడివాడు. ధర్మారావుకు తండ్రి విడిచి వెళ్లిన ఆస్తి బాగానె ఉంది. తండ్రి గతించిన పిమ్మట ధర్మారావు కొంతకాలము బాగానే వ్యవహారాన్ని నడిపించెను. కాని చిన్నతనముగుట వలన అనుభవజ్ఞుడు కానందువలన పరిస్థితి కొంచెము క్షీణించెను. అయినా ఆర్థిక స్థితికి లోటు లేకుండెను. అందరివలెనె వీరుకూడా పట్టణములో ఆస్తికొని వుంటే యీయన కూడా బాగానే పైకి వచ్చేవాడు. కాని అది యీయనకు కానిపని. తన వ్యవసాయము పశుసంపదపై తప్ప యే పెట్టుబడివైపు మనసుపోలేదు. వ్యవసాయముపైన ఆదాయము బాగానే ఉండెను. కాని ఆ ఆదాయాన్ని అడిగిన వారికల్లా అప్పులిచ్చి మళ్లీ అడిగిన పాపాన పోలేదు. అందువల్ల వీరు యే ఆస్తి వచ్చే లేదా సంపాదించే వూహా వీరి మనస్సుకే రాలేదు. అవాడు ఇంత ఆదాయము వున్నవాళ్లు పట్టణములో భూమి, యిళ్లు కొన్నచో ఆయనకూడా చాలా డబ్బు గడించెడివాడు. కాని రాబోయే కాలంలో యేమవునో తెలుసుకొనేది చాలా కష్టము. కాబట్టి వీరు వ్యవసాయములో గడించిన డబ్బును వ్యవసాయములో కొంత పెట్టుబడి పెట్టి తక్కినది అప్పులు యిచ్చెను. కాని పల్లెటూరిలో యిచ్చిన అప్పులు ఆకాలంలో వసూలు చేయాలంటే మానవతా దృక్పథాన్ని విడిచి దానవునిగా వ్యవహరించితే తప్ప మరి ఆ యిచ్చిన అప్పులు మరవవలసినదే. అట్లే వీరు కూడా దానవునిగా మారలేదు. మానవునిగా వసూలు చేయలేదు. యీయన జీవించిన యుగం ఒక విచిత్రయుగం. feudal యుగమని యే చెప్పవలె. వూరిలో కొందరే చదువుకున్న వారు అదికూడా యే Ist form, IInd form వరకే. చదువుకు ప్రాముఖ్యత యెక్కువగా యెవరూ యివ్వలేదు. చదువుకుంటె ఉద్యోగం కొరకే కదా అన్న ఆచారం అప్పుడు చాలా వరకు సమాజంలో పాతుకుపోయిన వ్యసనం. అందువల్ల, కులవిద్య లేక వృత్తి విద్యకు ప్రాధాన్యత నిచ్చేవారు. ఈ వృత్తి విద్య ఆకులంలో పుట్టినప్పటినుండి పెద్ద అయ్యేవరకు కుటుంబంలో నేర్చుకునెడి వారు. ఈ విధంగా వంశపారంపర్యంగా తరతరాలుగా యీ వృత్తి విద్యను నేర్చుకొని జీవనోపాధిని చేసెడి వారు. యీ విధంగా వందలాది సంవత్సరాలుగా యీ పల్లెటూళ్లలో సాగిన ఆచారం. ధర్మారావు కూడా యీ

**Cultural Product** కాని యీాయనకు చదువుకోవలెనని చాలా ఆకాంక్షుండేది. ఆ కాంక్ష ఒక కలగానే మారిపోయినది. యెందుకంటే 16 యేండ్ల వయస్సుకే పెండ్లి చేసినారు వీరి తండ్రిగారు. పిమ్మట పెండ్లిచేసిన తండ్రికూడా మరణించటంవల్ల యితని చదువుకోవలెనన్న కోరిక కోరికగానే మిగిలిపోయింది.

ఆస్థిమంతుడు అంతో ఇంతో ఆనాటి పరిస్థితుల కనుగుణముగా చదువుకున్న వాడు కాబట్టి తన వూరిలోను, చుట్టుపట్టు గ్రామాలలో స్థితిమంతునిగా పేరు సంపాదించినాడు. ఆనాడు పల్లెటూళ్లలో యీనాటివలె ప్రభుత్వ విధానములేకుండెను. వూరికి పెద్ద మనిషిగా మనగలిగినవాడు, అందరికి సబబయ్యే మాట మాట్లాడేవాడు, ఆనాటి గ్రామప్రజలకు నాయకుడిగా మెలిగేవాడు. యెలక్షన్స్ లేకుండెను. యెవరి బాధ్యతను వారు గ్రహించి నడచేవారు. యేవో చిన్నచిన్న కొట్లాటలు వస్తే పల్లెటూర్లలోనే పరిష్కారమయ్యేవి. వూరుదాటి ఒక పంచాయతీ కూడా వెళ్లేదికాదు. ఒక పోలీసు కానిస్టేబుల్ వస్తే ఊరు గజగజలాడి పోయేది. వూరి మధ్యవున్న కచ్చేరి భవనంలో కానిస్టేబుల్ నివాసము. వారికి యేదీ కొరవ అనేది ఉండేది కాదు. కోళ్లు మరి కావలసిన సామగ్రితో భోజనాలు తయారు కావలసిందే. కోళ్లు ఆవూరి బాజారులలో తిరుగుతుండేవి. వూరి కావలివాడు యెవరి కోళ్ళనైనాగాని బజారులో కనబడునని (సామాన్యంగా బీదజనులు పెంచుకున్నవే) ఒకటి రెండు చంపి ఆ కానిస్టేబుల్ భోజనసదుపాయాలకు కూర్చిపెట్టునవే. తక్కిన సామగ్రి కోమట్లు మరి పురప్రముఖులనుండి రావలసిందే. యీా విధంగా ఆనాడు పోలిసు కానిస్టేబులు వూరిలో ఉన్నన్నాళ్లు భోజనసదుపాయాలు జరగవలసిందే. అలా జరుగకపోతే ఉన్నవి లేనివి కాజేసి వూరి గురించి తప్పు రిపోట్లు వ్రాసేవాడే. యిది నిజాం రాజ్యము కాబట్టి అంత పెద్ద ఉద్యోగులందరు తురకలె. మొత్తం నిజాం రాజ్యములో యేదో కొంతమంది హిందువులు నిజాం ప్రభువు అనుగ్రహ పాత్రులైన వారే. వేళ్లమీద లెక్కపెట్టగల వారు మాత్రమే గొప్ప ఉద్యోగాల నావిష్కరించేవారు. నిజాం రాజ్యములో నీవూరిలో నీకు గౌరవము మర్యాద కలగాలంటే యీా తురక **Official** ను ధిక్కరించే మాటేలేదు. చాలామంది వూళ్లలో వుండే దేశముఖ్‌లు దేశపాండ్యాలనెడివారు. యీా తురుక ఆఫీసర్స్ దాసోహం అనుకుంటు వారు స్నేహాన్ని పెంచుకుంటేనే తప్ప వారి గౌరవము మర్యాదలు నిలిచేవి కావు. తురకలు చాలామట్టుకు రాజధాని నగరమగు హైదరాబాదులోనె ఉండెడివారు. హిందువులంతా పల్లెటూర్లలోనుండెడి వారు. అంటే పల్లెటూళ్లలో తురుకలు లేరని కాదు, కానీ వాళ్లంతా ఒకప్పుడు హిందువులే. అంటే వాళ్లు తురకమతాన్ని గ్రహించి పేర్లు వేషభాషలను మార్చుకున్నారు. వీళ్లను దూదేకుల వాళ్లు లేదా చెక్క తురకలు అనెడి వారు ఆనాడు. వీరు మాత్రము యేదో ఒక వృత్తిచే ఆ వూరిలో మనగలిగేవారు. యెవరైన హిందు స్త్రీని యీా తురకలు పెండ్లిచేసుకుంటే ఆ స్త్రీ తురకలలో కలిసినట్టె. ఆమెను మళ్ళీ హిందుసమాజంలో వాళ్ల తల్లిదండ్రులు, అన్నలు, తమ్ముళ్లు యెవరూ ఆమె వైపే చూడరు. అయితే ఆమె మాత్రము ఒక తురకస్త్రీ వలెనే చచ్చే అంతకాలం తురక స్త్రీగానే జీవించి చావలె. ఆమె

సంతానమంతా తురకలే. వాళ్లకు తురక ఆచారాలే అన్నీ. యిక హైదరాబాదులో హిందువులు లేరని కాదు. చాలమంది ఉండెడివారు. నిజాం ప్రభుత్వ ఉద్యోగంలో కూడా కొంతమంది ఉండేది అని యిదివరకె అన్నాము కదా. వాళ్లు చిన్న చిన్న వ్యాపారస్తులు. మేనియల్, ఉద్యోగాలు చేసెడివారు. అంటే రోజూ ఉదయంలేచి, రోడ్లు శుభ్రపరిచేవారు, పెద్ద వ్యాపారస్తులు అంటే మార్వాడీలు కొంతవరకు కోమట్లు యీ విధంగా కొంత మంది హిందువులు యీ హైదరాబాదు రాజధాని నగరములో నుండెడివారు. యూరపు అమెరికాలలో ఉండు పట్టణాలవలె హైద్రాబాదు ఉండేది. కార్లు చాలా తక్కువ. పెద్ద ఉద్యోగులకు, నవ్వాబులకే కార్లు. యెందుకంటె కార్లన్నీ యూరపు, అమెరికానుండే దిగుమతి చేసుకునేది. ఆనాడు యీ భారతదేశములో ఒక సూది వంటి చిన్న పారిశ్రామిక వస్తువుకూడా తయారు చేసే యోగ్యత యిచ్చుటి వారికి లేకుండెను. ప్రతిది అంటె బట్టలు, సూదులనుండి కార్లవరకు దిగుమతి చేసుకోవలసిందే. పరిశ్రమలనేవి మన దేశంలో మరియు నవ్వాబుగారు పరిపాలించే హైద్రాబాదు రాష్ట్రంలో లేకుండెను. కావున హైద్రాబాదులో ప్రభుత్వ ఉద్యోగులో లేక చిన్న వ్యాపారస్తులు లేక మీనియల్ పనులు చేసేవారో ఉండేది. యెక్కువమంది ప్రభుత్వ ఉద్యోగులు తురక వారే. తక్కినవారు హిందువులు. యిక హైద్రాబాదులో వూళ్లలో పెద్ద ఆస్తులు వున్నవారు, హిందువులు హైద్రాబాదులో ఒక నివాసము పెట్టుకుని హాయిగా కాలక్షేపము చేయుచు అప్పుడప్పుడు గ్రామాలకు వెళ్లి వాళ్ల పని గుమాస్తాలు బాగా చేయించుచున్నారా లేదా చూచి మళ్లి పట్టణానికి (హైదరాబాదు) విచ్చేసెడివారు. యీ నవాబుల ఇళ్ళలోనున్న కన్నియలంతా ఉన్నతవిద్య నభ్యసించెడివారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో యీ తురక వనితలు పరదాలో నుండి ఆచార్యులు బోధనలను వినేవారు, మగ విద్యార్థులు ఆడ విద్యార్థులు ఆచార్యులకు కనిపించేవారు. కాని మగ విద్యార్థులు ఆడ విద్యార్థులకు, ఆడ విద్యార్థులు మగ విద్యార్థులకు కనిపించెడి వారు కారు. యీ స్త్రీ విద్యార్థినులు యెక్కువ తురక వారు కాబట్టి వాళ్లు పర్దాలోనే ఉండెడి వారు. వీళ్ళతో సహా కొంతమంది హిందు విద్యార్థినులు కూడా వాళ్ల సభ్యతలను పాటిస్తూ, వీరితో విద్యాభ్యాసము చేయుచుండెడివారు. స్త్రీలు ఉద్యోగాలు చేసెడి వారు కారు. యీ విధంగా నవాబులు పెద్ద ఉద్యోగాలు తప్ప చిన్న ఉద్యోగాలను చేసెడివారు కారు. గ్రామాలలో నున్న పెద్ద భూస్వాములు కూడా చిల్లర ఉద్యోగాలను చేసెడి వారు కాదు. యెందుకంటే వాళ్ల ఆస్తులను చూచుటకు వాళ్లే గుమాస్తాలను పెట్టుకొన్నప్పుడు వాళ్లు గుమాస్తా ఉద్యోగాలను ఒప్పుకొందురా? అందువల్ల పల్లెటూళ్లలోని యీ సంపన్న కులాల వారు తమ మగ పిల్లలకు కొంత చదువు చదివించి యుక్తవయస్సు రాగానె తన దర్జాకు తగ్గట్టుగా వారి బంధువులలో ఒక కన్యను చూచి వివాహము చేసేవారు. చదువు వివాహానికి అంతముఖ్యముకాదు. డబ్బుకూడా అంతే. వివాహానికి ముఖ్యమైనవి, ఆస్తి అంతస్తులు యివి రెండువుంటే చదువు విషయమై యెవరు అంతగా పట్టించుకునే వారేకాదు. వివాహము సమానస్కందుల తోడనె కాని, విద్యను చూచికాదు. ప్రేమ వివాహాలు ఆనాడు చాల అరుదు. సాంప్రదాయానుసారమైన వివాహాలే. కులాలు ప్రజలలో చాలా బలీయంగా పాతుకొని యుండె. పల్లెటూరి

సభ్యత ఆచారాలు ఆనాడు అందరూ పాటించవలసిందే. యెందుకంటే వూరిలో పెద్దలనబడే వారి తీర్మానము తుది తీర్మానము. ముఖ్యంగ చదువులేని పల్లె జనులకు.

ధర్మారావు తన నీతి నిజాయితితో పేరు సంపాదించుకున్నాడు ఆ ప్రాంతంలో. డబ్బుగల శ్రీమంతుడు కాకున్న తన వ్యవసాయంలో వచ్చే ఆదాయంలో దానధర్మాలు చేసిన మనిషి ఆ ధర్మారావుగారు. విక్రం యితని యేకైక పుత్రుడు. అందువల్ల గారాబంగా పెంచినాడు. విక్రం ఆడిందే ఆట పాడిందె పాట అన్నట్టుగా కొందరు ధర్మారావు స్నేహితులు అతన్ని సంబోధించి విక్రంను మంచిదారిలో నడిపించవలెనని చెప్పేవారు. కాని ధర్మారావు తన కుమారుడు అన్నివిధాలుగా మంచిదారిలో నున్నవాడని వారి సలహాలను పాటించేవాడు కాదు. చిన్నతనం కాబట్టి విక్రం అప్పుడప్పుడు తను చేసేది వాళ్లకు నచ్చినవా లేదా అని ప్రశ్నించుకునే వాడుకాదు. అట్లు ప్రశ్నించుకునే పని తనకు లేదు అని తన నాన్నగారితో మునుపు యేలాగ ప్రవర్తించేవాడో అలాగే ప్రవర్తించుచుండెను. విక్రం చిన్నప్రాయం గలవాడైనా చాలా చురుకైనవాడు. మంచి చెడులలోగల భేద విచక్షణ శక్తి అతనిలో నుండెను. బహుశ కొంతమందికి ఆ విచక్షణ శక్తి పుట్టుకతోనే వస్తుందో యేమో. పాఠశాలలో యెవరితో పోట్లాడుట ఆ బాలుని రక్తములోనే లేకుండెను. అయినా యితని కన్న వయస్సులో పెద్దవారైన కుర్రాళ్లు యీతని వంశ పేరు ప్రతిష్టలను చూచి ఓర్వలేకుండిరి. అందువల్ల అప్పుడప్పుడు ఏవో సాకులు కల్పించి యితనిని హింసించేది. కాని విక్రం మాత్రం బడిలో జరిగిన విషయాలను బడిలోనె విడచి యింటికి వచ్చేది. విక్రంకు శ్రీకారము ముహూర్తము పెట్టిన పిమ్మట బడిలో వేసిరికాని యితనికి చదువంటే యిష్టం లేకుండె. కాని ధర్మారావు తనకు చదివే యోగం లేకుండె కనీసం తన కుమారునినైన బాగా చదివించాలన్న దీక్షపూనుకున్నాడు. అందుకే నయాన్నైనా, భయాన్నైన విక్రంను చదివించుచుండెను. అప్పుడప్పుడు విక్రం మొండిపట్టి పుస్తకాలను ముట్టేవాడు కాదు. కాని ధర్మారావు భయంతో బడికిపోయేవాడు. యెక్కడనో దాగుకునే వాడు. కాని తల్లికి తండ్రికి తెలియని చోటు ఆ యింట్లో యెచ్చటనుండేది. అయినా యీ చిన్నారి ప్రాయంలో యిల్లు తప్ప ఇంకెక్కడికి పోయి దాగుకొనగలడు. ఆ విధంగా అతిచిన్న ప్రాయమున చదువంటె అసహ్యమును ఆటలు అంటే సరదాగా నుండెను. కాని ధర్మారావుగారు మాత్రము యెప్పుడూ విక్రం చదువు ఒక కంట కనిపెడుతూ అయనకు వచ్చిన విద్యను కుమారునికి నేర్పుతుండెవాడు. ధర్మారావుకు ఆకాలంలో వూళ్లలో వుండె పెద్దకుటుంబాల వారికి వచ్చినంత తెలుగు ఉర్దు వచ్చేది. నిజాం కాలంలో ఇంగ్లీషుకు అంతగా ప్రాముఖ్యత లేకుండెను కాబట్టి ఆభాష ధర్మారావుకు రాదు. కాబట్టి విక్రంకు తెలుగు ఉర్దు పాఠాలలో సహాయపడేవాడు. ఇంగ్లీషు మాత్రము బడిపంతులే నేర్పుచుండెడివాడు. ఇందులో ధర్మారావు తనయునికి నేర్పే స్థితిలోనే లేకుండెను. ఇది ధర్మారావు లోటుగానె భావించేవాడు. కాలేజిలో చదివే వారికే ఆ భాష కొంచెముగా వచ్చెడిది. హైద్రాబాదులో సర్కారు భాష ఉర్దు. అందుకే దీనికి ప్రధాన పాత్ర. ఇంగ్లీషు నేర్వాలంటే విద్యార్థులు నిజాం కళాశాలకో లేక వేరే బ్రిటిష్ ముంబాయిలోని కళాశాలలకో పోవలసి ఉంటుండెను. హైద్రాబాదు నిజాం పాలనలో వుండెను. అందువల్ల మీడియమ్ ఆఫ్ యిన్‌స్ట్రక్షన్ ఉర్దూ. అందువల్ల

ఉర్దూకు ప్రాముఖ్యత. ఉర్దూలోనె అన్ని ఆఫీసులు నడిచేవి. ఉర్దూ రానివాడు హైదరాబాద్‌లో ఉద్యోగాలు చేయుటకు అనర్హుడు. కాని తెల్లవారు ఉర్దూలో కాక ఆంగ్లంలోనె తమ విధులను నిర్వర్తించేవారు. కాబట్టి వారు ఆఫీసుకు వెళ్లినప్పుడు ఆ భాషే ఉపయోగింప వలసి వుంటుండెను. తెల్లవారు గొప్పవుద్యోగాలలో ఉండేవారు. కాబట్టి ఇంగ్లీషు చదువుకున్నవారు కూడా గొప్పవారనే భావించేవారు అనాడు. కాని హైదరాబాదు ప్రక్కనున్న మద్రాసు, బొంబాయి ప్రెసిడెన్సీలలోను మరి బ్రిటిష్ ఇండియా అంతటను ఇంగ్లీషు కాబట్టి అచ్చటి వారికి ఇంగ్లీషు మరి వారి వారి మాతృభాషలు రావలసిందే. అంటే అందరికి కాదు. సంపన్నులకు ఉద్యోగస్తులకు వారి పాఠశాలలన్నిటిలోను medium of instruction ఇంగ్లీషే. కాబట్టి ప్రతి చదువుకున్నవాడు ఇంగ్లీషుతో పరిచయము తప్పకుండ చేసుకున్నవాడే. కాని హైదరాబాదులో మాత్రము అట్లాకాదు. రాష్ట్రములో ఒకే ఒక యూనివర్సిటీ. అందులో బోధనాభ్యాసము ఉర్దూలోనే జరుగుచుండేది. పోలీసు చర్యానంతరము పండిత్ నెహ్రూ వచ్చినప్పుడు O.U.ని పొగడినాడు. యెందుకంటే దేశంలో కొన్ని విశ్వవిద్యాలయాలె దేశభాషలో చదువునేర్పినవి. అందులో O.U. ఒకటి అని పలికినాడు. కాని ఆ కాలంలో విజ్ఞాన సంపదయెక్కువగా ఇంగ్లీషులో నుండేది. దానిని ఉర్దూకు మార్చి విశ్వవిద్యాలయ పాఠ్య పుస్తకాలను తయారుచేసేది విక్రం శ్రీకార ముహూర్తం పిమ్మట తెలుగు నేర్చెను. ఓనమాలు, బొట్లెరుసు, గిద్దెడెరుసు, బాలశిక్ష మున్నగునవి నేర్చుకున్నాడు. యింటిలో ధర్మారావుగారు భాగవతం రామాయణం చదివించేవాడు. బడిలో లెక్కలు తెలుగువాచకాలు ఉర్దూ, పహిలి నుండి పాంచ్మీవరకు ఇంగ్లీషు ర్యాపిడ్ రీడర్ వరకు చదువుతూ వుండేవాడు. రోజు ఆ పల్లెటూరి యేక పంతులు పాఠశాలలో యివి చదువుకునే వాడు. పాఠాలు తక్కిన పిల్లలతో సహా వప్పచెప్పి కొత్తపాఠాలు అందరితో నేర్చుకునెడివాడు. యే పాఠాన్నైన తప్పులు లేకుండ వప్ప చెప్పెడివాడు. పంతులు అడిగిన ప్రశ్నలకు సమాధానాలిచ్చేవాడు. అందువలన పంతులు మెప్పులు బడసేవాడు. పిమ్మట సాయంకాలం నిన్నటి శతక పద్యం వప్పచెప్పి మళ్లికొత్త పద్యం వ్రాసుకుని పాఠశాలను అందరి పిల్లలతో విడిచేవాడు. యీ విధంగా విక్రం విద్య ఆ పల్లెటూరి బడిలో సాగిపోవుచుండెను. యిట్లుండగా ఒకనాడు అందరు పిల్లలు బడికి వచ్చినారు కాని పంతులు మాత్రం రాలేదు. వస్తాడు అనుకొని పిల్లలంతా తమ తమ పాఠాలు నేర్చుకొనుచుండిరి. కాని పంతులు లేని బడి నాయకుడు లేని సైన్యంగా తయ్యారయినది. యే సమాజములోనైనా కొంతమంది బాధ్యతాయుతంగా నడుచుకుంటారు. వాళ్ల విధిని యెవరు చెప్పకున్న నిర్వర్తిస్తారు. కాని కొంతమంది యీ అవకాశాన్ని చూచి అల్లర్లు జరుపుతారు. ఒకరిని అణచి వేయుటకు లేదా వారిని బాధించుటకు చూస్తుంటారు. యీ పల్లెటూరి బడి పిల్లలు కూడా అంతె. పంతులు రాలేదు కాబట్టి కొందరు తుంటరి పిల్లలు అల్లరి చేస్తూ, వేరే వాళ్ళ చదువుకు భంగం కల్పించినారు. కొందరిలో కొట్లాటలు ప్రారంభమైనాయి. యిదంతా చూచి కొందరు పిల్లలు తమ యిండ్లకు పోయి పంతులు రాని సంగతి తమ తమ తల్లిదండ్రులకు చెప్పినారు. విచక్షణ చేయగా పంతులు గారు రాత్రికి రాత్రే లేచి వూరు విడచి వెళ్లిపోయినాడని తెలిసింది. యెందుకు యిలా

జరిగిందీ. యెవరికీ తెలియదు. కొంతమందికి తెలిసినా వాళ్లు యెవరికీ చెప్పలేదు.

యిప్పుడు ధర్మారావు మరి ఆ వూరి కొంతమంది మరి వేరే పంతులుకై వెదకనారంభించినారు. కల్పవల్లి తన కుమారుడు పరమేశ్వరుని చదువుకై పాటుబడ్డ మాతృమూర్తి. అలాగే ధర్మారావు కూడాను. యిద్దరూ కలసి ఒక పంతులు తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు నేర్పగల అర్హత కలవానికై వెతకనారంభించారు. వారి అన్వేషణ ఫలితంగ ఒక పంతులు వీరికి దొరికినందున చాలా సంతోషించారు. యీ పంతులు 5వ తరగతి వరకు హైద్రాబాదులో చదువుకొని పిమ్మట ఆర్థిక యిబ్బందుల వలన చదువుకు స్వస్తిచెప్పి యేదైన ఉద్యోగానికని వెదుకుచుండెను. యీ బడిపంతులు ఉద్యోగము సమయానికి లభించినందువలన దేవుడిచ్చిన వరముగా భావించి వప్పుకొనెను. అంటే మళ్లీ ఆ వూరి పిల్లలకు విద్యాభ్యాసానికి శ్రీకారము పెట్టబడెను. చదువు మాత్రము మునుపటి పంతులున్నప్పుడు జరిగినట్టే జరిగెను. కాని ఈయన ఉర్దూ ప్రాముఖ్యత తగ్గించి, ఇంగ్లీషు, తెలుగునకు ప్రాముఖ్యత నిచ్చెను.

యీ పంతులు నివాసానికి కల్పవల్లి యింటికి పక్కనే యిల్లు కుదిర్చిరి. ఆనాడు రేడియోలు గాని, టి.వి.లు గాని యేమియు లేకుండెను. హైదరాబాదులో యే పెద్ద శ్రీమంతుల యింటిలోనో ఒక రేడియో వుంటే అది ఒక గొప్ప కథనము. యీ రేడియోలు పెద్దగా ఉండి యుండినవి. యీనాటి వలె ఊళ్లలో entertainment లేకుండెను. యేదైన entertainment అంటూ వుంటే బంతి ఆటలు ఉండెను. ఒక పాత tannies ballతో పిల్లలు సాయంకాలము బంతి ఆట ఆడుచుండిరి. రెండు టీములు యీ ఆటను ఆడితె ఒక టీమ్ ఓటమి మరియొక టీమ్‌కు జయము. యీ విధంగా పిల్లలు సరదాగా ఆడుకొనుచుండిరి సాయంకాలమందు. యీ బంతి ఆటలు మొగపిల్లలే ఆడుకొనుచుండిరి. బాలికలు చాలా తక్కువగా బళ్లో చదువుకొనుచుండిరి. ఆ కొద్ది మంది చదువుచున్న బాలికలు సామాన్యంగా శ్రీమంతుల యింటి ఆడపిల్లలు. వారు వారి కుటుంబ స్త్రీలతో కలసి యేమైన చేసి కాలక్షేపము చేసేవారు. యీ విధంగ బాలురు బాలికలు ఉదయం నుండి సాయంకాలం వరకు చదువులలో నిమగ్నులైనుండెడి వారు. పల్లెటూళ్ళలో అస్పృశ్యత బలీయంగా నుండెను. గాంధిగారి ఉద్యమము బ్రిటిష్ ఇండియాలోని పట్టణాలలో కొంత మందికి తెలిసిన ఉద్యమమే. పల్లెటూళ్లలో కొంతమంది గాంధిని ఒక దేవుడుగా భావించినవారు ఉండిరి. నిజాం రాజ్యము నిజాముల పరిపాలనలో నున్నందువలన పల్లెలు చాలా వెనుకబడి యుండెను. రాజ్యమంత feudal పరిపాలన. అందువల్ల ఆ పల్లెటూరి జీవితము కొన్నివేల సంవత్సరాలకి క్రితము యెలావుండెనో యిప్పుడు కూడా సుమారు అలాగే నుండెను. పల్లె జీవితము కులాల మీద ఆధారపడి వుండెను. యెవరు యేకులములో పుట్టితె వారు ఆ కులవృత్తినే నడిపేవారు. అంటే యీ social structure పైననే వాళ్ల ఆర్థిక విధానము ఆధారపడి యుండెను. వూరి పెద్దగానున్న వారిని యెవరు ధిక్కరించుటకు సాహసించలేదు. వూరి పెద్ద అన్నమాట, చేసిన తీర్మానము శాసనము. దాన్ని ధిక్కరించి, యెదిరించి బ్రతికినవారు చాలా అరుదనియే చెప్పాలి.

అమావాస్యకు పున్నమికి పాఠశాలకు రెండు రోజులు సెలవులు. యీనాటి

వలె ఆ పల్లెటూళ్ళలో ఆనాడు ఆదివారము కాదు సెలవు. యిదినిజాం ప్రభువుల రాజ్యము. వీళ్లు తురక వారు. కావుననే శుక్రవారము సెలవుదినముగా సర్కారు పాఠశాలకు, సర్కారు ఉద్యోగులకు సెలవు. యీనాడే యీ తురకలంతా మసీదులకు వెళ్ళి తమ అల్లాను తలచుకునేవారు. అంటే నమాజు జదివేవారు. కాని పల్లెటూళ్ళలో సర్కారు బళ్ళు లేకుండెను. కాబట్టి యీ పంతులు బడికి అమావాస్యకు పున్నమికి మరి వేరే హిందువుల మరి ముస్లింల పండుగలకు సెలవులుండెడివి. యీ పిల్లలు సెలవులందు విచ్చలవిడిగా పూర్తి స్వేచ్ఛతో ఆడుకొనెడివారు. పంతులుగారు యీనాటివలె యింటికి హోంవర్కు యివ్వకపోయేది. అందుకే సెలవులంటే నిజమైన holidays. యీ సెలవుదినాలలో విద్యార్థులు, విద్యార్థినులుకూడా తమ కిష్టమైన ఆటలు ఆడెడివారు. బంతి ఆట యిందులో ముఖ్యమైనది. యిది కాక కాలానుగుణముగా, బొంగరాలాట, గోలీల ఆట, పతంగుల ఆట ఆడెడువారు. వర్షాకాలమైతే చాలా వుల్లాసంగా బడిపిల్లలు ఆటలాడుటయే కాకుండా చెరువుగట్టుకు విహారానికి, కొండలకి పచ్చటి అడవులలో తిరిగి శుభ్రమైన గాలిని పీల్చుచూ ప్రకృతి సౌందర్యములో ఓలలాడెడివారు. ఈనాడు అటువంటివేమియు కానరావు. దసరా పండుగనాడు యీ పల్లెటూళ్ళలో మహావైభవోపేతంగా జరుపుకునేవారు. ఈ పిల్లలకు వానాకాలంలో చాలా అడవిపండ్లు లభించేవి. కలిమి పళ్ళు, జాన్నపళ్ళు, సీతాలపండ్లు (సీతాఫలం) వంటి పళ్ళను ప్రకృతిలో ఆనందంగా భుజించెడివారు. అప్పుడు జనాభా అంతగా వృద్ధి చెందలేదు. ఎందుకంటే ఎంతమంది పుట్టేరో అంతమందికూడా చచ్చేవారు. Average life span 22 లేక 26 ఏళ్ళు ఆ కాలంలో. యిప్పుడు ఇది 58 వరకు పెరిగింది. సైన్సు కొన్ని కొత్తమందులతో చావురేటుని చాలావరకు తగ్గించింది. కానీ పుట్టుక రేటుమాత్రం అంతేవుందో, కాదంటే యింకా పెరిగిందో. అందువల్ల చావు పుట్టుకల Balance ని మన సైంటిఫిక్ మానవుడు Imbalance చేసినాడు. తద్మూలంగా జనాభా విపరీతంగా పెరిగిపోయింది. కాని ఆనాడు వూళ్ళలో ఎటుచూసినా ప్రకృతిసంపద చాలాగాను దానిలో నివసించే మానవులు తక్కువగా నుండెడివారు. మరి యిప్పుడో ఎటుచూసినా ద్విపాద పశువులే. చెట్లు విపరీతంగా నరికివేయడమైనది. ఎందుకంటే వంటచెరుకు డిమాండ్ విపరీతంగా పెరిగిపోయింది. కట్టెనుకాల్చి బొగ్గుచేసి పట్టణాలకు ఎగుమతి చేసినారు. కాబట్టి ఎటుచూచినా బట్టబయళ్ళు, పచ్చికబయళ్ళు మచ్చునకైనా కానరావు. అడవులనేవి ఏ దూరభూములలో నున్నవో! యీనాడు, ఆనాడు యీ పల్లెటూళ్ళలో బాల్యప్రాయము గడిపిన మనుషులకు అన్నీ కలలుగానే తోస్తుందనుటకు ఏమాత్రమూ సంశయములేదు.

యిక దసరా పండుగ యీ వూరిలో చాలాముఖ్యమైన పండుగ. దసరా సెలవులలో పిల్లలు చాలా తృప్తిగా, ఆనందంగా ఆడుకొనెడివారు. పిల్లలు యీ దసరాపండుగకు మహర్నవమి గడలు పట్టి పంతులుతో సహా పిల్లల తల్లిదండ్రుల యిండ్లకు పోయి దసరాపాటలు పాడి చివరకు పంతులుకు కట్నాలు, మాకు పుట్నాలు అని జయీభవ విజయీభవ దిగ్విజయీభవ అని ముగించెడివారు. ఆ వూళ్లనే కాక ఆ వూరికి పక్కవున్న వూళ్ళకు కూడా వెళ్ళెడివారు. కలవారి పిల్లలు కొందరు గుర్రాలపైన కూడా వెళ్లెడివారు. యీ విధంగా దసరా సెలవులు చాల వైభవంగా

దసరా గడలతో పిమ్మట దసరానాడు పటాకులు (టపాకాయలు) కాలుస్తూ, దసరాను ముగించెడివారు. దసరా పండుగను వూరి వారంతా వైభవంగా జరుపుకొనెడివారు. దసరా కన్న ఒకటి రెండు రోజులు మొదలు వూరి వారంతా బతకమ్మలను పేర్చి, సాయం సమయమందు వీటినన్నిటిని చెరువు గట్టుకు తీసుకొని పోయి చాలాసేపు ఆ వూరి వనితలు ఆ బతకమ్మల చుట్టు తిరుగుతు బతకమ్మ పాటలు పాడేవారు. వూరివారంత ఆ వినోదాన్ని చూచుటకై ఆ చెరువు తీరానికి చేరేవారు. పిమ్మట చీకటి పడగానే బతకమ్మలను చెరువునీటిలో వదలి అందరూ వూరుచేరి తమ తమ నివాసాలకు వెళ్లేవారు. తెల్లవారో లేక మరునాడో ఇక దసరా పండుగ. ఆ పండుగనాడు కలిగిన వారు మంచి వంటలు చేసి అందరూ యింపుగా భుజించెడివారు. ఆ కాలంలో చాలా మంది లేనివారేనని చెప్పవచ్చును. ఎందుకనంటే యీ దరిద్ర నారాయణులు తిండి గుడ్డకు నోచుకో లేని స్థితిలో నుండిరని చెప్పక తప్పదు. కాని యీనాడు ఆ రెండింటిని కలిగి యున్నాడు. కాని ప్రకృతి సౌందర్యానికి పచ్చటి అడవులకు కరువు అయినాడు. అప్పుడు ప్రకృతి సౌందర్యము పచ్చటి అడవులు కొల్లలు కాని, పల్లెటూళ్లలో చాలామందికి వంటినిండ బట్ట, కడుపునిండ తిండి లేదనియే చెప్పాలి. వూరిలో ఏ కొంతమందికో యీ అదృష్టం కలిగియుండెనని చెప్పటలో బహుశ అతిశయోక్తి లేదేమో. అయితే వున్నవారు లేని వారికి, అనాడు మాత్రము (దసరానాడు) తప్పకుండ అన్నదానము వస్త్రదానము చేసి వారిని వీరి సంతోషంలో కలిమిలో భాగస్వాములుగా చేర్చుకొనెడివారు. సాయంకాలము పిల్లలు టపాకాయలు కాల్పులతో పెద్దవారు, కొంతమంది, తుపాకుల కాల్పులతో జమ్మిచెట్టు వద్దకి ప్రయాణమై పోవుచుండిరి. ఆ జమ్మి చెట్టుకు దసరా నాడు పూజలు చేయుట ఆచారము. అందువల్ల డప్పు కొమ్ముల చప్పుళ్లతో అందరూ ఊరేగింపుతో ఆ జమ్మిచెట్టు వద్దకు వెళ్లి దానికి పూజ సల్పెడివారు. కాని యీ వూరిలో ఆ చెట్టు లేదు మరి అనుకూలంగా నున్న ఆ చోటులోనే లేదో, యేదో నిజమైన ఆ విశాల భూమికి ఒక కొమ్మను తెచ్చి మొదటనే నాటి సిద్ధంగా నుంచెడివారు. ఆవూరి గ్రామాధికారులో లేక పెద్దలో యేదైతేనేమి యీ ఊరేగింపు డప్పు కొమ్ములతో ఆ జమ్మి కొమ్మనాటిన స్థలానికి వెళ్ళి ఆ కొమ్మచుట్టు అందరూ ప్రశాంతంగా కూర్చునెడివారు. అందరూ కూర్చున్న పిమ్మట బ్రాహ్మణుడు జమ్మిపూజ మొదలెట్టును. పూజపిమ్మట ఆకొమ్మ నుండి ఆకుతెంపి అందరికి పంచిపెట్టుట ఆచారము కాని యీ వూళ్ళో మాత్రము పూజ పిమ్మట బ్రాహ్మణుడు మరి ఆయనకు సహాయంగా మరికొందరు ఆకు తెంపుటకు మొదలు పెట్టగానే ఆ కూర్చున్న జనానికి ఓపికేది? అందరు లేచి ఆ జమ్మి పత్రికై కొమ్మపైకి యెగబడి యెవరికి వారే అన్నట్లుగా ఒకరిని వొకరు త్రొక్కుచు ఆకొమ్మపై బడి జమ్మిపత్రికై ప్రయత్నించేవారు. యిందులో చిన్న పిల్లలను యీ బాధనుండి తరలించుటకు కొంత బలీయులు ప్రయత్నించి ఆ పిల్లలను రక్షించెడివారు. యీ విధంగా సావధాన పూజలతో మొదలైన యీ జమ్మిపూజ ఒక అల్లకల్లోలంగ ముగిసిపోవును. యీ వూరిలో మాత్రము యిక పూజ ముగిసిన పిమ్మట యీ జమ్మి పత్రిని తీసుకొని దానిని తమ మిత్రుల చేతులలో వుంచి వారితో సమానులైన

వారు  ఆలింగనము చేసుకొందురు. లేదా పెద్దలకు పాదనమస్కారముచేసి వారి ఆశీస్సులను తీసుకొనుట  ఆనాటి ఆచారము. సాయంకాలము జమ్మిపూజ సలిపిన పిదప చాలామంది ఊరి పెద్దల ఇండ్లకు వెడలి  వారికి పాదాభివందనము చేసి వారి ఆశీస్సులను మరి బహూమానము పొంది తృప్తి చెందుదురు. పిమ్మట యెవరి యిండ్లకు వాళ్లు పోయి శయనింతురు. యిది దసరా పండుగ మహోత్యము.

విక్రం మరియు పరమేశ్వరుడు కూడా మహోర్నవమి గడలు పట్టిన పిమ్మట దసరా పండుగ వేడుకలలో  పాల్గొని సంతసించెడివారు. ప్రత్యేకంగా విక్రంకు టపాకాయలంటె చాలా సరదా. అందుకు ఒక  పసుపు పచ్చని పొడిను (బహూశ గంధం పొడి కాబోలు) ఒక గొట్టంలో పోసి ఆ  గొట్టానికి ఒక యినుప సలాకితో బిగించి ఆ మొత్తం పరికరమును ఒక గట్టి కట్టెకు ఇమిడించి మరి  సలాకికి ఒక బలమైన దారంతో కట్టి మరి ఆ దారాన్ని కట్టెకు కట్టి ఆ సలాకితో కూడుకొన్న ఆ  యినుప గొట్టాన్ని బలంగా యే గట్టిస్థలం మీదనైన లేదా రాతిపైననైన బలంగా సలాకిని కొట్టితే యీ  సలాకి మరి యినుప గొట్టంలో నున్న మందుప్రేలి ఒక పెద్ద టపాకాయ పేల్చినంతటి చప్పుడు  ధ్వనించును. ఇలాగే విక్రంతో సహా మరికొంత మంది పిల్లలు కూడా ఈ చప్పుడును ఉద్భవింప  చేసెడివారు. అయితే యిటువంటి టపాకాయలతో ఆడినవారు అపాయానికి గురి అయ్యే అవకాశాలున్నవి. మరో విధమైన టపాకాయలు ఉల్లిపాయ టపాకాయలు.  యివి చాలా safe టపాకాయలు. కాని వీటినుండి పెద్దచప్పుడు రాదు. విక్రం చురుకైన పిల్లవాడు. పరమేశ్వరుడు విక్రంకన్న ఒకటి  రెండు సంవత్సరాలు వయసులో పెద్దకాని విక్రం అంత చురుకుదనం అతనిలో లేదు. అయిన  సాధుశీలుడు సత్యవ్రతుడనియే చెప్పాలి. విక్రం చురుకుదనంతో పాటు కోపిష్టి కూడా. విక్రం  పరమేశ్వర్ కలవారి బిడ్డలు. పంతులుకు ప్రేమాభిమానులు. అందువల్ల కొందరి పెద్ద పిల్లలకు  ప్రత్యేకంగా విక్రం అంటే అసూయ. యీ పిల్లలలో విక్రం కన్న నాలుగేండ్లు వయసులో పెద్దైన బండ రాఘవయ్య అనే పిల్లవానికి విక్రం అంటే పరమ అసూయత. ఎందుకంటే విక్రం కలవారి బిడ్డ  చదువులో చురుకు. అందువల్ల యేదో సాకుతో విక్రంపై పంతులుతో చాడీలు చెప్పేది. మరి వేరే  యితర పిల్లలతో చెప్పించేది. అయినా పంతులు ఆ బండ రాఘవయ్య మాటలనంత పట్టించుకునే వాడు  కాడు. అందువల్ల బండ రాఘవయ్యకు అసూయ పెరుగుతూ వచ్చింది విక్రంపైన. అనాడు  పిల్లలంతా కలిసి మెలిసి ఆడుకునే అలవాటు ఆ వూరిలో. అయితే బండ రాఘవయ్య మరి విక్రం అందరు  పిల్లలతో ఆడుకుంటున్న సమయాన ఒక ఢంగురాతిని తిప్పుదామా అన్న Proposel బండ  రాఘవయ్య అందరికి ప్రతిపాదించెను. అప్పుడు పిల్లలంతా ఓ అని తలవూపిరి. పిల్లలంతా ఆ రాతిని  గుండ్రంగా, ఆ గుండ్రని సున్నపు మరి యిసుక కాలువలో త్రిప్పుచుండిరి. విక్రంకూడా యీ రాయి  అమర్చిన మొద్దుకు రెండు చేతులు మోపి నెట్టుచుండెను. ఎట్లాగో మెల్లగ బండ రాఘవయ్య  విక్రం వద్దకు వేంచేసి ఆ సందడిలో వేగంగ తిరుగుతున్న ఆ గుండ్రమగు డంగురాతి రంధ్రంలోకి విక్రం చేతులను అసూయతతో నెట్టెను.  విక్రంకు తెలియకుండానే అతని చేతి చిటికెన వ్రేలు ఆ  డంగురాతి రంధ్రము మరి దానిలో దూరిన కట్టెసందులోకి

దూరి చిటికెన వ్రేలు విరిగి అంతా రక్తసిక్తమయ్యేను. విక్రం గెయ్యిన కేకవేసి యేడ్చుచుండెను. ఆ రక్తం ప్రవహిస్తున్న వ్రేలితో యింటి వైపు పరుగెత్తెను. తండ్రి ధర్మారావు వెంటనే వూరి వైద్యున్ని పిలిపించి తక్షణమే చికిత్స చేయించెను. వైద్యుడు ఆ గాయానికి యేదో ఆకు దంచి కట్టుకట్టెను. యీ గాయము రెండు నెలలకు కాని సంపూర్ణంగ మానలేదు.

యిక రెండవసారి కూడ బండరాఘవయ్య మళ్లీ విక్రంకు హాని చేయతలపెట్టెను. విక్రం యెవరితోనైన మంచిగా ఆడుకొనె స్వభావం కలవాడు. అందువల్ల బండ రాఘవయ్యను నమ్మి ఆడుకొందము సరే అనెను. కాని కుటిలుడగు రాఘవయ్య ప్లానును యీతడు గ్రహించలేదు. విక్రం రాకముందే బండ రాఘవయ్య ఒక చింత చెట్టు కొమ్మకు తాడుతో ఊయల కట్టెను. విక్రం రాగానే కడుస్నేహ వాత్సల్యముతో విక్రంను ఊయలపై కూర్చుండబెట్టి వూపుచుండెను. ఆ ఊయల speed pick-up చేయగానే కొమ్మకు కట్టివున్న ఆ తాడును కుటిల బండ రాఘవయ్య మెత్తని కత్తిచే కోసివేసెను. ఆ స్పీడుతో ఊయలపై నున్న విక్రం దూరంగా పడి మూర్ఛపోయెను. ఆ దృష్టిని చూచిన పిల్లలంత విక్రం చనిపోయినాడని పారిపోయిరి. కాని బండ రాఘవుడు యెచ్చటికి వెడలినాడో యెవరికి తెలియదు. యెన్ని నిమిషాలు విక్రం ఆ మూర్ఛలో నుండెనో తెలియదు. స్పృహరాగానే ఇటు అటు చూసినాడు. యెవరూ అతనికి కనిపించలేదు. తిన్నగా లేచి యింటికి వెడలి పోయినాడు. మొదటి సారిగా ఆ పసివాడు మృత్యు ముఖానికి పోయి మళ్లీ యీ ప్రపంచానికి చేరుకున్నాడు. ఆ అనుభవము అతనికి చాలా యేండ్ల వరకు మరుపుకురాలేదు. ఆ సంగతి ధర్మారావుకే గాని తల్లియగు శ్రీలతకు కూడా తెల్పలేదు.

యిప్పుడు విక్రం రెండో తరగతిలో చదువుచున్నాడు అంటె తెలుగులో రెండవ వాచకము ఉర్దూలో దూస్రీ (రెండవ వాచకము) చదువుచున్నాడు. యిరువది యెక్కాల వరకు కంఠపాఠము. యిక చదువుతో విక్రంకు యే సమస్యలేకుండెను కాని బండరాఘవయ్య వాని అనుచరుల బాధనే ఒకక్లిష్ట సమస్యగా భావించుచుండెను. అటు పంతులుకు చెప్పినా, జననీ జనకులకు తెల్పినా సమస్యకు పరిష్కారము కనుపించలేదు. అందువలన అయినంతవరకు వానికి దూరంగా వుంటూ వాని సాంగత్యానికి దూరంగ వుండటం మొదలు పెట్టినాడు. అంతేకాకుండ వాని వయసుగల మరో విద్యార్థితో స్నేహము పెంచుకున్నాడు. యీ విధంగా యెవరికి తెలియకుండ బండ రాఘవయ్య nuesense ను తప్పుకున్నాడు. పరమేశ్వరుడు విక్రం స్నేహితుడు. కాని అతని సహాయం కోరితే సమస్యకు పరిష్కారం కాదని పరమేశ్వరునితో యెన్నడూ యీ విషయమై ప్రస్తావించనే లేదు.

ఆనాడు పల్లెటూళ్లలో ప్రతివానికి సామాన్యంగ ఈత నేర్పుట ముఖ్యమని భావించెడువారు. ప్రత్యేకంగ బడిపిల్లలు 5, 6 సంవత్సరాలు రాగానే ఈత నేర్పుట ముఖ్యమని తల్లిదండ్రులు భావించెడివారు. యెండిన ఆముదపు చెట్టు కట్టెలను తాళ్లతో బాగా బిగించి, ఆ కట్టను పిల్లవాని నడుముకు బాగా బిగించి కట్టి, పిల్లవానిని నీటిలో పడవేసిన అతడు మునుగకుండా నీళ్లమీదనే తేలుచుండెడివారు. అయితే కొంతమంది పిల్లలకు నీళ్ల భయాన్ని పోగొట్టుటకు ఆ కట్టలను కట్టి నీటిలోకి

తోసేవారు. కొంతమంది పిల్లలు ఇటువంటి త్రోసివేతకు చాలా భయపడి మళ్లీ ఈత అంటె భయపడేవారు. కొంతమంది పిల్లలు మొదట భయపడ్డా రెండోసారి ఆ అముదపు కట్టతో నీటిలో మంచిగా ఈదెడివారు. విక్రం పరమేశ్వరులు కూడా ఆ విధంగానే ఈత నేర్చినారు. కాని వేరే వారికి వీరికి బేధమేమంటే ఒక మంచి ఈతకాడు మొదటిసారి నీళ్లలో వేసినపుడు, వీరి వెంటనే వుండి యేమి భయములేదని ధైర్యం చెప్పుచూ, వీరి వెంటనే ఈదెడివారు. యిప్పుడు పరమేశ్వరుడు మరి విక్రం రోజూ వూరుకి సమీపంలో నున్న మంచి వ్యవసాయబావులలో వేరే పిల్లలతో సహా ఒక గంటసేపటి వరకు ఈది మెల్లగా భోజనాలకు యింటికి వచ్చెడివారు. అయితే ఒకనాడు పరమేశ్వరుడు యేదో కారణంగా కొంచెము తొందరంగా విక్రంను విడచి వేరే మిత్రునితో యిల్లు చేరుకున్నాడు. విక్రం మాత్రం పరమేశ్వరుడు వెళ్లి పోయినా వేరే మిత్రుడు నారాయణమూర్తి అను మిత్రునితో చాలాసేపటి వరకు ఈదుచుండిరి. ధర్మారావు విక్రం ఇంకా రాలేదెందుకోనని పరమేశ్వరునింటికి వెడలి అతనిని అడుగగా, పసివాడగు పరమేశ్వరుడు విక్రం ఇంక ఈదుచునే యుండెను. తనకేమి తెలియదన్నట్టుగా మాటాడినాడు. కల్పవల్లికి కూడా పరమేశ్వరుడు ఆ విధంగానే చెప్పి లోననే నున్నాడని కూడా చెప్పెను. అప్పుడు ధర్మారావు తన చిన్నారి పుత్రుడు విక్రంకు ఘోరప్రమాదం సంభవించిందని తలచి దుఃఖించుచు ఇంటికి తిరిగి వచ్చెను. భర్త దుఃఖాన్ని చూచి శ్రీలత విక్రం కేమయ్యిందండి అని అడగగానే పరమేశ్వరునికి తెలిసి తెలయక చెప్పినవన్ని శ్రీలతతో చెప్పెను. స్త్రీ హృదయం కాబట్టి విక్రంకై ఘోరంగ విలపించసాగెను. ఆమె ఏడ్పును గాంచి ధర్మారావు మరి యింట్లోనున్న వారంత దుఃఖించ మొదలిడిరి. యిట్లు జరుగుచుండగా విక్రం ప్రవేశించి యేమి జరిగిందని ఆశ్చర్యంగా తల్లిని తండ్రిని సంబోధించెను. ధర్మారావు దిగ్భ్రాంతుడై తనయుని కౌగలించుకొని నాయనా నీవు మళ్లీ జన్మనెత్తినావు తండ్రి అని యేడ్పుమాని వైచెను. శ్రీలత దుఃఖాన్ని మాని తనయుని ఒడిలో నిడుకొని ముద్దుపెట్టుకొనెను. ఆ విధంగా అనాడు విక్రం జీవితంలో ఒక tragedy comic గా జరిగిపోయెను.

ఈనాడు అనాడు గాలిపటాల నెగురవేయుట అంటె పిల్లలకు, పెద్దలకు సరదా. ఇవి సంక్రాంతి పండుగకు మొదలు కొన్ని వారాలు యెగురవేస్తారు. ఇప్పుడు భారతదేశము చాలామారిపోయింది. సామాజికంగా, ఆర్థికంగా రాజకీయంగా యీనాటికి అనాటికి చాలా భేదము. అనాడు బహూశ మన జీవిత విలువలు వేరుగా నుండినాయో, మరేమియో పల్లెటూళ్లకు పోవుట అంటె ఒక సరదాగా వుండెను. అచ్చట వారాల తరబడిగానున్నా బోర్ అనుపించకపోయేది. మరి యీ నాడు పట్టణ జీవితాన్ని విడచి పల్లెటూరికి పోవాలనియే అనిపించదు. అనాటి పల్లెటూళ్లకు మరియు నేటి పల్లెటూళ్లకు చాలా వ్యత్యాసము. అప్పుడు ఆ రాజకీయవాదాలు పార్టీలు ఊళ్లలో చాలా అరుదు. యెవరో ఒకరిద్దరు చదువుకున్నవాళ్లకు కొంచెము రాజకీయ పరిజ్ఞానముండెడిది. వాళ్లె అప్పుడప్పుడు గాంధివాదమిమ్మదనో లేదా మార్క్సిజమ్ గురించో వాదించేవారు. కాని అనాడు ఈనాడు గ్రామాలలో యువతరం చాలా మంది లుంగీలు ధరించి యీ రాజకీయవాదనలతో కాలమంతా వృధా

చేసికొనెదరు. ఆనాడు యీ జట్లులేకుండెను. యెందుకంటె నిజాం రాజ్యమును నిజాంలే పాలించెడివారు. కాని పోలీసు చర్య తరువాత నిజాం రాజ్యాన్ని వదిలి ప్రజాపరిపాలనకు ఒప్పుకున్నాడు. మొదలు మొదలు ప్రజలలో అంత రాజకీయ చైతన్యము లేనందున ఎన్నికలు నామ్‌కేవాస్తేనే ఉండెనని చెప్పాలి. కాని యిప్పుడు రాజకీయ చైతన్యం ప్రజలకు చాలా నున్నందువలన యెవరికి ఓటువేస్తే వారికి లాభదాయకమో వారికి వేస్తూ ఉంటారు. అందువల్ల ఎన్నికలు రాగానే రాజకీయ దళారీలు యెవరు యెక్కువ డబ్బిస్తె వారికి వారి vote banks ను deliver చేస్తారు. ఆనాడు అటువంటివేమీ లేకుండెను.

విక్రం పరమేశ్వరుడు కలిసి పరమేశ్వరుని యింట్లో ఆడుకొనెడివారు. పరమేశ్వరునికి అక్క ఉండెను. ఆమె పేరు శ్రీలత. ఆ కాలంలో ఆడపిల్లల పెండ్లిండ్లు అతి చిన్న వయస్సులోనె చేసెడువారు. అందువల్ల శ్రీలత పెళ్లికూడా చిన్నపుడు జరిపినారు. చదువు ఆనాడు ముఖ్యం కాదు. ఉద్యోగం అసలే చూసేవారు కారు. వంశం, పిల్లవాని వ్యక్తిత్వం ముఖ్యం. ఆస్తి వుందా లేదా కూడా ముఖ్యమే. అందువల్ల యీ అమ్మాయిని 9 లేదా 10 యేళ్ల వయసురాగానే ఒక మంచి కుటుంబానికి చెందిన యువకున్ని చూచి యీమె పెళ్లి మహా ఘనంగా జరిపించినారు. కాని అతని వయస్సు శ్రీలతకన్నా చాలా పెద్దది. అందువల్ల శ్రీలత తల్లితోనే చాలగా ఉంటు వుండేది. ఈమె భర్తకు వేరే స్త్రీల మీద మోజుపోయినదనుకో. కావున కాలం గడచిన కొద్దీ శ్రీలత అత్తగారి యింటికి పోక కల్పవల్లితోనే ఉండుటయాయెను. అప్పుడప్పుడు శ్రీలత భర్త అత్తగారగు కల్పవల్లి యింటికి వచ్చి పోయెడిది. రానురాను ఆరాకపోకడలు కూడా తగ్గిపోయినవి. శ్రీలత చాల మంచి పిల్ల. తమ్ముడు పరమేశ్వరున్ని చూసినట్టె విక్రంను కూడా అట్లే చూసేది. చాల జాలి హృదయం కలది. యింట్లో పనివాళ్లతో చాలా నమ్రతతో, దయాదాక్షిణ్యాలతో మెలగేది. ఎత్తుగా పలచగా తెల్లగా వున్న అమ్మాయి. కాని భర్తప్రేమకు అనురాగానికి యెందుకు దూరమైనదో తెలియదు. కాని ఆమె యెప్పుడూ depressed గా వున్నట్లు కనిపించలేదు. దేవుడిచ్చిన భర్త "నా అదృష్టము" అనుకుని తృప్తి చెందెడిది. యీమె భర్తగారు కూడా పెండ్లి చేసుకొనలేదు. కాని పరస్త్రీ సాంగత్యములో మునిగి తేలెడివాడని వదంతి.

విక్రం ఒకనాడు భోంచెసిన పిమ్మట పరమేశ్వరునితో ఆడుకొనుటకు వారి యింటికి వెడలెను. ఆనాడు విక్రం యింటిలో ఒక క్రొత్త వ్యక్తిని చూచెను. విక్రం చాలా shy person. మొదటి సారి strangerతో కలసినప్పుడు అతడు చాలా reservesగా నుంటాడు. కాని అతనితో పరిచయమైన పిమ్మట చాల స్నేహభావంతో ఆత్మీయతతో మెలిగే వాడు. ఆనాడు ఆ కొత్త వ్యక్తి దూరంగ కూర్చొని అతనితో మాటాడుతున్న పరమేశ్వరుని వైపుకే చూస్తుండెను. పరమేశ్వరుడు ఆ కొత్త వ్యక్తితో విక్రంకు పరిచయము చేసెను. పిమ్మట విక్రం ఆ కొత్త వ్యక్తితో మాటాడెను. యిప్పుడు ఆ కొత్త వ్యక్తికి విక్రంకు స్నేహము కుదిరింది. యీ కొత్త వ్యక్తి పేరు శంకరశాస్త్రి. ఇతనికి తెలుగులో మంచి పరిచయముంది. విక్రం పరమేశ్వర్ పిల్లలు. కాని ఆ శంకరశాస్త్రి కొంతగానైన maturity గల వ్యక్తి. యీతనికి నచ్చిన

కవి గుర్రం జాషువ. యీ జాషువ కవి గురించి యీ శంకరశాస్త్రి విక్రంకు యెన్నియో విషయాలు చెప్పి, అతడు వ్రాసిన గబ్బిలము అను ఖండకావ్యములోని కొన్ని పద్యాలు యీ యిద్దరి చిన్న వారికి చదివి వినిపించెను. మొదటిగా చదివిన పద్యం "ఆశీర్వదించినారా వ్యాస వాల్మీక బృందారక మునీంద్రులెదురువచ్చి, కన్నావెకవి భయంకర కాళిదాసు భోజుండున్న వాడె విస్తృత గుణుండు రంభ నీతోడగేరడుము లాడెనె దాతాను కోపించెనే నలకూబరుండు....." యీ విధంగా యీ జాషువ వ్రాసిన గబ్బిలములోని పద్యాలు విక్రంకు చాలా నచ్చినవి. అందువల్ల విక్రంకు శంకరశాస్త్రికి స్నేహబంధ మేర్పడి పోయెను. శంకరశాస్త్రి స్నేహముతో విక్రంకు తెలుగుపైన ఆసక్తి యెక్కువైనది. అందువల్ల తెలుగు పుస్తకాలు యెక్కువ చదువ మొదలుపెట్టెను. కథారత్నావళి అను ఒక గ్రంథాన్ని శ్రీలత దగ్గర చూచి కొంచెం చదువగా అది చాలా interesting కథలతో నిండియుండెను. అందువలన ఆ పుస్తకం శ్రీలత దగ్గరనుండి తీసుకొని యింటికి పోయి మొదటి కథ మొదలు తుది కథవరకు చదివే వరకు నిద్రించలేదు. పిమ్మట ధర్మారావు ప్రోత్సాహము వలన, రామాయణము, భాగవతము, పిమ్మట మహాభారతమును కూడా చదివెను. చాలా పద్యాలు యితనికి కంఠస్థమయ్యెను. వాటిని చిన్నప్రాయమున చక్కగ చదువుతుంటె యీ వూరిలోని కొంతమంది విని చాలా ఆనందాన్ని పొందేవారు కాబట్టి కొంతమంది విక్రం పంతులు స్నేహితులు బడిలోకి వచ్చి విక్రంతో పద్యాలు చదివించగోరువారు. విక్రం యిట్లు చదువుట ఇష్టం లేకున్న చదువనిచో పంతులుగారు శిక్షింతురన్న భయముతో చదివేవాడు. యీ విధంగా యీ పంతులుగారు చదివించినన్నిరోజులు విక్రంకు యీ పర్మాయిాశీల బాధలు తప్పలేదు. ఒకనాడు రామయ్య నాయుడు పంతులు వలెనె యీ వెంకటప్ప పంతులుకూడా యెవరికీ తెలియకుండానె, యెవరికీ చెప్పకుండానె వూరు విడచి వెళ్లిపోయినాడు. యెందుకు పోయినాడు, యెచటికి పోయినాడు యెవరికీ తెలియదు.

యీ వూరిపిల్లలకు ప్రత్యేకంగ పరమేశ్వరునికి విక్రంకు ఒక పంతులు అవసరము. వేరే పిల్లలు పంతులు బడివుంటే పిల్లలను పంపుతారు లేనిచో వాళ్ళను కులవృత్తిలో పడవేస్తారు. కాని ధర్మారావుకు కల్పవల్లికి తమ పిల్లల చదువుపైన చాలా అపేక్ష కావున యిద్దరు మళ్లీ ఒక పంతులుకై వెతకనారంభించినారు మునుపటి వలెనె. కాని యిప్పుడు పరిస్థితులు కొంత మారినవి. విక్రం, పరమేశ్వరులు విద్య కొంత మారినది. వారు యిప్పుడు నాల్గవ వాచకం చౌథి పూర్తి చేసినారు. అయిదవ వాచకం పాంచ్వీ చదవవలె. ఇంగ్లీషుకూడా New Method Reader 3వది పూర్తి అయినది. ఇకముందు యే ఇంగ్లీషు పుస్తకము వీళ్లకు చదివించాలేనని నిర్ణయించే పంతులు కావలె. అంటే, యిప్పుడు రామానాయుడు, వెంకటప్పయవంటి పంతుళ్ళు పనికి రారు. కనీసం 8 లేక 9 వ తరగతి పూర్తిచేసిన పంతులుకావలె. Ideal High School Deploma గల పంతులైతె చాలామంచిది. కాని ఆనాడు High School Graduates యీ పల్లెటూళ్లకు యెందుకు వస్తారు. అయితే అది out of question యెంత వెతికినా కనీసం 7వ తరగతి పాసైనవాడు కూడ దొరకలేదు. విధి లేక విక్రంను మరి పరమేశ్వరుని పట్టణానికి పంపుటకై నిశ్చయించినారు.

హైద్రాబాదు పట్టణము ఆనాడు చాలా గొప్ప పట్టణమని అచోక్తి. యిది

హైద్రాబాదు రాష్ట్రమునకు ముఖ్యపట్టణము. ఈ రాష్ట్రములో తెలంగాణాకు చెందిన తొమ్మిది జిల్లాలు, నాలుగు జిల్లాలు మహారాష్ట్రమునకు చెందినవి మరి మూడు జిల్లాలు కర్ణాటకకు చెందినవి. యీ విధంగా హైద్రాబాదులో మూడు భాషలవారు సమ్మిళితమై పోయిరి. హైద్రాబాదు మూడుభాషలతో సమ్మిళితమైనా పాలించె రాజు మాతృభాష వుర్దూ అయినందున రాజభాష లేదా official language ఉర్దూ, తెలుగు లేదా మరాఠి లేదా కన్నడము పల్లెటూళ్లలో వాడుకలో నుండేది. కాని పరిపాలక భాష మాత్రము ఉర్దు. అందుకే ఆనాడు స్కూళ్లలో medium of instruction ఉర్దుయే. ఉర్దు రానివారికి ఉద్యోగము చేయుటలో కష్టము కాబట్టి అందరు తల్లిదండ్రులు తమ పిల్లలకు చిన్నప్పటినుండి ఉర్దును తప్పని సరిగా నేర్పించుచుండిరి. తెలుగుకు అంత ప్రాముఖ్యత నివ్వలేదు. హైద్రాబాదులో యెవ్వరూ, తెలుగువాళ్లతో సహా తెలుగు అని అనెడి వారు కారు. ఎందుకంటే తురకలందరు తెలుగు అనలేక తెలంగి అని మాటాడేది. కాబట్టి తెలుగు వారు కూడా తెలుగును, తెలంగీ అనే పిలిచెడివారు. ఇది 1947 వరకు వాడుకలో నుండెను.

విక్రంకు తెలుగుపట్ల చిన్ననాటి నుండి అభిరుచి మరి ప్రేమ. ఇది పుట్టుకతో వచ్చినదనియే చెప్పాలి. అయినా ఆచారము ప్రకారము తెలుగుతో సహా ఉర్దు ఇంగ్లీషు నేర్చుకున్నాడు. పరమేశ్వరుడు కూడా ఇంతే.

పరమేశ్వరుని మేనమామ యగు శ్రీనివాసుడు హైద్రాబాదు నగరములోనె యెక్కువగా ఉంటూ వుండేది. అందువల్ల కల్పవల్లి తన తనయునిని తమ్ముని నివాస స్థలములో నుంచుటకు నిశ్చయించి తమ్మునితో యీ ప్రస్తావన తెచ్చెను. శ్రీనివాస్ నిరభ్యంతరంగా సరేయని సంతోషంగా ఒప్పుకొనెను. ధర్మారావు విక్రంను కూడా పంపుటకై ఒక చిన్న యిల్లును మరి వంటమనిషిని సంసిద్ధము చేయుచుండెను. కల్పవల్లికి యీ విషయం తెలిసి ఓనాడు ధర్మారావుని సంబోధించి బావగారు (ధర్మారావును బావ అని పిలిచేది కల్పవల్లి) మీరు విక్రంని వేరే ఎందుకు వుంచాలా. విక్రం నాకు కూడా పరమేశ్వరుని వంటివాడు. అదిగాక చిన్నప్పటినుండి అన్నదమ్ములుగా పెరిగినారు. యిప్పుడు కూడా ఒకే చోట వుండి చదివితే మంచిది. అ మహానగరములో విక్రం ఒక్కడే ఒంటరిగా నుండుట మంచిది కాదు. కాబట్టి విక్రం కూడా పరమేశ్వరునితో శ్రీనివాస్ నివాసంలో వుంటాడు అనెను. ధర్మారావుకు కూడా విక్రంను ఒంటరిగానుంచుట ఇష్టము లేకుండెను. కాని విధిలేక వంట మనిషిని విక్రంను ఒక చిన్న అద్దెయింటిలో వుంచి చదివించాలని నిర్ణయించినాడు. కాని యిప్పుడు కల్పవల్లి ప్రస్తావించిన సూచన కూడా మంచిగానే తోచింది ధర్మారావుకు. సరే అన్నాడు ధర్మారావు. శ్రీలత కూడా యీ arrangement మంచిదని కల్పవల్లితో కలసి మాట్లాడినది. దీంతో విక్రం పరమేశ్వరుల పట్టణ ప్రయాణము మొదలు కాబోతుంది. విక్రం పట్టణంలో ఒక సినిమా చూచుటకు తల్లిదండ్రితో వెళ్లినాడు. అప్పుడు అతని వయస్సు రెండు యేండ్లు వుండవచ్చు. ఇతనికి ఒక మంచిరకమైన బిస్కెట్లు తినిపించినట్టు జ్ఞాపకం. సినిమా యేదియో గుర్తులేదు. పిమ్మట ఆయన ఒక సంవత్సరపు వయసు వున్నప్పుడు బహూశ అతనికి మశూచి టీకాలు తీయించెటందుకు తీసుకవెడలినాడు.

యిప్పుడు తన వూళ్లో నాల్గవ తరగతి వరకు చదివిన పిమ్మట మూడవసారి హైద్రాబాదులో నివసించటానికి వెళ్లుతున్నందున చాలా సంతోషము ఒకవైపు మరి రెండో వైపు తన వూరును, తల్లిదండ్రులను వీడిపోతున్నందుకు చాల బాధగా నుండెను. కాని చదువు ముఖ్యమని భావించిన యీ పసివాడు హైద్రాబాదు పోక తప్పదని భావించి మనస్సును స్థిరపరచుకొనెను.

యిచ్చట విక్రం తల్లిదండ్రులు హైద్రాబాదు ప్రయాణానికై విక్రంకు కావలసిన వస్తువులను ఓ పెట్టెలో పెట్టుచుండిరి. కల్పవల్లి పరమేశ్వరునికై కావలసిన సామగ్రిని పెట్టెలో సర్దుచుండెను. యీ విధంగా విక్రం, పరమేశ్వరులు శ్రీనివాసుతో కలిసి పట్టణం వెడలి బస్సుకై బయలుదేరిరి. ధర్మారావు శ్రీలత కల్పవల్లి యీ యిద్దరిని కన్నీటితో సాగనంపిరి. బస్సు యెక్కుటకు బండిపైన మైలుదూరము రోడ్డు వద్దకు వచ్చిరి. శ్రీనివాసుతో పట్టణము బస్సు చేరువరకు సాయంకాలమాయెను. నయాపుల్ వద్ద బస్సు దిగిరి. మొదటిసారిగా విక్రం హైదారాబాదును కనులపండువుగా చూచెను. బస్సులు, కార్లు, సైకిళ్లు, టాంగాలు నగర వీధులలో తిరుగుచుండెను. శ్రీనివాసు ఒక టాంగాను పిలిచి కిరాయి మాటాడుకొని తమ నివాసానికి చేరుకున్నాడు విక్రం పరమేశ్వరునితో.

హైద్రాబాదు అప్పుడు ఒక రమణీయమైన పట్టణము. నయాపుల్ ఆవలి భాగము ఉస్మానియా వైద్యకళాశాల. దానికి అంటుకొని పెద్ద భవనములో అఫ్జల్ గంజ్ హాస్పిటల్, నయాపుల్ కు యిటువైపు హైకోర్టు మరియు సిటీ కాలేజీ భవనాలు. పిమ్మట left side siddiamber బజారు. అఫ్జల్ గంజ్ కు సూటిగా సికింద్రాబాదుకు వెళ్లే త్రోవలో గౌలిగూడా residency కోఠి, సుల్తాను బజారు. పిమ్మట అంతా ఖాళీ స్థలమో లేక వ్యవసాయ పొలాలు ఇవన్నీ దాటిన పిదపకాని సిక్రిందాబాదు రాదు. అప్పుడు హైద్రాబాదులో మొత్తము జనాభా 2 లక్షలకు మించి ఉండదు. అప్పుడు యెటుచూచిన చెట్లతోటలతో నిండి వుండేది భాగ్యనగరము. రోజుకు 24 గంటలు మంచినీళ్లు, పరిశుద్ధంగా నుండే. నేటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యపట్టణము. కార్లు ఆనాడు చాలా తక్కువ. అట్లే మనుషులు కూడా; మరి యీనాడైతే యిసుక పోసిన రాలకుండ మనుషులు, కార్లు, ఆటోలు, స్కూటర్లు మొదలగు వాహనాలతో వాతావరణమంతా కలుషితమై విషపూరితమైన యీ వాయువుని యీ నగరవాసులు ఎట్లా పీలుస్తూ బ్రతుకుతున్నారో అర్థముకావటంలేదు. ఆనాడు ఒక సూదిని తయారు చేయలేని యీ భారతావని రాకెట్లను కూడా అకాశానికి పంపుచున్నది. వైజ్ఞానికంగా చాలా పురోగమించింది కాని మానసికంగా చాలా వెనకబడిందని చెప్పవచ్చు. ఆనాడు నిజాం ఏవి కావాలనుకొన్న అది కొద్ది ఖర్చుతో తయారయేది. మరి యీనాడు యేచిన్న ప్రాజెక్టు నిర్మించాలనుకొన్నా కోటానుకోట్లు ఖర్చు చేసి నిర్మించిన యేవో కొన్ని సమస్యలు ఆ కట్టడానికి. ఇది యీ నాటి వరస. అందుకే ఆనాడు హైద్రాబాదు నీళ్ళకోసము నిర్మించిన పెద్ద పెద్ద తటాకాలు నేటికి హైద్రాబాదుకు నీరు అందిస్తూనే వున్నవి. దేశంలో అప్పుడున్న జనాభా కన్న యిప్పుడు 5 రెట్లు కన్న యెక్కువగానే మున్నారని చెప్పక తప్పదు. మరి హైద్రాబాదు లోనైతే 20 వంతులు పెరిగెనని చెప్పుట అతిశయోక్తి కాదేమో.

ఇంటికి వెళ్లిన పిమ్మట రమణమ్మ వంట చేసి అందరికి వడ్డించింది. అందరు భోంచేసిన పిమ్మట విక్రం మరి పరమేశ్వరుడు అలసిపోయిన వారు కాబట్టి నిద్రాదేవి వడిలో హాయిగా శయనించిరి. మరునాడు యీ యిద్దరు బాలురు తెల్లవారు జామున లేచి కాలకృత్యాలు తీర్చుకొని మరి స్నానాలు చేసి బట్టలు వేసుకొని బడికి పోవుటకు సన్నద్ధులైరి. రమణమ్మ పిల్లలు బడికి పోవుచున్నారన్న తొందరతో ఇంత breakfast ను తయారుచేసి వారికి వడ్డించెను. వీరితో పాటు శ్రీనివాసు కూడ breakfast ముగించి యిద్దరి నిడుకొని వీరిద్దరిని బడిలో చేర్చుటకు బయలు దేరెను.

ఆ కాలంలో నాలుగవ తరగతి కన్న పై తరగతిలో చేర్చాలంటే school leaving certificate అవసరము. విక్రం మరి పరమేశ్వరుడు తన స్వంత వూళ్లలో సర్కారు పాఠశాల లేనందున ఒక ప్రయివేటు పంతులు వద్ద స్కూల్ syllabus ప్రకారము చదువుకున్నారు కాని school leaving certificate ను ఎలా తేగలరు. అందువల్ల శ్రీనివాస్‌గారు యిది గ్రహించి ప్రభుత్వ పాఠశాలలో యీ పిల్లల admission కై ప్రయత్నమే చేయలేదు. హైదాబాదు అనాడు హైదాబాదు రాష్ట్రానికి ముఖ్య పట్టణము. ఇక్కడ ప్రభుత్వ పాఠశాలలు మరి ప్రయివేటు పాఠశాలలు కూడా కొన్ని కలవు. యీ ప్రభుత్వ పాఠశాలలు school leaving certificate లేకున్న యీ పిల్లలను చేర్చుకోరని తెలసికొని private school కు వెళ్లినాడు. పరమేశ్వరుడు మేనల్లుడు కాబట్టి ఆయన విషయాలు ఆయనకు తెలుసు కాని, విక్రం విషయమే అన్ని విషయాలు తెలియవు. యీ ప్రయివేటు స్కూళ్లలో విక్రంను మరి పరమేశ్వరుని పరీక్షించి సరైనదని పరమేశ్వరున్ని, విక్రంని 6 standard లో ప్రవేశ మిచ్చుటకు ఒప్పుకొన్నారు. పిమ్మట యిద్దరికి admission forms ఇచ్చి వీటిని నింపమన్నారు. శ్రీనివాసు వీటిని నింపి పరమేశ్వరునికి form లో correct imformation యిచ్చి విక్రం form లో guessing game ఆడినాడు. అందువల్ల కొన్ని విషయాలు సరిగ్గ పడలేదు. యేది యెటులైన యిప్పుడు యీ బాలురిద్దరు ఒక పంతులుగారి బడిలో కాక ఒక middle school లో ప్రవేశించినారు. యివి ప్రయివేటు స్కూల్స్ అయినా వీటిని ప్రభుత్వం గుర్తించింది. వీరు కూడా school leaving certificates యివ్వగలగుతారు. అందుకే యీ బాలురు ఇప్పుడు ఒక విద్యా విధానంలో చేరినారు. యికముందు వీరు ఒక స్కూల్ నుండి మరియొక స్కూల్‌కు మారాలంటె school leaving certificate problme ఉండదు.

బడిలో పిల్లలిద్దరిని చేర్చి శ్రీనివాసు ఇంటికి వచ్చినాడు. అప్పటికి నాలుగు గంటలు దాటినది. ఒక ముఖ్య విషయము అయి పోయినది యీ విక్రం పరమేశ్వరుని జీవితాలలో. సాయంకాలం కాగా శ్రీనివాసు పిల్లలను వెంబడించుకొని 6వ తరగతిలో చదివె అన్ని పుస్తకాలు కొన్నాడు. వారికి కావలసిన note books కూడా కొన్నాడు. వూళ్లోనే అన్ని బట్టలు కుట్టించుకున్నారు. ఇక మిగిలింది ఉదయం లేచి బడికి పోవలసినదే. అది 1945 సంవత్సరము. అప్పటి ఆర్థిక సాంఘిక పరిస్థితులకు ఇప్పటి సాంఘిక పరిస్థితులకు ఆకాశానికి భూమికి వున్నంత భేదము. విక్రంకు యీ పట్టణ జీవితం వేరుగానున్నది పల్లెటూరి జీవనానికంటే. వూళ్లో తనను బడిలో యెవ్వరూ ఏమనే ధైర్యం లేదు. యెందుకంటె ధర్మారావు పలుకుబడి గల

వ్యక్తి. కాని ఈ పట్టణములో ఒక లంకలో తనో కోతిని అనుకున్నాడు. యిక్కడ తాను పరమేశ్వరుడు ఒకరికొకరు కష్టాలలోనైన సంతోషంలోనైనా ఒకరికొకరు ఆదుకోవల్సిందే అనుకొనుచు విక్రం నిద్రాదేవి ఒడిలో మైమరచినాడు.

తెల్లవారి అలారం చప్పుడుకు లేచి కాలకృత్యాలు తీర్చుకొని మొఖాలు కడుకొని టీ త్రాగి ఉపాహారాన్ని అరగించి, బట్టలు వేసుకొని బూట్లు వేసుకొని నిన్ననే కొన్న అన్ని పుస్తకాలను పెన్సిళ్లను ఒక సంచిలో సదురుకొని యిద్దరూ బయటకి ప్రయాణమైనారు. యీ బడి యింటికి అరమైలు దూరములోన నున్నది. వేళకు పోకపోతే head master cane తో దెబ్బలు అరచేతిలో వడ్డించును. వీళ్లు కొత్తవారు కాబట్టి వారు బడికి గంట మొదలే బడికి చేరుకున్నారు. వీళ్ల వెంబడి ఆ వాడలో నున్న కొంతమంది పిల్లలు కూడా బడికి వీళ్ల వెంబడి నడుస్తున్నారు. వారిలో ఒక అబ్బాయి శ్రీనివాసున్న యింటికి సమీపాననే ఉంటాడు. అతని పేరు బాబయ్య. తండ్రి లేని పిల్లవాడు. వృత్తికి వీరు గొలీలు. అంటే పాలను అమ్మువారు. తండ్రి పోయినందున తల్లి తన కొడుకును చదివించి పెద్దవాణ్ణి చేయాలని కంకణము కట్టుకొన్న మాతృమూర్తి. ప్రత్యేకంగా ఆనాడూ మరి ఈనాడూ హైద్రాబాదులోనే పుట్టి హైద్రాబాదులోనే పెరిగిన తెలుగు పిల్లల తెలుగు భాష చాలా వేరుగానుండును. వాళ్లు తెలుగు భాషలో చాలా ఉర్దూ పదాలు కలుపుటయే కాక, ఉర్దువలెనే తెలుగును మాటాడువారు. బాబయ్య కూడా అట్టి తెలుగే మాటాడువాడు. కాని స్నేహశీలి. అప్పుడప్పుడు ఆమె పాల దుకాణానికి వెళ్లినప్పుడు, తల్లి మాతో చాలా ప్రేమతో కొడుకుకన్నా మంచి తెలుగు మాట్లాడేది. ఆమె నన్ను పరమేశ్వరున్ని తన కొడుకులవలెనే చూచేది. పల్లెటూళ్లలో పుట్టి పెరిగింది కాబట్టి ఆమె భాష మా తెలంగాణ పల్లెటూరి భాష ఒకే తీరుగా నుండేది. బాబయ్య 7వ తరగతిలో నుండెను. కాబట్టి బడిలో యెలామెలగాలి. యేవేవి ప్రధాన విషయాలు, యే టీచరు యేమి చదివిస్తాడు మొదలగు అనేక విషయాలు తెల్పుతూ మా వెంట నడచేవాడు. ఆయన చెప్పిన విషయాలలో మాకు యేయే పంతుళ్లతో యెలా మెలగాలి అన్న విషయాలు తెలుసుకున్నాము. ఇక బడికి చేరుకున్నాక ద్వారంలో ప్రవేశించగానె బడి పిల్లలంత జామకాయలకై రాళ్ళు రువ్వుతున్నారు. ఆ జామచెట్టు వైపు మేము మెల్లగా వెళ్లి బాబయ్య చూపిన 6వ క్లాసులో కూర్చున్నాము. మా వూరిలో ఒకే పంతులు అన్ని పాఠాలు చెపుతాడు. ఈ బడిలో మేము కూర్చున్న క్లాసుకు ప్రతిగంటకు ఒక కొత్త పంతులు వస్తాడు. వేరు వేరు subject కు వేరు వేరు పంతుళ్లు పోగానే మాకు ఉర్దు పంతులు వచ్చి ఉర్దూ పాఠాలు ఆనాడు మొదలు పెట్టినాడు. ఆనాడు ఉర్దుకు ప్రాముఖ్యత. ఈ భాష రాజభాష. దీనిని ప్రతి ప్రభుత్వ కార్యాలయాలలో వాడుతారు. అందుకే విక్రంకు ఈ భాషలో పాండిత్యం సంపాదించాలని కుతూహలం. యీ ఉర్దూ పంతులు తర్వాత History and Geography Teachers చాలామంది పంతుళ్ళు షేర్వాని వేసుకొని వచ్చేవారు. కొంతమంది పంతుళ్లు కోటు లాగు మరి కొద్దిమంది పంచె షర్టు. యిందులో కొందరు పంచె షర్టుపైన ఒక కోటువేసుకొని వచ్చేవారు. యీ స్కూలుకు Head Master B.A. చదివినవాడు. అతనంటె పిల్లలకు హడలు. సరిగ్గా బడి తెరచిన సమయానికి

వచ్చి కొన్ని నిమిషాలు ఆలస్యంగా వచ్చిన పిల్లలను అరచేతిలో cane తో బాగా ఆలస్యాన్ని బట్టి ఫడా ఫడా మోగించేవాడు. అందుకే కాబోలు పిల్లలకు అతనంటే చాలా భయము. విక్రంకు మొదలు మొదలు అతనంటే భయమనిపించేది. కాని రాను రాను యీతడంటే మంచి అభిప్రాయం యేర్పడింది. విక్రం కొన్ని నిముషాలు మొదలే క్లాసు చేరుకునేది. పరమేశ్వరుడు విక్రం వేరే వేరే section లో నుండిరి. స్కూల్ కాగానే వారి వారి క్లాస్‌లో జరిగిన విషయాలను మాటాడుకొనెడివారు.

ప్రతిరోజూ ఉదయముననే ఒక అబ్బాయి పాలు సైకిలుపై తెచ్చి శ్రీనివాసు ఇంట్లో పోసిపోయెడివాడు. యీతడు పాలు కొని తెచ్చేదా లేక వీళ్లకు పాడి పశువులున్నయా తెలియదు. యీ బాలుడు ఉత్తర హిందుస్థానీయుడు, యీతనికి గడ్డము నెత్తిపైన వెంట్రుకలు అలాగె పెరిగినవి చిన్నప్పటి నుండి. ఆ నెత్తిలో పొడుగైన వెంద్రుకలను కప్పటకు ఒక turban చుట్టుకునేవాడు. యిది వీళ్ల ధర్మాచారమట. విక్రం మొదటి సారిగా యీ సిక్కుల మతానికి చెందిన కుర్రవాణ్ణి చూచినాడు. ఇతడు గౌలీ బాబయ్యకు సహోధ్యాయి. మెల్ల మెల్లగా నందుసింగుకు పరమేశ్వరునికి బాబయ్య మూలంగా స్నేహం కుదిరింది (యేర్పడింది). నేను పరమేశ్వరుడు ఒకే యింటిలో నున్నందున నేనెవరో అతనికి తెలుయును కాని మేము అంతగా స్నేహితులము కాలేదు. చిన్నప్పటి నుండి ఒకే వూళ్లో పెరిగిన, ఒక పంతులు వద్ద చదివిన పరమేశ్వరునికి విక్రంకు చాలా భేదము యేర్పడటం మొదలు పెట్టింది. చిన్నప్పుడు వారి పల్లెటూరు అచ్చటి వాతావరణము పూర్తిగా వేరు. మరి పట్టణములో ఒక cosmopolitan atmosphere అందులో హైద్రాబాదు culture ఉత్తర హిందుస్థానము మరి దక్షిణ హిందుస్థానము యొక్క సమ్మేళనము. ఇచ్చట అన్ని దేశాలవారు అన్ని రాష్ట్రాల వారు నివసిస్తున్నారు. యిచ్చట కాశ్మీరు రాష్ట్రము నుండి కన్యాకుమారిలోని ప్రజలు నివసిస్తున్నారు. యూరపుకు చెందిన యెన్నో దేశాలవారు కొంతమంది హైద్రాబాదులో నివసించేవారు. మొహమ్మదీయులు యెక్కువగా పాత హైద్రాబాదులో నున్నారు. వారికి హిందువులకు ఆ కాలంలో మైత్రి ఉండెనని యెందరో చరిత్రకారులు చెపుతుంటారు. దానికి కారణం నిజాం తురక యేలికుడు. వాళ్లు రాష్ట్రంలో 10 శాతమైనా political and government power అంతా వాళ్ల అధీనమే. చదువుకున్న తురకలు, మళ్లి మంచి కుటుంబాలకు చెందిన తురకలు హిందువులతో చాలా స్నేహ పూర్వకంగా వుండేవారు. కాని చదువులేని low strata అంతా హిందువులను హింసించేవారు. అయినా యీ low strata తురకల బాధలను భరించి ఉండటం వలన ఆనాడు మత పోరాటాలు జరుగలేదు. జరిగిన తురకల ప్రభుత్వము వాళ్లను అణచివేయునన్న భయముతో హిందువులు బాధలను భరించి ఉక్కిరి బిక్కిరి మనకుండ అణిగి మణిగి యుండేవారు. ఆనాడు జరిగిన అత్యాచారాలు చాలా నున్నవి. ఉదాహరణకు, బీద సాదలగు హిందూ స్త్రీలను చెరచి అపహరించి వారిని తమ మతములో కలుపుకొనెడివారు. దిక్కులేని హిందువులు గప్‌చుప్ అనకుండ కూర్చునెడివారు. అంతేకాకుండ ఊళ్ళలో నున్న హరిజనులను తమ మతానికి మార్చేవారు. యీ విధంగా హిందువులను యెన్నియో ముప్పు తిప్పలు పెట్టినారు యీ lower strata తురకలు. లోధివాడలోని లోధీలు

మాత్రము తురకలకు భయపడకుండా వాళ్లను ధైర్యంగ యెదుర్కొనే హిందువులలో వారొకరు. అల్లే సిక్కులు కూడా తురకలకు భయపడేవారు కారు. ఈ రెండు తెగల వాళ్లు తప్ప అందరు హిందువులు తురకలకు అణగి మణిగి వున్నవారే.

విక్రం స్నేహ బృందం వేరుగా పెరుగుతు వచ్చింది. అల్లే పరమేశ్వరుని స్నేహితులు కూడా పెరిగినారు. యీ యిద్దరి స్నేహ బృందములకు యే విధమైన పొత్తులేదు. చిన్నప్పుడు మైత్రిగా పెరిగిన స్నేహితులు కొంతవరకు పెద్దైనాక కూడా మైత్రిని మరువరని విక్రం విశ్వాసము. కాని వారు స్కూల్ నుండి వేరై జీవితములో ఎవరి దారిన వాళ్లు పోయి పెళ్లి చేసుకొని తమ కుటుంబాలతో అందరి చిన్ననాటి స్నేహితులను మరచిపోతారు. కాని విక్రం మాత్రము అలా జరగదని విశ్వసించేవారిలో ఒకడు. స్కూల్‌లో చదువుతున్న రోజులలో తను జన్మనెత్తిన పల్లెటూరు జ్ఞాపకము వచ్చినపుడెల్ల కొంచెం దిగులుగా వుండేవాడు. Holidays రాగానే మొదలు ఊరి ప్రయాణమే. బస్సు దిగి వూరికి వెళ్లి వున్నన్ని రోజులు హాయిగా కాలం వెళ్లబుచ్చి Holidays కాగానె చాలా బాధతో మళ్ళీ బస్సెక్కి పట్టణం వచ్చేవాడు. యింటి నుండి తినుబండారాలు పెట్టెలో పెట్టి యిచ్చేది యీయన మాతృమూర్తి. వీటి నన్నింటిని భద్రంగా దాచి పరమేశ్వరునితో సహ ఆరగించేవాడు. విక్రంకు శ్రీనివాస్ యింట్లో అన్నీ సక్రమంగా జరగినవి. పరమేశ్వరుని మేనత్త అంటె శ్రీనివాసు భార్య విక్రంని, పరమేశ్వరుని స్వంత పిల్లలవలెనే చూసేది. ఆమెకు యీ యిద్దరిలో యెవరిని వేరుగా అనే భావించలేదు. స్వతహ యీమె చాలా మంచి మనిషి. ఆదర్శ గృహిణి. అయినా శ్రీనివాసుకు పొరిగింటి పుల్లకూర రుచి అన్నట్లుగా వేరే స్త్రీల సంపర్కముకూడా నుండెను. యీ భార్యకు పిల్లలు లేనందున రెండో స్త్రీని పెండ్లాడి ఆమెతోనే యెక్కువగా ఉండేవాడు. అందువల్ల శ్రీనివాసు మొదటి భార్య విక్రంను పరమేశ్వరుని తన కొడుకులలాగే చూసేది. అందుకే యిద్దరు ఆ యింట్లో అన్నదమ్ములవలె నున్నారు.

విక్రంకు యెంతో మంది స్నేహితులు. వీళ్లంతా బడిలో దొరికినవారు. యీ స్నేహితులంతా పల్లెటూళ్లనుండి తన వలెనే చదువుకొరకై హైద్రాబాదుకు వచ్చినవాళ్లు. విక్రం వలెనే వీరు కూడా తమ తమ నివాస స్థలములో నుండి బడికి వచ్చి చదువుకునేవారు. యీ స్నేహితులలో ఆనందబాబు అనబడే స్నేహితుడు విక్రంకు చాలా సన్నిహితుడైనాడు. వీళ్లు విక్రం వూరికి ఒక నాలుగు క్రోసుల దూరములోనుండే వారు. ఆనంద్ అతని తమ్ముడు ఒక చిన్న యింట్లో అదే మొహల్లాలో వాళ్ల అమ్మమ్మతో వుండెడివారు. తల్లి తండ్రి వూళ్లో వుండెడివారు. వీరి జీవనాధారము వ్యవసాయమే. నెలకు రెండు నెలలకు ఒకసారి బియ్యం పప్పు మున్నగు వంట సామగ్రి, పొయ్యిలో కట్టెలతో సహ వీరి తండ్రి రామారావు గారు తెచ్చి ఆనందబాబు అమ్మమ్మకు ఒప్పజెప్పుచుండెను. ఆ అమ్మమ్మ వాటిని చక్కగా వాడి, పిల్లలకు రోజుకు తగు భోజనము పెట్టుచుండెను. వీరికి నెయ్యి, పాలు అప్పుడప్పుడు కూరగాయలు కూడా వూరునుండియే వచ్చుచుండెను. యీ రామారావు గారు చాలా మర్యాదగల మనిషి. విక్రం వాండ్ల యింటికి వెళ్లినప్పుడు యీ రామారావుగారు వీరి కెన్నియో బోధలు చేసేది. అందుకే రామారావుగారంటె విక్రంకు చాలా భక్తిశ్రద్ధలు.

యీాయన కాలంలో high school పరీక్షలు పాసైనాడు. కాబట్టి వీరికున్న పుస్తక సందేహాలను కూడా ఆయన నడిగి తెలుసుకునే వాళ్లు. యీాయన చాలా ఓపికతో వీళ్ల సందేహాల నన్నిటినీ తీర్చుటకు ప్రయత్నించేవాడు. యీా విధంగా విక్రం మైత్రి ఆనందబాబుతో పెరుగుతూ వచ్చింది. రాను రాను వీరిద్దరు పాఠాలు చదివి home work చేసి చాలా రాత్రైతే ఆనందబాబు రూంలో పడుకునేవాడు. దీంతో విక్రంను శ్రీనివాసు మందలించుట మొదలు పెట్టినాడు. మొదలు శ్రీనివాసు నమ్రతతో విక్రంకు అలా చేయగూడదని చెప్పి పిమ్మట కఠినంగా మందలించినాడు. అయితె విక్రంకు ఆనందబాబుకు కొద్ది రోజులు యెడబాటు జరిగింది. విక్రంకు మళ్లి Holidays రాగానే వూరికి వెళ్లినాడు. యీా సంగతి ధర్మారావు గారితో తెల్పి తనకు ఆనందబాబుతో వుండుటకు అనుజ్ఞ యివ్వమన్నాడు. ధర్మారావు కల్పవల్లితో ప్రస్తావించి ఆమెను ఒప్పించి శ్రీనివాసుకు తెల్పమన్నాడు. Holidays ముగిసిన పిమ్మట విక్రం హైద్రాబాదు చేరుకున్నాడు. వచ్చిన రెండు రోజులకే తనమకాం ఆనందబాబు యింటికి మార్చినాడు. దీనితో పరమేశ్వరునికి విక్రంకు యెడబాటు కలిగింది. ఆనందబాబు విక్రంకి ఆ యింటిలోనే ఒక రూంను అమర్చి దాని అద్దెను యేర్పాటు చేసినాడు. తిండి ఆనందబాబు అమ్మమ్మే వండి పెట్టేది. యీా విధంగా యీా చిన్న వయస్సులో విక్రం హైదరాబాదులో ఇండిపెండెంటుగా బ్రతుకుటకు అలవాటు పడ్డాడు.

రోజూ ఆనందబాబు విక్రం కలసి పాఠశాలకు వెళ్లేవారు. పాఠశాల దగ్గరగా నున్నందువలన యే కష్టం లేకుండ పది నిమిషాలలో పాఠశాల చేరుకునేవారు. పిదప పాఠాలు, పాఠల పిమ్మట మధ్యాహ్నపు meals పిదప నాలుగు గంటల వరకు చదువు పిమ్మట యింటికి రావటం. యివి నిత్యం చేసే కార్యక్రమాలు విక్రంకు. ఆనందబాబు కొంచెం చామనచాయ కలవాడు. నిరాడంబరజీవి. అబద్ధాలు పలుకడు. చదువులో బాగానే వుండేవాడు. పట్నం తల్లి, తండ్రి యిద్దరు వచ్చేవారు. తల్లితో విక్రం కంత చనువు లేకుండెను. కాని తండ్రి రామారావుతో విక్రం చాలా free గా ఉండేవాడు. ఆయన నిష్కళంక జీవి ప్రేమమూర్తి కావున విక్రంకు నచ్చినాడు. రామారావు వస్తాడనగానే ఆనందబాబు కంటె విక్రంకే యెక్కువ సరదా కలిగేది. ఆనంద్, విక్రం రెండు సంవత్సరాలు ఒకేచోట ఉండిరి. వీరి పాఠశాల I నుండి 7th వరకు పాఠ్యబోధన చేయుచుండెను. యిప్పుడు వీళ్లిద్దరు 7వ తరగతి పూర్తి చేసి 8వ తరగతికి వెళ్లవలసివుంది. అంటే 8,9,10 వ తరగతి అంటే మన లెక్కప్రకారం వీళ్లు Jr. High School పూర్తి చేసి Sr. High School కి పోవాలన్న మాట. యీా Sr. High School వీళ్ల యింటికి సుమారు $1\frac{1}{2}$ మైళ్లన్న మాట. అందుకే వీళ్లు మునుపటివలె 10 నిమిషాలు కాదు అరగంట మొదలు యింటినుంచి వెళ్లినచో సరిగ్గా క్లాసుకు పోగలరన్నమాట. యిప్పుడు విక్రంను యెవరు స్కూల్లో అడ్మిషన్ చేసే అవసరములేదు. ఆనంద్ విక్రం తమకుతామె admit చేసుకొని ఫీసు కట్టినారు. ఆనాడు ఫీసు చాలా తక్కువ. ఒక రూపాయికి యెంతో విలువ ఉండేది. నెలకు కొన్ని రూపాయల ఫీసు అన్నమాట. అయితే వీరికి admission లో యేమి కష్టము కాలేదు. school

leaving certificate automatic గానే లభించింది. అందువల్ల admission కూడా routine గా దొరికినది. admission అయిన మరునాడు పుస్తకాలు కొని బడికి వెళ్లినారు. Jr. High కు Sr. High కు యేమంత భేదము లేదు. కాకపోతే subjects కొన్ని కొత్తవి తీసుకున్నారు. Sr. Highలో optional subjects Higher maths and non-mathemetical subjects అంటే English History, Theology etc. యెక్కువ మంది Higher Maths నే తీసుకొనే వారు. ఆనంద్ విక్రం Higher Maths లోనే ప్రవేశించారు. యిప్పుడు వీళ్లు యిద్దరు teenagers అందువల్ల వీరి భావాలు కూడా teenage భావాలే. ప్రత్యేకంగ విక్రంకు దేశ రాజకీయాలంటె చాలా యిష్టం. అనాడు గాంధీవాదం దేశంలో ప్రాకిపోతున్న దినాలు. నెహ్రూ కూడా యెవరో విక్రంకు తెలుసు. కాబట్టి క్లాసులో పిల్లలతో గాంధీవాదం మీద మాట్లాడేవాడు. అయితే విక్రం క్లాసులో చాలామంది విద్యార్థులు జిన్నాను మరి అతను కావాలని కోరుతున్న పాకిస్తానును బలపరిచేవారు. విక్రం ఒకడే యీ విషయములో గాంధీని సమర్థించేవాడు. ఆయన భయము లేకుండ గాంధీని సమర్థించేది. ఇది కొంతమంది జిన్నా వాదులకు విక్రం అంటే కోపము, మరి కొద్దిమందికి అసహ్యం కూడా. అయితే విక్రం క్లాసులో నున్న కొంతమంది విక్రం భావాలతో యేకీభవించకున్న అతనికి గాంధీని సమర్థించే అధికారము నున్నదని జిన్నావాదులతో వాదించేది. విక్రంకు అనుకోకుండ లభించిన యీ Support తో జీవితం కొంత మెరుగు పడినది. విక్రంను Support చేసిన విద్యార్థి అరబు యువకుడు. యితడు విక్రం కన్న వయసులో 5 సంవత్సరాలు పెద్ద, మంచి బలీయుడు. అందుకే అతడు క్లాసు monitor గా నియమితుడైనాడు. అతనికి యీ జిన్నావాదులంటే అంతగా నచ్చనట్లు విక్రంకు తోచింది. అప్పటినుండి యీ అరబు కుర్రవాడంటె ఒక గౌరవము తనలో యేర్పడింది. చాలామంది జిన్నావాదులు హింసావాదాన్ని కూడా బలపరచేవారు. తమ మతస్తులు హిందూదేశాన్ని యెట్లా గెలచినారు యెలా పాలించినారు కాబట్టే మొత్తము హిందుస్థానము పాకిస్తానుకు మార్చాలన్న తీవ్రవాదులు కూడ విక్రం క్లాసులో వున్నారు. దేశవిభజన తప్పదని వాదించి హైద్రాబాదు కూడా కాశ్మీర్, బెంగాల్, పంజాబు, సింధు, బిలోచిస్తానుతో సహా చేరాలనేది. హైద్రాబాదులో యీ జిన్నావాదులంతా వేల సంఖ్యలో procession తీస్తుండిరి. "హంస్తే లేంగె పాకిస్తాన్ లడ్ కే లేంగె హిందుస్తాన్" అని నినాదాలు చేయుచూ, వీరందరు సిటీలో procession లో పోయేవారు. వీరు 100కి 10 శాతమే వున్నా ప్రభుత్వ సహాయము సంపూర్ణంగ ఉన్నందువలన హిందువులు వీరు అంటే పాకిస్తానును support చేసే వారిని హిందువులు యేమి అనలేని స్థితిలో ఉండిరి. అంతేకాకుండా బెంగాలు తూర్పు పాకిస్తాన్ మరి హైద్రాబాదు దక్షణ పాకిస్తానుగా చేయుటకు హైద్రాబాదు తురకలు ప్రయత్నించారు. అందుకే ఇండియాకు అగస్టు 15 కు స్వతంత్రం రాగానే హైదరాబాదు నిజాం హైదరాబాదును స్వతంత్ర హైద్రాబాదుదేశంగా ప్రకటించినాడు. అయినా 90% హిందువులు తలవంచుకొని చుప్ అనకుండా కూర్చున్నారు. మొహమ్మద్ కాసిమ్ అనే అతడు ఇది మా రాజ్యము మమ్మలను యెవరూ యేమీ చేయజాలరని Itehadul Muslmeen అనే ఒక

సంస్థను స్థాపించి దాని ఆధ్వార్యాన తురక యువకులనంత రజాకార్లుగా భర్తీ చేసి వారికందరికీ సైనిక శిక్షణనిచ్చి వారికి ఆయుధాలను సమకూర్చి అజాద్ హైద్రాబాదు రక్షకులుగా నియమించినాడు. అయితే యీ రజాకార్లందరు హిందువులను ప్రత్యేకంగా కాంగ్రెసు వాధులగు హిందువులను హింసించి కొంతమందిని హతమార్చినారు. స్త్రీల మానభంగాలు, ప్రత్యేకంగ బీద స్థితిలో నున్నవారిని, చేసినారు. యీ అఘాయిత్యాలను ఎదుర్కోలేక సదుపాయలున్న అనేక హిందువులు హైద్రాబాదుకు ప్రక్క రాష్ట్రాలకు అంటె ఆంధ్రా జిల్లాలకు మహారాష్ట్ర మరి కర్నాటక జిల్లాలకు వలసపోయినారు. సదుపాయాలు లేని వారు యిచటనే అన్నీ సహించి వున్నారు. హైద్రాబాదు నిజాము యీ రజాకార్ల నాయకత్వము సమ్మతించి యూరప్ నుండి అతి నూతన అస్త్ర శస్త్రాలను తెప్పించినాడు. విమానాలు Indian Union భూభాగము నుండి వీరి Air space ను దాటంది హైద్రాబాదుకు రాలేనందున యెట్లా యీ విమానాలను రప్పించవలె. అస్త్ర శస్త్రాలను యెలా తేవాలే అని ఆలోచించుచుండిరి. యీ విషయమై పిమ్మట యిదే పుటలలో విచారించుదాము. ప్రస్తుతము హైద్రాబాదులో చెలరేగే పరిస్థితులపై విచారించుదాం.

నిజాం English residence ఆధ్వర్యములో పాలించుట వలన యితనికి కొన్ని నిబంధనలుండెను. ఇంగ్లీషు వారు ఇండియాకు స్వతంత్రమిచ్చి princely states కు వారు స్వతంత్రంగా ఉండాలనుకుంటే ఉండవచ్చు అను అధికారాన్ని యిచ్చినారు. అందువల్ల చాల states మళ్ళి independent గా ఉంటామని declare చేశాయి. అవి చట్టబద్ధమైనవే అందువల్ల హైద్రాబాదు కూడా స్వతంత్రంగా ఉండ నిశ్చయించినది చట్టబద్ధమైనదే.

విక్రం, అనంద్ 8వ తరగతిలో చేరగానే స్వతంత్ర అల్లకల్లోలము దేశమంతటు వ్యాప్తిచెంది యుండెను. యిదివరకు చెప్పినట్టుగా హైద్రాబాదు తురకలు ప్రత్యేకంగా విద్యార్థులు, యువకులు పాకిస్తానునే కాక యావద్భారతాన్ని పాకిస్తానుగా మారుస్తామని ధైర్యంగ మాటాడుచుండిరి. అందుకు గత చరిత్రయే దీనికి తార్కాణము. ఎందుకంటే,

"మలిక్ కాఫర్" దక్షిణమున మధుర వరకు ఎత్తిన జండాను దించకుండా రాజ్యాలను జయించుతూ వెళ్లెను. అంతకన్న ఆశ్చర్యజనకమగునదేమనగా మహమ్మద్ ఖిల్జీ అను సేనానిని 200 మంది సవార్లతోనే బిహారును క్రీ.శ. 1197లో జయించెను. అంతకన్నాను మరీ ఆశ్చర్యకరమయిన విషయమేమన అ సేనానియే 1199లో 18 మంది సవార్లతోనే బెంగాలు రాజధానియగు నిడియాపై బడగా వంగరాజు తొంగి చూడకయే దొడ్డి తలుపున బడి పారిపోయెను. అ కాలములో బిహార్ బెంగాల్ రాజులును విశేషముగా బౌద్ధులు అహింస ధర్మము వారి నీగతికి తెచ్చెను. హిందూ బౌద్ధుల పతన మత్యంత లజ్జాకరమని యొప్పుకొనక తప్పదు. ఖిల్జీ సుల్తానులు, బహమనీ సుల్తానులు లక్షల హిందువులను ఈగలవలె చంపిరి. ఫిరోజిషా అను బహమనీ సుల్తాను 20,000 హిందువులను చంపుట పరిపూర్తియైనప్పుడంతయు మూడు దినములు చంపుడు విందు చేసినాడు. ఒక తడవ అయిదు లక్షల హిందువుల ప్రాణాలు తీసిన తర్వాతనే 'రోజా' (ఉపవాస వ్రతము) వదిలెను. లక్షల హిందువులు

ప్రాణాలు దక్కించుకొన ముసల్మానులైరి.*

"ముసల్మాన్ ప్రభువులు ఇస్లామ్ వ్యాప్తికి, హిందూ వినాశనానికి అందరున్ను (అక్బరుతో సహా) పరిశ్రమించిన వారె. పైగా హిందువుల అభివృద్ధికి కావలసినన్ని నిరోధాలు శాసించిరి. జహంగీరు, షాజహాన్, ఔరంగజేబు దేవాలయ నిర్మాణాలకు సెలవియ్య లేదు. ముసల్మానులయిన వారు తిరిగి హిందువులైతే ఘోర శిక్షల నిచ్చుచు నిరోధక శాసనాలు చేసిరి. ఔరంగజేబు బళ్లను కూడ పెట్టుకొన నియ్యలేదు".**

యీ నినాదాలు తురక విద్యార్థులు చేస్తు వుంటే వారిని వారించి సరియైన బాటలో పెట్టిన ఒక teacher కూడా నాకు కన్పించలేదు. కాని అనంద్ section లో ఒక teacher యిటువంటి వారిని అదుపులో పెట్టుటకు ప్రయత్నించేది. కాని యే తురక teacher కూడా యింతనైన చేయలేదు. ఇక మన హిందువులు యీ స్కూల్‌లో minority గా నుండిరి. ఒక ఇంగ్లీషు టీచర్ విక్రం క్లాసుకు ఇంగ్లీషు చెప్పెడి వాడు. ఇతడు చాలా మతోన్మాది. ఓ పెద్ద గడ్డము మరి పెద్దబొజ్జ Aligrah university నుండి M.A. English లో చేసినాడట. ఇతనికి హిందు విద్యార్థులంటే గిట్టదు. ఇతడు చదివించె ఇంగ్లీషు పాఠ్యగ్రంథములో Mahatma Gandhi ని గురించి ఒక పాఠముండెను. తురక విద్యార్థులలో చాలామంది Mahatma Gandu అనేవారు. విక్రంకు వారట్లా అన్నప్పుడల్లా రక్తం ఉడుకెత్తేది కాని యేమి చేయగలడు. గప్‌చుప్‌గా కూర్చుండేవాడు. కనీసము యీ English teacher విన్నప్పుడైనా అట్లా అనుట తప్పని యెప్పుడూ చెప్పలేదు. విక్రం ఒకనాడు యీ అసహ్యపు పేరుతో గాంధీని తిట్టుట విని భరించేక మహాత్ముని defence కై యేదో చిన్న argument చేసినాడు. దానితో ఒక విద్యార్థి ఉద్రేకియై సరే బైటికి నడువు. నీకు నాతడాకా చూపిస్తా అన్నాడు. విక్రం 8వ తరగతిలో వున్న శరీర బలం లేదు మేధా సంపత్తి బాగున్నది. క్లాస్ అయినాక విక్రం చాలా భయంతో అందరి పిల్లల నడుమ నడుస్తూ వున్నాడు. అంతలోన యీ క్లాసులో విక్రంను బెదిరించిన అబ్బాయి విక్రం దరిచేరి గొంతుపట్టి విక్రంను పడవేసి కొట్టుటకు ప్రయత్నిస్తున్నాడు. అంతలో మా క్లాసు మానీటరగు అరబ్బుల యువకుడు విక్రం ముందు నిలచి "విక్రంను కొట్టేముందు నాతో కొట్లాడండి దమ్ముంటే". అయనకు మీకున్నంత వాక్ స్వాతంత్రము లేదా? అని గర్జించగానే విక్రంను పీడింపదలచిన విద్యార్థి మాయమై పోయినాడు. పిమ్మట ఆనాటి నుండి ఈనాటి వరకు యెవరూ విక్రంను rough గా man handle చేయుటకు ప్రయత్నించలేదు.

యీ సంఘటన విక్రంలో కొంచెం ధైర్యం రేపింది. యెంతవరకు తురకల రాజ్యాన్నైనా న్యాయాన్ని మాట్లాడే వీరులుంటారని విక్రం గ్రహించగలిగినాడు. అయినా ఈ తురకల గూండాయిజముతో పదిలంగా ఉండాలని గ్రహించినాడు. కాని విక్రం ప్రకృతి యేమంటే సత్యమని తోచింది తనకు తెలియకుండానె అతని నోటినుండి వెలువడుతుంది. ఒకప్పుడు అదే స్కూల్‌లో ఈ టీచర్ తురక

---

* అంధ్ర సాహిత్యచరిత్ర. సురవరం ప్రతాప్‌రెడ్డి PP. 286 to 287.

** Ibid. PP. 345.

అతను, విక్రం ఏమో అన్నాడని, యెవరో విద్యార్థి ఆ టీచర్‌తో చెప్పినాడట. అతడు ఉగ్రుడై విక్రంను రాని యివ్వాళ వీపు బద్దలయ్యేటట్టు శిక్షిస్తాను అని విక్రంకై వేచి యుండెను. విక్రం క్లాసుకు రాగానె, యిటురా, అని కోపగ్రస్తుడై యున్న ఆ టీచరు విక్రంను పిలిచెను. విక్రం యేదో అపకారము కలుగనున్నదని భయంతో ఆ టీచర్ ముందుకు వెళ్లినాడు. అతడు విక్రంను సూటిగా చూస్తూ నీవు నా విషయమై ఇట్లా అన్నావా? అని గద్దించి విక్రంను ప్రశ్నించెను. లేదు సర్ నేను నాగురువులైన మిమ్మలను ఇటువంటివి అనగలనా? నేను అనలేదు సర్. యిది నిజము. ముమ్మాటికి నమ్మండి అని పలికెను. విక్రంకు యీ టీచరంటే యిష్టమే. ఎందుకంటే అతని రాజకీయ భావాలను తనలోనే దాచుకొని, వేరే వారి భావాలను, అభిప్రాయాలను గౌరవించిన వ్యక్తి అని. అటువంటి టీచరు ఈనాడు యిట్లా ఎందుకు ప్రవర్తించినాడు. అయినా యెవరో విక్రం అంటే పడనివారు ఇలా చెప్పి వుంటారని ఆగ్రహించి కేన్‌తో కొట్టకముందు స్వయంగా అడిగి అది అసత్యమని తెలుసుకొని క్షమించినాడు. అందుకు కూడా అతనిని మెచ్చుకోవాలని తన స్నేహితులతో అనేవాడు. ఈ ఘట్టము విక్రం జీవితములో చాలా కాలం వరకు ముద్ర పడియుండెను.

జీవితంలో టీచర్లలో కూడా మంచి వారు, చెడువారు, మంచిని చెడును, సత్యాన్ని అసత్యాన్ని విచక్షణ చేయగలిగిన వారుంటారని విక్రం తెలుసుకున్నాడు. అంతేకాకుండ యేమీరాని టీచర్లు యేదో నెలకు దొరికే జీతానికై యేదో పైపైన చదివించి యెప్పుడు టైమౌతుందా అని గోడకున్న గడియారాన్ని చూచేవారు. కాని కొందరు scholastic teachers మంచిగా పాఠాలు చెప్పగల జ్ఞానాన్ని అర్జించి పిల్లల మన్నల పొందిన టీచర్లు కూడా వున్నారని ఒక అభిప్రాయము కూడా యేర్పడింది. ఒకప్పుడు విక్రం science teacher ఒక simple chemistry experiment ను oxygen ను ఎలా సిద్ధం చేయాలే అని విద్యార్థులకు చూపించేటందుకు కొన్ని chemicals కలిపిన గ్లాసు flask కు గట్టిగా ఒక rubber కార్కు మూత పెట్టి దానిని gas flame మీద పెట్టి మరి యేదియో chemicals ను చూస్తు వుండెను. అట్లు పెట్టిన ఒక నిముషానికే విక్రం లేచి సార్ దాని మూతను తీసివేయండి అది పగలుతుంది అంటే, ఆ టీచరు కుర్రకుంక నీకేమి తెలుసునన్న నిర్లక్ష్యముతో మొఖము యెట్లానో చేసి విక్రం దిక్కు చూచెను. మంచిది సార్ మీ యిష్టము నేను యీ first - row నుండి last - row కు వెళ్లుటకు అనుమతిస్తారా అంటే సరే అని తలవూపెను. విక్రం అమ్మయ్య బ్రతికితిని అని చాలా వెనుకకు వెళ్లి కూర్చొనెను. విక్రం వెనుకకు వెళ్ళి కూర్చున్న సుమారు అర నిముషానికే flask పట్టుమని పగిలి, ఆ పగిలిన గ్లాసుముక్కలు forceful గా కూర్చున్న కొంతమంది విద్యార్థులను గాయపరిచెను. రక్తం కారుచున్న కొంతమంది విద్యార్థులు దానిని ఆపుటకు ప్రయత్నిస్తుండిరి. అదృష్టవశాత్తు యెవరికీ తీవ్రమయిన గాయాలు కాలేదు. ఆ టీచరు నన్ను యేమనలేదు. విక్రం మాత్రము నాకు తెలియదన్నట్టుగానె కూర్చున్నాడు. పిమ్మట ఆ టీచరు యింకో flask తెచ్చి ఈసారి మూత లేకుండానె

ఆ ద్రవాలను వేడిచేసి oxygen ను సృష్టించి విద్యార్థులకు చూపించి పిమ్మట ఆ details ని వ్రాయించినాడు.

విక్రం ప్రతిరోజూ క్లాస్ కాగానే ఆనంద్‌తో కలిసి యింటికి బయలుదేరి వచ్చేవాడు. రాగానే బట్టలు మార్చుకొని కొంచెం rest తీసుకొని మళ్ళీ రాత్రికాగానే పుస్తకాలు తీసి కొంతసేపు చదివి, పిమ్మట నిద్రాదేవి వళ్లో దూరేవాడన్నమాట. యీ విధంగా రోజూ ఒక routine గా అయిపోయింది. వేసవి రాగానే పరీక్షలు, పిమ్మట వూరి ప్రయాణం. విక్రం యెప్పుడు పరీక్షలు వచ్చి, వేసివి వస్తుందో అని యెదురు చూస్తుండేవాడు. వూరిలో యితనికున్నంత freedom ఈ పట్టణములో లేదు. యెటు చూచిన యిండ్లే. విశాలమైన మైదానములు పచ్చనిచేలు కానరావీ పట్టణములో. విక్రంకు పచ్చని చేలు విశాలమైన చోటు యెటు చూచిన కనుచూపు మేరకు చెట్లు చేమలు తప్ప మరేమీ కానరావు వారి వూరిలో. కాని పట్టణములో అవి యేకోశాన లేవు. కాబట్టి అతనికి యెప్పుడు ఎండాకాలం వస్తుందో యెప్పుడు యింటికి పోగలనో అను నిరీక్షణలో తప్పేమి లేదు. అనుకున్నట్టు వేసవి వచ్చింది. ఆనంద్ అతని అమ్మమ్మ మరి తమ్మునితో ప్రయాణమై వాళ్లనాన్నగారితోను మరి విక్రం ఒకడే బిస్తర్, పెట్టెతో వూరికి ప్రయాణమై పోయెను. విక్రం యిల్లు చేరగానే మాతృమూర్తి విక్రంను ముద్దాడి పనివారితో అతని పెట్టె మరియు bedding విక్రం రూంలో సర్దించెను. కుమారుడు ఫలాన దినమునాడు వస్తానని యిది వరకే వ్రాసినాడు కాబట్టి విక్రం గదినంత శుభ్రపరచి సిద్ధంగా నుంచెను. విక్రం తన రూములో ప్రవేశించి మంచంపై ఒరిగెను.

విక్రం వూరిలో నున్నప్పుడు తల్లి తనయునికి కావలసిన వంటలన్ని చేయించి పెట్టును. చాకలి వాడు రోజు బట్టలు ఉతుకును. మంగలి సాయంకాలం పక్క బట్టలు వేసి పోవును. ప్రొద్దున చాలా సేపటి వరకు నిద్రించును. పిమ్మట లేచి టీ త్రాగి, ఆనాటి వార్తా పత్రిక చదువును. పిమ్మట తమ భూములవైపు సిద్దడు అను పాలేరుతో బయలు దేరును. విక్రంకు తన పశువుల గురించి యేమియు తెలియదు. విక్రం తండ్రికి వాటిపై కుమారునికి ఆపేక్ష లేదని బెంగ కూడా లేదు. యెందుకంటే విక్రం ఆ పల్లెటూరి జీవనంలో నుండి వెడలి పట్టణ జీవితం అలవాటు పడాలని ఆయన కాంక్ష . తన కొడుకు ప్లీడరు వృత్తిలో ప్రవేశించి పట్టణంలోనే practice చేయాలని అతని యిష్టం. విక్రంకు కూడా pleader వృత్తి అంటే యిష్టం. కాని తాను pleader అయ్యేవరకు పరిస్థితులు యెలావుంటాయో తెలియదు. అందువల్ల యిప్పుడు అతడు యేది నిర్ణయించలేదు. యింకా సమయము వున్నందున దాని విషయమై అంత సీరియస్‌గా ఆలోచించడు.

వూరి నిర్మల వాతారణములో (ఆ రెండు నెలలు) సెలవులు అట్టే గడచిపోయినవి. యిక బడికి వెళ్లుటకు విక్రం సిద్ధం అయినాడు. తల్లి బట్టలు యిస్త్రీచేయించి పెట్టెలో సదిరి, ప్రత్యేకంగా చేసిన తినుబండారాలు ఒక బుట్టలో పెట్టించి దానిని మంచిగా తీసుకవెళ్లడానికి సిద్ధం చేసి పెట్టింది. పాలేరు రెండు మూగలు కట్టిన యెడ్లను కచ్చడం బండికై సిద్ధంగా నుంచెను. విక్రం తిని, ప్రయాణానికి అంటె ఒకమైలు

దూరంలో నున్న రోడ్డు వద్దకు బస్సుకై కచ్చడం బండీలో ప్రయాణమాయెను. పాలేరు, యెద్దులను వాటి యెదపై హై హై అంటూ బండిని నడుపుచుండెను. ధర్మారావు, శ్రీలత తనయునికి వీడ్కోలు చెప్పి లోనికి వెళ్లిరి. విక్రంకు ఆ మైలు ప్రయాణము చేయుటకు అరగంట పట్టెను. ఇంకా బస్సు వచ్చుటకు 20 నిముషాలు ఉండెను. అందుకై నీడలో కుర్చీపై కూర్చుండెను. యీ bus stand వద్ద ఒక చిన్న హోటలు ఒక కమ్మల గుడిసెలో పెట్టుకొని బస్సులో దిగే ప్రయాణీకులకు మరి లారి డ్రైవర్లకు, మరి వేరే custmers కు భోజనము, ఫలహారము, టీ supply చేయుచుండెను ఓ నారాయణ అనునతడు. ఈయన విక్రం వూరి వాడైనందువలన విక్రంకు కుర్చీ వేసి టీ త్రాగండి అయ్యా అని విక్రంను సంబోధించెను. దానికి విక్రం లేదు నారాయణ నేను యిప్పుడే అన్నీ ముగించుకున్నాను అన్నాడు. నారాయణ, సరే దొరగారు, అని తెచ్చిన టీని తీసుకొనిపోయెను. బస్సురాగానే అతను మరి యిద్దరు ముగ్గురు passengers చేతులతో సైగ చేయగానే బస్సు ఆగినది. విక్రం మరి యీ యిద్దరు ముగ్గురు బస్సులో ఎక్కగానే కండక్టర్ రైట్ రైట్ అంటూ గంటమోగించెను. డ్రైవరు బస్సును కదల్చెను. ఒక గంటలో విక్రం హైద్రాబాదు చేరుకున్నాడు. ఆనాడు రిక్షాలు, ఆటోలు గురించి యెవరూ కలలోనైనా వూహించలేదు. అప్పుడు బస్సునుండి తమ యిండ్లకు యీ భాగ్యనగరములో చేరుకోవాలంటే గుర్రపు బండ్లు. వీటిని జట్కాలని పిలుచుచుండిరి ఆనాడు. విక్రం దిగగానే ఒక కూలీని పిలిచి ఒక జట్కావానితో కిరాయ మాటాడుకొని లింగంపల్లికి పద అనెను. యీ జట్కావాడు లింగంపల్లిలో నున్న తన రూంకు తీసుక వెళ్లెను. తన పెట్టెను తను మోసుకొనగా జట్కా అతను తిను బండారాలను బుట్టను తీసుకొని విక్రం వెంట నడచి యింట్లో పెట్టి తన కిరాయిని తీసుకొని వెళ్లిపోయెను. యింకా ఆనంద్ వాళ్ల అమ్మమ్మ వారు వూరి నుండి రాలేదు. ఆనంద్ రూంలో ఒంటరిగా కూర్చుండి యేదో పుస్తకం చదువుచుండెను. ఆనంద్ ఎప్పుడు వస్తాడా అని రెండు గంటల వరకు యెదురు చూచెను. యింకా రానందున సరే అని ఒక ఫర్లాంగు దూరంలో నున్న శ్రీధర్ అను మరో విద్యార్థి వద్దకు వెళ్లెను. వారు కూడ ఆనాడు ఉదయమే తమ వూరినుండి వచ్చినారు. యిద్దరు కలసి వారు వూళ్లలో యేమి చేసినారు. యే విధంగా enjoy చేసినారు, మొదలగు విషయాలు మాటాడుకొనిరి. రెండు గంటలు యిట్లు మాటాడుకున్న పిమ్మట విక్రం సరే వస్తానని శ్రీధర్‌తో సెలువు తీసుకొని బయలు దేరుతుండగా శ్రీధర్ విక్రంను సంబోధించి ఆనంద్ రాత్రికి రాకపోతే ఒక్కడివే యెందుకుంటావు, మాయింటికి వచ్చేయ్ ఆనంద్ వచ్చేవరకు అని చెప్పెను. సరే అని విక్రం యింటికి వెడలి పోయెను. యింటికి రాగానే ఆనంద్ మరి వాళ్ల అమ్మమ్మ కూడా వూరినుండి వచ్చి యుండిరి. ఆయన అమ్మమ్మ వూరినుంచి తెచ్చిన వస్తువులనన్ని సదురుచుండెను. ఆనంద్ ఆమెకు యీ సదురుడులో తోడ్పడుచుండెను. విక్రం రాగానే నాయన ఆనంద్! నేను ఈ పనిని చూచుకుంటాను నీవు విక్రంతో మాట్లాడు వెళ్లు అని ఆనంద్‌ను పంపించెను. యిద్దరు స్నేహితులు తాము వూళ్లో చేసిన పనులన్నిటి విషయములు మాట్లాడుకొనిరి. ఇంతలో ఆనంద్ అమ్మమ్మ వంట చేసి యిద్దరికి

వడ్డించెను. భోంచేసిన పిదప విక్రం ఒక పుస్తకం తెరచి మంచంపైన వొరిగి చదువుచు నిద్రపోయెను. మరునాడు స్కూలు, పొద్దున్నే లేచి కాలకృత్యాలు తీర్చుకొని టీ త్రాగి పుస్తకాలు సదురుకొని ఆనంద్ విక్రం బడికి వెడలిరి. రోజూకు మాదిరి యిద్దరూ తక్కిన schoolmates తో నడచి స్కూల్ చేరిరి. స్కూల్ చేరగానే చాలామంది విద్యార్థులు బయట నిలబడి యుండిరి. కొందరు "లేకె రహింగె పాకిస్తాన్" అని నినాదాలు చేయుచుండిరి. అప్పుడు సర్కారి స్కూలో ముస్లిం విద్యార్థుల సంఖ్య యెక్కువ. private schools లో హిందువుల సంఖ్య యెక్కువ. హైదారాబాదులో చాలా కొద్ది ప్రయివేటు స్కూళ్లు. వీటిని వేళ్లపై లెక్కించవచ్చు. మేము చదివే స్కూల్ సర్కారు పాఠశాల కాబట్టి ముస్లిం విద్యార్థులు ఆడింది ఆట పాడింది పాట. విక్రం, ఆనంద్ యేమి చెయవలెనో తోచక కొంచెసేపు ఆ గుంపులోనే నిలబడి పిమ్మట లోనికి వెళ్లిరి. యివ్వాళ్ల హర్తాల్ యెవ్వరూ క్లాసుకు వెళ్లకూడదని కొంతమంది విద్యార్థులు క్లాసులో కూర్చున్న కొంతమంది విద్యార్థులను హెచ్చరించుచుండిరి. విక్రం ఆనంద్‌తో "మనము క్లాసుకు వెళ్లలేము అందువలన యింటికి వెడదాం పద" అని అనియెను. ఆనంద్ కొంచెము సంకోచంతో కొద్ది సేపటికి classes start అయితే యెట్లా అని విక్రంతో అనెను. దానికి జవాబుగా విక్రం "ఒకనాడు క్లాసు పోతే యేమి మునిగిపోదు. ఈ పరిస్థితిలో యింటికి పోవుట క్షేమమనె"ను. యిద్దరు వచ్చిన త్రోవకు మరలిరి. యింటికి పోగానే ఆనంద్ అమ్మమ్మ యేమి నాయనా ఇంత తొందరగ వచ్చేసినారేమిటి అని ఆనంద్‌నడిగెను. యివ్వాళ్ల హర్తాల్ అమ్మమ్మ అందుకే వచ్చేసినాము అని ఆనంద్ చెప్పెను. అలాగా నాయనా అని అమ్మమ్మ తన పనిలో నిమగ్నురాలాయెను.

పరీక్షలు ఇక మూడు నెలలు. యిది ఫిబ్రవరి నెల చలి అంతగా లేదు. యెండా కాలం వస్తుందన్నట్టుగా కొంచెం యెండల సందడి పెరుగుతున్నట్లుగా నుండెను. విక్రం ఆనంద్ పరీక్షలకు చదువుదామని ఆనాడు నిర్ణయించిరి. సాయంకాలం యిద్దరు కూర్చొని యిదివరకు చదివిన లెక్కలను మళ్లీ ఒకసారి solve చేయుచుండిరి. పిమ్మట ఇంగ్లీషు grammar చదివిరి. యీ విధంగా యిద్దరు combined study మొదలు పెట్టిరి. ఒకసారి అన్ని subjects revise చేసిన పిమ్మట యిద్దరూ కలిసి సినిమాకు వెళ్లిరి. ఆనాటి సినిమాలు ఈనాటి సినిమాల వలె కాకుండా వేరుగా ఉండేవి. యీ సినిమాలు దేశభక్తిని గురించైన లేక సాంఘిక దురాచారాలను గురించియైన లేదా ఆనాటి పల్లెటూరి వారికి యిష్టమైన పుస్తకాలనుండి తీసుకున్న కథలనైన సినిమారూపంగా తీసేవారు. ఆనాడు ప్రఖ్యాతి కెక్కిన తెలుగు సినిమాలలో మాలపిల్ల, వందేమాతరం, గృహలక్ష్మి, ధర్మపత్ని, బాలనాగమ్మ మొదలగు చిత్రాలు ఆనాటి జనుల మన్ననలు పొందిన సినిమాలు. ఈనాటి పాటలవలె యెగురుడు దుముకులు లేకుండ పాటలు శాస్త్రీయ పరంగా నుండేటివి. vulgarism కు అసలు తావే లేకుండెను. విక్రం ఆనంద్ యిటువంటిది యేదో సినిమా చూసి 10 గంటలకు ఇల్లు చేరుకున్నారు. పిమ్మట కొంతసేపు యేదో general పుస్తకాలు చదివి నిద్రించినారు. తెల్లవారు ఝామున యథాప్రకారంగ కాలకృత్యాలు తీర్చుకొని బడికి పోయినారు. యీనాడు బడిలో యే హర్తాలు లేదు. కొంతమంది ముస్లిం

విద్యార్థులు నిన్నటి హర్తాల్ యెంత ఘనంగా జరిగిందో మాట్లాడుకొవడం తప్ప తక్కిన విద్యార్థులు హిందువులు ముస్లింలు తమ పాఠాలలో నిమగ్నులై పోయిరి. ఒక క్లాసు తరువాత యింకొక క్లాసు యీ విధంగా చూస్తుండగానే దినము గడచి, పిమ్మట వారాలు గడచి పోయినవి. ఇక ఏప్రిల్ మాసము రాగానె పరీక్షలు మొదలాయెను. విక్రం అనంద్ చరుకైన కుర్రవాళ్లేకాకుండ పట్టుదలతో చదివినారు. పరీక్షలు బాగా వ్రాసినారు. యిక ఫలితాలు భగవంతునికి వదిలి వేసవి సెలవులకు వారి వారి వూళ్లకు వెళ్లినారు.

వీరు వ్రాసిన పరీక్షలు 8వ తరగితికి సంబంధించినవి. అనాడు ప్రతి తరగతి final పరీక్ష ఉండేది. అది పాసైతేనే పై తరగతి పంపేవారు. చాలా మంది విద్యార్థులు యీ పరీక్షలలో తప్పి, అదే తరగతిలో మళ్లీ చదివేవారు. automatic promotion అనే వదంతే లేదు. అనాడు పరీక్ష పాసయ్యే అంత వరకు పై తరగతికి వెళ్లే ప్రసక్తి లేదు. విద్యార్థులు అనాడు తమ టీచర్లను చాలా గౌరవించేవారు. కొంతమంది మంచి టీచర్ల పేర్లు వారు చదివించే విధానాలు యిప్పటికి చాలా మందికి బహూశః జ్ఞాపకం వుండి యుండును.

కాలచక్రం యెవరు యేమి చేసిన ఆగదు. అందుకే చూస్తుండగానే ఏప్రిల్ మరి మే నెలలు గడచి పోయినవి. జూన్‌లో మళ్లీ పాఠశాలలు తెరచినారు. విక్రం మరి అనంద్ పాఠశాలకు సంసిద్ధులౌతున్నారు. వీళ్ల పరీక్ష ఫలితాలు తెలిసినవి. పాస్ కామన్న భయమే యెవరికీ లేకుండెను. కాని పూర్తి క్లాస్‌లో యే ర్యాంకు వస్తుందన్న సమస్య. అదృష్టవశాత్తు విక్రం తన section లో Ist rank, అనంద్‌కు తన section లో Ist rank. యిందులో ఆశ్చర్యం యెవరికీ లేదు. యెందుకంటే వీరిద్దరికి చదువు తప్పితే అప్పుడప్పుడు కొన్ని సినిమాలు తప్ప యింకా యేముంది sports లో అసలే పాల్గొనరు. వేరే activities లో ఎప్పుడూ పాల్గొనరు. వీరికి చదువు తప్ప జీవితంలో యింక యే interest ఉందని? యింత చదివితె Ist rank కాక మరియేమొస్తుంది. ఇప్పుడు వీరిద్దరు 9వ తరగతిలో అంటే Vth form లో నన్నమాట. పట్నం వచ్చిన కొద్ది రోజుల పిమ్మట విక్రం అనంద్‌కు స్నేహం కలిగింది. అనంద్ స్నేహంతో విక్రం కూడా బాగా చదివినాడు. కాని ముందు వీరు వీడుకోలిచ్చుకునే సమయం వచ్చింది. ఎందుకంటే విక్రం తమ్ముడు క్రిష్ణమోహన్ కూడా విక్రంతో హైదరాబాదులో చదువాలని ధర్మారావు నిశ్చయించుకున్నారు. లేనిచో school leaving certificate సమస్య రాగలదని అయన తెలుసుకున్నారు. కాబట్టి విక్రంకు వేరే ఒక ఇల్లు చూడమని తమ్ముడు తను ఒక వంటమనిషితో సహా వేరే యింట్లో వుంటే క్రిష్ణమోహన్ కూడా విక్రం వలె చదువుతాడని అతనికి తోచింది. అందుకే విక్రం May లో ఒక యింటికై వెతకి వెతకి విసుగెత్తి తుదకు ధర్మారావు స్నేహితుని యిల్లును అద్దెకు తీసుకున్నాడు. ఈ యిల్లు అనంద్ యింటికి కొంచెం దూరం. యిల్లు కొత్తది. 2 bedrooms, kitchen మరియు sitting తో సహా బాగుంది. వంటమనిషి ధర్మారావు యింట్లో వంట చేసిన మనిషే కాబట్టి ధర్మారావుకు శ్రీలతకు పిల్లల వంట విషయమై యే చింతలేదు. యింటిలోనికి కావలసిన వస్తువులన్నంటిని ధర్మారావు శ్రీలత స్వయంగా వచ్చి

arrange చేసినారు. పిమ్మట రెండు రోజులు విక్రం క్రిష్ణమోహన్‌లతో గడిపి వెళ్లినారు. విక్రం యిప్పుడు వేరే స్కూల్‌కు మారినాడు. క్రిష్ణమోహన్‌కు కూడా యిందులోనే admission తీసుకున్నాడు. ఈ school యింటికి ఒక మైలు దూరంలో వుంటుంది. యిద్దరూ ప్రొద్దుననే breakfast చేసి బడికి పోదురు. ఇంకా యీ స్కూల్‌లో విక్రంకు యెవరూ స్నేహితులు దొరకలేదు. యీ స్కూల్ యీ పట్టణంలో కొంచెం పేరు పొందిన స్కూలే. క్రిష్ణమోహన్ చాలా సరదాగా స్కూలుకు వెడతాడు. చాలా మంచిగా చదువుతాడు. కొద్దిరోజులలో స్నేహితులు యీతని వద్దకి రావడము అతడు వాళ్ల దగ్గరికి పోవడము అరంభమైనది. విక్రం క్రిష్ణమోహన్ బాధ్యతలను గ్రహించినాడు. కాని విక్రంకు క్రిష్ణమోహన్ విషయమై యేమి బాధలేదు. వానికి వాడె విక్రం చెప్పకముందె బాధ్యతాయుతంగ మెలగుట నేర్చుకున్నాడు. విక్రం యిప్పుడు 9వ తరగతి విద్యార్థి. యింకా 10వ తరగతి పూర్తి అయితే కాలేజికి వెళ్లుతాడు. విక్రం పుస్తకాలన్నీ కొని క్లాసులు attend చేస్తున్నాడు. కాని చదవడంలేదు. భారతదేశం చదువు విధానము అంగ్లేయులు తమ East India కంపెనీకి గుమాస్తాలు తయారు చేయుటకు చేసిన విద్యా విధానము. యిచ్చట విద్యార్థులు సంవత్సరమంతా యేదేదో చేసి పరీక్ష రెండు మూడు నెలలు ఉందనగానె చదువు మొదలు పెడతారు. అంతేకాకుండా question & answers పుస్తకాలు కూడా యీ పరీక్షలలో నెగ్గుటకు ప్రచురిస్తారు. ఎక్కువ విద్యార్థులు యీ Q & A పుస్తకాలు చదివే పాసవుతారు. కనీసం అప్పుడు అంతా అయినా చదివేవారు. యిప్పుడు కళాశాలలో పిల్లలు అసలే చదవకుండా Exams papers తెచ్చి వాటికి జవాబు కూడా యెవరితోనో వ్రాయించి వాటిని Exams లో ఇచ్చి Ist class లో పాసవుతారట. యెంత మార్పు. యీ డిగ్రీలకు మరి చదువుకు యేమాత్రము పొత్తు లేదట. అందుకే ఒక degree వున్నవాడు విద్యావంతుడని అతనికి చదువు మరి పుస్తక పరిజ్ఞానము ఉన్నదనుకొనుట పొరపాటు అట. కాని ఆనాడు అంటె 1946 యీ అవినీతి యింకను రాలేదు. విద్యా విధానములో అసలే లేదు. విద్యార్థులు చదివితేనే పాసవుతారు. యెందుకంటె అప్పుడు మనకింకా స్వరాజ్యము రాలేదు. దేశము బ్రిటిష్‌వారి నుండి స్వతంత్రసాధనకై పోరాడు దినాలవి. ఆ యుగానికి ఈ యుగానికి పోల్చి చూస్తే నైతిక విలువల్లో యెంత మార్పు కల్గిందో ఊహించలేము. అప్పుడు భక్తి లేకున్న భయమైన ఉండెను. యిప్పుడు భయమైతే అసలే లేదు. భక్తికూడా లేదాయే. ప్రతివాడు ఒక పౌరునిగా తన బాధ్యతను నిర్వర్తించుట లేదు. కాని మాటి మాటికి తన rights కొరకు మాత్రము అందోళన చేస్తూనే ఉంటాడు. politicians మరియు political parties యేవియు పౌరులకు తమ బాధ్యతల గురించి యేమీ చెప్పరు. కాని మేము power లోకి వస్తే మీకు యివి ఇస్తాము అవి ఇస్తామని వాగ్దానాలు చేస్తుంటారు. power కు రాగానే వాళ్లకొరకు వాళ్ల బంధువులకొరకు చేసుకుంటారు. యిక revenue అంతా వాళ్లను గద్దె యెక్కించిన ఓటేదార్లకు పంచుతుంటారు. యీనాడు వున్న అన్ని Problems కు కారణము జనాభా పెరుగుదలె. దానిని అరికట్టితె కొంత వరకైన కొన్ని probems solve చేయవచ్చు. కాని యెవరికీ జనాభాను అదుపులో ఉంచే ధైర్యసాహసాలు లేవు. అప్పటికి యిప్పటికి జనాభా మూడింతలు పెరిగింది. కాని యెవరు

చూసినా యేవేవో theories చెబుతారు. కాని దీనికి పరిష్కారాన్ని యెవరూ వెతుకరు. మనదేశం ప్రపంచంలో ప్రత్యేకంగ ఆసియాలోనున్న అన్ని దేశాలకంటె, బీదదియు, చదువులేని వారు అధికంగ వున్నదేశం. దరిద్ర నారాయణులతో నిండుకొని యున్నది. అన్నిటికన్న మురికి దేశము. అయినా మనమంత యేమి చేస్తున్నాము? యేమి లేదు. మన నాయకులు రోజూ యేదో inaugurate చేస్తూ పనికిమాలిన ఉపన్యాసాలిస్తూ వాళ్లు పెట్టుకున్న దూరదర్శన్‌లో ప్రేక్షకులను బోరుకొట్టిస్తారు కాని యేమైన దేశానికి చేస్తారా?

విక్రం రోజూ తమ్మునితో స్కూల్‌కు వెళుతున్నాడు. యిప్పుడే కొంతమంది మిత్రులతో పరిచయం కలిగింది. సాయంకాలం స్కూల్ నుండి రాగానే భోంచేసి మిత్రులతో కలసి వెళతాడు. ఆనాడు కూడా అలాగే ఒక స్నేహితుని వద్దకి వెళ్లినాడు. అతడూ విక్రం ఒక స్కూల్‌లోనే చదువుతున్నారు. ఒక section లోనే వున్నారు. ఆనంద్ యిప్పుడు అంతగా విక్రంతో కలవడం లేదు. యెందుకంటే స్కూల్స్ వేరు, యిళ్లు వేరు. యెప్పుడో ఒకసారి కలుసుకుంటారు. అయినా విక్రం ఆనంద్‌ను మరచి పోలేదు. ఆ కొత్త స్నేహితుడు విక్రం యింటికి, విక్రం యీ కొత్త స్నేహితుని యింటికి తరచుగా అంటె almost ప్రతిరోజూ కలుస్తారు. యిప్పుడు విక్రం సాయంత్రం కాగానే భోంచేసి యీ కొత్త స్నేహితుని యింటికి వెళ్లడమో లేదా ఆ స్నేహితుడు విక్రం యింటికి రావడమో. యీ కొత్త స్నేహితుని పేరు వెంకటకృష్ణారావు. యీ వెంకటకృష్ణారావు తల్లిదండ్రులు కూడా వూళ్లోనే వుంటారు. ఆస్తిమంతులు. యితనికి కూడా క్రిష్ణమోహన్ వయసుగల ఒక తమ్ముడున్నాడు. అందులకేనేమో వెంకటక్రిష్ణారావుకు క్రిష్ణమోహనంటే చాలా ప్రేమాభిమానాలు. ఇది 1946 దేశములో స్వాతంత్ర్యవాంఛ మరి స్వాతంత్ర్య ఉద్యమము జోరుగా సాగుతున్న దినాలు. రోజు రోజుకు విచ్చల విడిగా చెలరేగిపోతున్న రజాకార్ల దౌర్జన్యాలు, స్త్రీల మానభంగాలు హత్యలు యీ హైదాబాదు రాష్ట్రంలో. అట్టి తరుణంలో విద్యార్థులు స్వాతంత్ర్య సమరంలో అడుగుముందుకు వేయాలని ఉద్బోధిస్తున్న కొందరు విద్యార్థినాయకులు. యిందులో కొందరు విద్యార్థి నాయకులు చాలా స్వార్థపరులు. అందరికి చెప్పేట వకటి తాము చేసేది మరి ఒకటి. యీ విధంగా వారానికో రెండు వారలకో యిదివరకు తురక విద్యార్థులు processions తీసినట్టే యిప్పుడు అన్ని కళాశాలల విద్యార్థులు నెహ్రూ, గాంధి యిచ్చిన పిలుపును పురస్కరించుకొని ఊరేగింపులు చేసేవారు. యీ వుద్యమంలో అందరు విద్యార్థులున్న కొద్దిమంది తురక విద్యార్థులు పాల్గొనేవారు. యెక్కువ తురక విద్యార్థులు పాకిస్తాను కొరకె నినాదాలు చేసేవారు. అంతేకాదు యీ procession ను వ్యతిరేకించేవారు, రజాకార్లు, యీ procession ను యెప్పుడూ ఆపినట్టు మాత్రం నాకు గుర్తులేదు. అంతేకాకుండ విద్యార్థులకు చాలవరకు స్వతంత్రము సిటీలో మాత్రము వుండెననియే చెప్పాలి. కాని సాధారణంగా, ప్రత్యేకంగా బీద హిందు ప్రజల మీద అత్యాచారాలు యీ చిన్న తెగకు చెందిన ముస్లింలు మాత్రము, జరిపినారని చెప్పక తప్పదు. వెంకట క్రిష్ణారావు యిటువంటి ఆందోళనలో ప్రముఖపాత్ర వహించేవాడు. పోలీసులు యీ procession ను disperse కావాలే అని ఆజ్ఞ యిచ్చినప్పుడు యితడు

వారిని ధిక్కరించుటకు అందరి విద్యార్థులను పురికొల్పేవాడు. పోలీసు అధికార్లు మొదలు teargas shells ను విడిచేది. పిమ్మట లాఠి charge చేసేది. అంతకు యింకను చెదరకపోతే firing కూడా చేసేది. విక్రం మాత్రం వెంకటక్రిష్ణారావుతో యీ procession లో పాల్గొనేవాడు. కాని హింసను మాత్రము సహించక పోయేవాడు. firing అయినప్పుడు యితడు కూడా procession లో ఉండుటయే కాకుండా అ తారురోడ్లపైన పడుకునేవాడు. నిజంగా యీ firing లో కొంతమంది మరణించినారు కూడా. వారి ఊర్లుకాని పేర్లు కాని తెలియవు. ప్రత్యేకంగా హైదరాబాదు నగరములో అంతగా విద్యార్థులు చావలేదు. కాని జిల్లాలో మాత్రము చాలా మంది High School విద్యార్థులు మాత్రము చచ్చినారని వినేది. అప్పుడు press కు ఈనాడున్నంత స్వాతంత్ర్యము లేకుండెను. హైదరాబాదు నగరములో అన్నీ ఉర్దు పత్రికలే. ఇందులో చాలా వరకు స్వతంత్ర హైదరాబాదునే బలపరిచేవి. తురక విద్యార్థులు, తురక ప్రజలు procession లో "ఆజాద్ హైదరాబాదు జిందాబాద్" అని నినాదాలు చేస్తూ రోడ్లవెంబడి పోయేది. హైదరాబాదులో 100కి 90 మంది కన్న యెక్కువ హిందువులున్నా యేలిక తురక కాబట్టి ఈరాష్ట్రం Independent గానే ఉండిపోవాలి. భారతదేశముతో కలువ కూడదన్న పట్టుదల రజాకార్లు కాసింరజ్వి మరి నిజాము వేరేవారు నిశ్చితులై ఉండిరి. ఒకనాడు గాంధీజీ పిలుపును పురస్కరించుకొని మొత్తము తెలంగాణలోని విద్యార్థులు classes ను బహిష్కరించి procession లో వెళ్లినారు. హైదరాబాదు సిటీలో మాత్రము old city నుండి city college నుండి మరి వేరే High Schools నుంచి విద్యార్థులు నయాపూల్ మీదుగా వెళ్లి నిజాం కాలేజిలో బహిరంగ సభ జరిపి పిమ్మట desperse అయ్యే plan లో ఉండిరి. అందరు విద్యార్థులూ నినాదాలు చేసుకుంటు నిజాం కాలేజిలో ప్రవేశించినారు. నిజాం కాలేజ్‌కు అప్పుడు ఒక ప్రత్యేకత వుండెను. హైదరాబాదు పట్టణములో అప్పుడు రెండే రెండు Intermediate colleges. నిజాం కాలేజ్ ఒకటే degree college అంతేకాదు, సిటీ కాలేజ్ old city లో నుండెను. chaderghat college, new city లో నుండెను. ఇక ఉస్మానియా విశ్వవిద్యాలయము సిటీ అవల సుమారు 6 మైళ్ల దూరములో నుండెను. విద్యార్థులు చాలామట్టుకు యీ హాస్టళ్లలోనే ఉండేవారు. ఇచ్చట Intermediate నుండి Ph.D. వరకు చదువుటకు సదుపాయాలుండేటివి. యిక old city లో మెడికల్ కాలేజ్ మాత్రము Afjalgunj Hospital కు affiliated గా నుండెను. ఇవే మొత్తము హైదరాబాదులో నున్న colleges. ఒక కాలేజ్ మాత్రము intermediate వరకు వోరుగల్లులో నుండెను. మొత్తం మెడికల్ కాలేజ్‌లను కలుపుకొని హైదరాబాదు రాష్ట్రంలో నాలుగు కాలేజస్ మరి ఒక విశ్వవిద్యాలయము. అయినా college లో సీటు ప్రతి 2nd class high school పాసైన విద్యార్థికి దొరికేది. చాలామంది 3rd class లో పాసైన వారికి కూడా దొరికేది.. medical కాలేజ్‌లో మాత్రము 1950 వరకు 2nd class లో ఉత్తీర్ణులైన ప్రతి intermediate విద్యార్థికి సీటు దొరికేది. అంటే average గా 45% వస్తే సీటు గ్యారంటి. మొత్తము medical college లో Ist year

admission 50 మంది విద్యార్థులకు ఇచ్చేదన్నమాట. ఇప్పటికీ అప్పటికి యెంత భేదం. తలచుకుంటుంటే యిది వాస్తవమా లేక కల కంటున్నామా అనిపిస్తుంది.

విక్రం పట్టణ నివాసియై కొన్ని సంవత్సరాలైనది. అంటె యిది అతని నాలుగవ సంవత్సరం. యిప్పుడు అమ్మను నాన్నను అంతగా miss చేయడం లేదు. హాలిడేస్ రాగానె వూరికి పోవాలని అంత కుతూహలము లేదు. పట్టణంలో చాలా మంది స్నేహితులు. అందులో ఆనంద్ మరియు వెంకటక్రిష్ణారావు చాలా close friends. మరి విక్రం తమ్ముడు క్రిష్ణమోహన్‌కు మాత్రము సెలవులు రాగానే ఊరికి ప్రయాణం. అతని వయస్సు యింకా తల్లి వడిలో పెరిగే వయస్సే. కాని విక్రం మాత్రం యిప్పుడు teen ager కాబట్టి అతని దృక్పథము మారినది. నూనూగు యవ్వనము అతనిలో అంకురిస్తుంది. కాని యింక నవ యవ్వనుడు కాలేదు. వెంకటకృష్ణారావు ఆనంద్‌ది ఒకే వయస్సు కాని ఆనంద్ యిప్పుడు విక్రంకు దూరంగా వుంటున్నాడు. వెంకటక్రిష్ణారావు మాత్రము విక్రంకు చాలా close అయినాడు. యీ closeness వలన విక్రం అంతగా చదువుటలేదు. వెంకటక్రిష్ణారావుకు చదువులో అంతగా ఆసక్తి లేనట్టు తోచుచున్నది. విక్రం పాఠ్యపుస్తకాలు చదువకున్న చిన్నప్పటి నుండి అతనికి మహాపురుషుల జీవిత గాథలను చదువుటకు చాలా ఆసక్తి. అందుకనే అతడు గాంధీగారి జీవిత చరిత్ర, యేబ్ లింకన్ జీవిత చరిత్ర, మార్క్స్ జీవిత చరిత్ర మున్నగు యెందరి జీవిత చరిత్రలో చదివినాడు. అందువల్ల వాటి ప్రభావము విక్రంపై పడక తప్పలేదు. ప్రొద్దున లేవగానే బడికి వెళ్లుట పిమ్మట యింటికి వచ్చుట చదువుట సాయంకాలం వెంకటక్రిష్ణారావు విక్రం షాపింగ్‌కో లేక అచ్చటికి దగ్గరగా నున్న శ్రీనివాస అయ్యరు హోటలుకు పోయి యేమైన తిని యింత టీ లేదా కాఫీ త్రాగి యింటికి పోయి కొంతసేపు రాజకీయాలు చర్చించి, భోంచేసి పడుకొనుట విక్రం వెంకటక్రిష్ణారావుకు అలవాటుగా అయిపోయింది. యీ విధంగా యీ యిద్దరు వారాలు మరి నెలలు routine గా గడిపి వచ్చే పరీక్షలకై చదువుట గూర్చి నిశ్చయించినారు. అనుకున్నట్టు పరీక్షలు రెండే రెండు నెలలు కాబట్టి అప్పుడప్పుడు రాత్రి ప్రొద్దు పోయే వరకు చదువుచు కూర్చుండేవారు. పరీక్షలు దగ్గర పడుతుంటే అన్ని activities కు స్వస్తి చెప్పినారు కాని visit to శ్రీనివాస అయ్యరు హోటలకు మాత్రము రోజూ సాయంకాలము తప్పని సరిగా కొనసాగుచుండెను. యేదేని కారణాలవల్ల విక్రం లేదా వెంకటక్రిష్ణుడు ఒకడే సాయంకాలం వెళ్లినాడనుకొ, యీ అయ్యర్ మీ స్నేహితుడు రాలేదే అని అడిగేవాడు.

పరీక్షలకు యిద్దరు చదువుతునే వున్నారు. విక్రం 10 గంటల వరకు చదివి పిమ్మట నిద్రించేవాడు. కాని వెంకటక్రిష్ణుడు 10 గంటలకు చదువు మొదలు పెట్టి చాలా రాత్రి వరకు చదివెడివాడు. అందుకే combined study నామమాత్రానికే అయిపోయినది. వెంకటక్రిష్ణుడు చురుకైన పిల్లవాడె కాని రాజకీయాలలో చాలా సంబంధం పెంచుకున్నాడు. విక్రం మాత్రం 10 గంటల వరకు చదివిన చాలా concentration తో చదివేవాడు. యిక క్రిష్ణమోహన్‌కూడా 10 గంటలకు మొదలే నిద్రపోయేవాడు. చూస్తుండగానే పరీక్షలు జరిగినవి. అందరూ ఉత్తీర్ణులైనారు. యిప్పుడు విక్రం వెంకటక్రిష్ణుడు 10వ తరగతిలో క్రిష్ణమోహన్ 3వ తరగతికి వచ్చినారు.

యిది 1947 సంవత్సరం. హైద్రాబాదులో రాజకీయ పరిస్థితులు క్లిష్ట పరిస్థితులు దాల్చినవి. రజాకార్ల దౌర్జన్యము పెరిగిపోయినది. నిజాం, పాశ్చాత్యులు ప్రత్యేకంగా ఇంగ్లీషు వారి సహాయంతో చాలా latest ఆయుధాలను చాటు చాటుగా కొని వాటిని నిలువ చేయుచుండెను. యీ ఆయుధాలను మున్ముందు తన పథకము అంటే స్వతంత్ర హైద్రాబాదు కాలేదు అంటే ఆయుధాలతోనైన దీనిని సాధించవలెనన్న plan తో ఈ అతినూతన ఆయుధాలను చాలా ప్రోగుచేసి పెట్టినాడు. రజాకార్లు పెద్దరాటు తేలిన సైనికులుకారు. ఇంకా చెప్పాలంటే వీళ్ల సైనిక శిక్ష యేమంత చెప్పకో తగ్గది కాదు. కానీ స్త్రీలను హింసించుటకు హిందువులను దండించుటకు పనికి వచ్చునవే. అయితే యీ రజాకార్లకు యేమంత మంచి ఆయుధాలను కూడా నిజాం యివ్వలేదు. కాబట్టి యీ రజాకార్లను ఒక fighting force లో చేర్చకూడదని చాలామంది భావించినారు. వీరి ఆయుధాలు డాలు కత్తులు మరి భర్‌మార్ తుపాకులు. అయినా యీ ఆయుధాలు హిందువులను భయపెట్టుటకు సరిపోయినవి. హిందువులు మాత్రము ఆయుధ పోరాటానికి తలపెట్టలేదు. ఇంకా గాంధీగారి సత్యాగ్రహమే శరణ్యముగా భావించిన వారు. అట్టి తరుణములో కొంతమంది ఆర్యసమాజీయులు హిందువులకు నాయకులుగా తయారై కొంతమేలు కూర్చినారు. వీరందరిలో అగ్రగణ్యుడు పండిత్ నరేందర్‌జీ. నరేందర్‌జీ మంచి orator. వీరు హిందువుల బహిరంగ సభలలో నిజామును మరి రజాకార్లను వారి నాయకులను దుయ్య బట్టెడువారు. రజాకార్లు పల్లెటూర్లలో హిందువులను బాధించేరేమో కాని సిటీలో అంత దౌర్జన్యాలు చేయలేదు. యెక్కువగా పట్టణములో దౌర్జన్యాలు చేసిన వారు అరబ్బులు మరి కొంతమంది గుండాలగు చిన్న జాతికి చెందిన తురకలు. ఇంత రాజకీయ దురంతరాలు జరిగినా స్కూళ్ల మాత్రము సాగుతునే ఉండెను. New city లో హిందువులకు భయము లేకుండెను కాని old city లో మాత్రము తురకల, ప్రత్యేకంగ రజాకార్ల భయము చాలా నుండెను. undoubtedly హిందువులు ఒక నరకయాతనతో బాధపడుచుండిరి.

పట్టణములో వుద్రిక్త పరిస్థితి అప్పుడప్పుడే కలుగుతు వుండెను. Rumers అప్పుడు రెండు పక్షాల వారికి హాని కలిగించేవి. ఒకనాడు తురకులు newcity కి వచ్చి హిందువులను హతమార్చుటకు ప్రయత్నాలు చేస్తున్నారన్న rumer ప్రబలిపోయింది. కొంతమంది, చిరకాలము పట్టణములో నివసిస్తున్న హిందువులు, చేజిక్కిన ఆయుధాలు, అంటే కత్తులు, వీలైనప్పుడు కొన్ని తుపాకులను యిండ్లలో సమకూర్చుకొని రాత్రి పూట గస్తీ చేయుచు self defence force గా వెలుబడెడివారు. మేమున్న ప్రాంతంలో కొంతమంది పల్లెటూళ్లలో నుండెడి శ్రీమంతులు పల్లెటూరికి వెళ్లిపోయెడి వారు. యెందుకంటే పల్లెటూళ్లలో పెత్తనము వీళ్లది కాబట్టి అచ్చట defence చాలా బాగా జరిపించవచ్చు అని వారి ఉహ. యిందులో చాలా వరకు వాస్తవికత నున్నదనియే చెప్పాలి. యెందుకంటే ఈనాటివలె ఆనాడు వూళ్లలో ఆయుధాలు ధరించిన criminals లేకుండిరి. ఆనాడు యిటువంటి machine guns మరి kashleric 56 rifles యెవరి వద్ద లభించవు. మహా అంటె 12 bore double barrel తుపాకులుంటే మహా గొప్ప. అటువంటివి ఈ వూరి పెద్దల వద్దనే

వుండేవి. సామాన్య ప్రజలకు యివి యెప్పుడు లభ్యం కాలేదు. ఆనాటి మహా ఆయుధము 303 rifles. అంతేగాని ఈనాటి వలె మారణ ఆయుధాలు ఆనాడు లేకుండెను. బాంబులు, మందు పాత్రలు, RDX మరి dynamite లు అప్పుడు వూహించరాని విషయాలు. అయితే ఓనాడు మేమున్న వాడలలో యీ రాత్రి తురకలు హఠాత్తుగా రాత్రిపూట హిందువులపైన హమ్లా చేయబోతున్న rumer విని శేఖర్ మా వూరికి సమీపములో నున్న ఒక వకీలుగారు వూరికి వెడలాలని తన పాత chevy car ను తయారు చేసి మాయింటికి ఆకారు driver ని మేము కూడా వారి వెంబడి city విడిచి పోవుట శ్రేయస్కరమని విక్రంని క్రిష్ణమోహన్‌ని ఆహ్వానించెను. వెంకట క్రిష్ణుడు కూడా విక్రంను వెళ్లుట మంచిదని సలహా యిచ్చెను. విక్రం క్రిష్ణమోహన్ ఒక పెట్టెలో యిద్దరి బట్టలు సర్దుకొని సరే మేము సిద్ధంగా నున్నామని వకీలుగారి driver తో చెప్పి పంపిరి. వకీలుగారు వాళ్ల కుటుంబముతో విక్రం యింటికి వచ్చి విక్రంను క్రిష్ణమోహన్ pick up చేసుకొని వూరివైపునకు బయలుదేరిరి. సిటీ నుండి వీరంతా 23 మైళ్ల దూరానికి పోగా సూర్యుడు అస్తమించి చీకటి పడెను. విక్రం కృష్ణమోహనుడు మరి వకీలు గారి family కారు వెనుక భాగంలో మరి వకీల్ గారు అతని కూతురు ముందు సీటులో driver ప్రక్కకు కూర్చొనియుండిరి. యీ రాత్రిలో హఠాత్తుగా కొంతమంది ప్రజలు వారికి నాయకుడుగా నున్న ఒక పొడగాటి మనిషి కట్టె లేపి 'ఠైరో" అని బూతు మాటలతో మా కారు నాపెను. ఆపినదే తడవు మా వకీలుగారు వైపు వచ్చి తలుపు తీసి వాడు దిగ్భ్రాంతుడయ్యి, అయ్యా వకీలుగారు మమ్ములను క్షమించాలె. యింతకు పూర్వమే కొంత మంది మైదావారు (అంటె ఇరాన్‌వారు ఆకాలములో మైదావారు అని తెలంగాణములో అనుచుండెడివారు వీరు రోడ్ల ప్రక్కలో కొంత దూరమందున్న పల్లెటూళ్లలో దొంగతనాలు చేయుచుండెడివారు. లేదా బలాత్కారంగ డబ్బు వసూలు చేసెడివారు) వచ్చి వూరిలో కొన్ని యిండ్లలో చేతికందినవి తీసుకొని పోయినారు. వారే మీరనుకొని ఆపినాము అన్నాడు. పిమ్మట ఆనాయకుని వెంబడి వున్న గుంపంతా కారును వీడి పక్కకు వెళ్లినారు. వకీలుగారు అమ్మ బ్రతికి బయట పడ్డాము. నేను రజాకార్లో మరి యే దుండగులు మన ప్రాణాలు తీయుటకు వచ్చినారని యెంత భయపడ్డానో తెలుసా! అన్నాడు.

అతని కూతురు అవును నాన్న, నేను కూడా అంతే అనుకున్నాను. విక్రం కూడా చాలా భయపడ్డాడు.

కృష్ణమోహన్ యింకా పసివాడే కదా! పాపం. యెంత భయపడ్డాడో అనుకున్నాడు విక్రం.

ఏది ఎటులైన అందరూ మళ్లీ ఊరికి ప్రయాణం సాగించినారు. అరగంటలో విక్రం వూరు వచ్చింది.

వకీలుగారు విక్రంను కృష్ణమోహనుని ధర్మారావుకు అప్పగించి మళ్లీ పరిస్థితులు చక్కబడగానే వెళ్లుతాను. అప్పుడు వీరని మళ్లీ పట్టణం తీసుకవెడతాను నాతో బాటు అని చెప్పి, ధర్మారావు టీకి ఆహ్వానించిన;

లేదు! మాయింట్లో గాభరాగా వుంటారు వెడతాను క్షమించండి, మీ ఆతిథ్యాన్ని మరలి వెడలేటప్పుడు తప్పకుండా స్వీకరిస్తాను అని చెప్పి, కారు ఎక్కేను.

విక్రం, ధర్మారావు వకీలు గారి కారు వరకు వెంట నడచిరి. కారు కదలగానే యిద్దరూ యింటిలోకి వెడలిరి.

వూరిలో వున్న రెండు రోజులు సిటీలో విక్రం వున్న వీధిలో యే అల్లర్లు జరిగినట్టు తెలియలేదు. అల్లర్లు జరిగితే విక్రం వూరికి తెలిసేది కాని, అటువంటిది జరిగినట్లు ఎవరూ తెల్పలేదు. కాబట్టి విక్రం మళ్లీ స్కూల్‌కు వెళ్లాలని ధర్మారావుతో అనెను. ధర్మారావుకూడా నిజమే! అనవసరంగా చదువు ఎందుకు చెడిపోవాలె అని అనుకొనెను.

తక్షణమే ఒక మనిషితో ఉత్తరం వ్రాసి విక్రంను తెచ్చిన లాయరుగారి వద్దకి పంపించెను. అయన ఉత్తరం చదువుకొని, రేపు వెళ్లాలని అనుకుంటున్నాను. విక్రంని, కృష్ణమోహన్‌ను సిద్ధంగా ఉండమనుము అని మనిషితో చెప్పి పంపెను.

అనుకున్న ప్రకారం లాయరుగారు తెల్లారి వచ్చి ధర్మారావు ఆతిథ్యాన్ని స్వీకరించి, భోజనాలు చేసి విక్రం కృష్ణమోహన్‌లతో పట్టణం చేరుకొనిరి. దీనినే బహుశః టీ కప్పులో తుఫాను అందురోయేమో.

ఈ తుఫానుతో ఇంటికి వెళ్లి, తలితండ్రులను చూచే అవకాశము కలిగింది. కాని కృష్ణమోహానుకు మాత్రము ఊరిలో కొంతకాలం ఉండాలని అనుకున్నాడు. కాని అన్నతో సహా తాను కూడా సిటీకి రాక తప్పలేదు.

ఇప్పుడు విక్రం 10వ క్లాసు విద్యార్థి. ఈనాటివలె అనాడు పల్లెటూళ్లలో చాలా చదువుకున్నవారులేరు, అది హైస్కూల్‌లో.

బహుశ! విక్రం పరమేశ్వర్లు ఇద్దరే ఆ ఊరినుండి హైస్కూల్ చదువుచున్నవారు. కాని టెక్నికల్‌గా విక్రం ఒక్కడే ఆ వూరివాడు.

పరమేశ్వరుడు పక్కవారి సుదర్శన్‌రావుగారి కుమారుడు.

విక్రం ఊరిలో తండ్రి చనిపోయినప్పటినుండి తల్లి మరి మేనమామతో వుంటున్నాడు. కాబట్టి విక్రం ఒక్కడే వారి ఊరి నుండి హైస్కూల్ గ్రాడ్యుయేట్ కాబోతున్నాడు, ఈ 10th పాసయితే.

వెంకటకృష్ణారావు ఈ రెండు రోజులు విక్రం కనిపించకపోవటం వలన చాలా miss చేసినాడు. యేదో తనకు తెలియకుండానే తననుండి వీడి పోయినట్టు భావించినాడు. విక్రం యింటికి ఈ రెండు రోజులు వచ్చి వంటమనిషిని అడిగి ఊరికి పోయినట్లు తెలుసుకొని ఎన్ని రోజులకు వస్తాడని మరల మరల ప్రశ్నించెను.

కాని, వంటమనిషి తనకేమీ తెలియదని చెప్పెను. మరునాడు విక్రం వచ్చిన సంగతి తెలిసి, విక్రం ఇంటికి వచ్చి హఠాత్తుగా ఊరికి వెళ్లినావు. ఊళ్లో అంతా క్షేమమేనా అని అడిగినాడు. ఇంతకూ హఠాత్తుగా ఊరికి ఎందుకు పోయినట్టు అని ప్రశ్నవేయగా.

విక్రం జరిగినదంతా పూస గుచ్చినట్లు వినిపించెను.

ఓ అలానా! ఇటువంటి rumers యీ హైద్రాబాదు స్వతంత్రంగా ఉండాలని

ఆకాంక్షించే వరకు వుంటాయి. పాత సిటీలో ఏమైనా జరగవచ్చు, కాని కొత్త సిటీలో ఇటువంటివి అసంభవమే కానీ, జాగ్రత్తగా మెలగుకొనుట మంచిదని వెంకటకృష్ణుడు విక్రంతో అనెను.

ఈ విధంగా కొంతసేపు మాట్లాడుకున్న పిమ్మట స్కూలులో నేను యేమి miss చేసినాను అని, స్కూల్‌లో జరిగినవన్ని తెలుసుకొనెను.

పిమ్మట యథాప్రకారంగా ఇద్దరు కలిసి తిరుగుటకు పోయిరి. శ్రీనివాస్ హోటల్ వీరికి ముఖ్య స్థానము. అందుకే దానికి వెల్లిన పిమ్మట ఇంటికి వచ్చి కొంచెం సేపు లోకాభిరామాయణము వర్లించిన పిమ్మట, విక్రం పుస్తకాలు చేపట్టెను. కృష్ణమోహన్ కూడా తన చదువులో నిమగ్నుడాయెను.

వెంకటకృష్ణుడు మాత్రము వార్తాపత్రిక పట్టుకొని కూర్చుండెను.

విక్రం, కృష్ణమోహన్ చదివినంతసేపు చదివి పుస్తకంతోనే నిద్రపోయిరి. వీళ్ళు పడుకున్న కొంతసేపటికి వెంకటకృష్ణుడు తన చదువు మొదలు పెట్టి, చాలా రాత్రి వరకు చదివి, పిమ్మట నిద్రించెను.

మరునాడు అందరూ లేచిరి, వెంకటకృష్ణుడు తన యింటికి పోయి, స్నానాలు చేసి, ఉపాహారాన్ని ఆరగించి, ఇస్త్రీ వస్త్రాలు ధరించి స్కూల్‌కు వెడలిపోయెను. విక్రం, కృష్ణమోహన్ కూడా స్కూలుకు వెడలిరి.

స్కూల్లో విక్రం స్నేహితులు, పరిచయస్తులు రెండు రోజులనుండి కనబడలేదేమి విక్రం, అని అడగగా! యేదో సాకు చెప్పెను. కాని కృష్ణమోహన్ మాత్రము జరిగినదంతా స్నేహితులకు నుడివెను.

రెండురోజులు miss చేసిన హోంవర్కునంత తెలిసుకొని అది పూర్తిచేయుటకు విక్రం, కృష్ణమోహనులు నిర్ణయించిరి. అంటే ఈనాటి సాయంకాలం తిరుగుడు వెంకటకృష్ణునితో బంద్ అన్నమాటే.

విక్రం స్కూల్ నుంచి రాగానే హోంవర్కులో నిమగ్నుడై ఉండెను. కృష్ణమోహన్ కూడా అంతె. యథావిధిగా సాయంకాలం కాగానే వెంకటకృష్ణుడు విక్రం వద్దకి వచ్చి అతనిని హోంవర్కుతో బిజీగా వుండటం చూసి అతనిని disturb చేయకుండా, తానొక్కడే తిరుగుటకు వెళ్లెను. తుదకు శ్రీనివాస్ అయ్యరు హోటల్‌కు వెడలెను.

అయ్యరు యథావిధిగా మీ స్నేహితుడు రాలేదే! అని ప్రశ్నించగా, అతడు యివ్వాళ్ల బిజీగా ఉన్నాడు. రేపు వస్తాడులే అయ్యర్, అని లోనికి వెడలి కూర్చుండెను.

వెంకటకృష్ణుడు పరిచయమున్న వారితో కూర్చుండి, కాఫీ సేవించి పిమ్మట విక్రం యింటికి combined study చేయుటకు వచ్చెను. పేరుకు మాత్రము combined study యే కాని చాలా తక్కువ సార్లు వీరు ఇద్దరు కలసి చదివినట్టుగా లేదు. అప్పుడప్పుడు maths problems మాత్రము కలిసి solve చేసేవారు. అది తప్ప, ఇద్దరి చదువు సమయం కూడా వేర్వేరు.

విక్రం general గా చదువు ఆపి పండుకొన్నాక, వెంకటకృష్ణుడు చదువు మొదలు పెట్టేవాడు.

ఇప్పుడు విక్రంకు 15 యేండ్లు. అప్పుడప్పుడే ఆడపిల్లలంటే మోజు పుట్టుచున్నది.

కృష్ణమోహన్‌కు ఇటువంటి ఆలోచనలే రావు. ఇక వెంకటకృష్ణునికి కూడా యీ వ్యసనము వుండనే వున్నది. ఇతని వయస్సు, విక్రం వయస్సు ఇంచుమించుగా ఒకటే.

వీరి బంధువులలో పెళ్ళిళ్ళు అయినప్పుడు, ఆ పెండ్లిలోనున్న ఆడపిల్లలను చూచి వారి విషయమై వీళ్ళు చర్చించుట అప్పుడప్పుడు జరుగుతుంది. కాని సమస్య ఏమిటంటే, ఆనాడు ఆడపిల్లల చదువు అంతగా లేకుండెను. మగపిల్లల చదువుమీదనే అంత శ్రద్ధలేని ఈ యుగములో, ఆడపిల్లల చదువును అంత ముఖ్యంగా భావించలేదు.

ఆడపిల్లలు పెండ్లి చేసికొని, భర్తలతో హాయిగా సంసారసుఖములను అనుభవించవలెనని ప్రతి తలితండ్రుల కోరిక.

ఆడపిల్లలు, మగపిల్లలు వేరే వేరే స్కూళ్లలో చదివేవారు. ఆడపిల్లలవి యేకొద్ది స్కూళ్ళో ఉండేవి ఆ కాలంలో. అందులో పల్లెటూర్ల నుండి వచ్చి చదివెడి వాళ్ళ సంఖ్య చాలా తక్కువ.

ఇక్కడ సిటీలో వృత్తిని అవలంభించినవాళ్లు కొందరు, ప్రత్యేకంగా లాయర్లు కొంతమంది తమ ఆడపిల్లలను స్కూళ్ళకు పంపెడివారు. వీళ్లను స్కూల్ బయట చూడగానే చాలా మంది రౌడీలు, వెంబడించి మాటలతో బాధించుచు హింసించేవాళ్ళు. ఆ రోగము ఇప్పుడు కూడా ఉందనుకుంటా. ఈ Eve teasing, eve పుట్టినప్పటి నుండి ఉన్న దురలవాటు కాబోలు.

ఈనాడు ఆదివారము స్కూల్‌కు సెలవు. విక్రం వెంకటకృష్ణుని యింటికి పోయెను. వెంకటకృష్ణుని గది యింటి ముందటనున్న వరండా ప్రక్కకు నున్న గది.

ఇందులో యితని మంచము, ఒక బల్ల, మరి కొన్ని కుర్చీలు.

వెంకటకృష్ణుడు మంచంమీద ఒరిగి, యేదో పుస్తకము చదువుచుండెను.

విక్రం ప్రవేశించగానే, వెంకటకృష్ణుడు లేచి కూర్చున్నాడు. విక్రం ఒక కుర్చీని లాగుకొని మంచం దగ్గర కూర్చున్నాడు.

ఈ ఇల్లు, వెంకటకృష్ణుని మేనత్త ఇల్లు.

ఈ మేనత్త భర్త, ఒక పిల్ల జమిందారు.

ఇంట్లో వంటవాడు కాక, మొత్తము ఊరి నుండి తీసుకువచ్చిన ముగ్గురు పనిమనుషులు.

ఈమె భర్త పెండ్లైన 10 సంవత్సరములకే పరమపదించినాడు. అందువల్ల ఇద్దరు కూతుళ్ళతో ఎక్కువ పట్టణంలో వుంటారు.

ఈమె గుమాస్తా పల్లెటూరి ఆస్థిని నడుపుతాడు. అప్పుడప్పుడు ప్రత్యేకంగా పండుగలకు ఈమె ఊరికి వెడుతుండేది. పిల్లలుకూడా ఈమెతో అపుడప్పుడు వెడుతుంటారు. పోయినప్పుడల్లా భూములు వాటి నుండి వచ్చే ఆదాయాన్ని గుమాస్తానడిగి తెలుసుకొంటుంది.

ఈమె పల్లెటూరి ఇల్లు సామాన్యమైన ఇల్లు కాదు. ఇది ఒక పెద్ద తోటలో నున్న చిన్నపాటి రాజభవనమే అనుకోవాలి. ఈమె భర్తగారు జీవించి వున్నప్పుడు దీని వైభవము చాలా బాగుండెడిదని ఇప్పుడు ఈమె ఊరువారు అనుకుంటుండగా విన్నాను.

కుమారునిది, కృష్ణమోహన్ వయసు. పేరు ఆదిత్య. పెద్దకూతురు పావని, రెండవది మనోరమ. వీరు ముగ్గురు పట్టణములో చదువుతున్నారు.

వెంకటకృష్ణని అత్తగారు వనజ. ఈ వనజమ్మగారు భర్త లేకున్నా, తన ఎస్టేట్‌ను బాగానే నడిపిస్తూ, పిల్లలను చదివిస్తున్నందువలన ఆమెకు తీరిక చాలా తక్కువ.

వెంకటకృష్ణుడు మేనత్తగారికి సహాయముగా వుంటాడు. ఈ కుటుంబానికి అప్పుడప్పుడు ఏమైనా వస్తువు లవసరమైతే, వెంకటకృష్ణుడు షాపింగ్ చేసి తెస్తాడు.

అయితే ఇప్పుడు వెంకటకృష్ణుడు తీరికగా నున్నాడు. ఈతని గది ఇంటి బయట వరండా ప్రక్కకు నున్నందున, ఇతనికి ఎవరు వచ్చినా, పోయినా ఇంటివారికి తెలియకుండానే ఉంటుంది.

అందువల్ల విక్రం ఇప్పుడు అక్కడ ఉన్నట్టు కూడా తెలియదు.

విక్రం, వెంకటకృష్ణుడు అప్పుడు జరుగుతున్న ఆందోళన విషయమై, మరి వేరే లోకాభిరామాయణము గురించి మాట్లాడి, ఇద్దరూ కొంతసేపైన పిమ్మట వీడ్కోలు పుచ్చుకున్నారు.

సాయంత్రం కాగానే యథారీతిగా వెంకటకృష్ణుడు విక్రం యింటికి వచ్చాడు. రాగానే కొంచెంసేపు కూర్చొని విక్రం వెడదామా అంటే, సరేనని! ఇద్దరూ కలసి బయటికి వెళ్లినారు.

ఆదివారం కాబట్టి కొంచెం రోడ్లపై జనం తక్కువ. ఆ కాలంలో మొత్తం హైదరాబాదులో నాలుగు లక్షలకు కొంచెం ఎక్కువ జనాభా.

కొత్త సిటీ అంటే నారాయణగూడా వరకే. తక్కినదంతా ఖాళీ స్థలము. చెట్లు చేనులతో పచ్చగానున్న బయళ్లు హిమాయత్‌నగర్, హైదర్‌గూడాలో ఇళ్లు చాలా తక్కువ. యే భాగ్యవంతులో ఇక్కడ విశాలమైన కాంపౌండ్లలో ఇళ్లు కట్టుకొని నివసించెడివారు. ప్రతివానికి సామాన్యంగా ఒకటి, రెండు కార్లు వుండవలసినదే.

ఇచ్చట నుండెడివారు, నిజాము రాష్ట్రసేవలో గొప్ప ఉద్యోగాలు చేసేవారో, పేరు పొందిన లాయర్లో లేదా పేరు పొందిన జమీందార్లో. సామాన్యుడు ఈ బస్తీలో నుండరు.

వీళ్లకు సేవ చేసి, వీరి అండలో బ్రతికే కొద్దిమంది మాత్రమే ఈ భవనాల పక్కన, చిన్న ఇండ్లలో ఉండెడివారు. వీరిద్దరూ రోజు వెడలినట్టే సుల్తాన్‌బజారు వైపుకు వెళ్లినారు.

వెంకటకృష్ణునికి అత్తగారేదో చిన్న పనిని వప్పగించినది. ఆ పని లాయరుకు సంబంధించినది. ఈ లాయరు సుల్తాన్‌బజారు ప్రక్కన ఉండేవాడు.

ఈయనదొక కొత్తయిల్లు. ఈయనకు నలుగురు కూతుళ్లని వెంకటకృష్ణుడు నాతో చెప్పినాడు. నలుగురు అచ్చువేసినట్టు ఒకే తీరుగా వుంటారని అందులో పెద్దవార లిద్దరికి పెళ్ళిళ్లయినాయి. ఇంకా చిన్నవారిద్దరు పెండ్లికాక నున్నారని చెప్పినాడు.

ఈ లాయరుగారు ఎత్తైయిన మనిషి, fair complexion. మొత్తము మీద ఈ వయస్సులో కూడా చాలా బాగా కనిపిస్తాడు.

ఆదివారము కాబట్టి సాయంత్రము ఆఫీసులో లేడు. తన drawing room లో కూర్చుని, ఎవరితోనో visit చేస్తున్నాడు.

వెంకటకృష్ణుడు లోనికి వెళ్లగానే, hello! వెంకట్ అని అతన్ని ఆహ్వానించినాడు. మమ్ములను ఆహ్వానించగానే, అతనితో మాట్లాడుతున్న మనిషి లేచి, మంచిది సార్, మళ్ళి కలుస్తాను సెలవు అని వెళ్ళిపోయినాడు.

దగ్గరగా కూర్చుండబెట్టుకొని హాఁ వెంకట్! అత్తగారు ఎలా వున్నారు. యేమిటి సంగతులు అని వెంకటకృష్ణని అడిగెను.

వెంకటకృష్ణుడు యేమిలేదు Uncle, అత్తయ్య ఆ కేసు విషయములో ఏమవుతుందో అని తెలుసుకోమంది, అని అడగగానే, దాని విషయము details అన్నీ, అది యిప్పుడు ఏ stageలో నున్నదో అంతా వెంకటకృష్ణునికి తెలుపుతుండెను.

ఇంతలో అప్పుడే పుష్పించిన పుష్పరాశియా లేక భూమిని అవతరించిన మేనకయా అన్నట్టు, ఒక అతిలోకసుందరి pappa అంటూ రూంలోకి ప్రవేశించి, sorry pappa! అంటూ, లోనికి పోవుటకు మరలిన అమ్మాయిని పిలిచి.

అమ్మా! వీరెవ్వరూ బయటివారు కారు. ఈయన వెంకటకృష్ణుడు, వనజ అంటీ అన్న కుమారుడు, ఈతడు అతని స్నేహితుడు. రా! కూర్చో అని, ఆమెను పిలిచి మాకు పరిచయము చేసెను.

ఈమెను చూడగానే విక్రంలో అప్పుడే అంకురించిన యవ్వనం ఈమె రూపురేఖలను పరిశీలించి చూస్తూ ఉండెను.

ఇంతలో లాయరుగారు వెంకటకృష్ణునితో కేసు గురించిన సంభాషణ పూర్తి చేసెను. పిమ్మట ఇంకా ఏమైనా కొత్త మలుపులు తిరిగితే, నేనే స్వయంగా వచ్చి అత్తయ్యతో మాట్లాడుతా! అని చెప్పి లేచెను.

మేమిద్దరము వకీలు గారికి నమస్కరించి బయలు వెడలితిమి. బయటకు రాగానే వెంకటకృష్ణుడు నన్ను సంభోదించి, విక్రం చూచితివా ఆ అమ్మాయిని, ఈమె No. 4, అందరికన్నా చిన్నది. అత్తయ్య కూతురు పావని, ఈమె క్లాస్‌మేట్సు అని చెప్పెను.

అమ్మాయి చాలా అందకత్తె! వెంకట్ అని విక్రం అనెను.

అఁ అవును! విక్రం.

ఎరుపైన వదనం, ఎత్తు 5′–6″, వయస్సు 14 సంవత్సరాలు. అందగత్తె కాకుండా యెలా వుంటుంది. వయసులో, ప్రకృతిలో ఏదైనా అందంగా ఉంటుంది.

ఈమె నవయవ్వనంతో తొణికిసలాడుతున్న కన్య. నువ్వన్నట్టు అందగత్తే మరి అని వెంకటకృష్ణుడు అన్నాడు.

ఇద్దరూ సుల్తానుబజారు వైపు మెల్లిగా వెడుతున్నారు యేదో మాటాడుకుంటూ. అయ్యర్ హోటలు రానే వచ్చింది. యథాప్రకారం అయ్యరు వీరిద్దరిని లోనికి ఆహ్వానించినాడు.

ఈనాడు వారి వెనువెనుకనే వచ్చి వీళ్లను ఓ క్లీన్ బల్లవద్ద కూర్చుండ బెట్టి, ఒక సర్వరును పిలచి, వీళ్ళకు యేం కావాలో తెలుసుకో! అని అజ్ఞాపించి, మరి తన ఆఫీసు బల్లపైన కూర్చొనెను.

ఆనాడు వెంకటకృష్ణుడు వేళగాని వేళ, విక్రం ఇంటికి వచ్చెను. రాగానే! విక్రం ఆహ్వానించి, సంగతేమిటి? సమయం గాని సమయానికి వచ్చావే అనెను.

నేను కొద్ది నిమిషాలకొరకు వుంటాను. దిగ్భ్రాంతి చెందకు విక్రం అన్నాడు వెంకటకృష్ణుడు.

రేపు మా మేనమరదలు పావని పుట్టిన దినము. కాబట్టి నిన్ను ఆహ్వానించుటకు వచ్చాను అన్నాడు వెంకటకృష్ణుడు.

ఓ అలాగా! ముద్దుల మరదలు జన్మదిన వేడుకలలో మేముకూడా పాల్గొనాలన్నమాట! చాలా thanks Venkat అని విక్రం అన్నాడు.

తప్పక రావాలె సుమా! అన్నాడు వెంకటకృష్ణుడు.

ఓ తప్పకుండా! అన్నాడు విక్రం.

మరి యింకా కొంతమంది పావని స్నేహితులను ఆహ్వానించుటకు విక్రం వద్దనుండి వెళ్ళిపోయినాడు వెంకటకృష్ణుడు.

పావని స్నేహితులందరూ వెంకటకృష్ణునికి తెలుసు. ఎందుకంటే! వారంతా పావని వద్దకు వస్తుంటారు. అటువంటప్పుడు family member అయిన వెంకటకృష్ణుడు చూడకుండా ఉంటాడా? ఇందులో తురకలు అంటే నావాబుల family members, హిందువులు సామాన్యంగా ఆ class చెందినవారు. కాకపోతే కొంతమంది ఈమె క్లాస్‌మేట్స్, సాధారణ కుటుంబాలకు చెందినవారు కూడా నున్నారు. అందరిని కలిపి ఆహ్వానించే బాధ్యత వెంకటకృష్ణుని మీద నున్నది.

అయితే! ఆనాడు డ్రైవర్‌ని తీసుకొని వెళ్లినాడు వెంకటకృష్ణుడు. సాయంకాలం వరకు పట్టణమంతా తిరిగి, అందరిని ఆహ్వానించి, సాయంత్రానికి ఇల్లు చేరుకున్నాడు.

కావున విక్రంతో తిరుగబోవుటకు వీలుకాలేదు. పావని స్నేహితులు ఒకరిద్దరు తప్ప, తక్కిన స్నేహితులంతా హిమాయత్‌నగర్, హైదర్‌గూడా, లింగంపల్లిలోనే వున్నారు. కొందరు చాలా తక్కువ బంజారాహిల్స్‌లో కూడా వున్నారు. అందరికి వెంకటకృష్ణుడు personal invitations ఇచ్చినాడు.

సాయంకాలం జన్మదినానికి కావలసిన సామాగ్రిని, మేనత్త వేరే కారులో సాయంకాలం ఇద్దరు కూతుళ్లతో వెళ్లి, కొని తెచ్చింది.

జన్మదిన వేడుకలు మన భారతీయ సాంప్రాదాయానుసారమే చేస్తూ వచ్చింది. అందుకే కేక్ మాత్రము ఆర్డరు చేయలేదు.

మరునాడు లేవగానే, తలంటి స్నానం చేసి, కొత్త వస్త్రాలు ధరించింది పావని. సాయంకాలము వేడుకలు అందరు స్నేహితులు, బంధువులు సాయంకాలమే వస్తారు. అందువల్ల పావని మనస్సంతా సాయంకాలపు వేడుకలపై నుండెను. అందులో early teenage దశలోనున్న సుకుమార పుష్పము. ఈ పుష్పాన్ని ఏ దేవునకు సమర్పించుటకై విధి వ్రాసినాడో.

ఆనాడు వనితల వివాహము రజస్వల కాకముందే చేసి వేయాలి. అందులకు వరునికై పూర్వాచార విధంగా వెదకాలి. వైదిక బ్రాహ్మణులు కొంతవరకు ఉపయోగపడుచుండిరి. కానీ, కన్యనిచ్చినప్పుడు ఇల్లు, కుటుంబము, వంశ గౌరవము వీరు, మాకు సరితూగుతారా! లేదా అను మున్నగు విషయాలు చూచుట అనాటి ఆచారము.

వనజమ్మగారు కూడా అప్పుడే బుహుశ, పావని వివాహ విషయమై తన మనసులో నున్నదనుకుంటా.

వనజమ్మగారి పెళ్లి, ఆమెకు 10 సంవత్సరాలున్నప్పుడే జరిగింది. పిమ్మట పదేళ్లకే వైధవ్యము ప్రాప్తించింది.

ఈనాడు 20 యేండ్లకు యింకా teenage behaviour యే వుంటుంది వనితలకు. కాని, వనజమ్మకు 20 యేండ్లకే జీవితము ముగిసినది. 16 యేళ్లకే పావని జన్మించింది. అంటే ఆమెకు ఇప్పుడు 30 యేళ్లు.

ఈనాడు, ఈ వయస్సులోనున్న చాలా మంది స్త్రీలు, కాలేజీల్లో యే M.S. or Ph.D., చేస్తుంటారో లేదా ఉద్యోగాలు వెతుకుతు స్వతంత్ర జీవితానికై కలలు కంటుంటారో కాని, అప్పటి సాంఘిక పరిస్థితులకు కట్టుబడిన ఈమె తలిదండ్రులు ఈమెను వైధవ్యాన్ని స్వీకరింపజేసిరి.

ఈనాడైతే విధవ, వివాహాలకు తలపడుతుంది. కాని, వనజమ్మకు అది లభించే వీలు లేకుండెను. ఈకాలాన వీలున్నప్పటికీ చాలామంది విధవరాలుగానే వుంటారు. అది వారు నిశ్చయించుకున్నదే.

ఎవరు ఎంత చెప్పినా కొంతమంది వనితలు ఈ విధవ వివాహాలకు ఒప్పుకొనక, తన పిల్లలుంటే పిల్లల మీద concentrate చేస్తారు. లేదా తల్లిదండ్రుల ఇంట్లో ఉండిపోతారు. వారి ఊహలో ఇదంతా వాళ్ల కర్మ ఫలం. ఇంకో వివాహము చేసికొన్న, మళ్లీ ఈ వైధవ్యము లభించదని ఏమి గ్యారంటీ. నొసట వ్రాసిన రాతను ఎవరు తప్పించలేరనే వారి ప్రగాఢ విశ్వాసము.

పాశ్చాత్య దేశాలలో వైధవ్యమనేది చాలా అరుదు. అయినా, కొంతమంది చాలా తక్కువ మన భారతీయ స్త్రీలవలెనే మళ్ళీ పెళ్లికి ఒప్పుకొనరు. కానీ, చాలామట్టుకు భర్త చచ్చినాక కొద్ది నెలలకు లేదా సంవత్సరాలకు వేరే పురుషులతో dating game లో ప్రవేశించి, ఎవరు నచ్చితే వాళ్లను పెళ్లి చేసుకుంటారు. ఈ విషయమ్మై అచ్చట స్త్రీ, పురుషులకు సమాన హక్కులు ఉన్నాయనే చెప్పవచ్చును.

అక్కడ ఒక వివాహితుడైన పురుషుడు మరి వేరే స్త్రీతో అక్రమ సంబంధాలు పెంచుకుంటే, స్త్రీ కూడా తలచుకుంటే అట్లే చేయవచ్చు. కానీ, కొందరు చేయరు – మరికొందరు చేస్తారు.

వాళ్ల వివాహాలు ప్రేమపైన ఆధారపడి వుంటాయి. ప్రేమ వున్నంత వరకు వివాహానికి ఏ ప్రమాదము లేదు. కానీ ప్రేమ లోపించిప్పుడు వారు, ఆ వివాహ బంధమునుండి విముక్తి పొందుతారు. వాళ్ళకు ఇప్పుడు వివాహ బంధము ఒక contractual agreement. ఆ contract నుండి ముక్తి అంటే విడాకులు.

ఆశ్చర్యమేమిటంటే, ఇద్దరి అంగీకారముతో జరిగితే స్త్రీలకు పురుషుని ఆస్తిలో భాగము రావాలి. కొంత మంది పురుషులు కూడా శ్రీమంతులైన భార్యలవద్ద కూడా Alimoney ని తీసుకుంటారు. యేది యెటులైన పాశ్చాత్యుల సంస్కృతికి, మన సంస్కృతికి చాలా భేదము. కానీ, ఆ బేధాలు ఈనాడు తగ్గిపోతున్నాయి ప్రత్యేకంగా so called, educated classes లో.

మన దేశంలో కూడా ఆ దేశంలోనున్న వ్యసనాలను మన పాశ్చాత్య నాగరికులగు

భారతీయులు అవలంభిస్తున్నారు. ఇది మంచా, చెడా అని తర్కించుట కాదు. ఇది జరుగుచున్న వాస్తవము.

ఎంతసేపటినుండో ఎదురు చూస్తున్న సాయంత్రము రానె వచ్చినది. పావని తన జన్మదిన మహోత్సవానికి సంసిద్ధురాలై వున్నది. వనజమ్మ ఈ జన్మదిన మహోత్సవానికి కావలసిన సామానులన్నీ సమకూర్చి వుంచినది. పనివాళ్లంతా అయినంత మట్టుకు శుభ్రంగా బట్టలు తొడుగుకొని పనిచేస్తున్నారు.

మనోరమ ఇంకా చిన్నది, అంటే పన్నెండేళ్ల ప్రాయము అయినా ఒక ఆకర్షణీయమైన, విలువైన పట్టు లంగా, ఓణీతో అప్సరసగా కనబడుతుంది. పావనికున్నంత సంతోషంలో ఈమెకూడా భాగస్వామి. ఎందుకంటే తన ప్రియమైన ఒకే ఒక తోబుట్టువుకు ఈనాడు పదునాలుగేండ్లు నిండినవి. వీళ్లు అందరూ ఈ సందడిలో వుంటూ వుండగా ఒకరొకరుగా అతిథులు విచ్చేయసాగినారు. అందరిని వెంకటకృష్ణుడు, మనోరమ receive చేసుకొంటున్నారు.

ఇందులో చాలా మంది యువతులే. కానీ బంధువులతో కొంతమంది పెద్దవారు కూడా వున్నారు. ఒకరికన్న ఒకరు పోటీ పడ్డట్టుగా విలువైన వస్తువులను, నాజూక్ మరియు లేటెస్ట్ ఆభరణాలను ధరించిన వారే. కొందరు పావని క్లాస్‌మేట్సు మరియు special friends. కొంతమంది simple and sweet గా డ్రెస్ చేసుకున్నారు. అందరూ కుర్చీలపై కూర్చున్నారు. భారతీయ సాంప్రదాయ ప్రకారమే ఈ జన్మదిన వేడుక జరిగింది. Happy birth day to you my dear Pavani అని మాత్రము ఎవరూ పాట పాడలేదు, కేక్‌ను కోయలేదు. 14 వెలిగిన క్యాండిల్స్‌ను మాత్రము పావని నోటి గాలితో ఆర్పి వేయలేదు. పిమ్మట అందరూ స్వీట్స్, ఫలాలను భుజించి, వేరే ఉప్పు కారం కలిపి చేసిన snacks కూడా వుండెను. ఇవి అన్ని అందరూ ప్లేట్లలో పెట్టుకొని ఆరగించుకుంటూ యేవేవో సంభాషిస్తూ కూర్చున్నారు.

అందరూ ఆమెను ఇలాగే వంద పుట్టిన దినాలు నీకు మళ్ళీ మళ్ళీ రావాలమ్మా! అంటూ ఆశీర్వదించినారు.

Thanks అంటూ, అదరికి బదులు చెప్పింది. ఈ విధంగా రెండు గంటలకుపైగా ఈ పుట్టినదిన పండుగ జరిగింది. ఒకరొకరుగా వెళ్ళిపోయే సమయము ఆసన్నమైంది. పావనికి వచ్చిన కానుకలు ఒకటొకటిగా విప్పి వాళ్లకు ప్రత్యేక కృతజ్ఞతలు తెలిపింది. పిమ్మట అందరూ thank you, buy అంటూ సెలవు తీసుకున్నారు.

ఇప్పుడు కొందరు బంధువులు తప్ప అందరూ వెడలి పోయినారు. బంధువులతో వనజమ్మ, పావని, మనోరమా మాట్లాడుతూ కూర్చున్నారు. విక్రం, వెంకటకృష్ణుడు వెంకటకృష్ణుని గదిలోకి వెళ్లిపోయినారు.

వెంకటకృష్ణుడు, విక్రం సావధానంగా వెంకటకృష్ణుని గదిలో కూర్చున్నారు. ఒక సేవకుని పిలిచి కొన్ని స్వీట్స్, పళ్ళు తేపో! అని పంపించాడు.

వాడు కావలసినన్ని స్వీట్స్ మరి పళ్లు తెచ్చి, వెంకటకృష్ణుని గదిలోనుంచి వెడలిపోయినాడు. ఈ ఇద్దరు ఇవ్వాళ్ల తిరుగుటకు పోలేదు. కాబట్టి విశ్రాంతిగా ఇచ్చట కూర్చుండి సంభాషించుకొంటున్నారు.

విక్రం : వెంకట్! ఈ జన్మదినము చాలా ఘనంగా జరిపినారే. దీనికి ఆర్గనైజర్ ఎవరు?

వెంకట్ : మా వనజత్తగారే! ఆమె ఇటువంటివి చేయుటలో చాలా అందెవేసిన చెయ్యి. నేను చెప్పిన వస్తువులను సిద్దపరిచాను.

విక్రం : అంటే? నీ సహాయము లేనిదే ఇంత ఘనంగా జరిగేదా!

వెంకట్ : O, yes! జరిగేది. నా బదులు ఇంకెవరైనా సహాయపడేవారుందురు.

విక్రం : అంటే?

వెంకట్ : విక్రం! నేను వున్నాను కాబట్టి చేసినాను. నేను లేకుంటే అత్తయ్య స్వయంగా వెళ్ళి అన్నీ కొని తెచ్చెడివారు. ఆమెకు ఒకటి కాదు, రెండు కార్లున్నాయి. ముగ్గురు సేవకులున్నారు. ఇంకా కావాలంటే ఊరి నుండి పిలుపించగలదు. నేను లేకున్నా ఈ జన్మదినము ఘనంగానే జరిగేది నిస్సంకోచంగా.

విక్రం : అంటే? నీవంత ముఖ్యం కాదన్నమాట ఈ ఇంటికి.

వెంకట్ : లేదు. నేనలా అనటం లేదు. నేనంటె అత్తయ్యకు చాలా ఇష్టం. నన్ను ఒకసారి కూడా పల్లెత్తుమాట ఆమె అని ఎరుగదు. ఆమె కొడుకు లేనిలోటు నేనున్నందుకు గుర్తించదు. ఆమె నాకు అత్తయ్యనే కాదు, అమ్మ కూడా ఈ యింటిలో అన్నాడు వెంకట్. విక్రం తనలో తాను వెంకట్ అదృష్టవంతుడని అనుకొన్నాడు.

పిమ్మట ఇద్దరి సంభాషణ ఆగిపోయింది. విక్రం, వెంకటకృష్ణుడు స్వీట్స్ మరి పండ్లు తినుకుంటూ కూర్చున్నారు. ఆనాడు చదువుకు స్వస్తి చెప్పినారు. వీరిద్దరే కాదు ఆ పని చేసింది. పావని, మనోరమ కూడా అంతే.

ఆనాడు టి.వి.లు వుంటవి అనే ఊహ కూడా ఎవరికీ లేకుండే. చాలా మందికి రేడియోల విషయము కూడా ఇంతే. కొంతమంది భాగ్యవంతులకు రేడియోలుండెను. అవి పెద్దవి గాను, చాలా ఖరీదైనవిగా నుండెను.

వనజమ్మ జమీందారిణీ అగుట వలన ఆమె ఇంట్లో గూడా ఫిలిప్స్ కంపెనీ వారు తయారు చేసిన ఒక రేడియో నుండెనన్న మాట. అందరూ పోగానే, తల్లి మరియు ఇద్దరు కూతుళ్లు రేడియో పెట్టికొని కూర్చున్నారు.

వెంకటకృష్ణుని వారితో రేడియో వినుటకు రమ్మని ఒక సేవకుని పంపింది వనజమ్మ. కాని విక్రం వున్నందువల్ల వెంకటకృష్ణుడు నేను తర్వాత వస్తానని చెప్పు, అని సేవకున్ని పంపించినాడు.

విక్రం : వెంకట్ నీవు వెళ్ళు. నేను కూడా ఇంటికి పోవలెగదా! అని కుర్చీనుంచి లేచినాడు. ఫరవాలేదు కూర్చో అని చేయిపట్టి విక్రంను కూర్చుండ బెట్టినాడు.

ఆనాడు వినోదానికి ఇన్ని టి.వి.లు మరియు వాటిలో వస్తున్న అన్ని రకములగు కార్యక్రమాలు లేకుండెను. అయినా పొద్దు పోదన్న సమస్య అంతగా లేకుండెను.

మన దేశము అప్పుడు బ్రిటీషు వారి పరిపాలనలో నుండెను. మన దేశీయులు ఒక alpin కూడా తయారు చేసే పరిస్థితులలో లేకుండిరి. అన్ని వస్తువులు, వస్త్రాలతో సహా సూదులు, సైకిళ్లు, కారులు, చాలా వరకు పుస్తకాలు మొదలగు అన్ని వస్తువులు ఇంగ్లాండు మరి ఇతర పాశ్చాత్య దేశాలనుండి దిగుమతి అయ్యేవి.

మన దేశం ఇంగ్లీషు వారి colony అంటే, వాళ్ల ఆజ్ఞ లేనిది మనము యేమీ చేయకుండా నుంటిమి. recreation కాక మరియొక entertainment instrument gramphone. అది కూడా spring తిప్పితేనే నడిచేది. Records మన భాషలో నుండే, కాబట్టి పాశ్చాత్య కంపెనీలే మన సంగీతాన్ని రికార్డు చేసి మనకు అమ్మేది. సినిమాలు ఉండేవి. అది ఇంకొక recreation సాధనము. ఇప్పుడైతే electronic revolution transister, T.V. మొదలగు ఎన్నియో సామగ్రి పాత, మధ్యతరగతి కుటుంబాలకు అందుబాటులో నున్నవి. అంటే మనమిప్పుడు యెంతో అభివృద్ధి చెందినాము. కాని అమెరికా, యూరప్ మరి చాలా ఆసియా దేశాలను పోలిస్తే మన అభివృద్ధి ఒక లెక్క కాదు. మన జనాభా విపరీతంగా పెరిగిపోయింది. మన అడవులు, పులులు, సింహాలు మరి అనేక ఇతర జంతువులు నశించిపోతున్నవి.

పెరుగుతున్నది ఒక జనాభా మరియు ఇంకొకటి దారిద్ర్యం. ఇప్పుడు ప్రతివానికి ఒక స్కూటర్ ఉన్నది. కాని ఆ స్కూటరు యొక్క కలుషితమైన గాలిని పీల్చుకుంటూ, క్రిక్కిరిసిపోయిన బాటలలో వాటిని నడిపిస్తున్నాము.

కార్లు ఎక్కువైనాయి సంతోషం. కానీ వాటిని పబ్లిక్ రోడ్స్ మీద పార్కు చేసి, కార్లను మరి ఇతర వాహనాలను నడుపలేకుండా ఆటంకం కల్గిస్తున్నాము. ప్రతి ఇంట్లో ఒక టి.వి., రేడియో, ఒక స్కూటరు లేదా సైకిల్ ఉన్నది. కాని ఆ టి.వి.లో వచ్చు కార్యక్రమాలు చాలా వరకు మన సంస్కృతిని మలినమైన కార్యక్రమాలతో పాడు చేస్తున్నవి. ఈ విధంగా ఎన్నియో సాంకేతిక విజయాలను సాధించినాము. కాని, వాటితో సమస్యలను కూడా సృష్టించినాము. ఇది బహుశ social education లో ఒక భాగం కావచ్చు. దీనిని progress అందామా, లేక degress అందామా. ఏది అన్నా వీటన్నింటిని చూచిన తర్వాత, గతం మంచిగా అగుపిస్తుంది. ఎవరికి మంచిగా అనుపిస్తుంది. ఎవరి జీవితమైతే హాయిగా ఉండెనో, కాని ఎవరైతే హాయిగా లేకుండిరో వారికి ఈ కాలమే మంచిగా అనిపిస్తుంది. అంతా relative మంచి చెడూ కూడా relative.

విక్రం విధి లేక కూర్చున్నాడు. వీరికింకా నూనూగు మీసాలు కూడా రాలేదు. అయినా ఆడపిల్లలమీద మోజు కనబరుస్తున్నాడు. ఇప్పుడు వీరిద్దరు అదే సంభాషణలో నున్నారు. అప్పుడు వీళ్లు 10వ తరగతిలో నున్నారు. అయినా కాలేజీలో చదివే బంధుమిత్రుల ఆడపిల్లలను గురించి తర్కిస్తున్నారు.

ఎవరో వెంకటకృష్ణుని బంధువుల అమ్మాయిని గురించి మాట్లాడుతున్నారు.

ఆమె బి.ఏ., చదువుచున్నదట! చూచుటకు అందగత్తెనట! ఆమెను ఓ అబ్బాయి గాఢంగా ప్రేమించినాడట! ఆమె చిత్రపటాన్ని తన అర్రలో వుంచి దానిని పూజించినంత పని చేస్తారట!

ఆ అమ్మాయికి ఈయన ప్రేమించేది కూడా తెలియదట! ఆమె పాపం, రోజూ కాలేజ్‌కు వెళ్ళి తన చదువుయేదో తానేమో. ఆమెకు అన్నతమ్ముళ్లు అక్కలు చెల్లెండ్రు చాలా మంది వున్నారట. అందుకే కాలేజీ నుండి రాగానే కుటుంబ సభ్యులతోనే కాలం గడుపుతాదట! ఆమెకు ఎక్కువ స్నేహితురాండ్రుకూడా లేరట! అంటే, ఆమె కుటుంబసభ్యులతోనే కాలం గడుపుతుందట. అంటే, కాలేజ్‌తోను

మరి కుటుంబసభ్యులతోనే ఆమె కాలమంతా అయిపోతుందట. అంతేకాదు, ఈ ప్రేమించే అబ్బాయికి చదువులో అంత ఆసక్తి కూడా లేదట.

ఇంటికాడ భూమి, బుట్రా బాగుందట. అని వెంకటకృష్ణుడు విక్రంతో చెపుతూ పోతున్నాడు. విక్రం మాత్రం ఉఁ అంటూ వింటున్నాడు. విక్రంకు కూడా ఇటువంటి విషయాలంటే కొంచెం ఆసక్తి కూడా పెరిగింది. ఆ teenage మహాత్యమనుకుంటా ఇదంతా.

ఈ విధంగా లోకాభిరామాయణముతో కాలం గడుపుతున్నారిద్దరు. 9 గంటలు కావొస్తుంది. విక్రం గడియారం వైపుచూచి, వెంకట్, నేను వెళ్లాలి. I had a nice time thank you మీ అత్తయ్యగారికి, మీ మరదళ్లకు నా వైపున చాలా చాలా కృతజ్ఞతలు తెలుపు అని, కుర్చి నుండి లేచి వెంకట్‌తో కరచాలనము చేసి తన ఇంటికి వెళ్ళిపోయినాడు.

పోగానే! కృష్ణమోహన్ ఎదురొచ్చి యేం అన్నయ్య ఇంత లేటుగా వచ్చావు అన్నాడు.

యేం లేదు క్రిష్ణా. వెంకట్ నేను మాట్లాడుతూ కూర్చున్నాము. చూడకుండానే పొద్దుపోయింది అంతే. అని వంటవానితో నీవు భోంచేయ్యి, నేను భోంచేయను అని చెప్పి తన గదిలోకి వెళ్లినాడు. చదువుదామని పుస్తకం చేత బట్టినాడు. కాని పుస్తకంమీద మనస్సు కేంద్రీకరించలేకపోయినాడు. తన తలలో మొత్తం పావని జన్మదిన దృశ్యాలే మెదుల్తున్నాయి. ప్రత్యేకంగా అక్కడికి వచ్చిన జవ్వనుల మీదనే మనసు కేంద్రీకరిస్తున్నాడు. ఆడపిల్లలను ఒక్కసారే అంతమందిని చూచుట విక్రంకు ఇది మొదటి అనుభవము. వాళ్ల hair styles మరి వారి చీరలు, వారి ఆభరణాలు, వాళ్ల నడత, వాళ్ల భాష మరి వాళ్ల ఉత్సాహము ఇవన్నీ చూచిన పిమ్మట విక్రంలో యేదో తీయని కోరిక ఉద్భవించినట్లుగా తోచింది.

కాని, ఆ కోరిక ఏమిటీ, ఆ స్పందన ఏమిటి విక్రంకు అర్థం కాలేదు. కాని అతనిలో ఏదో మార్పు వస్తున్నట్లు అతడు గమనించాడు. పుస్తకం బల్లపైన పడవేసి మంచం మీద వెలికలబడి రెండు అర చేతులు నెత్తిక్రింద బెట్టి అట్లే ఆలోచిస్తూ నిద్రపోయినాడు.

రోజుకులాగే తెల్లవారు జామున లేచి, కాలకృత్యాలు తీర్చుకొని స్కూల్‌కు తయ్యారయ్యి, యిద్దరూ కృష్ణమోహన్ మరి విక్రం స్కూల్‌కు వెళ్లిపోయినారు. వీళ్ల వంటవాడు మాత్రం యిల్లు శుభ్రం చేసి ఈ యిద్దరి బట్టలు, పుస్తకాలు అన్నీ సర్ది వాళ్లకు సంతోషాన్ని కలుగచేస్తాడు. పిమ్మట కూరకాయలు, వంట అది చేసుకుంటూ ఇద్దరి సన్నిధిలో కాలం గడుపుతాడు.

ఒక్క వేసవిలోనే వాని కుటుంబంతో కాలక్షేపం చేయుటకు ఊరికి యిద్దరు బాబులతో వెళ్ళిపోతాడు. విక్రం, కృష్ణమోహన్ సెలవులలో ఊరికిపోతే ఇతడు కూడా వాళ్లతోనే పోతాడు. మళ్ళీవాళ్లు వచ్చినప్పుడు వస్తాడు ఆ కాలంలోనున్న వేరే ఆ ఊరి బీదసాదలకంటే ఇతని ఆర్థిక పరిస్థితి ధర్మారావు పుణ్యమా అంటూ, ఈయన కుటుంబ పరిస్థితి బాగుంది.

అనాడు ఇలాగే వూరిలోని కొంతమంది వారి తెలివే అనుకొనండి లేదా అదృష్టమే అనండి. ఈ కొద్దిపాటి మంది ఊరిలోని పెద్దకుటుంబాలతో చెలిమి చేసికొని వీరి జీవనాన్ని సుఖవంతంగా చేసికొనెడివారు.

అనాడు హైదరాబాదులోని తెలంగాణా ప్రాంతములో ప్రతి ఊరిలో ఒకటి రెండు influential families కి ఆ ఊరిపైన సర్వాధిపత్యం. ఇటువంటి కుటుంబాలకే అన్ని సదుపాయాలు. ఆ వూరి భూమి అంతా వీరిదే. తక్కినవారంతా వీరి దయాదాక్షిణ్యాలపైన బ్రతుకవలసిందే. ఇది మంచిదా, చెడ్డదా అనే సమస్యకాదు మనం చర్చించేది. ఇది వాస్తవం. ఆ యుగం అంతే, నేను చెప్పదలచుకున్నది.

అలాగే ధర్మారావుది కూడా ఈ ఊరిమీద సర్వాధికారం. కాని పేరుకు తగ్గట్టుగా ఇతడు ధర్మాన్ని తప్పి నడచుకొనలేదు. కాని వీరి ఊరికి 10 మైళ్ల దూరంలో ఇంకో ఊరు ఉండెను. అక్కడ కూడా ఒక కుటుంబానిదే సర్వాధికారము. ఈ కుటుంబసభ్యులు ఊరి వారందరిపై దురాక్రమణలు జరిపి, వారికి అప్పులుగా గింజలు, డబ్బు ఇచ్చి కొన్నియేండ్లలో ఆ ఊరు భూములన్నీ తమ స్వాధీనములోకి తీసుకొనిరి. వీరే ఆ భూమికి భూస్వాములు. రెండు, మూడు కుటుంబాలకు కొంత భూమి ఉండెను. అది కూడా ఎందుకు విడచినారంటే, ఈ కుటుంబాలు ఆ వూరి పెద్దకుటుంబంతో బాంధవ్యముంది కాబట్టి, ఇక అందరి భూములు, ఇనాములు అన్నీ ఇప్పుడు ఈ పెద్దకుటుంబ స్వాధీనములో నున్నవి. భూములకు వీడ్కోలు ఇచ్చినవారంతా ఈ కుటుంబం వ్యవసాయములో పాలేర్లుగా పనిచేస్తున్నారు. ఎవరూ వీళ్ళను ఎదురించుటకు సాహసించరు. అలా చేసినారో వారు ఆ ఊళ్లో బతుకలేరు. వాళ్లను physical గా తమ వద్దనున్న గుండాలతో యమపురికి పంపవలసిందే అందుకే బ్రతికి ఉంటే బలుసుకూర తిని బతకవచ్చునని గప్‌చుప్ మనకుండా కూర్చుండెడివారు. దేవుడున్నాడు! కరుణామయుడు, అతడు అందరిని రక్షిస్తాడు. అని మన పెద్దలు, జ్ఞానులు చెపుతారే. మరి ఈ ఊరిలో యీ పెద్ద కుటుంబీకులకు యే పాపము తగులలేదు. ఎవరి వుసురు ముట్టలేదు. ఎవరి శోకము తగులలేదు. చాలా మంచిగా ఈ కుటుంబీకులు అనాటికి, ఈనాటికి prosper అవుతూనే వున్నారు. మరి దేవుడున్నాడంటారు. యేడీ దేవుడు, యేమి చేయలేదు ఈ ఊరి బీదజనులకు. అంతేకాదు, వీండ్లను మోసము చేసి. వీండ్ల భూములన్నిటిని తీసుకున్న ఆ మహోన్నత కుటుంబానికి, వారి సభ్యులకు యేమి కాలేదు సరేకదా! వారు prosper కూడా అయ్యినారే. అంటే ఆ దేవుని priorities వేరే వున్నవనుకోవాలా లేక వారికి కన్నులు లేవనియా. Any way ఇటువంటి క్రూరులు, కుటిలురు కూడా బాగానే ఉన్నారు. ఇక ఇప్పుడైతే వేరే తీరు అన్యాయాలు గోచరిస్తున్నవి.

మనము చరిత్రలో ఎప్పుడూ పరరాజుల పాలనలోనే ఉన్నాము. మనకు జాతీయ భావము అనేది బ్రిటీషు పాలనములోనే లభించింది. అంతకు మొదలు హిందూ దేశములో హిందు రాజులు, గ్రీకుల దాడి నుండి ముక్తినొందిన పిమ్మట తురకలు మన దేశాన్ని ఆక్రమించి పాలించినారు. వారి తర్వాత మెల్లగా ఇంగ్లీషువారు పాలించినారు. వారే ఈ మహాదేశాన్ని ఒక దేశంగా ఉంచితే ఇది ముమ్మందు

ప్రపంచ రాజకీయాలలో అగ్రస్థానాన్ని చేరగలదన్న భయముతో రెండు ఖండాలుగా విభజించినారు. ఇప్పుడు ఈ రెండు ఖండాలు ఒకదానితో ఒకటి పోట్లాడుకుంటూ నేను బ్రతకను, నిన్ను బ్రతకనీయను అన్నట్లు మెలుగుతున్నవి. అదే కాకుండా మనవారు మనకు వారికి నచ్చిన ప్రజాస్వామ్యాన్ని కట్టబెట్టినారు. దాని ప్రకారము అమెరికా మరీ బ్రిటన్‌కు చెందిన రాజ్యాంగాలను సమ్మిళితము చేసి, మన మొక రాజ్యాంగాన్ని సృష్టించుకున్నాము. రాజ్యాంగమంటే అది మన మహోన్నత సాంస్కృతికి ఆదర్శంగా నుండాలి. ఇప్పుడు మనదనునది ఏదీ లేదు. ఇంగ్లీషు మనకు దేవభాష. ఇక మన రాజ్యాంగము ఒక అతుకుల బొంత, మతాలకు తార్కాణము. ప్రతిసారి కులాలపేరిట రాజకీయవాదులు రిజర్వేషనులను కల్పిస్తూ ప్రతివారికి ఏదో రాజకీయ స్వార్థానికి నిదర్శనంగా రిజర్వేషనులను ఇస్తూ వస్తున్నారు.

ఇదివరకు పాకిస్తాను, హిందుస్తాను అను రెండు దేశాలను బ్రిటీషువారు సృష్టించినారు. ఇప్పుడు మన ఈ స్వార్థపరులైన రాజకీయనాయకులు భారతిని ఎన్ని విధాల విభజించుతారో తెలియదు. ప్రతివాడు హక్కుల గురించే మాట్లాడుతాడు. మరి బాధ్యతల గురించి మాట్లాడడేమి? ఇప్పటికిని ప్రెసిడెంటు Kennedy అన్న మాటలు మన చెవులో గింగురుమనవా? **My fellow Americans ask not what your country can do for your, but ask what you can do for your country.** ఈనాడు ప్రతి రాజకీయ పార్టీ మమ్ములను గద్దె ఎక్కిస్తే రు.2/– కి ఒక కిలో బియ్యం అందరికి లేదా పూర్తిగా మధ్యపానాన్ని నిషేధిస్తాము మేము గద్దె నెక్కితే. లేదు మీ కులానికి ఇన్ని సీట్లు, మీకు కూడా అంతే. మేము మైనారిటీలము. మాకు ప్రాతినిధ్యము మా సంఖ్యను బట్టి కావలి. అని ఎన్నియో చీలికలు పడుతున్నవి మన సమాజములో. రాను రాను మా కులానికి ప్రాతినిధ్యము సరిగ్గా లేదు. కాబట్టి మా జనాభాను బట్టి ఇంత దేశాన్ని మాకు పంచి వేరే చేసి ఇవ్వండి. మరి మాకు కూడా అంతే ఇవ్వండి. వేరే కులంవారు అంటూ వుంటే పంచి ఇస్తారా! పంచి ఇచ్చేవారు ఎవరు? ఎవరిదీ దేశం? ఈ విధంగా మన స్వార్థపరులైన రాజకీయ నాయకులు తాము పదవులలో లేమని ఈ చీలిక భావాలను లేవదీస్తుంటే ఈ దేశం దేశంగా ఉంటుందా! లేక చీలికలు వస్తాయా అని ఆనాటి పరిస్థితులతో పోల్చిచూచి చేయునది లేక అయ్యో రామాచంద్ర! యేమి స్వతంత్రం, యేమీ సమాజం ఇది అని పరితపిస్తూ కూర్చున్నాము. చదువుకొని పరదేశాలకు వలసపోయి మాతృదేశమని మరలి వచ్చి దుఃఖిస్తున్న భారతీయులం.

అంతేకాదు! ఈనాడు స్వాతంత్ర్యయోధుల సంఘం వారికి విలువైన సిటీకి దగ్గరి రాజకీయ బాధితులకు భూములు. అవి ఈనాడు లక్షలు విలువకట్టే భూములు. వీరికి పెన్షన్‌లు. వీరికి యెన్ని ఉచిత వసతులు. అయితే స్వర్గీయులైన రాజకీయ బాధితులకు యే సంఘం ఉంది. ఆనాడు స్వాతంత్ర పోరాటంలో బలియైనవాడు దేశభక్తితో బలియైనాడు కాని, ఈ లాభాల కోసము బలి కాలేదు. నిజమైన దేశభక్తుడు ఎవడు? నేను రాజకీయ బాధితున్ని నాకు లాభాలు కావాలి అని అడగడు. వీళ్లంతా స్వార్థపరులైన రాజకీయ బాధితులే, అవకాశవాదులే.

అబ్బా! ఎంత స్వార్థం పెరిగిపోయింది ఈ నా భారతావనిలో. నేను విద్యార్థిని, దేశస్వాతంత్ర్యానికై పోరాడినాను. ఇప్పుడున్న ఈ మహానాయకులు ఎక్కడున్నారు. నేను నా స్వార్థానికై పోరాడలేదు. నా దేశానికై పోరాడినాను. ప్రాణాలను పణంగా పెట్టి పోరాడినాను. దానికి ఫలితం కావాలనటంలేదు. నా కృషివల్ల సంపాదించింది, పాశ్చాత్య దేశాలలో నాకు చాలు, కాని ఈ కుళ్ళిన రాజకీయాలను చూచి నవ్వాలా, యేడ్వాలా తెలియక సతమతమవుతున్నాను.

విక్రం కృష్ణమోహన్ స్కూలునుండి రాగానే ముఖం కడుక్కున్నారు. తల దువ్వుకొని కూర్చోగానే, వంటవాడు విక్రంకు టీ, కృష్ణమోహన్‌కు పాలు తెచ్చినాడు. ఇద్దరూ మెల్లగా త్రాగి పేపరు చూస్తూ కూర్చున్నారు. పేపర్లో ఇప్పుడున్న ముఖ్య విషయాలు రాష్ట్రములో జరుగుచున్న సత్యాగ్రహాలు, వాళ్ల అరెస్టు, ఊళ్ళలో రజాకార్లు జరుపుతున్న ఘోరాలు. హైదరాబాదును స్వతంత్ర రాజధానిగా ఉంచవలసిన ఎత్తులు. ఎంత మందిని జైళ్లలో ఉంచిన విషయాలు తప్ప మరేమి ఉండవు. కానీ బయటి నుండి వస్తున్న 'హిందూ' మరి 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో రజాకార్లు చేస్తున్న అరాచకమైన పనులు, అక్రమాలు, అన్యాయాలు వస్తున్నాయి. ప్రజలు ప్రత్యేకంగా ఈ ఉర్దులో ప్రచురిస్తున్న పేపర్లను నమ్మటం లేదు. ఒకటి రెండు పేపర్లు తప్ప అన్నీ స్వతంత్ర హైదరాబాదునే సమర్థిస్తూ రాస్తున్నవే. అందువల్ల విద్యార్థులు వీటిని His master voice అని అనేవారు. ఇప్పటికి ఇంకనూ ఈ బయటి పేపర్లు వస్తున్నవి. కాబట్టి వాస్తవాన్ని తెలుసుకుంటున్నారు. ఈ స్వతంత్ర హైదరాబాదును వాంఛించని ప్రజలు ఇంకా రవాణా, రాకపోకల సౌకర్యాలు హైదరాబాదుకు, ఆంధ్రకు మరియు మహారాష్ట్ర, కర్నాటకకు అంతరాయం కలుగలేదు. కాబట్టి వచ్చే పోయే వారితో భారతస్వాతంత్ర్యం యెప్పుడు వస్తుంది. అనాడే ఈ స్వతంత్ర హైదరాబాదు భారతదేశంలో కలవక తప్పదని ఆశించి కూర్చున్న వారికి ఈ రవాణా రాకపోకల సౌకర్యాలు ఎంతో మేలు చేశాయి.

హైదరాబాదు స్వతంత్రంగా వుందామన్నా దీనికి ఒక ఓడరేవు లేదు కదా. ఎలా స్వతంత్రంగా ఉంటాది అనే వాదన చేసేవారు. దానికి రజాకార్ల నాయకులు లోలోపల మచిలిపట్టణం ఓడ రేవును హైదరాబాదు స్వాధీనం చేసికోవాలని పతకాలు వేస్తూ ఉండిరి. అది అనాడు బ్రిటీష్‌వారు తలచుకుంటే, నిజాం సాధించునో యేమో కాని వారు భారతదేశాన్ని విడిచిపెట్టి పోయే సమయంలో ఈ సాహసానికి నాందీ వేస్తారా అని మరి కొందరు.

మొదట చెప్పినట్లుగా స్వతంత్ర హైద్రాబాదును స్థాపిస్తాము అని ఎన్నో అతి నూతన ఆయుధాలను ప్రోగు చేసుకొనుచున్నారని ఆ ఆయుధాలను కావలసినంత డబ్బును ఖర్చుపెట్టి విమానాలలో హైద్రాబాదుకు చేరుస్తుండిరి. అనాడున్న భారతసేనలలో ఈ విమానాలను అపై వైజ్ఞాన పరికరాలు లేకుండెను. అంటే ఈ విమానాలు ఆకాశములో ఎవరికి కానరాకుండ భారత air space ని దాటి హైదరాబాదు విమానాశ్రయములో దిగుచుండెను. ఎవరికి తెలియకుండా రాత్రికి రాత్రే అవి నిజాం సైనిక దళాలు వాటిని తరలించి, దాచి వుంచేదన్న మాట. ఈ విమానాలు ఇండియా స్వతంత్రమైన పిమ్మట కూడా అంటే August 15, 1947 తర్వాత

కూడా ఆయుధాలు నిజాంకు సరఫరా చేస్తూనే ఉండేవి. ఇందులో అనుకోదగ్గవాడు Sydney cotton ఇతడు ఒక Australian pilot ఈతని విమానములో ఆయుధాలు నింపుకొని భారత air space ను అతిక్రమించి హైదరాబాదుకు విమానాన్ని తెచ్చి, వాటిలోనున్న అన్ని ఆయుధాలను హైదరాబాదులో Dump చేస్తుండెను. వీటినన్నింటిని పాశ్చాత్య దేశాలలో కొని పిమ్మట హైదరాబాదుకు మోస్తూ వుండెడివాడు. భారతసేనలో ఈ విమానాన్ని గుర్తించి దీన్ని కాల్చివేయడమో లేక పట్టుకొనుటయో అనునది జరుగలేదు. ఎందుకంటె యిది ఆకాశంలో చాలా ఎత్తుగా యెగిరి హైదరాబాదుకు రాగానే క్రిందికి దిగుతుండెడిది. అందుకే మన భారత సేనలు గుర్తించలేదు.

August 15, 1947 ఒక ముఖ్యమైన దినము భారతచరిత్రలో. ఖండాలుగా చీలిపోయిన భారతము స్వాతంత్రాన్ని చేకూర్చుకుంది. గాంధీగారు రెండుగా చీలిపోయిన భారతికై ఒప్పుకో లేదు. కాని నెహ్రూగారు, పటేలుగారు ఒప్పుకున్నారు.

కాశ్మీరు, హైదరాబాదు తప్ప అన్ని princely states భారతదేశంలో కలసి పోయినవి. కాని హైదరాబాదు, కాశ్మీరు మాత్రం స్వతంత్ర దేశాలుగా నిలుస్తున్నాము అని చాటినవి. ఈనాటి నుండి హైదరాబాదులోని ప్రజలు, స్వాతంత్ర పోరాటాన్ని ఇంకా తీవ్రతరం చేసినారు. అందువలన రజాకార్ల దౌర్జన్యాలు మితిమీరి పోయినవి.

ఇది జనవరి 1947. ఇది హైదరాబాదులో చాలా చలిగా వుండే మాసము. చలితో పాటు మంచు కూడా కురుస్తుంటుంది. అందువల్ల ఉదయం చలి నీళ్లతో ముఖం కడుక్కోవాలన్నా కష్టమే. చాలామంది స్నానాలు వేడి నీళ్లతోనే చేస్తుంటారు. అందుకు exception వుంటుందేమో కాని విక్రం మరి కృష్ణమోహనునకు వంటవాడు మాత్రము రాగితో చేసిన బొగ్గు బాయిలర్‌లో నీళ్లు వేడి చేసి ఉంచేవాడు. ఇద్దరూ ఈ వేడి నీళ్లతో స్నానం చేసిన కొంచెం సేపటికి break fast చేసి బట్టలు వేసుకొని స్కూలుకు వెళ్లాలనుకున్నారు. ఇంతలో వెంకటకృష్ణుడు వచ్చి ఇవ్వాళ్ళ అన్నీ స్కూల్స్‌కు హడ్తాల్ అంతేకాదు, అన్ని హైస్కూళ్లు మరి కాలేజి విద్యార్థులు అఫ్జల్ గంజు మీదుగా మరి అబిడ్స్ నుండి నిజాం కాలేజీకి వెళ్లుచున్నారు. అక్కడ ఒక బహిరంగ సభ జరుగుతుంది. అందులో విద్యార్థి నాయకులు ఉపన్యసిస్తారు. అని అన్ని వివరాలు పూస గ్రుచ్చినట్లు వివరించెను. అంతేకాదు రెసిడెన్సీ ఆ ప్రాంతంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులు ఈ ఊరేగింపులో కలుస్తారు కూడా. అని చెప్పి మీరు స్కూల్‌కు ఎలా పోతారు.

కృష్ణమోహన్ అసలే పోవద్దు! చిన్నవాడు, హాని గలిగే అవకాశమువుంది. కావలిస్తే నీవు రమ్ము అని విక్రంతో అనెను.

విక్రం సరే! మనము అందరితో కలిసి పోయేది కదా స్కూలుకు వెడలితే యెట్లాగైనా ఊరేగింపులో కలుస్తాము. కాబట్టి నీవన్నట్టు కృష్ణమోహన్‌ను ఇంట్లో ఉంచుదాం. మనమిద్దరము స్కూల్‌కు వెడదాం అని విక్రం సలహా ఇచ్చెను.

ఇద్దరూ సరేనని పుస్తకాలు ఇంట్లో పడేసి. ఒక నోట్ బుక్కును తీసుకొని స్కూలుకు వెళ్లిరి.

స్కూలులో ప్రవేశించగానే పిల్లలంతా గుమిగూడి హడ్తాల్ (strike) విషయమే మాట్లాడుకుంటున్నారు. ఇచట 8వ తరగతి నుండి 10వ తరగతి అంటే దీనిని సీనియర్ ఉన్నత పాఠశాల అనవచ్చు. 10వ తరగతి public board exam బాగా చదవవలసి వుంటుంది. క్లాసులలో పిల్లలెవ్వరూ లేరు. కొంత మంది టీచర్ల ప్రోద్బలం వున్నట్లుగానే తోచింది విక్రంకు, వెంకటకృష్ణుడికి. వీళ్ళిద్దరూ కూడా యేదో ఒక గుంపులో చేరి ఈనాటి హడ్తాల్ విషయమై మాట్లాడుతున్నారు. ఇందులో చాలా తక్కువ మందికి స్వాతంత్ర్య ఉద్యమమును గురించి కొంచమే తెలుసు.

చాలామంది పాపం, చదివి యేదో ప్రభుత్వ ఉద్యోగం చేస్తామన్న ఆశతో చదువుతున్నారు. వారికి ఈ హడ్తాల్‌తో సంబంధము అంతగా ఉండదు. ఇక core group నాయకత్వం వహిస్తాయి. ఈ group, very active group యీ హడ్తాలులో.

వెంకటకృష్ణుడు ఈ గ్రూప్‌కు చెందినవాడు. విక్రం కూడా వెంకటకృష్ణుని కన్న కొంచెం తక్కువ. కాని సమయం వచ్చినప్పుడు హడ్తాలును సమర్థిస్తాడు. ఆనాడు జరిగిన ప్రతి హడ్తాల్ సమర్థించినాడు కాని అనవసరంగా ఎప్పుడు హడ్తాలు జరిపి తమ విలువైన సమయాన్ని వృధా చేయడం ఆయనకు ఇష్టం లేదు. కాని అది దేశస్వాతంత్ర్య సమస్య. ఈ దాస్యశృంఖలముల నుండి విముక్తి చెందుటకై మనము యెన్నో హడ్తాళ్లు చేసిన తక్కువ అని నిర్ణయించుకున్నాడు.

సామాన్యంగా ఈ core group కొన్ని అనవసరమైన హడ్తాళ్ళను కూడా జరిపించినారు. వాటిని విక్రం ఒప్పుకోలేదు, నాయకత్వాన్ని కూడా చేబట్టలేదు.

యేది యేమయితేనేమి! ఇది హైదరాబాదు విద్యార్థులంతా ఆనాడు చేస్తున్న హడ్తాలు. తురక విద్యార్థులు ఈ స్కూలులో కొద్దిమంది కాబట్టి, వారు యింటికి వెడలి పోయినారు. కొంతమంది very few జాతీయవాదులు ఈ హడ్తాల్లో పాల్గొన్నారు.

విక్రం మరి వెంకటకృష్ణుడు స్కూల్‌కు చేరిన గంటలోనే అందరు విద్యార్థులు నినాదాలు చేసుకుంటూ స్కూల్ నుంచి బయలుదేరినారు. కోఠి మెయిన్ రోడ్డులో అన్ని స్కూళ్లు మరియు కాలేజీలు మరియు యూనివర్సిటీ విద్యార్థులతో కలిసి పోయినారు. యీ మహాస్థానములో కొంత anti social elements కూడా కలిసి పోయినవి. ప్రతి స్కూలు, కాలేజి విద్యార్థులు వారి వారి స్కూలుగుంపులో వారి వారి నాయకుల వెనుక నడుస్తున్నారు. నినాదాలు ఆకాశాన్ని అంటుకొనుచున్నవి. వేలకొలది విద్యార్థులు శాంతియుతంగా యీ నినాదాలతో నిజాం కాలేజి grounds వైపు వెడలుచున్నారు.

యీ శాంతియుతమైన procession ను వెళ్లకుండా గ్రామర్ స్కూలు మరియు John Company మధ్యలో పోలీసులు ఆపినారు. మీరు అంత disperse అయిపోవాలె అని ఆ పోలీసు దళానికి సారధ్యం వహిస్తున్న ఆఫీసరు అన్నాడు.

కాదు! అని మేము శాంతియుతంగా మా support ను భారత స్వాతంత్ర్యానికి చూపిస్తున్నాము. యిది మా జన్మహక్కు! అని ఉస్మానియా యూనివర్సిటీకి చెందిన విద్యార్థి నాయకులు ఆ ఆఫీసరుతో వాదిస్తున్నారు.

ఆ ఆఫీసరు కోపంగా, అందంత యేమి లేదు! మీరు విద్యార్థులు, మీరు వెళ్లి మీచదువుల్లో నిమగ్నులు కండి! అని వాదిస్తున్నాడు.

అందరిని ఆ రోడ్డుపైన కూర్చోమని ముందున్న విద్యార్థి నాయకులు ఆజ్ఞాపించినారు. అందరు ఒక్కుమ్మడిగా ఆబిడ్స్ నుండి John Company వరకు రోడ్డు అంతా క్రిక్కిరిసినట్టు కూర్చున్నారు.

శాంతియుతంగా కూర్చొని నినాదాలు చేస్తే యేమి ఘోరం జరుగదని అనుకున్నారు ఆ విద్యార్థి నాయకులు. కాని అలా జరగలేదు! ఒక అయిదు నిమిషాలు విద్యార్థి నాయకులకు, Police Official కు వాదోపవాదాలు జరిగిన పిమ్మట, సరే! అని Police Officials వెనుకకు వెడలి వాళ్ల భటులకు tear gas group కు, లాఠీఛార్జి (lathi charge) చేసే వారికి orders యిచ్చినారు. వాళ్ల orders నోటి నుండి వెడలగానే tear gas shells, కూర్చున్న విద్యార్థుల మధ్యన burst అయ్యి tear gas ని వదలినవి.

దీనితో కొందరు విద్యార్థులు భయపడి, లేచి పరుగిడసాగినారు. యీ సమయాన్ని కనిపెట్టి unsocial elements యీ procession నుండి police వారిపైకి రాళ్లు, మరియు వేరే missiles ను రువ్వినారు. దానితో లాఠీఛార్జీ మొదలయ్యింది.

యింకా వీరిని భయపెట్టుటకు గాలిలో తుపాకులు పేల్చినారు.

వెంకటకృష్ణుడు ధైర్యంగా ముందు వరసలో ఉన్నాడు. అతని వెనుక విక్రం వున్నాడు.

లాఠీఛార్జి దెబ్బ ఒకటి వెంకటకృష్ణునిపై పడింది. దానితో అతడు ఇంకో దెబ్బ పడకుండా తప్పించుకొనుటకు ప్రక్కగా వెళ్లి John Company side walk నుండి ముందుకు పరుగెత్తి నిజాం కళాశాల చేరుకున్నాడు.

విక్రం కూడా అతణ్ణి అనుసరించినాడు.

మేము వెళ్ళిన పిమ్మట procession తో కలసి వచ్చిన unsocial elements బాగా police పైన రాళ్లు రువ్వినారట! కాబట్టి, police వారు గాలిలో కాల్చే కాల్పులు విడచి విద్యార్థులపైకి కాల్చినారట!

అప్పటికి కొంతమంది రోడ్డుమీద పడుకొని వున్నారట! కాని, తుపాకి గుండ్లకు ముగ్గురు విద్యార్థులు మరియు విద్యార్థి కాని వాడు (బహుశా anti-social group లోని వాడేమో) మరణించినారు.

అప్పటి కచ్చటే 15 మంది విద్యార్థులు గాయ పడ్డారు. కొందరు లాఠీ దెబ్బలతో, మరికొంతమంది తుపాకి గుండ్లతో.

ఆనాడు పోలీసులు మొదటిసారిగా సిటీలో విద్యార్థుల రక్తాన్ని ప్రవహింపజేసినారు.

పల్లెటూళ్లలో రజాకార్లు యిది యెప్పటినుండియో జరుపుచున్నారు. హైదరాబాదులో మొదటిసారిగా విద్యార్థుల రక్తాన్ని కండ్లారా చూసినారు. యీ నాజీలను మించిన నైజాము నవాబుగారి భటులు, యీ రోజు విద్యార్థులను రెచ్చగొట్టుటకు దోహదమయ్యింది. మరునాడు, యీనాడు జరిగిన ఘోరాలకు నిరసనగా విద్యార్థులు యెవ్వరూ క్లాసులకు పోలేదు.

అది మార్చి నెల! పరీక్షలకు బాగా చదువుతున్నారు. యీ హైస్కూలు బోర్డు పరీక్ష పాసైతే, జన్మజన్మలకు యీ హైస్కూలుకు నమస్సుమాంజలులు అర్పించి కాలేజ్ కి వెళతారు.

యీ యిద్దరు మిత్రులు పోటీచేస్తున్నారా? అన్నట్టు చదువుతున్నారు.

అప్పటికి వలె విక్రం యింట్లో combined study కాదు. యిప్పుడు యెవరి యింట్లో వాళ్లు వుండి చదువుతున్నారు.

వెంకటకృష్ణుడు 10 అయ్యేవరకు చదువునారంభించడు. విక్రం 10 కాగానే చదవడు. ఈ వేరు అలవాట్లు ఉన్నవారు కంబైన్డ్ స్టడీ ఎలా చేస్తారు? విక్రం మెడిసిన్ చదవాలే! అందుకే, 10వ తరగతి మంచి క్లాసుతో పాసైతే sciecnce biology లో సీటు దొరుకుతుంది.

పిమ్మట Intermediate మంచి మార్కులతో పాసైతే M.B.B.S. లో సీటు దొరుకుతుంది. యీనాటివలె ఆనాడు చాలా medical colleges లేవు. అప్పుడు Osmania Medical Collge ఒకటె. దానిలో మొదటి M.B.B.S. లో 50 మంది విద్యార్థిని, విద్యార్థులకు ప్రవేశము దొరికేది. ప్రతి విద్యార్థి Intermediate లో 2nd class లో పాసైతే Ist M.B.B.S. లో సీటు గ్యారంటీ.

కనీసము యిది విక్రం చదువుతున్న కాలంలో. అంతకు మునుపు యే విధానం పైన సీటునిచ్చేదో తెలియదు. కాని యెక్కువ విద్యార్థులు సాహెబులే. స్త్రీ విద్యార్థులు తక్కువగా వుండేవారు. అప్పుడు కూడా యిప్పటివలె మెడికల్ సీటు కష్టమే.

కాని, comparatively అప్పుడే కొంచెం కష్టమో యేమో? అని చెప్పుట కష్టం. యేది యెట్లైనా medicine తన జీవిత ధ్యేయంగా చదువుతున్నాడు విక్రం.

వెంకటకృష్ణుడు కూడా medicine కే చదువుతున్నాడు. అంతగా విక్రంకు వున్నట్టు వెంకటకృష్ణునికి medicine మీద ఆసక్తిలేదు. అయినా సీటు లభిస్తే చదవాలనుకున్నాడు. కాని, విక్రంకు దొరికితే అనే సవాలేలేదు. దొరికిచ్చు కుంటాను అని అతని పంతం.

అప్పుడే ఎండలు కొంచెం వేడిగా వుంటున్నవి. శీతలం నుండి ఎండలో ప్రవేశిస్తున్నాము. బసంత పంచమి వచ్చింది. రంగుల నీళ్లను తెచ్చింది.

హైదరాబాదు సిటీలో దీన్ని చాలామంది హిందువులు వేడుకతో జరుపుకుంటారు. రంగులు చల్లుకుంటారు. గుర్తున్న స్నేహితుల యిండ్లకు వెళ్లి, వాళ్లపైన రంగు చల్లుతారు. యీ విధంగా యీ బసంత పంచమిని హైద్రాబాదులో హోళీ పండుగ అంటారు. యిది కాముని పున్నమి అని పల్లెటూళ్లలో అంటారు.

సిటీలో కొంతమంది మాత్రము ముఖాలకు నల్లటి మసితో కలిపిన గ్రీజును పూస్తారు. యిది చాలా ఘోరము. ప్రతి పండుగ ఆనందాన్ని అందరు పంచుకోవలె! కాని, కొంతమంది చాలా బూతులతో నిండిన పాటలు పాడుతూ, బజార్లలో వెళ్లుతుంటారు.

విక్రంకు కూడా యీ పండుగ అంటే ఇష్టమే. కాని, దాన్ని vulgar గా చేస్తే యిష్టం ఉండదు.

ఆనాడు యింట్లోనే వుంటాడు. ఎచటకి వెళ్లడు. తమ్ముడు కృష్ణమోహను అన్నతోనే యింట్లో వున్నాడు. యింతవరకు ఎవరూ ఇతనిపై రంగులు పోయలేదు. బయటికి వెడితే ఎవరైనా రంగుల పోయవచ్చు. అందుకే, యింట్లో కూర్చున్నాడు. ఉదయం పది గంటల తర్వాత తలుపుపై ఎవరో knock చేసినారు. విక్రం వెళ్లి తలుపు తెరిచినాడు. పిచికారితో నింపియున్న రంగంతా ఇతనిపైకి చివ్వుమని పడింది. పోసిన వాడు వెంకటకృష్ణుడు. ఛా! యేమిటి వెంకట్ యిదంతా, నామీద అంటే యేమో అనవచ్చు, ఇంటి బండలమీద అంత రంగునీళ్లేమిటి? అని విసుక్కుంటూ అన్నాడు విక్రం.

యేముందిలే, కడిగితే బండలు clean అవుతాయి అని లోనికి ప్రవేశించినాడు వెంకటకృష్ణుడు.

యివ్వాళ్ల హోళి. బయటికి వెల్లవలె. లే! బయటికివెళ్లి యీ హోళీ వేడుకలు చూద్దాం, అని వెంకటకృష్ణుడు విక్రంను వాళ్ళ ఇంటికి తీసుకువెళ్లినాడు. ఇంటికి వెళ్ళి తన గదిలో కూర్చున్నాడు. అతనితో పాటు విక్రం కూడా కూర్చున్నాడు. వేడుకలు చూద్దామని గదిలో కూర్చున్నావు! యివేమి వేడుకలు నీగదిలో, అన్నాడు విక్రం. కూర్చో వేడుకలు చూస్తావు అన్నాడు వెంకట్. సరే! అని కూర్చున్నాడు విక్రం.

కొంతసేపట్లో, బావా! యిలా బయటికి రండి, రూంలో యేమి చేస్తున్నారు? అని వచ్చింది మనోరమ. అంతకుముందే రంగంతా ఆ లాన్‌లోనున్న చెట్లచాటున దాచి వుంచింది. యెందుకు? రంగు పోద్దామనుకుంటున్నారా, అన్నాడు వెంకట్. నాదగ్గర రంగు కనబడుతుందా అన్నది మనోరమ. సరే! అని వెంకటకృష్ణుడు బయటికి వచ్చినాడు. మెల్లమెల్లగా నడుచుకుంటూ లాన్‌లోకి ప్రవేశించాడు. మనోరమ కూర్చున్నది. కూర్చోండి బావగారు! అని అన్నది. లే! నా స్నేహితుడు విక్రం ఒక్కడు రూంలో ఉన్నాడు. అతన్ని కూడా పిలుచుకు వస్తానని లేచి విక్రంను పిలిచి, ముగ్గురు లాన్‌లో కూర్చున్నారు.

విక్రంకు చాలా సిగ్గు కొత్త వాళ్ల దగ్గర. మనోరమ just 13 యేండ్లుగల teenager. చాలా ఉత్సాహాన్ని కనబరుస్తోంది జీవితంపైన. అంతా aggressive కాదు, కాని అంత సిగ్గుగా కూడా కాదు. తెల్లటి యిస్త్రీ చేసిన చీర కట్టుకొని, లూస్ జడతో నిగనిగ సడలె యవ్వనంతో అందంగా కనబడుతున్న జవ్వని మనోరమ.

జీవితంలో తొలి యవ్వనంతో తొణికిసలాడుతున్న యీ మనోరమ 15 యేండ్ల బాలకునికి యెలా కనిపిస్తుందో మనము ఊహించగలము. any way! విక్రం, వెంకటకృష్ణుడు, మనోరమ లాన్‌మీద మాటాడకుండా మౌనంగా కూర్చున్నారు. యింతలో మనోరమ లేచి మెల్లగా చెట్ల చాటునుండి రంగు తెచ్చి వెంకటకృష్ణునిపై పోసెను. దాంతో వెంకటకృష్ణునిపైన, మరికొంచెం విక్రం పైనకూడా రంగు పడెను. వెంకటకృష్ణుడైతే రంగులో స్నానం చేసినాడు. అప్పుడు వెంకటకృష్ణుడు, అమ్మో!

యిందుకేనా నన్ను పిలిచింది. అని ఆమె చేతిలో నున్న రంగునంతా లాక్కొని ఆమెపైన కుమ్మరించాడు. దాంతో అక్కయ్యా అని లోనికి పరుగెత్తింది మనోరమ.

వనజమ్మగారు, పావని లోననుండి బావా మరదళ్లను చూచి నవ్వసాగిరి. సరే! మరి నీకు కూడా కొంచెం కావాలే గదా! అని పావనిని బయటికి రమ్మనెను వెంకట్. ఆమె, అబ్బే! నాకేమీ, భయమా! యివ్వాళ్ల బసంత పంచమే. అని తనుకూడా కొంత రంగు వెంకటకృష్ణని మీదికి పిచికారీ చేసెను. సరే మరి మీకు కూడా పోయాలి కదా! అని, వెంకటకృష్ణుడు ఆమెపైన చాలా రంగు పోసెను. దానితో ఆమె బట్టలు పూర్తిగా తడసిపోయినవి. విక్రం మాత్రం లాన్‌మీదనే కూర్చున్నాడు.

వారు ముగ్గురు రంగులతో ఆడుకొని లాన్‌మీదికి వచ్చి కూర్చున్నారు. యింతలో పావని మరియు మనోరమ స్నేహితులు కూడా రంగు తీసుకొని వచ్చారు. అందరు కలిసి కొద్దిసేపు ఈ బసంత పంచమి పండుగ చేసుకున్నారు.

హిందూదేశానికి యింకా స్వతంత్రము రాలేదు. పాకిస్తాను ఈ విషయములో spoiler గా పని చేస్తుంది. యీ భారతావనిని రెండు ముక్కలు చేస్తేనే స్వాతంత్ర్యము. లేనిచో, స్వాతంత్ర్యము వద్దన్న ధోరణిలో వున్నారు.

అప్పటి పాకిస్తాన్ జననము, నిశ్చయమయినది. అయినా, గాంధీ సారథ్యములో యింకా భారత ఐక్యతకై పోరాటము జరుగుచున్నది. బహుశా! నెహ్రూగారు కొంత నేర్పు, ఉదారత, శాంతంతో మెలిగితే యింకా రెండు సంవత్సరాలాగితే బహుశః దేశవిభజన జరుగకపోవునేమో అని కొందరు వాదిస్తారు.

యేది యెట్లైనా దేశవిభజన తప్పదని చాలామంది నిర్ధారించుకున్నారు. కాని యింకా దేశంలో అలజడులు జరుగుతూనే వున్నాయి.

భారతావనికి ఇంకా స్వతంత్రము రాలేదు. కాని ఆ గమ్యానికి చేరుకునేందుకు చాలా నెలలు లేవని చాలామంది అనుకొంటున్నారు. విక్రంకు అంత సూక్ష్మంగా రాజకీయాలు తెలియవు. అతడు యెక్కువగా తన సమయాన్ని చదువు మీదనే కేంద్రీకరిస్తాడు. కాని వెంకటకృష్ణునికి రాజకీయాలంటే చాలా యిష్టము. అందుకే యెంతసేపూ పత్రికలు చదువుతుంటాడు. అయినా చదవాలి కదా high school board పరీక్ష పాస్ కావాలంటే! అందుకే, అపుడప్పుడు చదువుచుండేవాడు. పరీక్షలు చాలా దగ్గర వున్నందున యెక్కువ సమయాన్ని పరీక్షలకే యిప్పుడు యిస్తున్నాడు. విక్రం మాత్రం రోజు చదివినట్టే యిప్పుడు చదువుచున్నాడు. కాని late nights కూర్చొని చదివేది అతనితో కాని పని. కాని వెంకటకృష్ణుడు యింతవరకు యెక్కువగా చదవలేదు కాబట్టి రాత్రంతా చదువుతూ కూర్చుంటాడు. సిగరెట్లు కూడా కాలుస్తాడు, దానికి తగ్గట్టు టీ కూడా చాలా త్రాగుతాడు. యివి రెండూ లేనిదే అతని చదువుకాదు. అప్పుడప్పుడు సమస్యలు ఉంటే విక్రంతో చర్చించేవాడు.

పావని, మనోరమలకు కూడా పరీక్షలే కాని అవి board పరీక్షలు కావు. పావని 8 తరగతి పరీక్ష, మనోరమ 7 వతరగతి పరీక్ష, వాళ్లు రోజూ చదువు ముగించి నిద్ర పోతారు. కావున వారికి యిప్పుడు అంతగా చదవవలసిన అవసరములేదు.

కాని పరీక్ష అంటే ప్రతి వారికి భయమే. అందువల్ల పరీక్షల ముందు ఎక్కువగానే చదువుతారు కాబట్టి, వెంకటకృష్ణుడు రాత్రింబవళ్లు చదువుతుంటె పావని మనోరమ 11 లేదా 12 గంటలకు నిద్రపోతారు.

చూస్తుండగానే పరీక్షలు వచ్చినవి. రోజుకు ఒక పేపరు చొప్పున ఒక కేంద్రంలో పరీక్షలు జరుపుతారు. ఇటువంటి కేంద్రాలు సిటీలో నాలుగున్నాయి. జిల్లాలలో కూడా వున్నాయి. పరీక్షలఫీజు కట్టిన కొన్ని రోజులకు hall tickets ని యిచ్చేది. దీనిలో నీవు యే centre కు వెళ్ళవలసినదీ, hall ticket no. మున్నగు విషయాలు వుంటాయి. విక్రం మరి వెంకటకృష్ణుడు ఒకే centres లో పడ్డారు. వీరు ఒకరికొకరు సమీపంలోనే ఉన్నారు కూడా.

అనాడు విక్రం మరి వెంకటకృష్ణుడు పొద్దున్నే లేచి revise చేసినారు. విక్రం మాత్రం అంతగా పట్టించుకోలేదు అనాడు. ఎందుకంటే, అతడు అన్నిటిని బాగా చదివినాడు. వెంకటకృష్ణుడు మాత్రము తీవ్రంగా చదువుతున్నాడు. విక్రం అతని గదికి వెళ్లి ఈ eleventh hour లో యేమి చదువుతావు. కొంచెం మెదడుకు రెస్టు కావాలి, పుస్తకాలు మూసెయ్యి అన్నాడు. కాని వెంకటకృష్ణుడు, లే! ఈ సమయము నాకు చాలా ముఖ్యము విక్రం. Please! నన్ను disturb చేయకు! అని కొన్ని పత్రికలు విక్రం ముందట వేసి వాటితో busy గా వుండుమన్నట్లుగా మూగభాషలో చెప్పినాడు. విక్రం చేసేది లేక ఊరకున్నాడు.

Center కు పోవుటకు అరగంటనే వున్నది. వెంకటకృష్ణుడు లేవడు, తయారుకాడు. విక్రంకు విసుగు వచ్చి సరే! ఇక సమయం లేదు, నేను వెళుతున్నాను అని వెళ్లెను. అప్పుడు వెంకటకృష్ణుడు బట్టలు వేయనారంభించెను. వెంట్రుకలను దువ్వుకొని యింకా నోట్స్ చదువుతూనే బయలుదేరెను. ఒక టాంగాను తీసుకొని యిద్దరూ ఆ పరీక్ష సెంటరుకు చేరుకొన్నారు. అప్పటికి ఇంకను 5 నిమిషాల సమయమున్నది హాలులో ప్రవేశించుటకు. వెంకటకృష్ణుడు నోట్సును చూసుకొంటూనే వున్నాడు. కాని విక్రం మాత్రం స్నేహితులతో విషయమునును discuss చేస్తున్నాడు. ఇంతలో గంట మ్రోగగా అందరూ హాలులోకి ప్రవేశించి, వారి వారి నంబర్లను వెతికి ఆయా కుర్చీలమీద కూర్చున్నారు. కూర్చున్న పిమ్మట పరీక్ష పత్రాలు మరియు answer books అందరికి యిచ్చినారు. టైము మూడు గంటలు. యీ పరీక్ష పూర్తిచేయుటకు మూడు గంటలుకాగానే యివి మీరు మాకు యిచ్చి హాల్ నుండి వెడలిపోవాలి అని Chief Invigilator అందరు వినునట్టుగా చెప్పిరి. పిమ్మట అందరూ పరీక్షా పత్రమును చదివి జవాబులు వ్రాయ మెదలుపెట్టిరి.

వేరే అప్పుడు వీళ్ళ behaviour ఎలా వున్నా ఈ పరీక్షా హాల్ లో ప్రతివాడూ పరీక్ష వ్రాయుటకు మనస్సును కేంద్రీకరించుతారు.

వందలాది విద్యార్థులును ఆ హాల్ లో pindrop silense వున్నదిప్పుడు. అప్పుడప్పుడు కొంచెం దగ్గిన చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దం. ఎవరి అలోచన, వ్రాత వాండ్లది. ఇందులో నూటికి 20 మందే ఉత్తీర్ణులౌతారు. తక్కినవారు పరీక్ష తప్పుతారు. ఆ పాసైన వారిలో నూటికి ముగ్గురు లేదా నలుగురు Ist class లో

పాసౌతారు. మరి నూటికి యెనమండుగురు 2nd class లో, మరి తక్కిన వారు 3rd class లో పాసవుతారు. ఇది ఇంతవరకు వస్తున్న averages. ఇది అనాటి విద్యా విధానము పరీక్షా ఫలితాల జాబితా. ఈనాడు బహుశా, standard చాలా తగ్గినవి. యూనివర్సిటీలో standard లేనప్పుడు యిక యిప్పటి high school standards ను అడుగవలెనా? యిప్పుడు యే percentage high school నుండి పాసౌతారో కాని, collage లో మాత్రము చాలా percentage Ist class, పిమ్మట కొందరు 2nd class, 3rd class లో మాత్రము చాలా తక్కువ ఉత్తీర్ణులౌతారు. I class pass percentage చాలా ఎక్కువ ఈనాడు. ఈ నలభై ఏండ్లలో standred ని తగ్గించారా? లేదా విద్యార్థులు చాలా smart గా తయారయినారా? press report లను బట్టి చూస్తే ఈనాడు విద్యావిలువలు తగ్గినవి. ఈనాడు చదివేది విజ్ఞానార్జించుటకు కాదు, ఒక కాగితపు diploma సంపాదించుటకు. ఇది మన విద్యావిధానం యొక్క దురదృష్టమనియే చెప్పాలి. అనాడు paper out అయితే దానిలో ఉన్న ప్రశ్నలకు జవాబులు నేర్చుకొని పరీక్ష వ్రాసి వచ్చేది కాని, ఈనాటి విద్యార్థులకు అంత ఓపిక కూడా లేదు. వారు పరీక్ష పత్రాలకు ఉత్తరాలు వ్రాయించి, వాటిని పరీక్ష హాలులోనున్న supervisors కు యిచ్చి పాసవుతారు. ఈ మహాయజ్ఞములో విద్యార్థులే కాక రాజకీయవాదులు కొంతమంది దురాశ పీడితులైన ప్రొఫెసర్స్ మరియు విద్యావిధానానికి సంబంధిచిన ప్రతివారు ఉంటారని వదంతి. దీన్ని బట్టి చూస్తే మనదేశము ఎంత దిగజారిపోతుందో తెలుసుకొని, నవ్వాలో యేడ్వాలో అర్థం కావటంలేదు.

Any way! విక్రం రెండు గంటలకు తక్కువ సమయంలోనే ఆ ప్రశ్నలకు సమాధానాలు వ్రాసి పిమ్మట 15 నిమిషాలు revise చేసి paper invigilator కు ఇచ్చి బయటపడ్డాడు. ఇక యేమి చేయాలనో తోచక ఇంటికి వెడలి నిద్రించినాడు.

పాపం వెంకటకృష్ణుడు తనకు జ్ఞాపకమున్న ప్రశ్నలకు తొందరగా జావాబులు వ్రాసినాడు. పిమ్మట తనకు జవాబులు రాని ప్రశ్నలపై ఆలోచిస్తున్నాడు. ఎంత ఆలోచించినా తను ఈ ప్రశ్నలకు జవాబులు చదివిన దాంట్లో లేనట్టుగా తోచింది. అందుకే guess చేసి ఆ కొన్నిటికి జవాబు వ్రాసినాడు, ఇంకా ఎంతో సమయం లేదు. గడియారము చూచుకొన్నాడు. ఇక 5 నిమిషాల సమయమే మిగిలినది. తొందరగా జవాబులను revise చేయ మొదలిడినాడు. కొంతవరకు కొన్ని తప్పులను దిద్దినాడు. కాని సమయం లేనందున అన్ని మొదలు వ్రాసిన జవాబులలో తప్పులు వున్నావో, లేవో కూడా తెలియకుండానే పేపరు బల్లపైన నిడి exam hall లో నుండి బయటపడ్డాడు. ఇంటికి చక్కగా వెళ్లి పడుకున్నాడు. రాత్రంతా నిద్రించ లేదు పాపం. అందుకే సాయంకాలం ఆలస్యంగా లేచినాడు. భోంచేయుటకు వెడలినాడు. భోజనం టేబుల్ పై వనజత్తయ్య, పావని, మనోరమ కూడా ఉన్నారు. ఎలా వ్రాసినావు బావా! అంది మనోరమ. ఏమో! చెప్పుట కష్టం అన్నాడు. వెంకటకృష్ణుడు.

అన్ని పరీక్షా ఫలితాలు పేపర్స్‌లో పడినప్పుడే తెలుస్తుంది అన్నాడు. వనజమ్మ వెంకటకృష్ణునితో బాగానే చదివావు కదా వెంకట్ అంది. అం చదివాను అన్నాడు. ఇంతటితో అందురు ఏమి మాటాడలేదు. లేచి చేతులు కడుక్కొన్నారు.

వెంకటకృష్ణుడు తన గదిలోకి వెళ్ళినాడు. బట్టలు వేసుకొని సరాసరి విక్రం ఇంటికి వెడలినాడు.

విక్రం తన గదిలో చదువుతున్నాడు. వెంకటకృష్ణుని రాకతో విక్రం పుస్తకం బల్లపైన వేసి, వెంకటకృష్ణుని వైపు మరలినాడు. మరలటమే తడవుగా ఎలా ఉంది పేపర్ విక్రం! అని ప్రశ్నించాడు వెంకట్.

ఫరవాలేదు! బాగానే ఉంది అన్నాడు. పిమ్మట ఇతడు guess జేసి వ్రాసిన జవాబులు సరైనవా లేదా అని అడిగినాడు.

విక్రం : యివి ఫలానా chapter లో నున్నవి కదా. అని పుస్తకం తెరిచి చూపించాడు.

వెంకట్ : అప్పుడు నా guess ఈ ప్రశ్నకు correct. కాని వీటికి మాత్రము నా guess, wrong అన్నాడు వెంకట్.

సరే! యిప్పుడు చేసేదేముంది? Let us wait for the results అన్నాడు విక్రం. ఇద్దరూ ఆ పరీక్ష గురించి కొంచెంసేపు మాట్లాడినారు. పిమ్మట కొంచెంసేపు walk చేసినారు. తదుపరి వెంకటకృష్ణుడు తన గదికి వెళ్లి పోయినాడు. విక్రం ఇంటికి వచ్చి భోంచేసి తన చదువు మొదలు పెట్టినాడు.

కాలచక్రం ఎవరికోసం ఆగదు. అందుకే పరీక్షలు అయినాయి. విక్రం, కృష్ణమోహన్ వేసవి సెలవులకు తన ఊరు వెడలినారు. అట్లే వెంకటకృష్ణుడు కూడా కొన్ని వారాల తరువాత తన ఊరు వెళ్లినాడు.

మేనత్త, 'మరదళ్లు తమ ఊరికి వెళ్లినారు. విక్రం ఇంట్లో ఎవరూ లేరు. ఇంటికి తాళం వేసి వుంది. కాని వెంకటకృష్ణుని ఇంట్లో పనిమనుషులు out house లో వున్నారు. రోజూ వాళ్లు తోటలోని చెట్లకు నీరు పోసి కలుపు తీస్తారు. ఇల్లు బయట అంతా శుభ్రంగా వుంచుతారు. కాని ఇంటి యజమాని లేనందున వాళ్లకు పూర్తి స్వేచ్ఛ.

అప్పుడప్పుడు పావని, మనోరమ స్నేహితురాండ్రు వచ్చి పనివాళ్లతో పావని, మనోరమ యెప్పుడు వస్తున్నారని వాకబు చేసి పోతుంటారు. వనజమ్మ కొన్ని వారాలుండి మళ్లీ సిటీకి వచ్చి వారి ఇంట్లో ఉంటారు. పిల్లల స్కూళ్లకు సెలవులున్నా ఒకసారి పట్టణ జీవితనికి అలవాటు పడ్డాక వూళ్లో ఎన్ని సౌకర్యాలున్నా వూళ్లో వుండబుద్ధికాదు. అందులో ఆనాడు వూళ్ళలో యే సౌకర్యాలు లేకుండె గదా! సిటీలో విద్యుద్దీపాలు, సినిమాలు మొదలగు నవీన సౌకర్యాలు వుంటుండే. అందువల్ల కొద్ది వారాలు ఉండి, మళ్లీ సిటీకి వచ్చినారు. వీరు వచ్చిన కొద్ది రోజులకే వెంకటకృష్ణుడు కూడా వచ్చినాడు. మళ్లీ ఇల్లు మునుపటివలెనే సందడితో కళకళలాడుచుండెను.

ఇప్పుడు స్కూళ్లకు సెలవులు. కాబట్టి ఏమైనా కొత్త పుస్తకాలు చదివియో, రేడియో కార్యక్రమాలు వినియో లేదా అప్పుడప్పుడు స్నేహితులతో picknic కి వెళ్లడమో జరుగుచుండేది. ఇంకా ఎండలు వున్నందున పొద్దంతా ఫ్యాన్‌ల కింద ఏదైనా చదువుటయో, నిద్రించుటయో లేదా ఏవైనా పచ్చీసు, కార్డ్సు ఆటలు ఆడి సాయంకాలం కాగానే తయారయ్యి, సినిమాకు పోవడమో లేదా స్నేహితుల, చుట్టాల ఇండ్లకు వెళ్లడమో జరుగుచుండెను. ఇలాగే మే నెల కూడా ముగియుచున్నది.

జూన్ నెలలో ప్రవేశించారు. ఈ ఎండలు ఇక పోవును. వర్షాకాలం ప్రారంభమగును. స్కూళ్ళు ఎప్పటితీరుగా తెరువబడును. మళ్లీ పాఠాలు, చదువులన్ని routine గా జరిగిపోవును.

జూన్ రాగానే విక్రం, కృష్ణమోహనులు కూడా వంటమనిషితోను ధర్మారావు, శ్రీలతతో కూడా పట్నం వచ్చేసినారు. ఊరినుండి తినుబండారాలు, వంటకు కావలసిన బియ్యం, పప్పులు తీసుకొచ్చారు.

ధర్మారావు, శ్రీలత కొద్దిరోజులు ఉండి పిల్లలకు కావలసిన సౌకర్యాలన్ని కూర్చి ఊరికి వెడలిపోయినారు.

ఇప్పుడు మళ్లీ విక్రం ఇంటి పెద్దరికం తనదే. ఆనాడు పేపర్‌లో వాళ్ల public exam (H.S.E.) results publish చేయబడ్డాయి. విక్రం I class లో ఉత్తీర్ణుడైనాడు. వెంకటకృష్ణుడు 2nd class లో ఉత్తీర్ణుడైనందుకు చాలా సంతోషించినాడు. తనకుతానే అభినందించుకున్నాడు. విక్రం I st class వచ్చి కూడా అంతగా excite కాలేదు, కాని తృప్తిపడ్డాడు.

యిక college లో ప్రవేశించుటకు ప్రయత్నించాలె. ఆనాడు ఈనాటివలె కాలేజ్ సీట్లకు అంత కష్టం లేకుండెననియే చెప్పాలి.

I class & 2nd class కైతే తప్పని సరిగా హైదరాబాదు నాలుగు కాలేజీల్లో దేంట్లోనైనా దొరకవలసినదే. యిక 3rd class లో పాసైన వాళ్లకు కూడా చాలా మందికి దొరికేది. ఎందుకంటే ఆనాడు 3rd class average 90% వున్న ఇంగ్లీషులో 50% రాకపోతే I class ఇవ్వరు. అలాగా 40% ఇంగ్లీషులో లేకపోతే 90% వచ్చినా 3rd class. ఈవిధంగా యెంతో మందికి 2nd class, Ist class మార్కులున్న వారి ఇంగ్లీషు మార్కులు సరిగా లేవందున, వారికి క్లాసురాదన్నమాట. ఇటువంటి వాండ్లకు వాళ్ల high marks వల్ల కాలేజీలో admission వచ్చేది. ఆకాలంలోని ఈ విధానం చాలా విచిత్రమైనదే కాని. అవి అనాటి రూల్స్ వాటివి అందరూ పాటించినారు. ఇక రెండవ విషయమేమిటంటే science college లో admission రావాలంటే ఈ class ముఖ్యం కాదు. నీ high school optional subject higher maths అయి వుండాలే. నీవు medicine, engineering, agriculture, veternery science కు వెళ్లాలంటే నీకు science college లో admission రావలె. అప్పుడు యిదివరకన్నట్టుగా సిటీలో మూడు కాలేజీలు, ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఒకటి మరియు వరంగలులో ఒక కాలేజ్, మొత్తం నాలుగు కాలేజీలు మరియు ఒక విశ్వవిద్యాలయము. మార్కులు తక్కువ వచ్చి 3rd class పాసైన వాళ్లకు యే కాలేజీలో కూడా admission దొరుకుట కష్టమే. కాని influence ఉన్నవారికి యేదో విధంగా admission దొరికేది.

విక్రం, వెంకటకృష్ణుడు వున్న మూడు కాలేజెస్ మరియు ఉస్మానియా విశ్వవిద్యాలయములో అడ్మిషన్‌కై దరఖాస్తు పెట్టుకున్నారు. అన్నింటిలో ఇద్దరికి అడ్మిషన్లు దొరికినవి. ఒక కాలేజీలో సైన్సు లేదు. కేవలము అందు arts subject నే చదివిస్తారు. అందులో చేరుట out of question ఎందుకంటె ఇద్దరు

science biology ను చదువదలచుకున్నారు. అన్నీ బాగా ఆలోచించిన పిమ్మట ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఫీజు కట్టినారు. దానితో వీరి అడ్మిషన్ పని అయిపోయింది. అప్పట్లో ఆ విశ్వవిద్యాలయములో చదువుతున్న అందరు విద్యార్థులు యూనిఫారంలో వెళ్లాలి. అప్పటి యూనిఫారం నల్ల శేర్వాని. ఇద్దరూ నల్ల శేర్వానీల జతను కుట్టించుకున్నారు. కాచిగూడా చౌరస్తా నుండి విశ్వవిద్యాలయానికి బస్సులు వెళ్లేది direct గా. యిద్దరూ బస్సు పాసులు కొన్నారు. రోజూ 9 గంటలకు కాచిగూడ చౌరస్తా నుండి బస్సులెక్కి ఆర్ట్స్ కాలేజ్ ముందు దిగేది. పిమ్మట ఆర్ట్స్ కాలేజ్‌లో ఇంగ్లీషు class attend చేసి science class కు మూడు సైన్స్ భవనాలకు వెళ్లేవారు. యిద్దరు science biology తీసుకున్నారు కాబట్టి, కొన్ని తప్ప అన్ని class లకు ఇద్దరూ కలిసిపోయేవారు. అప్పుడప్పుడు విక్రం తన ల్యాబ్ తొందరగా పూర్తిచేసి వెళ్లిపోయేవాడు. కాని వెంకటకృష్ణుడు ఆలస్యంగా experiments finish చేయుట వలన ఆలస్యంగా ఇంటికి వెళ్లేవాడు. biology లో ప్రత్యేకంగా zoology లో విక్రం ఎప్పుడూ తన చేతితో disection చేయలేదు. ఆ గ్రూపులోనున్న యెవరో ఒకరు specimen disection చేస్తే labeling విక్రం చేసేది. కాని speciman లను చేతితో ముట్టిన పాపాన పోలేదు. అంతేకాదు ఆ disection జరిగిన రెండు రోజులు టీ త్రాగే బ్రతికేది.

ఇతడు విజిటేరియన్, ఇతని చిన్నారి తమ్ముడు కూడా విజిటేరియన్. విక్రం పుట్టుకతోనే మాంసాన్ని, చచ్చిన పశువులను లేదా పశువుల బొక్కలను చూస్తే రెండు మూడు రోజులు అన్నం ముట్టకపోయేది. ఇటువంటివాడు ఎలా డాక్టరు అవుతాడా? అని వెంకటకృష్ణుడు విక్రంని అడిగేది, కాని దీనికి విక్రం మౌనవ్రతుడయ్యేది.

ఉస్మానియా విశ్వవిద్యాలయము భవనాలు యూరప్ మరియు అమెరికన్ యూనివర్సిటీస్ భవనాలకంటే చాలా వైభవంగా ఉంటాయని కొంతమంది ఆచార్యులనేది. అది నిజమెంతో, అబద్ధమెంతో ఆ భగవంతునికి తెలుసు. కాని అప్పుడప్పుడే హైస్కూలు నుండి వచ్చిన ఆ విక్రంకు, వెంకటకృష్ణునకు ఈ భవనాలు చాలా వైభవోపేతంగా కనిపించాయి. అంతేకాకుండా విశాలమైన మైదానములు, ఉద్యానవనములు ఇది నందనవనమా! అన్నట్లు కనపడేది. కొన్ని నెలలలోనే విక్రం సిటీ ఇంటిలో తమ్ముడగు కృష్ణమోహన్‌ను వంటవాడిని విడచి యూనివర్సిటీ హోస్టలుకు వచ్చేసినాడు. ఆ హోస్టల్ భవనాలు రాజమందిరాలవలె నున్నవి.

ఆ హోస్టల్‌లో ఒక రూమ్‌లో ముగ్గురికన్నా ఎక్కువ ఉండరు. సామాన్యంగా మొదటి సంవత్సరము యిద్దరే ఒక రూంలో ఈ రూంల ముందు విశాలమైన స్థలము Ist floor అయితే, ముందు మంచి చెట్లు మరియు లాన్‌లు ఉంటవి. ఒక్క భవనము కొన్ని ఎకరాల భూమిని ఆలముకొంటుంది. ఎక్కువ స్థలము లాన్‌లకు పచ్చని fencing తో మరి పెక్కురకముల ornamental చెట్లతో కండ్లకింపుగా, చూడముచ్చటగా నుంటాయి ఆ హోస్టల్ భవనాలు. ఇక హోస్టల్‌లో నుండుట expensive కాదు. మొదటి సారిగా విక్రం హోస్టల్‌లో చేరినప్పుడు 15 రూపాయలు ఫీజు నెలకు. దీనిలో room rent, furniture rent, break fast, lunch

and dinner. వీటిని మ్యానేజ్ చేయుటకు విద్యార్థులు managing offcials ని తామే ఎన్నుకునేది. ఆ హాస్టళ్లు అన్నీ యూనివర్సిటీ రన్ చేసేది. అన్ని హాస్టల్స్‌కు ఓ chief warden మరియు ప్రతి హాస్టల్‌కు ఒక వార్డెన్ చొప్పున యూనివర్సిటీ represent చేసేది. మరి student elect చేసిన student officials దినదిన management ను చూసేది. అప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయం మూడు వేల ఎకరాల భూమిని ఆక్రమించుకొని పట్టణానికి నాలుగు మైళ్ల దూరములో వుండేది. దీనికి అప్పుడు బడ్జెట్ కొరత అంతగా లేకుండెను. ఇందులో విద్యనభ్యసించే విద్యార్థులు చాలామట్టుకు మొదలు మొదలు తురకవారై యుండిరి. కాని విక్రం, వెంకటకృష్ణుడు చేరిన కొద్ది సంవత్సరాలకు వాళ్ల సంఖ్య క్రమేణా తగ్గినది. ఈ హాస్టల్‌లో వుంటే విక్రంకు చదువు బాగా సాగుతుందన్న వుద్దేశ్యంతో ఈ హాస్టలకు మారినాడు. అతడు ఊహించినట్టుగానే ఆ ప్రశాంతమైన వాతావరణంలో చదువు బాగానే సాగింది. కాని కొందరి విషయంలో యిది వాస్తవం కాదు. కొందరు క్లాసులు కాగానే సిటీకి తిరుగబోయి, సాయంకాలం తిరిగి వచ్చి భోంచేసి హాయిగా పడుకునేవారు.

ఇక వెంకటకృష్ణుడు రావాలనుకున్నా హాస్టల్‌కు రాలేదు. ఎందుకంటే వనజమ్మకు మగదిక్కు అంటే వెంకటకృష్ణుడే. ఇప్పుడు వెంకటకృష్ణుడు లేంది ఆమెకు యేపనీ జరుగదు. ఆమెకు ఇంతమంది నౌకర్లున్నా, ఊళ్లో గుమాస్తా వున్నా వెంకటకృష్ణుడు లేంది ఆమెకు ఏ పని జరుగదు. అందుకే వెంకటకృష్ణుడు హాస్టల్‌కు రాలేదు. కాబట్టి క్లాసెస్ కాగానే వెంకటకృష్ణుడు విక్రం రూంలో చాలాసేపుండి పిమ్మట సిటీకి వెడలిపోయెడివాడు. day scholar గా విక్రంతోనే మధ్యాహ్నం భోంచేసేవాడు. అప్పుడప్పుడు మధ్యాహ్నం nap కూడా యిచటనే తీసుకొనేది.

ప్రతి వార్డుకు ఒక ward boy ఉండేవాడు. వీళ్లపని రూంలను శుభ్రంగా వూడ్చి, ఫర్నిచర్ అంతా దులిపి, ప్రక్క బట్టలను బాగుచేసి, శుభ్రంగా గదులను ఉంచి, ఇందులో వున్న విద్యార్థులు ఏ పని చెప్పితే, అది చేసి వాళ్లకు ఏ ఇబ్బంది లేకుండా చేయుట వారి కర్తవ్యము. ఆ పనిలో పాపము వీరు చాలా వరకు సిద్ధహస్తులే. పండగా, పబ్బాలకు వీళ్లకు కొంచెం బక్షీష్ ఇచ్చేవారు విద్యార్థులంతా. విక్రం కూడా ఈ ఆచారాన్ని పాటిస్తూ వచ్చినాడు. నిజంగా అనాటి ఉస్మానియా విశ్వవిద్యాలయము చాలా బాగుండేది. పోలీసు అధికారులు యూనివర్సిటీలో ప్రవేశించాలంటే వైస్-ఛాన్సలర్ అనతి లేనిదే ప్రవేశించలేరు. విద్యార్థులు చాలా freedoms ను enjoy చేసినారు. రజాకార్ల గొడవ ఉన్నా విశ్వవిద్యాలయ ఆవరణలో విద్యార్థులంతా చాలా సాఫీగా, నిర్భయంగా ఉండిరి. ఇప్పుడు ఇంకా జూలై మాసమే. భారతదేశానికి స్వాతంత్ర్యం రాలేదు. వస్తుందని స్థిరమైపోయింది ఆగష్టు 15, 1947 నాడు. అయినా విశ్వవిద్యాలయంలో శాంతియుత వాతావరణమే వుంది. విద్యార్థులు చదువుతున్నారు.

మా వార్డన్ ఒక senior professor. అతడు మొహమ్మదీయుడైనా చాలా మంచివాడు. హిందువులు, తురకలు అనే భేదభావమెప్పుడు చూపించలేదతను. విద్యార్థులతో చాలా సరదాగా వుండేవాడు. వాళ్ల రూంలలోకి వెళ్లి, వాళ్ల మంచి

చెడుల గురించి విచారించేవాడు. విద్యార్థుల రూంలలో తిరంగ జండాలను చూచి, మీ రూంలో మీకు పూర్తిగా అధికారాలున్నాయి. మీరు మీ జండాను యే సంకోచం లేకుండా ఎగురవేసికొండి. కాని మీ రూం బయట అలా ఎగురవేస్తే మీరు నన్ను ఇబ్బంది పెట్టినవారవుతారు. అంతవరకు రానివ్వరని ఆశాభావాన్ని వెలిబుచ్చి వెళ్లి పోయేవాడు.

విక్రం అతన్ని చాలా గౌరవించేవాడు. వేరే కొంతమంది వార్డనులు ఆ తిరంగా జండాలను రూంలలో నుండి తీయించేవారని విన్న. వాళ్లు నిజాంను support చేసే రజాకార్లతత్వం కలవారనుకుంటా. కాని విక్రం హాస్టల్ వార్డన్ మాత్రం చాలా freedom నిచ్చిన మహామనిషని విక్రం చెబుతూ వుండేవాడు తన స్నేహితులతో. ఇంకా అందరు విద్యార్థులు నల్ల శేర్వాణీతోనే క్లాసెస్‌కు వెళ్లాలి. సిటీకి వెళ్లినప్పుడు ఆ యూనిఫారంను చూసి పోలీసువారు ఈ విద్యార్థులను గౌరవించేవారట!

విక్రం week end లో సిటీకి వెళ్లేవాడు. యూనివర్సిటీ స్టేషన్‌లో యెక్కి, కాచిగూడాలో దిగి ఇంటికి వెళ్లి తమ్ముని చూచి, మంచి చెడులు అడిగి పిమ్మట వెంకటకృష్ణునితో కలసి హైస్కూలులో తిరిగి నట్టే తిరిగి చివరికి అయ్యర్ హోటలులో కాఫీ తాగి, పిమ్మట విక్రం హాస్టల్‌కు వెళ్లిపోయేవాడు, వెంకటకృష్ణుడు తన గదికి.

విద్యార్థులు ఆనాడు కూడా అల్లరి చేసేవారు. ఇందులో విచిత్రమేమియులేదు. కాని అల్లరి చేయు పిల్లవాళ్లు చదువులో శ్రద్ధవున్న వాళ్లు కారనే విక్రం అభిప్రాయం. విద్యనార్జించవలెనన్న సంకల్పమున్నవారు గురువుపై భక్తి చూపిస్తారు. మన భారత సంస్కృతిలో మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ, అని అంటారు. తలిదండ్రులపైన భక్తిభావాన్ని చూపించినట్టే గురువుపైన గూడా అట్టి భావాన్నే చూడాలని కదా! కాని విక్రం క్లాస్‌లో అంత fresh student. High school నుంచి పాసై వచ్చిన fresh men అందువల్ల మొదలు విక్రం కొద్దిరోజులపాటు ఆ అల్లర్లను సహించినాడు. కానీ రాను రాను అతనికి విసుగు వచ్చింది. ఆ అల్లర్లను చేసేవారు ఎక్కువ lower class కు చెందిన తురక పిల్లలే. ఈ క్లాసెస్ చాలా సాంకేతిక నైపుణ్యంతో కట్టించినవి. క్లాస్‌లో కుర్చీలు మరి వాటికే అమర్చిన desks చాలా ఖరీదైనవి. ప్రొఫెసర్ ముందు యీ కుర్చీలు బల్లలు మొదట వరుస అయిన పిదప 2వ వరుస కొంచెం ఎత్తు. మూడవది రెండవదానికన్నా ఇంక కొంచెం ఎత్తు. ఈ విధంగా ఆఖరుకున్న కుర్చీలు అన్నిటికన్నా యెత్తు ప్రదేశములో నుంటాయి.

యివన్నీ మంచి కట్టెతో చాలా అనుభవమున్న పనివారు చేసి అమర్చినవి.

ఏ ఆటంకము లేకుండా ప్రతి విద్యార్థి ప్రొఫెసర్‌ను తన సీటునుండి చూడ గలుగుతాడు. యిక కాళ్లక్రింద చెక్క floor. యీ విధంగా చాలా సాంకేతిక నైపుణ్యముతో ఆనాడు నిర్మించిన యీ క్లాసులు విద్యాసౌకర్యాలు చాలా అనుకూలమైనవని చెప్పక తప్పదు.

యిది fresh man class కాబట్టి క్లాస్ నిండి పోయేది. బెల్ కాగానే ప్రొఫెసర్ వచ్చేవాడు. అటెండెన్స్ తీసుకున్న పిదప తన ఉపన్యాసము ప్రారంభించాడో లేదో

అందరూ కాళ్లతో ఆ చెక్క floor పై ధంధం అని తన్నుతు అల్లరి చేసేవారు. యెంత సీనియర్ ప్రొఫెసర్ అయినా యీ చప్పుడులో చదువు చెప్పలేదు. కాబట్టి please do not make this noice. అని నాలుగు అయిదుసార్లు చెప్పి యీ చప్పుడు మాన్పించుటకు ప్రయత్నించేవాడు. కాని కొందరు అల్లరి విద్యార్థులు అలానే చప్పుడు చేయుచుండెడివారు. తుదకు ప్రొఫెసర్ కొంచెం సేపు చూసి చేయునది లేక క్లాస్ విడచి వెళ్లిపోయేవాడు. అనాడు పాఠాలు కృష్ణార్పణమే అయ్యేవి. విక్రంవంటి విద్యార్థులు నిరుత్సాహులై పోయేవారు. యీ విధంగా ప్రప్రధమంలో రెండువారాలు పాఠాలు వినుటకు వీలుకాలేదు. రాను రాను ప్రొఫెసర్ అల్లరి పిల్లలను బయటికి పంపించి మిగిలిన వారికి లెక్చర్ యిచ్చేవాడు. కొన్ని రోజులు యిలా చేయుటవలన అల్లరి పూర్తిగా తగ్గి క్లాసులు సాగినవి. ఆ అల్లరి మూకలు క్లాసులో వున్నా, వాళ్ల ఆటలు సాగలేదు. వారు ఒక గ్రూపులో వెనుక బెంచీల మీద కూర్చొనేవారు కాని, అల్లరి మాత్రము చేయలేని స్థితిలో నుండిరి.

యిప్పుడు అధిక సంఖ్యాకులు ప్రొఫెసర్ చెప్పేదివిని మంచిగా నోట్స్ వ్రాస్తున్నారు కాని అల్లరి మూకలకు అది అర్థమై చస్తే కదా! వీళ్ళకు చదువంటే ఆసక్తి లేదు. యేదో కాలేజ్‌కి పోతున్నారని మధ్య కుటుంబీకులైన తలితండ్రులను సంతోష పెట్టుటకే వీళ్లు కాలేజికి వస్తారనుకుంటా!

మనదేశములో ప్రతిది బ్రిటీష్ వారు నిర్మాణించిన ప్రకారమే నడిచింది. బ్రిటీష్ వారు మన దేశానికి రాకముందు మన కాలేజీలు యెట్లా ఉండేది? మన పరిపాలనా విధానము యెలాగవుండేది? ఈ న్యాయమూర్తులు మన న్యాయస్థానాలు యెలావుండేవి? ఒక మాటలో చెప్పాలంటే మన సమాజములో అన్ని institutions ఏ విధంగా నడిచేవి, అనే వివాదానికి మనము దిగటములేదు.

అవి బ్రిటీష్ వారు మనదేశాన్ని పాలించుటకు నిర్మించిన విధానాలు వేరే అనుకుంటా! బ్రిటీష్‌లో పార్లమెంటు విధానము పుట్టిందంటారు, మరి కొందరు అదికాదు, బుద్ధులకాలంలో యీ విధానము భారతదేశంలో పుట్టిందంటారు. యిది యెచ్చట పుట్టిందనేది ముఖ్యము కాదు. ముఖ్యమైన విషయమేమిటంటే, బ్రిటీష్ వారు మన దేశాన్ని ఆక్రమించుకున్న పిమ్మట ఈ దేశాన్ని వాళ్ళ ఆధిపత్యంలో ఉంచుటకు ఏవిధానం మంచిదో ఆ విధానాన్ని యిక్కడ అమలు పరచినారు. పోలీసు విధానము వాళ్ల దేశం నుంచి తెచ్చి పెట్టినదే, న్యాయవిధానం వాళ్లదే! administrative విధానము వాళ్ళదే! ఒక డెమోక్రసీ తప్ప వాళ్లు అన్ని విధాల వాళ్లు తమ దేశంలో ఉన్నవి మన నెత్తిపైన పెట్టినారు. అది యెందుకంటె ఈ దేశము వాళ్ల బానిసల దేశము. మనమంతా వారి subjects ము. అందువల్ల వీరి విధానాలు మనకు మంచివా! కావా, అనే ఆలోచనలేకుండానే మన పైన రుద్దినారు.

15th August 1947 మీకు స్వాతంత్రం అన్నారు.

మన నాయకులు మనకు రాజ్యాంగాన్ని తయారు చేసిన మహా మహులంతా ఇంగ్లాండులో చదివినవారే. అందులో కొంతమంది అమెరికాలోకూడా చదివినవారే. అయితే, వీరు మన దేశము యొక్క ప్రత్యేకతను లెక్కచేయకుండా వాళ్ళు యీ పాశ్చాత్య దేశాలలో గ్రహించిన రాజ్యాంగ విధానాన్నే, అంటే బ్రిటీష్ మరి అమెరికన్

రాజ్యాంగ విధానాలను సమ్మిళితము చేసి మనకు రాజ్యాంగాన్ని అతుకుల బొంతగా తయారు చేసి యిచ్చినారు.

అమెరికాలో పార్లమెంటరీ విధానము లేదు. అచ్చట ప్రసిడెంట్ డైరెక్ట్‌గా ప్రజలచే ఎన్నిక అయ్యి నాలుగేండ్ల వరకు దేశాన్ని పాలిస్తున్నాడు. కాని బ్రిటిష్ దేశంలో ప్రజలు తమ పార్లమెంటుసభ్యులను ఎన్నిక చేస్తారు. మరి ఈ పార్లమెంటు సభ్యులు ఒక ప్రైమ్ మినిస్టర్‌ని యెన్నికచేస్తారు. ఇప్పుడు యీ పార్లమెంటు విధానాన్నే అవలంబించినాము. ఇది దేశ పరిస్థితులు మామూలుగా వున్నప్పుడు.

యిక దేశపరిస్థితి అసాధారణ పరిస్థితిని యెదుర్కొంటున్నప్పుడు, Parliament dissolve అయినప్పుడు ప్రెసిడెంటు పరిపాలనను అంగీకరిస్తారు. అంటే సాధారణ పరిస్థితులు నెలకొన్నప్పుడు మన President British crown position లో నామమాత్ర పరిపాలకుడుగా ఉంటాడు.

ఏది ఎట్లైనా, మన రాజ్యాంగం మన సంస్కృతికి, మన చరిత్రకు మన సభ్యతకు నిదర్శనముకాదు. ప్రతిదీ మనము పాశ్చాత్యదేశాలనుండి తీసుకున్నాము. ఏదీ మన గత సంస్కృతిని, మన చరిత్రను, మన సభ్యతను రిఫ్లెక్ట్ చేయదు. అందుకే యీనాడు దేశములో యెటుచూచినా సమస్యలు పెరుగుచున్నవి కాని, తగ్గుటలేదు.

మనదేశాన్ని బ్రిటీష్ వారు పాలించినప్పుడు దీన్ని బ్రిటీష్ యిండియా అనేవారు. అంటే వారు మనలను పాలించేవారు. అయితే, యినాడుకూడా మన దేశాన్ని మనము బ్రిటీష్ యిండియా అనవచ్చు. పాలకులు వాళ్లుకారు, కాని పాలించే విధానమంతా అదే! యేవో కొన్ని superficial మార్పులు తప్ప.

అనాడు సోమవారం. విక్రం తన రూములోనుండి పుస్తకాలతో ఆర్ట్స్‌కాలేజీ వైపు నడుస్తున్నాడు. ఇంగ్లీషు క్లాసు అటెండ్ చేయుటకై. ఆర్ట్స్ కాలేజీ ముందు విద్యార్థులంతా నిలబడివున్నారు. అంతకు మునుపే సిటీ నుండి బస్సులు విద్యార్థులను తీసుకవచ్చి విడిచినాయి. వెంకటకృష్ణుడు కూడా ఈ సమూహాములో ఎవరితోనో మాటాడుతూ, నన్ను జూచి 'విక్రం' అని పిలిచాడు.

గొంతు వినగానే ఆగిపోతిని.

వెంకట్ విక్రంని సమీపించి, 'యెచ్చటికి వెడుతున్నావు? యివ్వాళ స్ట్రైక్, నీకు తెలియదా!' అన్నట్టు మాటాడినాడు. 'నిజంగా నాకు తెలియదు,' అన్నాను. 'సరే యిప్పుడు మనమంతా నిజాం కాలేజ్‌కు ప్రొసెషన్‌లో వెళ్ళాలి,' అన్నాడు. విక్రం యెందుకు అనకుండానే, 'సరే!' అన్నాడు. యిద్దరూ ఆ సముహములోనే నున్నారు.

కొంచెం సేపు వాళ్లు వీరితో వారితో మాటాడుకుంటు వుండగానే 'సరే మీరంతా ప్రొసెషన్‌లో చేరండి,' అని విద్యార్థి నాయకులు తెల్పగానే ఏవో నినాదాలు చేసుకుంటూ ప్రొసెషన్ కదిలింది.

నిజాం కాలేజీకి చాలామంది బస్సులలో సైకిళ్లపై వచ్చినారు. కొద్దిమంది మాత్రము మావలెనే ప్రొసెషన్‌లో నిజాం కాలేజీకి చేరుకున్నాము. కాలేజ్ ఆవరణలో చేరగానే వేలాది విద్యార్థులు ఆ ఆవరణలో వున్నారు. అందులో మొదటి సారిగా విద్యార్థినులను కూడా చూసినాడు విక్రం. ఎందుకంటే విక్రం మొదటి సారిగా నిజాం కాలేజీ ఆవరణలో అడుగు పెట్టినాడు. నిజాం కాలేజ్ డిగ్రీ

మరి Post graduate degree college తక్కిన రెండు కాలేజెస్ Intermediate colleges కాని Co-educational కాలేజెస్ కావు. Osmania University Science college కూడా Co-educational కాదు. హైదరాబాదులో ఒక నిజాం కాలేజీ Co-educational; Women's college లో కేవలం ఆడపిల్లలే వుంటారు.

Strict parda అచ్చట. అది పెద్ద గదిగోడల మధ్య ఉంటుంది. అచ్చటికి మొగ పురుగు కూడా ప్రవేశింపలేదు.

నిజాం కాలేజే ఒక college with co-education. ఇందులో ప్రవేశం కావాలంటే రెండు ఉండాలి. ఒకటి, Ist class లేదా High recommandation and good family background అంటే ఇప్పుడున్న ఈ కాలేజ్ విద్యార్థులు Ist class అయినా వుండాలి, లేదా Influential సంపన్నకుటుంబాలకు చెందిన వారైనా వుండాలి. యిప్పుడు మాత్రము అందరివలెనే వీళ్లు కూడా స్ట్రైక్‌లో నున్న విద్యార్థి, విద్యార్థునులు, అంతే.

ఈ కాలేజిలో, జీవితంలో రెండవ సారిగా విక్రంలో ఏదో అనుభూతో, మరి తెలియని ఆనందమో కలిగినది. బహుశా, ఇటువంటి అనుభూతే పావని పుట్టినరోజునాడు ఆమె చాలా మంది స్నేహితురాండ్రను చూచినప్పుడు కలిగినది. విక్రం యీ అనుభూతిని, ఆనందాన్ని తనలోనే దాచుకున్నాడు. అందరి విద్యార్థులవలెనే ఇతడు కూడా ఆ నాయకుల ఉపన్యాసాలు విన్నాడు. ఏదో కొద్దిమంది తప్ప చాలా వరకు వీరిలో వినాయకులని అనుకున్నాడు విక్రం.

స్వాతంత్ర్య సమరమని సంబోధిస్తున్నారు. కాని, వీళ్ళు మాత్రం సమరంలో అందరికన్న వెనుకనుంటారు. మరిఏమి తెలియని అమాయకులు ముందుండి తుపాకిగుండు దెబ్బలతో ప్రాణత్యాగం చేస్తారు. కాని, ఫలితం దొరికినప్పుడు మేము నాయకులం అని ముందుకు వెడతారు. యీ వినాయకులు. బహుశా, యీనాడు Freedom Fighter Association లో నున్న వారంత ఈతెగకు చెందినవారే అనుకుంటా!

ఈ మీటింగ్ ఏ అల్లర్లు లేకుండా, శాంతియుతంగా జరిగింది. ఆ పిమ్మట విద్యార్థులంతా వారివారి స్థావరాలకు వెళ్ళినారు.

విక్రం, వెంకటకృష్ణుడు మొదట విక్రం ఇంటికి వెళ్ళినారు. కృష్ణమోహన్ అపుడే ఇంటికి వచ్చినాడు. విక్రం వంటవానికి కాఫీ ఇవ్వమని అడిగినాడు. కొద్దిసేపట్లో విక్రం, వెంకట కృష్ణుడు కాఫీ త్రాగి బయటపడ్డారు. విక్రం వెంకటకృష్ణునితో సరే నేను రెలులో పోవాలి, అని సెలవు తీసుకున్నాడు. ఒక గంటలో హాస్టల్ లోని తన గదికి చేరుకున్నాడు.

చూస్తుండగానే వేసవికాలం సమీపించింది. ఇంటర్ మీడిఎట్‌కు పబ్లిక్ పరీక్షలు వుంటాయి రెండవ సంవత్సరములో. కాని, మొదటి సంవత్సరములో యూనివర్శిటీయే Ist year exam conduct చేస్తుంది. అది అంతకష్టమైనది కాదు.

విక్రం ఏ పరీక్షనైన సీరియస్‌గా తీసుకుంటాడు. కాని, వెంకట కృష్ణుడు దీనిని ఈజీగా తీసుకుంటాడు. విక్రం వెంకటకృష్ణులలో ఇదే బేధము.

విక్రం జీవితంలో ప్రతీది ముఖ్యం అని భావిస్తాడు. విజ్ఞాన సముపార్జన ఇతని జీవిత ధ్యేయము. అంటే Book worm కూడా కాదు. దేనికి ఎంత సమయాన్ని వినియోగించాలో అతనికి తెలుసు.

ఇప్పుడు పరీక్ష సమయమాసన్నమైనది. అందువల్ల రోజూ ఇంత చదవాలని ఇతని ఉద్దేశ్యము.

రోజూ క్లాసుకు పోవడము, పిమ్మట భోజనము చేసి కొంచెము Walk చేయడమూ రాత్రి కాగానే చదువుటకు కూర్చుండడము. వీక్ ఎండ్స్ మరియు వీక్‌లో కూడా క్రిష్ణమోహన్ వద్దకు వెళ్ళడం ఇతనికో రొటీన్‌గా మారింది. ఇక వెంకటకృష్ణుడైతే రోజూ క్లాస్‌లలో కలుస్తూనే ఉంటాడు.

ఒకనాడు అనుకోకుండా ఆనంద్ విక్రం రూంకు వచ్చినాడు. చాలాకాలం తరువాత వచ్చిన ఆనందును చూచి విక్రం నిశ్చేష్టుడైనాడు. “రా ఆనంద్ What a surprise” అన్నాడు విక్రం.

ఇద్దరూ రూంలో కూర్చొని గతాన్ని స్మరిస్తున్నారు. విక్రం ఆనంద్ వాళ్ల తల్లిదండ్రుల యోగక్షేమాల నడిగి తెలుసుకొన్నాడు.

పిమ్మట విక్రం ఆనంద్‌తో What can I do, for you! అని అన్నాడు.

Nothing really! చాలా కాలం తర్వాత చూడాలని అనిపించింది. అందుకే వచ్చేనని అన్నాడు ఆనంద్.

‘చాలా మంచి పనిచేశావు ఆనంద్’ అన్నాడు విక్రం.

ఆనంద్ కాడా Science Biology చదువుతున్నాడు సిటీకాలేజీలో.

అందువల్ల విక్రం ఆనంద్‌ను కలవడం లేదు. ఆనంద్ కూడా మెడిసిన్ చేయాలి అని అనుకుంటున్నాడు. విక్రం కూడా అంతే.

దేవుడు తలిస్తే మనం మళ్లీ మెడికల్ కాలేజీలో కలుసుకుంటాములే అని, వారి చిన్ననాటి స్నేహితుల విషయమై మాటాడుకొన్నారు.

పిమ్మట విక్రం ‘నాతో భోంచేయ’మన్నాడు. ‘చాలా రోజులయ్యింది, మనము కలిసి భోంచేసి,’ అన్నాడు’

‘లేదు, Thank you for the invitation, కాని, నేను వెళ్లాలి. సారీ, ఏమనుకోవద్దు,’ అన్నాడు ఆనంద్.

‘సరే next time may be,’ అని విక్రం అన్నాడు.

ఆనందుతో బస్సువరకు నడచి ఆనందును బస్సులో ఎక్కించి ‘బై,’ అని విక్రం రూంకు వచ్చినాడు.

రాగానే బాత్‌రూంకు వెళ్లి, కాళ్లు చేతులు కడుక్కొని, తలదువ్వుకొని డైనింగ్‌హాల్‌కు వెళ్ళి భోంచేసినాడు.

హాస్టస్ భోజనం ఏమీ బాగుండదు. ఈ హాస్టళ్లలో మరఠ్వాడ, కర్నాటకకు చెందిన పిల్లలు చాలా మంది ఉన్నారు. ఎందుకంటే హైదరాబాదులో తెలుగు వారు అధికసంఖ్యాకులైన నాలుగు జిల్లాలు మరాఠ్వాడివి, మరి మూడు జిల్లాలు కర్ణాటకకు చెందినవి వున్నాయి. అందువల్ల ఈ హాస్టళ్లలో తెలుగు, మహరాష్ట్ర, కన్నడ భాష

మాట్లాడు విద్యార్థులున్నారు. అందువల్ల విక్రంకు ఈ రెండు భాషలతో పరిచయం ఏర్పడింది.

అందువలన డైనింగ్ హాల్‌లో అందరి టేస్టుకు వంటచేస్తారు కాని, ఆ డైనింగ్ హాల్ తిండిలో ఏ టేస్ట్ ఉండదు.

వరి అన్నం పుల్కాలు వుంటాయి కాని, లిమిటెడ్ క్వాంటిటీ. ఈ మెనూలో కొంచెం అన్నం లేదా పుల్కాలు, Unlimited సాంబారు, మరి కొంచం కూర ప్లస్ కొంచెం పెరుగు. ఎక్కువ ఆకలిగలవాడు సాంబారు త్రాగి పొట్టనింపుకోవలసిందే. ఈ dining hall running లో చాలా Corruption ఈ హాల్‌లో పనిచేస్తున్న Clerk main person అన్న మాట. తరువాత వంటవాళ్ళు, వడ్డించేవాళ్లు. ఇక ఈ వంటచేసేవాళ్ళమీద వడ్డించేవాళ్లమీద ఒక Petty superviser. ఇక ఈ డైనింగ్ హాల్‌కు కావలసిన సరుకులన్నీ ఒక సంllరానికి గాను bid చేసి Contract కు ఇస్తారు.

ఈ డైనింగ్ హాల్‌లో భోంచేస్తున్న విద్యార్థులంతా ఒక Monitor ను యెంపిక చేస్తారు. నిజంగా ఈ మానెటరుకు సర్వాధికారాలు ఉంటాయి. అతడు నిజంగా sincere person అయితే ఈ బడ్జెట్ తో విద్యార్థులకు రుచికరమైన ఆరోగ్యమైన భోజనము పెట్టవచ్చు. కాని, మన దేశంలో Sincerity is very rare commodety కదా! అందుకే వీడు ఏ కంట్రాక్టర్ ఎక్కువ డబ్బు వీరికి ఇస్తాడో వాడికే ఈ కాంట్రాక్టు దొరుకుతుంది. ఇక కంట్రాక్టు దొరకినంక వాని ఇష్టమొచ్చినవి సరఫరా చేస్తాడు. Dining hall staff మరియు మానీటర్ సుఖంగా ఉంటారు. Suffer అయ్యేది విద్యార్థులు. ఇది ఏళ్ళతరబడి నుండి నడుస్తున్న చరిత్రే, ఎవరూ వేలెత్తి చూపరు. యెందుకంటే ఎవ్వడూ రెండు మూడేండ్ల కన్న ఎక్కువుండడు కదా! అందుకే అందరూ మన కెందుకీ గొడవ అన్నట్లు కళ్ళు మూసుకొని పెట్టింది ఇష్టమయితే తింటారు, లేనిచో వెళ్లి పోతారు. కాని, పండగదినాలలో అన్నీ బాగా చేస్తారు. యెందుకంటే చాలా మంది University Professors student guests గా వస్తారు. వాళ్లను Impress చేయటానికి ఆనాడు తిండి చాలా బాగా వుంటుంది. ఇందువల్ల కూడా అన్నిరోజులు చేసిన పాపాలకు పరిహారమేమో ఈ పండుగ నాటి భోజనాలు.

ఈ తిండి తప్పితే హాస్టల్ చాలా సౌకర్యమైన స్థలము. సీరియస్ గా చదువు వారికి మంచి అనువైన చోటు. అందువల్లనే విక్రం చేరినాడు. సిటీలో తన ఇంట్లో నున్నప్పుడు తిండి బాగా వుండేది. ఇపుడు అది లోపించింది. కాని, దానిని విక్రం మిస్ చేయుటలేదు. యెందుకంటె అంతగా తినాలనిపిస్తే గంటలో ఇంటికి వెళ్ళి ఇష్టమొచ్చినది చేయించుకొని తినిరావచ్చు. అదే కాకుండా ప్రతి శని, ఆది వారాలు ఇంటికి వెళుతూనే ఉంటాడు. కాబట్టి తిండిని ఏమీ మిస్ చేయలేదు. హాస్టల్ బ్రేక్‌ఫాస్ట్ అంత మంచిగా ఉండకున్నా విక్రం కు నచ్చినట్టుగానే ఉండేది. On the whole విక్రంకు ఈ హాస్టల్ తిండి నచ్చకున్న tolerable అనుకున్నాడు. కాని, చాలా మంది విద్యార్థులు దీనిని జిందా తిలిస్మాత్ అని అనేవారు.

ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థి జీవితము చాలా వైభవోపేతమైన జీవితమనియే

చెప్పాలి. కాని, అట్టి జీవితములో కూడా హాస్టల్ డైనింగ్‌హాల్ ఒక మచ్చు అని చెప్పాలి. దీనికి విద్యార్థులు elected officials అనియే చెప్పాలి. ఎక్కడనైన ఎలక్షన్స్ వుంటే అచ్చట అవినీతి లంచగొండితనం తావు చేసుకొంటుందనుకుంటా. ఇది హిందూదేశానికి చాలా బాగా అనువర్తిస్తుందనుకుంట. ప్రాశ్చాత్య దేశాలలో కూడా కొంత అవినీతి లేదని కాదు కాని, నిరక్షరాస్యుల సంఖ్య అధికంగా వున్న హిందూదేశములో ఈ అవినీతి అధికమనియే చెప్పాలి.

ఉస్మానియా విశ్వవిద్యాలయములో 5 హాస్టల్స్ వుండెను. ప్రతి హాస్టలుకు ఒక వార్డన్ వుంటాడు. వీరంతా O.U. Campus పైననే నివసిస్తున్నారు. అయితే ప్రతిసంవత్సరానికి ఒకసారి ending of the academic year లో హాస్టల్ డే అని చేస్తారు. ఇది అన్ని ఫంక్షన్స్ కన్నా ఘనంగా జరుగుతుంది. దీనితో ఆ సంవత్సరం ముగింపు. ఈ హాస్టల్‌కు ఒక Chief guest generally a VIP మరి ఒక స్పీకర్‌ని ఇన్‌వైట్ చేస్తారు. మా హాస్టలు డే కూడా చేయాలని మా Senior monitor మరి అయనకు తోడ్పడే ఇతర స్టూడెంట్ అధికారులు ఓ మీటింగ్‌లో నిశ్చయించినారు.

ఈ వుత్సవానికి ప్రతి విద్యార్థి కొంతమంది గెస్టలను ఇన్‌వైట్ చేయవచ్చు. ప్రతి గెస్ట్‌కు ఇంత ఫీసు నిర్ణయిస్తారు. ఈ Fees dinner కై. యెందుకంటె హాస్టల్ డే నాడు మంచి డిన్నర్ ఉంటుంది.

పిమ్మట గెస్టలు మరి విద్యార్థులంతా వినోద కార్యక్రమానికి హాజరౌతారు. ఈ వినోద కార్యక్రమంలో సామాన్యంగా విద్యార్థులే పాల్గొంటారు, లేదా వారి స్నేహితులు. చాలా అరుదుగా professional entertainer ను పిలుస్తారు.

ఈ హాస్టల్‌డే కొరకు ఒక వినోద కార్యదర్శి నిర్వర్తిస్తారు. విక్రంకు ఆ senior monitor ఈ బాధ్యత ను వప్పగించినాడు. విక్రంకు వినోద కార్యక్రమాలంటే సరదా, అందుకే సరేనని ఒప్పుకున్నాడు. అతనికి ఈ బాధ్యతను తీసుకోవాలెనని ఇష్టములేకుండెను. ఎందుకంటే, ఆ సీనియర్ మానిటరంటే విక్రం కు కొంచెం మంచి అభిప్రాయంలేదు. అయినా ఒప్పుకున్నాడు.

విక్రం ఒక డాన్స్ ప్రోగ్రామ్ అరేంజి చేదామనుకున్నాడు. ఎందుకంటే విక్రం ఫ్యామిలీ ఫ్రెండ్ ఒక పారిశ్రమికవేత్త. అతని చిన్న కూతురు మంచి డాన్సర్ అని ఇతనికి తెలుసు. విక్రం అతన్ని uncle అని పిలిచేవాడు. ఆ ఇంటిలో విక్రంకు తన ఇంట్లో నున్నంత చనువుండెను. సిటీకి వెళ్ళినప్పుడు అపుడప్పుడు వీళ్ల ఇంటికి కూడా వెళ్ళేవాడు. వాళ్ళు ఎప్పుడు వెళ్లినా ఏదో తిననిదే వెళ్లనివ్వక పోయేవారు. అయితే ఒకనాడు సాయంకాలం వెళ్ళి అంకుల్ అయిన పారిశ్రామిక వేత్తతో ఈ విషయాన్ని ప్రస్తావించాడు. అప్పుడు ఆ అంకుల్ సరే దానికేమీ తీసుకెళ్ళు. నీమీద నాకు 100% నమ్మకము అన్నాడు. ఇది అడిగి వప్పించకమునుపే వాళ్ల మొత్తం familyని తన గెస్ట్స్‌గా ఆ హాస్టల్ డే విందుకు రమ్మన్నాడు. అందుకు అయన 'విక్రం'! నేను మీ అంటీ రాలేము. అనాడు మాకు వేరే ఎంగేజ్‌మెంట్ వుంది కాని, మేమిద్దరము తప్ప మొత్తం family కావలిస్తే తీసుకెళ్ళు. నా కారు డ్రైవర్‌ను కూడా తీసుకెళ్లు అని చాలా ఉదార స్వభావంగా అన్నాడు. విక్రం ఇందుకు అంకుల్ చాలా చాలా థ్యాంక్స్ అని హాస్టల్‌కు వెళ్లిపోయినాడు.

ఇప్పుడు ఆయన బాధ్యతను తను నిర్వహించకలుగుతాడు.

అందుకే చాల relaxed గా వున్నాడు. అంకుల్, అంటీ కాక వాళ్ళింట్లో అయిదుగురు family members. అందరికి dinner tickets కొన్నాడు ముందుగానే. విక్రం మాత్రం కారు ఒకనాడు ముందు గానే డ్రైవర్‌తో సహా హాస్టల్ కు తెచ్చుకున్నాడు. విక్రం స్వతహాగా చాలా sincere. Corrupt మనుషులంటే అసహ్యం. ఏ బాధ్యతను తీసుకున్నా దానిని sincere గా నిర్వర్తించుట ఆయన జీవితవిధానము. విక్రం కు ఇప్పుడు 16 ఏళ్ళ వయస్సే అయినా అతని వయసుకు మించిన బుద్ధికుశలత మరి maturity వుంది.

హాస్టల్ డే రానే వచ్చింది. సాయంకాలము అందరు విద్యార్థులు మంచి దుస్తులు వేసికొని లాన్‌లో జరుగుచున్న చోటికివచ్చి ఆ లాన్‌పై వేసిన డేరాలో వేసిన కుర్చీలలో కూర్చున్నారు.

మనదేశంలో పాశ్చాత్య దేశాలవలె సమయాన్ని పాటించరు. దానికి ఎన్నియో సాకులు చెప్పగలరు కాని, దీనికి కారణము మన సంస్కృతిలో అలముకొని పోయిన దురాచారాలలో ఇది ఒకటనియే చెప్పాలి. అందరు ముఖ్య అతిథికై wait చేస్తున్నారు. ఆనాడు ముఖ్యవుపన్యాసకుడు కూడా సమయానికి వచ్చేసినాడు. ఇక రావలసింది ముఖ్య అతిథే. 90 నిమిషాలు ఎదురుచూచిన పిదప ఈ శ్రీవారు, ఒక మినిష్టరనుకుంటూ కారులో విచ్చేసినాడు. రాగానే హాస్టలు సీనియర్ మానిటరు వారికి స్వాగతము చెప్పి తీసుకువచ్చి సభకు ముఖ్య అతిథిగా వేసిన కుర్చీపై కూర్చుండబెట్టెను. పిమ్మట సారీ ఇంత అలస్యంగా వచ్చినందుకు అని క్షమాపణ అడగకుండానే కూర్చున్నాడు. అప్పుడు సీనియర్ మానిటర్ వీరిని పరిచయం చేసి అధ్యక్షత వహించమని ఆహ్వానించి పూలమాలతో అలంకరించినాడు. పిమ్మట కార్యక్రమాన్ని ఆరంభింపమని కోరుతూ ఆ సీనియర్ మానిటర్ తన ఆసనంపై కూర్చుండెను. అప్పుడు ఈ అధ్యక్షులవారు మెయిన్ స్పీకర్‌ను తన వుపన్యాసాన్ని ప్రారంభించమని కోరుతు అతనిని పరిచయము చేసెను. ముఖ్య స్పీకర్ విద్యార్థుల బాధ్యతలను గూర్చి ఉపన్యసించెను. ఆయన పుణ్యమా అంటూ 30 నిమిషాలలోనే పూర్తిచేసెను. అప్పటికి ఓపికతో కూర్చున్న విద్యార్థులు ఈయన ఉపన్యాసం ముగించగానే కరతాళధ్వనులు చేశారు. ఈ కరతాళధ్వనులు thank you for finishing earlyకి కాని, వారు చేసిన వుపన్యాసానికి కాదు. విద్యార్థుల సైకాలజీ కనిపెట్టి వుపన్యసించినవాడే ఘనుడు ఆనాడు, ఈనాడు కూడా. ఆనాడైతే, కొంచెం భయం భక్తి విద్యార్థులలో నుండేది. ఈనాడైతే, ఆ రెండు బొత్తిగా లేవనియే చెప్పవచ్చు.

ఒకప్పుడు వాళ్లకు వుపన్యాసమే కాక వుపన్యసించుచున్న వ్యక్తిని బట్టి కూడా వాళ్లు మెలుగుకొంటారు.

ఆనాడు వుపన్యసించుచున్న వ్యక్తి ఆ క్యాంపస్‌లో పేరు పొందిన ఆచార్యుడు అందువల్ల 30 నిమిషాలు చప్పుడు చేయలేదు. ఇక వేరే వారు అవుతె ఇప్పటికి కరతాళధ్వనులు అయేవి కాని, ఈనాడు అవేమీ జరుగలేదు.

సభ ముగిసాక, డైనింగ్ హాల్‌కు అందరిని రమ్మని సీనియర్ మానిటర్ ఆహ్వానించారు. Guest rows లోని కుర్చీలన్నిటికి Guest label వేసివుండినవి.

తక్కిన వన్నీ విద్యార్థులకు. Guests అంతా వారి వారి కుర్చీలపై కూర్చున్నారు. విద్యార్థులంతా వాళ్ళ కుర్చీలలో కూర్చున్నారు. అప్పటికే టేబుల్స్‌పైన అన్ని అమర్చబడి ఉన్నవి. పిమ్మట సర్వర్స్ మరికొన్ని వడ్డించినారు. ఇదివరకు వ్రాసినట్టు పండుగలకు హాస్టల్ తిండి చాలా బాగుంటుందని, అట్లే ఈనాడు విందుకు చేసిన ఐటమ్స్ అన్నీ సూపర్‌గా వున్నాయి. last item dissert ఈనాడు లిమిట్ దేనిపైనా లేదు. హాయిగా ఇష్టమున్నంత తినవచ్చు. విక్రం తన గెస్ట్‌లతో కూర్చున్నాడు. ఏవి కావలయునో వారితో తెలుసుకొని సర్వర్‌కు చెప్పినాడు. అందరూ తృప్తిగా భోంచేసినారు కాని, ఆ డాన్స్ చేసే అమ్మాయి సగమే తిన్నది యెందుకంటే కడుపు నిండావుంటే డ్యాన్స్ చేయలేదుకదా. ఏది ఏమైనా అందరు తిన్న పిమ్మట రిలాక్స్ అవుటకు ఆ వినోద కార్యక్రమము జరిగే వేరే హాలుకు వెళ్లి తాంబూలము తీసుకొని వేసుకొని కూర్చున్నారు.

ఇంక వినోద కార్యక్రమమౌటకు కొంచెం సమయమున్నది. అందువలన, ఒకరితో నొకరు మాట్లాడుకొంటున్నారు. విక్రం కూడా తన గెస్ట్‌లతో మాట్లాడుకుంటూ లేచి పోయినాడు వారితో ఎందుకంటె ఈయన వినోద కార్యదర్శికదా!

స్టేజీ బాగానే డెకరేట్ చేసి యున్నది.

విశ్వవిద్యాలయములో బాగానే పాడే కొందరు విద్యార్థులను ఆహ్వానించాడు విక్రం.

తామస నాట్యం చేస్తుంది ఈనాడు. శిల్ప అమె అక్క తామసను అలంకరించుటకు దుస్తులు వేయుటకు గ్రీన్‌రూం లోకి వెళ్లింది. స్వతహాగా తామస very attractive girl అందులో డాన్స్ అనుభవము బాగానే ఉంది. వయస్సులో చిన్నది. 13వ యేట ఉన్నదిప్పుడు. అయినా డాన్స్‌లో పెద్దదనియే చెప్పాలి. వాయిద్యాల అరేంజిమెంట్ అంతా అయిపోయింది. తబలా, హార్మోనియం, ఫ్లూట్, వీణలతో యూనివర్సిటీలోనే చదువుతున్న విద్యార్థులు వారి ఇన్‌స్ట్రుమెంట్స్‌ను శ్రుతి చేసుకుంటున్నారు.

తెరలోపల ఇంకకొన్ని నిమిషాలలో వినోదకార్యక్రమము మొదలు కావాలి.

తెరవెనుక పాటలు పాడే మొదటి పిల్లవాడు యెంకి పాటలతో కార్యక్రమము మొదలు పెడతానంటాడు. దానికి విక్రం సరే, అలానే కాని, మీ పాటలను మొదలు ఒక భజనతో కార్యక్రమాన్ని సాగిద్దామా అన్నాడు విక్రం. సరేనని ఆ ఎంకిపాటల అబ్బాయి ఒప్పుకున్నాడు.

సరేనని ఆ భజనపాడే అమ్మాయిని పిలిచాడు విక్రం. అమ్మాయి మధ్యలో కూర్చుంది. రెండు వైపులా వాయిద్యాలతో విద్యార్థులు కూర్చున్నారు. వారి వాయిద్యాలు ట్యూన్ చేసికొని రెడీగా నున్నాము అన్నారు. విక్రం తెరముందుకు వచ్చి మహాశయులారా ఇక మన వినోదకార్యక్రమము భజనతో మొదలు పెడుతున్నాము అన్నాడు. దానితో అందరూ కరతాళధ్వనులు చేసినారు. ఈ భజనపాడే అమ్మాయి ఎవరోకాదు పావని. వెంకటకృష్ణని మేనత్త కూతురు. ఈమె భజనలు బాగా పాడుతుందని విక్రంకు suggest చేసి ఇన్‌వైట్ చేయించినాడు. వెంకటకృష్ణుడు కూడా ఆయన మేనత్త వనజమ్మగారి నొప్పించి పావనిని తయారు చేసినాడు.

తెర లేచింది. తెర లేవగానే, కొంచెమాలాపన తరువాత సావిరహేతవదీనా రాధా! పావని మొదలు పెట్టింది. అందరూ తమ వాయిద్యాలను ఈమె పాటకు సపోర్టుగా వాయించారు. చాలా బాగా పాడింది. అందరూ కరతాళధ్వనులు చేసినారు, తెరపడింది. తెరపడగానే విక్రం తెరముందుకు వచ్చి మీ హర్షధ్వానాలకు మాకృతజ్ఞతలు. పావనికి మీ అందరి తరపున నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఇక next program యెంకి పాటలు అని చెప్పి వెడలి పోయెను.

విక్రం వెడలి పోయిన నిముషములోపలనే తెరలేచింది.

యెంకి పాటలు పాడె నందకిశోరుడు అను విద్యార్థి"యెంకి వంటి పిల్ల లేదోయి లేదోయి" అని యెంకి పాటను మొదలు పెట్టెను. విద్యార్థులు ఈతని పాటకు శృతికలిపినట్లు చప్పట్లు కొడుతు ఎన్‌జాయ్ చేస్తూవుండిరి. ఈ విధంగా రెండు యెంకి పాటలు పాడి నందకిశోర్ అపుచేసెను.

పిమ్మట లక్ష్మణమూర్తి తన ఫ్లూట్‌తో ఆ సభను తన్మయపరచెను.

అప్పటికే 9–30 అయ్యింది. ఇక తామస dance next అని విక్రం అనౌన్సు చేసెను. తెర లేవగానే తామస డాన్సింగ్ వేషంతో సిద్ధంగా నున్నది.

హార్మోనియమ్‌తో వాయిద్యాలు మొదలైనవి. అన్ని వాయిద్యాలు మ్రోగుతుంటే ఆమె డాన్స్ మొదలయింది. మొదలు మొదలు మెల్లగా మొదలయిన డాన్స్ చాలా తీవ్రతను దాల్చింది. ఒక పదినిమిషాలు ఈ డాన్స్‌ను అందరూ ఎంజాయ్ చేసినారు. డాన్స్ అయిపోగానే అందరు విద్యార్థులూ సీటీలు కొట్టుచు కరతాళధ్వనులు చేసినారు. తెరపడి పోయింది.

విక్రం తెరముందుకు వచ్చి దీనికి తోడ్పడ్డ ఆర్టిస్టులకు మరి వేరే సోదరులకు థాంక్స్ తెల్పుతూ ప్రేక్షకులకు కూడా థ్యాంక్స్ చెప్పినాడు.

పిమ్మట సీనియర్ మానిటర్ స్టేజ్ పైకి వచ్చి ముఖ్య అతిధికి మెయిన్ స్పీకర్‌కు గెస్టులకు విద్యార్థులకు ప్రత్యేకంగా ఈ hostel day success కు తోడ్పడ్డ వారికందరికి ప్రత్యేకంగా విక్రంకు మరీ అతనికి సహాయం చేసిన ఆర్టిస్టుల కందరికి special thanks చెబుతూ హాస్టల్‌డేను ముగించాడు. పిమ్మట అందరూ లేచారు. దీనితో హాస్టల్ డే సమాప్తమయింది.

తెల్లవారి, హాస్టల్‌డే మరునాడు, విక్రం కాలేజీకి వెళ్లలేదు. యెందుకంటే హాస్టల్‌డే రాత్రి చాలా ఆలస్యంగా నిద్రపోయినాడు. వెంకటకృష్ణుడు మాత్రం యధావిధిగా కాలేజీకి వెళ్ళినాడు. విక్రం క్లాసులో లేని కొరతను గ్రహించినాడు. అందుకే కొన్ని పిరియడ్స్ వీడి సరాసరి ఇంటికి వచ్చినాడు రాగానే టీ తాగి తన రూంకు వెళ్లి కాలేజి బట్టలు అంటే నల్ల శేర్వాణి మార్చుకొని షర్టు పేంటు వేసికొన్నాడు. కొంచెం సేపు తన గదిలోని మంచం పై వరిగి రిలాక్స్ అయినాడు. పిదప సుమారు 5 గంటల సమయానికి విక్రం ఇంటికి వెళ్లినాడు. విక్రం తన గదిలో మంచం మీద ఇంక నిద్ర మత్తుతో పడుకొనే వున్నాడు. వెంకటకృష్ణుడు సరాసరి విక్రం రూంకు వెళ్ళి అతని మంచం తట్టి, 'ఇంకా నిద్రమత్తు వదలలేదే దొరవారికి లే లెమ్ము' అన్నాడు.

దానికి విక్రం కళ్లు తెరచి 'కూర్చో వెంకట్ ఇపుడే వస్తాను' అని టవల్ తీసుకొని బాత్‌రూంకు వెళ్లినాడు. కొంతసేపట్లో విక్రం కళ్లు కడుకొని నెత్తి దువ్వుకొని ఫ్రెష్‌గా రూంలోకి మళ్లీ ప్రవేశించినాడు. కొంచెంసేపట్లో వంటమనిషి టీ తీసుకొని వచ్చినాడు. టీ తీసుకొని విక్రం 'What about you' అన్నాడు విక్రం వెంకటకృష్ణని చూచి. 'No thanks, నేను ఇప్పుడే త్రాగి నీ వద్దకి వచ్చినాను' అన్నాడు. 'Are you sure' అని మళ్లీ విక్రం అడిగినాడు. విక్రం మంచం మీదనే కూర్చొని టీ సిప్ చేస్తున్నాడు. వెంకటకృష్ణుడు 'నీ వినోదకార్యక్రమము చాలా బాగుంది విక్రం congratulation' అన్నాడు. 'Thanks you! మీ అందరి సహకారం లేకపోతే successful కాక పోతుండేది ప్రత్యేకంగా తామస, శిల్ప తలిదండ్రుల సహకారము లేకపోతె' అన్నాడు విక్రం. 'మరచిపోయిన, పావనికి నా ప్రత్యేక కృతజ్ఞతలు తెల్పు వెంకట్. ఆమె భజనలు ఇంత బాగా పాడుతుందని నేను అనుకోలేదు' అన్నాడు విక్రం. 'She is very talented', అన్నాడు వెంకటకృష్ణుడు. 'అయితే, మరి హాస్టల్ సంగతేమిటి ఇంట్లో వున్నావు!' అన్నాడు వెంకటకృష్ణుడు. 'హాస్టల్ ఎక్కడకు పారిపోతుందిలే రాత్రి అందరిని తమతమ ఇండ్లలో వదలి పెట్టేవరకు ఆలస్యమయింది. అందువల్ల సిటీలోనే వుండిపోయాను. హాస్టలు తప్పతుందా!' అన్నాడు విక్రం. 'మళ్లీ సిటిలోనే వుండి పోతావనుకున్నా', అన్నాడు వెంకటకృష్ణుడు చిరునవ్వుతో. 'సరే! మన ఓల్డ్‌వాకింగ్ రూట్‌కు పోదామా' అన్నాడు వెంకటకృష్ణుడు. 'సరే!' అని విక్రం బట్టలు మార్చుకున్నాడు. ఇద్దరూ నడచినారు బయటికి. మెల్లగా సుల్తాన్ బజారు వైపుకు నడచినారు. పిమ్మట కోఠీవైపు ఈ విధంగా 30 నిమిషాలు నడచి అయ్యరు హోటల్‌కు చేరుకొన్నారు. వీళ్లను చూడగానే అయ్యరు ఆహ్వానించినాడు. Old habit ప్రకారము వీళ్లతో లోనికి వెళ్ళి ఒక వెయిటర్‌కు చెప్పి బయటికి వెళ్లికూర్చున్నాడు. విక్రం వెంకటకృష్ణుడు సావధానంగా కూర్చొని ఏదో టిఫెన్ మరి కాఫీ ఆర్డర్ చేసినారు. పిమ్మట చీకటి పడ్డది. వాటిని ముగించి ఇద్దరూ ఎవరి ఇళ్లకు వాళ్లు చేరుకున్నారు.

మరునాడు ఇద్దరూ 9 గంటల బస్సుకు విశ్వవిద్యాలయానికి చేరుకున్నారు.

అన్ని క్లాసెస్ మునుపటివలెనే అటెండ్ చేసినారు. వెంకటకృష్ణుడు క్లాస్ అయిన పిమ్మట సిటీకి వెళ్లినాడు.

విక్రం తన హాస్టల్‌లోని గదికి చేరుకున్నాడు. గది చేరగానే ward boy Hussain వచ్చి అంతా శుభ్రపరచి కూజాలో నీళ్ళు పెట్టి వెడలి పోయినాడు.

విక్రం తన బల్లవద్ద కుర్చీపైన కూర్చొని పుస్తకాలు అన్ని సర్దుకొంటున్నాడు. ఇంతలో అతని హాస్టల్ acquaintances కొందరు వచ్చినారు. వీరిలో కొందరు ఆ హాస్టల్ ఆఫీస్ బేరర్స్! వీళ్ళు కూడా హాస్టలు విద్యార్థులచే ఎన్నికైన వారేకాని, వీరు పూర్తి హాస్టలుకు కాక ఆ హాస్టలు వేరేవేరే wings నుండి ఎన్నికౌతారు. కాని, ఏ కార్యక్రమాన్నైనా మెజారిటీ ఎన్నికతోనే పాసౌతోంది. మీ హాస్టలు కార్యక్రమానికి యెంతఖర్చు అయినది వీళ్లు హాస్టలు డే పిమ్మట లెక్కచేసి bills pass చేస్తారు.

అయితే, ఆ రూల్స్‌ను గుర్తుంచుకొని మరునాడు మధ్యాహ్నమే అన్ని ఖర్చుల బిల్స్‌ని పాస్‌చేస్తారు. సీనియరు మానిటరు preside చేస్తాడు. బిల్స్ అన్ని ఈ కమిటీలో పాసైనాయి. ఇదివరకు చెప్పినట్టే ఈ సీనియరు మానిటరు కొంచెం నమ్మకస్తుడు కాదు.

విక్రం ఈ వినోదకార్యక్రమంకు ఒక చిల్లి గవ్వకూడా హాస్టలునుండి తీసుకోలేదు. ఎందుకంటె కారు పెట్రోల్ తామస, శిల్ప తలిదండ్రులు భరించారు. డ్రైవరుకూడా వాళ్ళ మనిషే. ఇక చిల్లర ఖర్చులు విక్రం భరించాడు.

ఒక బిల్లు కూడా ఇవ్వమని ఆ సీనియర్ మానిటరును అడుగలేదు. ఈవచ్చిన విద్యార్థులు 'ఆ బిల్లులన్నీ మేం పాస్ చేసినాము', అన్నారు. అందుకు విక్రం నాకేమి తెలియదు అని వూరకున్నాడు.

కొద్ది రోజుల పిమ్మట ఆ సీనియర్ మానిటర్ విక్రం రూంకు వచ్చాడు. 'క్షమించాలి! విక్రం నేను నీతో మాటాడాలి' అన్నాడు.

'రండి కూర్చోండి' అని అన్నాడు విక్రం.

కూర్చున్న పిమ్మట 'నేను బిల్స్ మీటింగ్ ముందర పెట్టింది నిజమే! ఆ డబ్బు తీసుకొందినిజమే! ఇది పొరపాటే! అందుకు నన్ను క్షమించి నాకు సహాయపడాలి' అన్నాడు.

'నేను మీకు ఎలా సహాయపడగలను!' అన్నాడు విక్రం.

'ఏమీలేదు, నిజమే! నాకీ డబ్బు ముట్టింది అని వ్రాసైనా ఇవ్వండి, లేదా నేను మీటింగ్‌కు పిలుస్తాను దాంట్లో మీరు నేను చెప్పిన విధంగానైనా చెప్పండి' అన్నాడు.

అందుకు విక్రం 'సారీ, నేనాపని చేయలేను' అన్నాడు. 'కావలిస్తే అన్ని డిటేల్స్, యెంతఖర్చయింది, ఎవరు ఏ ఖర్చు భరించింది మొదలగు విషయాలు చెప్పమంటె మీటింగులో చెప్పటకు నాకు అభ్యంతరముండదు' అన్నాడు.

దానికి ఆ సీనియర్ హౌస్ మానిటర్ మరొకసారి ప్రార్థించాడు. విక్రం 'సారీ!' అన్నాడు. ఆయన నొచ్చుకున్నాడు. ఏమి అనకుండా ఒక నిమిషం నిశ్చేష్టుడై కూర్చున్నాడు. పిమ్మట 'సరే! వస్తాన'ని వెళ్లిపోయినాడు.

ఈ విషయం హాస్టలు అంతా తెలిసిపోయింది. దానితో యితడు చాలా చెడ్డవాడని హాస్టలు విద్యార్థులు అనుకొన్నారు.

విక్రం అంటె ఆనాటినుండి అతనికి ఒక కసి, కోపం. ఎలా ఇతనిమీద పగసాధించాలని ఆలోచనలోనే వున్నాడు ఆనాటినుంచి.

కాల చక్రం ఎవరికోసం ఆగదు. అది కదలిపోతూనే వుంది. దీనికి ఆది లేదు, అంతం లేదు. ఈ ఆది అంతం అనేది మనకు మనము సృష్టించిన చరిత్రకు మరి నియమాలకు. కాని, కాలం కదలిపోతూనే ఉంటుంది. దానిలో మనమంతా కలసిపోతుంటాము.

విక్రంకు మళ్ళీ ఇప్పుడు పరీక్షలు. High school board పరీక్ష తర్వాత ఇది University నిర్వర్తిస్తున్న మొదటి పరీక్ష, ఇది పబ్లిక్‌పరీక్ష కాదు. ఇంగ్లీషు పరీక్ష మొదటినాడు అయిపోయింది. రెండవనాడు Physics, మూడవనాడు chemistry,

నాల్గవనాడు biology. మొదలు theory పరీక్షిస్తారు. పిమ్మట practicals వుంటాయి. అన్ని పరీక్షలు theory and praticals బాగానే వ్రాసినాడు, చేసినాడు. ఇక నాల్గవనాడు biology బాగానే వ్రాసినాడు. మధ్యాహ్నం biology practicals. ఇతడు dissection ఎప్పుడూ చేయలేదు. Botany practicals లో ఏ బాధ లేకుండెను. ఇప్పుడు మధ్యాహ్నం ఎవరి practicals వాళ్ళు చేయాలి.

ఆ ల్యాబ్‌లో ఇతని పరీక్షకు ఒక చచ్చిన కప్పను, దానిని dissect చేయుటకు పరికరాలు అచ్చట నున్నవి. దానినుండి reproductive system తీసి దానిని practical గా కాగితంపై గీసి ఆ పార్ట్స్‌నన్నిటిని లేబిల్ చేసి పెట్టాలి. అవి అన్ని సరిగా వుంటె 100% marks.

విక్రం సమర్థవంతుడు. ఆ పార్ట్స్ ఎట్లు వేరుచేయాలి అవన్ని జ్ఞాపకమున్నది కాని, అతడు ఇదివరకు కప్పను ముట్టలేదే ఇపుడు ఎట్లా అని తికమక పడుతున్నాడు. కొంచెంసేపు విధిలేక నిలబడి ఆ కప్ప మృతకళేబరాన్ని అటు ఇటు త్రిప్పుతున్నాడు. ఇక తప్పదని షర్టు చేతులు మలచుకొని కప్పను ముట్టుకొన్నాడు. మొదలు చాలా అసహ్యంగా తోచింది. విధిలేదు. కట్ చేసినాడు.

అన్ని reproductive parts ను మంచిగా వేరు చేసి వాటికి లేబిల్ చేసినాడు. పిమ్మట ఒక కాగితము పైని దించి లేబిల్ చేసినాడు. అన్నీ సరిగ్గా చేసితినా లేదా అని మరి ఒకసారి చూసుకొని లాబ్‌నుండి వెడలిపోయినాడు.

హాస్టల్‌కు పోగానే స్నానం చేసి బట్టలు మార్చుకొన్నాడు. ఆనాడు రాత్రి భోజనం ముట్టలేదు. వట్టి టీ త్రాగి పడుకున్నాడు.

ఆ మరునాడు కూడా తిండి నోటికి పోలేదు.

నాలగవనాడు మాత్రము ఇంత breakfast చేసినాడు. ఈ మూడు రోజులు టీ మీదనే బ్రతికినాడు విక్రం పాపం. విక్రం వెజిటేరియన్ అని వేరే చెప్పవలెనా, పాపం pure vegetarin.

పరీక్షలయిపోయినవి. ఇక కొద్దిరోజులలో కాలేజీ మరి హాస్టళ్లు మూసివేస్తారు.

విక్రం వూరికి వెళ్లవలెనా సిటీలోనే వుండవలెనా అన్న ఆలోచన. ఇతనికి పల్లెటూరి జీవితమంటే అప్పుడే అంత ఇష్టంగా లేకుండెను. ఇప్పుడైతే ఎవరున్నారా పల్లెటూళ్లలో కొన్ని రోజులు తమ పల్లెలో మరి కొన్ని రోజులు పట్టణములో నుండవలెనని నిశ్చయించుకున్నాడు.

ఈ వేసవి సెలవుల్లో హైస్కూలులో నున్నప్పుడు ప్రప్రథమంగా చాలా ఎన్‌జాయ్ చేసేవాడు కాని, రానురాను పట్టణం మోజు పెరిగిపోయింది.

పల్లెటూళ్లలో పచ్చని చేలు, ప్రకృతి సౌందర్యం విక్రం కిష్టమే కాని, అచ్చట స్నేహితులేరు. ఇతనొకడే ఆ పల్లెటూరి మొత్తంలో కాలేజీలో చదువుతున్న విద్యార్థి. తక్కిన వారంత కొంచెం పల్లెటూరి చదువు నేర్చుకొని ఏవో చిన్న వ్యాపారం లేదా కుల వృత్తి నిర్వర్తిస్తూ జీవించేవారు. అందువల్ల ఈ జీవితం చాలా నిస్సారంగా తోచింది.

అయినా, ఇది స్వాతంత్ర్య పోరాటయుగము. భారతీయులంతా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటున్నారు.

అందువల్ల, విక్రం వెంకటకృష్ణుడు కూడా వారి పాత్ర నిర్వర్తించుకోవలెనని అనుకొన్నారు. అది ఒకరు చెప్పితే వచ్చేది కాదు. అది తనలో ఉద్భవిస్తున్న ఒక పోరాటకాంక్ష.

అందుకనే వీరు ఒక పథకం వేశారు.

ఒక బుర్రకథ బృందంతో పొత్తు కుదుర్చుకొన్నారు. ఆనాడు పల్లెలలో జాగృతి నిజాంకు వారి రజాకార్లకు బృందానికి విరుద్ధంగా తేవాలంటే ఈ నిరక్షరాస్యులగు పల్లెటూరి ప్రజలకు బుర్రకథే మంచి సాధనమని తెలుసుకొన్నారు. వూళ్ళలో ఆనాడు తందాన పాటలు, బాలనాగమ్మ కథలు, ఒగ్గుకథలు వినుటకు పల్లెటూరి ప్రజలు సాయంకాల సమయమందు గుంపులు గుంపులుగా వచ్చేవారు.

వెంకటకృష్ణుడు విక్రం ఒక బుర్రకథ బృందంతో సాయంకాలమందు ప్రజలను గుమి కూర్చి వారికి స్వాతంత్ర్య పోరాట ప్రాముఖ్యతను గురించి మొదట ఉపన్యాసరూపంలో వారికి తెల్పేవారు. పిమ్మట బుర్రకథ బృందం బుర్రకథ మొదలుపెట్టేవారు. యీ బుర్రకథ బృందము మంచిదే. వీరు గాంధి, నెహ్రూ మొదలగు దేశనాయకుల గురించి బుర్రకథలో తెల్పేవారు. వీరి శైలి, కంఠం శ్రవణానందంగా ఉండేది. ప్రజలలో ఉత్తేజాన్ని పుట్టించేది. పిమ్మట స్వతంత్ర భారతికి జై, మహాత్మగాంధీకి జై, జవహర్‌లాల్ నెహ్రూకి జై అన్న నినాదాలు లేపి ఒక procession గా యీ నినాదాలతో వూరంతా వూరేగింపు జరిపి ప్రజలను యింటికి పంపించి వీరిద్దరు కూడా విక్రం యింటికి వచ్చి భోంచేసి నిద్రించేవారు. యీ విధంగా విక్రం, వెంకటకృష్ణుడు ఆ చుట్టుమట్టున్న 8, 10 గ్రామాలలో ఉద్యమాన్ని లేవదీయుటలో సఫలీకృతులైనారు.

ఏ యుగంలోనైన ఒక నూతన మార్పు సమాజములో తీసుకురావాలంటే మొదట యువతీ యువకులు ముందుకు రావాలి. అప్పుడే ఆ ఉద్యమము సఫలీకృతమౌతది. అంతేకాదు ప్రజలలో ఆ మార్పుకు నిశ్చలమనస్సుతో సహకారము వుండాలె. యువకులు ముందంజవేసి యీ ప్రజలతో పని చేస్తే ప్రజలు ఏకీభవిస్తారు. అందువల్ల ఆ ఉద్యమానికి సంపూర్ణ సార్థకత లభిస్తుంది. యిప్పుడు మన 10 వూళ్లకు విక్రం, వెంకటకృష్ణుడు ముఖ్య నాయకులు. యువకులంతా ముందు నడుపదలచుకున్న కార్యక్రమాన్ని గురించి వీరిద్దరితో చర్చించేది. దానికి వీరు కడు నేర్పరితో యీ గ్రామ యువకులకు మంచి చెడు యేది అనె విచక్షణా జ్ఞానాన్ని బోధించేది యెందుకంటే యీ యువకులలో నున్న యీ enthusiasm మంచి దారిని నడిపించాలనే యీ యిద్దరి కాంక్ష. ఆనాడు తీవ్రవాదులు కూడా వుండిరి. వారు అన్ని హింసా కార్యాల మార్గాన్ని బలపరిచేది. సంగీతానికి చింతకాయలు రాలవని వారి నమ్మకం. అందుకే వారి వివాదాన్ని విక్రం ప్రత్యేకంగ వెంకటకృష్ణుడు గట్టిగా oppose చేసేది. యువకులకు బహుశః తీవ్రవాదమే నచ్చుతుంది. కాని వారిలో కొంచెం అనుభవం, జ్ఞానం కలిగితే వారిలో చాలా శాతము యీ తీవ్రవాదాన్ని ఒప్పుకోరు. యిప్పుడు యీ ఉద్యమములో చేరిన యీ పల్లెటూరి యువకులు కొంతమంది నిరక్షరాస్యులు, కొంతమంది అక్షరాస్యులు. యీ కాలంలో వూళ్లలో స్కూళ్ళు లేకుండె కాబట్టి యేపంతులు వద్దనో కొంచెం తెలుగు నేర్చుకునేవారు.

అది వారికి గొప్పవిద్య. అయితే విక్రం, వెంకటకృష్ణుడు ఒక గ్రంథాలయం విక్రం వూరిలో నిర్వర్తించవలెనని నిశ్చయించుకున్నారు. విక్రం ఊరి చివరకు ఒక యింటిని తీసుకున్నారు. దానిని ఒక వూరి రైతు కట్టించుకున్నాడు. కాని, యిప్పుడాయన ఆ వూరు వీడిపోయినాడు. విక్రం, వెంకటకృష్ణుడు ఆ రైతువున్న వూరికి వెడలి ఆయనతో సంప్రదించి ఆ యింటిని తీసుకున్నారు. యిక ముఖ్యమైనవి చదువు పుస్తకాలు magazines. మరి వార్తాపత్రికలు పుస్తకాలు కొనుటకు డబ్బు కావాలి. అది యీ తొందరలో కాదు. అందువల్ల ఒక రెండు వార్తాపత్రికలు, రెండు magazines చదువుకున్న వారు వచ్చి చదువుకుంటారుగాని యీ యింటిని పూర్తిగా వినియోగించుకోవాలంటే దీనిని వయోజన పాఠశాలగా తయారు చేస్తే బాగుంటుందని అభిప్రాయపడ్డారు. యీ విధంగా ఇది వయోజన విద్యాభ్యాసానికే కాకుండ ఒక మీటింగు స్థలంగా కూడా ఉపయోగానికి తెచ్చారు. అయితే వూరిలో విద్యరాని యువకులకు విద్యనేర్పేదెవరు! విక్రం వూళ్ళో కొంతవరకు అంటె IV$^{th}$ standard అట్లా చదివి ముగించిన వారు కొంత మంది వున్నారు. వారి సహకారాన్ని సాయంకాలం ఒక 3, 4 గంటలు విక్రం, వెంకటకృష్ణులు కోరినారు. ఆ సహకారం లభించింది. యిక వూరిలో వయోజన విద్య ప్రారంభం అయ్యింది.

ఆనాడు ప్రతి కాలేజ్ విద్యార్థి, మరి కొంతమంది senior high లో వున్న విద్యార్థులు చాలా పల్లెటూళ్ళలో యీ స్వాతంత్ర్య కాంక్షను లేవదీయుటకు వారి వారి శక్త్యానుసారము మొత్తం రాష్ట్రంలో ప్రయత్నాలు జరుపుతునే వున్నారు. వీరు కాక కొంతమంది లాయర్లు వాళ్ల కుటుంబాలు కూడా యీ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. వీరందరి కృషి వల్ల యిప్పుడు రాష్ట్రంలో స్వాతంత్ర్య సమరము రాష్ట్ర మూల మూలలా పాకినది. కాని గ్రామాధికారులు యింకను నిజాం అండగా నిలిచి వున్నారు. కొందరు తప్ప చాలా మట్టుకు యీ గ్రామపెద్దలు గ్రామాధికారులు కొంత మట్టుకు నిజాంకు మద్దతుగానే నిలిచి ఉండినారు. కానీ వీరి సంతానము ప్రత్యేకంగా చదువుకున్న బాల బాలికలు వీరిని వ్యతిరేకించారు.

విక్రం, వెంకటకృష్ణుడు స్వాతంత్ర్య సమరాన్ని అహింసా పూర్వంగా సాగించిన యిది యీ గ్రామాలలో కొంతమందికి నచ్చలేదు. యెవరో ఒకరు వీరిద్దరి మీద ప్రభుత్వానికి ఫిర్యాదు చేసినారు. తద్మూలంగా యీ యిద్దరి పైకి warant issue అయినట్లు ధర్మారావు గారికి తెలిసింది. వెంటనే విక్రంను వేరే తాలూకాలో మున్న విక్రం తాతగారింటికి విక్రంను పంపించినాడు. వెంకటకృష్ణున్ని తన స్వంత వూరికి పొమ్మన్నాడు. వెంకటకృష్ణుడు భయపడలేదు. కాని విక్రం లేనిది తను ఒంటరివాడు యేమి చేయజాలుతాను, తన వూరిలో బహుశః యిక యెవరిసహాయంతోనైనా యీ ఉద్యమం ప్రారంభింపవచ్చునని వెడలిపోయినాడు. ధర్మారావు విక్రంను తీసికొని తన అత్తగారి యింటికి వెడలినాడు. వీరి మామగారు ధర్మారావుని చూచి యేం నాయనా యేమిటి సంగతులు అనగానే అన్ని విషయాలు క్లుప్తంగా వివరించి యిక్కడనే భద్రంగా కాపాడమని బయలుదేరి వెడలిపోయినాడు. విక్రం తాతగారితో రోజూ కబుర్లతో కాలం గడిపేది. యీ వూరు చిన్నది. యిక్కడి తాతగారిదే సర్వాధికారము. ఆయన **అన్నది** కాదనినవారు యీనాటికి ఆ చిన్న పల్లెటూరిలో

యెవరులేరు. ముదుసలితనము వచ్చి గంభీరమైన తెల్లని కాయము. ఆరు అడుగుల యెత్తైన విగ్రహము. పొడుగాటి ముక్కు, ఖద్దరు ధరిస్తాడు. గాంధీ తత్వాన్ని గురించి కాదు. వీళ్ల యింట్లో గాంధి బోధనకుముందే విక్రం అమ్మమ్మ రాట్నం వడకుతూ వుండేది. అదే దారం ఆ వూళ్లో సాలెవారు నేసి యీ గురువారాయుడి గారికి యిచ్చేది. యీ బట్టనే ఆ వూరి మేర వీరయ్య చొక్కాలుగా కుట్టి వీరికి సమర్పించేది. యిక వీరు కట్టే ధోతులు యీవూరి సాలె నేసి యిచ్చేది. యిది గురువారాయుడి బ్రతుకు. ఆ వూరిలో అతనికి యిద్దరు కుమారులు, శ్రీలత పెద్ద కూతురు. విక్రం తల్లి, మనుమడిని చూచుకొంటూ యిద్దరు దంపతులు కడు జాగ్రత్తతో మెలుగుచుండిరి. విక్రం యిక్కడ తిని పడుకోవటం తప్ప వేరే చేసేది యేమీలేదు. అయినా కాలం మనది కానప్పుడు చేయునది యేమున్నది. కొద్దిరోజులు యిచటవుండి పిమ్మట యెటుపోయేదీ యేమిచేసేది ఆలోచించుదామన్న వుద్దేశంతో ఉండి పోయినాడు. శ్రీలత, ధర్మారావు యిది చాలా safe place అని తన తల్లి తండ్రి విక్రంను అన్నిటినుండి రక్షిస్తారని అనుకొన్నారు. అలాగే విక్రం యింతవరకు క్షేమంగానున్నాడు. గురువారాయుడిది పెద్దయిల్లు. కావలసినంత స్థలముంది. అందులో దానిమ్మ, నారింజ, జామచెట్లున్నాయి. ఒకటి రెండు మామిడి చెట్లు కూడా వున్నాయి. అందువల్ల యెప్పుడూ యేదో ఒక ఫలము ఆ యింటిలో ఉంటుంది.

ఒకనాడు సాయంకాలం గురువారాయుడు యింటి అరుగుమీద కూర్చొని వున్నాడూ. వూరి వారు కొంతమంది అతనితో మాట్లాడుతూ వాకిట్లో కూర్చువ్నారు. యింతలో ఒక గుర్రపురౌతు gate దగ్గరికి వచ్చి గుర్రాన్ని దిగి గేటు పీకులకు గుర్రాన్ని కట్టి లోనికి ప్రవేశించి గురువారాయుడికు వంగి సలాము కొట్టి వారిని సమీపించి ఒక కాగితం వారి చేతికిచ్చెను. గురువారాయుడు అది చదివి మీకెవరు చెప్పినారు యీ వ్యక్తి మాయింట్లోనున్నాడని? యెదురు ప్రశ్నవేయలేదు. యితడు మాయింట్లో లేడని నిర్భయంగా చెప్పినాడు. యింతటితో ఆ గుర్రముమీద వచ్చిన పోలీసు బంట్రోతు వెడలి పోయినాడు. ఆ గుమ్మంలో నుండి విన్న విక్రం అమ్మమ్మ ఈ మాటలు వింది. తక్షణమే మేడమీద ఉన్న విక్రంకు యీ విషయము చెప్పింది. నాయనా నిన్ను arrest చేయుటకు వచ్చినాడనే నా అనుమానం. తాతగారు పంపించి వేసినారు కాని మళ్లీ రాడని నమ్మకమేమిటి? కాబట్టి మీ మామగారిని పిలుస్తాము యిక్కడనే ఉండు అని తన పెద్దకుమారుడగు నందకుమారుని పిలిచి నాయన విక్రంని తక్షణమే యీ యింటి నుండి తప్పించు. యెంత తొందరలో యీ పనిచేస్తే అంత మంచిది. విక్రంకేమన్నా అయితే మీ అక్కగారు భరించలేదు అని చెప్పినది. అప్పుడు పాపం నందకుమార్ తక్షణమే విక్రంతో సరే పోదాము పద అన్నాడు. అప్పుడు విక్రం వట్టి బనీను లుంగీతో మంచం మీద పడుకొని యున్నాడు. సరే మావయ్య అంటూ విక్రం నందకూమార్ననుసరించినాడు. యిద్దరిలో భయం ఆవరించుకపోయింది. అప్పుడు విక్రంకు యేమీ తోచలేదు. నందకుమారుకు కూడా అంతే. అందువల్ల యిద్దరు జీవితంలో యెన్నడూ సాహసించని పని చేసినారు. అప్పుడే సాయం సమయం సూర్యుడు అస్తమించి 30 నిమిషాలైనా అయివుంటుంది. నందకుమార్ మరి విక్రం వెనకకు డాబా పైకి వెళ్ళి క్రిందికి ఆలోచించకుండానే

దుమికినారు. యింటివెనక అంతా బయలు భూమే. అందులో రేగుపొదలు రాళ్లు రప్పలు ఉంటాయి. మామూలు సమయాలలో పాదరక్షలులేనిది వీటిల్లో అడుగు పెట్టరు యెవరు కూడా. ఆ తొందరలో మామా అల్లుళ్లు యేమీ చూడలేదు, బ్రతికితిమి దేవుడా అన్నట్లు అతివేగంగా చీకటిలో యేదీ చూడకుండా ఆ బయళ్లలో పరుగెత్తుతున్నారు. రేగు పొదలలో రాళ్లలో వీరికి యేమీ కానరాలేదు. యేది యేమిటి ముళ్ళు గ్రుచ్చు కుంటాయా, రాళ్లు కాళ్ళకు గ్రుచ్చుకుంటాయా అన్న బెడద లేకుండా పరుగెత్తినారు. 30 నిమిషాలు పరుగెత్తిన పిదప నందకుమార్‌కు తమముందే ఒక బావి కనుపించింది. అక్కడికి విక్రంను తీసుకువచ్చినాడు. ఆ కమ్మ గుడిసెల్లో వీళ్ల పాలేర్లు ఉండాలి కాని అందరూ సాయంకాలానికి తినుటకై వూరు చేరుకున్నారు. పశువులు తప్ప అక్కడ మానవుడనే వాడేలేదు. నందకుమార్ విక్రంను ఆ నులక మంచం మీద కూర్చుండబెట్టి విక్రంతో యిచట నీకే అపాయముండదు. నీవిచటనే rest తీసుకో నేను యింటికి వెళ్ళి నీకు మన పాలేరుతో అన్నం పంపిస్తాను రాత్రికి యిచ్చటే విశ్రమించు. రేపు చీకటి వుండగానే మన కచ్చడంపై నీవు భువనపల్లెకు వెళ్ళి రైలు యెక్క మీ బసకు చేరు పట్టణంలో. అచ్చటికి వెళ్లిన తర్వాత నిన్నెవరు యేమీ చేయలేరు. యెందుకంటె నీవు అక్కడ వున్నట్లు యెవరికీ తెలియదు అన్నాడు. అన్నట్లే ఒక పాలేరు అన్నం మరి కొంత డబ్బుతో వచ్చాడు. అన్నం తిన్న పిమ్మట పాలేరు 'అయ్యా మీరు నిశ్చింతంగా పడుకోండి. ఉదయం చీకటి వుండగానే మిమ్ములను భువనపల్లెకు చేరుస్తాను' అని చెప్పగానే సరే అని విక్రం నిద్రపోయినాడు. విక్రం పడుకున్న బట్టలు కూడా అమ్మమ్మ యింటివే. అనుకున్న ప్రకారము ఉదయమే భువనపల్లెకు చేరుకున్నాడు. 30 నిముషాల పిమ్మట train దిగగానే ఒక టాంగాలో యింటికి చేరుకున్నాడు. అతనికి కావలసిన బట్టలు మరి యితర సామానులు తీసుకొని హాస్టలు చేరుకున్నాడు. ward boy Hussain ఒక సలాం కొట్టి రూం తెరచినాడు. విక్రం స్నానం చేసి బట్టలు మార్చుకొని మంచం మీది కొరిగిపోయినాడు.

ఆనాటినుండి పోలీసులు వూరిలో వెతకినారు. విక్రం అమ్మమ్మ వారియింటికి మళ్ళీ వచ్చి యింట్లో సోదా చేసుకొన్నారు. విక్రం దొరుకనందున గురువారాయుడికి క్షమాపణ చెప్పి వెడలి పోయినారు. విక్రం; నేను క్షేమంగా హాస్టల్‌లో వున్నానని గూఢంగా మనుషులతో చెప్పి పంపించినాడు తండ్రిగారికి. తండ్రిగారు అమ్మమ్మ తాతవారు అంతా విక్రంని వదలి వెళ్ళిన పిమ్మట తన వూళ్ళో తన ఉద్యమాన్ని యేదో విధంగా నడుపుతునే ఉన్నాడు. కొంతమంది యువకులతో రాత్రిళ్ళు తన వూళ్ళో, మరి వేరే వూళ్ళలో కూడా చెట్ల పైన తిరంగా జండాలు యెగురవేసి వూళ్ళోని తెల్లగోడలపైన నినాదాలు వ్రాయించి బాగా రాత్రి అయిన పిమ్మట యింటికి చేరుకునే వాడు. ఉదయం లేవగానే వూరి ప్రజలంతా చూసేది కాని నిజాం రజాకార్ల రక్షక భటులు వీటిని చూసి యెవరు చేసినారీ పనిని అని అందరిని బెదరించి అడిగేవారట కాని యెవరూ మాకు తెలియదు మాకు తెలియదు అని పోయేవారు. కొన్ని సమయములందు అనుమానమున్న వాళ్లను పట్టుకెళ్లి కొట్టి హింసించి యెవరు చేసిన పని యిది అని అడిగితే పాపం వాళ్లకు తెలియనిది యేమి

చెప్పుతారు. తుదకు వారిచే యేమియు చెప్పించలేక యెవరు చేసినది తెలుసుకోలేక విడిచి పెట్టేది. యీ విధంగా కొందరు అమాయకులు దెబ్బలు తిన్నారు కాని వెంకటకృష్ణుని ఉద్యమము పల్లెటూళ్లలో ప్రాకినది.

విక్రం వెంకటకృష్ణునివలెనే విశ్వవిద్యాలయము మరి మూడు కాలేజీల్లో చదువుచున్న వందలాది విద్యార్థులు వేసవిలో యీ ఉద్యమంలోనే పనిచేసినారు. కాని organisation అనేది లేకుండెను. యెవరికి తోచింది వారు చేసినారు. కొంతమంది యీ పల్లెటూళ్ళలో యీ రజాకార్స్‌తో సాయుధ పోరాటము జరిపి ఆహుతయిపోయినారు. అట్టి వారిని యీనాడు యెవరూ జ్ఞాపకం కూడా చేస్తులేరు. వాళ్లు యేది ఆశించకుండానే మాతృదాస్య విముక్తి సేవకై ప్రాణాలు వదిలిన వీరయోధులు. వారికి నా నమస్సుమాంజలులను అర్పింపక తప్పదు.

చూస్తుండగానే May నెల గడచి పోయినది. కళాశాలలు తెరచినారు. కొంతమంది మరలి రాలేదు. వారు ఈ లోకంలో ఉంటేగా వచ్చేది. కాలేజీలో చేరిన 2, 3 వారాలకే మళ్లీ యీ స్వాతంత్ర్య పోరాట ఉద్యమం బయలుదేరింది. యిప్పుడు ఒక పద్ధతిలో జరుగుతుంది. ఒక విద్యార్థి అసోసియేషన్ యేర్పడింది. యిది విద్యార్థులచే ఒక Pledge కాగితము మీద సంతకాలు చేయించుకుంది. దీనిని quit college movement అని పేరు పెట్టింది. కాని యీ quit చేసిన పిమ్మట యేమి కర్తవ్యము విద్యార్థులది అని మాత్రము నిర్ధారణ చేయలేదు. చాలా మంది విద్యార్థులు ఈ ఉద్యమం పిలుపు ప్రకారము కాలేజ్ విడచి తమ తమ వూళ్లకు చేరుకున్నారు. కొంతమంది మాత్రము సంతకాలు చేసి కూడా picket చేస్తూ వాళ్లకు నచ్చచెప్పటకు regular గా కాలేజికి వెళ్లుచున్నారు. వాళ్లను పోనీయకుండ కొంతమంది ప్రయత్నిస్తున్నారు. కొందరు వాళ్ళ యిబ్బందులను చెప్పచు మరి కొందరు యెంత చెప్పినా విని కాలేజ్‌కు పోవుట జరుగుతూ వుంది. విక్రం యిప్పుడు hostel లోనే వున్నాడు, కాని classes కు పోవటం లేదు. క్లాసెస్‌కు పోయే విద్యార్థులను పికెటింగ్ చేస్తూ గ్రూపులో పనిచేస్తున్నాడు. యీ picketing యేమంత జయప్రదం కాలేదు. యిష్టం లేని వాళ్ళకు యెంత చెప్పినా ప్రయోజనముండదు. అందులో ముస్లిం విద్యార్థులు యీ ఉద్యమం లో పాల్గొనక పోవటమే కాక picketing చేసే వారి పేర్లు వ్రాసి మరి వేరే విశ్వవిద్యాలయ Administration కు పంపిచేవారు. కాని వారు యీ కాలేజి విడచిన వారిని యేమి చేయగలరు. యేమియులేదు. యిది July మాసము. August 15 నాడు యెర్రకోట పైనుండి బ్రిటీష్ జండా దింపి స్వతంత్ర భారత తిరంగా జండా యెగురుతుంది. ఆనాడు యిన్నేండ్లుగా స్వాతంత్ర్యానికై ప్రాణాలర్పించిన వీర భారతీయుల కల నిజమౌతుంది. కాని వారు చూడలేదు కదా యీ శుభ సమయాన్ని. హైద్రాబాదులో రజాకార్ల దౌర్జన్యం ఆకాశాన్నంటుకుంది. చాలామంది పల్లెటూళ్ళలో నివసించెవారు, విక్రం వంటి warrant లున్నవారు యీ రజాకార్ల దౌర్జన్యం నుండి తప్పకొని సరిహద్దు రాష్ట్రాలకు వలస పోతున్నారు. విక్రం, వెంకటకృష్ణుడు మాత్రం పోదలుచుకోలేదు. యెందుకంటె వీళ్ళమీద వారంట్లు వున్నాయి. యేవిధంగానైనా వీళ్లు చిక్కితే యీ రక్షకభటులు, రజాకార్లు వీళ్లని

హింసించక విడవరని వీరిద్దరి అనుమానము అందుకని యిద్దరూ హాస్టలులోనే ఉండి పోయినారు. కొంత మంది విద్యార్థులు యెక్కువ ముస్లిం విద్యార్థులు మరికొంత మంది హిందు విద్యార్థులు వున్నారు. కాబట్టి dining hall తెరచి వుంచినారు. క్లాసెస్ జరుగుతునే ఉన్నాయి. విక్రం, వెంకటకృష్ణుడు క్లాసెస్ కు మాత్రం పోవడం లేదు. కాని హాస్టల్‌లోనే ఉంటున్నారు. యింక వీరికి తోడు వీరివలెనే classes బహిష్కరించి హాస్టలులో వుంటున్నారు. మరికొంతమంది విక్రం వలెనే warrants వున్నవారు కూడా యీ hostel లోనే వున్నారు. కాని ఒకరి గుట్టు యింకొకరికి తెలియదు. closeగా వున్న friends కు తప్ప యెవరికీ తెలియదు. యూనివర్సిటీలో వుండుట చాలా safe అనుకున్నారు. యెందుకంటే అప్పుడు విశ్వవిద్యాలయము అంటే గౌరవము, ఘనత కూడా వుండెను. అనాడు యేకొద్ది మందికో యీ previlege లభించేది. రోజూ భోంచేసి యేమైనా పికిటింగ్ చేసేది వుంటే అది వుదయము ముగించుకొని పిమ్మట హాస్టల్‌కు చేరుకునేది. యిప్పుడు వెంకటకృష్ణుడు కూడా విక్రం గదిలోనే ఉంటున్నాడు. day scholar గా తనతో భోంచేస్తూ వున్నాడు. వనజమ్మ తన యిద్దరి కూతుళ్ళతో యిప్పుడు ఆంధ్రలో నున్నారు. ధర్మారావు శ్రీలత మాత్రము వూరిలోనే వున్నారు. అక్కడ పరిస్థితులు యింక ఆ దశలోకి చేరలేదు. చేరితే వెడలి పోదామనుకొని తణుకులో ఒక యిల్లు అద్దెకు తీసుకొని వుంచినారు.

July గడచిపోయింది. August వచ్చింది. అందరూ ఆ 15 వ శుభ దినానికి వేచి యున్నారు. గాంధీగారు మాత్రం యిది శుభదినంగా భావించలేదు. యెందుకంటె యిది వేల సంవత్సరాలుగా వస్తున్న భారతి చీలి రెండు ముక్కలుగా చీలిపోయింది. ప్రతిరోజు విక్రం, వెంకటకృష్ణుడు యింక 15 కు యిన్ని రోజులని లెక్కిస్తూ హాస్టల్‌లో కూర్చున్నారు. 14 వ అగస్టు రానే వచ్చింది. యిద్దరూ అనాడు రాత్రి ఒక radio వద్ద కూర్చుని ఆ స్వాతంత్ర్య పండుగ ఉత్సవాలను రేడియోలో వింటున్నారు. అనాడు ఈనాటి వలె ఎలక్ట్రానిక్ రివల్యూషన్ లేదు. ఒక రేడియో వుంటే మాహాభాగ్యము. విక్రం మరి వెంకటకృష్ణునితో చాలా మంది ఆ గదిలోవున్నారు. ఇది రహస్యంగా వింటున్నారు. యెందుకంటె ముస్లిం విద్యార్థి యెవడు చూచిన ముప్పు అని వీరికి తెలుసు. అందులో యీవరకు చెప్పినట్లు వార్డెన్ మాత్రం చాలా మంచివాడు అందుకే కొంచెం ధైర్యంగా వున్నారు. విద్యార్థులు అందరూ వింటుండగానే 12 గంటల రాత్రి అయ్యింది. అప్పుడు అంతా తిరంగాను లాల్‌ఖిల్లాపై అవిష్కరించారు. బ్రిటీష్ ప్రభుత్వానికి యిది అఖరిరోజు. రాధాకృష్ణన్, నెహ్రూగారు దేశ ప్రజలను address చేస్తూ యీ శుభదినాన్ని గురించి వుపన్యసించారు. బహుశః రాధాకృష్ణన్ వుపన్యాసానంతరం విశ్వకల్యాణ్ అని సంభోదించినారనుకుంటా. అప్పుడు భారతదేశం చాలా చాలా బీదదేశం. అయినా మన వూహాలు చాలా గొప్పవి. అవి చాలా కాలం వరకు నిజం కాకుండ వుండటానికే యీ భారతదేశాన్ని విభజించారు. కొంతమంది దీనిపై వ్యాఖ్యానించారు. కొందరు మాత్రం "మాటలు కోటలెక్కుతాయి కాళ్లు తంగ లెక్కకున్నా" అని విమర్శించారు. యీ విశ్వకళ్యాణ్ ముగింపును విని. అది నిజమేమో అనిపించింది. దరిద్రనారాయణుడు తాండవ

మాడుతున్న యీ పవిత్ర భారతావని అదికూడా విభజించబడ్డ యీ భారతావనియెలా దీన్ని సాధిస్తోంది అన్నారు. అది నిజమే కాని ఆదర్శ భావన లుండుటలో తప్పేమీలేదు కదా. అనాటి అల్లకల్లోల పరిస్థితులలో యీ ఒక్క ఆశాకిరణాన్ని సృష్టించే నినాదాన్ని లేపితే తప్పే ముందనుకొన్నారు. విక్రం, మరి వెంకటకృష్ణుడు.

భారతావనికి స్వాతంత్ర్యం లభించిది కాని హైదరాబాదు యింక దాస్యశృంఖలాల లోనే వుంది. హైద్రాబాద్ నిజాం స్వతంత్ర ప్రభుత్వంగా వెల్లడించాడు. 15 ఆగస్టు నాడు యితడు తక్కిన రాజులవలె భారతావనిలో చేరిపోతే అందరికి వున్నట్లు యీన హక్కులు కూడా చాలా వరకు దక్కపోతూ వుండె. భారత నూతన ప్రభుత్వము యెంత చెప్పినా వినకుండ స్వతంత్రంగా వుంటున్నాడు. యిది ముస్లింల ప్లాను ప్రకారము దక్షిణ పాకిస్తానుగా చేద్దామనుకున్నారు. పశ్చిమ పాకిస్తాను, తూరుపు పాకిస్తాన్ అప్పటికే నిర్ధారింపబడ్డాయి. ఈ దక్షిణ పాకిస్తానును బ్రిటీష్‌వారు చేసిన ప్లానులా లేదు. కాని పరిపాలకులు ముస్లిం కాబట్టి ఇచ్చుటనున్న Majority ముస్లింలు. దీనిని దక్షిణ పాకిస్తానుగా పాకిస్తానుకు చేరాలని వుండెకాని యీ మధ్యలో వున్న రాష్ట్రం పాకిస్తాన్‌లో యెట్లా కలుస్తుందని యెవరూ ఆలోచించలేదు. 15th August కు మొదలు మచిలీపట్టణపు ఓడరేవును తమ భూభాగంలో చేర్చుకుంటే తూర్పు పాకిస్తానుకు ఉన్నట్లే సముద్రములో పశ్చిమ పాకిస్తానులో కలిసిపోవచ్చు అని అనుకున్నారు. కాని యిప్పుడు స్వతంత్ర భారతము అన్ని వైపుల నున్నప్పుడు యీ scheme యెలా రూపం ధరిస్తుందని యెవరూ ఆలోచించలేదు కాని స్వతంత్రాన్ని చాటించారు. యిది కాశ్మీరు రెండు మిగిలిపోయినాయి. యివి రెండు తప్ప అందరు రాజులు పాలించే రాజ్యాలు భారతములోనే పాకిస్తానములోనే కలిసి పోయినవి. హిందుస్థానములో మట్టుకు యీ కఠిన కార్యాన్ని సాధించిన ఘనత పటేలుకు దక్కుతుంది. నెహ్రూ మాత్రము యీ కార్యాన్ని సాధించక పోతుండె. నెహ్రూ ఒక్క idealist. మాటలు మాట్లాడి తప్ప కార్య సాధన శూన్యము. యిది idealist కు ఉండే రోగమని కొందరంటుంటారు. Kashmir మరియు Tibet సమస్యల కితడే బాధ్యత వహించాలని మరికొంత మంది అంటారు. యీ విషయమై చరిత్రకారుల viewes యేమైన యింకముందురానున్న చరిత్రయే దీనికి జవాబిస్తుంది. యిప్పుడు మనము దీనిపై final verdict ను pass చేయుట వుచితము కాదు.

భారతావనికి స్వాతంత్ర్యం వచ్చింది కాని హైద్రాబాదు ప్రజలు యింక దాస్య శృంఖలాలలోనే బంధించబడివున్నారు. పోరాటము సాగుతూనే వుంది. హైదరాబాదుకు చుట్టు ముట్టు స్వతంత్రించిన రాష్ట్రాలు. హైదరాబాదు యెలా జీవించగలదు. యీనాడు కాకున్న కొన్ని సంవత్సరాలకు యిది ఆర్థికంగా చిక్కుల్లోపడి స్వతంత్ర భారతానికి దాసోహం అనక తప్పదని చాలా మంది ఆశిస్తూ కూర్చున్నారు. కాని రజాకార్ల దౌర్జన్యాలను యెలా యెదుర్కోవాలన్నది ఒకటి సమస్య. యిదివరకే కొంత మంది సాయుధ పోరాటాన్ని నడుపుతునే వున్నారు. యిప్పుడు దానిని intensify చేయాలని నిశ్చయించినారు. ప్రజలలో ఉత్సాహము వున్నా, ఆయుధాలు లేవు. అందుకే కొంత మంది హైదరాబాదు ప్రజానాయకులు నెహ్రూ గారివద్దకి వెళ్ళి అయ్యా మాకు ఆయుధాలన్నా యిప్పించండి లేదా మమ్ములినందరిని తురకలుగా

హింసించక విడవరని వీరిద్దరి అనుమానము అందుకని యిద్దరూ హోస్టలులోనే ఉండి పోయినారు. కొంత మంది విద్యార్థులు యెక్కువ ముస్లిం విద్యార్థులు మరికొంత మంది హిందు విద్యార్థులు వున్నారు. కాబట్టి dining hall తెరచి వుంచినారు. క్లాసెస్ జరుగుతునే ఉన్నాయి. విక్రం, వెంకటకృష్ణుడు క్లాసెస్ కు మాత్రం పోవడం లేదు. కాని హోస్టల్ లోనే ఉంటున్నారు. యింక వీరికి తోడు వీరివలెనే classes బహిష్కరించి హోస్టలులో వుంటున్నారు. మరికొంతమంది విక్రం వలెనే warrants వున్నవారు కూడా యీ hostel లోనే వున్నారు. కాని ఒకరి గుట్టు యింకొకరికి తెలియదు closeగా వున్న friends కు తప్ప యెవరికీ తెలియదు. యూనివర్సిటీలో వుండుట చాలా safe అనుకున్నారు. యెందుకంటే అప్పుడు విశ్వవిద్యాలయము అంటే గౌరవము, ఘనత కూడా వుండెను. అనాడు యేకొద్ది మందికో యీ previlege లభించేది. రోజా భోంచేసి యేమైనా పికిటింగ్ చేసేది వుంటే అది వుదయము ముగించుకొని పిమ్మట హోస్టల్ కు చేరుకునేది. యిప్పుడు వెంకటకృష్ణుడు కూడా విక్రం గదిలోనే ఉంటున్నాడు. day scholar గా తనతో భోంచేస్తూ వున్నాడు. వనజమ్మ తన యిద్దరి కూతుళ్ళతో యిప్పుడు అంధ్రలో మున్నారు. ధర్మారావు శ్రీలత మాత్రము వూరిలోనే వున్నారు. అక్కడ పరిస్థితులు యింక ఆ దశలోకి చేరలేదు చేరితే వెడలి పోదామనుకొని తణుకులో ఒక యిల్లు అద్దెకు తీసుకొని వుంచినారు.

July గడచిపోయింది. August వచ్చింది. అందరూ ఆ 15 వ శుభ దినానికి వేచి యున్నారు. గాంధీగారు మాత్రం యిది శుభదినంగా భావించలేదు. యెందుకంటె యిది వేల సంవత్సరాలుగా వస్తున్న భారతి చీలి రెండు ముక్కలుగా చీలిపోయింది. ప్రతిరోజు విక్రం, వెంకటకృష్ణుడు యింక 15 కు యిన్ని రోజులని లెక్కిస్తూ హోస్టల్ లో కూర్చున్నారు. 14 వ ఆగస్టు రానే వచ్చింది. యిద్దరూ ఆనాడు రాత్రి ఒక radio వద్ద కూర్చుని ఆ స్వాతంత్ర్య పండుగ ఉత్సవాలను రేడియోలో వింటున్నారు. అనాడు ఈనాటి వలె ఎలక్ట్రానిక్ రివల్యూషన్ లేదు. ఒక రేడియో వుంటే మాహాభాగ్యము. విక్రం మరి వెంకటకృష్ణునితో చాలా మంది ఆ గదిలోవున్నారు. ఇది రహస్యంగా వింటున్నారు. యెందుకంటె ముస్లిం విద్యార్థి యెవడు చూచిన ముప్పు అని వీరికి తెలుసు. అందులో యీవరకు చెప్పినట్లు వార్డెన్ మాత్రం చాలా మంచివాడు అందుకే కొంచెం ధైర్యంగా వున్నారు. విద్యార్థులు అందరూ వింటుండగానే 12 గంటల రాత్రి అయ్యింది. అప్పుడు అంతా తిరంగాను లాల్ ఖిల్లాపై అవిష్కరించారు. బ్రిటీష్ ప్రభుత్వానికి యిది ఆఖరిరోజు. రాధాకృష్ణన్, నెహ్రూగారు దేశ ప్రజలను address చేస్తూ యీ శుభదినాన్ని గురించి వుపన్యసించారు. బహుశః రాధాకృష్ణన్ వుపన్యాసానంతరం విశ్వకల్యాణ్ అని సంభోదించినారనుకుంటా. అప్పుడు భారతదేశం చాలా చాలా బీదదేశం. అయినా మన వ్యూహాలు చాలా గొప్పవి. అవి చాలా కాలం వరకు నిజం కాకుండ వుండటానికే యీ భారతదేశాన్ని విభజించారు. కొంతమంది దీనిపై వ్యాఖ్యానించారు. కొందరు మాత్రం "మాటలు కోటలెక్కుతాయి కాళ్లు తంగ లెక్కకున్నా" అని విమర్శించారు. యీ విశ్వకళ్యాణ్ ముగింపును విని. అది నిజమేమో అనిపించింది. దరిద్రనారాయణుడు తాండవ

మాడుతున్న యీ పవిత్ర భారతావని అదికూడా విభజించబడ్డ యీ భారతావనియెలా దీన్ని సాధిస్తోంది అన్నారు. అది నిజమే కాని అదర్శ భావన లుండుటలో తప్పేమీలేదు కదా. అనాటి అల్లకల్లోల పరిస్థితులలో యీ ఒక్క అశాకిరణాన్ని సృష్టించే నినాదాన్ని లేపితే తప్పే ముందనుకొన్నారు. విక్రం, మరి వెంకటకృష్ణుడు.

భారతావనికి స్వాతంత్ర్యం లభించిది కాని హైదరాబాదు యింక దాస్యశృంఖలాల లోనే వుంది. హైద్రాబాద్ నిజాం స్వతంత్ర ప్రభుత్వంగా వెల్లడించాడు. 15 అగస్టు నాడు యితడు తక్కిన రాజులవలె భారతావనిలో చేరిపోతే అందరికి వున్నట్లు యీన హక్కులు కూడా చాలా వరకు దక్కపోతూ వుండె భారత నూతన ప్రభుత్వము యెంత చెప్పినా వినకుండ స్వతంత్రంగా వుంటున్నాడు యిది ముస్లింల ప్లాను ప్రకారము దక్షిణ పాకిస్తానుగా చేద్దామనుకున్నారు. పశ్చిమ పాకిస్తాను, తూరుపు పాకిస్తాన్ అప్పటికే నిర్ధారింపబడ్డాయి. ఈ దక్షిణ పాకిస్తానును బ్రిటీష్‌వారు చేసిన ప్లానులా లేదు. కాని పరిపాలకులు ముస్లిం కాబట్టి ఇచ్చటనున్న Majority ముస్లింలు. దీనిని దక్షిణ పాకిస్తానుగా పాకిస్తానుకు చేరాలని వుండెకాని యీ మధ్యలో వున్న రాష్ట్రం పాకిస్తాన్‌లో యెట్లా కలుస్తుందని యెవరూ ఆలోచించలేదు. 15th August కు మొదలు మచిలీపట్టణపు ఓడరేవును తమ భూభాగంలో చేర్చుకుంటే తూర్పు పాకిస్తానుకు ఉన్నట్లే సముద్రములో పశ్చిమ పాకిస్తానులో కలిసిపోవచ్చు అని అనుకున్నారు. కాని యిప్పుడు స్వతంత్ర భారతము అన్ని వైపుల నున్నప్పుడు యీ scheme యెలా రూపం ధరిస్తుందని యెవరూ ఆలోచించలేదు కాని స్వాతంత్ర్యాన్ని చాటించారు. యిది కాశ్మీరు రెండు మిగిలిపోయినాయి. యివి రెండు తప్ప అందరు రాజులు పాలించే రాజ్యాలు భారతములోనే పాకిస్తానములోనే కలిసి పోయినవి. హిందుస్థానములో మట్టుకు యీ కఠిన కార్యాన్ని సాధించిన ఘనత పటేలుకు దక్కుతుంది. నెహ్రూ మాత్రము యీ కార్యాన్ని సాధించక పోతుండె. నెహ్రూ ఒక్క idealist. మాటలు మాట్లాడి తప్ప కార్య సాధన శూన్యము. యిది idealist కు ఉండే రోగమని కొందరంటుంటారు. Kashmir మరియు Tibet సమస్యల కితడే బాధ్యత వహించాలని మరికొంత మంది అంటారు. యీ విషయమై చరిత్రకారుల viewes యేమైన యింకముందురానున్న చరిత్రయే దీనికి జవాబిస్తుంది. యిప్పుడు మనము దీనిపై final verdict ను pass చేయుట వుచితము కాదు.

భారతావనికి స్వాతంత్ర్యం వచ్చింది కాని హైద్రాబాదు ప్రజలు యింక దాస్య శృంఖలాలలోనే బంధించబడివున్నారు. పోరాటము సాగుతూనే వుంది. హైదరాబాదుకు చుట్టు ముట్టు స్వతంత్రించిన రాష్ట్రాలు. హైదరాబాదు యెలా జీవించగలదు. యీనాడు కాకున్న కొన్ని సంవత్సరాలకు యిది అర్థింకంగా చిక్కుల్లోపడి స్వతంత్ర భారతానికి దాసోహం అనక తప్పదని చాలా మంది ఆశిస్తూ కూర్చున్నారు. కాని రజాకార్ల దౌర్జన్యాలను యెలా యెదుర్కోవాలన్నది ఒకటి సమస్య. యిదివరకే కొంత మంది సాయుధ పోరాటాన్ని నడుపుతునే వున్నారు. యిప్పుడు దానిని intensify చేయాలని నిశ్చయించినారు. ప్రజలలో ఉత్సాహము వున్నా, అయుధాలు లేవు. అందుకే కొంత మంది హైదరాబాదు ప్రజానాయకులు నెహ్రూ గారివద్దకి వెళ్ళి అయ్యా మాకు అయుధాలన్నా యిప్పించండి లేదా మమ్ములినందరిని తురకలుగా

మారుటకు అనుమతించండి. మా ప్రాణాలకు మరీ మా ఆడువారి మానాలకు చాలా ప్రమాదముందని మొర పెట్టుకున్నారట. కాని నెహ్రూ గారు ప్రతిదీ ప్రపంచ దృక్పథంతో చూచేవాడు కాబట్టి ఆయుధాలనిచ్చుటకు ఒప్పుకోలేదట. అదృష్టవశాత్తుగా వీరు సర్దార్ వల్లభాయ్ పటేల్ దగ్గరకు వెళ్లినారట. ఆయన వీళ్లకు ధైర్యం చెప్పి భయము లేదు మేము మీకు ఆయుధాలు యిచ్చుటకు ప్రయత్నిస్తాము. అంతే కాదు యిక చాలా కాలం వరకు మీకు యీ యిక్కట్లు వుండవని తెల్పినారట. అంటే పటేలు గారు యేదో ప్లాను హైదరాబాదు ప్రజల దాస్య విముక్తికై చేస్తున్నాడని గ్రహించి మరలి వచ్చినారట.

యీ రాయబారాలు యిటు జరుగుచుండగా రాష్ట్రంలో యెంతో మంది వీరులు రజాకార్లతో ఘోరంగ పోరాడి వారి గుండెల్లో బల్లెమై కూర్చున్నారు. యిటువంటి వీరుల గాథలెన్నో వున్నాయి. కాని అవి యిందులో వ్రాయుట వీలుకాదు. యెవరైన చరిత్రకారులు యీ అమర వీరుల చరిత్రలు వేరే వ్రాయుటకు ప్రయత్నించుట మంచిది. పొరుగు రాష్ట్రాలకు వలస పోయిన హైదరాబాదు వాసులు రోజూ యీ రజాకార్లను పట్టితెచ్చి వారితో యిచ్చట జరుగుతున్న పన్నాగాలనన్ని భారత ప్రభుత్వానికి తెలియచేయచుండిరట యీ రజాకార్లు హైదరాబాదు సరిహద్దులను కాచుటకై వెళ్లినప్పుడు బహుశః వారికి తెలియకుండానే భారతసరిహద్దులలో ప్రవేశించెడివారు. అటు ప్రవేశించగానే భారత రక్షక భటులు వారిని బంధించి పై అధికారుల ముందు ప్రవేశపెట్టేది. యిట్లు పట్టుబడిన రజాకార్లను రోజూ యీ హైదరాబాదు కాందిశీకులు చూసేవారట. పాపం యీ కాందిశీకులకు యీ పని తప్ప మరియే పని లేకుండెను. చాలామంది యిక్కడ వున్న పనులన్ని వీడిపోయిన వారు. యిది 1948 భారత స్వాతంత్ర్యం వచ్చిన రెండవ సంవత్సరం. చదువుకు స్వస్తి చెప్పి యెన్నినెలలో లెక్కించుకోలేదు. మేము యే ఉద్యమములో చేరి యేమి చేసినాము వూరకె కూర్చుండుట తప్ప అనుకొన్నాడు విక్రం. వృథాగా కాలం వెళ్లబుచ్చుటకిష్టం లేదు విక్రంకి. అయినా ఒకసారి కాలేజ్ విడచినంక మళ్లీ యే ఆశయానికైతే కాలేజ్ విడిచినామో అది పూర్తిగాకుండానే యెలా కాలేజీకి వెళ్ళేది అని హోస్టలులో అజ్ఞాతవాసాన్ని చేస్తున్నారు విక్రం, వెంకటకృష్ణుడు. నెహ్రూగారు యీ హైదరాబాదును గురించి యేమీ చేయుటలేదు. బహుశః యిక్కడి ప్రజలు యెక్కువ వత్తిడి తెస్తే దీన్ని కూడా కాశ్మీరుకు వలెనే అంతర్జాతీయ అసెంబ్లీలో ప్రవేశపెడుతుండెనో యేమో కాని అలా జరుగలేదు. యీ credit పటేలుకు పోవాలని చాలా మంది అంటూ వుంటారు. పటేలు యీ వరకు చెప్పినట్టుగా అన్ని princely states ను చాకచక్యంతో భారతదేశంలో ప్రవేశింపచేసినాడు. కొందరు చరిత్రకారులు పటేలు చేసిన మహాకార్యములలో యిది ఒకటి మాత్రమే అంటారు. పటేలు మాత్రము హైదరాబాదును యెన్నడూ మరచిపోలేదు. లోలోన దీని విమోచనానికి గుప్తంగా ప్రయత్నాలు చేయుచునే యుండెను. కాని దీని విషయమై వీరు నెహ్రూతో యెక్కువ ప్రస్తావించినట్టు లేదు. హైదరాబాదు ప్రభుత్వము సరిహద్దు ప్రాంతాలలో భారత హక్కులకు భంగం కలిగిస్తున్నట్లు evidence తయారు చేస్తుండెను. కాని సరియైన అవకాశానికి ఎదురు చూస్తూ ఉండెను. ఆ

సమయం యితనికి 194౦ ల³ దొరికింది. అది విని యోగించుకొని హైదరాబాదుపై పోలీసు ఆక్షన్ పేరుతో భారతసైన్యాన్ని హైదరాబాదుకు విముక్తి కల్గించండి అని ఆజ్ఞాపించినాడు. భారతసైన్యము హైదరాబాదు నలుమూలల నుండి యేమాత్రము resistance లేకుండా రజాకార్లను మరి నిజాం సైన్యాన్ని చెండాడుతు హైదరాబాదు నగరం చేరినది. మొదట హైద్రాబాద్ ప్రవేశం చేసిన సేనాధిపతికి హైదరాబాద్ మిలటరీ గవర్నర్‌గా నియమించింది. యీ గౌరవము మేజర్ జనరల్ J.N. చౌదరికి దక్కింది. యీ మిలిటరీ గవర్నర్ కు సర్వాధికారాలీయబడినవి. యీాయన చాలా డబ్బు హైద్రాబాదు నవ్వాబులవద్ద మరి నిజాం వద్ద తీసుకున్నాడని వదంతి. యేది యెట్లయినా హైదరాబాదు ప్రజలు స్వాతంత్ర్య శ్వాసలను పీల్చుకున్నారు. వారి భయము ఆందోళన మటుమాయమైనవి. హైద్రాబాదు భారతిలో కలసిపోయింది. దక్షిణ పాకిస్తాను కలలు కంటున్న ముస్లింల కలలు కలలు గానే మిగిలి పోయినవి.

విక్రం, మరి వెంకటకృష్ణునికి యిది ఒక పర్వదినం. హైద్రాబాదు ప్రజలు దిగ్విజయంబుగా వస్తున్న భారత ప్రజలకు వీరు వస్తున్న ప్రతి వూరిలో నివాళులర్పించారు. పూలమాలలతో అలంకరించారు. quit college ఉద్యమంలో కాలేజీలు విడచి వెళ్లిన విద్యార్థులంతా మళ్ళీ కాలేజీలకు వచ్చినారు. అంతకు ముందు రజకార్లుగా పని చేసిన ముస్లిం విద్యార్థులు కూడా వచ్చినారు. హాస్టల్‌లోకి కూడా కొంతమంది వచ్చినారు. పోలీస్ ఆక్షన్ కాకముందు వీరు చాలా ధీటుగా, స్వతంత్ర హైద్రాబాదు జిందాబాద్ అని నినాదాలు చేసేది. యిప్పుడు అవి అన్నీ మరచి యెవరితో కలయుటకు మొఖము చెల్లక isolation లో వుండినారు. కళాశాలలు వీడి పోయిన విద్యార్థులలో కొంతమంది తిరిగిరాలేదు. వారు శాశ్వతంగా యీ ప్రపంచాన్నే వీడి పోయినారు. చాలా మంది అదృష్టవంతులు మరలి వచ్చినారు. స్వతంత్రం హైదరాబాదువాసులకు 1948 లో వచ్చింది. యిక విద్యార్థులు చదువు ప్రారంభించాలె. యెలా మొదలు పెట్టాలి. యీ సమస్య కు పరిష్కారాన్ని విశ్వవిద్యాలయమువారు ఆలోచిస్తున్నారు.

I year లో నున్నప్పుడు పిలుపు నిచ్చింది. హైదరాబాదు విద్యార్థి సంఘము 2nd year కు ప్రవేశించిన పిమ్మట యీ ఉద్యమము ముగిసినది. యిన్ని నెలలు క్లాసులకు వెళ్ళి చదవంది పరీక్ష యెట్లు పాసు కాగలడు. దీనికి సులభమైన సమాధానాలు లేవు. అయినా పరీక్షల గడువు మునుపటి వలె కాక కొంచెం పొడిగించారు. అంటే చదువుకొనుటకు కొంచెం గడువు లభించింది Arts విద్యార్థులకు యిది బాగానే వుంటుంది కాని సైన్స్ విద్యార్థులకు కొంచెం కష్టమైన పనే. Arts subjects వలె Science subjects తనంతట తాను చదువుకొని పరీక్ష యిచ్చేది అంత సులభం కాదు. యేది యెట్లైన 2nd year పరీక్ష యివ్వవలె. యీ పరీక్షలు April లో కాకుండా June లో తీసుకొనుటకు నిర్ణయించారు. విక్రం, వెంకటకృష్ణుడు రేయింబవళ్లు యీ పరీక్షలకై చదువుచున్నారు. విక్రం హాస్టలులో వెంకటకృష్ణుడు తన యింట్లో. June లో పరీక్షలిచ్చినారు. యిద్దరు 2nd class లో ఉత్తీర్ణులైనారు. యిద్దరికి మెడిసిన్‌లో సీటు తథ్యము. యిద్దరూ medicine కు apply చేసినారు. యిద్దరు పేర్లు selected list లో నున్నది. యిద్దరు ఫీసు కట్టినారు ఒకేనాడు. I year లో, body discetion. II year లో కూడా

అదే యీ కాలేజీలో ఆడపిల్లలు మొగపిల్లలు కలిసి చదువుతుంటారు. యెక్కువ ఆడపిల్లలు ముస్లింలు. హిందువుల అమ్మాయిలు కూడా ఉన్నారు కాని వారి సంఖ్య తక్కువ. ప్రొఫెసర్స్ notes ను చూచి lecture యిస్తారు. లేదా వాటిని dictate చేస్తారు. పుస్తకాలు కొంచెం ఖరీదయినవే. ఒక Gray anotomy కే రూ 150 అంటే అప్పుడు యిది చాలా expensive పుస్తకము. 1300 పేజీలకు పైగా వుండె. అయితే విక్రం అన్ని పుస్తకాలు యింకను కొనలేదు. lectures లో theory పిమ్మట అందరు విద్యార్థులు practicals కు Anatomy hall కు వెళ్లాలి. యీ హాల్‌లో అన్ని మృతకళేబరాలు అవి మురిగిపోకుండ మందులతో preserve చేసి వుంచుతారు. విద్యార్థులు యీ శవాలను మెల్లగా disect చేసి ఆ parts ను గ్రహిస్తున్నారు. యీ శవాలను group కు ఒకటిగా యిస్తారు. యివి పెద్ద టేబుళ్ళపై పడి వుంటాయి. మొదటి నాడు యీ anotomy halls కు వెళ్లగానే విక్రంకు అబ్బా అనిపించింది. యితడు 100% శాఖాహారి. పుట్టింది మాంసాహారులగు తల్లిదండ్రులకైనా, దైవము యీతనికి శాఖాహారాన్నే తినుటకు నిర్ణయించినాడన్నట్టు యెప్పుడూ మాంసాన్ని ముట్టలేదు. పచ్చి మాంసాన్ని చూస్తే యితనికి వాంతులొచ్చినంత పని. అందుకే యీ పీనుగులను చూచినప్పుడు ఒక Philosophical భావాలు అతనిలో ఉద్భవించినవి. అంతే కాకుండ $II^{nd}$ year విద్యార్థులకు యిప్పటికి వీటిని చూచుట అలవాటుగా మారింది అనుకుంట. అందుకే యీ పీనుగుల సమక్షంలో వాటిని disect చేసుకొంటూ romantic చూపులతో ఒకరినొకరు చూస్తూ వుండేది. యీ దృశ్యం చూసినంత విక్రంలో మరింత Philosophical భావన ఉద్భవించింది. అతనిలో యీ శవాలు కూడా మావలెనే ఒకప్పుడు ఆనందాన్ని, అసూయను, నవ్వును, యేడ్పును అనుభవించినవే కదా. అబ్బ యెంత విచిత్రము ఆ మానవులే యీనాడు పీనుగులుగా యీ విద్యార్థుల dissection కు పనికి వస్తున్నవి. యెవరికి యేమి జరిగేది యెవరికెరుక అనే ఆందోళన అతనిలో బయలు దేరింది.

dissection పిమ్మట వెంకటకృష్ణుడు విక్రం Anotomy hall విడచి పోయినారు. సాయంకాలం మళ్లీ high school routine మొదలయ్యింది. యిద్దరికి యిద్దరు యేదో మాటాడుకుంటూ సుల్తాన్ బజారుకు వెళ్లినారు. కొత్తగా కాలేజ్ లో పరిచయమైన స్నేహితులతో మాటాడుకుంటు నిలబడ్డారు. చూస్తుండగానే చీకటి పడింది. యిద్దరు తిరిగి విక్రం యింటికి వచ్చారు. మెడికల్ కాలేజ్ విషయమై మాటాడినారు. మాటల మధ్యలో విక్రం తాను medical college వదలుచున్నానని, తనకు జరిగిన అనాటమీ హాలు అనుభవాన్ని వెంకటకృష్ణునికి తెల్పి తాను యిన్నాళ్ళు కలలు కంటున్న medicine తనకు రాబోదని తెల్పినాడు. వెంకటకృష్ణుడు దిగ్భ్రాంతుడై యేమి? ఆలోచించే మాటాడుతున్నావా? విక్రం మెడికల్ కాలేజ్ విడిచితే యేమిచేస్తావు అన్నాడు. బి.ఎ. చేస్తాను అన్నాడు విక్రం. బి.ఎ. చేసి ఏమి చేస్తావు అన్నాడు వెంకటకృష్ణుడు. యేదైన చేయవచ్చు అన్నాడు విక్రం. వెంకటకృష్ణుడు లేచి సరే మునుపటి వలెకాదు. మెడిసిన్ కష్టమైనది రోజూ చదవాలి వస్తాను, రేపు కలుసుకొందాము కాలేజి విడిచే ముందు బాగా దీర్ఘంగా ఆలోచించు సుమా అని

వెడలి పోయినాడు. త్రోవలో వెంకటకృష్ణుడు విక్రం విషయమే అలోచిస్తున్నాడు. యేమి యిది విచిత్రంగా ఉందే? మొదటి నుండి మెడిసన్ అని చదివి సీటు దొరకగానే యీ విక్రం యిలా మాటాడుతాడేమిటి అని వెంకటకృష్ణుడు తనలో తానే అలోచిస్తున్నాడు. యింతలో యిల్లు వచ్చింది. వనజమ్మగారు భోజనం చేయక ఇంతసేపు ఏమిచేస్తున్నావు అని మందలించి సేవకునితో అయ్యగారొచ్చినారు వడ్డించు అని పిలిచింది. ఆ సేవకుడు టేబుల్ పై సిద్ధంగా నున్నదంత వడ్డించినాడు. వెంకటకృష్ణుడు భోంచేసి తన గదిలోనికి వెళ్ళినాడు. Gray Anotomy తీసి చదువ మొదలు పెట్టినాడు కాని యేమి నెత్తికి యెక్కటము లేదు. అందుకే పుస్తకాన్ని బల్లపైన పెట్టి రెండు అరచేతులతో తలపట్టుకొని అలోచిస్తూ పడుకున్నాడు. యెపుడు నిద్ర పట్టిందో కాని మళ్లీ ఉదయం 6 గంటలకు అలారం కాగానే లేచినాడు.

విక్రం లేచి టీ త్రాగి బట్టలు వేసుకొని తనకు కావలసిన సర్టిఫికేట్సు తీసుకొని నిజాం కళాశాలకు బయలుదేరినాడు. ప్రిన్సిపాల్‌తో కలిసి తన పరిస్థితిని తెల్పి తాను బి.ఎ. లో చేరుతానని చెప్పినాడు. అప్పుడు ప్రిన్సిపాల్‌గారు సరే నీ యిష్టము అని ఫారాలు యిచ్చినాడు. విక్రం వాటిని నింపి ప్రిన్సిపాల్ గారికి యిచ్చివేసినాడు. ప్రిన్సిపాల్ సరే ఫీసు కట్టి క్లాసెస్ attend చేయమన్నాడు. ప్రిన్సిపాల్‌గారికి థ్యాంక్స్ చెప్పి బయట పడ్డాడు. యింటికి చేరుకొన్నాడు. విక్రం యిప్పుడు తీవ్రంగా అలోచిస్తూ మంచం పై పడుకున్నాడు. తన స్కూల్, హైస్కూల్ కాలేజ్ దినాల్ని నెమరు వేస్తువున్నాడు. తన భవిష్యత్తు యెలా నున్నదో యేమో అని భవిష్యత్తు విషయమే అలోచిస్తున్నాడు. తనంటె డాక్టరుకాలేదు, కృష్ణమోహన్ నైనా మెడిసన్‌లో చేర్చాలి. అని అనుకున్నాడు. కాని వాడికి కూడా తన వలెనే యిష్టం కాకపోతే యెట్లా? అని యెన్నియో తీరుల అలోచిస్తున్నాడు. యింతలో నాలుగు గంటలయ్యింది. కృష్ణమోహన్ లోనికి వచ్చినట్లు చప్పుడయ్యింది. కృష్ణా అన్నాడు విక్రం. యేమిటి అన్నయ్యా అన్నాడు కృష్ణమోహన్ విక్రం గదిలోకి వచ్చాడు. కృష్ణునితో విక్రం కృష్ణా నేను మెడికల్ కాలేజికి వెళ్ళడం లేదు. రేపటినుండి నేను నిజాం కాలేజీకి వెడుతున్నాను అన్నాడు. ఎందులకు అన్నాడు కృష్ణమోహన్. నాకు మెడిసిన్ చదవాలని లేదు కృష్ణా. ఆ పీనుగులను కోయుట అదంతా నాకు నచ్చలేదు అన్నాడు విక్రం. మరి నాన్నగారితో మాటాడినారా అన్నాడు కృష్ణమోహన్. లేదు అన్నాడు విక్రం. మరి నాన్నగారు నన్ను మెడిసిన్ కు వెళ్లమని బలవంతపెట్టలేదు కదా అందుకే వారు యేమనుకోరు అన్నాడు. సరే అన్నయ్యా మీ యిష్టం అని నిలుచున్నాడు కృష్ణమోహన్. కొంచెం సేపు నిలబడి యిక నేను వెళ్లవచ్చా అన్నయ్యా అని అన్నాడు. Sure అన్నాడు విక్రం. విక్రం medicine నుండి arts కు అలోచించే చేసినాడు. అతని జీవిత ఫిలాసఫీ వేరు, అందువల్ల ఈ మార్పులవల్ల అతనిలో యేమీ బేధము కనబడలేదు. ప్రతిరోజు కాలేజీకి వెళ్ళడం యింటికిరావడం జరుగుతుంది. యిప్పుడు అతనికి చదువు వత్తిడి లేదు కాబట్టి general పుస్తకాలు చాలా చదువుతాడు. బి.ఎ.లో మొదటి సంవత్సరము కొన్ని రోజులు పరీక్షలముందు చదివి I year pass కావచ్చు. అది నిజము. రెండవ public exam దానికి కొంచం కష్టపడటం అవసరము. హైస్కూల్‌లో వలె యిప్పుడు అంతగా తిరగడం

లేదు. కారణం వెంకటకృష్ణుడికి చదువు వత్తిడిచేత తీరికలేదు. యేమైనా వీరిద్దరూ ఆదివారం సాయంకాలము కలుసుకొనుట తప్ప వేరే సమయాలలో వెంకటకృష్ణునికి సమయం చిక్కదు. విక్రంకు కూడా general knowledge అంటే యిష్టం. పుస్తకాలు బాగా చదువుతాడు. అందువల్ల పొద్దు పోదన్న సమస్యలేదు. మాగెజైన్స్ మరి యితర పుస్తకాలు లైబ్రరీ నుండి తెచ్చి యెప్పుడూ చదువులో నిమగ్నుడై ఉంటాడు.

Arts చదివే విద్యార్థులకు జనరల్‌గా చదివే అలవాటు చాలా ముఖ్యము. అనుకోకుండా విక్రంకు యీ అలవాటు అయిపోయింది. పరీక్షల ముందు యిదివరకన్నట్లుగా చదివితే పాసు కావచ్చు. అందుకే బి.ఎ. లు, ఎం.ఎ. లు చదువుట అంత కష్టమైన విషయముకాదు. అంటే యిది అందరికి వర్తించక పోవచ్చు. కాని విక్రం విషయమై యిది నిజము. యిక మెడికల్ కాలేజీలో వెంకటకృష్ణుడు చదవలేక చస్తున్నాడు. మొదటి సంవత్సరము చాలా కష్టముగా పాసయినాడు. రెండవ సంవత్సరము tough గా ఉంటుందంటారు. యీ దేశంలో పాశ్చాత్య దేశాలలో ప్రత్యేకంగా U.S.A. లో అన్ని సంవత్సరాలు కష్టమే అంటారు. కాని ఆ Medical colleges లో practicals కు యెక్కువ ప్రాముఖ్యత నిస్తారు. కాని హిందూ దేశంలోలో theory కి యెక్కువ ప్రాముఖ్యత. కొంతమంది memorise చేసి పాసవుతారు. వెంకటకృష్ణుడు memorise చేయలేదు. చదివే ఓపిక లేదు, యితడు కూడా arts లో చేరితే బాగుంటుందేమో కాని మెడిసిన్‌లో చేరాడు. కష్టపడి చదువుటకు ఇంకా అలవాటు పడలేదు. అందువలన విక్రం బి.ఎ. final year I class లో పాస్ అయినాడు. యిక యిప్పుడు M.A. లో అడ్మిషన్ తీసుకున్నాడు. వెంకటకృష్ణుడు 2$^{nd}$ year classes attend చేస్తూ వున్నాడు. మళ్లీ పరీక్షకు చదువుతువున్నాడు. విక్రం M.A. I year attend చేస్తున్నాడు. యితని క్లాస్‌లో చాలా తక్కువమంది వున్నారు. బి.ఎ.లో వలెగాక యిక్కడ professors కు విద్యార్థులకు స్నేహభావం వెలివడుతుంది. మెడికల్ కాలేజ్‌లో విద్యార్థులకు professors కు అంత చనువు వుండదు. ఒక వేళ professors తలుచుకుంటే యెన్ని ఏండ్లైనా విద్యార్థిని ఒక క్లాస్‌లో ఆపివేసి వుంచగలరని వదంతి. అది వాస్తవమా! కాదా! చెప్పుటకు వీలుకాదు. ఇది ఒక అపోహ. అందువల్ల దీన్ని యెక్కువ చర్చించుట సమయాన్ని వృధాచేయుట తప్ప మరేమీకాదు.

ఆనందబాబు కూడా యిప్పుడు $I^{st}$ year మెడిసన్‌లోనే వున్నాడు. విక్రంకు దొరికినప్పుడు యితనికి దొరకలేదు కాని మరో సంవత్సరము దొరికింది. అందువల్ల యిప్పుడు ఆనందమోహన్ మరి వెంకటకృష్ణుడు theory class లో మరి practical క్లాసులో కలుస్తూ ఉంటారు. యిద్దరికి విక్రం comman friend. అప్పుడప్పుడు వెంకటకృష్ణుడు విక్రంతో కలసినప్పుడు ఆనందబాబు విషయం చెబుతూవుంటాడు. ఆనందబాబు చాలా hard work చేస్తాడు. చాలా మంచి వాడని ఇదివరకే తెలుసుకున్నాము. యితడు యే పనిచేసినా నిదానంగా చేస్తాడు. క్లాస్‌లో చాలా attend గా ఉంటాడు. అందువల్ల వెంకటకృష్ణుని కి అప్పుడప్పుడు notes ఇస్తాడు.

practicals లో కూడా సహాయపడుతూ ఉంటాడు. విక్రం కు మాత్రం general పుస్తకాలు చదవడం తప్ప క్లాసు పుస్తకాలు చదువుట అంతగా లేదు. lecture notes తీసుకుంటాడు. అవి పరీక్ష పాసవుటకు సరిపోతాయి కాని దానితో యితనికి తృప్తివుండదు. reference పుస్తకాలు కూడా చదువుతుంటాడు. యిప్పుడు అతనికి డిగ్రీ ఉంది. అందువల్ల యితడు I.A.S. కు పరీక్ష నిచ్చుటకు అర్హుడు. అందువలన దానికి సిద్ధం చేస్తున్నాడు. బాగా general పుస్తకాలు పత్రికలు మొదటి నుండి చదువుతాడు కాబట్టి ఆ knowledge అంతా యీ పరీక్షకై ఉపయోగపడవచ్చు. అందుకై ఫీసు కట్టినాడు. సమయం కూడా వుంది. దానికి prepare చేసేది యేమీ లేదు. విక్రం మొదటినుండి చదివిన పుస్తకాలలోని, పత్రికలలోని విజ్ఞానము వుంది కదా యీ పరీక్షలకు కావలసిందే అది అనుకున్నాడు. యిప్పుడు M.A. $I^{st}$ year పరీక్షకు యేమీ చదివేది లేదు. కావున ideal time యీ సమయం వినియోగించుకోవాలె అని విక్రం నిర్ణయించుకొన్నాడు. పరీక్ష యిచ్చినాడు. బాగా చేసినాడు, Papers అన్ని. పరీక్షల ఫలితాలు వచ్చినాయి. ర్యాంకులోనే pass అయినాడు. యిక oral interview tough అన్నారు అందరు. కాని విక్రం చాలా confidence తో వున్నాడు. ఇంటర్వ్యూ పిలుపు రానే వచ్చింది interview కు. యింటర్వ్యూ, oral బాగానే చేసినాడు. యిప్పుడు అతడు results కు wait చేస్తున్నాడు. రిజల్ట్స్ పత్రికలలో పడినవి. కొద్దిరోజుల పిమ్మట official letter కూడా వచ్చింది. యిప్పుడు అతడు Vikram Rao I.A.S. విక్రం సంతసించినాడు. కాని అందరివలె అంత సంతసించలేదు. మొదటి పని కృష్ణమోహన్ రూం లోనికి పోయి తమ్ముడూ నాకు I.A.S. వచ్చింది యిదుగో చూడు అని paper మరి official letter చూపించాడు. కృష్ణమోహన్ అన్నగారిని గట్టిగా కౌగలించుకొని congratulation అన్నయ్యా అన్నాడు. మరి నాన్నగారికి తెల్పు అన్నాడు. మనమిద్దరము వూరికి వెళ్లి స్వయంగా చెప్పి అమ్మ నాన్నల ఆశీర్వచనాలు తీసుకొందాము అన్నాడు. యిద్దరూ శనివారం సాయంకాలానికి యెదురు చూస్తున్నారు. విక్రం వెంకటకృష్ణుని వద్దకు వెడదామనుకున్నాడు. కాని అతడిప్పుడు తన గదిలో వుండడు. కాలేజీలో ఉంటాడు. కాబట్టి యింటివద్ద కూర్చున్నాడు. 4 గంటలు కాగానే కృష్ణమోహన్‌ను తోడ్కొని వెంకటకృష్ణుని యింటికి వెడలినాడు. అప్పుడే వచ్చి మొఖం కడుగుతున్న వెంకటకృష్ణుడు తమ్ముడితో వచ్చింది చూచి యేం విక్రం యివ్వాళ తమ్మునితో వచ్చినావు యేమి సంగతి అన్నాడు? ఒక శుభవార్త వినిపించ వచ్చినాను అన్నాడు. శుభవార్తనా? యేమిటది అన్నాడు. నేను I.A.S. యిప్పుడు అన్నాడు విక్రం. Oh my god! hearty congratulation అని విక్రం ను గట్టిగా కౌగలించుకొన్నాడు. నిజంగా విక్రం I am proud of you నీవు మెడిసన్ విడిచినప్పుడు విచారపడ్డాను. కాని దానికన్న 10 రెట్లు సంతోషం నాకు కలిగిందంటె నమ్ము. యేకొద్దిమందినో వరించే అదృష్టం నిన్ను వరించిది. నా hearty congratulation అన్నాడు వెంకటకృష్ణుడు. యీనాడు యెక్కడికీ బయలుదేరలేదు. వెంకటకృష్ణుడు, విక్రం, కృష్ణమోహన్ ముగ్గురు యింటిలోకి వెళ్ళారు. వనజమ్మ Drawing room లో యేదో అల్లుతూ సోఫా మీద కూర్చొని వుంది. యీ ముగ్గురు ఒకేసారి ఆమె వద్దకు యెప్పుడూ రాలేదు. వీరిని చూడగానే కొంచెం ఆశ్చర్యంగా వీరి వైపు

చూసింది. కూర్చోమని చేయితో సైగ చేసింది. ముగ్గురూ కూర్చున్నారు. కొంతసేపు నిశ్శబ్దం, వెంకటకృష్ణుడు మెల్లగా అత్తయ్యా విక్రం I.A.S pass అయాడు అన్నాడు. వనజమ్మ ఆశ్చర్యం సంతోషంతో అవునా పరీక్ష యిచ్చిందే తెలియదే అన్నది. అవును యెవరితో చెప్పలేదు. యెందుకంటే all india లో లక్షలు కూర్చుంటారు. యీ పరీక్షకు యే కొద్దిమందికో అందులో చేరే అదృష్టం వస్తుది కదా! అందుకే చెప్పలేదు. ఆ కొద్దిమంది అదృష్టవంతులలో విక్రం ఒకడు అత్తయ్యా అన్నాడు వెంకటకృష్ణుడు. అయితే శుభం నాయన అంటూ వంటవాన్ని పిలిచి యేమైనా sweet చేసి కాఫీ చేసుకరమ్మన్నది., అందరూ coffee సేవించినారు. యెప్పుడైనా మీ office కు వస్తే మమ్ములను గుర్తుపడతావా నాయనా అన్నది విక్రం వైపు చూస్తూ. O, yes aunty మిమ్ములను గుర్తుపట్టక పోవుటయేమి యెప్పుడైనా రావచ్చు. ఆఫీస్ నాదైనా అందులో ఉండేవాడు మీవాడేకదా అంటీ అని చిరునవ్వుతో అన్నాడు. అందుకు వనజమ్మ నవ్వింది. మంచిది aunty thanks for coffee అని విక్రం లేచినాడు. విక్రంతో కృష్ణమోహన్, వెంకటకృష్ణుడు లేచినారు. వనజమ్మ వీళ్ళతో కొంచెం దూరం నడచి మళ్ళీ మరలి పోయింది. ముగ్గురూ వెంకటకృష్ణుని గదిలోనికి పోయి అయిదు నిమిషాలు కూర్చున్నారు. పిమ్మట విక్రం, కృష్ణమోహనుడు సరే వస్తాము అంటూ వెంకటకృష్ణునితో సెలవు తీసికొని వారి యింటికి వెడలిపోయినారు.

తెల్లవారి శనివారం కృష్ణమోహనుడు స్కూల్ నుండి రాగానే విక్రం, కృష్ణమోహనుడు వూరికి ప్రయాణమైనారు. వూరు చేరేవరకు చీకటి పడింది. పోయేవరకు ధర్మారావు శ్రీలత మరి వేరే వారు యింటి నిండా వున్నారు. యిద్దరు కూమారులను చూచి ధర్మారావు ఆశ్చర్య పోయినాడు. విక్రంతో వుత్తరం వ్రాయలేదెందులకు టాంగా పంపుతుంటినిగా రోడ్డువరకు అన్నాడు ధర్మారావు. యేదో రావాలని అనిపించింది వచ్చేసినాము అన్నాడు. మీరిద్దరు వచ్చినందుకు నాకు అమితానందంగా వుంది విక్రం. కాని మీకు సెలవలు లేవుకదా అన్నాడు. అవును అన్నాడు విక్రం. కృష్ణమోహన్ కల్పించుకొని ఒక సంతోషవార్త వినిపిద్దామని అన్నయ్యే రావాలనుకున్నాడు నాన్నా అన్నాడు. యేమిటా వార్త విక్రం అన్నాడు ధర్మారావు. నేను I.A.S. లో వచ్చేసినాను అన్నాడు విక్రం. అంటే interview లో కూడా నెగ్గినావా విక్రం అన్నారు పట్టలేని సంతోషంతో. ఈ వార్త వినగానే తల్లిగారు సరాసరి పూజామందిరంలోకి ప్రవేశించి దీపం ముట్టించి, దేవునికి వెంటనే కొబ్బరికాయలు తెమ్మని పనిమనిషితో డబ్బులిచ్చి పంపింది. అయిదు కొబ్బరికాయలతో పనిమనిషి వచ్చింది. శ్రీలత వెంటనే స్నానం చేసి దేవునికి అయిదు కొబ్బరికాయలు కొట్టింది. కొడుకుకు బొట్టు పెట్టి దేవుని ప్రసాదము అందరికి పంచి పెట్టినది, విక్రం తల్లి పాదాలకు నమస్కరించాడు. ఆమె కొడుకును దీవించింది. ధర్మారావు అమితానందంతో పొరలి పోతున్నాడు. రేపు సత్యనారాయణ వ్రతం చేయిస్తాం అన్నాడు విక్రంతో సరేకాని మేము రేపు సాయంత్రం ప్రయాణం. సోమవారం కృష్ణమోహన్‌కు స్కూలు అన్నాడు విక్రం. సరే సాయంకాలం వరకు పూజ అయిపోతుంది. రాత్రి వరకు మీరు సిటీలో వుంటారు అన్నాడు ధర్మారావు. అప్పటినుండే సత్యనారాయణ పూజా సన్నాహాలు చేసి పడుకునే వరకు ఆలస్యమైంది

ఆ దంపతులకు. మళ్లీ ఉదయం తొందరగా లేచారు ధర్మారావుగారు శ్రీలత. విక్రం, కృష్ణమోహన్ మాత్రం బాగా నిద్రించారు. ఆలస్యంగా లేచినారు. వీరు లేవగానే టీ త్రాగి సోఫాలపై హాయిగా కూర్చొని వార్తా పత్రికలను చదువుచున్నారు. తల్లి తండ్రి పూజకు కావలసిన సామగ్రి సిద్ధం చేస్తున్నారు. బ్రాహ్మణునికి నిన్ననే చెప్పి పంపినారు. పూజ కాగానే అన్నదానం చేయబోతున్నారు. దానికి కూడా వూరిలో చాటింపు జరిగింది. పూజ కాగానే అందరు ప్రసాదం తీసుకొన్నారు. వీరు ఆహ్వానించిన కొంచెంమంది వూరి పెద్దలతో కలసి భోంచేసినారు. పిమ్మట శ్రీలత సేవకుల సహాయంతో వచ్చినవారికంత లేదనకుండా అన్నం వడ్డించుట జరుగుచునే వున్నది. విక్రం, కృష్ణమోహన్ తండ్రితో I.A.S details మాటాడుతున్నాడు. ధర్మారావుగారు విక్రం చెప్పినవన్నీ వినుచున్నారు. అమితానందంతో అప్పుడప్పుడు కృష్ణమోహన్ విక్రం మిస్ చేసిన points ను నాన్నగారికి చెబుతున్నాడు. యీ విధంగా కొమరులు జనకుడు relaxey mood లో enjoy చేస్తున్నారు. అప్పుడే నాలుగు కావచ్చింది. యిక బయలుదేరుతాము నాన్నగారు అన్నాడు విక్రం. సరేనని టాంగాను సిద్ధం చేయమన్నాడు, టాంగా డ్రైవరుతో. సరేనన్నాడు టాంగా డ్రైవరు. ధర్మారావు విక్రంతో యిక ఒక కారుకొనాలె నీకు యెంతకొస్తున్నది ఒక fiat car అన్నాడు ధర్మారావు. బహుశః 6 లేదా 7 వేలనుకుంటు. యిటాలియన్ fiat అన్నాడు. యెక్కువకెక్కువయితె 8 వేలు అన్నాడు విక్రం. అయితే నేను డబ్బు యిస్తాను ఒకటి కొనేయి అన్నాడు ధర్మారావు సరే అన్నాడు విక్రం. టాంగా తయ్యారయ్యింది అన్నాడు ఒక సేవకుడు వచ్చి, మంచిది నాన్నగారూ మళ్ళీ వస్తాము అన్నాడు విక్రం. ధర్మారావు భార్యతో పిల్లలు పోతున్నారు యిటురా, అన్నాడు. ఆమె వచ్చేసింది. విక్రంని, కృష్ణమోహన్‌ను ముద్దు పెట్టుకుంది. భద్రం నాన్న అని చెప్పగానే యిద్దరు టాంగా యెక్కినారు. టాంగా కదిలింది. టాంగా కనబడినంతసేపు యిద్దరూ చూస్తూ నిలబడ్డారు గేటుదగ్గర. పిమ్మట లోనికి పోయినారు. టాంగా రోడ్డు మీదికి వచ్చిన 30 నిమిషాలలో బస్సువచ్చింది. యిద్దరూ బస్సు యెక్కారు. 3 గంటలు బస్సులో నున్నారు. బస్సుదిగి మరి ఒక టాంగాను తీసుకొని యింటికి చేరుకున్నారు.

యింటికి చేరుకోగానే వంటమనిషి తలుపు తీసినాడు. మీ కోసం వెంకటకృష్ణబాబు వచ్చి పోయారయ్యా అన్నాడు. యేమైనా చెప్పినాడా అంటే యేమీలేదు మీరు రాగానే నేను వచ్చి పోయినానని చెప్పమన్నాడయ్యా అన్నాడు. కాళ్లు చేతులు ఇద్దరూ కడుక్కొని తమతమ గదులలోకి ప్రవేశించారు. కృష్ణమోహనునికి తల్లి, తండ్రి జ్ఞాపకం వస్తున్నారు. ఆ వూరి జీవితం యింక కృష్ణమోహనునికి యిష్టం కాని విక్రంకు యెన్నడో ఆ పల్లెటూరి మోజు పోయింది. రూం లోన మంచపై పడుకొని యేదో ఒక పుస్తకం చదువుతున్నాడు తన భవిష్యత్తును గురించి ఆలోచిస్తున్నాడు తను అదృష్టవంతుడనని అనుకొన్నాడు. యే కొద్దిమందికో లభించే యీ I.A.S. తనకు లభించినందుకు భగవంతునికి వేయి నమస్కారములు పెట్టుకొన్నాడు. భగవాన్ నీవు కరుణామయుడవు. నాకు ముమ్ముందు మీ సహకారము, మీ అనుగ్రహము, మీ కరుణాకటాక్షము ప్రసాదించు తండ్రి అని వేయిసార్లు ఆ దేవునికి మొక్కుకున్నాడు.

యిక కొన్ని నెలలో M.A $I^{st}$ year పరీక్షలు కాని M.A $II^{nd}$ year విడిచిపెట్టవలసినదే అనుకున్నాడు. సరే యేదైనా వేరే ఆలోచన చేయవచ్చు పిమ్మట దానిని కూడా పూర్తిచేయవచ్చు అనుకున్నాడు విక్రం. యిప్పుడైతే I.A.S. training కు సంసిద్ధం కావాలని అనుకున్నాడు. ధర్మారావు చెప్పినట్లుగా car dealer వద్దకు వెళ్ళి fiat car కొరకై అడిగినాడు. కాగితాలన్ని నింపి deposit కట్టినాడు. ఆనాడు మనదేశంలో కార్లు కాదు యే పారిశ్రామిక వస్తువులు కూడా చేసే స్థోమత మనకు లేకుండె. సూదులు, గుండు సూదులు కూడా యింగ్లాండు నుండే import చేసేవారము. మనదేశములో చేతి పరిశ్రమలు, వ్యవసాయము తప్ప మరియే పరిశ్రమలు లేకుండెను. మనము ముడిసరకులను తప్ప మరి యేవి చేసే స్థితిలో లేకుంటిమి. బ్రిటీష్ వారు మనలను అట్లావుంచినారు. మనదేశాన్ని వెనకబడిన దేశంగా వుంచినారు. యీ దేశం నుండి ముడిసరుకులను దిగుమతి చేసుకొని వాటికి బదులు పారిశ్రామికంగ తయారయిన వస్తువులను మనకు యెగుమతి చేసేవారు. యిది వారి మర్కెంటలిస్టు పాలసి. యీ విధంగా మనదేశాన్ని కొల్లగొట్టినారు యీ దేశాన్ని వారికి లాభసాయంగా వాడుకొన్నారు. యిచ్చటి విద్యావిధానము వారి East india company కి కావలసిన గుమాస్తాలను సృష్టించటానికై చేసినారు. మన రైళ్ళ రవాణా సౌకర్యాలను కూడా వాళ్ల ముడి సరకులను తరలించుటకై చేసినారు. అంటె మనము 200 సంవత్సరాలు వీరి దాస్యములో వుండి ప్రపంచంలోని యితర స్వాతంత్ర్య దేశాలకన్న వెనుకబడిపోయినాము. తెల్లవారు ICS చేసుకొని మన దేశంలో రాజ్యం చేసినారు. వారు పోయిన పిమ్మట యీ జాతీయ నాయకులు మన administrative విధానములో యేమి మార్పులు చేయలేదు. ICS మార్చి IAS గా చేసినారు. పాత ఉన్నత ఉద్యోగులు యింకా ICS తీసుకున్న కొంతమంది పరిపాలన ప్రధానంలో వున్నారు. బ్రిటీష్ వారు నెలకొల్పిన పరిపాలన విధానము అంత చెడ్డదిగాదు. stability రక్షిస్తుంది కాని development ని రానివ్వదు. యీ విధానం యెన్నడు మారుతుందో అనుకుంటు ఆలోచిస్తున్నాడు విక్రం.

విద్యార్థిదశకు కొద్ది వారాలలోనే స్వస్తి చెప్పవలసి వస్తుందని విక్రంకు తెలుసు. విక్రంకు చాలా చదవాలని ఉంది. కాని I.A.S. గా చేరిపోవాలిగదా పిమ్మట అతని జీవిత విధానమే మారుతుంది. బాధ్యతలు చాలా తీసుకోవలె. యీ స్వేచ్ఛా విద్యార్థి జీవితం మళ్లీరాదుగదా అనుకున్నాడు. విక్రంకు M.A. పిదప Ph.Dచేసి ఆచార్యునిగా విశ్వవిద్యాలయంలో చేరాలని వుండె. కాని యేదో అందరివలె యీతడు కూడా I.A.S. కు కూర్చున్నాడు ఉత్తీర్ణుడయినాడు. అందుకు విచారపడుటలేదు కాని తను స్వప్నాలు కంటున్న జీవితానికి స్వస్తి చెప్పాలి కదా అన్న విచారమే. ఆ acadmia లో మన్నంత స్వేచ్ఛ స్వాతంత్రం civilion life లో వుండదు కదా. పరిపాలనా యంత్రాంగంలో భాగమైన శాసనాలను అమలు చేస్తూ రాత్రింబవళ్ళు పనిచేస్తూ ఉండాలె. దీనిలో satisfaction అనేది ఉంటే అది ప్రజలు తనను మెచ్చుకొనుటమే. కాని అందరిని సంతోషపెట్టలేము. అందువల్ల అసంతృప్తి పడ్డవాళ్లు కూడా చాలామంది ఉంటారు. అనుకుంటు ఆలోచిస్తున్నాడు విక్రం. యింతలో వంటవాడు బాబు వంట టేబిల్ మీద పెట్టినాను. రండి వడ్డిస్తాను అన్నప్పుడు

కాని విక్రం ఈ ప్రపంచంలోకి రాలేదు. భోంచేసి కొంతసేపు పుస్తకం తీసుకొని కూర్చున్నాడు విక్రం. పిదప మంచంపై పడుకొని నిద్రపోయినాడు. తెల్లవారగానే పుస్తకాలు తీసుకొని నిజాం కాలేజికి వెళ్ళినాడు. అందరు పిల్లలు congratulation అని చెప్పినారు. Thanks అని వెళ్లుతున్నాడు. క్లాస్ కాగానే library reading room లో కూర్చున్నాడు యేదో చదువుకుంటూ. ఆ రూంలోనే విద్యార్థులు general గా పత్రికలు అవి చదువుతుంటారు. వీరిలో స్త్రీలు, పురుషులు అందరూ మాటాడితే చాలా మెల్లగా మాటాడుతారు. విక్రం నిజాం కాలేజ్‌కు మొదటిసారి వచ్చినప్పుడు స్వాతంత్ర్యానికి పూర్వం హైస్కూలు, Inter లో ఉన్నప్పుడు public meetings లో పాల్గొనటానికి వచ్చినాడు. అప్పుడు యిక్కడ నున్న ప్రతి విద్యార్థి ఒక special person గా ఇతనికి కనబడ్డారు. విక్రం తను నిజాం కాలేజ్ కు చదువుటకై వస్తానని యెప్పుడూ అనుకోలేదు. కాని ఇప్పుడు full time విద్యార్థి. యింకా కొన్ని వారాల వరకే. అంతటితో యితని మూడుసంవత్సరాలు పూర్తి అయిపోతాయి. పిమ్మట తాను I.A.S. బాధ్యతలు నిర్వర్తించుటకై training కు వెళ్లాలి అని ఆలోచిస్తున్నాడు. హైస్కూల్‌లో నున్నప్పుడు యీ కాలేజ్‌లో చదివే ప్రతి ఆడపిల్ల చాలా అందకత్తెగా కనిపించేది యెందుకంటే అది నూనూగుమీసాలు రావి నూత్నయవ్వనము అతనిలో తొంగిచూస్తున్న రోజులు. యిప్పుడు అతనికి 20 యేండ్లు. Teenage లో నున్న దృక్పధాలు మారినవి. Maturity అనేది వుంది యిప్పటి విక్రంలో. యితడు ఎక్కువగా మాట్లాడడు. కాని యెప్పుడూ చదువుతూ ఉంటాడు. గాంధీ వాది కాని దాన్ని గుడ్డిగా సమర్థించలేదు. వేరే దృక్పధాలను కూడా వింటాడు. అందులో మంచి సూత్రాలను వింటాడు. నచ్చితే ఒప్పుకుంటాడు. విక్రం యిలా ఆలోచించుకొంటూ పత్రికను చదివే ప్రయత్నాలు చేస్తున్నాడు. కొంచెం దూరంలో కొంతమంది అమ్మాయిలు కొందరు చదువుకుంటున్నారు. కొందరు మెల్లగా మాటాడుకొంటున్నారు. అందులో ఇద్దరు వేరే కూర్చొని వున్నారు. ఒకామె అప్పుడప్పుడు నా వైపుకు చూస్తున్నది. మరి ప్రక్కనున్న ఆమె స్నేహితురాలు యేమో మెల్లగా కన్నులు పత్రికమీద ఉంచే యేమో చెప్పుచున్నది. యిది విక్రం గ్రహించనట్టుగానే ప్రవర్తిస్తున్నాడు. కాని వాళ్లు యేమి మాటాడు తున్నారో యీతనికి వినిపించడంలేదు. కాని ఆ పత్రిక చదువుతున్న అమ్మాయి B.A మొదటి సంవత్సరము చదువు తుందని మాత్రము విక్రంకు తెలియును ఆమె అందగత్తె. అతి సంపన్న కుటుంబమునకు చెందినదని కూడా తెలుసు. ఆమెకు చాలా ఫ్రెండ్స్ వున్నట్టు వున్నది. యెప్పుడూ ఆ ఫ్రెండ్స్‌తోటే ఉంటుంది. ఒంటరిగా వుండగా నేను యెప్పుడూ చూడలేదు. కాలేజ్‌లో క్లాసులు అయిపోగానే కారులో యెక్కి వెళ్ళిపోతుంది. యీ అమ్మాయి తండ్రి High court judge అని విన్నాను. అందులో యీమెతో వుండే friends కూడా చాలా ప్రఖ్యాత కుటుంబీకులని విన్నాను. అందులో యిద్దరు మాత్రము యీమెకు తీసిపోరు అందములో అందరు కలిసివుంటారు. కాలేజి అయ్యేవరకు తరచుగా వీళ్లు కాలేజ్ క్యాంటిన్‌లో ఒకే చోట కూర్చుంటారు. యీ అమ్మాయి విక్రంకు నచ్చింది. గులాబిరంగు సుమారు ఐదు అడుగుల నాలుగు అంగుళాల యెత్తు అనుకుంట చాలా మట్టుకు Shyness

వుంటుంది reserve మాత్రము కాదనుకుంట. యెందుకంటె ఆమె అంతరంగిక స్నేహితులతో చాలా నవ్వుతూ మాటాడుతుంటుంది. చాలా joly గా కనపడుతుంది. ఆమెలోకం ఆ స్నేహితులు తప్ప మరెవ్వరితో లేనట్టున్నది. విక్రం ఆమెను వేరే యెవరితోను చూచినట్టు లేదు. విక్రంకు కూడా యీ కాలేజ్ లో కొంతమంది స్త్రీ విద్యార్థులతో స్నేహము కలిసింది. కొందరు యీయన క్లాస్‌మేట్స్ మరికొందరు యేదో సందర్భాన కలసినవారు. వీండ్లను Acqaintance అంటే బాగుంటుందేమో స్నేహితురాండ్రు అనే బదులు. యిక మగపిల్లలు చాలా మంది స్నేహితులున్నారు. కాని యిప్పుడు మాత్రము వెంకటకృష్ణునితో నున్నంత స్నేహము మరెవరితో లేదు.

కొంతకాలం యీ కాలేజిలో గడిపాక M.A. $I^{st}$ year అయిపోయింది. మళ్లీ వేసవి సెలవులు $I^{st}$ year అయిన కొద్దిరోజులకే యితనికి training కై orders వచ్చినవి. యీ training కాగానే యితడు asst Collector గా appoint చేయబడుతాడు. పిమ్మట నాలుగైదు సంవత్సరాలకు జిల్లా కలెక్టర్ గా వేస్తారు. అంటె సీనియర్ I.A.S. అన్నమాట. యిప్పుడు విక్రంకు కారున్నది. యిది ఆ కాలంలో మంచి కారు. అప్పుడు fiat కార్లు పూర్తిగా Italy లోనే తయారుచేసి మన దేశానికి యెగుమతి చేసేవారు. యీ కార్లు ఆ కాలంలో మంచి నాణ్యమైన కార్లలో లెక్క. వేరే కార్లు గూడా ఉండెను. కాని అవి కొంచెం విలువైనవి. యిటలినుండి వచ్చే కార్లలో fiat మంచిది. యిప్పుడు దీని మోజు అంతగా లేదు కాని ఆ కాలంలో మంచి కారే చూచుటకు, నడుపుటకు. మొత్తం కలసి Rs 8000 తో యింటికి చేరినది. విక్రం యీ కారులోనే కొన్ని సార్లు కాలేజికి వచ్చేది. కొన్నిసార్లు మళ్లీ బస్సులో అప్పుడప్పుడు టాంగాలో వచ్చేది. ఆనాడు, రిక్షాలు ఆటోలు లేకుండెను. బస్సు టాంగా రెండే రెండు సాధనాలు ఒక చోటునుంచి మరి ఒక చోటుకు పోవాలంటే. Maruti, Ambassdor మున్నగు కార్లు యింక లేకుండెను. ఒక fiat, hillman మున్నగునవి అన్ని imported కార్స్. యిప్పుడు training కు పోతున్నాడు. కాబట్టి యింటివద్ద కారును వదిలేసినాడు. ఒక driver ను ధర్మారావు మాటాడినాడు. విక్రంకి కొన్న కారు యిప్పుడు ధర్మారావు స్వాధీనములో నున్నది. యిప్పుడు కృష్ణమోహనుడు ఒకడే యింటిలో. అందువల్ల ధర్మారావు, శ్రీలత తో పట్నము యెక్కువగా వచ్చేస్తున్నాడు. యిప్పుడు కృష్ణమోహన్ బాధ్యత ధర్మారావుగారిదే. విక్రం యిప్పుడు I.A.S. training లో నున్నాడు. యితనితో యింకా కొంత మంది కూడా వేరే వేరే స్టేట్స్ నుండి విక్రంతో training తీసుకుంటున్నారు.

training అయిపోయింది. రాగానే ఇంటికి మరలి వచ్చాడు. కృష్ణమోహన్ ఇంట్లోనే ఉండెను. అన్నయ్య రాకతో కృష్ణమోహన్‌కు మితిమీరిన ఆనందం కల్గింది. కాని యీ ఆనందము కొన్ని రోజులదే. విక్రంకు త్వరలో post వస్తుంది. మళ్లీ పోవలసిందే. ధర్మారావుకు శ్రీలతకు మొదలే తెలుసు విక్రం వచ్చే సంగతి అందుకే కారులో యిద్దరు విక్రం వచ్చిన గంటతర్వాత యిల్లు చేరుకున్నారు. యింట్లో కి రాగానే విక్రం తల్లికి తండ్రికి పాదాభివందనం చేసాడు. మాతృమూర్తి విక్రం ను

కౌగిటిలోకి తీసుకొని ముద్దిడికొంది. యిప్పుడు మొత్తము కుటుంబం ఒక చోట ఉంది. వంటవాడు టీ తీసుకొచ్చాడు. యింటినుంచి తెచ్చిన ఫలహారాలను శ్రీలత విప్పి టేబుల్ మీద పెట్టింది. అమె కూడా బల్లవద్ద కుర్చీలోనే కూర్చుంది. యెలో వుంది నీ training బాబు అని అడిగింది తల్లి. పరవాలేదమ్మా బాగానే ఉంది అన్నాడు విక్రం. ప్రతి తల్లి అనే విధంగానే చిక్కిపోయినావు విక్రం అన్నది. అవునా అమ్మా అన్నాడు. ధర్మారావు విక్రం కృష్ణమోహన్ నవ్వుకొన్నారు.

ధర్మారావు శ్రీలత రెండు రోజులు కొమరులతో గడిపి వెళ్లిపోయారు ఊరికి కారు మాత్రం విక్రం వద్దనే వదిలి వెళ్ళినారు. తలిదండ్రులు వెడలిన పిదప విక్రం కు appointment orders వచ్చినవి. యిప్పుడు అతడు Assistant collectorగా నియమింపబడ్డాడు. అతని ఆఫీస్‌లో అతనికి తోడు చాలా మంది ఉద్యోగులున్నారు. యితడు అందరికన్న వయస్సులో చిన్న. అయినా head of the office కదా విక్రం. అందరు వినయవిధేయతలతో నుండేవారు. విక్రంకు యీ పదవి కొత్త. training లో అన్నీ నేర్చుకున్నప్పటికి అనుభవము ముఖ్యము కదా. యిప్పుడు ఆ అనుభవాన్ని సంపాదించాలె. అందుకే విక్రం చాలా చురుకుతో నమ్రతతో తన subordinates తో మెలగుతున్నాడు. వాళ్లు పెట్టిన files పై గుడ్డిగా సంతకాలు పెట్టకుండా చిక్కులున్నవని గ్రహించినప్పుడు concern officer ను లేదా clerk ను పిలచి అతనితో సంప్రదించి final decision తీసుకొని సంతకం చేసేవాడు. ఈ విధంగా ప్రతిది అతి జాగ్రత్తతో పరిశీలించి డిశెషన్ తీసుకుంటున్నాడు రోజా సరిగ్గా నిర్ణీత సమయానికి office కు వచ్చి యెవరు వచ్చింది రానిది చూస్తుండేవాడు. 5 నిమిషాలు లేటు వచ్చిన మొదలు పిలచి వాళ్లు నిర్ణీత సమయానికి వస్తే మంచిదని చెప్పేవాడు. రెండవసారి అలాగే వస్తే కొంచెం హెచ్చరించేవాడు. మూడవ సారి కఠినంగా మందలించేవాడు. మళ్లీ నాలుగవసారి కూడా అలా జరిగితే యేదైనా చిన్న punishment యిచ్చేవాడు. యీాయనరాక ముందు యిక కొన్ని నెలలకు retire కాబోయే డిప్యూటీ కలెక్టరు యీ ఆఫీసుకు అధికారిగా నుండెను. అందువల్ల ఆఫీస్‌లో అంతగా డిసిప్లెన్ ఉంచినట్లుగా విక్రంకు కనబడలేదు. అందరిని తన పంథాలో పనిచేయునటుల చేయుటకు కొంతకాలము పట్టింది. యిప్పుడు అంతా విక్రం అనుకున్నట్టు నడుస్తుంది. కొంతమంది కుర్రకుంక మాకేమో నేర్పుతుండు అని అనుకునేది. కాని దానిని పైకి పొక్కనివ్వక పోయేది. కాని చాలా మందికి యిప్పుడు dicepline బాగుంది. పని చాలా బాగా నడుస్తుంది. ఆఫీసులో అనుకుంటున్నారు. మొత్తానికి చాలా వరకు ఆఫీసు సంతృప్తిగా నడుస్తుంది. విక్రంకు ఆఫీసు లో కొన్ని vehicles వున్నవి. యితనికి official కారు మరి జీపు కూడా నున్నది. తండ్రి కొనిచ్చిన fiat official residence లో వుంటుంది. తన pravite work కు పోయినప్పుడు యీ ఫియట్ మీదనే వెడతాడు. యింట్లో వంటవాడు మరి కొంత మంది పనిచేసేవారు వున్నారు. అంహాయి office కి సంబంధించినవారే. విక్రం ఉండేది government కు చెందిన ఒక బంగ్లా with small garden. యింత యింట్లో యితనొక్కడే. ఆఫీస్ నుండి వచ్చిన పిమ్మట యెంతో మంది కలయుటకు వచ్చేవారు. కాని యితడు ఒంటరిగా వుండుటకు యిష్టపడేవాడు. నెలకు యెక్కువ

ఆఫీసు పని మీద దొరా చేసేవాడు. వంటవాడు ఒకరిద్దరు peons వెంబడే వెళ్ళేవారు. యెక్కువ జీవితము doe bunglows లో గడపేది. కొన్ని రోజులు మాత్రమే ఆఫీసులో వుండేవాడు. యెంతో మంది కలయుటకు వచ్చేవారు ఆఫీసుకు. మొదలు అతనికి యేమైనా నిజమైన పనివుంటే తప్ప meetings కు కలయుటకు polite గా నిరాకరించేవాడు. ముఖ్యమైన offiecer కాబట్టి పనులున్న వారు యెంతో మంది వుంటారు. అందులో యితని P.A screening చేసి ముఖ్యమైన పనులున్నవారినే పంపమని strict గా instructions యిచ్చినాడు. అందువలన యింటర్వ్యూలు చాలా తగ్గినవి. విక్రం politician కాదు. అప్పుడు యెలక్షన్స్‌కు అంతగా ప్రాముఖ్యత లేకుండెను. యిప్పుడున్నంత caste politics లేకుండెను. అందుకే విక్రంకు political headaches, pressures యేమీ లేకుండెను. యిప్పుడు విక్రంకు 24 hours responsibility. రిపోర్టులు వ్రాయటం చాలా వుంటాయి. యివి అన్నిటికి staff వుంది కాని వట్టి సంతకం పెడితే altimate responsibility విక్రం తీసుకోక తప్పదు. అందువల్ల చాలా time వీటిపైన ఖర్చు అయ్యేది. యీాయన క్రింది అధికారులు అప్పుడప్పుడు వాళ్ళలో వాళ్లు నవ్వుకునేది. వీరు యివి అన్ని చదివి యే సంతకాలు చేస్తే యిక office నడిచినట్టే అనుకునేవారు. యిప్పుడు యితని వయస్సు 22 సంవత్సరాలు. యింత చిన్న వయస్సులోనే యిన్ని బాధ్యతలు అని అప్పుడప్పుడు అనుకుంటూ వుండేవాడు. తండ్రి ధర్మారావు నుండి ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. అందులో కుటుంబ విషయాలు. మరి యిప్పుడు ఆ కుటుంబ విషయాలతో సహా యితని పెండ్లి ప్రసక్తి యెక్కువగా వ్రాస్తున్నారు. కొంతమంది యువతుల పేర్లు వారి కుటుంబ విషయాలు వారి వంశము వారి ఆస్తి మొదలగు విషయాలు వ్రాసికొన్న photoes కూడా ఆ ఉత్తరాలతో వస్తూవున్నాయి. విక్రంకు కొన్ని pictures మంచివిగా ఉన్నవి కొన్న చూచి ప్రక్కకు పెట్టి అట్లు వున్నాయి, వీటిని చూచి యే నిర్ణయము తీసుకోలేము. అని తండ్రికి సమాధానము వ్రాసేవాడు. విక్రం ప్రతి ఉత్తరంలో కృష్ణమోహన్ విషయమై తాను medicine విడిచినాను కృష్ణమోహన్‌నైనా మెడిసిన్ కు పంపించండి. వాడు బాగా చదువుచున్నాడా వాడు ఒక్కడే మీరు వాడితో యెక్కువ contact లో వుండటం మంచిదని వ్రాసేవాడు. యిప్పుడు కృష్ణమోహన్ 13 యేండ్ల వయస్సు. ఒక సంవత్సరంలో 10 వ తరగతికి పోతాడు. యింతవరకు బాగానే చదువుచున్నాడు. యిప్పుడు medicine సీట్ అంత సులభంగా లభించదు. యింకో medical college కూడా తెరచినారు. కాబట్టి సీటు కొరకు యింకో 3 or 4 యేడ్లవరకు ఆలోచించవచ్చు. యిప్పటి వలె అప్పుడు యే reservation లేవు అన్నీ merit మీదనే లభించేవి. ఏ కులం విద్యాసంస్థలలో ప్రవేశించక పోయేది. అప్పుడు నీ మార్కులు బాగా వుంటె ఆ మార్కుల ప్రకారము సీట్ అలాట్ అయ్యేది. It was simple and straight forward system కాని యీనాడు అవి ఒక కలగా మారిపోయింది. What a change! విద్యాసంస్థలలో రాజకీయాలు కులాల కోట విపరీతంగా పెరిగిపోయినవి. కాని అనాడు కృష్ణమోహన్ కి యింకా fair compitition చేసే పూర్తి అవకాశముంది.

అది వినియోగించుకొని కృష్ణమోహనుడు తల్లిగారి మరి తండ్రిగారి ఆశయాన్ని నెరవేరుస్తాడని విక్రం ఆశిస్తున్నాడు.

తండ్రికి వ్రాసిన ఉత్తరం ముగించి బంట్రోతును stamp అంటించి పోస్టు చేయమని సీల్ చేసిన కవర్ బంట్రోతుకిచ్చాడు. యింతలో యింకో బంట్రోతు ఒక visiting card తెచ్చి విక్రంకు యిచ్చాడు. అది చూడగానే తొందరలో రమ్మను రమ్మను అని రెండుసార్లు అన్నాడు. బంట్రోత్తు తొందరగా పోయి ఆ వచ్చిన మనిషిని లోనికి తెచ్చినాడు. హలో వెంకట్ యెలా ఉన్నావు What a surprise అన్నాడు వెంకటకృష్ణునితో కరచాలనం చేస్తూ. ఆc అంతా క్షేమమేనా? యెందుకు నాకు యింత surprise యిచ్చావు అన్నాడు విక్రం. ఓ card పడేసినా అయిపోయేదే అన్నాడు. వెంకటకృష్ణుడు యిల్లు అన్ని వైపులా జూచి What a royal life విక్రం అన్నాడు. Well responsibilities go with the life too అన్నాడు. పిమ్మట యిద్దరు స్నేహితులు కూర్చొని అన్ని విశేషాలు తమ comman friends గురించి మాటాడుకొన్నారు. How is your aunty & her daughters అన్నాడు. thank you అందరు బాగున్నారు అన్నాడు వెంకటకృష్ణుడు. వంటవానిని పిలిచి యివ్వాళ్ళ అన్ని చాలా బాగుండాలె. యీ అయ్యగారికి నచ్చినట్లు చేయాలి అన్నాడు. సరే దొరగారు అలాగే చేస్తాను అన్నాడు. టీ తెచ్చి పెట్టు అని బంట్రోతు కు అజ్ఞాపించగానే టీ pot లో టీ కప్పులు suger, milk, biscuits అన్నీ ఒక tray లో తీసుకొచ్చి వేరు table పైన వుంచి టీ ready sir అన్నాడు. విక్రం, వెంకటకృష్ణుడు టీ త్రాగుతూ యేవో మాటాడుకుంటున్నారు. మాట వరుసలో వెంకటకృష్ణుడు పెండ్లి విషయమై యేమి అనుకుంటున్నావు విక్రం అన్నాడు వెంకట్ నీ వేమనుకుంటావు యిప్పుడు life లో మంచిగా settle అయినావు కాబట్టి It is time to think of your life partner అన్నాడు సరే మరి నీ మాటేమిటి అన్నాడు విక్రం. యింక నేను M.B.B.S $V^{th}$ year పూర్తి చేయలేదు. Medicine పూర్తి అయిన తర్వాత కదా ఆలోచించేది అన్నాడు. వెంకటకృష్ణుడు యిప్పుడు నాకు కూడా అంతే కదా నేను medical college లోనే వుంటే నీవలెనే నేను కూడా అదే సమాధానమిస్తుంటిని. యేదో I.A.S. కు కూర్చున్నాను కాబట్టి యిప్పుడు settle అయినాననుకుంటున్నావు. settle అయినానని నేను అనుకొనుటలేదు. జీవితములో ఒక వయసువస్తే జీవితములో పాలుపంచుకొనే ఒక భాగస్వామి కావాలంటారు. కాని నాకైతే యిప్పుడు 22 యేండ్లు యిప్పుడే యేమిటి తొందర. అందులో నేను యింక ఆ విషయమే ఆలోచించదలచుకోలేదు. నాయనగారికి తొందరున్నట్టు ఉంది కాబట్టి ఆలోచిస్తున్నారు అన్నాడు విక్రం. నేను నీకో proposal తెచ్చినాను విక్రం నీవు సరేనంటే ప్రస్తావిస్తాను లేదంటే మానుకుంటాను అన్నాడు. వెంకట్ నీ proposal విషయమై తప్పక వింటాను. నీవు నాకు పరమ స్నేహితుడవు నిర్భయంగా జంకు గొంకు లేకుండా చెప్పవచ్చు మరి సందేహమెందులకు అన్నాడు విక్రం. అయితే సావధానంగా విను అన్నాడు వెంకటకృష్ణుడు. మా పావని తెలుసుగదా ఆమె విషయమై ముందు నీ అభిప్రాయాన్ని వినాలని వుంది. విక్రం ఓస్ యింతేనా. యిక విను పావని $1^{st}$ నీ మేనత్త కూతురు. అందం, ఐశ్వర్యం ఆమెకు

పుట్టుకతోనే లభించిన సొత్తు. అందుకు దగ్గట్టు చదువుకుంది. సంగీతం కూడా బాగానే నేర్చుకుంది. పేరైన కుటుంబం. యింక కావలసిన దేమీ అన్నాడు విక్రం. వెంకటకృష్ణుడు మనసులో propose చేస్తే ఒప్పుకొంటాడనుకొన్నాడు తనలో. పైకి మాత్రం thanks అని వూరుకున్నాడు. సమయమొచ్చినప్పుడు తను పోకముందే proposal వినిపిద్దామనుకున్నాడు. ప్రస్తుతానికి thanks అని మాట మార్చాడు. యిద్దరూ చాలా వరకు మాటాడుతూ కూర్చున్నారు. విక్రం బంట్రోతును పిలిచి drinks తెమ్మన్నాడు. drinks గ్లాసులతో వచ్చినది. soda తే పో అని బంట్రోతుతో అన్నాడు సరే అని వెళ్ళిపోయినాడు. విక్రం ఒక scotch bottle చూపిస్తూ నేను సాధారణంగా త్రాగను. యిప్పుడు నీరాక పరమసంతోషదాయకము కాబట్టి We have to celebrate అన్నాడు. సోడా తేగానే విక్రం గ్లాసులలో scotch పోసి ice వేసి దాంట్లో soda నింపినాడు. యిద్దరు cheers అని గ్లాసులను రెండింటిని toutch చేసి sip చేసినారు. యీ సందర్భంలో అటు కాలేజీ విషయాలు, వారి family విషయాలు జీవితములో జరిగిన యేవేవో జ్ఞాపకాలు మాటాడుకుంటూ కూర్చున్నారు. యింతలో table set చేసి వంటమనిషి అన్ని సిద్ధంగా నున్నయి sir అన్నాడు విక్రం వద్ద కొచ్చి. సరే వస్తున్నాము అంటూ వారు drinks finish చేసి వెళ్లి భోంచేస్తూ యింకా యేవేవో సంభాషించుకుంటూ భోజనాలు finish చేసినారు. పిమ్మట విక్రం వక్కాలు వేసుకున్నాడు. అవే వెంకట్ కి కూడా offer చేశాడు. వెంకట్ వక్కాలతో సహా సిగరెట్టు ముట్టించాడు. విక్రం కు offer చేసినాడు కాని విక్రం no thank you అని నిరాకరించినాడు. యిట్లు మిత్రులు యిద్దరు verenda లో కూర్చొని మాటాడి చాలా సేపటి తర్వాత వారి రూంలలో నిదురించారు. వెంకటకృష్ణుడు guest room లో నిద్రించాడు. విక్రం తన bed room లో.

తెల్లవారి విక్రం వెంకటకృష్ణున్ని లేపినాడు. టీ మరియు టిఫిన్ సిద్ధంగా చేసినారు పనివారు. యిద్దరూ మరి విక్రం collegue వేరే jurisdiction లో వుంటాడు కలసి breakfast చేసి టీ త్రాగినారు. Tea త్రాగిన పిమ్మట విక్రం collegue ను పంపించి వెంకటకృష్ణుని తో మాటాడుతు కూర్చున్నాడు. నీవు వచ్చినావని యింత పురుసత్ గా వున్నాను. రోజూ విరామము లేకుండ పని ఉంటుంది అన్నాడు విక్రం. అవును విక్రం పదవులటు వంటివి. చాలా బాధ్యతలుంటాయి నాకు తెలుసు. అయినా యెంతవరకు నీవు నీ work enjoy చేస్తావో it doesn't matter అన్నాడు. of course I enjoy but it is very stressfull and strainfull job. యెంతకాలము యీ stress ను తట్టుకోగలనో అంతకాలం చేస్తా. స్ట్రెస్ తట్టుకోలేకపోతే వేరే యేమైనా అలోచించాలె అన్నాడు విక్రం. యింకా ఏమి అలోచిస్తావు this is the top job in the Govt. sector you will perhaps retire as a principal or chief secretary somewhere in the country అన్నాడు వెంకటకృష్ణుడు. యీ మాటల సందర్భంలో విక్రం వెంకటకృష్ణునితో thanks for coming వెంకట్. I am enjoying your company అన్నాడు విక్రం. thanks కే ముంది నాకు పనుంది కాబట్టి వచ్చినాను. And of course the feeling

is mutueal నేను కూడా చాల enjoy చేసినాను అన్నాడు వెంకటకృష్ణుడు. సరే నేను నిన్ను ఒక మాట అడిగి సెలవు తీసుకొని బయల్దేరాలె అన్నాడు వెంకటకృష్ణుడు. అప్పుడే బయల్దేరుతావా? అంత తొందరేమిటి అన్నాడు విక్రం. నీవు medicine లో వుంటే నీకూ తెలిసేది విక్రం. చాలా చదవాలి అన్నాడు. ఆ మాట యేదో సెలవియ్యండి మరి అన్నాడు విక్రం. నేను నిజంగా వనజ అత్తయ్య తోలితే వచ్చినాను. పావని విషయమై నీ అభిప్రాయాన్ని తెలుసుకొమ్మన్నది. ఆ విషయం యీ వరకే తెలుసుకొన్నా ఆమెను నీవు అర్ధాంగిగా స్వీకరిస్తే వనజ అత్తయ్య మరి నీ parents కూడ సంతోషిస్తారు. నీకు తెలుసు కదా ఆడపిల్లకు అయిన వరుడు దొరకగానే పెండ్లి చేసి అత్తవారింటికి పంపించితే వారి బాధ్యతలు తీరతాయి అని. దీనికి విక్రం కొంచెం సేపు మాటాడలేదు. వెంకటకృష్ణుడు సమాధానానికై యెదురు చూస్తున్నాడు. విక్రం సమాధానం యివ్వక తప్పదా అని వెంకట్‌ను అడిగినాడు. తప్పదు అని అనను ఆలోచిస్తాను అంటే మళ్లీ వస్తాను అన్నాడు వెంకట్. విక్రం వెంకట్ తో వెంకట్ I am ready to answer but this should not be a reflection on Pavani nor on our friendship. I do not have any answers now బహుశః నా position ను చూసి చాలా మంది పిల్లలను చూపిస్తామంటున్నారు. నాన్నగారు కూడా ప్రత్యుత్తరంలో యిదే విషయాలు వ్రాస్తున్నారు. కాని చాలా కాలం యీ I.A.S. జాబు చేయనేమో అప్పుడు అందరు disappoint అవుతారు. రెండవది నా వయస్సు యిప్పుడు 22 సంవత్సరాలు let me be free with family responsibilities for some more time అన్నాడు. వెంకట్ విక్రంతో మంచిది విక్రం I respect your views అని, సరే వస్తా అని కారులో కూర్చున్నాడు. విక్రం వెంకటకృష్ణుని car లో కూర్చుండబెట్టి bye Venkat, take care అని చెప్పిలోనికి వచ్చినాడు. రాగానే బట్టలు వేసుకొని office కు వెళ్లినాడు. ఆఫీసుకు పోగానే యెన్నో files తన బల్లమీదవుంచినారు తన staff. యెందరో interview కు మరి కొందరు వేరే పనుల మీద వచ్చినారు. office is full of people. office లో కూర్చొని file తీసి concern official ను పిలిచి మాటాడి వాటిని dispose చేస్తున్నాడు విక్రం. యీ విధంగా ప్రతినిత్యం యిల్లు office, గ్రామాలు క్రింది officials చూస్తున్న office inspection ల తోనే కాలం వెళ్లబుచ్చడం జరుగుతుంది. vacation అంటే తల్లి, తండ్రి మరి కృష్ణమోహన్‌తో యిట్లు రెండేళ్ళు గడిచి పోయినవి. విక్రంకు జీవితం శుష్కంగా కనిపిస్తుంది. మంచి officer గా పేరు తెచ్చుకుంటున్నాడు. ఒక్క చిల్లిగవ్వ కూడా లంచం తీసుకోడని అందరికి తెలిసి పోయింది. యెవ్వరు కూడా అది యితని వద్ద యెత్తలేదు. యీ విషయమై విక్రం అంటే యితని క్రింద పని చేస్తున్న అధికారులకు హడలు. యిప్పుడు విక్రం తన బాధ్యతను office బాధ్యతను బాగా తెలుసుకున్నాడు. office rules & regulations బాగా తెలుసుకున్నాడు. గుమాస్తాలు అధికారులు rules విషయమై విక్రంకు చెప్పనవసరములేదు. ఒక వేళన్యాయం కలుగుతున్నది, అనుకొంటే rules కు విరుద్ధంగా పోతాడు కాని legal matters మాత్రం తిరస్కరించడు. rules are meant for smooth functioning of the office but law is the right of

the people అని ఇతని భావన. యిప్పుడు పని కూడా చాలా చురుకుగా సాగిపోతుంది office లో ప్రతిదీ యితనికి కంఠస్థమైపోయింది office లో file dispose చేసి interviews యిచ్చి అలసి యింటికి వస్తాడు. యింట్లో domastic staff తప్ప యింక యెవరూలేరు. టీ, భోజనం నిర్ణీత సమయంలో టేబుల్ పైన వుంటాయి. భోంచేస్తాడు. పేపరు చదువుతాడు. పడుకుంటాడు. అనాడు TV లు లేవు కదా రేడియో మాత్రం news వినుటకే వేరే programes విక్రంకు పనికిరావు. అప్పుడప్పుడు కొన్ని మంచి classical or semi classical music వింటూ వుంటాడు.

కాల చక్రం యెవరికోసరమై అగదు అది యెవరూ అడ్డగింపరానిది. even పరమాత్ముడు కూడా వచ్చి ఆగిపో అంటే అగదు. చూస్తుండగానే ఉద్యోగంలో చేరి 3 యేండ్లు కావస్తుంది. యిక 2 యేడ్లలో యీతనిని collector గా బదిలీ చేస్తారు యే జిల్లాకైనా. అప్పుడు యింకా బాధ్యతలు మించి పోతాయి. అప్పుడు almost జిల్లా కార్యభారమంతా యీతని భుజస్కందాలమీదనే ఆధారపడి వుంటుంది. విక్రం యిప్పుడు enjoy చేసేది తన తల్లిదండ్రులు వ్రాసే ఉత్తరాలే. ముఖ్యంగా కృష్ణమోహన్ ఉత్తరాలు విక్రంకు చాలా ఇష్టం. కృష్ణమోహన్ ఇప్పుడు college లో ఉన్నాడు. వాడి వుత్తరాలు చదివి విక్రం సంతోసిస్తాడు. యెప్పటి వలెనే ధర్మారావు వుత్తరము వచ్చింది. ఆ వుత్తరం విప్పి చదివినాడు. ఆ ఉత్తరంతో పాటు ఒకరిద్దరి అమ్మాయిల photo లు కూడా ఉన్నాయి, అందులో ఒకటి familiar face. విక్రం యీ అమ్మాయిని యెక్కడో చూచినాను అని అలోచిస్తుండగా ఒక సారి తాను నిజాం కాలేజ్ reading room లో కూర్చున్నప్పుడు తనకు కొంత దూరములోనే యిద్దరు అమ్మాయిలు మెల్లగా మాటాడుకుంటూ అప్పుడప్పుడు తన వైపుకు చూస్తూవుండిరి. అప్పుడు ఆ అమ్మాయి బి.ఎ మొదటి సంవత్సరములో నుండెను. యీమె తండ్రి high court justice అని. యిప్పుడు తండ్రిగారు పంపిన photo తో సహా అన్ని విషయాలు పేరు ఉత్తరంలో నున్నాయి. అమ్మాయి M.A. final పరీక్ష యిచ్చిందట అమ్మాయి పేరు ప్రమద అట. తండ్రిగారు justice Raghunath Rayalu అని ఆ వుత్తరంలో వుంది. యిక వీరి family వివరాలు ఉన్నాయి. ఉత్తరం పూర్తిగా చదివిన పిమ్మట విక్రం ఆ photo ను బాగా చూసినాడు. యింక చూడలనిపించింది కాని ఒట్టి photo లు చూస్తే యేమి లాభము అమ్మాయిని మంచిగా మరి ఒకసారి చూడాలె అనుకున్నాడు. మొదటిసారి కాలేజ్‌లో చూచినప్పుడే విక్రంలో ఒక విధమైన feeling అనాడే తలెత్తింది. అప్పుడతడు యింక teenage ఆఖరి దశలో నుండెను. అందుకే ఆ feelings కు అంత ప్రాముఖ్యమివ్వలేదు. యిప్పుడు అదే feeling మరో సారి యెన్నియో రెట్లు తనలో పెల్లుబికింది. Is it love or what అనుకున్నాడు తనలో తాను. అప్పుడే విక్రం ఒక వుత్తరం వ్రాసి తండ్రికి పోస్టు చేయించాడు. రఘునాధ్‌రాయలు గారి అమ్మాయిని చూస్తానని పిమ్మట మనము చర్చించవచ్చు అని తేదీ తిధి అన్ని చూచి వుత్తరం వ్రాస్తే సెలవు తీసుకొని హైద్రాబాదుకు వస్తానని వ్రాసినాడు.

ధర్మారావుగారు తనయుని ఉత్తరం చదవగానే చాలా సంతోషించారు. యీ విషయం భార్యకు తెల్పినాడు. ఆమె ఆనందానికి అంతులేదు తన గారాబు కొడుకు కనీసం యిప్పటికైనా పెండ్లి చేసుకోవాలని బుద్ధి పుట్టినందుకు చాలా సంతోషించింది. అప్పుడే దేవునికి దీపం పెట్టి అగరువత్తులు ముట్టించింది. వెంటనే బ్రాహ్మణుని పిలిచి పెండ్లి చూపుల కే దినము మంచిదా యీ 15 రోజులలో అని అడిగింది. బ్రాహ్మణుడు అన్ని విధాల బాగున్న ఒక రోజును నిర్ణయించి యిచ్చాడు ఆ తేదీ time హైద్రాబాదులో పిల్లను చూపిస్తే బాగుంటుందని తమ కుటుంబమంత ఆనాడు శ్రీవారి యింటికి వస్తామని వ్రాసి మనిషితో పట్టణానికి పంపించాడు. వస్తూ వస్తూ కృష్ణమోహన్‌కు కూడా యీ విషయం తెల్పమన్నాడు. పిమ్మట విక్రంకు యీ తేదీ time గురించి వ్రాస్తూ ఆ తేదీ కంటే ఒక నాడు వీలైతే రెండు రోజుల ముందే పట్టణానికి రమ్మని వ్రాసినాడు.

తాము కూడా విక్రంని పట్టణములోనే కలుస్తామని వ్రాసి express mail ద్వారా పంపించినారు. ఉత్తరము ముట్టగానే విక్రం leave కు apply చేసినాడు తండ్రికోరిక ప్రకారము రెండు రోజుల ముందే హైద్రాబాదు చేరుకున్నాడు కృష్ణమోహన్‌ను తీసుకొని తల్లిదండ్రిని తీసుకొనివెళ్లుటకు వూరు వెళ్లినాడు. ధర్మారావు శ్రీలత బట్టలు సర్దుకొని, కావలసిన వస్తువులన్నీ తీసుకొని సిద్ధంగా వున్నారు. యింటి ముందు కారాగిన చప్పుడు ధర్మారావు విన్నాడు వేరే సమయములందైతే యెవరు సుమా అనుకునే వాడు. యిప్పుడు విక్రం వచ్చి వుంటాడని పనిమనిషితో చిన్నయ్య గారొచ్చినట్టుంది. వెళ్లి చూడు అన్నాడు. కారు దిగి విక్రం, మరి కృష్ణమోహనులకు పనిమనిషి యెదురుగా వచ్చినారు. పనిమనిషి వారి యిద్దరి suite case లను తీసుకొని వారి వెనుక నడుస్తున్నాడు. యిద్దరు లోనికి వచ్చి తండ్రి పాదాలకు నమస్కరించి తల్లితో కలయుటకు లోపలికి వెళ్లినారు. తల్లి మహానందముతో యిద్దరిని కౌగిలించుకొని ముద్దుడికొంది. అందరూ హాల్‌లోకి వచ్చినారు. శ్రీలత లోనికి వెళ్ళింది. ముగ్గిరికి కొన్ని పండ్లు మరి sweets పంపింది. వాటితో tea pot కూడా వుంది టీ కలిపి అందరికిచ్చింది మెల్లగా snaks తినుకుంటూ టీ త్రాగినారు. పిమ్మట కొంచెం రెస్టు తీసుకొనుటకు విక్రం మేడమీదకి వెళ్ళినాడు. కృష్ణమోహన్ మాత్రం తల్లితోనే వున్నాడు చిన్నవాడు కాబట్టి యింక baby లాగానే ప్రవర్తిస్తున్నాడు.

సూర్యుడు, తన యాత్రలో కడు అలసినానని పడమరి దిశకు అస్తమించబోతున్నాడు. 10,12 గంటలు విశ్రమించి మళ్లీ తూర్పుదిశనుండి బయలుదేరి వస్తానన్నట్లుగా తన విశ్రాంతికి తయారీలు చేస్తున్నాడు. యిక కొద్దిసేపట్లో తన బాధ్యతలను మరచి పడమర దిశ పవళిస్తున్నాను అంటున్నాడు. పాపం సూర్యుడు పవళించినట్టున్నది. చీకటి అలముకొన్నది. యింటిలో దీపాలు వెలిగించినారు. హాల్ లో petromax దీపము వెలుగుతున్నది చాకలివాడు అందరికి పరుపులు వేయుటకు వచ్చినాడు. అన్ని పరుపులు దులిపి పక్కలు వేసిపోయినాడు. విక్రం కొంచెం rest తీసుకున్న పిదప హాల్‌లోకి వచ్చినాడు. నలుగురు చాలా సేపటి వరకు మాటాడుకుంటూ కూర్చున్నారు. ధర్మారావు విక్రం ను తన ఆఫీసు బాధ్యతలను గూర్చి అడిగినారు.

కాని విక్రం మాత్రం వాటిని అంతగా పట్టించుకోలేదు. పిమ్మట కృష్ణమోహానుని చదువు గూర్చి మాత్రము ప్రస్తావించాడు వాడు బాగానే చదువుతున్నాడు వాడిని గురించి మీరు బెంగపెట్టుకొనే అవసరమే లేదు నాన్నా అన్నాడు విక్రం. అయినా తండ్రిగా కొన్ని ప్రశ్నలు అడిగినాడు వాటన్నిటికి సంతోషంగా సమాధానమిచ్చాడు కృష్ణమోహన్. అందరూ భోంచేసి వారి వారి గదులకు వెళ్లి నిద్రించారు

సూర్యుడు మళ్లీ తన అరుణ కిరణాలతో తెలవారిందన్నట్లుగా తూర్పున వుదయించినాడు. అతడిప్పుడు తన కిరణాలను చల్లగా ప్రసరింపచేస్తున్నాడు. కాని యీ చల్లదనం కొంత సేపే కొంతసేపట్లో అవి తీక్షణ మౌతాయని అందరికి తెలుసు. సర్వ ప్రపంచం మేలుకొంది, కనీసము హిందూ దేశములో. విక్రం వూరిలో అందరూ లేచి వారి వారి కాలకృత్యాలు తీసుకుంటున్నారు. కృష్ణమోహన్ లేవలేదు. విక్రంకు ప్రొద్దున్నే లేచే అలవాటు లేదు రాత్రి చాలాసేపటివరకు సాధారణంగా మేలుకొంటాడు కాని ఉదయం లేవడం ఆయనకు బద్దకం. ధర్మారావు శ్రీలతకు ఉదయం లేచుట అలవాటు. అందుకే వాళ్లు లేచినారు. యింట్లో వుండే నౌకర్లను లేపినారు. బయటనున్న నౌకర్లుకూడా వచ్చినారు. పాలు పితికేవారు, యిల్లు వాకిలి వూడ్చేవారు వంటయింట్లో పనిచేసేవారు, అందరూ వచ్చి తమ తమ పనులలో నిమగ్నులైనారు. ఒక పాలేరు పాలుపితికిన గేదెలను తోలుకొని పోతున్నాడు శ్రీలత వీండ్లందరికి పనులు చెప్పాచు busy గా వుంది ధర్మారావుమాత్రము కాలకృత్యాలు తీర్చుకొని టీ అని చెప్పి paper చదువుతూ కూర్చున్నారు, యింతలోనే టీ కూడా శ్రీలత తనకు తనభర్తకు తెచ్చింది యిద్దరు టీ త్రాగుతూ కూర్చున్నారు. తొందరగా వెడితే మంచిదని శ్రీలత ధర్మారావుతో అంది నాదేముంది. నేను యెప్పుడు అంటే అప్పుడు బయలుదేరగలను, పిల్లలు కూడా అంతే యిక ఆలస్యం జరిగిందంటే మీ ఆడవారి అలంకరణతోనే అన్నారు. సరే లెండి యెవరు మొదలు తయారవుతారో మీరే చూస్తారు అని టీ త్రాగుతుంది. యింతలో కృష్ణమోహానుడు దిగివచ్చినాడు. అమ్మా టీ అన్నాడు. మొఖం కడుక్కో టీ వస్తుంది అన్నదా మాతృమూర్తి. టీ త్రాగుటకు మొఖమెందుకు కడగాలి అన్నాడు గారాబంతో. యిది పట్టణం కాదు నాయన. 10 నిమిషాలలో ముగించికొని రమ్ము అంది తప్పదా? లే తప్పదు అంది కృష్ణమోహానుడు paste and brush తీసుకొని bath room కు వెళ్ళాడు. అంతలో విక్రం brush చేసుకుంటు క్రిందికి దిగినాడు కొంచెంసేపు హాల్‌లో కూర్చొని bath room కు వెళ్లి shave చేసుకొని మొఖం కడుక్కొని అమ్మా టీ అన్నాడు. సరే నాన్న యిప్పుడే అని పనిమనిషిని పిల్చి యిద్దరికీ టీ తెచ్చి ఇవ్వు అంది సరే అమ్మా అని వంటశాలకు పోయి టీ kettle తో రెండు మూడు కప్పుల టీ తీసుకొని వచ్చింది యింతలో కృష్ణమోహన్ కూడా వచ్చాడు. యిద్దరు అన్నదమ్ములూ ఒక చోట కూర్చొని టీ త్రాగినారు విక్రంకి టీ చాలా వేడిగా వుండాలి. లేకపోతే త్రాగలేడు. అమ్మా యీ టీ చల్లగా వుందే కొంచెం వేడి చేసి తెమ్మను అన్నాడు అలాగే అయ్యా అని పనిమనిషి సలసల కాచి తెచ్చింది విక్రం టీ త్రాగి మరి తొందరగా బయలు దేరుదామా అమ్మా

అన్నాడు. సరే బాబు అని లేచిపోయింది. 25 నిమిషాలలో స్నానం చేసి పట్టు వస్త్రాలతో మరి ఆమెకు నచ్చిన నగలతో అలంకరించుకొని హాల్ లోకి వచ్చింది ఏమండి ధర్మారావుగారు ఆడవారికే అలస్యమవుతుందన్నారుగా యిప్పుడెవరండి తయ్యారుగా లేంది అంది ఓ అలాగా అని లేచి స్నానం చేసి తెల్లటి చొక్క మరి ధోవతితో సిద్ధంగా నున్నాడు హాల్ లో విక్రం సూటు వేశాడు కృష్ణమోహన్ పేంటు షర్టు తో సిద్ధంగా నున్నాడు వీరి వెంబడి తీసుకపోవుటకు ఒక సేవకురాలు కూడా రెడీ యిక అలస్యం దేనికి. suite case అన్నీ డిక్కీలో పెట్టించారు ఒక సేవకునితో. విక్రం డిక్కీ మూసివేసినాడు శ్రీలత, సేవకురాలు, కృష్ణమోహను కారు వెనక భాగంలో కూర్చున్నారు. విక్రం మరి ధర్మారావుగారు ముందు భాగంలో కూర్చున్నారు. విక్రం స్టీరింగ్ వీల్ పైన నున్నాడు. అన్ని సామానులు సర్దుకున్నారా అన్నాడు విక్రం. అవును అన్నారు అందరు. అయితే బయలుదేర వచ్చా? అవును అన్నారు అందరు. కారు start చేసి $1^{st}$ gear లోకి వేసాడు విక్రం. accelerator వత్తగానే ఝూూం అంటూ కారు ముందుకు సాగింది. ఇల్లు భద్రం అంటుంది శ్రీలత వెనకకు మరలి పనివారితో సరిగ్గానే వుంటుందిలే అన్నాడు ధర్మారావు యీలోపుగా కారు యిల్లు విడిచి street లోకి కదిలింది పిమ్మట $2^{nd}$ gear కు మార్చినాడు కారు speed pickup చేస్తుంది విక్రం అతి శ్రద్ధగా కారు నడుపుతూ రోడ్డు పైకి వచ్చాడు అప్పుడు తారు రోడ్డులు లేవు యీనాటివలె. వాటిని కంకర రోడ్లు అనేవారు speed ముప్పై మైళ్లకు సామాన్యంగా మించదు Anyway 30 – 40 మైళ్ల మధ్య స్పీడులో కారు పరుగిడుతోంది. మూడు గంటలలో హైదరాబాద్ లో తన యింటికి చేరుకున్నారు. అంతకు ముందే ఒక మనిషి వచ్చి పోయినాడని వంటమనిషి ధర్మారావుకు తెల్పినాడు. అయితే బయల్దేరదామా? అన్నాడు విక్రం కొంచెం అగు నాయనా అంది శ్రీలత కొంచెం దిగికాళ్లు చేతులు కడుక్కొని fresh అయిపోదాము అంది సరే అని అందరూ దిగినారు వొకరి తర్వాత మరొకరు మొఖాలు కడుక్కొని fresh అయినారు శ్రీలత మాత్రం బట్టలు మార్చుకుంది. పిమ్మట అందరు వెడదామా అన్నారు. విక్రం వాళ్ళ అడ్రసు వుందా అన్నాడు ధర్మారావుతో. ఆఁ అన్నారు ధర్మారావు ఆ అడ్రసు వ్రాసిన కాగితం విక్రం చేతిలో పెట్టినారు. ఆ అడ్రసు చూసుకొని కొంచెం ఆలోచించి సరే అని కారు యెక్కారు. రఘునాథరాయలు మారేడిపల్లిలో వుంటాడు. విక్రం కారు సికింద్రాబాదు వైపుకు త్రిప్పాడు యీనాటి వలె అనాడు రోడ్డుపైన యింత congestion లేదు కాబట్టి 20 నిమిషాలలో వారి యింటికి చేరుకున్నారు. వీరి యిల్లు పెద్ద మేడ. gate కాడ ఒక సెంట్రీ ఉన్నాడు. కారు చూడగానే ఒక పనిమనిషి gate తీసినాడు. కారు లోనికి చేరగానే gate ముగించాడు. అందరూ దిగగానే రఘునాథరాయలు స్వయంగా వచ్చి guest లను recieve చేసుకున్నారు యితనికి యిద్దరు కూతుండ్రు యిద్దరు, కుమారులు. ప్రమద పెద్దది, సరిత చిన్నది ప్రమదకన్న పెద్దవాడు సుమిత్, అందరికన్న చిన్నవాడు సుమన్. సుమన్ ఆ యింటి baby high school లో నున్నాడు. ప్రమద తల్లి శ్రీలక్ష్మి. సుమిత్ కూడా I A.S. యితడు యిప్పుడు జిల్లాకలెక్టరుగా పనిచేస్తున్నాడు. తన చెల్లెలిని

చూడటానికి వస్తున్నందుకు తండ్రి యితనిని రప్పించాడు సరిత B.A చదువుతున్నది. రఘునాధరాయులు 12 సంవత్సరాలుగా హైకోర్టు justice గా పని చేస్తుస్తున్నారు. రఘునాధరావు గారి బంధువులు కూడా వచ్చియున్నారు. యిల్లంతా సందడిగా ఉంది, అందరూ వీళ్ళ విశాలమైన drawing room లో సోఫాలపైన కూర్చున్నారు. కొంత సేపు నిశ్శబ్దం పిమ్మట రఘునాధరాయలుగారు ధర్మారావుగారితో ప్రయాణము ఎట్లుండె అన్నారు యేదో మందలించుటకు ధర్మారావుగారు పరవాలేదన్నారు. సుమిత్, విక్రం కూడా ఒక సోఫా పై కూర్చొని తమ అడ్మినిస్ట్రేషన్ గురించి మాటాడుకొన్నారు శ్రీలత శ్రీలక్ష్మమ్మ యేవో నగల విషయం చీరల విషయం మాటాడు కున్నారనుకుంట. కృష్ణమోహన్‌తో మాటాడుటకు యెవరు లేరు నిశ్శబ్దంగా కూర్చున్నాడు. రఘునాధరావు యిది గ్రహించి అచ్చట నున్న పనిమనిషితో కృష్ణమోహనును చూపించి ఈ బాబును సుమన్ గదిలోకి తీసుకెళ్ళు అని ఆజ్ఞాపించాడు. ప్రమద సరిత ప్రమద గదిలోనున్నారు. కొంచెం సేపు అందరూ మాటాడుకొన్న పిమ్మట శ్రీలక్ష్మమ్మ గారు లేచి లోనికి వెళ్లింది. వెళ్లిన 10 నిమిషాలకే కోసిన పండ్లముక్కలు మిఠాయలు, కారపు వస్తువులు అన్నిటిని వేరే వేరే tray లలో పేట్లలో పెట్టి సేవకురాండ్రతో పంపించింది coffee table పై అన్నీ పెట్టబడినవి drawing room మధ్యలో. పిమ్మట సుమిత్, శ్రీలక్ష్మి అందరికి ఇచ్చినారు రెండు కుటుంబాలె కాబట్టి అంత గజిబిజి లేదు. అందరూ కూర్చొని యీ ఫలాహారాలు తింటున్నప్పుడు రఘునాధరాయులు తమ్ముడు ప్రవేశించాడు. అప్పుడు రఘునాధరాయలు తమ్ముని పిలిచి అందరికి పరిచయం చేశాడు. ఇతని పేరు కృష్ణరాయలు, వూరిలోనే ఉంటారు. వీరి భూములను manage చేస్తుంటారు. కూతురును చూచుటకు వస్తున్నారని కబురంపి రప్పించాడు.

అందరూ టీ ముగించిన తర్వాత రఘునాధరాయలు శ్రీలక్ష్మితో అమ్మాయిని రమ్మను అన్నాడు శ్రీలక్ష్మి లోనికి వెళ్లింది రెండు నిమిషాలలో ప్రమద సరితతో వచ్చింది శ్రీలక్ష్మి ప్రమదను తన మధ్య శ్రీలత మధ్య కూర్చోబెట్టింది విక్రం ప్రమద రూంలోకి వస్తుంటేనే మెల్లగా యెవరు చూడకుండ ప్రమదను చూస్తున్నాడు. ఆనాడు అంత simple గా dress చేసుకున్నప్పుడు నన్ను ఆకర్షించని ప్రమద యివ్వాళ make up లో యెంత అందంగా ఉంది అనుకున్నాడు లోలోన. slim, tall, fair complexion తో అపురూప సుందరి అన్నట్లు వుంది ప్రమద. భగవంతుని సృష్టిలో ఎన్నియో అందాలున్నాయి కాని యింత అందము యీమెకే యిచ్చిన ఆ భగవంతుడెంత పక్షపాతియో? కోలముక్కు గుండ్రని ముఖము పొడుగాటి వెంట్రుకలతో స్వర్గలోకము నుండి యీ మానవలోకానికి ప్రవేశించిన దేవకన్నెయా అన్నట్టు గోచరిస్తుంది. విక్రంకు. ఆమె తల్లి మధ్య శ్రీలక్ష్మి మధ్య కూర్చున్నది కాబట్టి అటు వైపు అప్పుడప్పుడు చూచి చూడనట్టుగా చూస్తున్నాడు కాని వాస్తవానికి ఒకడే ఉంటే ఆమెను యెంతసేపు చూచినా తనివి తీరదనుకొన్నాడు అందరు యేవేవో మాటాడుతున్నారు కాని యీతడు అన్ని మరచి ఆమెనే చూడాలనుకుంటున్నాడు. కాని అలా చేస్తే సభ్యతకు విరుద్ధమని అప్పుడప్పుడు ప్రక్కనే కూర్చున్న సుమిత్‌తో కూడా మాటాడుటకు ప్రయత్నిస్తున్నాడు. సుమిత్

యీ సంగతి గ్రహించాడు. అందువల్ల ఆయనకూడా యీతని మాటలు తగ్గించుటకు ఆ( ఆ( అని కూర్చున్నాడు. కాని లోలోన నవ్వుకున్నాడు పాపం. తన చిన్నారి చెల్లెలు విక్రంకు నచ్చిందని తెలుసుకున్నాడు. అందుకే చూడనీ అని అటునుండి excuse me అని లేచి తండ్రితో యేదో ముఖ్యమైన పని ఉన్నట్టుగా విక్రంను విడచి తండ్రి దగ్గర కూర్చొని తండ్రితో మాటలు ప్రారంభించాడు ధర్మారావుకూడా యీ సంభాషణలో పాల్గొన్నారు. సరిత మాత్రము విక్రంను చూచి లోలోన నవ్వుకుంది కాని పైకి మాత్రము సీరియస్‌గా నటిస్తుంది పదినిమిషాలు యిలానే గడిచినాయి. శ్రీలత తనయునితో యేం నాయనా యెలా ఉంది నాకాబోయే కోడలు అంది. విక్రముడు బాగుందమ్మా అన్నాడు వెంటనే శ్రీలత శ్రీలక్ష్మితో వదినగారు అమ్మాయి నచ్చినట్టుగా బాబు తెల్పినాడు. యిక నాకు మావారికి యేమి అభ్యంతరముండదు. మరోనాడు తాంబూలాలు పుచ్చుకొనుటకు వస్తాము అని అంది. ధర్మారావు కూడా రఘునాధరాయలతో చేతులు జోడించి విన్నారుగా మాఆవిడ మాటలు. అదృష్టంలో నుండి ఎవరూ తప్పించలేము. మళ్ళీ ఒక సుముహూర్తములో తాంబులాలు స్వీకరించుటకు కలుసుకుందాం. మరి సెలవిప్పించండి అని లేచినాడు. దీనితో రఘునాధరాయలు కొడుకు, భార్య, తమ్ముడు లేచినారు కారు వరకు సాగనంపినారు. విక్రం car start చేసి bye అని అందరికి చెప్పి కారును కదల్చినాడు. రఘునాధరాయల కుటుంబమంత మళ్లీ drawing room లో కూర్చున్నారు. అప్పుడు ప్రమద మామూలు మనిషివలె తమ family members తో free గా మాటాడుతుంది సమన్ మరి సరిత ప్రమదను పరిహసిస్తున్నారు. ప్రమద పాపం నవ్వటం తప్ప యింకేమి అనుటలేదు. అప్పుడప్పుడు వీరి అల్లరి మితిమీరినప్పుడు శ్రీలక్ష్మి వీరిని control చేయుటకు ప్రయత్నిస్తున్నది. రఘునాధరాయలు సుమిత్‌తో విక్రం విషయమై నీ అభిప్రాయమేమిటి అని అన్నాడు. super అన్నాడు సుమిత్. నీ అభిప్రాయమేమిటి కృష్ణ అని తమ్మునితో అడగగా మీకన్న యెక్కువ నాకేమి తెలుసు అన్నయ్య అని వూరకున్నాడు. శ్రీలక్ష్మమ్మ మధ్యన రఘునాధరాయలతో ప్రమదకు అబ్బాయి చాలా నచ్చినాడు. అందువల్ల మనము తొందరగా తాంబూలాలు పుచ్చుకొని యీ వేసవిలో పెండ్లి నిర్ణయిస్తే బాగుంటుందని అంది. అందరు సరేననుకున్నారు. యిక పెండ్లిదే ఆలస్యము.

విక్రం సిటి యింటికి వచ్చి తల్లి తండ్రులతో చాలా సేపు మాటాడి సరే నాన్నా మిమ్ములను వూళ్ళో వదలి మళ్లీ కృష్ణమోహన్‌ని యిచట వదలి నా duty కి వెడతాను అన్నాడు. సరే అని ధర్మారావు తన పెట్టెలను కారులో పెట్టించి భార్యతో వెడదామా అన్నాడు. కృష్ణమోహన్ శ్రీలత పనిమనిషి కారు వెనుకభాగంలో కూర్చున్నారు. విక్రం, ధర్మారావు ముందు భాగంలో కూర్చున్నారు. కారు రివ్వున పరుగెత్తింది. సాయంకాలం యేడు గంటలకు యిల్లు చేరుకున్నారు. విక్రం కృష్ణమోహన్‌లు ఇంకొంచెం సేపు ఆగి మళ్ళీ సిటీకి 10 గంటలకు చేరుకొన్నారు. వంటవాడు అయ్యా భోంచెయ్యరా అంటే లేదు అని తనగదిలోకి వెళ్ళినాడు విక్రం. మరి 5 గంటలకే లేచి కృష్ణమోహనును లేపలేదు. కాలకృత్యాలు తీర్చుకున్న పిదప టీ చేయమని వంటవానికి చెప్పినాడు. టీ రాగానే త్రాగి బట్టలు మార్చుకొని

కృష్ణమోహన్‌ను లేపినాడు. యిప్పటికి 7 గంటలు కావస్తున్నది తమ్ముడూ నేను వస్తాను. యివ్వాళ నేను office లో పనిచేయాలి. బాగా చదువుకో. ఉత్తరాలు వ్రాస్తువుండు మళ్ళీ కలుస్తా అని బైటకి నడచి కారు start చేసి నా పెట్టెలు డిక్కీలో పెట్టితివా అని వంటమనిషిని అడగగా అవునయ్యా అన్నాడు వంటమనిషి. విక్రం కారు కదల్చాడు 12 గంటలకు office చేరుకున్నాడు. తన గదిలోకి చక్కగా వెళ్ళినాడు. files కట్టలు కట్టలుగా బల్లపైన అమర్చబడియున్నవి. office లో కూర్చొని కొంతసేపు ఈ అయిదు రోజులలో జరిగినవి జ్ఞాపకము చేసుకున్నాడు. పిమ్మట files తీసి వాటికి సంబంధించిన officer లను పిలిచి brief గా discuss చేసి dispose చేస్తున్నాడు యిప్పుడు సాయంకాలము 6 గంటలు అయినా యింకా పని తగ్గడంలేదు విక్రం అలసి పోయినాడు. అందువల్ల పని ఆపివేసి యింటికి వెళ్లినాడు. యింట్లో పనిచేసేవారంతా ఆహ్వానించినట్లు వంగి నమస్కారాలు చేసారు. విక్రం వారందరి నమస్కారాలకి మందహాస ముఖముతో అందుకొని drawing room లో కూర్చున్నాడు వంటమనిషి టీ తెచ్చినాడు. మెల్లగా టీ sip చేస్తూ పేపర్ చూస్తూ కూర్చున్నాడు. పిమ్మట 8 గంటలకు భోంచేసి బయటికి వెళ్ళినాడు. రాత్రి 10 గంటలకు యింటికి వచ్చి బట్టలు మార్చుకొని నిద్ర పోయినాడు.

విక్రం routine గా లేవడం కాలకృత్యాలు తీర్చుకోవడం టీ త్రాగడం office కి వెళ్ళడం ప్రొద్దంత పని చేయడం యింటికి రావడం మళ్ళీ టీ త్రాగటం పేపర్ చదవటం మళ్లీ నిద్రపోవడం. యివి అతని నిత్యకృత్యాలు. ఒక గానుగ యెద్దు రోజూ పని చేసినట్టే నాపని కూడా యింతే. యేమి బ్రతుకిది అనుకున్నాడు. కాని యెంత మంది విద్యాధికులు తనవంటి అదృష్టము రాలేదే అని వగచి పోతున్నారో విక్రంకు తెలియదు యిది మానవ ప్రకృతిలోని నైజం అనుకుంటాను. మానవుడు తాను కోరుకున్నదానికి చాలా కృషి చేస్తాడు అది లభించగానే కొన్నిరోజులకే routine లో పడి bore గా ఫీలు అవుతాడు అందుకే కొందరు variety is the spice of life అంటారు అంటే మానవునికి ఒకే తీరు పని routine లో పడక ప్రతి కొన్ని వారాలకు ఒక new challenge ఉంటే బాగుంటుందో యేమో. జిల్లా కలెక్టరయినంక గూడా యిదే routine కదా అనుకున్నాడు విక్రం. కాని తన పెళ్లయిన పిదప జీవితంలో మార్పొస్తుందనుకొన్నాడు. అది ఒక మేరకు నిజమే. కాని అది అయిన తర్వాత honey moon యెప్పటికి ఉండదు కదా. కనీసం కొన్ని సంవత్సరాలవరకైనా వుంటుంది కాబోలు అనుకున్నాడు విక్రం. తన తీరిక సమయాలలో యేకాంతంగా వున్నప్పుడు ప్రమద విషయమై కలలు కంటున్నాడు. ఆమెను తన మనోవీధిలో చిత్రించుకునే ప్రయత్నం చేసుకుంటున్నాడు. ఒక సారి చూడగానే ఆమె విషయమై తనలో యింత మార్పెందుకో అనుకున్నాడు. కాని ఆమె ప్రతిబింబమే యెప్పుడూ విక్రంకు కనిపిస్తుంది. ఒక ప్రమద పిక్చర్ ఉంటె యెంత బాగుండునో గదా అనుకున్నాడు. ఆమె చిత్రాన్ని చూచియైన కొంత కాలము యీ మనోబాధను తగ్గించవచ్చు అనుకున్నాడు. దీనికై యెలా చేయాలి అన్న ఆలోచన విక్రం తలలో నున్నది. దానికై ఆలోచించగా direct గా ఒక్క

ఉత్తరం ప్రమదకే వ్రాయాలని అనుకున్నాడు కాని engagement కూడా కానప్పుడు వాళ్లు దానిని అసభ్యంగా భావిస్తారో యేమో అనుకున్నాడు. తుదకు ఆలోచించి ఆలోచించి కృష్ణమోహన్‌కి ఒక్క ఉత్తరం వ్రాసినాడు. అందులో మీ కాబోయే వదినగారిని కలిసి ఆమెతో నేనడిగినట్టుగా అడిగి ఆమె photo ఒకటి మంచిది నాకు పంపించమని చెప్పు అని ఉత్తరం వ్రాసినాడు. కృష్ణమోహనుడు ఉత్తరం ముట్టగానే రఘునాధరావు యింటికి ప్రయాణమైనాడు. ఆయింట్లో అందరికి తెలుసు కృష్ణమోహనుడు యింటికి పోగానే శ్రీలక్ష్మి దగ్గరకు వెళ్ళి వదినెగారున్నారా అని అన్నాడు. ఆమె గదిలో వుందని గదిలోకి తీసుకువెళ్ళి తను మరలి వచ్చింది. హాలో కృష్ణా యెలాఉన్నావు అంది ప్రమద. కుర్చి చూపించి కూర్చో అన్నది. కొంచెంసేపాగి యేమైనా త్రాగుతావా తింటావా కృష్ణా అంది. లేదు అన్నాడు కృష్ణ మోహనుడు నీవు యీ ఇంటికి అతిధివి యేమైన తినకుండా యెవరు పోనిస్తారయ్యా అంది ప్రమద. కృష్ణమోహనుడు మెల్లగా నవ్వి వూరుకున్నాడు. పండ్లరసము తెప్పించనా అంటే సరే అన్నాడు. ప్రమద తన రూం నుండి వెడలి తల్లితో అమ్మా ఒక గ్లాస్ పండ్లరసము పంపియ్యవే కృష్ణమోహనునుకి అన్నది సరే అని శ్రీలక్ష్మమ్మ అయిదు నిమిషాలలో పండ్లరసాన్ని ప్రమద రూంలోకి పంపించింది. సేవకురాలు తలుపు కొట్టగా రా అంది ఆ పనిమినిషి పండ్ల రసము ప్రమద బల్లపై పెట్టి వెడలి పోయింది ప్రమద ఆ రసాన్ని కృష్ణమోహనునుకి ఇచ్చి త్రాగు అంది కృష్ణమోహనుడు రసాన్ని మెల్లగా త్రాగుకుంటు ప్రమదతో యేమేమో మాటాడాలని అనుకుంటున్నాడు. కాని ధైర్యం చాలదు అంతకు మించి సిగ్గు. ప్రమద యిది గ్రహించి కృష్ణ చెప్పవయ్యి వట్టిగానే వచ్చినావా లేక ఏదైనా పనివుండి వచ్చినావా అంది అప్పుడు కృష్ణమోహనుడు పనుండే వచ్చాను. ఏం పనయ్యా అంది మెల్లగా అన్నయ్య మీతో కలసి రమ్మన్నాడు మీరేమనుకోకబోతే మీదొకమంచి picture పంపించమన్నాడు. అని కృష్ణమోహన్ అన్నాడు యీ మాట వినగానే ప్రమద సంతోషానికి అంతు లేదు. యేది కృష్ణ మరి ఒక సారి చెప్పు సరిగా వినబడ లేదు అంది, కావాలని కృష్ణమోహనుడు కొంచెం కంఠస్వరాన్ని యెక్కువ చేసి మళ్ళీ మొదటిదాన్నే repeat చేసాడు ప్రమద నవ్వింది. ఆ నవ్వుతోనే తెలివిగల వాడివయ్యా కృష్ణా మీ అన్న నీతో అన్నాడా యిలా అని. యెట్లునమ్మాలి నేను? నీవే joke చేస్తుండవచ్చు అంది. లేదు వదినగారూ అని విక్రం వ్రాసిన ఉత్తరాన్ని ప్రమదకు అందించినాడు. ఆ ఉత్తరం చేతికివ్వగానే దాన్ని తన వక్షస్థలానికి అంటిపెట్టుకోవాలనుకుంది. కాని కృష్ణమోహనుడు ఉన్నాడు. కాబట్టి అట్లు చేయ సాహసించలేదు అది చదివి నిజమేనయ్యా నీవన్నది. అయితే యిప్పుడే యిస్తాను. అని తన photo album ను వెతకసాగింది. చివరకు ఆ album లో నుండి తీసి యిదిగో నా picture అని యిచ్చింది. ఆ పిక్చర్ ను చూచి తనలో యెంత అందగా వచ్చింది ఈ ఫోటో అనుకున్నాడు. మళ్ళీ తనను తాను సవరించుకొని పిక్చరేమిటి నిజానికి మా వదినగారు చాలా అందంగా ఉందని దానిని ఒక envelope లో పెట్టిస్తారా అన్నాడు, సరే అని ఓ envelope లో పెట్టి కృష్ణమోహన్ చేతికిచ్చింది. కృష్ణమోహన్ ఆ photo వుంచిన envolope

ను భద్రంగా జేబులో పెట్టుకొని యివాళనే ఉత్తరం వ్రాసి మీ picture పోస్టు చేస్తాను యేమైనా వ్రాయమంటారా అన్నాడు క్షేమంగా ఉన్నామని వ్రాయి అన్నది ప్రమద సరే నమస్కారము వదినమ్మా అని లేచినాడు. యెట్లా వచ్చినావు అంది. టాంగాలో అన్నాడు కృష్ణమోహన్. యెలా వెడుతున్నావు? టాంగాలో యేది టాంగా బయట వెదకాలి అన్నాడు. సరే మా కారులో వెళ్ళు అని driver ఈ బాబుని విడచిరా అంది. కృష్ణమోహన్ నమస్కరించి కారు ఎక్కినాడు. కారు వెడలి పోయింది. ప్రమద పట్టరాని సంతోషంలో మునిగి పోయింది. విక్రం photo ఎందుకు అడగకపోయాను అనుకుంది సరే మళ్ళీసారి తప్పకుండా అడిగి తెప్పింస్తాననుకుంది. తన గదిలో కూర్చొని విక్రం ప్రతిమనే తన మనోమందిరములో స్థాపించుకుంది. విక్రం వ్రాసిన ఉత్తరం యెద మీద పెట్టుకొని మంచంపై ఒరిగింది.

విక్రంకు, కృష్ణమోహనుడు వ్రాసిన ఉత్తరం ప్రమద photo ముట్టింది. ఆ ఫొటోని చూసి చాలా మురిసిపోయినాడు. అది తన study లో చిన్న frame లో వుంచి డెస్కు మీద ఉంచినాడు. ఆ desk దగ్గర పనిచేసినప్పుడు ఆ picture వైపే చూస్తూంటాడు. నా ఆరాధ్య దేవత అనుకుంటాడు. అప్పుడే ఒక ఉత్తరం నాన్నగారికి వ్రాసినాడు. తొందరలో ముహూర్తం నిశ్చయించి పెండ్లి పెట్టుకొమ్మని వ్రాసినాడు. ధర్మారావు విక్రం తొందరను శ్రీలతతో చెప్పగా ఆమె నవ్వింది. సరే అమ్మాయివాండ్లకి ఉత్తరం వ్రాయండి అన్నది. వుత్తరం వ్రాయటమేమిటి తనే స్వయంగా వెళ్ళి మాటాడతామని యింతలో మన బ్రాహ్మణుని పిలచి మంచి దినాలు యెప్పుడో తెలుసుకుంటామని శ్రీలతతో చెప్పినాడు. మరునాడు టీ త్రాగిన పిమ్మట బ్రాహ్మణుని ఇంటికి మనిషిని పంపి తాము రమ్మంటున్నట్లు మనిషితో కబురంపినాడు. సిద్ధాంతిగారు మనిషి వెంటనే వచ్చినారు. ధర్మారావు, సిద్ధాంతిగారు దయచేయండి అని కుర్చీని చూపించాడు. సిద్ధాంతిగారు కూర్చొని సెలవియ్యండి దొరవారు అన్నాడు. ధర్మారావు గారు యేమీలేదు సిద్ధాంతిగారూ మా అబ్బాయికి ఈ వేసవిలో పెండ్లి చేయాలనుకుంటున్నాము. ఏ ముహూర్తాలు బలంగా నున్నవో యేయే తేదీలలో నున్నవి తెల్పండి అని విన్నవించాడు. సిద్ధాంతిగారు మీరు పిలువగానే వచ్చేసినాను పంచాంగం తేలేదు కొంచెం మనిషిని మాయింటికి పంపి తెప్పిస్తారా ప్రభో అన్నాడు సిద్ధాంతిగారు సరేనని ధర్మారావు గారు ఒక మనిషిని తొందరగా సిద్ధాంతిగారింటికి పంపి కొంచెంసేపట్లో పంచాగాన్ని తెప్పించారు సిద్ధాంతిగారు ఆ పంచాంగాన్ని చూసి వేళ్లతో లెక్కబెట్టుకుంటు యేయే తేదీలు మంచివో చెప్పినాడు. ధర్మరావుగారు ఆ తేదీలన్నిటిని తన dairy లో వ్రాసుకొని బ్రాహ్మణుని సత్కరించి పంపినాడు. పిమ్మట రఘునాథరాయలకు వుత్తరం వ్రాసినాడు. తాను లగ్నం నిర్ణయించుటకై ఫలానా రోజున వస్తున్నానని యీయీ తేదీలు లగ్నాలకు నిర్ణయించుటకు మంచివని తన పురోహితుడు తెల్పినట్లు తాము కూడా బ్రహ్మణునితో సంప్రదించి విక్రం, మరి ప్రమద జన్మదినాలకు యే లగ్నం మంచిదో చూపించి వుంచితే తాను వచ్చిన పిమ్మట యే తేది అనుకూలంగా ఉంటుందో దానినే నిర్ణయిస్తామని వుత్తరం వ్రాసినాడు. ఉత్తరం సీల్ చేసి పోస్టులో వేయించాడు.

అది జనవరి నెల చలి యెక్కువగానే ఉంది రఘునాధరాయలు court నుండి వచ్చి మొఖం కడుక్కొని కూర్చున్నాడు. ఆనాడు వచ్చిన mail విప్పుతున్నారు అందులో ధర్మారావుగారు వ్రాసిన ఉత్తరం కూడా వుంది. ఉత్తరాన్ని తీసి చదువుకున్నాడు. పిమ్మట శ్రీలక్ష్మిని పిలిచినాడు ఆమె రాగానే యిద్దరూ కూర్చొని యీ విషయమై చర్చించుకున్నారు సరే రేపు మన బ్రాహ్మణుని పిలిపించి సంప్రదిద్దాము అనుకున్నారు. ప్రమదకు కూడా యీ విషయమై తెల్పినారు ఆమె యేమి అనలేదు. మీ యిష్టము అన్నట్టుగా వూరకుంది ప్రమద తన గదిలోకి పోయింది శ్రీలక్ష్మి భర్తతో మెల్లిగా తన photo విక్రంకు పంపించింది విక్రం తమ్మునితో అన్నది. రఘునాధరాయలు నవ్వుకున్నారు.

ఉత్తరం వ్రాసిన తేదీకి ధర్మారావు శ్రీలత రఘునాధరాయల యింటికి రానే వచ్చారు. వీరు వస్తారని ఆనాడు రఘునాధరాయలు సెలవు పెట్టి యింట్లోనే ఉండి పోయినాడు. ధర్మారావు వచ్చువరకు అంతా సిద్దంగా చేసి వుంచినారు. బ్రాహ్మణుడు కూడా సిద్దంగానే వున్నాడు. యిద్దరి జన్మనామాలు చూచి అన్ని రోజుల లగ్నాలకన్న ఒక లగ్నం చాలా బలంగా ఉందని నిర్ణయించారు రఘునాధరాయలు అది ఆదివారం నాడు లేనందున ఇంకో లగ్నం ఆదివారం ఉండునట్లుగా చూడమన్నాడు. సరే మహాప్రభో అని వెతికి వెతికి ఆదివారం నాడు ఉన్న లగ్నాన్నే ఇచ్చినారు. ఆ తేదీని ధర్మారావుకూడా ఒప్పుకున్నాడు యిప్పుడు లగ్నం తేదీ time నిశ్చయమయ్యింది. ఆచారం ప్రకారం అన్ని మాటాడుకున్నారు. పత్రికలు print చేసుకోవచ్చునా మేము అని అన్నాడు ధర్మారావుగారు. యింక సమయముందికదా అన్నారు రఘునాధరాయలు ఆడపిల్లవాండ్రము మాకు time కావలెగాని మీకేం చింత బావగారు అన్నారు రఘునాధరాయలు. మాకు కూడా మొదటి పెండ్లి యింట్లో మేము కూడా మా సంతోషానికై యేదో ఒకటి చేయాలి కదా అన్నాడు ధర్మారావు కూడా. పిమ్మట ధర్మారావుగారు శ్రీలత భోజనాలు చేసి సెలవు తీసుకొని తమ city యింటికి చేరినారు. కృష్ణమోహనితో యిప్పుడు విక్రం రూం ఖాళీగానే ఉంది. తాను శ్రీలత ఆ గదిలో నిద్రించి అచటనుండే ఒక ఉత్తరం పెళ్లి నిశ్చయమైంది అని, అప్పుడు ఒక నెల రోజులు సెలవు తీసుకొని పెండ్లికి నాలుగు రోజులకు ముందే సిటీలో వుండమని వ్రాసి mail చేసినాడు. పిమ్మట సిటీలో కొంచెం purchasing చేసేది ఉంటే అవి పూర్తి చేసుకొని శ్రీలతతో వూరికి వెళ్ళి పోయినాడు ధర్మారావు.

విక్రంకు ధర్మారావు సిటీ నుండి రాసిన ఉత్తరం ముట్టినది. office నుండి రాగానే. విక్రం తొందర తొందరగా ఉత్తరం విప్పి చూశాడు. అది తండ్రిగారి ఉత్తరం. లగ్నం నిశ్చయించినామని. అది యింకా మూడు నెలలు వుందని. ఒక నెలరోజులు సెలవు తీసుకొని నాలుగు రోజులకు మునుపే రావలయునని వ్రాసినాడు. సరే అని జవాబు వ్రాసి బల్లపై నున్న photo చూస్తూ కూర్చున్నాడు విక్రం. యీ photo చూస్తేనే యింత ఆనందంగా వుందే నామనసు యిక ప్రమదను చూస్తే యెంత సంతోషంగా వుంటానో అనుకున్నాడు. పిమ్మట పేపరు పట్టుకొని drawing room లో కూర్చున్నాడు అయినా ప్రమద రూపమే తనను

ఆకర్షిస్తున్నది. యెట్లో అట్ల paper ముగించి sofa పై ఆలోచిస్తూ కూర్చున్నాడు వంటవాడు దగ్గరికి వచ్చి అయ్యా వంట చేసినాను. భోంచేయండి అన్నాడు. వంటమనిషి చెప్పేడు విని గాని యీ లోకంలోకి రాలేదు విక్రమసింహుడు సరే అని టేబుల్ వద్ద కుర్చీలో కూర్చున్నాడు. వంట మనిషి వడ్డించినాడు. విక్రంకు ఆకలి లేదు. అయినా కొంచెం తిన్నాడు పిమ్మట చేతులు కడుగుకున్నాడు. ఏ మనిషి కాని నిజమైన ప్రేమలో పడితే ఆకలి నిద్రలు సన్నగిల్లుతావంటారు. యిప్పుడే అదే జరిగినట్టుంది విక్రంకు మళ్లీ సోఫా పైన కూర్చొని యేదో ఆలోచిస్తున్నాడు. యింతలో ప్యూన్ యేదో visiting card తీసుకొచ్చినాడు ఆ పేరు అది చూసి ఎక్కడో విన్న పేరుగా తోచింది. తక్షణమే లోనికి ఆహ్వానించమని ప్యూన్‌కు చెప్పినాడు రాగానే లేచి కరచాలనం చేసి కూర్చొండి అని కుర్చీ చూపించాడు కొంతసేపైన తరువాత క్షమించండి నేను మిమ్ములను గుర్తించలేదు అన్నాడు విక్రం. నాపేరు నరోత్తమరాయలు నేను ప్రమద మేనమామను శ్రీలక్ష్మి మా అక్కగారు. రఘునాథరాయలు మా బావగారు అన్నాడు ఓ అలాగా నేను మొదటిసారి మిమ్ములను కలుసుకొంటున్నాను అంటూ వంటమనిషితో టీ చేయమని చెప్పుతూ భోజనాలైనవా అన్నాడు విక్రం లేదండి అన్నాడు నరోత్తమరాయలు. అయితే నేను భోంచేశాను మీరు భోంచేయండి అని వంటవానితో త్వరితముగా యేమైనా మంచి భోజనము సిద్ధం చేయుమని డబ్బు యిచ్చినాడు. నరోత్తమరాయలు నాకు simple భోజనము యిష్టము మీకు శ్రమ అనవసరము యేదో వున్న దానినే భోంచేస్తాను అన్నాడు లేదు మీరు మాయింటికి మొదటిసారి దయచేసినారు. ఒక 30 నిమిషాలు ఆగండి అన్ని సిద్ధం అయిపోతాయి. అని లోనికి వెళ్ళి scotch bottle తెచ్చి సోడా ఉంటే పట్రా అన్నాడు పనిమనిషితో. సరే అయ్యా అంటు సోడా సీసాలు తెచ్చిపెట్టినాడు. పనిమనిషితో గ్లాసులు కూడా తెమ్మన్నాడు. గ్లాసులు రాగానే యిద్దరూ ఒకే సోఫామీద కూర్చున్నారు. కాఫీ టేబుల్ పైనున్న గ్లాసులలో స్కాచ్ సోడా కలిపి నరోత్తమరాయలకిచ్చాడు విక్రం. యెందుకింత శ్రమ పడుతున్నారు నాకొరకు అన్నాడు నరోత్తమరాయలు. యిందులో శ్రమ యేమున్నది. యిదినాకు సంతోషము ప్రమద మేనమామ యెప్పుడూ మాయింటికి వస్తారా. చాలా తక్కువ, మొదటిసారే నేను సత్కరించకపోతే ప్రమదకు తెలిస్తే నన్ను బ్రతకనిస్తుందా చిన్నాన్నగారు అన్నాడు విక్రం. యిద్దరు నవ్వుకున్నారు. మరి మీరో అన్నాడు నరోత్తమరాయలు. నేను యిపుడే భోంచేసి కూర్చున్నాను. లేకపోయినచో తప్పకుండ మీకు కంపెని యిచ్చేవాడిని అన్నాడు విక్రం యీ విధంగా యిద్దరు 40 నిమిషాల పాటు మాట్లాడుకుంటూ సరదాగా గడిపినారు. యింతలో వంటవాడు అయ్యా భోజనం సిద్ధంగా ఉంది లేవండి అన్నాడు. యిద్దరూ లేచి టేబుల్ వద్ద కూర్చున్నారు. వంటవాడు వడ్డిస్తుంటే యెలా వుంది వంట అన్నాడు విక్రం. బాగా వుంది అన్నాడు నరోత్తమరాయలు అయితే యింకా కొంచెం వేసుకోండి అని తనే స్వయంగా పళ్ళెంలో వడ్డించాడు. చాలు నాయన అరిగించుకునేది కష్టం అని అన్నాడు నరోత్తమరాయుడు. భోజనం చేసిన పిమ్మట యిద్దరూ మళ్లీ సోఫాలో

కూర్చున్నారు. నరోత్తమరాయలు తాంబూలం వేసుకున్నాడు. యేదేదో మాటాడుకున్నారు. పిమ్మట విక్రం! యీ వూరికి మొదటిసారి రావటంలేదు బాబు నేను అప్పుడప్పుడు వస్తుంటాను court పనిమీద అన్నాడు. అలాగా అని మరి మీకు బిస్తర్ వేసి ఉంచాను. మీకు నిద్ర వచ్చినప్పుడు వెళ్ళి నిద్రించండి నేను ఆలస్యంగా నిద్ర పోతాను అన్నాడు విక్రం. పరవాలేదు నాయనా అని మాటాడుతూ కూర్చొని కొంచెం సేపటి తర్వాత పోయి నిద్రించాడు. విక్రం కూడా తన గదిలో యేదో పుస్తకం చదువుతూ కూర్చున్నాడు నిద్రరాగానే నిద్రాదేవి ఒడిలో హాయిగా ఒరిగి పోయినాడు.

తెల్లవారి లేచి, నరోత్తమురాయుని లేపినాడు కాలకృత్యాలు తీర్చుకొని breakfast table మీద కూర్చున్నారిద్దరు. Breakfast ముగించి టీ తీసుకొని సోఫా పై కూర్చున్నారు. విక్రం, యేదైనా పని మీద వచ్చినారా లేక నన్ను చూచి పోవుటకేనా? లేదు కొంచెం యిచ్చటి కోర్టులో పని వుండి వచ్చినాను యీనాడు ఆ పని ముగించుకొని అటునుండే వూరికి వెడతాను అన్నాడు నేనేమైనా చేయగలిగితే చెప్పండి అన్నాడు విక్రం. ఆ, లేదు బాబు యివన్నీ routine పనులు మీ **జోక్యం** **అ**వసరంలేదు అన్నాడు. అయితే మరి నేను సెలవు తీసుకుంటాను అని **ఆఫీస్**కు office జీప్‌లో విక్రం వెడలిపోయినాడు. కొంచం సేపటికి నరోత్తమరాయలు **తన** **కారులో** వెడలి పోయినారు

సాయంకాలంకాగానే విక్రం official residence కు వచ్చినాడు. రాగానే పనిమనిషితో ఆ కొత్త అయ్యగారు యెపుడు వెడలినారు అని అడిగినాడు. మీరు వెళ్లిన కొంతసేపటికి ఆ అయ్యగారు కూడా వెడలినారయ్యా అన్నాడు. వంటమనిషితో కొంచెం టీ చేయమని చెప్పి లోనికెళ్లి మొఖం కడుకొని తల దువ్వుకున్నాడు. యింతలో టీ ready చేసి బల్లపై పెట్టినాడు వంటమనిషి. paper చూస్తూ టీ త్రాగినాడు విక్రం. యేమైనా ఉత్తరములు వచ్చినాయా అని అడిగినాడు. రెండు మూడు ఆనాడు వచ్చిన ఉత్తరాలను తెచ్చి ముందుంచినాడు పనిమనిషి. ఒక ఉత్తరం పైన రఘునాథరాయలు యింటి అడ్రసు వ్రాసివుంది. విప్పి చదివినాడు. అది యెవరిదో కాదు తన జీవితభాగస్వామి కాబోతున్న ప్రమదాదేవిది. ఉత్తరం మొదలు ప్రియమైన నా స్వామికి ప్రమద నమస్కరించి వ్రాయునది. నేను చాల కఠిన సమస్యగా పరిణమించి యీ వుత్తరాన్ని వ్రాయుటకు సాహసించినందుకు క్షమించగలరు. రెండు వారాలనుండి వ్రాయవలెనా లేదా అని నాలో నాకు ఘర్షణ జరిగింది. తుదకు వ్రాయి యేమి కాదు అని నా అంతరాత్మ నాకు తెలిపినందులకు వ్రాస్తున్నాను. మీరు వేరే విధంగా భావించరని అమ్మ నాన్నలకు నేను వ్రాసినట్లు తెలియకూడదని promise చేస్తూ యీ ఉత్తరానికి జవాబు వ్రాయండి. నాకు మీ photo ఒకటి కావలె నా photo నైతే తెప్పించుకున్నారు. మీది మాత్రం పంపలేదు. యెన్నో రోజులు మీరు పంపుతారని యెదురు చూచి యిప్పుడు వ్రాస్తున్నాను. యీ ఉత్తరం ముట్టగానే నాకు మీ photo పంపిస్తారని ఆశిస్తున్నాను. యిట్లు మీ ప్రేమకు నోచుకొన్న ప్రమద అని వుంది ఆ వుత్తరం పూర్తిచేయగానే మరో ఉత్తరం అప్పుడే వ్రాసి తన రెండు pictures ను అందులో పెట్టి స్వయముగా పోస్టు చేసినాడు

విక్రం. ఆ మొదటి ఉత్తరాన్ని కడు జాగత్తగా ప్రమద photo ప్రక్కనే వుంచినాడు. ప్రమదను చూడాలని అనిపించినప్పుడల్లా ప్రమద ఫోటో ను చూస్తూ ఆ ఉత్తరం చదువుకుంటాడు విక్రం. త్వరలోనే యీ వేదన అంతరిస్తుందని మనసంత బిగబట్టి ఉంచుకున్నాడు ఇచ్చట విక్రమసింహుడు అక్కడ ప్రమదాకుమారి.

ప్రమద మొదటి ఉత్తరంతో యిప్పుడు యిద్దరి మధ్య ఉత్తరాలు వ్రాయుట మొదలయ్యిందన్నమాట. యీ ఉత్తరాలు చాలా careful గా ఆలోచించి వ్రాస్తున్నారు యిద్దరూ. యెందుకంటే అనాటి ఆచారాలు వేరు. పెండ్లికాని యువతి యువకులలో letters చాలా తక్కువ. యీనాటి వలె అనాటి సంఘము వారికంత స్వేచ్ఛ యివ్వలేదు. ఒకరి నొకరు పెండ్లి అయ్యేవరకు కలుసుకునే వారుకారు ఉత్తరాలమాట అటుంచి. అందువల్ల వీరు బహుశః మొదట కాబోయే దంపతులేమో ఉత్తరాలు వ్రాసుకున్నందుకు యీ అనాటి తెలుగుదేశంలో విక్రం వ్రాయవచ్చు అనుకుంట. యెందుకంటే యిప్పటికి మన సమాజము మొగపిల్లలకిచ్చినంత స్వేచ్ఛ స్వాతంత్రము ఆడపిల్లలకు యింక పూర్తిగా యివ్వలేదు. యీ దేశము యీ విషయమై పాశ్చాత్య దేశాల పిల్లలకిచ్చునంత స్వేచ్ఛ పెండ్లిగాని ఆడ పిల్లల కివ్వదన్నమాట. కాని college లో వాళ్లు ఫ్రీ గా తిరుగుతున్నారు. కాని ఆడపిల్లల parents దీన్ని యిష్టపడరు. అది ఒక విధంగా మంచిదే. మగ పిల్లలు యేమి చేసిన సరిపోతుంది. కాని ఆడపిల్లకు అలా కాదు గదా. నే నంటున్నది మీకర్థం అయ్యిందనుకుంట. ప్రమద ఉత్తరం వ్రాసిదంటే కొన్ని వారాలలో తనకు కాబోయే భర్త విక్రం. అంతే కాకుండా విక్రమే మొదట ఉత్తరం వ్రాసినాడు ప్రమదకు. ఒక ప్రమద picture కావాలని. ఆమె తక్షణమే విక్రం కోరిక తీర్చింది. యిక విక్రం ఫోటో కూడా తనకు కావలసినప్పుడు తప్పేముంది అనుకొని సాహసించి ఉత్తరం వ్రాసి విక్రం ఫోటో తెప్పించుకుంది. యిద్దరు పరస్పరం ప్రేమించుకుంటున్నారు. పెండ్లి చేసుకోబోతున్నారు. అయినా అనాటి సామాజిక ప్రమాణాల ప్రకారము ప్రమద చేసినపని సాహసముతో కూడుకున్న పని అనియే చెప్పక తప్పదు.

చూస్తుండగానే రోజులు దొరలి పోతున్నాయి. రోజులు గడుస్తున్నకొద్ది వివాహ దినము సమీపిస్తున్నది. దీనితో పాటు విక్రం తొందరపాటు కూడా ఎక్కువౌతోంది. యెప్పుడు తన ప్రేమ దేవతను తన కౌగిటిలోకి చేర్చుకోవాలె. యెప్పుడు ఆమెతో మనసారా మాటాడాలి? యెప్పుడు ఆమె అందాన్ని మనసారగా గ్రోలాలి. యెప్పుడు ఆమెను తనతో తోడ్కొనిపోవాలి అని కలలు కంటు దినాలు గడుపుతున్నాడు విక్రం. యిక 20 రోజులు పెండ్లి అనగానే సెలవులకై దరఖాస్తు పెట్టుకున్నాడు. పై అధికారుల సమ్మతికై యెదురు చూస్తూ కూర్చున్నాడు. తనపై అధికారులు సమ్మతము రానే వచ్చింది. యిక కొద్ది రోజులలో నగరానికి వెళ్ళి పోవాలి. అని బట్టలు సర్దుకుంటున్నాడు. కారు సర్వీసింగుకిచ్చినాడు. బట్టలు యిస్త్రీ చాకలివానికి పంపినాడు. అన్ని సిద్ధంగానే ఉన్నాయి. యిక కావలసింది పట్టణానికి పోయే రోజు, అది కూడా రానే వచ్చింది. యిప్పుడు పెళ్లి నాలుగే నాలుగు రోజులు. అనాడు ఆఫీసులో charge తీసుకున్నాడు వేరే officer. విక్రంకు యిప్పుడు పూర్తి స్వేచ్ఛ.

office గురించి ఆలోచన వుండదు నెలదినాలు. పిమ్మటయిదే position కి వస్తాడో లేదా వేరే చోటికి transferరో తెలియదు. యిప్పుడు అవన్నీ ఆలోచించి లాభం లేదనుకున్నాడు. అన్ని సామానులను కారు డిక్కీ లో సర్దించినాడు. తన యింటిలో పనిచేస్తున్న staff కంత యినాములిచ్చి కారు యెక్కినాడు. అందరూ సలాము కొట్టి సాగనంపినారు. సరే అని car speed అందుకున్నది. కొంచెంసేపట్లోనే యిల్లు దూరం అయిపోయింది. రోడ్డు మీద కారు వేగంగా పోతుంది. తను మనస్సంత కారుపైననే కేంద్రీకరించి నడుపుతున్నాడు ప్రయాణం బాగా సాగుతుంది. యీనాటివలె ఆనాడు తార్ రోడ్డులు చాలా తక్కువ. రోడ్లపై వాహనాలు అంతకంటే తక్కువ. బండ్లు, పశువులు యీనాటివలె ఆనాడు కూడా చాలాగా వుండెను. పల్లెలు త్రోవలో అవన్ని దాటుకుంటూ 5 గంటలు drive చేసి హైద్రాబాదు నగరానికి చేరుకున్నాడు. తన యింటి ముందు కారు ఆగింది. కృష్ణమోహనుడు తన గది కిటికిలోనుంచి చూచి వంటవానితో అన్నగారు వచ్చినారని తెల్పి బయటికి వెళ్లినాడు. విక్రం కృష్ణ మోహనుని చూచి కౌగిలించుకొన్నాడు. యింతలో వంటమనిషి బాగానే కొంత సామాను వంటమనిషి కిచ్చి తక్కింది యిద్దరు పట్టుకొని లోనికి ప్రవేశించినారు. 5 గంటలు driving తో అలసిపోయినాడు విక్రం. తన రూం అంతకు మొదలే సర్ది క్లీన్ గా చేసిపెట్టినారు. కృష్ణమోహనుడు టీ చేయించి అన్నగారి గదిలోకి తెచ్చినాడు. విక్రం మెల్లగా టీ సిప్ చేస్తూ అన్ని విషయములు తెలుసుకున్నాడు. ప్రత్యేకంగా వెంకటకృష్ణుడెలా ఉన్నాడని అడిగినాడు. యిప్పుడు medicine అయిపోయింది. intermship కూడా అయిపోయింది practice కి ప్రయత్నిస్తున్నాడు అన్నాడు కృష్ణమోహనుడు. వుత్తరాలు రాక చాలాదినాలైనది వెంకటకృష్ణుని వద్దనుండి అన్నాడు విక్రం. యింకేమి సమాచారాలన్నాడు విక్రం. యేముంది పావని పెండ్లి నిశ్చయమైంది అన్నాడు కృష్ణమోహనుడు. యెవరితో అన్నాడు విక్రం. యెవరో తెలియదు కాని ప్రభుత్వ ఉద్యోగి అట అన్నాడు కృష్ణమోహనుడు. అలానా అని టీ కప్పు డెస్క్ మీద వుంచినాడు. సరే కృష్ణ రేపు వూరికి బయలు దేరవలెను కదా మరి కాలేజీ యేమి చేస్తావు అన్నాడు. కాలేజ్‌కు సెలవులు కదా అందుకే యేమీ చేసేదిలేదు. taking it easy అన్నాడు కృష్ణమోహన్. అవును కదూ కాలేజీని విడచి చాలా కాలంగా అనిపిస్తున్న అప్పుడే సెలవు లెప్పుడనేది కూడా మరచినాను కృష్ణా అన్నాడు నెత్తిపై నిమురుతూ. కృష్ణా నేను స్నానం చేసి పడుకుంటాను. I am tired కృష్ణా అన్నాడు. బాతురూంకు వెళ్ళి హాయిగా స్నానం చేసి మంచంపై ఒరిగినాడు విక్రం. కృష్ణమోహన్ మాత్రం తన గదిలో మంచం పై ఒరిగి యేవో చదువుచున్నాడు.

భగవంతుడు రాత్రిని సృష్టించాడు అంటే దానికి కారణము వుందనుకుంటా. రాత్రిళ్లు సకలమానవ కోటి నిద్రించి పూర్తిగా తనకున్న tensions, problems మరచి పోతారు. యీ నిద్రలో తాను జీవితంలో జయించలేనన్నిటిని కలలోనైనా జయిస్తారు. పూర్తిగా వాళ్ళ కష్టాలన్నీ మరచిపోతారు. ఈ అలసిపోయిన భౌతిక శరీరానికి పూర్తిగా రెస్ట్ దొరుకుతుంది. ప్రొద్దున లేవగానే మళ్ళీ ఆనాడు చేసే పనికి సిద్ధంగా వుంటాడు కాని కొన్ని ప్రపంచ ప్రదేశాలలో 6 నెలలు దినము. ఆరు నెలలు రాత్రి ఉన్నప్పుడు ఆ ఆరు నెలల దినాలలో రాత్రిని వారు సృష్టించుకుంటారు.

అంటే తలుపులు కిటికీలన్నిటిని బిగించి రాత్రిని యింటిలో సృష్టించుకుంటారు. యిక 6 నెలల చీకటి ఉన్నప్పుడు పనిచేసే కార్మిక సంస్థలలో విద్యుద్దీపాలతో దినములను సృష్టించి 8 గంటలు పనిచేస్తారు. తక్కిన 8 గంటలు నిద్రిస్తారు. అంటే వాళ్లు 12 గంటలు రాత్రి 12 గంటలు దినాన్ని సృష్టించుకుంటారు. యిది నార్త్ పోలులో జీవించే వారు చేసేపని. అచ్చట చలి చాలా విపరీతంగా ఉంటుంది కాని మనదేశంలో చలి చాలా తక్కువ. North pole తో compare చేస్తే అసలు నిజానికి మనదేశంలో చలి లేదనియే చెప్పాలి. యెంత చలి వేసే రోజైనా ఉదయం, మరి సాయంకాలం ఓ స్వెట్టరుతో జీవించవచ్చు. కాని చాలా మందికి అది కూడా ఉండదు. కొంచెం సూర్యుడు రాగానే యీ చలి అంతా అదృశ్యమై పోతుంది. కాని చలికాలంలో వర్షాలు వుంటే బహుశః బీదలకు ఒక సమస్య కావచ్చు. కాని చలికాలంలో వర్షాలు చాలా తక్కువగా ఉంటాయి. కాశ్మీరు అటువంటి చలి ప్రదేశాలలో వారి దుస్తులు ఆ చలికి తగ్గట్టుగా ఉంటాయి. కాని దక్షిణ హిందూస్తానములో ఒంటిపైన చొక్కా లేని ప్రజలు కోట్లు. వారికి తీవ్రమైన చలి ఒక సమస్యగా మారవచ్చు. యేది యెటులైనా మానవుడు తన వేషభాషలను తమ పరిస్థితులకు అనుకూలంగా వాడుకుంటాడు. ఆఫ్రికా ఖండంలో వేడి చాలా యెక్కువ కాబట్టి వాళ్ల శరీరాలపై బట్టలు చాలా తక్కువ. యీనాడు మన నవ నాగరికత ప్రతి దేశీయులను ఒకే దుస్తులకు మార్చుచున్నది. మన దేశంలోనే కాని ఆఫ్రికా ఖండంలో నే కాని చాలా మంది తమకు తాము civilized అనుకునే వారు సూట్లు వేస్తారు. అవి air condition రూంలో వుండి పనిచేయుటకు పనికి వస్తాయి కాని బయట నడచినప్పుడు అవి శరీరాన్ని కాల్చివేస్తాయి. అందుకనే మనదేశంలో కూడా కొంతమంది గొప్ప ఉద్యోగులు మరి గొప్ప వ్యాపారస్తులు సర్వదా suits వేస్తుంటారు. వీరు యెప్పుడూ బయటకు నడవరు, A.C. గదులలో పనిచేస్తారు. వీరి యిండ్లలో కూడా A.C. వుండక తప్పదు.

రాత్రంత హాయిగా పడుకొని ఉదయం 9 గంటలకు లేచినాడు విక్రమసింహుడు. లేచి పక్కపై అటుయిటు కొంచెంసేపు దొర్లినాడు. పిమ్మట టీ తీసుక రమ్మన్నాడు. యింతలో brush చేసి మొఖం కడుక్కొని డైనింగ్ బల్లపైన కూర్చున్నాడు. అంతకు ముందే కృష్ణమోహనుడు టీ పూర్తి చేసి వార్తాపత్రిక చూస్తూ కూర్చున్నాడు. విక్రం వచ్చి కూర్చున్న పిమ్మట టీ తో వంట వాడు ప్రత్యక్షమై టీ యిచ్చినాడు విక్రంకు విక్రం leisure గా టీ sip చేస్తూ ఆలోచిస్తున్నాడు. మధ్యలో ఆగి కృష్ణమోహన్ తో తమ్ముడూ అన్ని సర్ది కారులో పెట్టినావా అన్నాడు. తనకు సామానేమీ లేదని తన సామాన్నే సర్దుతానన్నాడు కృష్ణమోహనుడు. నాకు కూడా ఏమీయు లేదని నిన్న తెచ్చిన సామాన్ని యిచ్చుటనే వదుల్తాను మళ్ళీ రెండు రోజులలో వస్తాముకదా అన్నాడు విక్రం సరే బట్టలు వేసుకొని బయల్దేరదాము అన్నాడు కృష్ణమోహనుడు. అనుకున్నట్లు అన్నయ్యా యింకా నాలుగు invitation కార్డ్సు పంచేదుంది. మీ కారు తీసుకవెళ్లనా అన్నాడు కృష్ణమోహనుడు. యిద్దరము వెడదాము సరేనా అన్నాడు. వంటమనిషిని కూడా సిద్ధం కమ్మన్నాడు విక్రం. బట్టలు వేసికొని బయలు దేరినారు, విక్రమసింహుడు, కృష్ణమోహనుడు. వంట మనిషి వెనుక సీటులో కూర్చోగా విక్రం

మరియు కృష్ణమోహనుడు ఆ నాలుగు ఇండ్లకు వెడలి యీా marriage invitation cards పెండ్లి పత్రికలను యిచ్చి తప్పకుండా రావలె అని చెప్పి రోడ్డు మీద వూరి వైపుకు కారును త్రిప్పినారు. 3 గంటలలో వూరికి చేరుకున్నారు.

యింటిలో అంతా పెండ్లి సందడి అప్పుడే మొదలయ్యింది. యింటి నిండ చుట్టాలున్నారు. కొంతమందిని విక్రం గుర్తు పట్టలేదు కాని చాలా మందిని గుర్తించాడు. ముఖ్యంగా విక్రం అమ్మమ్మ రుక్మిణిగారు (రుక్మమ్మ) విక్రం ను కౌగలించుకొంది యెంత యెదిగినావు నాయనా అని ముద్దడికుంది. మేనమామ భరతభూషణ్ విక్రంతో కలిసినాడు బాగున్నావా బాబు అని పరామర్శించాడు. యింక యెందరో వున్నారు అందరితో కలసినాడు విక్రం. యింట్లో తనకై ఒక ప్రత్యేకమైన గది యేర్పాటుచేయబడ్డది. కృష్ణమోహన్‌కు తనకు రెండు మంచాలు అమర్చబడి ఉన్నాయి. విక్రం తల్లితో అమ్మా నేను తమ్ముడు యెక్కడుండాలెనమ్మా అన్నాడు. మీకు వేరే గది ఉంది బాబు అని తానే స్వయంగా యిద్దరు కొడుకులను గదిలోకి తీసుకెళ్లింది. యిది బాబు మీ రూం అన్నది గదిలో తన పెట్టె బెడ్డింగు విడిచి హాలులోకి యిద్దరూ ప్రవేశించారు. చాలా మంది యేదో ప్రాపంచిక వ్యవహారాలు మాటాడుకుంటున్నారు కొందరు రాజకీయాలు మాటాడుతున్నారు. మరి కొందరు తమ సంసార, సాంఘిక వ్యవహారాలు మాటాడుతున్నారు. యెల్లుండి పెళ్ళి, అందరు రఘునాధరాయల యింటికి తరలి పోవాలె. ధర్మారావు తన బంధువులకు స్నేహితులకు శుభలేఖలు వారం రోజులముందుగానే ముట్టునట్టు పంపించారు. చాలామంది పెండ్లికి direct గా పట్టణం వచ్చేస్తున్నారు కొందరు తమ స్వంత కార్లలో మరి కొంతమంది బస్సులలో రైళ్లలో ఆదివారం పెండ్లికై వస్తున్నారు. విక్రంను పెండ్లిపిల్లవాన్ని చేయుటకు అన్నీ సిద్ధం చేస్తున్నారు రేపు ఆ పని కాగానే అందరూ కార్లలో మరి rent చేసిన priavate బస్సులో పట్టణం వెళ్లిపోతున్నారు విక్రం యివన్నీ చూస్తూ మన హిందువుల పెళ్ళిళ్లు యింత సావధానంగా, తీరికగా కొన్ని రోజులు జరుపుతారు. యిది మంచిదా అన్న ప్రశ్న కాదు. ఇది మన ఆచారములో ఒక భాగంగా చేరిపోయింది. యీా సంప్రదాయము బహుశః మారదేమో. పాశ్చాత్యులు arranged marriages చేయరు. వాండ్లంత love marriages చేసుకుంటారు. అయినా కొన్ని కొన్ని సమయాలలో కొన్ని గంటలకే love మారి divorce తీసుకుంటారు. కాని చాలా మంది జీవితాంతం యీా వివాహబంధంలోనే ఉంటారు. కాని మన వివాహబంధము వారిద్దరి మృత్యువుతోనే అంతమవుతుంది. మన సంస్కృతిలో love marraiges చాలా తక్కువగా వుంటాయి కాని కొంతమంది మన దాంపత్య జీవితములో ప్రేమ లేదనుట పొరపాటు. ఒకరి నొకరు చూచుకుంటారు పెండ్లికి మొదలు. తలిదండ్రులు, అన్నతమ్ములు, అక్కచెల్లెళ్ళు యీా వివాహబంధనాన్ని కన్న మొదలే దంపతుల చదువు సంధ్యలు, వారి ఆర్థిక పరస్థితి వారి character విషయమై యెంతో ప్రయత్నాలు చేసి తెలుసుకున్న తర్వాతనే పిల్ల పిల్లవాడు కలసుకునేటట్టు చూస్తారు. అందువల్ల మన వివాహాలు cold గా start అయ్యి hot గా end అవుతాయి. అని కొంతమంది అనుకుంటారు. కాని పాశ్చాత్య వివాహాలు hot గా మొదలయ్యి cold గా divorce లోకి దిగుతాయి యిది కొంతవరకు వాస్తవమే. యువతీయువకులు

పాశ్చాత్య దేశాలలో ఒకరితో ఒకరి కలిసి తిరుగుతారు. వాళ్లు యెవరు, వారి తలితండ్రులెవరు, వారి పుట్టుపూర్వోత్తరాలేమిటి అని యెవరు తెలుసుకోరు. కేవలం ప్రేమగల యువతీ యువకులు చాలా వరకు తల్లి తండ్రుల అనుమతి లేకున్న పెండ్లి చేసుకుంటారు. అందువల్ల పిమ్మట యీ వివాహాలు sucessful కాక పోతే వారికి వారే బాధ్యులు. మంచైనా చెడైనా వారే అనుభవించాలి కాని మన సంప్రదాయంలో అందరు సామాన్యంగ ఆ వివాహం success కు పునాది గట్టిగా వేసే ప్రయత్నం చేస్తారు అని ఆలోచిస్తూ కూర్చున్నాడు. అంతలో యెవరో ఒక పెద్ద మనిషి విక్రం వద్దకొచ్చి కూర్చున్నాడు. విక్రం కొంచెం జరిగి అతనికి చోటిచ్చాడు. ఆ పెద్దమనిషి విక్రంతో యెక్కడ ఉద్యోగం చేస్తున్నారు అని ఉద్యోగం విషయమై యెన్నియో అడుగుతున్నాడు. విక్రంకు అతనడిగే ప్రశ్నలు యిష్టం కాలేదు. యెట్లా ఈ విపత్తులో నుంచి బయట పడాలా అని చూస్తున్నాడు. యింతలో ఒక maid వచ్చి బాబుగారు మిమ్ములను అమ్మగారు రమ్మంటున్నారు అంది విక్రంతో. విక్రం కు అబ్బ మోక్షం లభించింది అని excuse me అని లేచిపోయినాడు. శ్రీలత రేపటి కార్యక్రమాన్నంత తెల్పి యెప్పుడు లేవవలెనో యేమి చేయువలెనో అనేక విషయాలు చెప్పి పోయి విశ్రాంతి తీసుకో అని అంది. విక్రం సంతోషంతో తనకు అమర్చిన రూంలోకి పోయి విశ్రమించాడు.

రాత్రి భోజనాలైనాక అందరూ వారికి యేర్పాటు చేసిన చోట్లలో పడుకున్నారు. ఉదయం లేచి అందరూ ధర్మారావు వ్యవసాయ బావుల కడకు వెళ్లి కాలకృత్యాలు తీసుకొని యింటికి వచ్చి ఫలహారము చేసి కూర్చున్నారు. బాజాబజంత్రీలవారు చప్పుడు చేస్తున్నారు. విక్రం స్నానం చేసి కొత్తబట్టలు కట్టుకొని పీటల మీద కూర్చున్నాడు. యితని తోడి పెండ్లికొడుకుగా వీరి బంధువులలోని ఒక చిన్న అబ్బాయిని యితనితో కూర్చుండ బెట్టినారు. పిమ్మట వారి సంప్రదాయ ప్రకారము పెండ్లి కొడుకును చేసినారు. యిప్పుడు విక్రం మెడలో ఒక చంద్రహారం వుంది. విక్రం యిది silly గా వుందనుకున్నాడు గాని తప్పదు యిది వారి ఆచారము. బంధువులందరు బొట్టు బెట్టి వారికి తోచిన కానుకలు సమర్పించుకున్నారు పిమ్మట భోజనాలు చేసి, కార్లలో బస్సులలో అందరూ బయలు దేరినారు. ధర్మారావు, విక్రం మరి శ్రీలత ఆమె తల్లి విక్రం కారులో అందరూ ప్రయాణమైన పిమ్మట యింటిలో నున్న మనుషులకు ఇల్లు భద్రమని చెప్పి బయలుదేరినారు. హైదరాబాదుకు 2 గంటలకు చేరుకున్నారు. వీరికి యేర్పాటు చేసిన విడిదికి చేరేవరకు $5\frac{1}{2}$ అయ్యింది. అచ్చట రఘునాధరాయలుగారు వారి బంధువులు అన్ని యేర్పాట్లు సరిగా నున్నవా లేవా అని చూచి ఒక నలుగురు మనుషులను వారి తమ్ముడు నరోత్తమరాయలనుంచి యింటికి వెడలిపోయినాడు. నరోత్తమరాయలు వచ్చిన బందువులకు భోజనాలు చేపించి రాత్రి పన్నెండు గంటలకు చేరుకున్నారు. ధర్మారావుగారితో వచ్చిన బంధువులంత భోజనాలు చేసి పండుకున్నారు. చాలామంది రేపు వుదయం పెండ్లి సమయానికి వస్తారు. కొందరు యీ సిటిలోనే వున్నారు. మరి కొందరు వూళ్ల నుంచి పెండ్లి సమయానికి చేరుకుంటారు.

కొన్ని గంటలకు పెళ్లి కాబట్టి తెల్లవార్లు పెండ్లికి కావలసినవన్నీ సరి చేసుకుంటున్నారు.

రాత్రి చాలా సేపటికి అన్ని చేసుకొని నిద్రించారు. ఆదివారం నాడు పెండ్లి యిది. రఘునాధరాయలు కోరిక ప్రకారము జరిగింది ఆదివారం 11.35 నిమిషాలకు ముహూర్తం బాగుందని బ్రాహ్మణుడు చెప్పినాడు అందువల్ల ఆ సమయంలో పెళ్లి అయి తీరవలె. అందరూ ఉదయం లేచి కాలకృత్యాలు తీర్చుకున్నారు. ఫలహారాలు చేసినారు. 10 గంటలకు ఆచార ప్రకారం పిల్లవానికి నిశ్చితార్థం కొరకు పిల్ల తరపు వాళ్లు వచ్చారు. నిశ్చితార్థం కాగానే పిల్లవాన్ని తీసుకొని పోతున్నారు. సాంప్రదాయ ప్రకారం బ్యాండు సన్నాయిలు పిల్లవైపునుండి సుమిత్ మరియు వేరే బంధువులు మిత్రులు వచ్చినారు. విక్రం మరి వారి తరపున వచ్చిన వారంతా బస్సులలో కార్లలో విడిదినుండి తరలినారు యీ procession కొంతదూరం మెల్లగా పోయింది. పిమ్మట speed తగ్గించారు. పెండ్లికై రఘునాధరాయలు యింటిప్రక్కనే ఉన్న పెద్ద మైదానములో శ్యామియానాలను వేసి పూలతో బాగా అలంకరించినారు. కార్లు park చేయుటకు కూడా చాలా స్థలమున్నది. ఆనాడు, యీనాటివలె function halls లేకుండెను గొప్ప వాళ్లంత వాండ్ల యింట్లో చోటు సరిపోదని యీ విధంగానే ప్రక్కకు ఖాళీగా వున్న స్థావరంలో షామియానాలు వేసి పెళ్ళిల్లు జరిపించుకునేవారు. అప్పుడు యిండ్ల ప్రక్కకు ప్రత్యేకంగ ధనికులున్న localities లో విశాలమైన చోట్లు వుండేవి. రఘునాధరాయలు భవనము చుట్టు ముట్టు ఒక compound wall (ప్రహరిగోడ) యిందులో వీరికి పెద్ద భవనము, తోట, కొబ్బరిచెట్లు, పూలచెట్లు, లాను అన్ని ఉండెను. వీరి యిల్లు తోట విశాలము మూడు వేల చదరపు గజాలు యీ చోటంతా తొమ్మిది వేల రూపాయలకు కొన్నారు. యిల్లు పెద్దదైనా యీభై వేలకు కట్టబడింది. యిప్పుడే అయితే చోటుకే 50 లక్షల విలువ చేసే property. కాని అ కాలం వేరు ఈ కాలం వేరు. అప్పుడు డబ్బుకు చాలా విలువ వుండేది. యిప్పుడు డబ్బుకు యేమి విలువలేదు. యిప్పుడు అప్పుడున్న జనాభా కంటె మూడు రెట్లు యెక్కువగా ఉంది. అప్పుడు భయము భక్తి రెండు ఉండేవి యిప్పుడు యీ రెండు లేనే లేవు. అప్పుడు తనకు తెలియకున్న వేరే వారు చెప్పిందన్నా వినేవారు. యిప్పుడైతే తనకు తెలియదు వేరే వారు చెప్పితే వినరు. యెందుకంటే రాజకీయవాదులు తన స్వార్థానికై ఒక దానిని కూలగొట్టినారు మరి దాని చోట్లో నిర్మాణాత్మకమైనది సృష్టించలేదు. యీ దేశానికి రాజకీయవాదులు న్యాయమే చేశారో అన్యాయమో యిక భవిష్యత్తే నిర్ణయిస్తుంది. యిప్పుడు మాత్రము స్వార్థపరులైన రాజకీయవాదులు ప్రజలను తమ స్వార్థానికై వినియోగిస్తున్నారని యే చెప్పక తప్పదు.

పెండ్లి పందిట్లోకి రాకమునుపే కాళ్లు కడిగి ఆచార ప్రకారము కొన్నిటిని చేసిన పిదప పెండ్లి పిల్లవాడైన విక్రంను పెండ్లి పందిట్లో కూర్చుండబెట్టి యేవో కొన్ని కార్యక్రమాల పిమ్మట రఘునాధ రాయలు కాళ్లుకడుగుచుండ శ్రీలక్ష్మమ్మగారు నీళ్లు పోసింది. దీని పిమ్మట బ్రాహ్మణులు మంత్రాలు చదువుతూనే వున్నారు. పిమ్మట పిల్ల పిల్లవాని నెత్తిలో బెల్లం జీలకర్ర అంటించినారు. "పిమ్మట మంగళ సూత్రధారణ జరిగింది. మంగళసూత్రధారణ జరుగుతుంటె బాజా భజంత్రీలు బ్యాండు యెక్కువ చప్పుడు చేస్తున్నవి. మంగళ సూత్రధారణ జరగగానే వచ్చిన అతిధులంత అక్షంతలు

జల్లుతున్నారు యిద్దరి నెత్తిపైన పిమ్మట వీరిద్దరు భార్యాభర్తలుగా ఏడు అడుగులు నడిచారు ఇది ఏది ఏమైనప్పటికీ ఇప్పుడు విక్రం, ప్రమద భార్యాభర్తలు. పెండ్లి ఘనంగా జరిగింది 5, 6 వందల కార్లు వచ్చినవి యీ పెండ్లికి వచ్చిన అతిథుల్లో చాలా మంది స్నేహితులు, బంధువులు, మిత్రులలో సుమిత్ మిత్రులు యీతనితో I.A.S లో చేరినవారు. సుమన్ మిత్రులు కొందరు కాలేజీలో చదువుతున్నారు. మరికొందరు వారి వ్యవహారాలలో నున్నవారు రఘునాథరాయలుతో పనిచేస్తున్న తోటి justices మరి high courtలో పనిచేస్తున్న పలువురు లాయర్లు, శ్రీలక్ష్మి స్నేహితులు బంధువులు ప్రమద కాలేజీ crowd ఆమె professors అంతా ఈ పెండ్లికి వచ్చిన వారిలో నున్నారు. పెండ్లి మహా వైభవంగా జరిగింది. నగరములో మరి state లో నున్న ప్రముఖులంతా యీ పెండ్లికి attened చేసినారు. కొందరు మంత్రులు మరి రాజకీయ నాయకులను కూడా ఆహ్వానించినారు. పెండ్లి కాగానే అందరిని భోజనాలకు ఆహ్వానించడమైనది. కొందరు తినకనే వెళ్లిపోయినారు కాని చాలామంది భోజనాల పిమ్మట రఘునాథరాయలతోనో, సుమిత్ తోనో సెలవుతీసుకుని వెళ్ళి పోయినారు ధర్మారావుతో వచ్చిన బంధువులు స్నేహితులు అచ్చటనే వున్నారు. అట్లాగే రఘునాథరాయల వూళ్లనుండి వచ్చిన చుట్టాలు కూడా అచ్చటే నున్నారు. భోజనాల పిమ్మట యింక కొన్ని చిన్న చిన్న ఆచారాలను పూర్తి చేసిన పిమ్మట నాలుగు గంటలకు వప్పగింతలు జరిగినవి. యిది చాలా touchy function. యిన్ని రోజులు గారాబముతో పెంచిన కూతురుని అత్తవారింటికి భర్తతో కాపురము చేయుటకు పంపునట్టి దృశ్యమే యీ function చేయునప్పుడు కని పెంచిన తలిదండ్రులకు దుఃఖము వచ్చుట సహజమే కాని వేరే వాళ్ళు కూడా యీ function లో యేడుస్తారు. యిప్పుడు ప్రమద ఒక వంశమునుండి మరో వంశానికి పోయింది. యిప్పుడు యీమె విక్రంకు అర్ధాంగి. యీ వప్పగింతలలో విక్రం తలితండ్రులకు శ్రీలత అక్కచెల్లెండ్రకు ధర్మారావుగారి అన్న తమ్ములకు (వీరికి లేరు) వారి భార్యలుంటే వారికి అందరిని పీటలపై కూర్చుండబెట్టి కట్నాలు కానుకలర్పించిన పిమ్మట పెండ్లి పిల్లను వప్పజెపుతారు. అప్పుడే అన్ని వప్పగింతలు అయిపోతావన్నమాట. యిక తుట్టతుదకు నూతన దంపతులిరువురు పెద్దల పాదాలకు నమస్కరించి విక్రం యింటికి వెడతారు తాను గారాబంతో పెంచిన తన ముద్దుబిడ్డ పోతుందని అందరూ నిజంగా దుఃఖిస్తారు. యీ దుఃఖరసంతో కూడుకున్న function పిమ్మట అత్తవారింటికి పోతారు. వప్పగింతలు కాగానే ధర్మారావుగారు వారి సతీమణి అందరు బంధుమిత్రులతో సహా తమ వూరికి ప్రయాణమైనారు. విక్రం ప్రమద తమ కారులో యెక్కినారు బస్సులు కార్లు ముందు విక్రం కారు వీటి వెనక మెల్లగా కొంచెం దూరం నడిచింది పిమ్మట పట్టణం దాటగానే వేగాన్ని పెంచినారు. రాత్రి అయ్యేవరకు ధర్మారావు వూరికి చేరుకున్నారు. వూరికి పోగానే నూతన దంపతులకు గుమ్మం వద్ద హారతులిచ్చి ప్రమదను కుడికాలు మొదలు గుమ్మంలోకి పెట్టించినారు. పిమ్మట నూతనదంపతులు యింట్లోకి ప్రవేశించారు. ప్రమద విక్రంలు ఒకే సోఫా పైన కూర్చున్నారు. ధర్మారావు శ్రీలత అన్ని సర్దుతున్నారు. యింట్లో అందరు హడావుడిగానున్నారు. కృష్ణమోహనుడు అన్న ప్రక్కనే కూర్చునున్నాడు. ప్రమద

చిన్నారి చెల్లెలు సరిత తన ప్రక్కనే వున్నది. విక్రం ప్రమద యేదో మాటాడుటకు ప్రయత్నిస్తున్నారు. ప్రమద మాత్రం చప్పుడు చేయకుండ అలసిన కన్నుల నేల వాల్చి చూస్తున్నది. సరిత అక్కయ్య యెలా అనుపిస్తున్నదే అని అడుగుచున్నది అప్పుడప్పుడు అక్కను సంభోదించి. కృష్ణమోహనుడు కూడా వదినగారి spirits ని లేవనెత్తుటకు ప్రయత్నిస్తున్నాడు.

రెండవ నాడు రఘునాథరాయల యింటినుండి రెండు కార్లలో ప్రమదను విక్రంను తీసుకొని పోవుటకు వచ్చినారు. సుమిత్ సుమన్‌తో యింక కొంత మంది బంధువులు వచ్చినారు. వారిని చూడగానే ప్రమదకు చాలా సంతోషం కలిగింది. యీ పల్లెటూరి వాతావరణం ఆమెకు నచ్చలేదు. పుట్టింది పల్లెటూరిలో నైనా పెరిగింది పట్టణంలో. అప్పుడప్పుడు దసరా పండగలకు తలిదండ్రులతో వూరికి పోయేదికాని K.G నుండి college వరకు సిటీలోనే గారాబంగా పెరిగింది. తండ్రిని చూడనిది ఒకనాడు కూడా వుండలేదు. తండ్రికూడా అంతే. కూతురు యెపుడైనా కాలేజ్ వైపునుండి excursion కు వెళ్ళితే యేమీ తోచకుండా వుండేవాడు. ఆమె ఒకనాడు కంటికి కనబడకపోతే అమ్మణి యేది అని శ్రీలక్ష్మిని అడిగేవారట. యిప్పుడైతే అత్తవారింటికి వెళ్లి రెండురోజులే యైనా రెండేళ్ళు గా తోచింది అతనికి. అందుకు అల్లుణ్ణి కూతురిని పిలుచుక రమ్మని పంపినాడు. వీరు రాగానే ధర్మారావుగారు వీరిని అహ్వానించి తగిన మర్యాదలు సల్పి ఆదరించినాడు. సునిత్ మరి బంధువులు ఒక రాత్రి నిద్రించి ఉదయం లేవగానే ధర్మారావును సంభోదించి మామగారూ మరి విక్రం ప్రమదలను సిద్ధం చేయండి సాయం కాలం వరకు యిల్లు చేరుకుంటాము అన్నాడు. సరే నాయన భోజనాలు కాగానే సిద్ధం కమ్మంటాను అన్నాడు ధర్మారావు. విక్రం సుమిత్ కడకు వచ్చి కూర్చున్నాడు. యిద్దరు I.A.S. కాబట్టి తమకు కలిగిన అనుభవాలను చర్చించుకుంటున్నారు. ప్రమద, సరిత, శ్రీలత మరి బంధువులతో కలసి కూర్చొని మాటాడుతున్నారు. ప్రమదకు bore గావుంది. తన మిత్రులు యెవరు లేరు యీ అత్తగారి బంధువులలో యిప్పుడు ఆమెతో intelectual level లో మాటాడుటకు యెవ్వరు లేరు. యీ ఆడవారంత పెండ్లిళ్ళు, నగలు, బట్టలు, నాణ్యాల గురించి మాటాడుకుంటున్నారు. అంతే కాకుండా gossip కూడా మాటాడుకుంటున్నారు. అందువల్ల ప్రమద, సరిత అక్కడే కూర్చొని వారు మాటాడుకుంటున్నవి వినుకుంటు కూర్చున్నారు. యేమైనా ప్రశ్నలడిగినప్పుడు సమాధానమిస్తున్నారు. శ్రీలతతో అత్తవారు యేమిచ్చినారని ఒక అమ్మగారు అడిగినారు. అది విని ప్రమద ఆశ్చర్యపోయింది. శ్రీలత యిది కనిపెట్టి యేమిస్తారు మంచి కోడలని యిచ్చారు. అది పదివేలు కాదా. ఒకరిస్తే ఉంటాయా అమ్మ, మనది మనము సంపాదించుకోవలె అన్నది కొంచెం indifferent mood తో. అంతటితో ఆ సమస్య తీరిపోయింది. సామాన్యంగ పెండ్లిళ్ళలో యిటువంటి మాటలు చాలా మాటాడుతారు. అందరూ ఒక చోట కాలక్షేపానికి కూర్చున్నప్పుడు యేదో ఒకటి మాట్లాడాలి కదా. అందుకని యెవరెవరి back ground ను బట్టి అటువంటి మాటలు మాట్లాడుతూ ఉంటారు. దగ్గరి బంధువులైతే వారికి యీ విషయమై certificate ఉందనుకుంటారు పెళ్ళిళ్లలో అన్ని అర్థిక స్థోమతలున్న

వారు వుంటారు. యిందులో బీదలు, మధ్యతరగతి కుటుంబాలు, బాగావున్నవారు వస్తారు యిందులో కొంతమందికి సంస్కారమన్నదే వుండదు. అటువంటివారితోటే యీ problems వస్తాయి. సంస్కారమున్న మనుషులు యెవరి మనసు నొప్పించకుండ మాటాడుతారు. వీరు మాటాడేది కూడా తక్కువే కొందరు పలకరించేవరకు మాటాడరు కొందరు యెవరు వారిని మందలించకున్న ఫరవాలేదు తమంతట తామె కల్పించుకొని మాటాడుతారు. కొందరు సందర్భాన్ని బట్టి మాటాడుతారు. కొందరు యేదో మాటాడిందే దక్కిందని మాట్లాడుతారు యిదంత socialisation పేరుతోనేమో. Any way యీ ఆడ గుంపులో అందరు యేదో వకటి మాటాడుతున్నారు పిమ్మట భోజనాలకు లేపినారు యిది ఆడవారి పంక్తి. మగవాళ్ల భోజనాలు మొదలే అయిపోయినవి. పెండ్లిండ్లలో సామాన్యంగా మొగవారు భోంచేసిన పిమ్మటనే ఆడవాండ్లు భోంచేస్తారు. యిప్పుడు కూడా అలానే జరుగుతుంది. అందరు భోజనాలకు లేచినారు.

పెండ్లికూతురు ప్రమద, చెల్లెలు సరిత ఇంకా దగ్గరి బంధువులు ఒక చోట కూర్చున్నారు. ప్రమద కొంచెం వడ్డించుకుంది. సరిత కూడా అంతె. అందరూ తింటున్నారు. ప్రమద, సరిత తొందరగా భోంచేసినారు. అట్లే అందరితో కూర్చొని వున్నారు. శ్రీలత యిది కనిపెట్టి అమ్మా లేవండి చేతులు కడుక్కోండి అన్నది. ప్రమద సరిత లేచి చేతులు కడుగుకున్నారు. పోయి మళ్లీ యిదివరకు కూర్చున్న చోటనే కూర్చున్నారు. ఒకరొకరు అంతా వచ్చి మళ్లీ అచ్చటనే కూర్చున్నారు ఆ పరచిన జమ్‌ఖానాలలో. యిప్పటికే మూడు గంటలు కావస్తున్నది. సంప్రదాయ ప్రకారము అన్ని పనులు ముగించుకున్నారు విక్రం ప్రమద fiat లో ముందుసీట్లో కూర్చున్నారు. కృష్ణమోహన్, సరిత వెనుక సీటులో, బంధువులంతా వేరే కార్లలో కూర్చున్నారు. సుమిత్‌తో కూడా కొందరు కూర్చున్నారు. ప్రమద, విక్రం, ధర్మారావు, శ్రీలత పాదాలకు నమస్కరించి పిమ్మట కారునెక్కారు. సుమంగళిగా వేయేండ్లు సమస్త ఐశ్వర్యాలను అనుభవించు తల్లి అని ధర్మారావు దీవించినారు. అందరు కార్లు ఎక్కినారు. కార్లు కదిలినవి. మూడు గంటల పిమ్మట ప్రమద విక్రంలు రఘునాధరాయల యింటికి చేరుకున్నారు రాత్రి 8 గంటలు సమయము కాగానే. రఘునాధరాయలు కూతురుని చూచి చాలా ఆనందించినారు. అల్లుడితో కరచాలనము చేసిన పిమ్మట కూతురు నెత్తి నిమిరినాడు. ప్రమద అమితానందముతో తండ్రి కాళ్లకు నమస్కరించబోయింది. వద్దు తల్లి అని లేపినాడు ప్రమద చేతులు బట్టి యిల్లు యింక కొంతమంది బంధువులతో కళకళ లాడుతోంది. తెల్లవారగానే చాలామటుకు బంధువులు వెడలి పోయినారు యింటిలో రఘునాధరాయల చెల్లెలు, తమ్ముడు అతని భార్య తప్ప యింకెవరు లేరు సుమిత్ కూడా నాలుగైదు రోజులలో తన కలెక్టర్ బాధ్యతను నిర్వర్తించుటకు వెళతాడు. 10 రోజులలో చెల్లెలు, తమ్ముడు అతని భార్య కూడా వెళ్ళిపోతారు. విక్రంకు యింక 12 రోజుల సెలవుంది.

రఘునాధరాయల చెల్లెలు రాధిక. యీమె భర్త అయిదు సంవత్సరాలకు పూర్వమే చనిపోయినారు. యీమె చాలా మంచిది. అన్నగారంటే అతి వినయ విధేయతులు, వదినగారిపైన చాలా ఆదరాభిమానాలు. రఘునాధరాయలకు ముగ్గురు తోబుట్టువులు.

రఘునాధరాయలు తన తలితండ్రులకు ప్రధముడు. పిమ్మట నరోత్తమరాయలు, No 3 రాధిక. No 4 లక్ష్మి అందరికన్న చిన్నది. రాధిక చాలా కరుణామయి. అంతేకాకుండా ఆశగొండి కాదు. చాలా సంస్కారముగల మనిషి. ప్రమద యీమెను రాధికత్త అంటుంది. ప్రమద తండ్రికి ప్రియాతి ప్రియమైన రాధికత్తతోటే వుంటుంది. తండ్రి యింటికి రాగానే చేపను నీళ్లలో వదలినట్టనిపించింది ప్రమదకు. తన ప్రియమైన నాన్నగారు తను యింతవరకు పెరిగిన అతి అనుకూలమైన వాతావరణము, అన్న చెల్లెలు, అమ్మ, అత్తయ్య అందరూ వున్నారు. తనకు యే మాత్రము సిగ్గు బిడియము అనే సమస్యే వుండదు. యింటికి రాగానే విక్రంకు ఒక గది యేర్పాటు చేసారు. రెండు రోజులనుండి ఒంటరిగానున్నాడు. తన గదిలో విక్రం యిప్పుడే ప్రమదా సాంగత్యాన్ని ఆశించలేదు. యెందుకంటే పెళ్ళయిన కొన్ని రోజులలో మంచి దినాలు వెళ్లిపోతున్నాయని మళ్లీ ఆరు నెలల పిమ్మటనే మంచి దినాలున్నవని యెక్కడో విన్నట్టు జ్ఞాపకం. అందువల్ల ఆరునెలల వరకు తనకు వంటరి జీవితము తప్పదని నిశ్చయించుకున్నాడు అందువలన అతడు ప్రమద సాంగత్యాన్నే మరచి పోయినాడు.

ఒకనాడు సుమిత్, సుమన్, విక్రం, కృష్ణమోహనుడు యేదో యింగ్లీషు 2nd picture కు పోయి రాత్రి వంటిగంట సమయానికి యిల్లు చేరుకున్నారు. సుమిత్ తన గదిలోకి పోయి పడుకున్నాడు కృష్ణమోహన్ మరి సుమన్ మేడపైన సుమన్ గదిలో పడుకున్నారు బహుశ శ్రీలక్ష్మి రాధిక మెలుకువతోనే వున్నారనుకుంట. విక్రం యింటిలో క్రింది భాగంలో తనకమర్చిన గదిలో తలుపువేసుకొని పడుకున్నాడు. తను పడుకున్న కొద్దిసేపటికి యెవరో తలుపు కొట్టినారు నిద్రలో నున్న విక్రం తలుపుతట్టి. తలుపు తెరిచినాడు రాధిక మొదలు ప్రవేశించింది. ప్రమదను పిమ్మట రమ్మని సైగతో పిలిచింది. ప్రమద సిగ్గుతో రాలేదు. రాధిక వెళ్లి చేయి పట్టి తీసుకొచ్చింది. విక్రం bed పైననే విక్రం ప్రక్కనే కూర్చోబెట్టింది. చేతికేదో బంగారు వుంగరము పెట్టింది. యింక యేదో ప్రమదకు తొడిగించింది. పిమ్మట సరే నాయనా అంటూ తలుపు దగ్గరగా వేసుకుంటూ వెళ్ళిపోయింది. విక్రం యింకా shock లోనే ఉన్నాడు. రాధిక వెళ్ళిన కొన్ని seconds లో ప్రమద వెళ్లి దగ్గర వేసిన తలుపు వద్ద తలవంచుకొని నిలబడింది.

విక్రం మాత్రం మంచం మీదనే కూర్చొని ఆతడు shock నుండి తేరుకుం టున్నాడు. ఒకటి రెండు నిమిషాలలో ఈ ప్రపంచంలోకి వచ్చినాడు. యింకా ప్రమద తలుపు వద్దనే నిలబడింది. ఆమె వస్తుంది అనుకున్నాడు విక్రం. కాని రాలేదు.

విక్రం తలుపు వద్దకు వెళ్ళి తలుపు గొళ్లెం వేసి ప్రమద చేయి పట్టుకొని తన మంచం వద్దకి తీసుకవచ్చి తన ప్రక్కన కూర్చుండ పెట్టుకున్నాడు. యిది విక్రం వూహించని సన్నివేశం. యింక ఆరు నెలలవరకు బ్రహ్మచర్యంను పాటించవలసిన విక్రంకు అనుకోకుండా ప్రమద లభించినందుకు సంతోషించినాడు. యిక విక్రంకు ఆమె పంపిన picture అంతగా అవసరము లేదు. ప్రమద భుజం మీద చేయివేసి తనకు దగ్గరగా లాక్కున్నాడు. ప్రమద నీవు నా దేవతవు నేను ఆశించకుండానే నీవు నా కడకు వచ్చినావే అన్నాడు. ప్రమద సిగ్గు భారంతో యేమీ మాటాడలేదు. యీనాడు రెండు శరీరాలు ఒక ఆత్మగా మారిన శుభదినం.

రాత్రి మూడు గంటలవరకు యిద్దరూ నిద్రించలేదు. రెండు గంటలు స్వర్గసుఖాలననుభవించి యిద్దరు ఒకరి ఒడిలో ఒకరు ఉదయం తొమ్మిది గంటలవరకు నిద్రించినారు. తొమ్మిది గంటలకు ప్రమద లేచి పోబోయింది. విక్రం చేయి బట్టి అబ్బ యిప్పుడే యేమి తొందర యింక కొంచెం సేపు పడుకో అన్నాడు విక్రం. లేదు వెళ్ళి మొఖం కడుగుకోవాలి. మీరు కూడా రండి అంది చేయిబట్టి. సరే నీవు వెళ్ళు నేను కొన్ని నిమిషాలలో వస్తాను అన్నాడు విక్రం. కొంచెం సేపు అటులే పడుకొని ఉన్నాడు. ప్రమద మొఖం కడుక్కొని స్నానం చేసి brush కు paste అంటించి లేవండి ముఖం కడుక్కోరా అని లేపింది. విక్రం sink వద్దకు వెళ్ళి బ్రెష్ చేసుకొని లోపలి వరండాలో cane సోఫాపై కూర్చున్నాడు.

ప్రమద వచ్చి breakfast రడీ అయింది రండి. నేను breakfast చేయను వట్టి hot tea చాలు అన్నాడు విక్రం. విక్రం కోరిక ప్రకారమే ప్రమద స్వయంగా టీ చేసి తీసుకొచ్చింది. విక్రం టీ చాలా వేడిగా వుంటే తప్ప తాగడు. ప్రమద తెచ్చిన టీ వేడిగానే ఉంది. మెల్లగా ఆ వేడి టీని సేవించుతూ స్వప్న జగత్తులో ప్రయాణిస్తున్నాడు విక్రం. విక్రం అంటూ సుమిత్ విక్రం భుజం తట్టి ప్రక్కనే కూర్చున్నాడు యేమి విశేషాలు అన్నాడు. విక్రం స్వప్నజగత్తునుండి బయటకు వస్తూ. యేమిలేవు నేను యీ రెండు మూడు రోజులలో మళ్లీ నా work ప్రపంచంలోకి వెళ్ళాలి అన్నాడు. అంటే అన్నాడు విక్రం. I have to resume my duties అన్నాడు సుమిత్.

ఓ అలాగా నాకు యింకా రెండు వారాలకు పైగా సెలవుంది. అన్నాడు విక్రం. అయితే take it easy అన్నాడు సుమిత్. I intend to do that సుమిత్. Thank you any way అన్నాడు విక్రం. యింతలో ప్రమద వచ్చి అన్న ప్రక్కన కూర్చుంది. నీ M.A. finals యెప్పుడమ్మా అన్నాడు సుమిత్. అతి త్వరలోనే అన్నయ్యా అంది. preparation లేందే యిస్తావా అన్నాడు సుమిత్.

లేదు, అన్నయ్యా బాగా prepare చేసి యిస్తాను అంది. సుమన్ యిప్పుడే లేచినాడు. యింకా బ్రెష్ నోట్లోనే వుంది. లేచి మొఖం కడుగుకొన్నాడు. బాత్ రూంలోకి వెళ్ళినాడు స్నానం చేయుటకు.

ప్రమద విక్రం ప్రక్కకు వచ్చి ప్రక్క కుర్చీలో కూర్చుంది. ఎంతవరకున్నవి మీ శెలవలు అంది. రెండు వారాలకు కొంచెం మించి వున్నాయి అన్నాడు విక్రం. యేం చేద్దామనుకుంటున్నారు నీకొంగు పట్టుకొని కాలం గడుపుదామనుకుంటున్నాను. అన్నాడు విక్రం చిలిపిగా.

ఓ అలానా! సంతోషం. మనలను చూచి అందరు నవ్వుకొనుటకా అంది చిలిపిగా. నవ్వుకోనీ మనకేం. సీరియస్ గా అడుగుతున్నాను అంది ప్రమద. యేముంది హనీమూన్‌కు వెళదాం అన్నాడు విక్రం. యెక్కడికి అంది ప్రమద. యేముంది నీవు యెచ్చటికి అంటే నేను అచ్చటికే అన్నాడు. నాకైతే వేరే తెలియని ప్రదేశాలకు వెళ్లడం యిష్టముండదు యిచ్చటనే చాలా సినిమాలు చూద్దాం. యిక్కడే ఆ రెండు వారాలు గడుపుదాము అంది ప్రమద. సరే అన్నాడు విక్రం.

నిజంగా అంటున్నారా అంది ప్రమద. నిజంగానే, నేనన్నాను కదా నీవు

ఎచ్చుటికి అంటే అచ్చటికని. నీవు యిచ్చటనే వుందామంటే అలానే కాని అన్నాను. తప్పన్నానా అన్నాడు విక్రం. very good అంది ప్రమద అప్పటికే స్నానాలు ముగించుకొని బట్టలు వేసుకొని court కు వెళ్లుటకు జస్టిస్ రఘునాథరాయులు కారు యెక్కుతు ప్రమదా అని పిలిచారు. నాన్న అంటూ పరుగెత్తింది ప్రమద. అల్లుడుగారికి యే లోటు రానీయకుండా చూడమ్మా. అమ్మతో అన్ని విషయాలు చెప్పినాను. అంటూ ప్రమద నుదుట ముద్దిడుకొని కారులో యెక్కినాడు. కారు కదలగానే ప్రమద లోనికి వచ్చింది విక్రం ప్రక్క కుర్చిలోనే కూర్చుంది

స్నానం చేయరా అంది తొందరేముంది అన్నాడు విక్రం. స్నానం చేసినంక యెచ్చుటికైనా వెడదాము యేమైన చేద్దాము. మీరు స్నానం చేసి బట్టలు వేసికొండి మొదలు ప్లీస్ అంది. సరే అనగానే సేవకునికి బట్టలు fresh towel యిచ్చి బాత్ రూంలో పెట్టమంది. పిమ్మట విక్రం తో వెళ్లి స్నానం చేసిరండి అంది. అలాగా అమ్మగారు అన్న విక్రం లేచి బాత్ రూంలోకి వెళ్ళినాడు. యిప్పుడు తనొక్కతే వరండాలోని సోఫాపై కూర్చుంది. యేవో ఆలోచిస్తుంది. రాత్రి జరిగిందంతా తలచుకుంటుంది. అబ్బ యెప్పుడైన గుంపులో యెవరి స్పర్శ తగిలినా అస్యహించుకొన్న నేను రాత్రంతా నా ప్రాణేశ్వరుని స్పర్శను స్వర్గతుల్యంగ భావించినానే. యేమిటీ మార్పు నాలో. అంతేకాదు, ఆ స్పర్శను యింకా కావలెనని ప్రతి నిమిషము కోరుకొంటుంది. యీ నా అదుపు దప్పిన శరీరం అనుకుంటు సోఫాలో ఒరిగింది. మళ్ళీ రాత్రి యెప్పుడొస్తుందా అని కలలు కంటుంది ప్రమద

యిప్పుడు ఆమెకు చదువు మీద దేనిమీద అంత ధ్యాస లేదు. తన జీవితం విక్రంతో స్వర్గతుల్యంగ గడచి పోవాలె అని దేవుని వేడుకుంటుంది ప్రమద. యింతలో శ్రీలక్ష్మి వచ్చి స్నానం చేశావా అమ్మా అంది. చాలా సేపయ్యిందమ్మా అంది. మరి అల్లుడుగారు ఏరి అంది. వారు స్నానం చేస్తున్నారమ్మా అంది. శ్రీలక్ష్మితో రాధిక అత్తయ్య కూడా వచ్చి కూర్చుంది. యేమమ్మా కోడలా యెలా గడిచింది మీ మొదటి రాత్రి. మీకు తెలియదా అత్తయ్య అంది నవ్వుకుంటు. అంతా మంచిగానే జరిగినట్లుంది ప్రమదా అంది రాధిక. అలా అని యెలా అనుకుంటారు అత్తయ్యా అంది. అమ్మా నేను నీకన్నా వయసులో చాలా పెద్ద. నీకన్న యెక్కువ అనుభవమున్న దానిని నీ మాటలను బట్టి నీ నవ్వును బట్టి మీ రాత్రి చాలా ఘనంగా జరిగిందని తెలుస్తోంది.

యే మంటారు వదినెగారు అంది శ్రీలక్ష్మి ని సంభోదించి. శ్రీలక్ష్మి మీ అత్త కోడండ్ర మధ్య నేను రాను తల్లీ అని కూర్చుంది. యింతలో బాత్ రూం నుండి విక్రం వచ్చు శబ్దం విని శ్రీలక్ష్మి లేచింది. అమ్మో అత్తగారికి అల్లుడితో పరదా కాబోలు అంది రాధిక. శ్రీలక్ష్మి నవ్వుకుంటూ వెడలిపోయింది. విక్రం వచ్చి కొంచెం hair oil ఇస్తావా ప్రమదా అనగానే; అదిగో అది డ్రస్సింగ్ రూం, అందులో అన్నీ వున్నాయి పదండి అని విక్రంను తీసుకొని ఆ గదిలో వదిలి అన్నీ చూపించి రాధిక దగ్గరికి వచ్చి కూర్చుంది.

విక్రం నెత్తి దువ్వుకొని వచ్చి రాధిక, ప్రమదల మధ్య కూర్చున్నాడు. యేం నాయనా యేం programme యివ్వాళ అన్నది రాధిక. అది ప్రమద చేతుల్లో

ఉంది అన్నాడు విక్రం. యేమమ్మా యేం చేస్తున్నారు అంది ప్రమదతో. యివ్వాళ యేమి లేదు అత్తయ్యా నాకైతే నిద్ర వస్తోంది భోంచేసి పడుకుంటాను అంది. మంచి పని చేస్తున్నావు తల్లీ, కాని మా విక్రంకు కూడా నిద్రరాదా అంది. అయితే ఆయనను కూడా పండుకొమ్మనండి అంది ప్రమద. యేం నాయనా నీవు కూడా అంతే చేస్తావా అంది రాధిక. విక్రం నవ్వి యేమి అనలేదు. సరే అమ్మా నేను కూడా స్నానం చేయాలె అని చెప్పి వెళ్లి పోయింది. యిపుడు వరండాలో ప్రమద విక్రంలు తప్ప యెవరూ లేరు. పదండి మన గదిలోకి అంది ప్రమద. సరే పద అన్నాడు విక్రం. ప్రక్కనే వున్న పడకగదిలోకి యిద్దరూ వెళ్ళి పడుకున్నారు. యిప్పుడు విక్రం అర్ధాంగి ప్రమద. యిద్దరూ ఒకరి నొకరిని హత్తుకొని పచ్చడం కప్పుకొన్నారు. యిద్దరి యువ హృదయాలు ఒక్కటైనప్పుడు యేమి జరుగుతుందో వేరే చెప్పనక్కరలేదు. స్వర్గసౌఖ్యాలననుభవిస్తున్నారు యీ నూతన దంపతులు. ఆ స్వర్గలోకంలోనే కన్నులు మూసుకున్నారు. ఆ నిద్రలో అలాగే హత్తుకొని వున్నారు. రెండు గంటలవరకు నిద్రపోతూనే ఉన్నారు.

శ్రీలక్ష్మి రాధికతో యేమ్మా మరదలుగారు, కోడలు కొడుకు యెచట అంటే వాళ్లగదిలో పండుకున్నారు, లేపకండి అంది. శ్రీలక్ష్మి భోజనాలమ్మ అంది రాధికతో. ఆకలయినప్పుడు మేలుకుంటారు లే వదిన. వాళ్ళు నూతనదంపతులు వాళ్లను యిప్పుడు disturb చేయకండి. అని యిద్దరూ dining హాల్‌లో టేబిల్ పైన కూర్చున్నారు. యింతలో భోజనం వడ్డించినారు. యిద్దరూ యేదో మాటాడుకుంటూ భోంచేసినారు. వీరు భోంచేసిన గంటన్నరకు ప్రమద విక్రంలు బయటికి వచ్చినారు తమ గదిలోంచి. యిద్దరూ మొఖాలు కడుగుకున్నారు. ప్రమద వంటశాలలో నున్న మనుషులతో నాకు అయ్యగారికి వడ్డించమంది. సరే అమ్మగారు అని వాళ్ళు అన్నీ టేబుల్ మీది set చేస్తుంటే రాధిక యెటనుండో వచ్చి స్వయంగ యిద్దరికి వడ్డించింది. ప్రమదా మంచిగా భోంచేయి, నీవు కూడా నాయనా అని విక్రంను కూడా సంభోధించింది. సరే పెద్దమ్మా అన్నాడు విక్రం. ప్రమద విక్రం తృప్తిగా భోంచేసినారని తెలుసుకునే అంతవరకు వాళ్లకు వడ్డిస్తూ తినండి తినండి అని అంటూనే ఉంది.

యేమో అత్తయ్య మేము పసి కూనలమా యిలా తిను తిను అని వడ్డిస్తున్నావు అంది ప్రమద, కాని విక్రం యేమీ మాటాడలేదు. తిన్న ఒక గంటసేపటికి రఘునాథరాయలు కారు శబ్దం వినబడింది. నాన్న వచ్చినారని ప్రమద బయటి వరండాలోకి వెళ్ళింది. రఘునాథరాయలు కూతురునొక్కరైను చూచి విక్రం యేడమ్మా అన్నాడు. వరండాలో కూర్చున్నారు నాన్నా అన్నది. యిద్దరు వరండాలోకి వచ్చినారు. విక్రం మామగారిని చూచి గౌరవంగా నిలబడినాడు. కూర్చో విక్రం అని కూర్చుండబెట్టి తను కూర్చున్నారు. కొంతసేపాగి విక్రంతో విక్రం నీవు మళ్లీ ఆ position మీదకే పోవాలా? లేక నీకు ప్రమోషన్ వచ్చేవరకు secretariat కు transfer చేయించుకుంటావా? అన్నాడు.

యేమో! యింకా యేమీ ఆలోచించలేదు అన్నాడు మెల్లగా. ఆలోచించుకో. పిమ్మట నీ అభిప్రాయాన్ని తెల్పమన్నాడు. పిమ్మట రఘునాథరాయలు టీ తీసుకొని

బయటి వరండాలోకి వెళ్లి కూర్చున్నాడు. ప్రమద విక్రంను అడిగింది సిటీకి transfer చేయించుకోండి ప్లీస్. ఆ డిస్ట్రిక్టులలో యేముంది అన్నది. సరే ఆలోచించి చెపుతా అన్నాడు. అంతటితో ఆ topic close అయ్యింది. మరునాడు సుమిత్ తన స్నేహితులతో పై వరండాలో cards ఆడుతున్నాడు. మళ్ళీ ఉద్యోగంలో చేరితే ఘడియకూడా తీరిక ఉండదు కాబట్టి యీనాడు యేదో కాలక్షేపానికై ఒక యెనిమిది మంది కలసి పేకాట ఆడుతున్నారు. ఆ సందర్భములో ఒక స్నేహితుడు సుమిత్‌ను పెళ్ళెప్పుడు brother అన్నాడు. అది కూడా ఒకనాడు తప్పక జరుగుతుంది అన్నాడు. అది జరగదని యెవరంటున్నారు కాని త్వరలోనా యింకా కొన్నేండ్లా? అన్నాడు, ఆ సోదరుడు. యిక చెల్లెలు పెళ్లి అయ్యింది కదా నా పెండ్లి చేసుకోవచ్చుననుకుంటూ అన్నాడు సుమిత్.

విక్రం ఆ గ్రూప్‌లోనే కూర్చున్నాడు కాని కార్డ్సు ఆడుట లేదు. విక్రంకు కార్డ్సు ఆడుట అంత ఇష్టం వుండదు. అందులో హై స్టేక్స్‌తో అసలు ఆడడు. ఆట అనేది pleasure కొరకు కాని gambling కు కాదు అని అంటాడు. కాని కొందరికి హై స్టేక్స్ లేకుంటే వారికి ఆడినట్టు గానే ఉండదు. అందుకనే వూరకనే చూసుకుంటూ కూర్చున్నాడు. యింతలో రాధికమ్మగారు ఆ వరండాలోకి ప్రవేశించి విక్రం యిలా రా నాయనా అంది వెంటనే విక్రం లేచి ఆమెను అనుసరించాడు. ఆమె చక్కగా అవరండా వెనుక నున్న ఒక గదిలోకి వెళ్ళింది విక్రంతో. గదిలో ప్రమద మంచంపై కూర్చొని ఉంది. విక్రంను చూచి మందహాసం చేసింది. పిమ్మట రాధిక చూడు నాయన నీవు గుంపులో చేరితే ప్రమద యేమి చేయగలదు. ప్రమదకు నీవు company యీయకపోతే యెవరిస్తారు.

మీరిద్దరు ఒకరి కొకరు కంపెని అని చెప్పి తలుపులు వేసుకొమ్మని చెప్పి వెడలిపోయింది. ప్రమద విక్రంతో తలుపులు వేసి రండి ఎవరైనా చూస్తే నాకు గంపెడు సిగ్గు అంది. నాకు కూడా అంతే అని మెల్లగా వెళ్లి తలుపులు బిగించి బేడెం వేసి వచ్చినాడు. రాగానే చెప్పు నా ఆరాధ్య దేవత అని ఒడిలో ఒరిగినాడు. ప్రమద ఒడిలో పడుకొన్న విక్రం తలను నిమిరింది. ఒకరి నొకరు కౌగలించుకున్నారు. ముద్దులిడికున్నారు. పిమ్మట జరిగేదేదో జరుగుతుంది. వరండాలో కార్డ్సు ఆడుతున్నవారు తమ ఓటమి గెలుపులో మునిగివున్నారు. ప్రక్కగదిలో యేమి జరుగుతుందో యెవరికి తెలియదు. విక్రం ప్రమద రతిమన్మథతాపం తీరింది. యిప్పుడు యిద్దరు ఒకరి ఒడిలో ఒకరు నిద్రించినారు. గంట పిమ్మట మెలకువ వచ్చింది విక్రంకు. మెల్లగా ప్రమదను తట్టి లేపినాడు. మెల్లగా క్రిందికి వెడలిపో అని మెల్లిగా తలుపు గొళ్లెం తీసినాడు.

బయట యెవరు లేంది చూచి ప్రమదను వెళ్ళిపొమ్మని సైగ చేసినాడు. ఆమె వెంటనే సిగ్గుతో క్రిందికి దిగిపోయింది. విక్రం యేమీ యెరుగనట్టే తన చోటులో పోయి కూర్చున్నాడు. అది june నెల యింకా వర్షాలు కురుయలేదు. యెండలు వేడిగానే వున్నాయి. యింక వర్షాలు పడతాయా యింక ఆలస్యం చేస్తాయా అని అందరు మాటాడుకుంటున్నారు. తెల్లవారి లేచినప్పుడు విక్రం transfer city కి చేయించుకోవలెనా లేదా తను leave తీసుకున్న position కే Asst. Collector

గా పోవాలా అనేది నిర్ణయించుకున్నాడు. చిన్నప్పటినుంచి సిటీలోనే చదివి సిటీలోనే పెరిగినాడు. వెంకటకృష్ణుడు యిప్పుడు సిటీలోనే practice చేస్తున్నాడు. Dist. లో త్రాగితే, cards ఆడితే కంపెనీకి కొదువలేదు. తను strict గా వుండలేదు. అందరి వలె డబ్బుకు influence కు లొంగిపోవాలి. యిప్పుడు ఆఫీస్‌లో strict గా వుంటాడు కాబట్టి యింట్లో యెవరిని రానీయడు, యింటర్వ్యూలు యివ్వడు. యీ జీవితము చాలా కష్టాలతో కూడుకున్నది.

Asst. Collector వద్దకు వచ్చేవాళ్లు వారి వారి స్వార్థమైన పనుల కోసరము వస్తారు. యిందులో ప్రభుత్వ మంత్రులతోను, ముఖ్యమంత్రితోను, దగ్గరి రాజకీయ వ్యక్తిగత సంబంధాలున్నవారు వుంటారు. తాము తలచినట్టుగా వ్రాయకపోతే transfer కూడా చేయించుతారు. విక్రం పని అంత వరకు రాలేదు. strict గా వుండి కూడా అయినంతవరకు వారికి నొప్పి కలగకుండా వారిని మెప్పించి పంపే ప్రయత్నం చేస్తాడు. అందరూ యితన్ని మెచ్చుకొనక పోయినా అర్థం చేసుకొని పోతారు. అందరిని స్నేహభావంగా కలుసుకుంటాడు. వారడిగిన వాటికి న్యాయ సమ్మతమైందని తనకు తోస్తే వెంటనే వారి పని చేసి పంపిస్తాడు. అనుమానాస్పదమైనదనుకుంటే మళ్లీరండి చూద్దాము అంటాడు. పూర్తిగా న్యాయసమ్మతమైంది కాదనుకున్నప్పుడు వారికి లాభంలేదండి అని మంచిగా చెప్పి పంపుతాడు. ఒకరికి అన్యాయం చేయనప్పుడు భయం యేముంది అనుకుంటాడు. యీ 54 నెలలలో చాలా నేర్చుకున్నాడు విక్రం. యిక అరు నెలలలో collector గా అవుతాడు. అప్పుడు పూర్తి జిల్లాకు సర్వాధికారి. యెక్కడకు వెళ్లేది యే జిల్లా అధికారాన్ని నడిపేది యింకను తెలియదు. యిప్పుడైతే leave మీదు ఉన్నాడు. ఇంకా కొద్ది రోజుల్లో leave అయిపోతుంది అనుకున్నాడు విక్రం.

విక్రంకు executive job అంటే ఇష్టం లేదు. కాని చాలామందికి including his own wife ప్రమదకు చాలా యిష్టం. యీ మూడురోజులలో ప్రమద మనస్తత్వాన్ని తెలుసుకున్నాడు విక్రం. ఒకనాడు విక్రం ప్రమదతో నాకు యీ executive position నచ్చవు. బెస్త పెత్తనం, చెప్పుల మ్రోతగా అనిపిస్తుంది. యీ exceutive position అన్నాడు. ప్రమద అంది నిజమా అందరూ యెంత రీవి, యెంతమంది మన క్రింద వుంటారు అంది. అయితే నేను Asst. collector గా లేకుంటే నన్ను పెండ్లాడకుంటివా అన్నాడు. బహుశ ఆడియుండక పోవుచుంటినేమో అంది. విక్రం యేమీ మాటాడలేదు. కొంచెం సేపు యిద్దరూ మౌనంగా నున్నారు. పిమ్మట విక్రంతో మరి మీకు యే job అంటే యిష్టము అంది ప్రమద. అకెడెమిక్ లైఫ్ అంటే యిష్టము అన్నాడు విక్రం. అలాగా నాకు అంతగా యిష్టము ఉండదు. అందులో powers యేమి వుంటవి అంది. ఆ life very dignified, quiet & peaceful life అన్నాడు విక్రం. అందులో కూడా రాజకీయాలుంటాయండి అంది ప్రమద. మనము politics కు దూరంగా వుండి మన బాధ్యతలను మనము నిర్వహిస్తుంటే యే సమస్యలు రావుకదా అన్నాడు. యీ executive job లు కూడా అంతేగా మన పనేమిటో మనము చూసుకొంటే యే రాజకీయాలు మనలనేమీ చేయవుకదా అంది ప్రమద. నా అనుభవాన్ని బట్టి నే చెబుతున్నా ప్రమద academic

life కు executive life కు చాలా బేధముంది అన్నాడు విక్రం. నాకయితే అట్లేమి కనిపించదు అంది ప్రమద. ప్రమద సరే అవన్నీ యిప్పుడెందుకులెండి. మొన్న నాన్నగారు మీతో అడిగినదానికి మీ సమాధానమేమిటి అన్నది. మీరు సిటీకి రావాలనుకుంటే మరి నాన్నగారు యేదైనా ప్రయత్నం చేస్తారేమో మరి మీ అభిప్రాయం తెలిపితే నాన్నగారితో మాటాడుతాను అంది. యింకా ఆరు నెలల లోపుగా నాకు transfer తప్పదు. అప్పుడు కలెక్టరుగా వెళ్ళాలా లేదా సిటికి డిప్యూటీ సెక్రటరీగా రావాలా ఆలోచించవచ్చు. ప్రస్తుతానికి leave కాగానే duty join అవుతాను అన్నాడు విక్రం. మరి నేనేమి చేయాలి యీ ఆరు నెల్లు అంది ప్రమద. యిచ్చటనే ఉండు అన్నాడు విక్రం. ఉండి యేమి చేయాలి మీరెక్కడ ఉంటే నేను అక్కడనే ఉంటా అంది ప్రమద సరే అట్లే కానివ్వు మరి నీవన్నీ సర్దుకో పది రోజులలో నేను వెళ్లాలి అన్నాడు విక్రం. సరే అంది ప్రమద మందహాసంతో

చూస్తుంటే పదిరోజులు గడచిపోతున్నవి. ఒక నాడు రఘునాథరాయలు సాయం కాలం బైటి వరండాలో కూర్చొని ప్రమదను పిలచినాడు. అల్లుడు గారేమన్నారమ్మా సిటీకి వస్తారా లేదా అచటనే వుంటారా? అని ప్రమదను అడిగినాడు. మీరే అడగండి నాన్నా అని విక్రం ని పిలుచుకొని వచ్చింది. విక్రం కూర్చున్నాడు. విక్రం మరి సిటికీ వస్తావా లేదా అదే చోటికి వెడతావా అన్నాడు రఘునాథరాయలు. యింక ఆరు నెలలైతే ప్రమోషన్ వస్తుంది కదా అప్పుడు transfer తప్పదు. కలెక్టరుగా యే జిల్లాకు వేస్తారో లేదా మరి యింకెక్కడికి వేస్తారో అన్నాడు విక్రం. నీకు ప్రమదకు యిష్టమైతే సిటీకి transfer చేయిస్తా. సెక్రటేరియట్ లో deputy సెక్రటరీ గా ఉండవచ్చు ప్రమద తన M.A. పూర్తి చేయుటకు కూడా బాగుంటుంది అన్నాడు రఘునాథరాయలు. సరే మీ యిష్టప్రకారమే కానీయండి అన్నాడు విక్రం. యింతటితో విక్రం సమస్య ముగిసింది. విక్రంకు సిటీకి రావాలనే ఉంది కాని ఆలోచించి పనిచేయాలని అడగగానే మూడు రోజుల క్రితము చెప్పలేదు. యిప్పుడు పూర్తిగా ఆలోచించి చెప్పినాడు. యీ ఆరు నెలలు అసిస్టెంట్ కలెక్టర్ గా పోవలసిందే కాని ప్రమదతోనా లేక వంటరిగానా ఆలోచిస్తున్నాడు విక్రం ప్రమద మాత్రం తనను విడచి వుండనంటుంది. ఆమెతో వెళ్లాలో ఆమెను తల్లితండ్రి వద్దనే విడచి పోవాలో ప్రమద యిందుకు ఒప్పుకొనకపోవచ్చు అయినా ప్రయత్నిస్తాననుకున్నాడు. రాత్రి పూట యిద్దరు యేకాంతంగా తన పడకగదిలో నున్నప్పుడు విక్రం ప్రమదతో రెండు రోజులలో నేను బయలుదేరాలి నీ నిర్ణయం చాలా ముఖ్యము యిచ్చటనే వుంటావా నాతో వస్తావా అన్నాడు విక్రం. మీరేమనుకుంటున్నారు. అని యెదురు ప్రశ్న వేసింది ప్రమద. ఆరు నెలలలో నేను సిటీకి రావచ్చుకదా అందుకే యీ ఆరు నెలలు యిచ్చట వుంటే బావుంటుందేమో అన్నాడు విక్రం. మీకు బావుంటుందేమో నాకు మాత్రం బాగుండదు. యిక ముమ్ముందెప్పుడూ మంచికైనా చెడుకైనా నేను మీ వెంటనే వుంటాను అంది ఖండితంగా. అయితే యెల్లుండే ప్రయాణం. నీ బట్టలు అవి సర్దుకొని సిద్దంగా వుండు యెల్లుండి breakfast పిమ్మట బయలు దేరుదాం అన్నాడు విక్రం. సరే అంది ప్రమద. అనాడు బుధవారం. ప్రొద్దున్నే

లేచినాడు విక్రం. ప్రమదను లేపినాడు. అన్నీ సిద్ధమా అన్నాడు. సిద్ధమే అంది. తల్లి వద్దకు వెళ్లి అమ్మా 10 గంటలకు మేము వెళ్ళిపోతాము అన్నీ ready యా అంది. అన్నీ రెడీ అమ్మా నీవు యిచ్చటే వుంటే అల్లుడుగారు ఆరు నెలలో వచ్చేవాడు కదా అంది. అమ్మో లేదు ఆయన యెక్కడ ఉంటే నేను కూడా అక్కడనే అంది ప్రమద. అవును తల్లీ అలానే కానిమ్ము అంది ప్రమదను ముద్దిడుకొని. విక్రం ముఖం కడుగుకొని టీ త్రాగుచున్నాడు. ప్రమదకూడా తన టీ కప్పుతో వచ్చి విక్రం ప్రక్క కుర్చీలో కూర్చుంది. యిద్దరూ తాగుతూ యేమి తీసుకువెళ్లాలి యేమి యిచ్చట విడిచి వెళ్లాలి అని మాటాడుకుంటున్నారు. కృష్ణమోహనునికి యీనాడు అన్నయ్య వదినమ్మ ప్రయాణిస్తున్నారని తెలియగానే ఉదయమే వచ్చి యిక్కడనున్నాడు. సరిత అక్క బావ పోతున్నారని అందువల్ల ఆనాడు స్కూల్‌కు సెలవు పెట్టి యింట్లో కూర్చుంది. యింక ప్రమదకు దగ్గరి స్నేహితులు కూడా వీరికి farewell చెప్పుటకు వచ్చినారు. రఘునాధరాయలు బిడ్డ అల్లుడు వెడుతున్నందుకు courtకు సెలవు పెట్టినాడు. బ్రాహ్మణునితో యే ముహూర్తాన యీ దంపతులు ప్రయాణము చేస్తే బాగుంటుందో తెలుసుకొని అప్పుడే పంపిస్తే బాగుంటుందని నిశ్చయించుకున్నాడు. 11 గంటలకు ముహూర్తం మంచిదని అన్నీ కారులో చిన్న చిన్న వస్తువులు యిద్దరి బట్టల suite cases లను సర్దుచున్నారు. డిక్కీలో అన్నీపట్టలేదు అందువల్ల వెనుక సీటులో light వస్తువులలో కొన్ని కాళ్లకాడ పెట్టి సర్దినారు పనిమనుషులు. ప్రమద విక్రంలిద్దరు ముందు కూర్చుంటారు. కాబట్టి యే సమస్యా లేకుండా వారితో తీసుకువెళ్లే సామానుకు అంతరాయం కాలేదు. అనుకున్న సమయం రానే వచ్చింది. ప్రమద తల్లిదండ్రి పాదాలకు నమస్కరించింది. రఘునాధరాయలు శ్రీ లక్ష్మి కన్నీటిని కప్పి పుచ్చుతున్నారు. యీనాడు కూతురు నిజమైన వీడ్కోలు కాబోలు అనుకున్నారు. అయినా ధైర్యంగా యెలా యిల్లు నడపాలి మున్నగు విషయాలు తెల్పుతున్నారు. విక్రం మాత్రం ఒక తెల్ల షర్టు ట్వీడ్ pant వేసి కారు దగ్గరగా నిలబడ్డాడు. మామగారికి నమస్కరించి కృష్ణమోహనుని కౌగిలించుకొని సరే ప్రమద బయలు దేరుదామా అన్నాడు. విక్రం అందరికి నమస్కరించి కారు యెక్కినాడు. కారు start చేసి right hand ను బయటికి పెట్టి wave చేసినాడు. ప్రమద కన్నీటితో అందరికి కారులో నుండి తల బయటికి పెట్టి wave చేసింది. యీనాడు నిజమైన వప్పగింతలు విక్రం కు జ్ఞాపకం వచ్చినవి. గేటు దాటింది. మరి ఒకసారి అందరికి bye చెప్పి వేగాన్ని యెక్కువ చేసాడు. కొన్ని నిమిషాలలో మారేడిపల్లి దాటి main road కు ప్రవేశించింది కారు. సిటీ దాటే వరకు మెల్లగానే నడిచింది. సిటీ దాటగానే విక్రం కారు spead ను యెక్కువ చేసినాడు. త్రోవలో యెన్నియో వూళ్లు దాటినారు. పల్లెటూళ్లు యిద్దరికి కొత్త కావుకాని ప్రమదకు అంత పాత కూడా కాదు. చిన్నప్పటినుండి అప్పుడప్పుడు కొత్త పండుగలకు తప్ప యెప్పుడు హైదాబాదులోనే వుండేది. ఆమె జీవితము ఆమె స్నేహితులు అంతా హైదాబాదుతోనే ముడివడి వున్నాయి. విక్రం జీవితం యించు మించు యింతే కాని విక్రం వూరు సిటీకీ దగ్గర కాబట్టి యితని తల్లి తండ్రి వూళ్లలో వుంటారు కాబట్టి విక్రం చాలా సార్లు తమ్ముడు కృష్ణమోహన్‌తో వూరుకు వెడుతుండేవాడు. కావి

college లో ప్రవేశించిన పిమ్మట వూరికి పోవుట చాలా తగ్గిపోయింది. యిప్పుడు కారు శరవేగంతో పోతోంది. ప్రమద యితని వళ్లో ఒరిగిపోయింది. కంట నీరు యింక ఆగిపోలేదు. ప్రమద యెలా వున్నావిప్పుడు అన్నాడు విక్రం. బాగానే వున్నాను అంది ప్రమద. నేనుండమన్నాను కాని నీవే వస్తానని పట్టు బట్టినావు. నేను నిన్ను కాదనలేక రమ్మన్నాను ప్రమద అన్నాడు విక్రం. యిప్పుడు ఎవరు కాదన్నారు. నా పూర్తి సమ్మతముతో నేను వస్తున్నాను. కాదంటే యిన్నాళ్ళ నుండి వున్న యింటిని తల్లి దండ్రులను విడచి వస్తున్నాననే బాధ తప్ప నాకిప్పుడేమి కొదువ. మీరే నా సర్వస్వం మీరు లేంది నాకు జీవితం ఉండదు యికముందు అంది ప్రమద. అలాగా అని ఒక గట్టి ముద్దు పెట్టుకున్నాడు విక్రం. కొంచెం నవ్వింది ప్రమద. విక్రం చేతిని ముద్దిడుకొని చెంపకు హత్తుకుంది. యిప్పుడు హైద్రాబాదునుండి బయలు దేరి రెండు గంటలయ్యింది. ఆనాడు రోడ్డుపైన తారు లేదు. కంకర పైన మట్టి వేసి రోలరు నడిపించిన రోడ్డులవి. ముప్పై మైళ్లకెక్కువ ప్రయాణం సాగదు. మధ్య మధ్యన గొర్రెలు, మేకలు, ఆవులు, బర్రెలు రోడ్డుపైకి వస్తుంటాయి. స్పీడు తగ్గించి మరి స్పీడు యెక్కువ చేయాలి అందుకే average spead యిరువై మైళ్లకు మించదు. యింకా మూడు గంటల ప్రయాణము. అచ్చటచ్చట ఆగి విశ్రాంతి తీసుకొనుటకు ఆనాడు మరి యీనాడు అటు వంటి అవకాశాలు లేవు. అందువల్ల అలసిపోయినా drive చేయవలసిందే. అందుకే విక్రం ప్రమదతో టీ త్రాగాలనిపిస్తుందా ప్రమదా అన్నాడు. మీకు అంది ప్రమద, నీకు త్రాగాలని వుంటే నాకు కూడా ఒక అరకప్పు సరిపోతుంది అన్నాడు.

పండ్లు తింటారా? అంది ప్రమద.

ఓ.యస్. అన్నాడు విక్రం.

అయితే ఒక నిమిషం ఆగండి! అని సంచిలో శ్రీలక్ష్మి కట్టిన ఒక సంత్రా వలచి నోట్లో పెట్ట బోయింది. నీవు కూడా తిను ప్రమద అన్నాడు సరే అని తాను తింటూ నాకు తినిపిస్తుంది. ఈ పండ్లు తిన్న పిమ్మట కొన్ని కారపుగారెలు తీసింది; నేను, ప్రమద తిన్నాము. పిమ్మట ఒక చిన్న గ్లాసులో నీళ్లు పోసి ఇచ్చింది. నీళ్లు త్రాగినాను పిమ్మట ఇద్దరం టీ త్రాగుతూ రానున్న మా సంసారాన్ని గురించి మాట్లాడుతున్నాము. ఈ విధంగా ఇద్దరము కారులో అయిదు గంటలు గడిపినాము. Official residence కు చేరుకున్నాము. అంటే నేనుంటున్న ప్రభుత్వపు ఇల్లు అన్నమాట. ఆ కాలంలో ఈనాడున్న టెలిఫోన్ సౌకర్యాలు లేవు కాబట్టి, మా ఇంట్లోనున్న మా Domestic staff కు మేము వచ్చే సంగతి తెలియదు. కారు ఇంటి ముందాగిన చప్పుడు వినగానే మా బంట్రోతు బయటికి వచ్చి మా కారులో నన్ను చూచి, సలాముకొట్టి నా కారు తలుపు తీసినాడు. ప్రమదను పెళ్లికి వచ్చినప్పుడు చూచినాడు. వీడి పేరు జమాల్. జమాల్ ప్రమద వైపుకు వెళ్ళి 'సలాం సాబ్' అని తలుపు తీసినాడు. ప్రమద నావైపు వచ్చింది. మేమిద్దరము ఇంటి మెట్లెక్కుతుంటే జమాల్ మమ్ములను అనుసరించాడు. వెనుక సీటులోనున్న సామాను తీసుకొని లోనికి రాగానే తక్కిన Domestic staff అంతా మాకు సలాము కొట్టి, మమ్ములనాహ్వానించినారు. జమాల్ మాత్రము నావద్దకొచ్చి సాబ్ కొంచెం

తాళపుచెవి ఇస్తారా? డిక్కీలోనున్న సామాను తెస్తానన్నాడు. విక్రం తాళపుచెవిని ఇచ్చినాడు. జమాల్ మరియు ఇంకొక మనిషి కారునుండి సామానులను తెచ్చి ఇంటిలో పెట్టినారు విక్రం, ప్రమదకు అందరి పేర్లు తెలిపి వాళ్ళ బాధ్యతలేమిటో చెప్పినాడు. యిక ఈనాటి నుండి ఇల్లు భారమంతా నీది అన్నాడు విక్రం. చూడండి 10 రోజులలో మన ఇల్లు ఎలా మారిపోతుందో అంది, చిరునవ్వుతో ప్రమద. అమ్మ! హైదరాబాదు వీడినంక మొదటిసారిగా నవ్విందనుకున్నాడు విక్రం. సరే! ప్రమదా వీళ్లంతా వున్నారు మరీ, నీవు యేమి చేస్తావో. ఇది నీ ఇల్లు, నీ సంసారము. ఆరు నెలల పిదప యెచటికి వెడతామో అటు పిమ్మట. నేను ఆఫీసుకు వెళ్లి రానా? సెలవా మరి! అన్నాడు విక్రం. సరే అన్నట్లుగా తల వూపింది. నవ్వుతో నాకు వీడ్కోలొసగినది కొన్ని గంటల తరువాత.

ఆఫీసుకెళ్ళి Charge తీసుకున్నాడు. అతని బల్లపై చాలా ఫైల్స్ నిర్ణయాలు తీసుకొనుటకై వుంచినారు. ఆఫీసు వాళ్లంతా పోగానే అర్జంట్ అని వ్రాసి వున్న ఫైల్స్ తీసి చూసి, సంబంధిత ఉద్యోగులను పిలిచి వారితో discuss చేసి dispose చేస్తూ వున్నాడు. ఆనాడు ఎవరికీ ఇంటర్వ్యూ ఇవ్వలేదు. ఫైల్స్‌తోనే ఆరు గంటలవరకు నిమగ్నమైయున్నాడు. విక్రంకు ఆరు గంటలైన సంగతి గుర్తుకు రాలేదు. గడియారం చూడగానే ఆరు గంటలు దాటింది. తక్కినవి రేపు చూడవచ్చునని లేచినాడు. తన కారులో ఇంటికి ప్రయాణమైనాడు. ప్రమద తన దేవుని కొరకు ఎదురు చూచినట్లు ఎదురు చూస్తూ కూర్చుంది.

విక్రం రాగానే ఇంత ఆలస్యంగా వచ్చినారే అంది.

ఆలస్యంగా వెళ్ళినాను కదా! అందుకే ఆలస్యం. రోజూ కూడా ఆలస్యం కావచ్చు. అయినా రేపటి నుండి ప్రత్యేకంగా నీకొరకై సమయానికి వస్తాను అన్నాడు.

ప్రమద పెండ్లి అయిన కొన్ని వారాలలో ఒకరిని విడిచి ఒకరము కొన్ని నిమిషాలైన వుండలేదు. ఇప్పుడు ఉద్యోగంతో నేను ఆఫీసులో, నీవు ఇంటిలో ఉండక తప్పదు ప్రమదా. ఈ ఎగ్జిక్యూటివ్ ఉద్యోగంలో చాలా పనులుంటాయి. It is thankless job, I say అన్నాడు విక్రం.

ఫరవాలేదు లేండి! నాకు అలవాటైపోతుంది అంది ప్రమద చిరునవ్వుతో. ఎలాగైనా ఇంటిపనులతో నిమగ్నమైయుంటాను. కాకపోతే పుస్తకాలు వుండనే వున్నవి. అవి కాకపోతే మేగజైన్లు, పేపర్లు తిరగేస్తాను అన్నది.

Thank you అని ఇద్దరూ కూర్చున్నారు. వంట మనిషి టీ తెచ్చి డైనింగ్ టేబుల్ మీద పెట్టినాడు.

నేను కలుపుతాను వేరే పని చూసుకో అంది ప్రమద వంటవాడితో.

సరే అమ్మగారూ! అని వంట మనిషి వెళ్లిపోయినాడు. టీ త్రాగుదాము రండి! అని విక్రం చేతులు పట్టి లేపింది ప్రమద. విక్రం డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నాడు. ప్రమద టీ కలుపుతుంది.

చక్కెర ఎంత వేయమంటారు అంది.

నీకు తెలియదా అన్నాడు విక్రం.

ఇక్కడ మీ వంట మనిషి కలిపిన టీ కదా మీరు త్రాగుచుంటిరి, అందుకే అడుగుచున్నాను అంది.

అది సరే కాని, ఇప్పుడు నా అర్ధాంగి వుంది. ఆమెకు నా రుచులు చాలమట్టుకు తెలియుననుకుంటా! కదా ప్రమదా దేవిగారు అన్నాడు విక్రం నవ్వుకుంటూ.

అవునండి విక్రమసింహగారు అంది ప్రమద.

ఈ డైలాగ్ తర్వాత ఇద్దరూ నవ్వుకున్నారు. ప్రమద టీ కలిపి విక్రంకి ఇచ్చింది. తను కూడా కలుపుకుంది.

ఎలా వుంది టీ రాజాగారూ అంది.

బాగుంది. వేరే తీరుగా వుంది అన్నాడు. అందులో అందమైన స్త్రీ చేసిన రుచి వేరే వుంటుంది సుమా! I am enjoying both the Tea and tea maker అన్నాడు చిలిపిగా చూస్తూ.

Bad fellow! అని వీపుపై చరిచింది. అబ్బా! చంపినావు అన్నాడు విక్రం.

ఈ దెబ్బకే ఇంతగా బాధ పడితే మీ పేరు విక్రమ సింహుడు మార్చి బక్కమ సింహుడని పెట్టాలి అంది ప్రమద.

ఇద్దరూ ఇలా సరసాలాడుకుంటూ టీ పూర్తి చేసినారు. పిమ్మట ప్రమద ఇల్లంత inspect చేశారా ప్రభూ అంది!

లేదు.

అయితే రండు అని ప్రతి గదికి తీసుకొని పోయింది. విక్రం వెడలినప్పటినుండి ప్రమద ఇంటిలోనున్న వస్తువులను re-arrange చేసింది. కొన్ని కొత్త వస్తువులను కొని తెచ్చింది. కొన్ని తన తండ్రి ఇంటివద్దనుండి తెచ్చినవి కూడా అమర్చింది. కొన్ని కొని తెచ్చింది ఆ వూరిలోనే.

అయితే ఆ మార్పు మరి arrangement చాలా నచ్చింది. Very good ప్రమద. నీవు ఈ ఇల్లునే మార్చివేసినావు. ఇప్పుడు ఇది నిజమైన గృహిణి వుండే ఇల్లు. ఇంతవరకు ఇది Batchular quarter ఇప్పుడు ఇది home! sweet home సుమా! అని చాలా మెచ్చుకున్నాడు.

ప్రమద చాలా పొంగిపోయింది. విక్రంను కౌగిలించుకొని ముద్దిడుకోవాలనుకుంది. కానీ అందరూ పనివారలున్నందున అంత సాహసము చేయలేదు.

మీకు నిజంగా నచ్చినదా అంది ప్రమద

అవును! నిజంగా ప్రమదా ఒక professional decorater, decorate చేసినట్లుగా వుంది యీ ఇల్లు అన్నాడు విక్రం.

అయితే యిలా రండి! ఇంకా మరికొన్ని చూపిస్తా. తిన్నగా బెడ్ రూంలోకి చెయ్యిపట్టి తీసుకెళ్ళింది. రూంలోకి పోగానే కొంచెం చాటు చేసుకొని నా decoration నచ్చిందా! అని తన చెంపను చూపింది.

విక్రం కనుక్కున్నాడు! గట్టిగా కౌగిలిలోకి లాక్కొని చెంపపై గట్టిగా ముద్దిడుకున్నాడు. పిమ్మట గది తలుపులు వేసి మంచముపై పరుండబెట్టి ఇంకా ముద్దిడికొన్నాడు. ప్రమద కూడా విక్రంను ముద్దిడికొని ఒకరిని ఒకరు గట్టిగా కౌగిలించుకున్నారు. ప్రమద, విక్రంలు పరవశులై అర గంటవరకు అలాగే వున్నారు. పిమ్మట నిద్రించినారు.

గంట వరకు గానీ యీ ప్రపంచములోకి మరలి రాలేదు. రాగానే బాత్‌రూంలోకి వెళ్ళి దువ్వుకొని, బట్టలు సవరించుకొని హాల్‌లోనున్న సోఫాపై కూర్చున్నారు.

వంట అయ్యింది అమ్మా అన్నాడు వంట మనిషి.

సరే వడ్డించు అంది ప్రమద.

సరేనని వంటవాడు అన్నీ టేబుల్‌పై అమర్చాడు.

రండి! భోంచేద్దురుగాని అని విక్రంతో అంది.

సరేనని ప్రమద ననుసరించాడు విక్రం. ఇద్దరూ కూర్చున్నారు టేబుల్ వద్ద. ప్రమద విక్రంకు వడ్డించి, తను వడ్డించుకుంది.

వంటవాడు మరి ఇంకో మనిషి టేబులుకు కొద్ది దూరములో attentive గా నిలబడివున్నారు.

ఇవ్వాళ అన్నీ రుచిగా నున్నవే అన్నాడు మెల్లగా ప్రమదతో.

అందులో నా ప్రమేయమేమి లేదు. ఇవన్నీ పాపం వంటాయనే వండినాడు. చూడబోతే మంచి వంట మనిషిగా నున్నాడు అంది ప్రమద.

అలానా! అన్నాడు విక్రం తింటూ.

పెరుగు కూడా బాగుందన్నాడు. అందులో నా కంట్రిబ్యూషన్ కొంచెం వుంది కాబట్టి కొంచెం క్రెడిట్ నాకు రావాలి సుమా! తక్కిందంతా ఆ వంటమనిషికే పోవాలి క్రెడిట్ అంది ప్రమద.

భోజనాలు ముగించిన పిమ్మట ప్రమద తాను చేసిన స్వీట్ తెమ్మంది.

తెచ్చినాడు వంటవాడు. ప్రమద చిన్న గిన్నెలో పెట్టి విక్రంకు ఇచ్చింది.

ఇది ఏమి స్వీటు ప్రమదా అన్నాడు.

యేం బాగాలేదా? అంది ప్రమద.

అలాకాదు యేమిటిది కొత్తగా వుంది అన్నాడు.

యేదో Cook Book లో చూసి ఆ recipe తో తయారుచేసాను అంది.

Not bad! ఇలా రోజూ తింటే ఒక నెలలో నా బరువు చాలా పెరుగుతుంది సుమా! అన్నాడు ప్రమదతో.

మీరు మరచిపోవద్దు, మీ శరీరమిప్పుడు నా సొత్తు. దాన్ని అతి జాగ్రత్తగా చూసుకొంటాను నేను. మీరు ఆ విషయమై భయపడనవసరం లేదు అంది.

ఇక మీ శరీరాన్ని (అంటే ప్రమద శరీరము) మీరు బాగా చూసుకుంటారో లేదో మీ యిష్టం అంది. నేను చెప్పినట్టు నడుచుకుంటే, నీ శరీరము, నా శరీరము బాగానే వుంటాయి సరేనా! అన్నాడు విక్రం. (విక్రం, ప్రమద మొదటి రాత్రిలో వీరిరువురి శరీరాలను ప్రమదపించింది. నా శరీరం మీది. మీ శరీరం నాది యినాటి నుండి మీ శరీరాన్ని నా శరీరంగా అతి జాగ్రత్తతో చూచుకుంటాను. ఇక నా శరీరాన్ని, మీ శరీరంగా కడు జాగ్రత్తతో చూచుకుంటానని ప్రమాణం చేయించుకుంది. ఇద్దరు ప్రమాణాలు చేసుకున్నారు వాళ్ల మొదటి రాత్రి సంసార జీవితంలో).

రోజులు దొర్లిపోతున్నాయి. ప్రమద ఇప్పుడు ఈ ఇంట్లో సర్వాధికారి. ఆమె భర్తకు యే చిక్కులు లేకుండా చూసుకుంటున్నది. అప్పుడప్పుడు ఆ వూరి పెద్దలకు (అంటే యిదొక ముఖ్యమైన తాలూకా) మరి ఇతర ఆఫీసర్స్‌కు డిన్నర్‌కై తన ఇంటికి invite చేస్తుంది. అందరూ అసిస్టెంట్ కలెక్టరు ఇంట్లో డిన్నర్ అంటే తప్పకుండా వస్తారు. ఆ కాలంలో ఈ executive position కు చాల prestige వుండేది. ఇంకను హైదరాబాదు ఫ్యూడల్ వ్యవస్థా గుర్తులు చాలా వరకు మాసిపోలేదు. చాలా మంది జిల్లా కలెక్టర్లు H.C.S. పొందినవారే. ఆంధ్రప్రదేశ్ ఇక కొన్ని రోజులలో ఏర్పాటు అవుతుంది. చాలా మంది ప్రత్యేక తెలంగాణా వాంఛించి నెహ్రూవల్ల నిరాశ చెందివున్నారు. ఆంధ్రులకు తెలంగాణాను ఆంధ్రలో కలుపుకొని హైదరాబాదు రాజధానిగా ఏర్పాటు చేసుకోవాలన్న ఆకాంక్ష చాలా వుంది. ఆంధ్ర రాష్ట్రానికి మద్రాసు రాజధానిని ఇవ్వాలని నిరహారదీక్ష చేసి ప్రాణాలొడ్డినారు శ్రీ పొట్టి శ్రీరాములు. పిమ్మట అరాచకము చెలరేగింది. ఆంధ్రలో అందుకే ఆంధ్ర రాష్ట్రాన్ని వేరుచేసినారు. కర్నూలు రాజధానిగా చేసికొని ఆంధ్రులు సంతోషంగానున్నారు. వారంతా తెలంగాణా ఆంధ్రలో కలిపి విశాల ఆంధ్రగా చేయాలని ఆంధ్రుల పట్టు. లేదు మాకు ప్రత్యేక తెలంగాణ కావాలని మేము మా 9 జిల్లాలతో వేరే ప్రత్యేక తెలంగాణ రాజ్యంగా వుండిపోతామని తెలంగాణ వాసులు. అయితే తెలంగాణలో కూడ తెలంగాణ ఆంధ్రలో కలసిపోవాలన్నవారు కూడ లేకపోలేదు. State Re-organisation Committee కూడ ప్రత్యేక తెలంగాణానే నిర్ణయించాలని తన కమీషన్ రిపోర్టులో తీర్మానించింది. కానీ నెహ్రూ దానిని కాదని తెలంగాణా 9 జిల్లాలను ఆంధ్రలో కలిపి ఆంధ్రప్రదేశ్‌గా 1956 నవంబరునాడు ఈ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని సృష్టించింది నెహ్రూ ప్రభుత్వము. చాలా కాలంవరకు తెలంగాణ వాసులకు, ఆంధ్ర వాసులకు సుహృద్భావాలు నెలకొనలేదు. అందుకే మరొక మారు 1970లో అనుకుంటా! మరోసారి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ప్రారంభమయ్యింది. ఇది కొన్ని రోజులు నడచి చల్లారింది. ఈ విధంగా బలవంతంగా ఒకటిగా చేసిన రెండు రాష్ట్రాలు ఒక రాష్ట్రంగా మారిపోయింది. ఇప్పుడు ప్రత్యేక తెలంగాణ ఉద్యమం చరిత్రలోనే మిగిలిపోయింది.

ప్రమద ఆ వూరి పెద్దలందరికి తెలిసిన వ్యక్తే. చదువుకుంది, చాలా అందమైనది, అసిస్టెంట్ కలెక్టరుకు భార్య. అందులో చాలా Social organisation లో పనిచేస్తుంది. ప్రతి Function attend చేస్తుంది. కాబట్టి ఆ పట్టణంలో అందరికి తెలుసు ప్రమద అంటే యెవరో. భర్త Subordinate Office లకు inspection కు వెళ్ళినప్పుడు ఈమె కూడా వెళ్ళేది. అందువల్ల వూళ్ళలలో కూడా ఈమెను చాలమంది యెరుగుదురు.

ఇంట్లో పనివాండ్లకు అంతా నేర్పింది. ఎట్లా మెలగాలి, యెలా ఇల్లును మంచిగా decorate చేసి వుంచాలి. ఒకనాడు యేదైనా వస్తువు అది వుండే చోట వుండకుంటె అప్పుడు ఇంటి పనివారందరిని ఒక చోటకూర్చి ఆ వస్తువు అలా ఎందుకు లేదని explanation అడిగేది. అందువల్ల పనివారంతా అటువంటి అవకాశము రాకుండా చూచుటకు ప్రయత్నించే వాళ్ళు.

ఇప్పుడు ఆ ఇల్లు స్వర్గసీమగా కనబడుతుంది. తన ఆఫీస్ పనిమీద చాలా శ్రద్ధ చూపిస్తున్నాడు. Office staff కూడ efficiency ని పెంచినారు. ప్రతిది సాఫీగా సాగిపోతుంది. చూస్తుంటే అయిదు నెలలు గడచినాయి. ఇక విక్రంకు బదలీ కలెక్టర్‌గా వస్తుంది.

అబ్బ! కాలం నిమిషాలుగా దొరలిపోయింది. ప్రమద లేకుంటే ఎంత బోర్‌గా వుండేదో అనుకున్నాడు విక్రం. తనకెప్పుడు బదిలీ వస్తుందా అని ఎదురు చూస్తున్నాడు. చూస్తుండగానే బదిలీ రానే వచ్చింది. అయిదేళ్ళుగా అసిస్టెంట్ కలెక్టర్‌గా ఒకే చోట పనిచేసి మంచి పేరు తెచ్చుకున్నాడు విక్రం. ఇతని పై అధికారి విక్రం విషయమై చాలా బాగా సెక్రటేరియట్‌కు వ్రాసినాడు. అందువల్ల సెక్రటేరియట్‌లో డిప్యూటి సెక్రటరిగా హోం శాఖలోకి బదిలీ జరిగింది. ఆ విషయాన్ని ప్రమదకు చూపించినాడు.

Very good! నేను, మీరు అనుకున్నట్లే జరిగింది అంది ప్రమద. మళ్లీ మన జీవితం హైదరాబాదులో సాగుతుంది హాయిగా అంది.

Yes! అన్నాడు విక్రం.

ఇప్పుడు విక్రంలో బలీయమయ్యింది అయన కాంక్ష అతను ఎమ్.ఏ, పూర్తి చేసి అమెరికాకు వెళ్లి అర్థికశాస్త్రంలో పి.హెచ్‌డి. చేయాలని. కాని ప్రమదకు తెల్పలేదు. తాను ఐ.ఎ.ఎస్. ప్రథమ దశలోనే ఆ నిర్ణయానికి వచ్చినాడు. కాని ఆ నిర్ణయాన్ని ఎవరితో ప్రస్తావించలేదు కాలక్రమేణా ఆ కోరిక తగ్గుతుందనుకొన్నాడు. కాని ఆ కోరిక అతనిలో గట్టి పడుతూ వచ్చింది. విక్రంకు Scholarly life అంటే చాలా ఇష్టం అచార్యునిగా తాను కావాలని అతని మహా కాంక్ష అందుకే మెడికల్ కాలేజ్‌లో ఒకనాడు గడపలేదు. చిన్నప్పుడు డాక్టర్ కావాలని కోరిక వుండేది. దాన్ని సునాయాసంగా సాధించినాడు, కాని కాలేజిలో ఆ శవాలను, వాటి ప్రక్కన ఆ శవాలను కోస్తూ పనిచేస్తున్న విద్యార్థులను చూసినంక ఇది తన భవిష్యత్తు కాదని వదలినాడు. పిమ్మట బి.ఏ.లో ఎకనామిక్స్‌లో చేరినాడు. ఎమ్.ఏ. మొదటి సంవత్సరము కూడా ఆ సబ్జెక్టుతోనే చేసినాడు. కాని మధ్యలో అనుకోకుండా ఐ.ఏ.ఎస్. వచ్చింది అనాడు ఐ.ఏ.ఎస్. అంటే చాలా influential job అందువల్ల అయిదేండ్లు ఐ.ఏ.ఎస్. అఫీసర్‌గా ఆ చిన్న పట్టణంలో $4\frac{1}{2}$ ఏళ్లు యెటులనో తన బాధ్యతను నిర్వహించాడు. పిమ్మట తను వరించిన వనితను పెళ్లి చేసుకున్నాడు. ఆమె తన జీవితంలో ప్రవేశించి 5 నెలలైనా అయిదు దినాలుగా గడచిపోయినవి. ఇప్పుడు ఒకరిని వీడి ఒకరు క్షణం మాత్రం వుండలేరు. పట్టణం పోవుటకు అచ్చట ఒక Desk job దొరికింది. ఆ సమయాన్ని వృధా చేయకుండా ఇద్దరూ ఎమ్.ఏ. ఫైనల్ పూర్తి చేయాలని నిశ్చయించుకొన్నారు. సిటిలో స్థిరపడ్డాక U.S. Universities తో కరెస్పాండెన్సు చేయాలని అడ్మిషన్ మరి Assistantship కు అన్నీ నిర్ణయించుకున్నాడు. యెప్పుడు రిపోర్టు చేసే అఖరు దినమని మరి ఒకసారి ఆ వచ్చిన అర్డర్సును చూచుకున్నాడు. తనను relieve చేసే అఫీసర్‌గారు ఎప్పుడొస్తాడో అని ఎదురు చూస్తున్నాడు.

విక్రం వద్ద charge తీసుకొనుటకు ఒక fresh I.A.S. రానే వచ్చాడు. రాగానే అచ్చటి డాక్ బంగ్లాలో దిగి తన భార్యతో సహా విక్రంను కలయుటకు ఇంటికి వచ్చాడు. రాగానే విక్రం అతన్ని, అతని సతిమణిని ఆహ్వానించినాడు లోపలికి.

ప్రమద వంట పనులతో నిమగ్నమైయుండగా విక్రం, ప్రమదా! అని పిలిచెను.

ఆమె రాగానే ఇతడు Mr. Chandrasen, I.A.S., ఇతని పత్ని మోనీషా సేన్ అని పరిచయం చేశాడు. ప్రమద, మోనీషా మాట్లాడుకుంటున్నారు డైనింగ్ టేబుల్ వద్దనున్న Chairs పై కూర్చొని.

విక్రమ సింహుడు, చంద్రసేన్ సోఫాపైన కూర్చొని మాట్లాడుచున్నారు. ప్రమద వంట మనిషిని పిలిచి టీ మరి ఏదైనా టిఫిన్ చేసి తీసుకరా అంది.

సరే అమ్మ! అని వెళ్లిపోయాడు ఆ వంటమనిషి.

టీ తేగానే ప్రమద మీరు వచ్చి టీ త్రాగండి అంది.

విక్రం, చంద్రసేన్ ఇద్దరు వచ్చి డైనింగ్ టేబుల్ వద్ద కూర్చున్నారు. ప్రమద టిఫిన్ అందరికి చిన్న ప్లేట్స్‌లో పెట్టి ఇచ్చింది. తక్కింది టేబుల్ పైన వుంచి, please help yourself అంది. పిమ్మట టీ కలిపి ముగ్గురికి ఇచ్చింది. తను కూడా కలుపుకుంది. టీ తాగుతూ యేవేవో మాట్లాడుకున్నారు.

విక్రం, చంద్రసేన్‌తో కలకత్తానుండి ఇక్కడికి ఎలా వచ్చినారేమిటి అన్నాడు. నేనే ఇచ్చటికి opt చేశాను. హైదరాబాదు అంటే నాకు, నా సతీమణికి చాల ఇష్టము.

మా బంధువులు కూడా ఉన్నారిచ్చట అన్నాడు చంద్రసేను. ఇలా చాలా సేపు మాట్లాడిన పిమ్మట మళ్ళీ కలుస్తాము అని చంద్రసేన్ లేచినాడు. మరి మీ భోజనమెక్కడ, మీరు వుండటం యెక్కడ అన్నాడు విక్రం.

ప్రస్తుతానికి డాక్ బంగ్లాలో వుంటున్నాము. ఇక భోజన విషయము ఆలోచించాలి అన్నాడు చంద్రసేన్.

డాక్‌బంగ్లా ఫరువాలేదు. నేను కూడా ఈ ఊరికి క్రొత్తగా వచ్చినప్పుడు బహుశ ఒక రోజు అందులో వున్నాననుకుంటా. కానీ భోజనం మాత్రం మా ఇంట్లోనే చేయండి అన్నాడు ప్రమదను చూస్తూ.

యేమంటావు ప్రమద అన్నాడు విక్రం.

O, sure! అంది ప్రమద నవ్వుతూ...

చంద్రసేన్ భార్యతో can I call you Monisha. Certainly అంది. మోనీష then please come for dinner అంది. మోనీష, చంద్రసేన్‌లు సరే మళ్ళీ సాయంకాలం కలుద్దాం అని వెళ్లిపోయినారు.

చంద్రసేన్ మరి మోనీషాలు వెళ్లిపోగానే ప్రమద వంట మనిషిని పిలిచి ఇవ్వాళ మన ఇంటికి చంద్రసేన్ అనునతడు వచ్చాడు. మేము ఈ మూడు, నాలుగు రోజులలో పట్టణం వెళ్లిపోతాము. అయ్యగారికి పట్టణానికి బదిలీ అయ్యింది. ఈ రెండు మూడు రోజుల పిమ్మట ఆయన, ఆయన భార్యకు మీరు మాకు మీ సేవలనందించినట్లే వారికి కూడా అందివ్వాలి అంది ప్రమద.

అవునా! అమ్మగారు, యెందరో ఈ ఇంట్లో వుండి పోయింద్రుకాని మీ అటువంటి అమ్మగార్లను నేను తక్కువ చూచినాను అమ్మా అన్నాడు ఆ వంటమనిషి.

ఇది ఉద్యోగం, జీవితం. రాను రాను ఇంకా యెందరెందరిని చూస్తావో నీ జీవితంలో. మేము కూడా యెంత మంది సేవలకు నోచుకున్నామో అంది ప్రమద.

సరే! వంట వస్తువులు అన్నీ వున్నాయా అంది ప్రమద.

అన్నీ వున్నాయమ్మ. కూరలు యేమి చేయమంటారు అన్నాడు రామదాసు.

రామదాసుకు కొంత డబ్బు ఇచ్చి చేపలు, మాంసము మరి ఒకటి రెండు కూరగాయలు కొని తెమ్మంది.

సరే! అని ఆ వంటమనిషి స్వయంగా మార్కెటుకు వెళ్లినాడు. పిమ్మట కొంత సేపటికి వచ్చి వంట మొదలు పెట్టినాడు. అప్పటికి 8–00 గంటలు కావస్తుంది.

రామదాసు ఆ కొత్త ఆఫీసర్ ఎప్పుడైనా రావచ్చు, వంటలు అయితే బల్లపైన పెట్టు అంది ప్రమద.

సరే! అమ్మగారు 10 నిమిషాలలో అన్ని బల్లమీద వుండగలవని చెప్పినాడు.

ఇంతలో కారు ఆగిన శబ్దము వినబడింది. చంద్రసేన్, మోనీషా ఇంట్లోకి వస్తున్నారనుకొని గుమ్మంవద్దకి ప్రమద, విక్రం వెళ్లినారు. Greetings పిమ్మట నలుగురు హాలులో కూర్చున్నారు. మోనీష, ప్రమద అప్పుడు పాత స్నేహితులవలే మాట్లాడుకుంటున్నారు.

ఈ credit ప్రమదదే అనుకోవాలి. ఆమె చాలా social మనిషి. యెవరైనాకాని తన ఇంటికి వచ్చినా, తను యెవరి ఇంటికి వెడలినా చాలా కలగలుపుతో వాళ్లతో పాత స్నేహితులుగా, పాత చుట్టాలుగా కలిసిపోతుంది. A very good conversationalist కూడా.

కానీ అది విక్రంకు లేదు. చాల reserve! అడిగిన దానికి సమాధానమిస్తాడు. కాకపోతే వారిని చూసుకుంటూ కూర్చుంటాడు. అందువల్ల అందరూ ఇతడు చాలా proud అనుకుంటారు. పాపం ఇతనికి proud అనేది లేదు. ఇతనిని సరిగ్గా అర్థం చేసుకున్న మనుషులు చాల తక్కువ. తప్పు అర్థం చేసుకున్న వాళ్లు చాల యెక్కువ. తనతో అయిన న్యాయసమ్మతమైన పనులు తప్ప న్యాయానికి విరుద్ధమనుకొన్న పనులు యెవరు చెప్పినా చేయడు.

విక్రం ప్రవృతికి, ప్రమద ప్రవృతికి భూమి, ఆకాశానికున్నంత భేదముంది. అయినా ఒకరిపైన మరొకరికి గాఢమైన ప్రేమ. భర్త విషయమై ఏమైనా, ఎవరైనా అంటే తల్లి, తండ్రి మరి స్నేహితులేగాని అంటే ప్రమద తక్షణమే వాళ్లకు సరియైన సమాధానము ఆ క్షణమే వినిపిస్తుంది.

ఆమె విక్రంను తన ప్రాణానికన్న మిన్నగా ప్రేమిస్తుంది. విక్రం కూడా ప్రమద అంటే చాలా ప్రేమ. కానీ ఈ ఇద్దరిలో ప్రమద ప్రేమయే గొప్పయని చెప్పక తప్పదు.

విక్రం, చంద్రసేన్ ఇద్దరూ ఒకే సోఫాపైన కూర్చున్నారు. విక్రం యేదో ఒకటి రెండు ముక్కలు మాట్లాడినాడు. మొదట మీరు ఐ.ఏ.ఎస్. యే batch, పిమ్మట

యే కాలేజి నుండి మీరు graduate గా బయలుదేరినారు, యే subject అని కొన్ని విషయాలు అడిగి వూరుకున్నాడు.

చంద్రసేన్ జూనియర్ కాబట్టి, సీనియర్ మరి యేమి మాట్లాడుకోవాలి అని వూరకున్నాడు లేదా విక్రంకు మళ్ళీ good conversationalist కాదో యేమో. విక్రం మాట్లాడిన పిమ్మట చంద్రసేన్ యేమీ మాట్లాడలేదు. కాని మోనీష, ప్రమద చాలా మాట్లాడుతున్నారు. కాలేజి మొదలుకొని వారి subjects, వారి parents, వారి in laws మొదలగునవన్ని ఇంగ్లీషులో మాట్లాడుకుంటున్నారు. మోనీషకు, ప్రమదకు link language ఇంగ్లీషు తప్ప యేదీ లేదు. మోనీషా మాతృభాష బెంగాలి, ప్రమద తెలుగు వనిత. కాబట్టి వీరి సంభాషణ సాగుతూనే వుంది. విక్రం, చంద్రసేన్‌ను మాత్రం నిశబ్దంగా కూర్చున్నారు.

చంద్రసేన్ విక్రంను గర్విష్ఠి అనుకుంటాడేమో అని లోపల భయపడుతు వున్నాడు.

ఈ మౌనాన్ని బ్రేక్ చేయుటానికి are you feeling hungry అన్నాడు విక్రం.

not really అన్నాడు చంద్రసేన్.

ఇక ఏమీ మాట్లాడాలే భగవాన్ అనుకున్నాడు విక్రం. ఇక లాభం లేదు అనుకొని ప్రమదతో when are we eating madam అన్నాడు.

Any time you both are ready.

I am ready, అన్నాడు విక్రం.

సరే రండి! అని మోనీషాతో మాట్లాడుకుంటూ డైనింగ్ టేబుల్ వద్ద నున్న కుర్చీలలో మోనీషా, ప్రమద పాత చూట్టాలవలే ఇంకా మాట్లాడుతూ కూర్చున్నారు.

విక్రం, చంద్రసేన్‌లు కూడా కూర్చున్నారు.

రామదాసు వడ్డిస్తున్నాడు. మూతలు తీసి వాళ్ళను అడుగుతున్నాడు.

ఇది చేప తింటారా!

ఇది మాంసము అనుకుంటూ వడ్డిస్తున్నాడు.

అన్నీ బాగున్నాయని తింటూ అన్నారు.

అమ్మ! బ్రతికి బయటపడ్డాను అనుకున్నాడు రామదాసు.

భోంచేస్తూ కూడా ప్రమద, మోనీషా మాట్లాడుకుంటున్నారు. పిమ్మట కూడ సోఫాలపైన వీరి మాటలు సాగుతూనే వున్నాయి. విక్రం ఇది గమనించి ఇద్దరు conversational experts అని లోలోన నవ్వుకున్నాడు.

మరునాడు ఉదయం సమయం 10 గంటలకు విక్రం ఆఫీసుకు వెళ్ళినాడు. అప్పటికే చంద్రసేన్ ఆఫీసులో విక్రంకొరకు కాచుకొని వున్నాడు.

మోనీషా ఎక్కడ అన్నాడు విక్రం.

డాగ్‌బంగ్లాలోనే వుంది అన్నాడు.

అలా ఎందుకు చేశావు, మా ఇంట్లో drop చేయక పోయినావా! ప్రమదతో వుండును అన్నాడు.

యేమో అది నాకు తట్టలేదు అన్నాడు చంద్రసేన్.

సరే! అని డ్రైవర్‌ను పిలిచి డాక్‌బంగ్లాలో ఈ అయ్యగారి భార్య వుంది, తీసుకెళ్లి అమ్మవద్ద వదలిపెట్టి రమ్మన్నాడు. సరే అని డాక్‌బంగ్లాకు వెళ్లినాడు డ్రైవర్.

అయ్యగారు మిమ్ములను అమ్మగారి వద్ద వదలమన్నాడు అన్నాడు.

సరే ఒక 15 నిమిషాలు ఆగు అని డ్రైవర్‌తో అంది పిమ్మట బట్టలు మార్చుకొని 15 నిమిషాలలో వచ్చి కారులో కూర్చుంది. మరి 20 నిమిషాలలో డ్రైవర్ ప్రమదవద్ద మోనీషాను విడచి విక్రం ఆఫీసుకు వెళ్లిపోయినాడు.

మోనీషాను చూడగానే ప్రమద రావమ్మ మోనీషా అని లోనికి ఆహ్వానించింది.

ఇద్దరూ కూర్చొని మళ్ళీ వారి యెడతెగని మాటలు ప్రారంభించినారు.

మోనీషా ఇప్పుడు ప్రమదను దీదీ అని సంభోదిస్తుంది. మోనీషా పెండ్లయ్యి మూడు నెలలే అయ్యిందట.

అలానా! అని ప్రమద ఈ వూరికి అసిస్టెంటు కలెక్టరుగా అందరు నూతన దంపతులే వస్తారాయేమి ఇక ముందు అంది నవ్వుకుంటూ.

Office లో విక్రం charge యిచ్చే list అంతా తయారు చేయిస్తున్నాడు. ofice staff list సిద్ధంగా చేస్తున్నారు. వీరిద్దరు మాటాడుకుంటున్నారు. యింతలో యెవరో విక్రంకు కార్డు పంపినారు. ఆ కార్డు పంపిన మనిషి ఆ వూరి chamber of commerce president. రమ్మని కబురంపాడు. అతను నమస్కారం చేస్తూ లోనికి ప్రవేశించాడు. విక్రం అతన్ని చంద్రసేనుకు పరిచయం చేస్తూ వీరు యీ వూరికి నా స్థానంలో పనిచేయుటకు వచ్చిన కొత్త Asst., కలెక్టరుగారు అన్నాడు. అతడు చంద్రసేన్‌కు నమస్కరించి నిలబడ్డాడు. కూర్చోండి అని అతనికి కుర్చీ చూపించి చంద్రసేన్‌తో మాటాడటం తాత్కాలికంగా ముగించి యేమి మీరు దయచేసిన కారణం అన్నాడు విక్రం. ఆ వర్తక chair person మీరు మాకు కొంచెం సమయాన్ని ప్రసాదించాలె. విక్రం అశ్చర్యంతో నేనా ప్రసాదించేది. చెప్పండి నాకు వీలైతే తప్పకుండా ప్రసాదిస్తాను అన్నాడు నవ్వుకుంటూ. అయితే రేపైనా యెల్లుండి అయినా మీకు మీ సతీమణికి వీడ్కోలు విందు. మరి యీ కొత్త దొరవారికి ఆహ్వాన విందు యివ్వాలని మా chamber of commerce ప్రధాన అధికారి అన్నాడు. సరే వీరినడిగండి నేను మా ఇంట్లో అడిగి చెబుతాను అన్నాడు. చంద్రసేనుడు కూడా మా ఇంట్లో అడిగి మేమిద్దరము ఒకే సారి చెబుతాము అన్నాడు. సరే రేపు ఉదయం కలుస్తా అని ఆయన యిద్దరికి నమస్కరించి వెళ్లి పోయినాడు. పిమ్మట విక్రం చంద్రసేనుకు office విషయము అందులో నున్న staff విషయమై విపులంగా చంద్రసేన్‌కు explain చేసి వాళ్ల confidential files ముట్ట చెప్పినాడు. అంతలో office time అయిపోయింది. యిద్దరూ office నుండి బయటకు వచ్చి విక్రం కారులోనే కూర్చున్నారు. పిమ్మట విక్రం యింటికి వచ్చినారు. యిద్దరూ యింట్లో ప్రవేశించగానే ప్రమద మోనీషా యిద్దరికీ స్వాగతం అన్నారు. నవ్వుకుంటూ పిమ్మట తమ మాటలలో లీనమైనారు. కొంతసేపటికి ప్రమద రామదాసుతో యిద్దరి అయ్యగార్లకు మరి మాయిద్దరికి టీ సిద్ధం చేయవా రామదాస్ అన్నది. సరే అమ్మా అని అతడు యేదో (snak) స్నాక్ చేయుటకై నీళ్లు పెట్టినాడు. స్నాక్

కాగానే నలుగురికి నాలుగు ప్లేట్లలో పెట్టి బల్లపైన వుంచి ప్రమదతో అమ్మా ఆ స్నాక్స్ తిన్నాక టీ చెస్తానని చెప్పి టీ కొరకై వంట యిట్లోకి పోయినాడు. విక్రం, చంద్రసేన్ చేతులు తుడుచుకుంటు వచ్చి బల్ల వద్ద కుర్చీల మీద కూర్చున్నారు. మీకు టీ అవసరము లేదా అన్నాడు విక్రం మొనీషా మరి ప్రమదల వైపు నవ్వుతూ చూస్తూ. మా మొనీషాకు మాటలుంటే, మాటాడువారుంటే బ్రతికిపోతుందిలెండి అన్నాడు చంద్రసేన్. చాలు కూర్చోండి అంది మొనీషా చంద్రసేనుని సంభోధించి. పాపము మాటాడనివ్వండి అన్నాడు నవ్వుతూ విక్రం. మేము వెడలి పోతే ప్రమద వుండదు గదా అందుకే యీ రెండ్రోజులు మాటాడుకోనివ్వండి అన్నాడు విక్రం. నలుగురు స్నాక్స్ తినేసినారు. టీ రామదాసు అంది ప్రమద. యిదుగో తెస్తున్నా మేమ్‌సాబ్ అన్నాడు రామదాసు. టీ రాగానే ప్రమద కలిపి ఒకరికి ఒకరికి యిచ్చింది. నాలుగవ కప్పులో తనకు కలుపుకొంది. అందరూ టీ ముగించి కొంచెంసేపు మాటాడుకొన్న పిదప చంద్రసేన్ మొనీషా డాక్ బంగ్లాకు వెళ్ళినారు. విక్రం ప్రమద ఆ యింట్లోనే ఉండి పోయినారు. చంద్రసేన్‌పోగానే విక్రంతో ప్రమద మొనీషా చాలా మంచిదండి నన్ను దీది దీది అంటూ నా వెంబడీ ఉంటుంది. నాకు bore అనేది లేకుండ పోయింది. యీ రెండు రోజులనుంచి అంది ప్రమద. యిక రెండు రోజులలో మనము వెడలి పోతాము పిమ్మట మళ్లీ యెప్పుడు కలుస్తామో యీ జీవితాలు యింతే ప్రమద. ఎవరితోనో బంధాలు యేర్పడుతాయి ఆ బంధాలు గట్టి పడినాకనో లేక గట్టి పడకముందో మనము ఆ బంధాలను విడచి పోవలసిఉంటుంది. యిది జీవితములో నున్న సాధారణ విషయము. మన జీవితములో యిది మొదటి బంధం. దీనిని గట్టి చేసుకొనుట మంచిది కాదు అన్నాడు విక్రం. రెండు రోజులలోనే మొనీషాకు నాకు యింతగా గాఢమైన అనురాగబంధ మేర్పడింది. I will miss her when we leave this place అంది విక్రం వడిలోకి వచ్చి. sorry ప్రమద. యీ రాగానుబంధాలే మన దుఃఖానికి కారణము కాని ఆ బంధాలు లేనప్పుడు జీవితమే నిస్సారము. అందుకే మహర్షులనువారు ఆ బంధాలనే పెంచుకోరు. తామరాకుపైన నీటిబిందువులవలె జీవితాన్ని సాగిస్తారు. అందుకే వారే నిజమైన విజ్ఞానులు. మనము అలా వుండలేము. మనము ప్రేమ అనురాగబంధాలలో బంధింపబడతాము. అందుకే యీ బంధాలు తెగిపోయినప్పుడు మనము దుఃఖసాగరములో మనిగిపోతాము. బంధాలలో చిక్కుకొననేల మరి దుఃఖసాగరములో మునిగిపోనేలా చూడు మన యిరువురము యీ ప్రేమబంధాలలో గట్టిగా బంధింపబడ్డాము. దేవుడు మన మీద దయను తగ్గించి నీకైనా నాకైనా శాశ్వితంగా యీ ప్రపంచము నుండి ముక్తి కలిగిస్తే ఊహించలేనంత దుఃఖాన్ని అనుభవింపకతప్పదు కదా ప్రేయసి అన్నాడు విక్రం. అబ్బ యీ మాటలు చాలించండి నేను అవన్నీ ఆలోచించలేను, వూహించలేను. పోతే నేను పోవాలి మీరు మాత్రం పోగూడదు అంది ప్రమద. యెవరు పోయేది యెవరికి తెలియదు ప్రమద నీవు పోతే నా జీవితము ఎంత దుర్భరమౌనో ఒకసారి ఆలోచించి చూచినావా. నీవు పోతావు యెచటికి పోతావు, యేమైతావు యెవరికి తెలియదు కాని యీ ప్రపంచంలో నున్న నాకు యేమౌతుంది నేను వూహించగలను అన్నాడు

విక్రం. యిట్లు విక్రం ప్రమదలు జీవిత కఠోర సత్యాలను వాదిస్తుంటే బంట్రోతు ఒక కార్డు తీసుకొచ్చి విక్రంకు యిచ్చాడు అది నిన్న office లో కలిసిన chamber of commerce ది. అప్పుడు నిజమైన ప్రపంచంలోకి వచ్చి ప్రమదకు నిన్న చెప్పిన విషయాలు చెప్పి మరి నీకు యిష్టమా యీ వీడ్కోలు విందు అన్నాడు విక్రం. మీకు యిష్టమైతే నాకు యిష్టమే అంది. సరే నని జమాల్ ఆ కార్డు యిచ్చి అతనిని రమ్మను అన్నాడు. ఆయనలోపలికి వచ్చి నమస్కారించినాడు యిద్దరికి. విక్రం అతనికి కుర్చీ చూపి కూర్చొమన్నాడు. పిమ్మట సరే మేము వస్తాము. 6 నుండి 7 వరకు సరేనా అన్నాడు. 6 నుండి 7 వరకు బావుంటుంది అన్నాడు. సరే అన్నాడు విక్రం. ఆయన లేచి నమస్కారించి సెలవు అని వెళ్ళిపోయినాడు.

మరునాడు విక్రం office లో charge యిచ్చుట పూర్తి చేసినాడు. యిక యీనాటి నుండి విక్రంకు Astt collector office బాధ్యతలు ముగిసినవి. యిక రేపటినుండి Deputy sceretary, హైదరాబాదులో బాధ్యతలు నిర్వహించాలి. చంద్రసేన్ విక్రం కలసి విక్రం official యింటికి వచ్చినారు. రేపు మీరు సాయంకాలం యీ యింటికి రావచ్చు అన్నాడు చంద్రసేన్‌తో రేపటి మధ్యాహ్నం వరకు మా సామానంతా లారీలో చేరుతాయనుకుంటా. మేము రేపు ఉదయం breakfast కాగానే కారులో వెళ్లిపోతాము. మధ్యాహ్నం వరకు secratariat లో report చేయవలసి ఉంటుంది అని విక్రం చెబుతున్నాడు. అంతలో ప్రమద వచ్చి మొనీషా యేది అంది విక్రం తో. నాకేమి తెలుసు అన్నాడు విక్రం. డాక్ బంగ్లాలో ఉంది అన్నాడు చంద్రసేన్. పాపం వక్కతిని అక్కడ యెందుకు వుంచారు తీసుకొని రండి పోయి, యీ సాయంకాలం ఆ function కు పోవాలి కదా అంది ప్రమద. మీరు తొందరగా వెళ్లి refresh అయ్యి బట్టలు మార్చుకొని యిచ్చటికి టీకి తొందరగా రమ్మంది ప్రమద. సరే అన్నాడు చంద్రసేన్. కారులో వెళ్లినాడు డాక్ బంగ్లాకు. మొనీషా కూర్చొని యేదో పత్రిక చదువుతుంది. చంద్రసేన్ డాక్‌బంగ్లాలో ప్రవేశించి ప్రమద దీది యింటికి పోలేదెందులకు? యివాళ మీరు కారు విడిచిపెడితే కదా. యీవూళ్లో taxiలు వున్నాయా యేమన్నానా మరి యెలా పొమ్మన్నారు అంది. అయితే బట్టలు మార్చుకో అక్కడికి వెళ్ళి ఆ welcome function కు వెడదామన్నాడు చంద్రసేన్. సరే అని కొంచెంసేపట్లో యిద్దరూ మొఖాలు కడుగుకొని తల దువ్వుకొని బట్టలు మార్చుకున్నారు. మొనీషా బెనారస్ పట్టుచీర కట్టింది. మంచి scent రాసుకుంది. రతీ మన్మథులవలె యిద్దరూ కనబడుతున్నారు. కార్లో రివ్వున ప్రమద యింటికి వచ్చినారు. వీరు వచ్చేవరకు విక్రం, ప్రమదలు కూడా బాగా తయారయి ఉన్నారు. యిద్దరూ నూత్న దంపతులు, యిద్దరూ I.A.S. క్యాడరుకు చెందినవారు. యీ యిద్దరూ విక్రం కారులో వెడదామని నిశ్చయించుకొన్నారు. మొనీషా ప్రమద వెనుక సీటులో కూర్చున్నారు. చంద్రసేన్ విక్రం ముందు కూర్చున్నారు. పదిహేను నిమిషాలలో ఆ function hall కు చేరుకున్నారు. సరిగ్గా ఆరు గంటలకు hall లోకి ప్రవేశించినారు. యింత కరెక్టుగా మన దేశంలో ఫంక్షన్స్ కావు. అరుగంటలు అంటే యే యేడుగంటలకో ఫంక్షన్ ప్రారంభమవుతుంది. కాని యీనాడు ఆరు అంటే ఆరు గంటలకే అంత సిద్దం అయింది. వీరు ప్రవేశించగానే function

chairman వీరి నలుగురిని stage మీదకి ఆహ్వానించినాడు. నలుగురు వెళ్ళి stage మీద కూర్చున్నారు. వీరిని అందరికి పరిచయము చేసినాడు చైర్మన్‌గారు. పిమ్మట నలుగురిని పూలమాలలతో అలంకరించినారు. అందరు చప్పట్లు కొట్టినారు. పిమ్మట విక్రం ను సభికులకు సందేశమివ్వమన్నారు. విక్రం లేచి వారినందరిని సంభోదిస్తూ తను వచ్చినప్పుడు యీ పట్టణం గురించి యేమనుకున్నాడు, ఇప్పుడు వీడ్కోలప్పుడు యేమునుకుంటున్నాడో అన్ని మంచి విషయాలు చాలా, చెడు విషయాలు, చాలా తక్కువ ఉపన్యాసములో నున్నవి. పిమ్మట చంద్రసేన్‌ను పరిచయం చేసినాడు. చంద్రసేన్ చాలా మంచివాడని తన వలెనే ఆయనకు జీవిత యాత్రలో మొదటి అవకాశమని మీరంతా ఆయనతో సహకరిస్తారని పిమ్మట మొనీషాను లేపి యీమె చంద్రసేన్ సతీమణి అని చాలా మంచిదని తన భార్య ప్రమదతో రెండు రోజులలోనే చాలా అప్యాయతతో నున్నదని వారిప్పుడు ఒకరినొకరు విడవలేని పరిస్థితి యేర్పడింది కాని యీ జీవితములో బంధాలు యేర్పడుతాయి మళ్ళీ ఆ బంధాలు వీడిపోతాయి. యిది ప్రపంచ విధానమని చెప్పి కూర్చున్నాడు. పిదప chairman చంద్రసేన్‌ను కూడా మాటాడమన్నారు. చంద్రసేన్ లేచి తనకు యిది మొదటి posting అని తన బాధ్యతలను నిర్వర్తించుటలో అందరూ తమకు తోడ్పడగలరని అటులైన ప్రజాసేవలో కృతార్థుడనౌతానని చెప్పి కూర్చున్నాడు. యీ రెండు speachలతోనే యాభైనిమిషాలు పూర్తి అయినవి. chairman అప్పుడు యిద్దరు officers వచ్చినందుకు ధన్యవాదాలు తెలిపి అందరము విందారగించిన పిమ్మట యీ సభ ముగుస్తుందని తెలిపి అందరిని విందుకు ఆహ్వానించినాడు. విక్రం ప్రమద; మొనీషా చంద్రసేన్ నలుగురు chairman తర్వాత కూర్చున్నారు. waiters అన్నీ వడ్డించినారు. అన్నీ బాగున్నాయి అనుకున్నారు. పిమ్మట యీ నలుగురు పరిచయమున్న వారందరితో కలసి సరే సెలవు అని యింటికి వచ్చినారు. రాగానే ప్రమద అంది మొనీషాతో మేము ఉదయం వెళ్లుతున్నాము కదా మీరీ రాత్రికి guest room లో వుండకూడదా అంది. మొనీషా చంద్రసేన్‌తో ఉండిపోదామంది. ప్రమద దీదీని సాగనంపినట్లుంటుంది అంది. చంద్రసేన్ సరే అన్నాడు. చాలా సేపటివరకు లోకాభిరామాయణము మాటాడుకుంటూ పిమ్మట తమ తమ గదులలో నిద్రించారు.

మరునాడు తెల్లవారింది. విక్రం ప్రమద breakfast చేసినారు. చంద్రసేన్ మొనీషా యింకా పడుకొనే వున్నారు. breakfast పూర్తి చేసి బట్టలు వేసుకొని కారులో పెట్టే ముఖ్యమైన సామాను కారులో సర్దించినారు. తక్కినదంతా lorry లో సర్దించినారు. యింకా యేమైనా వుంటే జాగ్రత్తగా సర్దించి lorry యింటికి పంపించమని రామదాసుకు జమాల్ కు చెప్పి చంద్రసేన్‌ను మొనీషాను లేపమన్నారు, వారు లేవగానే ప్రమద విక్రం యిక యిది మీయిల్లు మాకు సెలవిస్తే మేము ప్రయాణం చేస్తాము అన్నారు విక్రం ప్రమదలు. అయ్యో మమ్ము లేపలేదెందుకు దీది యివ్వాళ కనీసం నేను మీకు breakfast అయినా వడ్డిస్తుండేదాన్ని అంది. అందులో యేముందిలేమ్మా మళ్లీ అట్టి అవకాశమురాదని యెందుకనుకుంటావు. ప్రస్తుతానికి మీకు యింట్లో settle అయ్యేటందుకు చాలా పని వుంటుంది. మాకు

సెలవిస్తే మరి మేము వస్తాము అంది ప్రమద గద్గగ కంఠంతో. సరే దీది అని మొనీషా ప్రమదను గట్టిగా కౌగలించుకొంది కంట తడితో. పిమ్మట ప్రమద విక్రంలు కారులో యెక్కినారు. అందరూ కారు వరకు వచ్చినారు. కారు కదిలింది. కొంచెం సేపట్లో కారు రోడ్డు యెక్కింది. కనబడినంతవరకు మొనీషా, చంద్రసేన్ చేయితో wave చేస్తూనే వున్నారు. విక్రం, ప్రమద యిన్ని రోజులు సంసారం చేసిన పట్టణమును స్నేహితులను వీడిపోతున్నామని విచారం. మరి సిటీకి మరి తన తల్లియింటికి వెడుతున్నామన్న సంతోషం ప్రమదకు వుంది. యేది యెట్లైన అరగంటవరకు యిద్దరూ చింతితులుగా ఒకరి ప్రక్కన ఒకరు కూర్చొని ఉన్నారు. యిప్పుడు సుమారు రెండు గంటలు అయ్యింది వారున్న యిల్లు విడచి. యింక నాలుఘంటలలో మీయింట్లో వుంటాము అన్నాడు విక్రం. మా యిల్లేమిటండి మీరెక్కడ వుంటె అది మన యిల్లు. నా యిల్లు నీ యిల్లు. యిప్పుడు మనం వెళ్లేది మీ అత్తవారింటికి మాఅమ్మవారింటికి అంది ప్రమద నవ్వుకుంటు. నీవు పుట్టి పెరిగిన యిల్లు కాబట్టి నీయిల్లు అన్నాను. క్షమించాలి dear అన్నాడు విక్రం. కోపమొచ్చిందా నేను అట్లన్నందుకు sorry అని విక్రం చేయిని ముద్దుపెట్టుకుంది. సరే ప్రమదదేవిగారు నన్ను కారు driving పై concentrate చేయనివ్వండి అన్నాడు విక్రం. Sorry నేనేమనను safe గా drive చేయండి please అంది ప్రమద. యిది జరిగిన పిమ్మట కొంచెంసేపటి వరకు ప్రమద మాట్లాడలేదు. విక్రం రోడ్డుపై మనసును కేంద్రీకరించి కారు నడుపుతున్నాడు. విక్రం ప్రమద కొంచెం టీ యిస్తావా అన్నాడు. చప్పుడు రాలేదు. మళ్లీ చూస్తే ప్రమద నిద్రించింది సరే అని మరో అరఘంట పిమ్మట ప్రమద, ప్రమద అని లేపినాడు. పాపం నిద్రలోనున్న ప్రమద త్రుల్లిపడి లేచింది. కళ్లు చేతులతో తుడుచుకొని, పిలిచింద్రా అంది. అవును అన్నాడు విక్రం. యేమిటి అంది ప్రమద. కారు నడుపుతావా కొంచెంసేపు మరినేను కూడ నిద్రించాలి కదా అన్నాడు. సరే అంది ప్రమద. విక్రం హాస్యాస్పదంగా అన్నాడు. కాని ప్రమద సీరియస్‌గా సరే అంటుంది. విక్రంకు తను తప్ప యెవరు కారు నడిపినా భయం. అందువల్ల యెప్పుడూ తన కారు తానే నడుపుతాడు. యిప్పుడు ప్రమద సరే అంది యెట్లా యీ సుడిగుండం నుండి తప్పించుకోవాలా అని ఆలోచిస్తున్నాడు సరే యిక కొద్దిసేపటి వరకు నేను నడుపుతాను. కొంచెం hot tea యివ్వరాదా అన్నాడు. సరేనని flask నుండి గ్లాస్‌లో పోసిన టీని విక్రం చేతికిచ్చింది. Thank you అని టీని మెల్లగా ఒక చేతిలో పట్టుకుని త్రాగుతున్నాడు. కారు speed తగ్గించినాడు. పది నిమిషాలలో టీ ముగించి గ్లాసును ప్రమదకు యిచ్చినాడు. ప్రమద గ్లాసు లోపలపెట్టి మరి కారు ఆపండి నేను కూర్చుంటాను steering మీది అంది. సరే కాని టీ త్రాగగానే నా నిద్ర పారిపోయింది ప్రమద. మళ్లీ నిద్ర వచ్చినప్పుడు ఆపుతాను అప్పుడు నీవే నడుపుదువు dear అన్నాడు విక్రం. సరే అంది ప్రమద. యేమైన మాటలు చెప్పు అన్నాడు విక్రం. యేం చెప్పమంటారు చెప్పండి. మీకు తెలియనివి యేముంటాయి. యీ అయిదునెల్లలో అన్నీ చెప్పాను యింకేమున్నాయి అంది. మీరే చెప్పండి మీ office విషయాలు. రోజా office నుండి రాగానే రోజా విషయాలు రోజా చెబుతునే వుంటిని

యింక యేమున్నవి అన్నాడు విక్రం. కొంచెం సేపు యిద్దరూ నిశ్శబ్దంగా వున్నారు. ముందు నుండి ఒక లారి సరుకులు నింపుకొని వీరికి యెదురుంగ వస్తుంది ఆ లారివాడు పూర్తి రోడ్డును ఆక్రమించుకొని వస్తున్నాడు. యెంత పొగరు చూడు వానికి అని విక్రం ప్రమదతో అంటున్నాడు ఆ లారి అట్లానే పూర్తిగా రోడ్డుపైన వస్తుంది. విక్రం కారు ప్రక్కకు దింపి ఆపుకున్నాడు. లారి పోయినంక రోడ్డుపైకి కారు తీసినాడు. చూశావా ప్రమద నేను కారు ప్రక్కకు దింపకపోతే వాడు మన కారు మీదికె పోయేవాడేమొ అన్నాడు. అవును అంది ప్రమద వాని నంబరు వ్రాసి పోలీసుకు కంప్లేంటు యెందుకు యివ్వగూడదు అంది ప్రమద. చూడు ప్రమద ప్రతిదానికి కంప్లేంటు చేస్తూపోతుంటె జీవితము దుర్భరము. వాళ్ళు, పోలీసువారు కలిసి చేస్తారో లేక వాళ్ళు తమంతటతాముగా చేస్తారో తెలియదు. కాని ఒక IPS officer గూడా నాతో ఒకసారి అన్నాడు. SP అయ్యి కూడ ఒకనాడు రోడ్డుమీద లారివాడు యిట్లే చేసేవాణ్ణి యేమీ చేయలేకపోయినాడట. అయన కూడా మనవలెనే రోడ్డు దిగి తప్పించుకున్నాడట అన్నాడు విక్రం. అవునా అంది ప్రమద. యిట్లు మాటాడుకుంటుంటే త్రోవ బాగా సాగింది. పట్నం సమీపించారు. పిమ్మట main road విడచి తన మామగారింటికి పోవుటకు tank bund రోడ్డు పట్టినాడు. చూస్తుండగానే మారేడుపల్లి వచ్చింది. అబ్బ వచ్చేసినామండి నేను పెరిగిన చోటికి అన్నది ప్రమద. నీకు చాల సంతోషంగా వుందిలే అన్నాడు విక్రం. ఆఁ అంది ప్రమద. కారుగేటు దగ్గరికి వచ్చింది. సెంట్రీ గేటు తీసినాడు. కారు లోనికి వచ్చింది. కారు ఆపి యిద్దరూ దిగినారు.

వీరు వచ్చే సంగతి యిదివరకే వుత్తరాల ద్వార తెలిసినవారు కాబట్టి యెపుడైన రావచ్చునని శ్రీలక్ష్మి అనుకుంది.

యింక రఘునాథరాయులు రాలేదు. యింక కొన్ని గంటలలో రావచ్చు.

కారు దిగగానె ప్రమద విక్రంలు లోనికి వెళ్లినారు.

శ్రీలక్ష్మి ప్రమదను ముద్దెట్టుకుంది. ప్రయాణము యెలా వుంది నాయన అంది విక్రంతో.

బాగానే వుంది అన్నాడు విక్రం. సరే నేను వెళ్లి duty కి report చేసి యిపుడే వస్తా అన్నాడు విక్రం ప్రమదతో.

తొందరగా రండి అంది ప్రమద యెంత తొందరలో అవుతే అంత తొందరలో వస్తా అని కారు start చేసినాడు. కారు రివ్వుమని గేటు బయటకు వెడలి నిమిషములో కనబడకుండా వెళ్లింది విక్రం చక్కగా Secretariatకు వెళ్లినాడు. Joining report యిచ్చి Secretary గారిని కలిసినాడు. తన రూము బల్ల అన్ని చూపించారు విక్రంకు. సరే రేపటినుండి పని మొదలుబెట్టవచ్చు అని బయటకు వచ్చి కారు యెక్కినాడు

కారు tank bund రోడ్డు నుండి మారేడుపల్లి చేరుకుంది. అత్తగారింటికి చేరుకోగానే మామగారు dressing room లో నున్నారు విక్రంను చూచి duty join అవడము అయిపోయిందా? అన్నాడు. అయిపోయింది అన్నాడు. యింతలో

యింట్లో పనిచేసే సేవకుడొకడు టీ tray లో తెచ్చి విక్రం ముందు నిలబడ్డాడు. విక్రం కొంచెం మంచీళ్లు తెమ్మన్నాడు. సరేనయ్యా అని tray ను మధ్యనున్న చిన్నబల్లపై వుంచి వెళ్లినాడు. నీళ్లు తీసుకొని విక్రంకు యిచ్చి మళ్లీ టీ యిచ్చినాడు. విక్రం నీళ్లు త్రాగి టీ తీసుకున్నాడు. టీ తాగుతుంటే రఘునాథరాయలు యేవేవో ప్రశ్నలడుగుతుంటె వాటికి సమాధానమిస్తూ tea finish చేసినాడు. పిమ్మట చాలసేపటివరకు మామ అల్లుండ్లు మాటాడినారు.

యింతలో ప్రమద తల్లితో వచ్చి కూర్చుంది. యెలా గడిపినావు తల్లి యీ అయిదు నెలలు అన్నాడు రఘునాథరాయలు. మొదలుకొన్ని రోజులవరకు మీ అల్లుడు office కు వెళ్లగానే యేడ్చుకుంటూ కూర్చున్నా. రానురాను కన్నీరుకార్చడం మాని కొంతమందిని స్నేహితులుగా మార్చుకున్నాను. యింటిలో వున్న పనిమనుషులతో పనిచేయిస్తు అలవాటుపడ్డాను. రానురాను ప్రొద్దుపోవటము సమస్యగా లేకుండానేపోయింది. వీరు పోగానే స్నానం పూజ వంట యిల్లు శుభ్రం చేయించుట వీటితోటె ప్రొద్దుపోయేది అంతలో విక్రం వచ్చేవాడు. పిమ్మట యిద్దరం కలిసి బయటికైన వెడలేవారం లేదా యింట్లో papers, magazines లేదా యితర పుస్తకాలు చదువుతూ కూర్చొనేవారం.

ఆరంభంలో కొన్నిరోజులు తప్ప అయిదునెలలు చూస్తుంటె గడచిపోయినవి నాన్నా అంది. అవునా, తల్లి చాల సంతోషం అన్నాడు రఘునాథరాయలు. మరి city లో యేంచేస్తావమ్మ రోజూ అన్నాడు. M.A. పూర్తి చేద్దామనుకుంటున్నా. నేను, విక్రం యిద్దరము private candidates గా పరీక్ష యిద్దామనుకొంటున్నాము అంది.

బాగుంటుంది అన్నాడు రఘునాథరాయలు. సిటీలో ప్రొద్దుపోదని కాదు కాని యేదైన qualification add చేసుకుంటే మంచిదికదమ్మా అన్నాడు.

కొంచెం నా office పనికి మళ్లీ అలవాటు అయినాక నా M.A. final పూర్తిచేసి higher studies కి states వెళ్లాలనుకుంటున్నా అన్నాడు విక్రం. అవును ప్రమద తన వుత్తరాలలో అప్పుడప్పుడు ప్రస్తావించేది అన్నాడు రఘునాథరాయలు. యిచ్చట AID programme లో పనిచేస్తున్న కొందరు club లో నాకు కలుస్తారు. అందులో ఒకరిద్దరు నాకు స్నేహితులు. కావలిస్తే club కు నాతో రా ఒకసారి కలుపుతాను అన్నాడు రఘునాథరాయలు. సరే అన్నాడు విక్రం. యివన్నీ మాటాడుతూ కూర్చున్నారు నలుగురూ.

యింతలో కృష్ణమోహన్ వచ్చి రఘునాథరాయలకు శ్రీలక్ష్మమ్మకు నమస్కరించినాడు. విక్రం కృష్ణమోహన్‌ను యెలా వున్నావు కృష్ణా అన్నాడు. బాగున్నాను అన్నయ్యా అన్నాడు కృష్ణమోహన్. నీ studies యెలా జరుగుతున్నదన్నాడు.

ఓ, బాగానే వున్నది అన్నయ్యా అన్నాడు! యిప్పుడు III$^{r}d$ year కదా కృష్ణ అన్నాడు విక్రం. III yearకు వచ్చినాను అన్నాడు కృష్ణమోహన్. అంటె మూడేండ్లలో డా॥ కృష్ణమోహన్‌వా అన్నాడు విక్రం నవ్వుతూ. కృష్ణమోహన్ కూడా తల నేలకు వంచినవ్వినాడు.

వూరి సంగతులేమిటి అన్నాడు విక్రం. అంతా మంచిగానే వుంది అన్నాడు కృష్ణమోహన్. వీరి యిద్దరికి వయసులో తేడా 7 లేదా 8 యేళ్లు. కాని కృష్ణమోహన్ విక్రం ముందు తలయెత్తి కూడ చూడడు. చాల సాధుశీలుడు. అన్నయ్యా, వదినమ్మ

అంటే దేవతలతో సమానము. వదినిగారితో కూడ వినయవిధేయతలేకాక భక్తిశ్రద్ధలు కూడా చాల వున్నవి.

చాలారోజుల పిమ్మట చూచిన కుమార్తెతో రఘునాథరాయలు మాటాడుతున్నాడు. అలాగే చాలరోజుల పిమ్మట చూచిన తమ్మునితో విక్రం మాటాడుతున్నాడు. శ్రీలక్ష్మమ్మ ఒకతే యెవరితో మాటాడటములేదు. కొంతసేపు కూర్చొని లేచి లోనికి పోయింది. వంటవాడితో యేమి వంటలు చేయాలో చెప్పి దగ్గర నిలబడి వంటలు చేయిస్తుంది.

రఘునాథరాయలు ప్రమదతో మాటలు ముగించిన పిమ్మట ప్రమదా అక్కడ సినిమాలు చూసావా అమ్మా అన్నాడు. లేదు నాన్నా అంది. యెందుకనీ అన్నాడు రఘునాథరాయలు. మీ అల్లుడికి అచ్చట వున్న రెండు థేటర్సు యిష్టము కాలేదు. అందుకని యెప్పుడూ నన్ను తీసుకువెళ్లలేదు నాన్నా అంది. అయితే యిచ్చట యేదో మంచి పిక్చరు వచ్చిందట అందరం ఫోంచేసి 2nd show కు వెడదామా అన్నాడు. సరే విక్రంను అడిగి చెబుతాను నాన్నగారు అంది. పిమ్మట విక్రం వద్దకు వెళ్లి విక్రం మనమంతా ఫోంచేసి 2nd show కు వెడదామా, యేదోమంచి పిక్చరు నడుస్తుందట అంది.

సరే అన్నాడు విక్రం కృష్ణమోహనునితో మాటాడుతు. కృష్ణ నీవు కూడ మాతో రావాలి అన్నది. కృష్ణమోహనుడు విక్రంవైపు చూస్తు కూర్చున్నాడు.

రా! మీ వదినెగారు రమ్మంటుంది కదా అన్నాడు విక్రం. తప్పకుండ అన్నాడు కృష్ణమోహన్. ఓ! అన్నగారి అజ్ఞలేనిది రాడా యీ లక్ష్మణుడు అంది నెత్తిపై మెల్లగా మెట్టుతు.

విక్రం నవ్వినాడు. సరే వస్తున్నాడుగదా అన్నాడు విక్రం. చిత్తం సార్ అనుచు తండ్రికడకు వెళ్లి సరే నాన్నా మనమంతా కలిసి యెన్నాళ్లు అయ్యింది తృప్తిగా మాట్లాడుకొనక పిక్చరు అందరము కలిసిచూడక అంది. సరేనని రఘునాథరాయలు attender ని పిలిచి బాక్స్ టికెట్లు reserve చేయించినాడు.

అప్పటికే యెనమిది గంటలు కావస్తుంది. అమ్మకు చెప్పి భోజనం సిద్ధమైతే మనకందరికి చోటు చేయమని చెప్పమ్మ అన్నాడు రఘునాథరాయలు ప్రమదతో. ప్రమద సరే నాన్నా అని లోనికి పోయింది. కొంతసేపటి పిమ్మట ప్రమద వచ్చి నాన్నా భోజనాలకు రండి అంది. పిమ్మట విక్రంవద్దకి వచ్చి మెల్లగా "వినపడలేదా" రండి సినిమాకు ఆలస్యమౌతుంది అంది.

మరిదిగారు మీరు కూడా అంది కృష్ణమోహన్‌తో. పోయేవరకే టేబుల్ మీద అన్నీ అమర్చబడియున్నవి. సరిత ready గా కూర్చొనియున్నది. శ్రీలక్ష్మమ్మ యింకా వారికి యేదో చెప్పుతు తెప్పిస్తోంది. అల్లుడు భర్త రాగానె అందరికి వడ్డిస్తోంది. అందరికి వడ్డించి తానుకూడ వడ్డించుకుంది. చాలా బాగున్నాయే ఈనాడు వంటలన్నీ అన్నాడు రఘునాథరాయలు.

అల్లుడిగారి మెప్పుకొరకు అంది ప్రమద చిలిపిగా నవ్వుతు. రఘునాథరాయలు మెల్లగా నవ్వినాడు.

శ్రీలక్ష్మమ్మ కూడా నవ్వింది. సరిత మాత్రం తింటు వుంది నాకు యేమి తెలియదు అన్నట్టుగా. భోజనాల పిమ్మట సమయము అంతగాలేదు. 15

నిమిషాలలో కారులో వుండాలి మీరంత అంటూ బయట వరండాలో కూర్చున్నాడు రఘునాధరాయలు.

విక్రం, కృష్ణమోహనుడు కూడ రఘునాధరాయలతోనె కూర్చొని వున్నారు. అందరూ సిద్ధంగానున్నారు సినిమాకు పోవుటకు. విక్రం, కృష్ణమోహనుడు ముందు కూర్చున్నారు. విక్రం driver ప్రక్కన అతని ప్రక్క కృష్ణమోహనుడు ముందు సీటులో కూర్చున్నారు వెనుకసీటులో ప్రమద ప్రక్కకు రఘునాధరాయలు పిమ్మట శ్రీలక్ష్మమ్మ ఆమె ప్రక్కన సునిత. మొత్తము driver ను కలుపుకుంటె యేడుగురు వ్యక్తులు old Buick లో కూర్చున్నారు.

పదిహేను నిముషాలలో థియేటరుకు చేరుకున్నారు. driver వెళ్లి tickets తెచ్చినాడు. అందరు box లలో కూర్చున్నారు. యింక అయిదు నిమిషాలకు పిక్చరు ప్రారంభమౌతుంది. యింతలో ప్రమద "సుమిత" యేమైన cool drink కావాలా అంది. సరే అక్కా అంది. "నీకు కృష్ణ" అంది. లేదు వదినమ్మా అన్నాడు. త్రాగు నీవు కాబోయే డాక్టరువు అయినా మాకు చిన్నపిల్లవాడవే అంది. లేదు వదినమ్మ నిజంగావద్దు అన్నాడు. సరేనని ఒక cool drink తెమ్మంది. వెంటనే cool drink తెచ్చి సుమితకు అందించినాడు. సుమిత ఒక్కతే హాయిగా త్రాగుకుంటూ పిక్చర్ని చూస్తుంది. తక్కినవారంతా పిక్చర్ని చూస్తున్నారు. మధ్యలో ఒక మంచి పాట మొదలయ్యింది అందరూ పారవశ్యులైనారు ఆ పాటలో. ఆనాడు పాటలు వినుటకు విందుగా వుండేవి యిప్పటి పాటలకు అప్పటి పాటలకు చాల వ్యత్యాసము. అసలు యీనాడు సినిమాలు, అధిక సంఖ్యాకంగా, western styles తో, పాటలు, ఆటలతో నిండుకొనివున్నాయి. కాలం మారుతుంటె పాత విలువలు పోయి కొత్త విలువలు వాటిచోటును ఆక్రమిస్తాయి. వీటినే మనము change అంటాము కాని ఆ change తో పాటుకొన్ని change కానివి కూడా వుంటాయి. వాటినే మనము classical styles అంటాము. ఆ classical styles లో యింకా కొన్ని తీస్తున్నారు వాటిని ప్రజలు చాల ఆదర్శంగా చూస్తారు అంటె యింకా మన classical styles లను ఆదర్శించేవారున్నారన్న మాట. అంటె యీనాడు ప్రతిదీ ఒక వ్యాపారదృష్టితో చూస్తున్నారు. కాని నైతిక విలువలతో కాదు. ఆ వ్యాపార యుగములో వ్యాపారదృష్టితో చూడడం ఆశ్చర్యకరంకాదు. కాని వాటిలో కూడ కొంచెమైన classical విలువలకు తావుంటే బావుంటుంది. యేదియెట్లైనా రఘునాధరాయలు కుటుంబం ఆ సినిమా చిత్రాన్ని చూచి చాలా ఆనందించారు.

మళ్లీ యింటికి వెడుతూంటే అందులోని కొన్ని ఘట్టాల విషయమై చర్చించు కొంటూ యింటికి వచ్చి పడుకున్నారు. తెల్లవారగనే ప్రమద లేచింది విక్రం యింకా పడుకొనేవున్నాడు. ప్రమద మొఖం కడుక్కొని టీతో తన రూంలోకి వచ్చి విక్రంని లేపి వేడి తే నీటిని యిచ్చింది. విక్రం కన్నులు నలుచుకుంటులేచి ప్రమద చేతిలో నుండి టీ తీసుకొని త్రాగినాడు. ప్రమద ప్రక్కనే కూర్చుంది. యెన్ని గంటలకండి మీ office అంది. పది ఘంటల 30 నిమిషాలకు నేను officeలో వుండాలి. Dist. executive jobs కు Secretariat లోని clerk job లకు యిదే భేదము అన్నాడు ప్రమదతో. డిస్ట్రిక్టులో మనమంటే ప్రాముఖ్యత ఇక్కడ వేలాదిమందిలో

మనమొకరము అన్నాడు. యిప్పుడు యెనిమిది గంటల ముప్పది నిమిషాలు అంటె యింకా రెండు గంటలున్నదిలే.

యిచ్చటి నుండి యిరువది నిమిషాలలో office చేరగలను కాని rush చాలా వుంటుంది అన్నాడు విక్రం. అయితే అయిదు నిమిషాలు మొదలు బయలుదేరండి అంది ప్రమద. ప్రమద మరి మనకో యిల్లు కావాలి కదా యేం చేద్దాము అన్నాడు. చూద్దాం. చాలా వుంటాయిలెండి. ఆ విషయం నాకు వదిలేయండి మీ పని మీద మీరు concentrate చేయండి అంది. Very good ప్రమద అన్నాడు విక్రం. మరియింక యేమి విశేషాలు.

యేమీ లేవుకాని, అమ్మ అడిగింది యేమైనా... అని. అంటె యేమిటో అన్నాడు విక్రం. తెలియదా అంది ప్రమద. అదేనండి యింక గర్భం ధరించలేదా అంది. అందరూ ఆమెను అడిగారట అమ్మనన్నడిగింది అంతే.

ఓ అంతేనా! యింకా చాల టైమ్ వుంది దానికై యింకా యేమి తొందరలే అన్నాడు. ప్రమద నవ్వి వూరుకుంది. అప్పుడే పదికావస్తుందే అని లేచి బట్టలు వేసుకున్నాడు విక్రం. తలదువ్వుకొని సూట్ వేసుకొని సరే ప్రమద officeకు టైం అయ్యింది మళ్లీ సాయంకాలం కలుస్తాను అని బయటికి వెడలిపోయినాడు యేమండి మీరేమైన మరచిపోతున్నారా అంది. యేమీలేదు అన్నాడు విక్రం. ఒకసారి రండి చెబుతా అంది. యేమిటి అని లోనికి వచ్చినాడు విక్రం. తలుపు దగ్గరవేసి నవ్వుకుంటు చెంపను చూపించింది. ఓ sorry అని చెంపను ముద్దిడుకొని వెళ్లినాడు విక్రం. కారులో యెక్కి వెడలిపోయినాడు. ప్రమద కారులోనున్న విక్రంను wave చేసి కొంతసేపు వరండాలో నిలబడింది. పిమ్మట లోనికి వచ్చి కూర్చుంది. newspaper చూసుకుంటు paperలో transfer column లో విక్రం promotion & transfer యిచ్చటికైనట్లు, యీయనచోటులో చంద్రసేన I.A.S. వెళ్లినట్లు వుంది. అది మార్కు చేసి పెట్టింది విక్రంకు చూపించుటకు.

పిమ్మట చాలసేపటి వరకు paper చదివి తల్లివద్దకి వెళ్లింది. శ్రీలక్ష్మమ్మ యేదో పనిచేస్తూ కూర్చుంది లోపటి వరండాలో. వెళ్లి తల్లి ప్రక్కకు కూర్చుంది. అమ్మా యీ మారేడుపల్లిలో యెవరైనా యిల్లు అద్దెకు యిస్తారా అంది. యెందుకమ్మ ఆ సంగతి యిప్పుడు. యెవరైనా యిస్తారు ఖాళీగా వుంటె. అయినా ఆ సంగతి యిప్పుడెందుకమ్మా అంది శ్రీలక్ష్మమ్మ. కాదమ్మ మా యింట్లో మేము వుంటె బావుంటుందమ్మా అంది ప్రమద. చూడు ప్రమద వచ్చి రెండు రోజులు కూడ కాలేదు అప్పుడే యిల్లెందుకమ్మ కొన్నిరోజులు కాని అవసరమైతే చాలా దొరుకతయి యిప్పుడు తొందర లేదు తల్లీ అంది శ్రీలక్ష్మమ్మ. అంత కావలిస్తె యిచ్చటికి కొంచెం దూరంలో ఒక స్నేహితుల యిల్లు వుంది. కావలిస్తె మీరు అందులో వుండవచ్చు అంది కాని యిప్పుడు తొందరపడకు తల్లి అనుచు తన అల్లకంలో నిమగ్నురాలైంది శ్రీలక్ష్మమ్మ. యింతలో వంటమనిషి శ్రీలక్ష్మమ్మను సమీపించి అమ్మగారు యేమి వండమంటారు అన్నాడు. మధ్యాహ్నం రోజూ చేసినట్లే చేయికాని సాయంకాలం మళ్లీ నన్నడుగు అంది. రఘునాథరాయలకు యింటి నుండే మధ్యాన్నం భోజనం పోతుంది. యిక విక్రం అక్కడే officer's mess లో లంచ్

తీసుకుంటానన్నాడు. సుమిత స్కూల్ canteen లోనె తింటుంది. యిక రోజా శ్రీలక్ష్మమ్మ ఒకతే యింటిలో యేదో తిని సరిపుచ్చుకుంటుంది. యిక సాయంకాలం అందరూ యింట్లో వుంటారు కాబట్టి dinner బాగానే చేపిస్తుంది. యిప్పుడు ప్రమద వుంది కాబట్టి యేదో కొంచెం చేపిస్తుంది. యిద్దరూ కలసి తింటారు. అనాటి నుంచి అనుకుంది. అందుకే రోజా చేసినట్టు చేయమంది మధ్యాహ్నానికి, సాయంకాలానికి మళ్లీ నన్ను అడుగమంది శ్రీలక్ష్మమ్మ. ప్రమద అమ్మ ప్రక్కనే అమ్మతో మాట్లాడుతు కూర్చుంది.

విక్రం office లో charge తీసుకున్నాడు. తన desk మీదనున్న files నన్నింటిని చూస్తూకూర్చున్నాడు. యిక్కడ యెక్కువ తను decision తీసుకునే files లేవు. తన క్రిందనున్న వుద్యోగస్తులు files పంపిస్తుంటే వాటిని చూసి యేవో కొన్ని notes వ్రాసి పంపిస్తుంటాడు. నిజంగ విక్రం ఒక నిజమైన beaurocrat యిప్పుడు మన అడ్మినిస్ట్రేటివ్‌లో ఒకభాగం. మొదటి దినం కాబట్టి ఏదో పని చేస్తున్నాడు. Asst. కలెక్టర్‌గా వున్నంతపని యిక్కడ యేమీ వుండదు. అయినా యేదైనా ఒక పని చేయవలె కదా. ఆ Secretariat కు జిల్లాల నుండి చాల మంది వస్తారు. వాళ్ల పనులకొరకు అప్పుడు వాళ్లు యెచ్చట వుంది file అని తెలుసుకొని వారిని చేరుకుంటాడు. యీ విధంగా వ్యక్తిగతంగ పనులను చూసుకొనకుంటే యేపనీకాదు. ఆ Secretariat లో యింతమంది ఉద్యోగస్తులున్న పని దానంతట అదేకాదు. ఒక file ఒకచోటి నుండి మరి ఒకచోటుకు తనంతట తాను కదలదు. సంవత్సరాల తరబడి ఆ పని అట్లే అగి వుంటుందట. మనదేశములోనున్నంత red tape పాశ్చాత్యదేశాలలో నుండదు. అక్కడ వుండదనికాదు కాస్తోకూస్తో red tape ప్రతి ప్రభుత్వంలో వుంటుంది కాని మనదేశంలో నున్నంత red tape మాత్రము వుండదు. లాయర్లు యిక్కడ law తో వాదించేది తక్కువ. వీళ్ల పని పైరవి చేయుటములోనె చాలా వినియోగిస్తారు. అందువల్లనే ఆనాడు బహుశః యీనాడు కూడ ఒక office లో పనిచేస్తున్న గుమాస్తా కన్న మంచిగా జీవించేవారు చాలతక్కువ. ఆ విశ్వవిద్యాలయాలు బ్రిటిషువారు స్థాపించింది. ఈస్టిండియా కంపెనికి గుమాస్తాలను తయారుచేయుటకే. యిప్పటికి కూడ విద్యావిధానాన్ని పైపైగా మార్చినా కూడ విద్య మాత్రము గుమాస్తాలను చాలమటుకు తయారు చేయటము తప్ప మరి యేమిచేస్తుందనే ప్రశ్నకు సమాధానమేమొ తెలియదు. విద్యార్థులు పాపము చదువకుండనే డిగ్రీ సంపాదించుటకు ప్రయత్నిస్తారు. ఆ డిగ్రీని పొందగానే ప్రభుత్వము employment యిస్తలేదని అల్లర్లు చేస్తారు. యేదో ఒక విధంగా even గుమాస్తా ఉద్యోగమైన సరేనని ఒప్పుకుంటారు. అది వచ్చిన మరునాడు నుండి union లో చేరుతారు. పిమ్మట మా జీతాలు పెంచమంటారు. లేకపోతే strike. Union లను చాల బలీయంగా చేసుకుంటారు. రాజకీయవాదులు యెలక్షన్‌లో గెలుచుటకు వీరి సహకారాన్ని అర్థిస్తారు. అయితె రాజకీయవాదులు యీ చదువుకున్నవారు కలిసి వీరద్దరి భవిష్యత్తును బాగుచేసుకుంటారు. యీ process కు ఆటంకం కలిగితె భూకంపం వచ్చినంత పని అవుతుంది. ప్రభుత్వానికి వచ్చే అదాయంలో 100లో చాలావంతు యీ ప్రభుత్వ ఉద్యోగుల జీతాలకు, కరువుభత్యాలకు, ట్రావెల్

అలవెన్సుకే పోతుంది. యేదో కొంచెం capital expenditure కు పోతుంది. యిక యీ office ల సంఖ్య పెరుగుతుంది. అందువల్ల అందులో పనిచేసేవారి సంఖ్య పెరగాలిగదా. యిది మన office ల కథ. అన్ని ఉద్యోగాలవలె I.A.S., I.P.S.ల సంఖ్య కూడా పెరుగుతోంది.

విక్రం, Secretariat లో clerk పనిచేస్తు తన భవిష్యత్తును నిర్మాణిస్తున్నాడు. అతను Secretary లేదా Chief Secretary గా retire అయ్యే వుద్దేశం లేదు. అతనికి తెలుసు. ఆ I.A.S. తో తన భవిష్యత్తును నిర్మాణించలేనని. అందుకే అయినంత త్వరలో M.A. పూర్తి చేయాలని, నిజాం కాలేజ్ కు వెళ్లినాడు. అచట తన Senior ఆచార్యులతో కలిసి మాటాడినాడు. వారు private candidate గా Final లో కూర్చోమన్నారు. అప్పుడే వెళ్లి Exam Fees కట్టినాడు. పిమ్మట పుస్తకాలు కొన్నాడు. ఆనాటినుండి సమయం వృధా చేయకుండా Office నుండి రాగానే చదువుతున్నాడు. ప్రమద మాత్రము ఇప్పుడే Final పరీక్ష ఇవ్వదలచుకోలేదు. నేను తరువాత ఇస్తానని అంది. విక్రం వద్ద కూర్చొని యే యిండ్లు చూచి వచ్చిందో ఆ యిండ్ల futures మొదలగు విషయాలు చెపుతూ విక్రంను చదవనీయుటలేదు. విక్రం ఇది గ్రహించి సరే అని పుస్తకం ప్రక్కన పెట్టి ప్రమదతో కూర్చొన్నాడు. సరే కొన్ని రోజులలో వేరే యింటికి పోగానే strict అవుదాము అనుకున్నాడు. ఒకనాడు ప్రమద విక్రం వద్ద కూర్చొని ఇవ్వాళ ఒక మంచి యిల్లును చూచినామంది. అది మీరుకూడా చూస్తే దాన్ని మనదనిపించుకొందాం. ఇచ్చటికి చాలా దగ్గర. Independent ఇల్లు. చిన్నదైనా చాలా సౌకర్యంగా ఉంది. గ్యారెజి కూడా ఉంది మన కారుకు అంది. అయితే ఎప్పుడు చూపిస్తావు అన్నాడు? ఇప్పుడే. నీకు ఓపిక ఉంటే సరే అని ఇద్దరూ బయలుదేరినారు. కారులో వెడదామా అన్నాడు విక్రం. కారెందుకు అంది. ఇక్కడనుండి కనబడుతుంది చూడండి అని రఘునాధరాయల ఇంటిముందున్న మూడో యిల్లును చూపించింది. మీద యింటివాళ్ళుంటారు. క్రింద అంతా మనముంటాము. ఆ యింటివాళ్ళు ఇద్దరే సుమా. మీద కూడా అంది ప్రమద. అమ్మ నాన్నకు తెలిసినవారు చనిపోయిన యింటి యజమాని నాన్న స్నేహితులట. అందుకే మనకైతే రూ.250/–లకి ఇస్తారట ఏమంటారు అంది. అయితే సరే చూద్దాం పద అని Gate బయటికి వెళ్లి ఆ యింటికి వెళ్లినారు. వీళ్లను చూసి పైనుండి ఆ యింటి యజమాని బంధువు క్రిందికి వచ్చి విక్రంకు నమస్కరించి యిల్లు చూస్తారా అన్నాడు. అవును అని ప్రమద అంది. వీరు నా భర్తగారు అంది. తెలుసునమ్మా! నేను మీ పెండ్లిలోనే చూసినాను వీరిని అన్నాడు. అయితే రండని వారిని ఆహ్వానించి అంతా చూపించినాడు. విక్రంకు యిల్లు నచ్చింది. అన్ని సౌకర్యాలున్నవి. It is not crowded అనుకొన్నాడు. సరే! ప్రమదా నాకు నచ్చింది మరి ఎన్నడు మారుదాం అన్నాడు. నాన్నగారు రాగానే మాట్లాడుదాం అని ఆ యింటిని చూపించిన మనిషితో సెలవు తీసుకొని తల్లి యింటికి భర్తతో సహా వచ్చేసినది. రాగానే తల్లితో అమ్మా మీ అల్లుడికి యిల్లు నచ్చిందమ్మా అంది. మంచి యిల్లేనమ్మా అంది శ్రీలక్ష్మమ్మ. ఇంతలో రఘునాధరాయల కారును చూచి sentry salute చేస్తున్నాడు. నాన్నగారికి నూరేండ్లమ్మా అంది

ప్రమద. కారు లోనికి రాగానే రఘునాధరాయలు కారు దిగినారు. కొన్ని పుస్తకాలు Files court గుమస్తా ఫ్యూన్‌తో లోపలికి పంపినారు. రఘునాధరాయలు లోనికి వెళ్లినారు. పుస్తకాలు ఫైళ్లు Office బల్లపైన పెట్టినారు. బట్టలు మార్చుకొని మొఖం కడుక్కొని నెత్తి దువ్వుకొంటున్నారు రఘునాధరాయలు. శ్రీలక్ష్మమ్మ వెనుక నిలబడి నీ కూతురు యిండ్లు చూసుకుంది అన్నది. ఏ యిల్లు మన యింటిముందున ఉన్న మూడో ఇల్లు అంది. ఇప్పుడు యింటికి అంత తొందరేముందే అన్నాడు. అడగండి మరీ. సరే అని Drawing room లోకి వచ్చి కూర్చున్నాడు. కొద్దిసేపటి పిమ్మట ముందు వరండాలోకి వచ్చి కూర్చున్నాడు Paper చదువుకుంటూ. ప్రమద కొంచెం సేపట్లో తండ్రిగారి పక్కకు వచ్చి కూర్చుంది విక్రం యేడమ్మా? మా గదిలో ఉన్నాడు నాన్నా అంది. యెట్లా ఉందట తన కొత్త పని అన్నాడు. బాగానే ఉందంటున్నాడు. బాధ్యతలు ఏమీ లేవట. just a desk job అంటాడు అంది. మరీ secretariat jobs lower cadre లో అంతే తల్లీ అన్నాడు. డిస్ట్రిక్ట్‌లోనే I A.S. వారు బాగుంటారు అన్నారు. కానీ వారి ప్రకృతికి అవి నచ్చవు నాన్నా అంది ప్రమద. ఇద్దరు కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉన్నారు. మేము ఒక యిల్లు చూసుకొన్నాము నాన్నా అంది. అవునట మీ అమ్మ చెబుతుంటే అన్నాడు. ఇప్పుడేం తొందర అమ్మా? మేమీ యింట్లో ముగ్గురమే కదా! నువ్వూ నీ భర్త మాకు బరువనుకున్నావా? అమ్మా. ఇక్కడే కొన్నిరోజులు ఉండి పిమ్మట మెల్లగా చూసుకుంటే సరిపోదా? లేదా మీ ఇద్దరు ఇక్కడే ఉండిపోవచ్చు కదమ్మా, మళ్లీ యిల్లెందుకు ప్రమద. వచ్చి మూడురోజులు కూడా కాలేదు అప్పుడే ఇంత తొందర ఎందుకు తల్లీ అన్నాడు రఘునాధరాయలు. ప్రమద చప్పుడు చేయలేదు. ఇద్దరూ కూర్చొని వున్నారు. యింతలో సరిత వచ్చి నాన్నా టీ కి రమ్మంటుంది అమ్మ! అంది. పద ప్రమద అని రఘునాధరాయలు లేచినారు. ప్రమద కూడా లేచింది. అమ్మా! సరిత, బావను కూడా పిలువు అని లోనికి ప్రమదతో వెళ్లినాడు. కొంచెంసేపట్లో విక్రం, సరితకూడా వచ్చి కూర్చున్నారు. శ్రీలక్ష్మమ్మ యేదో Snack అందించింది అందరికీ. పిమ్మట అందరూ టీ త్రాగుతున్నారు. అప్పుడు శ్రీలక్ష్మమ్మ విక్రంతో నాయనా! ఇప్పుడు వేరే యింటికి ఎందుకు మారుతారు? యిచ్చటే ఉండిపోతే కాదా! అంది. విక్రం నవ్వుతూ ఊరుకున్నాడు. ఇంతలో అందరూ టీ ముగించి లేచిపోయినారు. విక్రం, ప్రమద తమ గదిలో వున్నారు. ఏమి సమాధానం యిస్తావు మీ అమ్మకు అన్నాడు విక్రం. ప్రశ్న అడిగింది మిమ్ములను, నన్ను అడిగితే నేను సమాధానము యిస్తాను. మరి ఏమి సమాధానం యివ్వమంటావు. లేదు పోతాము ఆ యింటికి అనండి. వాళ్లు అంత ప్రేమతో ఉండమంటుంటే మేము పోతాము అంటే ఏమనుకుంటారు గ్రహించినావా? వారు నాకు తల్లిదండ్రులు, వారు ఏమనుకోరు, నేను అన్నింటిని చూసుకుంటాను. మీ యిష్టం తెల్పండి అంది ప్రమద కొంచె కటువుగా. నా యిష్టం నీ యిష్టం ఒకటే ప్రమద. నీవు ఏది సరి అనుకుంటే అది చేసివేయి. నేను ఏమనుకోను. అయితే యీ రెండు మూడు రోజులలో మంచి దినమునాడు మారుదాం అంది ప్రమద. సరే అన్నాడు విక్రం ప్రమద మరునాడు బ్రాహ్మణునితో మాట్లాడి ఎల్లుండి ఒంటిగంట పది

నిమిషాలకు మంచి ఘడియ. మీరు క్రొత్త యింటికి పోవచ్చు అమ్మగారు అన్నాడు. ఆ సమయానికి సరిగా మీ పూజా గదినుండి దేవుణ్ణి ఆ యింటికి మార్చివేయండి అన్నాడు. సరే, అంది ప్రమద. శ్రీలక్ష్మి చప్పుడు చేయలేదు. చేసికూడా లాభం లేదనుకొని కూతురు తొందరకు కొంచెం నొచ్చుకుంది. కాని సరే ఆమె సంతోషమే తన సంతోషం అని ఊరుకుంది. రఘునాథరాయలు రాగానే ప్రమద నిర్ణయాన్ని తెలిపింది. ఎల్లుండినుండి వాళ్లు ఆ క్రొత్త యింటికి పోతారట అంది. సరే, ఆమె యిష్టం. సామానులన్నీ మన పనివారితో అచ్చట చేర్పించు అన్నాడు. సరే అంది శ్రీలక్ష్మమ్మ. మార్చే రోజు రానే వచ్చింది. ప్రమద బ్రాహ్మణుడు చెప్పిన ఘడియకు దేవుణ్ణి ఆ యింటికి చేర్చింది. పిమ్మట పనివారంతా అంత సామాను ఆ యింటికి చేర్చినారు. పనివారితో యిల్లంతా సామాను సర్దిస్తుంది. చూస్తుండగానే విక్రం యిల్లు చేరుకున్నాడు. రఘునాథరాయలుకూడా వచ్చినాడు. యిద్దరూ కలిసి ప్రమదను ఆమె వుండబోయే యిల్లును చూచుటకు బయలుదేరినారు. ఇంకా సామానంతా సర్దలేదు. ప్రమద తొందరగా టీ చేసి భర్తకు, తండ్రికి ఇచ్చింది. ఇంకను మెస్సీగా ఉన్న Drawing room లో రఘునాథరాయలు సంతోషంగా టీ అందుకొన్నాడు. విక్రం కూడా టీ త్రాగినాడు ఎందుకింత తొందర అని తన మనస్సులో అనుకొంటు. అయినా ఒక విధంగా మంచిదే. ఒకసారి స్థాపిస్తే యింట్లో మళ్లీ తన చదువుకు అటంకం కాదని అనుకొని తృప్తి పడ్డాడు. అంతేకాకుండ తన యిల్లు సంసారం తనవనుకున్న ప్రమదలో తప్పును చూడలేము అనుకున్నాడు విక్రం. కాని రఘునాథరాయలు తన ముద్దులకూతురు యిక తన యింట్లో వుండదు కదా అని బాధపడుతున్నాడు. అయినా సంతోషమే, తన యింటిముందే నున్నదని. యెప్పుడు చూడాలన్న రెండడుగులు నడిస్తే చూడవచ్చు అనుకున్నాడు. యిద్దరూ తమతమ వూహా ప్రపంచంలో మునిగి టీ ముగించారు. టీ ముగించి రఘునాథరాయలు అమ్మ ప్రమదా, నీ సామాను సర్దుకో అమ్మ యింట్లో వంటరిగా వుంది. నేను వెడతాను అని నడచి శ్రీలక్ష్మమ్మను కలుసుకొన్నాడు విక్రం లేచి పనివారితో చెప్పి యీ వస్తువు యిచట మరి ఆ వస్తువు యిచ్చట అని చెబుతున్నాడు. ప్రమద యిది చూచి విక్రం యీ బాధ్యతనాది Now I am a house maker మీరు మీ office లో చెప్పిచేయించుకొండి కాని యింట్లో నా బాధ్యతలను నన్ను నిర్వర్తించనీయండి. పిమ్మట వస్తువులన్ని అమర్చిన పిమ్మట మీకు నచ్చకపోతె అప్పుడు మాట్లాడండి. నేను మార్పిస్తాను మీ ఇష్టప్రకారము. కాని యిప్పుడు మాత్రము యిదుగో యీరోజు పత్రిక, వారపత్రిక యివి చదువుతూ హాయిగా ఆసోఫాపై కూర్చొండి అని సోఫాపైన కూర్చుండబెట్టింది. సరే అమ్మగారూ అంటూ సోఫాపై కూర్చుండి తన చదువు ప్రపంచంలో లీనమైనాడు విక్రం.

అనుకున్నట్లుగా రాత్రి యెనిమిది గంటల వరకు అన్ని సామానులు సర్దించింది. ఏ వస్తువు యెక్కడుండాలో ప్రమదకు బాగా తెలుసు. ఎందుకంటే యిది తన యిల్లు. ఇచ్చట ఆమెను criticise చేసేవారులేరు. suggestion యిచ్చేవారు అంతకంటే లేరు. అయినా ఆమెకున్న decorative talents అన్ని వుపయోగించి మంచిగా సర్దింది.

ఆమెకు నచ్చటమే కాకుండ విక్రం కూడా బాగా వుంది అన్నాడు. సరే మీకు నచ్చింది చాలా సంతోషము అని వచ్చి దగ్గరగా కూర్చుంది. పనిమనిషి యిల్లంతా వూడుస్తోంది, కడుగుతుంది మురికిగా వున్న బండలను. విక్రం తన చదువులో నిమగ్నుడై వున్నాడు. యేమండి ప్రక్కన మీ భార్య వుందని కూడ మరుస్తున్నారే అని వీపుమీద చరచింది. సరే యేమి చేయమంటావు చెప్పు ప్రమద. బాగుగా వుందన్నాను. నీపనిలో నేను జోక్యము చేసుకొనలేదు. మరి చదువుటనాపని యిందులో యెందుకు జోక్యం చేసుకుంటున్నావు అని బుగ్గ గిల్లినాడు. బుగ్గ గిల్లగానే తన ఒడిలో ఒరిగి విక్రం కన్నులలలోకి చూస్తూ వుంది. వేరే పనివారున్నారు జాగ్రత్త అన్నాడు విక్రం.

వాళ్లకు తెలుసులే వారేమనుకోరు అని అట్లానే విక్రం కనులలోకి చూస్తోంది. మన పడకగది యెలా సర్దినానో చూద్దురుగాని రండి అని లేచి విక్రంను లేపింది. ఈ పిక్చర్ selection బాగుందా మన పడకగదిలో అమర్చుటకు అంది. బాగానె వుంది అన్నాడు విక్రం. మీరు చదువుకొనుటకు యీ desk మరి కుర్చీ సరియైన స్థలంలోనున్నవా అంది. పరవాలేదు అన్నాడు విక్రం. వీళ్లిద్దరు ప్రమద అమర్చినవన్నీ చూస్తుండగా రఘునాథరాయలు యింటి నుండి ఒకమనిషి వచ్చి, అమ్మా పెద్దమ్మ మిమ్మలను రమ్మంటున్నారు అంది. సరే వస్తున్నామని చెప్పు. ఇప్పుడే అయిదు నిమిషాలలో వస్తాము అంది. పనివాడు వెళ్లిపోయినాడు. పిమ్మట కొంతసేపటికి ప్రమద విక్రంలు రఘునాథరాయలు యింటికి నడచి పోయినారు. పోగానే రఘునాథరాయలు రామ్మా అని ఆహ్వానించినాడు. యిద్దరూ కూర్చున్నారు. ఇంతలో శ్రీలక్ష్మమ్మ సరిత వచ్చి కూర్చున్నారు.

ఎలా సర్దుకున్నావు తల్లీ అంది శ్రీలక్ష్మమ్మ. ఏదో తోచినకాడికి సర్దానమ్మా అంది ప్రమద. బాగానే వుంది అంతా అన్నాడు విక్రం. శ్రీలక్ష్మమ్మ నవ్వింది. అమ్మా మీరంతా యెల్లుండి మా యింట్లోనే భోంచెయ్యాలమ్మా అంది ప్రమద. మీ నాయనను అడుగమ్మ. నాదేముంది నేను తరచుగా యింట్లో వుంటాను మీనాన్నగారికి వీలవుతుందో లేదో అంది. తప్పకుండా వీలు కలుగచేసుకుంటారు ప్రమద invite చేస్తే. నేను కాదంటానా అన్నాడు. అందరు ఫక్కున నవ్వినారు.

ఏం నేనేమన్న తప్పు మాటాడితిన అంది ప్రమద. లేదు ప్రమద నువ్వేమి తప్పు మాటాడలేదు. ఇప్పుడు భోజనానికి ఆహ్వానించి మరుక్షణమే వంటవారిని చూడమంటున్నావు అందుకని నవ్వొచ్చింది. ఓ అదా యెల్లుండి స్వయంగ అన్ని నేనే చేస్తాను మీ అందరికి అంది. మనకు వంట మనిషి కావలెను కదండి అంది విక్రంతో. సరే అట్లే చూస్తాను నీవు నిశ్చింతగా వుండు అంది. ఇంతలో పనిమనిషికి చెప్పి మన పుల్లయ్యను పిలువుమని ఆజ్ఞాపించింది. పుల్లయ్య వచ్చి అమ్మా పిలిచారా అని నిలబడ్డాడు దూరంగా. అవును పుల్లయ్య యిప్పుడు పెద్దమ్మాయికి వంట మనిషి కావాలట యెవరన్నా వుంటే పంపించు ప్రమదమ్మ యింటికి. అట్టే అమ్మా రేపే పంపిస్తాను అన్నాడు పుల్లయ్య.

సరే పుల్లయ్యా ఆ మరునాడు సాయంకాలము ప్రమదమ్మ యింట్లో ఆమెకు సహాయపడు అంది. సరే అమ్మగారు అన్నాడు. సరే యిక నీవు వెళ్లు పని

చూసుకో అంది. పిమ్మట ఆ కుటుంబము యేవేవో మాటాడుకుంటు కూర్చున్నారు.
శ్రీలక్ష్మమ్మ మాత్రము కొంచెముసేపు ఆగి లోనికి పోయింది. పోగానే వంటలన్నీ టేబుల్ మీద పెట్టించింది. పిమ్మట అమ్మా సరితా వెళ్లి నాన్నను అక్కయ్యను బావను భోజనానికి రమ్మను తల్లీ అంది. సరే అమ్మా అంటూ సరిత పరుగెత్తినట్టు తరలిపోయింది. అందరిని తీసుకొనివచ్చి టేబుల్ పక్క కుర్చీలలో కూర్చోబెట్టింది. శ్రీలక్ష్మమ్మ అందరికి వరుసగా వడ్డించింది. అందరూ భోజనాలు మొదలుపెట్టగానే తను కూడ వడ్డించుకొని కూర్చుంది. విక్రం తొందరగా తింటాడు తిని కూర్చున్నాడు. లే విక్రం చేతులు కడుక్కో అన్నాడు రఘునాధరాయలు. పరవాలేదు అని అట్లే కూర్చున్నాడు. అందరూ తినగానే అందరూ ఒకేసారి లేచి సింక్ వద్ద చేతులు కడుక్కున్నారు.

రఘునాధరాయలకు తమలపాకు తినుట చాల యిష్టము. అందుకే రోజా భోజనాలు కాగానే ఆ కట్టిన తమలపాకును తీసుకొని తెచ్చి రఘునాధరాయలకు యిచ్చింది. అమ్మా నాకు కూడ యివ్వవే అంది. రఘునాథరాయలు తన ప్రక్కనే వున్న పాందాన్ తీసి కూతురుకై ఒక తమలపాకు కట్టుచున్నాడు. శ్రీలక్ష్మి మీరుండండి అని ఆకును తానే మడచి ప్రమదకు యిచ్చి విక్రం నీకు కూడ ఒకటి కట్టనా నాయనా అంది. లేదు నేను తినను అన్నాడు. కొంచెంసేపు కూర్చొని విక్రం ప్రమద లేచి సరే అమ్మా మాయింటికి వెడతాము అంది. సరే అమ్మా అని శ్రీలక్ష్మి అంది. రఘునాధరాయలు మంచిదమ్మా రేపుకూడ సాయంకాలం యిచ్చటికే రండి భోజనాలకి అన్నాడు. లేదునాన్నా రేపు నేను వంట చేస్తున్నాను. మేము మాయింట్లోనే భోంచేస్తాము అంది. సరే తల్లీ అయితే యెల్లుండి మీ యింట్లో అందరమూ కలిసి తిందాము అన్నాడు. విక్రం ప్రమద యిద్దరూ మెల్లగా తమ యిల్లు చేరుకున్నారు. కొంచెంసేపు drawing room లో కూర్చున్నారు. ప్రమద యింట్లో యిప్పుడు ముగ్గురు. ఒక పనిపిల్లను యీయింటిలో ప్రవేశించక ముందే మాటాడుకుంది. పనిపిల్ల ప్రస్తుతానికి ఆ యింటిలో నున్న ఒక గదిలో పండుకుంటుంది.

ప్రమద ఆ పిల్లతో సరేలే మాగదిలో నీళ్లు పెట్టి నీవు పడుకోమంది. సరే అమ్మ అని నీళ్లు పెట్టి పడుకుంది. పిమ్మట ప్రమద విక్రం భుజంపై తలవాల్చింది. విక్రం చదువుకుంటున్నాడు. కొంచెంసేపటికి తలవాల్చిన పిదప. మీకు ఒక good news చెప్పాలని వుంది అన్నది ప్రమద. విక్రం విచిత్రంగా ప్రమద వైపుకు చూస్తు యేమిటా good news అన్నాడు. చెప్పమంటారా అంది నవ్వుతు. news వుంటె చెప్పాలిగదా మరి అన్నాడు విక్రం. అయితె వినండి మీరు తండ్రి కాబోతున్నారు అంది చిరునవ్వుతో. నీకు యెలా తెలుసు? మరి యింకెవ్వరికి తెలుస్తుంది నాకు కాకపోతె అంది. నిజమా అన్నాడు విక్రం. అవునంది నాకు పిరియడు రాక రెండు వారాలు కావస్తుంది. మరి మీ అమ్మతో చెప్పినావా లేదా. మన యింటికి భోజనాలకు పిలిచాను గద ఆనాడు చెప్పాలనుకుంటున్నా అంది ప్రమద. లేదా యింక రెండు వారాలు ఆగమంటారా అంది. నీ యిష్టము ప్రమద అన్నాడు

[illegible] కావస్తున్నవి యింకా నెల తప్పలేదని శ్రీలక్ష్మమ్మ యెదురు చూస్తుంది.

ఇంత ఆలస్యము యెందుకో అనుకుంటుంది. ఏమన్న ప్రికాషన్స్ తీసుకుంటున్నారా అని అడిగింది ప్రమదను. లేదు అని అడిగినపుడల్ల చెప్పింది ప్రమద. అయినా శ్రీలక్ష్మమ్మమ్మకు అర్థము కావటములేదు. ఒకటి రెండుసార్లు రఘునాథరాయలుతో ప్రస్తావించింది. డాక్టరుకు చూపెట్టనా అని అడిగింది. కాని రఘునాథరాయలు యిప్పుడే తొందరయేమి. ఇంకొన్నాళ్లు చూడు పిమ్మట అలాచేద్దాం అన్నాడు రఘునాథరాయలు ఈ వార్త విని విక్రం సంతోషించినాడు. కాని సిగ్గుపడుతున్నాడు కూడ. ఇంత తొందరగ నేను నాన్నను కాబోవుట యేమిటి అనుకున్నాడు. అయిన ఒక చిన్న పాపాయో బాబో వుంటే ప్రమద తనను యెప్పుడు అంటిపెట్టుకొని వుండదని అనుకొన్నాడు. On the whole విక్రంకు విచారాని కన్న సంతోషం ఎక్కువగా వుంది.

ఇద్దరూ తమ గదిలోకి వెళ్లి మంచంపై పడుకున్నారు. విక్రం ప్రమద కడుపును నిమురుతు అయితే మరి బాబునిస్తున్నావా పాపనా అన్నాడు. నాకైతే పాపకావాలని వుంది అని నవ్వుకుంటు. నన్ను చెప్పమంటావా ప్రమద అన్నాడు విక్రం. చెప్పండి అని తలవూపింది. నాకు బాబు అంటే ఇష్టం అన్నాడు విక్రం. ప్రస్తుతం పాప పిమ్మట బాబు మరి మూడవది ఎవరైన సరే అంది ప్రమద. లే ప్రస్తుతానికి బాబు మళ్లీసారికి పాప పిమ్మట యేదైన సరే అన్నాడు విక్రం. అంటే మనమిద్దరము కోరేది ఒకటే. భేదాభిప్రాయాలు మొదటి బిడ్డ విషయమే అంది ప్రమద.

సరే చూద్దాము. యేదైనా I don't care but I want a healthy baby అంది ప్రమద. నేను కూడా అంతే అని ముద్దిడుకొని హత్తుకున్నాడు ప్రమదను. ప్రమద కొద్దిసేపట్లోనే అన్నింటిని మరచి విక్రం బాహుబంధాలలో నిద్రపోయింది. కొంచెంసేపటికి విక్రం కూడ నిద్రించినాడు.

తెల్లవారి కళ్లు తెరిచింది ప్రమద. కొన్ని క్షణాలు యేమీతోచలేదు. అంతా విచిత్రంగ కొత్తగా కనిపించింది. మరికొన్ని క్షణాలకు కళ్లు రాచుకొంటు లేచి కూర్చుంది. ప్రక్కనే విక్రం పడుకొనివున్నాడు. అప్పుడు కాని తాను విక్రం తను నూతన నివాసంలోనున్నామని గ్రహించలేదు. అప్పుడే ఆ పనిపిల్లను లేపింది. తను brush చేసి మొఖం కడుకుంది.

పిమ్మట పడకగదిలోకి వచ్చి విక్రం వీపుతట్టి లేవండి అని లేపింది. brush చేసుకొండి. టీ యిస్తాను. ఇవ్వాళ్ల నేను చేసిన టీ మనయింట్లో యెలా వుంటుందో చెబుదురుగాని అంది. సరేనని కనులు నిమిరుకుంటు లేచినాడు విక్రం. ముఖం కడుగుకొని drawing roomలో కూర్చున్నాడు. Tray లో తీసుకొని దాంట్లో కొన్ని biscuits పెట్టుకొని వచ్చింది ప్రమద. వాటిని coffee table పైన వుంచి టీ కలిపింది యిద్దరికి. ఆమె మాత్రం బిస్కట్లు తింటు టీ త్రాగుతుంది కాని విక్రంకు పట్టి టీ సరిపోతుంది ఉదయం. యిద్దరూ టీ ముగించారు. విక్రం టీ సేవించి వార్తాపత్రిక చూస్తాడు. ఆనాడు పత్రిక ఆలస్యంగ వచ్చింది కొత్త యిల్లు కదా అందుకోయేమొ. అడ్రసు వాడికి తెలియలేదేమొ అనుకున్నాడు. సరే మొత్తానికి

పత్రిక వచ్చింది. దాన్ని చదువుతూ కూర్చున్నాడు విక్రం.

ప్రమద ఆయనతో కూర్చొని headlines చదువుతుంది. పిమ్మట విక్రంతో కొంచెంసేపు కూర్చొని పిమ్మట వంట యింట్లోకి పోయింది. ఆ పనిపిల్లకు చెప్పి యిల్లంత శుభ్రంగా వూడిపించింది. పిమ్మట యేదో breakfast చేయుటకు నిశ్చయించింది. శుభ్రంగ కడిగి వున్న గిన్నెనొకదానిని తీసి పొయ్యి ముట్టించి ఆ గిన్నెను ఆ పొయ్యిపై వుంచింది.

యేదో ఒక item తయారుచేసి దానిపైన మూతపెట్టింది. విక్రం పత్రిక ముగించగానె breakfast చేసిన గిన్నెను మరికొన్ని వేరే గిన్నెలను బల్లపై పెట్టింది. మొదలు ఆ వండిన వంటను విక్రంకు వడ్డించి వేరే గిన్నెలలోనున్న పదార్థాలను కూడ వడ్డించింది. ఏమిటి యిది అన్నాడు విక్రం. ఉప్మా అంది ప్రమద. ఓ! అంటూ ఆ వడ్డించిన చట్నీలతో దాన్ని కొద్దిగా భుజించాడు. ఇంక కొంచెం పెట్టుకొండి అంది ప్రమద. లే ప్రమద చాలు నీవు తిను అని ఆమె ప్లేటులో వడ్డించాడు.

చట్నీలు వేసుకొని తింటోంది. ఎలా వుంది ప్రమద అన్నాడు. very good అంది ప్రమద. అయితే నీకు ఇష్టమైన వంట అన్నాడు విక్రం. అవును అంది. అలాగ నాకు ఇంత ప్రొద్దున తినుటకు ఇష్టముండదు. నాకు breakfast అనవసరము. tea తో సరిపోతుంది. lunch అయితే ఇంట్లో తినను. ఇకపోతే dinner మాత్రము ఇంట్లో తింటాను. అందువలన అది ఒకటి చేసి పెట్టగలవా ప్రతిరోజూ వంటమనిషి లభించే వరకు అన్నాడు విక్రం. అలాగేనని తలవూపింది ప్రమద. సరే నేను స్నానం చేస్తానన్నాడు.

ఆ పనిపిల్లను పిలిచి అయ్యగారికి fresh టవల్ స్నానశాలలో పెట్టు అని ఆజ్ఞాపించింది. సంవత్సరములో మూడు నెలలు తప్ప తక్కిన తొమ్మిది నెలలు చన్నీళ్ల స్నానమే చేస్తాడు విక్రం. అమ్మా సిద్ధంగా వున్నాయమ్మా బాత్‌రూంలో అంది ఆ పనిపిల్ల నరసమ్మ. మంచిది అని ప్రమద విక్రంని స్నానానికి లేవమంది. విక్రం బాత్‌రూంకు వెళ్లి bath తీసుకొన్నాడు. బట్టలు వేసుకున్నాడు. కొంచెంసేపు డ్రాయింగ్ రూంలో కూర్చున్నాడు.

పిమ్మట ప్రమదతో ప్రమదా నేను office కు వెళుతున్నాను అని చెప్పి కారులో కూర్చున్నాడు. కారు యెక్కిన 40 నిముషాలలో office చేరుకున్నాడు. ఇంట్లో ప్రమద drawing room లో ఒంటరిగా కూర్చొంది.

అసిస్టెంటు కలెక్టరు గృహములోనున్నట్లు అంతమంది సేవకులు లేరు. అమ్మ ఇంట్లో నున్నంత మంది సేవకులు లేరు. వంటమనిషి ఎప్పుడు వస్తాడా అని ఆలోచించుకుంటు కూర్చొంది ఆమె ఇంట్లో. శ్రీలక్ష్మమ్మ అనుభవశాలి. ఆమెకు తెలుసు ప్రమదకు యీ loneliness తప్పదు వేరుగా వుంటే అని. అందువలననే వద్దు ఆమె యింట్లోనె వుండమన్నది. కాని ప్రమద వినలేదు. ఒకరోజుకే యింత loneliness అవుతుంది అనుకుంటోంది.

ఇంతలోనే తల్లిగారి యింటిలోని పనిమనిషి లోనికి వచ్చింది. రాగానే ప్రమద యేమే రంగమ్మ యేమి సంగతులు అంది. యేం లేదమ్మగారు. పెద్దమ్మగారు

ఒక్కతే వుండట మిమ్ములను పిలుచుకురమ్మంది. ఇంక కొంచెంసేపట్లో స్నానం చేసివస్తానని చెప్పు అంది. రంగమ్మ వెళ్లిపోయింది. రంగమ్మ పోయిన 10 నిమిషాలకే ప్రమద స్నానాల గదికి వెళ్లి స్నానం చేసింది. పిమ్మట తలదువ్వుకొని బట్టలు వేసికొంది. నరసమ్మా నువ్వు తయారుగా వున్నావా అంది ప్రమద. అవును అమ్మగారు అంది నరసమ్మ. అయితే తాళము తీసుకో మనము అమ్మ యింటికి వెడదాము అంది, సరేనని నరసమ్మ తాళము తీసుకొని నిలబడింది. తాళము వేసి యిద్దరూ బయలుదేరినారు.

శ్రీలక్ష్మమ్మ ప్రమద పోయేవరకు లోనివరండాలో కూర్చుంది. ప్రమద ప్రవేశించగానె రాతల్లి అని ఆహ్వానించింది. ప్రమద తల్లి ప్రక్కన కూర్చుంది. రంగమ్మ నరసమ్మలు వేరుగా వంట యింటి వసారాలో కూర్చున్నారు సాయంకాలం వరకు.

సాయంకాలం తల్లి భోంచేసి పో ప్రమదా అన్నది. లేదమ్మా వారు వస్తారు నేను వెళ్లాలి అని తల్లితో సెలవు తీసుకొని యింటికి వెళ్లిపోయింది. ప్రమద వెళ్లిన కొద్దిసేపటికి విక్రం వచ్చినాడు. ప్రమద చిరునవ్వుతో విక్రంను ఆహ్వానించింది. విక్రం లోన ప్రవేశించగానే బాత్ రూంలోకి వెళ్లి మొఖం కడుక్కొని దువ్వుకున్నాడు. ప్రమద విక్రంలు drawing room లో కూర్చున్నారు. ఏమిటి విశేషాలు అన్నాడు విక్రం. ఏమున్నవి చెప్పండి యేదైన విశేషం వుంటె మీరు రాగానే గబాగబా చెపుతూనే వుంటాను. మీకు తెలుసుగా అంది. అయితే యివ్వాళ్ల dull గా యెందుకున్నావు ప్రమదా అని దగ్గరగా లాక్కున్నాడు ప్రమదను. What is the matter అంటు.

ఏమిలేదు యెందుకో యివ్వాళ్ల depress గా వుందండి అంది. కారణం యేమో నాకే తెలియదు అంది. Anyway cheerup అన్నాడు విక్రం. సరసంగా నవ్వింది. సరే వుండండి నేను మీకు టీ తీసుకొస్తాను అని వంట యింట్లోకి వెళ్లింది. నరసమ్మా kettle ను యివ్వవే అంది. సరేనని నర్సమ్మ టీ కెటిల్ ను యిచ్చింది. నీళ్లు kettle లో పోసి పొయ్యి మీద వుంచింది. నీళ్లు కాగుతుంటె ఒక snack ను ప్లేట్లో పెట్టి యిది అయ్యగారికి యిచ్చిరా అంది. నర్సమ్మ snack ను drawing room లో విక్రం ముందున్న coffee టేబుల్ పై వుంచి వచ్చింది.

ప్రమద టీ కలిపి రెండు empty కప్పులను టీ కల్పి వుంచిన china pot ను ఒక tray లో వుంచి తాను స్వయంగా తీసుకొని విక్రంతో కూర్చుంది. ఇద్దరికీ టీ కప్పులలో వంచి ఒకటి విక్రంకు యిచ్చింది. పిమ్మట ప్రమద తీసుకుంది. ఇద్దరూ టీ త్రాగుకుంటు యేవేవో విషయాలు మాట్లాడుకున్నారు.

పిమ్మట ప్రమద నర్సమ్మను పిలిచి యివి తీసుకెళ్లి కడిగి పెట్టవే అంది ప్రమద. సరే అమ్మగారు అంటూ నర్సమ్మ ఆ tea pot త్రాగిన కప్పులను tray ను తీసుకెళ్లింది. విక్రం యిప్పుడు paper చదువుచున్నాడు. ప్రమద అతని భుజంపై తలవాల్చి నిశ్శబ్దంగా కూర్చుంది ప్రక్కన విక్రం కొన్ని పేపరులోని ముఖ్య విషయాలను అపుడపుడు చెబుతున్నాడు. వాటిని నేను చదివాను అంటూ ఒరిగి కూర్చుంది. అపుడప్పుడు యేది చూపించండి అని తను కూడ చదివి చూస్తుంది.

ఈ విధంగ ఇద్దరూ పత్రికతో కాలక్షేపం చేస్తూకూర్చున్నారు. వంటమనిషి సంగతి యేమయ్యింది ప్రమదా అన్నాడు విక్రం పత్రిక చదువుతూనే. ఇవ్వాళనే అమ్మ యింటికి వెళ్ళాను. రేపో మాపో పుల్లయ్య ఒక మనిషిని తెస్తాననా్నడట చూడాలి అంది ప్రమద.

ఓ మళ్లీ వెళ్లినావా మీ అమ్మ యింటికి. ఏం వెళ్లకూడదా అంది ప్రమద జాలిగా విక్రం వైపు చూస్తు. తప్పకుండా వెళ్లాలి. ఇంట్లో ఒంటరిగా కూర్చునే బదులు వెళ్లుట చాలా మంచిది. మీ అమ్మ వుండిపొమ్మంటె విన్నావుకాదు. ఇక్కడ నీకు బోర్ అవుతుందనుకుంటూ కదు ప్రమదా. లేదండీ ఇక్కడికి వచ్చే మంచిపని చేశాం. ఇది నాయిల్లు నాకు సర్వాధికారం స్వతంత్రం నాయింట్లో. పెండ్లి జరిగిననాడే నేను నీదాననయినా. నీయిల్లు యెక్కడో నాయిల్లు అక్కడే అన్నది ప్రమద. నేను కాదనటంలేదు నీవన్నది. కాని నీవు ఒంటరిగా వుంటున్నావని నాదిగులు. అందులో నీవు గర్భవతివి యెప్పుడూ సంతోషంగా వుండాలనే నా కోరిక అన్నాడు విక్రం. రేపు అమ్మా నాన్న వాళ్లంతా మన యింటనే తింటారు కదా. యేమిచేయాలి అని ఆలోచిస్తున్న. మీరేమైనా suggestions యిస్తారా అంది. నా suggestions యేముంటాయి. నాకు వంటయిల్లంటేనే అసహ్యము. నీకు తెలుసు కదా ప్రమదా అన్నాడు. నాకు తెలుసు సరదాకు అడిగాను. నేను బాగానే చేస్తాను. మీరు చూడండి అంది. Good అన్నాడు విక్రం. మరి మనంవెళ్లి రేపటికి కావలసిన సామానులు తేవాలి. మీరు సిద్ధంగా నున్నారు కదా. నేను తయారు అయివస్తాను. సరేనా అన్నది ప్రమద. OK. అన్నాడు విక్రం.

ప్రమద 10 నిమిషాలలో బట్టలు మార్చుకొని రతీదేవిలా drawing room లోకి వచ్చింది. ఎలావున్నాను నేను అన్నది విక్రంతో. నాకైతే మేనక, రంభను తలదన్నినట్లు కనిపిస్తున్నావు ప్రమదా. నీవు దేవలోకమున వుండదగినదానవు నాదృష్టిలో. అవి మానవలోకానికి దిగివచ్చిన దేవకన్నియవు ప్రమదా అన్నాడు కౌగిలించుకొని.

ఆఁ, దూరంగా వుండండి నాబట్టలు నలిగిపోతాయి అని దూరంగా నిలబడ్డది.

సరే! అని విక్రం మరి వెడదామా అన్నాడు. సరే అని నర్సమ్మా రావే పోదాము అంది. నర్సమ్మ రాగానే దానితో యింటికి తాళం వేయించి ప్రమద విక్రం కారులో కూర్చున్నారు. 30 నిముషాలలో మార్కెట్టు చేరుకున్నారు. కారు park చేయకముందు ప్రమదను నర్సమ్మను మార్కెట్టులో దింపినాడు. పిమ్మట అక్కడికి దగ్గరగా park చేసి ప్రమదను కలుసుకున్నాడు. ప్రమద అవసరమైన వస్తువులు కొంటోంది. నర్సమ్మ వాటిని సంచులలో సర్దుతుంది. విక్రం వాళ్ళననుసరిస్తున్నాడు. ఇట్లా గంటన్నర సేపు షాపింగ్ చేసింది. పిమ్మట విక్రం అన్నాడు. ఇంక యెంత సేపు చేస్తారు అన్నాడు విక్రం. ఇక అరగంటలో కారులో కూర్చుంటాము అంది. Take your own time. I am just asking అన్నాడు. సరేనని ప్రమద ఆ shop వాళ్లతో ధరలు అడిగి బేరము చేస్తోంది. అన్నీ కొన్నది. పిమ్మట విక్రంతో ఒకటి రెండు సంచులు మీరు పట్టుకుంటారా అంది. ఎందుకు మీరు మీ సామానులు ఇచటనే వుంచండి, నేను కారు తెస్తాను అని పోయినాడు విక్రం.

6 నిమిషాలలో కారు తీసుకొనిరానే వచ్చాడు. నర్సమ్మ డిక్కీలో సామానంత

సర్దింది. అర గంటలో సామానుతో సహా యింటికి వచ్చినారు. నర్సమ్మ సామానంత లోనికి తీసుకెళ్లింది. ఇక రేపు చాలా పని వుంది. ఉదయము తొందరగా లేవాలి. అలారము పెట్టుకొని... అంది ప్రమద. సరే నీవు లేచి నన్ను మాత్రము లేపకు అన్నాడు విక్రం. అలాగే మీరు లేచి మాత్రం యేమి చేస్తారు. మీరు పండుకొనివుంటేనే నాపని సాఫీగా జరుగుతుంది అంది. రేపటి విషయమై ఆలోచించుకుంటు ప్రమద మంచంపైన ఒరిగింది. చాలా సేపటివరకు నిద్ర రాలేదు. పక్కన విక్రం గుర్రు కొడుతు నిద్రపోతున్నాడు. రేపటి dinner ప్రమదను నిద్రపోనిస్తలేదు. చాలసేపు ఆలోచించి అన్ని నిర్ణయాలు తీసుకొని ప్రమద నిద్రపోయింది.

తెల్లవారు ఉదయమే లేచింది. నర్సమ్మను లేపింది. ఇద్దరూ యేదేదో చేస్తున్నారు. ప్రమద నర్సమ్మకు చెప్పి చేయిస్తుంది. ఆనాడు రెండు మామ్సాలు, రెండు కూరగాయలు, పప్పు, సాంబారు మరి రెండు తీపివంటలు చేస్తుందని విక్రంకు తెలుసు. అవి ఆమె minimum requirements dinner కు. విక్రం లేచి టీ త్రాగి కొంచెంసేపు యిటు అటు యింటిలో తిరిగి అపుడప్పుడు Do you need any help ప్రమదా అన్నాడు. No thank you అంది ప్రమద. ఇంతలో office time కాగానే వెళ్లిపోయినాడు. ప్రమదా కారు కావలిస్తె వుంచుకో యివ్వాళ్ల అన్నాడు. No I don't need it అంది.

సరే good luck for the dinner అని వెళ్లిపోయినాడు. ప్రమద తనకు తోచినంత చేసి సాయంకాలానికి కావలసిన వంటలన్నీ సిద్ధంగ వుంచింది. పిమ్మట స్నానం చేసి బట్టలు వేసికొని సిద్ధంగా వుంది విక్రం రాకకు యెదురుచూస్తు. ఆనాడు రఘునాథరాయలు కూతురు ఇంట్లో భోంచేయాలని కొన్ని నిమిషాలు తొందరగానే వచ్చినారు. రాగానే శ్రీలక్ష్మమ్మతో ప్రమద యింటికి మన వంటమనిషిని పంపించినావా శ్రీ అన్నాడు రఘునాథరాయలు. లేదు అన్నది శ్రీలక్ష్మి. ఎందుకని? ప్రమద తనే స్వయంగ చేస్తాను అని వంటమనిషిని పంపించింది

అలాగా, మరినివ్వెందుకు పోలేదు అన్నాడు రఘునాథరాయలు. పోదామనుకున్నాము కాని నేను జోక్యం చేసుకుంటె యిష్టపడుతుందో లేదోనని పోలేదు. ఆమెనే చేయనీయండి. నేర్చుకుంటుంది. రేపైతె ఆమె కొరకు మాట్లాడిన వంటమనిషి వస్తాడు అప్పుడు వాడే చూచుకుంటాడు యింట్లో వంటపని అంతా. అప్పుడు మీకు మీ కూతురుకు చీకుచింత వుండదులే అంది నవ్వుకుంటు శ్రీలక్ష్మమ్మ. రఘునాథరాయలు నవ్వి వూరకున్నాడు. ఎన్ని గంటలకు రమ్మంది మనలను అన్నాడు రఘునాథరాయలు. ఆరుగంటలకు అన్నది. యెపుడైన వెళ్లవచ్చు. మీరు మొఖం కడుక్కొని బట్టలు మార్చుకోండి. సుమిత రాగానే అందరము కలిసి వెళ్లుదాము అంది శ్రీలక్ష్మమ్మ. సుమిత రానే వచ్చింది. అప్పటికే ఆరుగంటలు దాటిపోయినది. శ్రీలక్ష్మమ్మ కూడ బట్టలు మార్చుకొని సిద్ధమైనది. అందరూ నడచుచు బయలుదేరినారు. విక్రం గేటువద్దకువచ్చి ఆహ్వానించినాడు.

ప్రమద నర్సమ్మతో అన్నీ సిద్ధం చేయించుతూ యింక వంటి యింట్లోనే వుంది. బట్టలు మాత్రము మార్చుకుంది. అందంగా తయారైంది. simple గా ఒక diamond necklace ధరించింది. విక్రం మామగారిని, అత్తగారిని, మరదలను

drawing room లో కూర్చుండబెట్టి ప్రమదను పిలుచుటకు వెళ్లినాడు. ప్రమద నీ parents & sister వచ్చి కూర్చున్నారు. మరి నీవు యింక వంట చేస్తున్నావా అన్నాడు. లేదండి అన్ని వంటలు యెపుడో అయిపోయినవి కొంచెం పండ్లరసం తీయించి పెట్టినా మరి మీరేమైన drink నాన్నకు offer చేస్తారా లేక juice యిస్తామంటారా అంది. లేదు ప్రమద అందరం juice నే తీసుకుందాం యేమంటావు అన్నాడు విక్రం. సరేనంటాను అంది ప్రమద. రా మరి అందరము కూర్చుందాము అనగానే అయిదు గ్లాసులు మరి juice jug ఒక ట్రేలో పెట్టుకొని విక్రంతోపాటు drawing room లోకి వచ్చింది.

రాగానే tray ని coffee table పై వుంచి ఒకటొకటి తీసి ముగ్గురికి యిచ్చి పిమ్మట విక్రంకు కూడా ఒక గ్లాసు యిచ్చింది. చివరకు ఒక గ్లాసు తీసుకొని విక్రంవద్ద కూర్చుంది. ఇప్పుడు అందరూ juice sip చేస్తూకూర్చున్నారు. ప్రమద లేచి గ్లాస్‌తో తల్లి శ్రీలక్ష్మమ్మమ్మ చెంత కూర్చుంది. కొంచెంసేపు యేవో మాటలు మాట్లాడి మెల్లగ తన periods ను గూర్చి చెప్పింది. శ్రీలక్ష్మమ్మ సంతోషంతో మునిగిపోయింది. అవునా ప్రమదా అంది అందరూ వినునట్టు, యిది వినగానే సరిత రఘునాధరాయలు దిగ్భ్రాంతులై శ్రీలక్ష్మమ్మ వైపు చూసినారు. విక్రం చలించలేదు. ఎందుకంటె ప్రమద తాను తెలుపుతానన్న secret ను తెల్పింది శ్రీలక్ష్మమ్మకు అనుకున్నాడు. యేమిటే అమ్మా ఆ secret అంది సరిత. ప్రమదా యేమిటమ్మా మీ అమ్మ అంత సంతోషంగ వుంది అన్నాడు రఘునాధరాయలు. ప్రమద ముసిముసిగ నవ్వుతు, యేంలేదు నాన్న అంది చేతులు నిమురుకుంటు. శ్రీలక్ష్మమ్మ ఒక సంతోషవార్త వినిపించింది ప్రమద అంది. మీరిద్దరికేనా ఆ వార్త పరిమితము లేక మమ్ములను కూడా భాగస్వాములు చేసుకుంటారా అన్నాడు రఘునాధరాయలు. మీరు తాతగారు కాబోతున్నారు అన్నది శ్రీలక్ష్మమ్మ. ఓ అదా నీ సంతోషము. Really it is a good news అమ్మా అన్నాడు రఘునాధరాయలు. ఆ వార్త విన్న రఘునాధరాయలు లోలోన చాలా సంతోషించినాడు. కాని పైకి చాల నిబ్బరంగనున్నాడు.

మరి డాక్టరుకు చూపించారా అన్నాడు రఘునాధరాయలు. లేదు అంది ప్రమద. మరి యిప్పుడే call చేసి oppointment తీసుకొమ్మంటావా అమ్మా అన్నాడు రఘునాధరాయలు ప్రమదతో. మీ అల్లుడుగారు అప్పుడే తీసుకున్నారు నాన్నా అంది ప్రమద. సరేనమ్మా అమ్మను కూడా వెంట తీసుకెళ్లు అన్నాడు రఘునాధరాయలు. సరిత అయితే నేను చిన్నమ్మనౌతున్నానన్నమాట అంది నవ్వుకుంటు. అందరూ కొంచెంసేపు సంతోష సాగరంలో మునిగిపోయారు పిమ్మట ప్రమద లేచి వెళ్లింది. నర్సమ్మతో అన్నీ తెచ్చి యీ టేబుల్ మీద పెట్టమంది. ఆమె తెచ్చినవి తెచ్చినట్టు టేబుల్ పైన మ్యాట్లు వేసి అన్నీ సర్దింది. పిమ్మట కడిగి తుడిచిన ప్లేట్లనన్నిటిని టేబిల్ పైన పెట్టించింది. ఎవరు యెచ్చట కూర్చోవాలన్నది నిర్ణయించి డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్లి విక్రం table is set you all can come to table అంది. సరేనని విక్రం, అత్తగారిని, మామగారిని, మరదలుగారిని ఆహ్వానించినాడు.

వారు రాగానే యెవరికి నిర్ణయించిన స్థలంలో వారిని కూర్చుండబెట్టింది.

అప్పుడు శ్రీలక్ష్మమ్మ ప్రమద రేపు నీ వంటమనిషి వస్తున్నాడమ్మా ఒకరోజు ముందువస్తే యీ పనంతా వాడు చేసేవాడు కదా అంది. పరవాలేదమ్మా నేను చేసుకోగలనా లేదా అని నన్ను నేనే పరీక్షించుకొన్నాను. ఇప్పుడు తిని మళ్లీ తెల్పండి నావంటలు యెలానున్నవీ అంది. సరే అమ్మ వడ్డించు అన్నాడు రఘునాథరాయలు. తను చేసిన వంటలన్నీ ఒకటొకటిగా వడ్డించింది అయిదు నిమిషాలలో. అందరూ తిన్నారు. తింటూ బాగాచేశావమ్మా అన్నాడు రఘునాథరాయలు. మొదటిసారిగా చేసినా చాల బాగున్నాయే తల్లి అంది శ్రీలక్ష్మమ్మ. బాగుండుటేమిటి చాలా బాగున్నవి అన్నాడు రఘునాథరాయలు. అందరూ భోజనాలు ముగించారు. Drawing room లో కూర్చున్న నలుగురికి dessert serve చేసింది ప్రమద. అదికూడ తిని మెచ్చుకున్నారు. పిమ్మట మసాలపాన్ tray లో తెచ్చింది నరసమ్మ. అందరూ తీసుకున్నారు విక్రం తప్ప. విక్రంకు యే అలవాట్లూ లేవు. అందుకే విక్రం తప్ప తక్కిన వాళ్లంతా మసాలపాన్ తిన్నారు. మాటాడుకుంటు అందరూ ప్రమద యింట్లోనే వున్నారు. పిమ్మట పదకొండు గంటలకు నడచి తమ యింటికి చేరుకున్నారు. ఆనాడు ప్రమద చాల సంతోషంగ పడుకుంది విక్రం కౌగిలిలో. తెల్లవారి sunday కావున యిద్దరూ ఆలస్యంగ లేచినారు.

సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు. పడమర అస్తమిస్తాడు. ప్రతిరోజూ యిది తప్పనిసరి. యెన్నాళ్ల నుండి యితడు తన కర్తవ్యాన్ని యిలా నిర్ణయిస్తున్నాడో యింక యెన్నాళ్లు యిలా నిర్వర్తిస్తాడో యెవరికీ తెలియదు. యిలా దినాలు, వారాలుగా, వారాలు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా, సంవత్సరాలు దశాబ్దాలుగా, దశాబ్దాలు శతాబ్దాలుగా మారుతునే వున్నాయి. యీ అంతులేని, ఆది లేని సమయంలో మన జీవిత పరిమితి యెంత చిన్నదో ఊహిస్తే అర్థమౌతుంది. అయినా మానవుడు యీ క్షణభంగురమైన జీవితములో యెన్నియో ఆశలు, ఆశయాలు నెరవేర్చుకోవాలని ప్రయత్నిస్తాడు. ఆధ్యాత్మికంగ ఆలోచిస్తే మానవుని పుట్టుకకు మరి గిట్టుటకు మధ్యలోనున్న సమయం యెంత చిన్నదో ఆలోచిస్తే తెలుస్తుంది. పుట్టుటకు మొదలు మనమెక్కడున్నాము, మరి గిట్టిన పిదప యెచటికి వెడతాము యెవరికి తెలియదు. స్వర్గనరకాలున్నాయా వుంటె మరోజన్మ యెందుకుంటుంది. స్వర్గములో అన్ని సౌఖ్యాలు అనుభవిస్తూ వుండక మళ్ళీ జన్మ యెందుకు. లేక నరకములో యమ బాధలననుభవించిన పిమ్మట మళ్ళీ జన్మనిస్తారా. ఏమిటి యీ విచిత్రము. అంత అజ్ఞానమా లేక యేమిటి? అన్ని మతాలు స్వర్గాన్ని నరకాన్ని చిత్రిస్తాయి. యీ విషయములో ఎవరు అంటే యే మతము. స్వర్గము లేదని నరకము లేదని వాదించరు. కాని యెవరు యీ స్వర్గనరకాల నుండి వచ్చి వాటి విషయమై మనకు చెప్పలేదు. అంతేకాకుండ మనము జన్మమెత్తక ముందు యే జన్మ నుండి యే జన్మకు వచ్చినాము చెప్పలేము లేదా చావగానే యెన్ని రోజుల పిమ్మట యే జన్మనెత్తగలము కూడ చెప్పలేము. అయినా ప్రమద విక్రంలు నిన్నటి డిన్నరు విషయమై చాలా బాగా జరిగిందని మాటాడుకుంటున్నారు. తనకు రాబోయే baby గురించి కూడా మాటాడుకుంటున్నారు టీ పైన. అంతేకాదు విక్రం తన అమెరికా ప్రయాణం విషయమై కూడా తన వూహాలోనున్నవి ప్రమదతో

చెప్పుచున్నాడు. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత అమెరికా ప్రపంచంలోనున్న అన్ని దేశాలకన్న బలీయమైనది, భాగ్యవంతమైనది అని ప్రమదతో చెప్పుచున్నాడు. అప్పుడు ఇంగ్లాండుకున్నంత ప్రాముఖ్యత అమెరికాకు యింక లేదు. అందుకే అప్పుడు పై చదువులకు వెళ్లే వాళ్లంతా ఇంగ్లాండుకే వెడుతుండేవారు. అప్పుడప్పుడే కొంతమంది అమెరికా విషయమై దాని ఆర్థిక విధానంపై విద్యావిధానంపై చర్చలు జరుపుచుండెడివారు. కాని యింకను, ప్రత్యేకంగా భారతదేశం నుండి ఇంగ్లాండు వెళ్లేవారి సంఖ్యయే యెక్కువ. మన విద్యార్థి లోకంలో విక్రం, ప్రమద రోజా యేవో చర్చలు జరుపుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు. యిప్పుడు ప్రమదకు వంటపని లేదు. వంటవాడు, నర్సమ్మ కలిసి అన్ని యింటి పనులూ చేస్తున్నారు కాబట్టి ప్రమద విక్రం office కు వెళ్లగానే తల్లి యింటికి తరచుగా వెళ్లి విక్రంవచ్చే సమయానికి యిల్లు చేరుకుంటుంది. లేదా తల్లి దగ్గరనే సాయంకాలం వుండి విక్రం రాగానే మనిషిని పంపి తండ్రిగారింటికి రప్పించుకుంటుంది. అచ్చటే భోంచేసి పిమ్మట రాత్రికి వచ్చి తమ యింట్లో పడుకుంటారు. ఈ విధంగా కాలం దొర్లిపోతుంది. విక్రం పరీక్షలు సమీపిస్తున్నాయి. అందుకే యిప్పుడు ప్రమదను తల్లిగారింట్లో వదిలి తను చదువు సాగిస్తున్నాడు. ప్రమద తల్లిగారింట్లో హాయిగ కాలం వెళ్లబుచ్చుతుంది. ప్రియమైన తల్లి తండ్రి, చెల్లెలు కంపెనీని చాల enjoy చేస్తుంది. విక్రం office నుండి రాగానె ప్రమదను చూచుటకు వస్తుంటాడు. పిమ్మట తన యింటికి వెళ్లి చదువుకుని నిద్రిస్తాడు. చూస్తుండగానే పరీక్షలు రానెవచ్చినవి. తనకు దొరికిన సమయాన్నంత బాగానే వినియోగించి చదివినాడు. పరీక్షలయి పోయినవి. ఫలితాలకు వేచియున్నారు. ఈ M.A. degree అతనికి అవసరములేదు I.A.S. ఉద్యోగిగా పనిచేస్తే కాని అతని మనస్సు academic life పైననున్నది. అనేక మంది I.A.S. వస్తే ఆకాశానికి యెక్కినాము అనుకుంటారు. కాని విక్రం మాత్రం I.A.S. stepping stone for ultimate achievement అనుకుంటాడు. దీనికి M.A. $I^{st}$ class అతనికి కావాలి. ఆ సాధనకే ప్రయత్నించినాడు. ఫలితాలకు యెదురు చూస్తున్నాడు.

పత్రికలలో M.A. final పరీక్షాఫలితాలు రానే వచ్చినవి. విక్రం ప్రథముడుగా నెగ్గినాడు $I^{st}$ classలో. ఇది అతనికి చాల ధైర్యాన్ని యిచ్చింది. ప్రమదకూడ సంతోషించింది. ఇంకా కొన్ని నెలలో ఆమె తల్లి కాబోతుంది. ఆ దినానికై ఆమె విక్రం వేచి చూస్తున్నారు. మొదట్లో వాంతులు యిప్పుడు కడుపులోనున్న పాప రోజా కడుపులో కదులుతు కాళ్లు చేతులతో లోపల కదులుతూ వుంటాడు. విక్రంకు కూడా ఈ సంగతి చెప్పి ఆ కదలిక చూపిస్తుంది. ప్రమద యిప్పుడు తల్లి యింట్లోనే వుంది. విక్రం కూడ office నుండి రాగానే తల్లితోనున్న ప్రమదవద్దనే యెక్కువ గడుపుతుంటాడు. హైద్రాబాదు సెక్రెటేరియట్‌కు సమీపాననున్న U.S.I.S.కు వెళ్లి అచ్చటి విశ్వవిద్యాలయాల అడ్రసు తన అర్థికశాస్త్రానికి యేవి మంచి విశ్వవిద్యాలయాలో వాటి గురించి చదివి notes తీసుకుంటున్నాడు. అవి పూర్తికాగానే అన్నింటికి ఒకవారం కూర్చొని అర్జీలు వ్రాసి వాటి వెంట photo stat కాపీలు అన్నింటిని కలిపి u.s.కు మేలు చేసినాడు. మొదట హార్వర్డు విశ్వవిద్యాలయానికి, పిమ్మట ప్రింగ్‌స్టన్‌కీ, యేల్, బ్రౌన్, కార్నెల్, స్టాన్‌ఫోర్డు, బర్కిలీ మొదలగు ప్రఖ్యాత

విశ్వవిద్యాలయాలకు పంపినాడు. అమెరికన్‌లలో నున్న మంచిదేమిటంటె వాళ్లు జవాబు తప్పకుండా యిస్తారు. మనము ఆ జవాబులను చూచి దొరుకుతుందని ఆశలు పెట్టుకుంటాము. కాని వారి భాష డిప్లమాటిక్‌గా వుంటుందని మనము అర్థము చేసికొనము. ఆ అర్జీలు పంపిన నెలరోజులకు అన్ని విశ్వవిద్యాలయాల నుండి జవాబులు వచ్చినాయి. చాలమటుకు అప్లికేషన్ ఫారాలు వచ్చినవికాని ఆర్థికంగ సహాయానికి యేమి encouragement లేదు. అన్ని అప్లికేషన్ forms నింపి పంపినాడు. పిమ్మట వేరే కొన్ని స్టేట్ universitiesకి కూడ అప్లికేషన్ ఫారాలు నింపి పంపినాడు. చాల మటుకు అదే జవాబులు. కాని కొందరు మాత్రము మీరు వచ్చి ఒక సెమెస్టరు యిక్కడుండి మంచి గ్రేడులు తెస్తే అప్పుడు ఆలోచిస్తాము అన్నట్టుగా వ్రాసినారు. అది కొంచెం ఆశాజనకంగా వున్నా పూర్తిగా గ్యారంటీ లేదు. యిది కొంచెము నిరాశకు కారణమయినా విక్రం ధైర్యంతో పోయి chance తీసుకోవాలనే నిర్ణయించినాడు. అడ్మిషన్ యివ్వమని అతను హార్వర్డుకు వ్రాసినాడు. వ్రాసిన నెలరోజులలో అడ్మిషన్ వచ్చింది. అది చూపిస్తూ తన ఆర్థికస్తోమత గురించి certificate ను అమెరికన్ council general office కు దరఖాస్తు పెట్టుకొన్నాడు. అమెరికన్ consulate general visa యిస్తాము యింటర్‌వ్యూకు రమ్మన్నారు. సరేనని కొంచెం ఆలస్యం చేసి తనకు నాలుగు సంవత్సరాల study leave యివ్వమని A.P. ప్రభుత్వాన్ని కోరినాడు. ఆ కాలంలో ప్రభుత్వ ఉద్యోగులకు passport దొరకుట చాల కష్టము. అతడు Asst. collector గా నున్నప్పుడే పాస్‌పోర్టుకు అప్లై చేసినాడు. కాని ప్రాపర్ చానల్‌లో దరఖాస్తు రాలేదని తిరిగి పంపినారు. పిమ్మట ప్రాపర్ చానల్‌లో పంపి రెండేండ్లు కావస్తున్నది. అది రావచ్చునన్న ఆశతోనున్నాడు విక్రం. ఇప్పుడే వీసా కోసం పోదలచలేదు. ఎందుకంటే ఇంకను ఏ విషయం ప్రమదతో మాటాడలేదు. అదిగాక తన బాబు లేక పాపాయో రాకమునుపే తొందరపడి అమెరికాకు పోదలచలేదు. ప్రమద ప్రసవించిన ఆరు నెలలకుగాని పోను అనుకొన్నాడు విక్రం.

ఒకనాడు తానో ఆదివారంనాడు drawing roomలో కూర్చొని వుండగా సుమిత్ I.A.S. మరి సుమన్ యిద్దరు బావమరుదులు తలుపు తట్టినారు. నరసమ్మ తలుపుతెరిచింది. హలో బావా good news congrats అన్నారు ఇద్దరూ. యేమిటా గుడ్ news అన్నాడు విక్రం. మీకు బుజ్జిబాబు వచ్చినాడు. ప్రమద మాలతి నర్సింగ్‌హోమ్‌లో ప్రసవించింది రాత్రి 1.58 ని.కు అన్నాడు సుమిత్. అప్పుడు విక్రంకు నోటమాట రాలేదు. యేం బావా మాటాడవేమి అన్నాడు సుమన్ విక్రం చిన్న బావమరిది. ఆ చాల సంతోషం. ప్రమద యెలా వుంది అన్నాడు విక్రం. బాగానే వుంది. అమ్మ అక్కయ్యతోనే వుంది. ప్రసవించుట కొంచెం కష్టంగానే జరిగిందట. ఇప్పుడు బాబు అక్కయ్య క్షేమంగా నున్నారు. వారం రోజులు ఆ నర్సింగ్‌హోంలోనే వుంటారు అనుకుంట అన్నాడు సుమన్. సుమన్ మద్రాసు presidency కాలేజ్‌లో M.A. చేస్తున్నాడు. అందువల్ల యెప్పుడు మద్రాసులోనే అతని మకాం. సుమిత్ కలెక్టర్‌గా జిల్లాలలో వుంటాడు. ఆయన చాల కష్టపడి పనిచేసే sincere officer. ఇక హైద్రాబాదులో రఘునాథరాయలు,

శ్రీలక్ష్మమ్మయు, సరితనే వుంటారు. ఇప్పుడు అందరూ పెద్దవారైనారు. సరిత కూడ కాలేజ్‌లోనే వుంది. పెండ్లైనప్పుడు చిన్న పిల్ల. చిట్టి మరదలుగా చాలాచాల సరసాలు ఆడి బావని ముప్పు తిప్పలు పెట్టేది. సుమిత్ యింకా పెండ్లి చేసుకొనలేదు. తల్లితండ్రి అతనిని అడుగుతూనే వుంటారు. అతడు యేదో సాకు చెప్పి పోస్టుపోన్ చేస్తూనే వచ్చాడు. విక్రంకన్నా కొన్నేండ్లు పెద్దనే. ఎందుకు చేసుకొనలేదని ప్రమదను అడిగినాడు విక్రం. ప్రమద చెప్పిన ప్రకారం సుమిత్ కాలేజ్‌లో వుండగానే ఒక అమ్మాయిని ప్రేమించినాడట. ఆమెకు అందం, చదువు అన్ని వుండెనట కాని వంశం మరి స్టేటస్ లేకుండెనట. రఘునాథరాయలు, శ్రీలక్ష్మమ్మ అది మనకు తగిన సంబంధంకాదని చాల వత్తిడి తెచ్చినారట. అందువల్ల ఆ అమ్మాయి ఒక డాక్టరును పెండ్లి చేసుకొందట. అప్పటి నుండి యెన్ని సంబంధాలు వచ్చినా నచ్చవని పంపినాడట. ఇది సుమిత్ కథ. ఇప్పుడతనికి దాదాపు ముప్పది సంవత్సరాలకు పైగా వుంటాయిట. విక్రం యిద్దరితో సరదాగా మాటాడుతున్నాడు. వారిద్దరు ఆ పసిపాపను చూచారట. రఘునాథరాయలు వీరు కలిసియే వెళ్లినారట. మీవలెనే వుంటాడు బావా అన్నాడు సుమన్ విక్రంతో. అయినా ఆ పసిగుడ్డుకు యెవరి పోలికలుంటాయి చెప్పేది కష్టము. ఈ పసిపాపలు నెలనెలకు మారుతు వుంటారు అనుకున్నాడు విక్రం. అలాగా సుమన్ good అన్నాడు. నా కొడుకు గదా నావలెనే వుంటాడు. మీ అక్క పోలికలు లేవా అన్నాడు విక్రం. ఏమో బావా అచ్చం విక్రం పోలికలే అంది ప్రమదక్క అన్నాడు సుమన్. ఇలా మాటాడుకుంటు కాలం గడుపుతున్నారు ముగ్గురూ. పిమ్మట లేచి రఘునాథరాయల యింటికి వెళ్లినారు. వీరు ముగ్గురు ప్రవేశించగానే రఘునాథరాయలు చాల సంతోషించారు. అతడు మితవాది. ఎక్కువ మాటాడడు సందర్భం లేనిది. ఒక్కొక్కసారి సందర్భానుసారంగా ఎక్కువగానే మాటాడుతాడు. ఈ ముగ్గురు అయన కుటుంబము తనముందు కుర్రవాండ్లు కాబట్టి యేమి మాటాడేది వుంటుంది. అందుకే పుట్టిన మనుమడి గురించి కొంచెం మాటాడినాడు. మగపిల్లవాండ్రంటె మీ అత్తగారికి చాల యిష్టము. అందుకే మనవణ్ణి విడిచిరాలేదు ఆమె అన్నాడు నవ్వుతు. విక్రం నవ్వి వూరకున్నాడు. భోంచేసి వెడదాం అని అన్నాడు రఘునాథరాయలు. అప్పుడు 12 గంటల సమయము. సరిత యిప్పుడు యింటిలో పెద్ద. ఆమె వంట చేయిస్తుంది అన్నలకు. తండ్రిగారికి ఆమే వడ్డిస్తుంది. వీరు మాటాడుకుంటుంటె ఆమె drawing roomలో ప్రత్యక్షమయ్యి భోజనాలకు రండి నాన్న అంది. సరే అమ్మా యిప్పుడే వస్తాము అన్నాడు రఘునాథరాయలు. కొంచెంసేపట్లో అందరూ భోజనానికి పోయినారు. భోజనాలైన పిమ్మట సుమిత్ కారులో మాలతి నర్సింగ్‌హోంకు వెళ్లినారు. నలుగురు ప్రమద వున్న గదికి వెళ్లినారు. ఉన్నవే రెండు కుర్చీలు ఆ రూంలో. లక్ష్మమ్మ ఒకదానిలో మరోదానిలో రఘునాథరాయలు కూర్చున్నారు. ప్రమద మత్తులో మంచంపై పరుండి వుంది. ఎలావున్నావమ్మా అని తల నిమిరినాడు రఘునాథరాయలు. శ్రీలక్ష్మమ్మ బాబును యెత్తుకొని కొడుకులకు విక్రంవద్దకు తెచ్చింది. సుమన్ యెత్తుకొని ఆనందిస్తున్నాడు. శ్రీలక్ష్మమ్మ యెలా యెత్తుకోవలెనో యేయే జాగ్రత్తలు తీసుకొనవలెనో పసిపాపను యెత్తుకున్నప్పుడు అని చిన్నకొడుకుకు తెల్పుతుంది. ఇంక

యీా బాబు యీా ప్రపంచంలోకొచ్చి కొన్ని గంటలే అయ్యింది. కళ్లు మూసుకొని వున్నాడు. సుమన్ కొంచెంసేపు యెత్తుకొని విక్రంవద్దకు వచ్చి బావా యెత్తుకుంటావా అన్నాడు. ఇప్పుడే వద్దు యింటికి వచ్చిన పిదప యెత్తుకుంటాను అన్నాడు. పిమ్మట తండ్రి వారివద్దకు తీసుకువెళ్లినాడు. రఘునాథరాయలు మహాసంతోషంగ మనవణ్ణి రెండు చేతులతో జాగ్రత్తగా తీసుకున్నాడు. కొంచెంసేపు తాతవద్దనున్న ఆ పసికందు యేడువనారంభించినాడు. వెంటనే శ్రీలక్ష్మమ్మ రఘునాథరాయల వద్దనుండి తీసుకొని వూరడించుటకు ప్రయత్నించింది. కాని ఆ పసికందు వూర్కోవడము లేదు. అందువల్ల అమ్మా వీడికి ఆకలవుతుందేమోనే కొంచెం పాలియ్యి తల్లీ అని ప్రమద ప్రక్కలో పండపెట్టింది. ప్రమద పాలు తాపిస్తుంది. అందువల్ల పాలు త్రాగుతు యేడ్పు మానినాడు. పిమ్మట నిద్రించినాడు. ఇట్లా కొంతకాలం ప్రమద గదిలో గడిపి నలుగురూ సరే యికవస్తాము అన్నాడు. రఘునాథరాయలు శ్రీలక్ష్మమ్మతో. మళ్లీ సాయంకాలం వస్తాము యేమైన తెమ్మంటావా అన్నాడు రఘునాథరాయలు. యేముంది తెచ్చుటకు యిప్పుడు అన్నీ వీరు యిస్తున్నారిచ్చట. వీలైతే సరితను కూడ తీసుకొని రండి సాయంకాలం అంది శ్రీలక్ష్మమ్మ. సరే అని అందరు బయటపడ్డారు.

ప్రమద వారంరోజుల పిమ్మట బాబుతో తల్లి యింటికి వచ్చేసింది. ఇప్పుడు బాబుకు ఒకవారం. నామకరణం చేయుటకు యింక పదునాలుగు రోజులు. నామకరణం చేసేనాడు యెవరిని ఆహ్వానించాలెనని శ్రీలక్ష్మమ్మ మరి రఘునాథరాయలు మాటాడుకొని ఒక list తయారుచేసినారు. ఘనంగా జరుపవలెనని నిశ్చయించినారు. ఇక యే పేరు బాగుంటుందో అందరూ కలిసి ఆలోచించి తమకిష్టమైన పేరును ప్రమదతో తెలుపుతున్నారు. ఆమె కూడా పేర్ల విషయమై ఆలోచిస్తుంది. అన్నిపేర్లు రాసుకొంది. ఆమెకు నచ్చినపేరు ఒకటిమాత్రమే అది ఆమె మనస్సులో వుంచుకొంది. ఒకనాడు విక్రంతో యేపేరు పెట్టుకుంటారు మీ ముద్దుల కొడుకుకు అని అడిగింది. నీకేది యిష్టమైతే అదే నాకూ యిష్టము ప్రమద అన్నాడు. మీకేదైన పేరు గుర్తుకు రాదా అంది. అప్పుడు విక్రం "అవిలోకితేశ్వర్" యెలా వుంటుంది అన్నాడు విక్రం. బాగుంటుంది కాని చాల పొడుగైన పేరు. పేరు short & sweet వుండాలి అంది. అయితే నీవే ఆలోచించుకో మరి నాకు నచ్చింది నీకిచ్చినాను అన్నాడు. ప్రమద నవ్వింది. ఇంకేమైన పేర్లు వుంటే ఆలోచించండి త్వరలోనే బాబుకు నామకరణం జరుగుతుంది అంది ప్రమద. సరే అన్నాడు విక్రం. మర్నాడు విక్రం బాబును చూచుటకు ప్రమద తల్లితండ్రుల యింటికి వచ్చినాడు. పేరు ప్రస్తావన మళ్లీ తీసింది ప్రమద. విక్రం నాకు తోచింది నిన్ననే చెప్పినాను యింక నాకు పేర్లు నిన్నటిదానికన్న మంచివి యేమి తెలియడము లేదు ప్రమదా అన్నాడు. అయితే నేనొక పేరు చెప్పనా అంది ప్రమద. సరే చెప్పు అన్నాడు విక్రం. "అనుపమ్" యెలా వుంటుంది అంది. బాగానే వుంటుంది అన్నాడు విక్రం. ఈ పేరు నీకు ఎందుకు నచ్చింది అన్నాడు విక్రం. బాబు కాబట్టి అనుపమ్, పాపవస్తే అనుపమ అని పెట్టుకోవచ్చు అంది ప్రమద సరే అనుపమ్ బాగానే వుంది. మీ అమ్మ, చెల్లి, అన్నయ్య, తమ్ముడు, నాన్నకు తెల్పి వాళ్లేమంటారో అన్నాడు విక్రం.

నేనన్నదాన్ని కాదనరు వారు. అదిగాక బాబుపేరు 'అ' తోటే రావాలట అంటే యిది జన్మనామము కూడా అంది ప్రమద. అయితే నాకు పూర్తిగా సమ్మతము. don't worry అన్నాడు విక్రం. చూస్తుండగానే బాబు పుట్టి యిరువదిరోజులయి పోయినవి. రేపు 21వ దినము. బాబు నామకరణ దినం. తెల్లవారగానే అందరు స్నేహితులు బంధువులు వాండ్రు వంటకి కావలసిన సామానంత వస్తుంది. శ్రీలక్ష్మమ్మ ముఖ్య పాత్ర వహించి రఘునాధరాయలు కూడ cuttlery వాండ్లను శామియానాలు వేసే వారిని పిలిపించి రేపు ఉదయం పది గంటల వరకు యింటి ముందు శామియానాలు సిద్ధం చేయి అని తెల్పి పంపించాడు ఆ కంపెనీవాడికి. సరేసాబ్ మీరు చూడండి పదికి మొదలే సిద్ధంగ వుంటాయి అన్నాడు. ఆ కంపెనీయే అన్ని ప్లేట్లు, చమచాలు, వంటపాత్రలు అన్ని supply చేస్తారు. వాటికి కావలసిన వస్తువులన్నింటిని తెచ్చి సిద్ధంగా వుంచినారు. మరునాడు సాయంకాలము బాబుకు నామకరణం జరుగుతుంది. అనుకున్న ముహూర్తానికి నామకరణం జరిగింది. "అనుపమ్" అని ప్రమద సూచించిన పేరునే అందరు ఒప్పుకున్నారు. నామకరణం జరుగగానే వచ్చిన స్నేహితులకు, బంధువులకు విందు జరిగింది. కృష్ణమోహన్, ధర్మారావు, శ్రీలత ప్రత్యేకంగ యీ బంధువర్గంలోనివారు. పాపం కృష్ణమోహనుడు యిప్పుడు పినతండ్రి, ధర్మారావు తాతగారు. శ్రీలత నాయినమ్మ. అందరూ సంతోషంగ ఒకరితో ఒకరు మాటాడుతు గడిపినారు. అన్ని విందులలో జరిగినట్టే యీ విందులో కూడా రకరకాల వ్యక్తులు, రకరకాల బట్టలు వేసుకున్నవారు వున్నారు. పార్టీ ముగియగానే చాలామట్టుకు స్నేహితులు సిటీలో వున్న బంధువులు వెళ్లిపోయినారు. ధర్మారావు, శ్రీలత కూడ కృష్ణమోహన్‌తో వెళ్లిపోతాము సెలవీయండి అని శ్రీలక్ష్మమ్మను అడుగగా మీరు కూడ పోతారా మీ మనుమన్ని విడచి అంది. యింతలో విక్రం వచ్చి నేను విడుస్తాను కూర్చోండి లేదా మాయింట్లో వుండండి అన్నాడు. సరే అని ధర్మారావు, శ్రీలత ఆగిపోయినారు. వారితోబాటు కృష్ణమోహనుడు కూడ అగిపోయినాడు. రాత్రి చాలా సేపటివరకు మనమని తీసుకొని శ్రీలత, ధర్మారావు కూర్చున్నారు. ప్రమద ఆవలించటం చూసి అమ్మా నీవెళ్లి పడుకోతల్లి అంది శ్రీలక్ష్మమ్మ. సరేనని ప్రమద వెళ్లిపోయింది. ఇప్పుడు శ్రీలక్ష్మమ్మ, రఘునాధరాయలు, ధర్మారావు, శ్రీలత, కృష్ణమోహన్, విక్రం మిగిలినారు. కొంచెంసేపు మనుమనితో ఆడుకొన్న పిమ్మట శ్రీలక్ష్మమ్మ మనుమని తీసుకెళ్లి ప్రమద ప్రక్కలో పడుకోబెట్టింది. యిప్పటికే ఆలస్యమైంది యికవస్తాము వదినగారు అని శ్రీలత లేచింది. ఆమెతోబాటు ధర్మారావు, కృష్ణమోహన్, విక్రం లేచినారు. ఆ దంపతులు మరి వారు యిద్దరి కొడుకులు విక్రం యింటివైపు నడిచినారు. రఘునాధరాయలు, శ్రీలక్ష్మమ్మ లోనికి వెళ్లినారు.

తెల్లవారుజామున లేచి ధర్మారావు కుమారునితో యిక వెడతాము బాబు. నీ అమెరికా ప్రయాణమెప్పుడన్నాడు ధర్మారావుగారు. కొంచెం ఆలస్యంగా పోవాలనుకుంటాను. ఇంతలేత వయస్సులో బాబును విడచి పోబుద్ధవడం లేదన్నాడు విక్రం. సరేనాయన అన్ని విషయాలు నీకు తెలుసు నీవు అన్ని ఆలోచించే నడుచుకుంటావు అన్నాడు. మరి మేము వెడతాము అంటె టీ త్రాగి వెళ్లండి.

నేను మిమ్ములను కారులో వదలిపెడతా లేదా తమ్ముడైన వదలుతాడు అన్నాడు విక్రం. సరే అని కూర్చున్నాడు ధర్మారావు. శ్రీలత యింట్లో అన్ని పనులు వంటవాడితోను నర్సమ్మతోను చేయిస్తుంది. కొంచెం టిఫిన్ తయారు చేయించి డైనింగ్ టేబుల్‌పైన పెట్టింది. టీని నర్సమ్మతో పంపింది. యిద్దరు కొడుకులు తండ్రి టీ త్రాగుతుండగా శ్రీలత కూడ వచ్చి కలిసింది వారితో. టీ ముగించుకొని యిక వెడతాము నాయనా అంది శ్రీలత. మంచిదమ్మా అని విక్రం తల్లిదండ్రుల పాదాలకు నమస్కరించాడు. కారు తాళపుచెవులు కృష్ణమోహన్ చేతులోబెట్టి అమ్మను నాన్నను భద్రంగ విడిచిపెట్టిరా తమ్ముడూ అన్నాడు విక్రం. సరే అన్నయ్య అన్నాడు కృష్ణమోహన్. కారు తలుపు తెరచి తల్లిని వెనుక సీటులో కూర్చోబెట్టి నాన్నా మీరు కృష్ణునితో కూర్చోండి అన్నాడు. ధర్మారావు సరే నాన్న వస్తాము అన్నాడు. కారు కదిలింది. విక్రం కారు కన్నుమేరలో నున్నంతసేపు చూస్తు నిలబడ్డాడు. పిదప లోనికి వెళ్లి కూర్చున్నాడు. ఇప్పుడు యింట్లో ఒక్కడే వున్నాడు. యిద్దరు పనివాళ్లతో కొంచెంసేపు పుస్తకం చదువుతు సోఫాపై ఒరిగినాడు. కొంచెంసేపట్లో బోరు కొట్టించినది ఆ పుస్తకం. లేచి ముఖం కడుక్కొన్నాడు. బట్టలు మార్చుకొని బయటికి నడిచాడు. ప్రమదను చూడాలనిపించింది. నేరుగా ప్రమద తల్లి యింట్లో ప్రవేశించాడు. ప్రమద గదిలో ప్రవేశించినాడు. ప్రమద బాబుకు పాలు యిస్తు మంచంపై కూర్చొని వుంది. శ్రీలక్ష్మమ్మ కూడా ఆగదిలోనే వుంది. అల్లుడు రాగానే లేచి యింకో గదిలోకి వెళ్లింది. ప్రమద బాబుకు పాలిస్తూ భోంచేసారా అంది. ఆకలి లేదు అన్నాడు విక్రం. ఎందుకు లేదు అని, అమ్మా అని పిలిచింది. పక్కగదిలోనున్న శ్రీలక్ష్మమ్మ యేమిటి ప్రమదా అని తలుపుబైటి నుండే అంది. మీ అల్లుడిగారికి భోజనం పెట్టించమ్మ అంది. విక్రం యిది వినగానే లేదు ప్రమద నాకు నిజంగ ఆకలిలేదు. ఆకలివేస్తే యింటికి వెళ్లి తింటాను. వంటవాడు వంట చేస్తున్నాడు అన్నాడు విక్రం. అప్పుడు ప్రమద యిక్కడ తింటె తప్పా అంది. తప్పనికాదు. అక్కడ వండినవంట వృథా అవుట నీకిష్టమా అన్నాడు విక్రం. సరే అచ్చటే భోంచెయ్యండి అని అన్నది. పిమ్మట అమ్మా మీ అల్లుడిగారికి ఆకలి లేదట భోంచెయ్యడట అన్నది ప్రమద. సరేతల్లి అని తల్లి శ్రీలక్ష్మమ్మ గొంతు వినబడింది. విక్రం కుర్చీపైన కూర్చున్నాడు. పాలు త్రాపుట విడిపించి కొడుకును విక్రంచేతులలో బెట్టి భద్రం అంది. అట్లాగే అని అనుపమ్‌ను యెత్తుకున్నాడు విక్రం. ముద్దుపెట్టుకున్నాడు, ముచ్చటిస్తున్నాడు. తన ముద్దుల బాబుతో ప్రమద యిదంతా చూస్తు మురిసిపోతోంది. కాని తొందరలోనే తన భర్త అమెరికా వెళ్లిపోతారని కొంచెం గాబర పడుతోంది. కాని on the whole పోవటం ఆయన మంచికేననుకొని నిశ్చయంగానుంది.

విక్రం యింటికి వెళ్లి భోంచేసినాడు. ఇప్పుడే వెళ్లాలా U.S.కు కొంచెం ఆలస్యం చేయాలి అని ఆలోచిస్తు కూర్చున్నాడు. నా బాబుకు ఒక సంవత్సరం రాందే యెలా పోవాలి అని అనుకుంటున్నాడు. సరే వీసాకు పిలుపువస్తే postpone చేస్తాను. Harvard నుండి అడ్మిషన్ వస్తే మళ్లీ semester లో వస్తాను అని

ప్రాస్తాను అని నిశ్చయించుకున్నాడు. రిజర్వ్‌బ్యాంకుకు హయ్యర్ స్టడీస్‌కై ఫారెన్ ఎక్ఛేంజ్‌కై వ్రాసినాడు. అతికష్టంగ పదివేల రూపాయల యీక్వలెంట్ డాలర్లు మంజూరు చేసినారు. రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ తనయుడు, విక్రం collegemates. అందుకే యీ మంజూరు దొరికింది లేకపోతే చాల కష్టంగా వుండేది అనాడు foreign exchange దొరకాలంటె, అప్పుడు రూపాయలు నాలుగు 75 పైసలకు ఒక డాలరు దొరికేది. ఒక సమస్య తీరింది. ఇక పాస్‌పోర్టు సమస్య యెలా తీరాలి అని ఆలోచిస్తున్నాడు. ఏదో విధంగా దాన్నికూడ తీసిపెట్టుకుంటె వీసాకు కష్టంకాదని ఆలోచిస్తున్నాడు విక్రం. ఏవేవో పుస్తకాలు refer చేస్తున్నాడు. చాలకాలం చూడగా చూడగా ఒక reference పుస్తకంలో భారతదేశపు అన్ని రాష్ట్రాల హోంశాఖామాత్యులు మరి కార్యదర్శులు యేదో ఒక సమావేశంలో తీసుకున్న నిర్ణయం విక్రం చూసినాడు. దీనిప్రకారంగా ప్రభుత్వ వుద్యోగులకు కూడ పాస్‌పోర్టును ప్రైవేట్ సిటిజన్‌కు యిచ్చినట్లే యివ్వవలసి వుంటుందని దీని తీర్మానం. ఈ రిఫరెన్స్‌ను quote చేస్తు మళ్లీ తన పాస్‌పోర్టు అర్జీపై తొందరగ నిర్ణయం తీసుకొని తనకు అయినంత త్వరలో పాస్‌పోర్టు మంజూరు చేసి పంపగలరని విన్నవించుకున్నాడు. ఈ reference పంపిన మూడు వారాలకే తన పాస్‌పోర్టు వచ్చింది. అది రాగానే విక్రంకు చాల ఆనందం కలిగింది. ఇప్పటివలె అప్పుడు మనదేశం చాల వెనుకబడిన దేశం. ఏది రావాలన్నా యెవరైనా తెలుపందే పనికాదు. అంతేకాకుండ మనము సోషలిస్టు విధానాల పేరట దేశంలో లైసెన్స్ మరియు పర్మిట్ రాజ్యాన్ని నడిపించినాము. ఒక డాలరు లేదా పౌండే కావాలంటె చాలా కష్టంగా చాల సమయాన్ని వృధా చేస్తే కాని రాని కాలం అకాలం. మనకు foreign exchange reserves చాల తక్కువగా వుండేది. అందువల్ల foreign exchange మరి passport రెండు readyగా తన చేతులలో వున్నందుకు విక్రం చాల సంతసించినాడు. అమెరికన్ విశ్వవిద్యాలయంతోగాని వారి counsel generalతో గాని యేమి సమస్యలు రాలేదు. మన ప్రభుత్వం నుండే చాల సమస్యలు వచ్చినవి. అయినా వాటినన్నింటి తన స్నేహితుల సహకారంతో తట్టుకున్నాడు. ఇప్పుడు యే తేదీలోగా వెళ్లాలి అని నిర్ణయించుకోవాలి. దానిని గురించే విక్రం ఆలోచిస్తున్నాడు. కాని యీ విషయమై ప్రమద సలహా అవసరం అని వూరకున్నాడు. మర్నాడు లేవగానే టీ త్రాగకుండానే ప్రమద తల్లిగారి యింటికి వెళ్లినాడు. రఘునాధరాయలు యింక యింట్లోనె office లో యేవో cases చూసుకుంటు కూర్చున్నాడు. ప్రమద రూంలోకి సరాసరి వెళ్లినాడు. ప్రమద మంచంపై బాబు పక్కన పడుకొని వుంది బాబును బుజ్జగించుతు. విక్రంను చూడగానె లేచి మంచంపై కూర్చుంది. బాబును యెత్తుకొని విక్రంకు యిచ్చి యిక మీ యిష్టం మీ కొడుకు యిష్టం వీడిని తీసుకొని పొండి. రాత్రులు పండనీయడు. నాన్న పోతాను అంటాడు యేడుస్తాడు అంది నవ్వుకుంటు. ఓ అలాగా నాన్నసరే అమ్మకు చెప్పు నేను నాన్నతో వుంటానని అన్నాడు విక్రం. బాబు కూడ కళ్లు తెరచి చూస్తున్నాడు, సరేనన్నాను అన్నట్లుగా. పిమ్మట విక్రం ప్రమదా passport మరియు foreign exchange permit వచ్చేసింది. నేను తలచుకుంటె 40 రోజులలో ప్రయాణం చేయవచ్చు U.S కు అన్నాడు. అవునా

సరే అయితే  మరి ఆలస్యం యెందుకు వెళ్లండి. అమ్మకు నాన్నకు మీరు వెళ్లాలని చాల వుంది అమెరికాకు. వారికీ సంగతి  తెలిస్తే చాల సంతోషిస్తారు అంది సంతోషంతో. అప్పుడు విక్రం యీ బాబును విడచి యిప్పుడే వెళ్లాలని లేదు ప్రమద. వీడు ఒక సంవత్సరం వాడైన పిదపనే వెడతాను అన్నాడు. వీడిని మేమందరము చూచుకుంటాము. మీరు  నిశ్చింతగా వుండండి అంది ప్రమద. సరే ఆలోచిస్తా ఈ విషయమై అన్నాడు. ఆలోచించేదేముంది. మీరు వెళ్లండి  please. ఎంతతొందరగా వెడితే అంత తొందరగా మీ అమెరికా చదువు ముగించుకోవచ్చు అంది. నేను ఆ  దేశంలో ఒక్కణ్ణి వుండలేను ప్రమద. నీవు, బాబు లేంది నేనుండగలనా అన్నాడు. అయితే మమ్ములను తీసుకెళ్లండి  అంది ప్రమద. అట్లా చేయలేను. దానికి కారణాలు ఒకటి యిది చాల ఖర్చుతో కూడుకున్న పని. రెండవది యీ పసికందును తీసుకొనిపోలేము విమానంలో అన్నాడు. బాబు కనీసం ఆరు నెలలు లేంది విమానంలో పోవుట అంత  దూరం మంచిదికాదు. వానికి టీకాలు యీ చిన్న వయస్సులో వేయటమా. కనీసము ఒక సంవత్సరమైన వుండాలి  ప్రమదా అన్నాడు విక్రం. సరే మీ యిష్ట ప్రకారమే నడచుకుంటాం అంది. మేము మీరు పోయి settle అయిన పిమ్మటనే వస్తాము.  మీరు మాత్రము వెళ్లండి అంది. ప్రమద యీ విషయము తల్లికి, తండ్రికి ఆ  సాయంత్రమే చెప్పింది. వాళ్లు చాల ఆనందించినారు. విక్రం మళ్లీ మద్రాసులోనున్న consulate general officeకు వీసా తేదీలకై వ్రాసినాడు. హార్వార్డుకు కూడా admission పంపించమని  వ్రాసినాడు. నెలరోజుల్లో admission పంపించినారు హార్వార్డు విశ్వవిద్యాలయంవారు.  అది రాగానే  photostat copies తీసి మద్రాసు consulateకు అన్ని certificatesతో పంపించినాడు. ఇక వీసాకై వేచివున్నాడు విక్రం. తను study leave secreteriat లోనే కాబట్టి తను  పోయినంకనైన sanction అవుతుంది. ప్రస్తుతానికి order తీసుకొనవలె. చూస్తుండగానే మద్రాసు  consulate general office నుండి వీసా యింటర్వ్యూకు రమ్మని పిలుపు వచ్చింది. అది ప్రమదకు  చూపించినాడు. ఆమె విక్రంను కౌగిలించుకొంది. నేను బాబు యెలా వుండాలి విక్రం అంది. అందుకే నేనన్నాను ఒక  సంవత్సరం postpone చేస్తాను అన్నాడు విక్రం. ఆపని మాత్రం చేయకండి అంది. యిప్పుడు బాబు  రెండునెలలవాడు చూస్తుండగానే 10 నెలలు అయిపోతాయి. అప్పుడు ఒక సంవత్సరం పూర్తి అవుతుంది. అప్పుడు  మేము యిద్దరము వస్తాము. మీరు వెళ్లండి అంది ప్రమద. ఈ మాటలు జరిగిన వారం రోజులకు విక్రం  మద్రాసుకు వెళ్లినాడు. అనుకున్న సమయానికి consulate general offce కు చేరుకున్నాడు. Interview బాగానే పోయింది. వీసా యిచ్చి congratulation అన్నాడు consulate general. విక్రం విమానంపైన హైదరాబాదు ఆనాడే చేరుకున్నాడు. ప్రమద రఘునాథరాయలు, శ్రీలక్ష్మమ్మ  విమానాశ్రయానికి వచ్చి విక్రంను పిక్ అప్ చేసుకున్నారు. మరునాడే అప్పుడువున్న ఒకటే ఒక travel agent కు phone చేసి U.S.కు టికెట్ బుక్ చేయమన్నాడు. మీరు అన్ని documentation తో ఒకసారి మా officeకు దయచేస్తే మేము మీ టికెట్ తీస్తాము అన్నాడు ఆ office manager Mr.Rao.  మధ్యాహ్నం 2 గంటలకు

విక్రం officeకు వెళ్లి అన్ని documents యిచ్చి రూ. 3500 బొంబాయి నుండి న్యూయార్క్ వరకు అయ్యే టికెట్‌కు డబ్బుకట్టి వచ్చినాడు. ఆనాడు టికెట్టుకు అన్ని యింటర్ నేషనల్ యేర్‌లైన్సు నుండి చాలా కాంపెటీషన్ వుండెను. ఇండియా నుండి అమెరికాకు పోయేవాళ్ల సంఖ్య చాల తక్కువ. ఆ సంవత్సరము నుండే బోయింగ్ 707 విమానాలు నడుస్తువుండేవి. యేర్‌యిండియాలో అంతకు కొన్ని సంవత్సరాలకు ముందు చాలా మంది విద్యార్థులు ఓడలపై అమెరికాకు వెళ్ళినారు. కాని యిప్పుడు యీ బోయింగ్ విమానాలలో 20 నుండి 26 గంటలలో న్యూయార్క్‌కు చేరుచుండిరి. టికెట్టు రూపాయలకే యిచ్చినాడు. ఇక రిజర్వు బ్యాంకు హైద్రాబాదు బ్రాంచ్‌లో అయిదువేల రూపాయలు కట్టి డాలర్ల ట్రావెలర్స్ చెక్స్ కొన్నాడు. ఇప్పుడు అన్ని సిద్ధంగ వున్నాయి. హైద్రాబాదు నుండి బొంబే వరకు కూడ టికెట్ విమాన ప్రయాణానికై కొన్నాడు. ఇక రెండు వారాలలో ఈ యాత్ర. దేశానికి యీ రత్నగర్భకు వీడ్కోలు చెప్పాలి అని విక్రం చింతిస్తున్నాడు.

విక్రం అమెరికా వెడుతున్న విషయం బంధుమిత్రులకు తెలిసింది హైద్రాబాదులో. కొందరు డిన్నర్లకు పిలిచినారు. కొందరు వచ్చి కలిసిపోయినారు. విక్రం దగ్గరి బంధువు ఒకాయన ఒకనాడు విందుకు పిలిచినాడు. డిన్నర్ grand గా వుంది. పోగానే విస్కీ యిచ్చినాడు. విక్రంకు విస్కీ తాగే అలవాటు. అందుకే విస్కీ సోడాలో కలుపుకొని కొంచెం త్రాగినాడు. ప్రమదకు వీరు దగ్గరి బంధువులు చాలా మంచివాడు. అందువల్ల రఘునాథరాయలు మొత్తం family ఆ డిన్నరులో వుండిరి. విస్కీ త్రాగినాక యెక్కువ భుజించుట సహజము. అలాగే విక్రం కొంచెం ఎక్కువ భుజించినాడు. భోజనాల తర్వాత ఫ్రూట్ సలాడు యిచ్చినారు. విక్రంకు ఫ్రూట్‌సలాడ్ అంటె చాల యిష్టం. అందుకే యెక్కువ తిన్నాడు. దాని కారణమో మరేకారణమో తెలియదు కాని తెల్లవారి నుండి విక్రంకు దస్తులు పెట్టినవి. చాలా వీక్‌గా అయిపోయినాడు ఆనాడు. 6వ సెప్టెంబరు 7వ సెప్టెంబరు ప్లేన్ యెక్కాలి యిక మధ్యన ఒకటే దినం మరునాడు వెళ్లాలి sept 9కు పోర్ట్లాండులో వుండాలి. ఈ దస్తులు sept 6 నాడు కూడ తగ్గలేదు.

7వ sept యెలా plane యెక్కగలనన్న బాధ విక్రంను బాధిస్తుంది. ప్రమద చాల nervous గా నుంది. విధి లేక 7వ తేదీ నుండి యెనిమిదవనాడుకు ప్రయాణము postpone అయ్యింది. 6వ september తేదీనాడు ప్రమద మిత్రురాలి తండ్రి ఒక డాక్టరు. అయన విక్రం ప్రయాణిస్తున్నాడని కూతురుతో కలిసిపోవుటకు వచ్చినాడు ప్రమదతో. సంగతిని తెలుసుకొని అయా suffa drug ఒకటి suggest జేసి రోజు 5 ట్యాబ్‌లెట్సు తిను అన్నాడు. విక్రం భయపడ్డాడు. అయినా సరే అన్నాడు. మందు తెప్పించి 5 బిళ్లలను మ్రింగినాడు రెండు గంటలలోగ చాలా ఆయాసము తగ్గింది.

అందువల్ల 4 గంటలకు మళ్లీ నాలుగు వేసుకున్నాడు. ఇప్పుడు 50% నయమయ్యింది.

7వ తేదీనాడు మధ్యాన్నం వరకు నేను రేపు పోగలనని confidence వచ్చింది విక్రంకు. అందుకని పెట్టె సర్దుకున్నాడు. Air bagలో కావలసిన documents అన్ని

పెట్టుకొని సిద్ధమైనాడు. అయినా ప్రమద చాల భయంగనే వుంది. రఘునాథరాయలు కూడ అల్లుని ఆరోగ్యము యెట్లా వుంటుందో యీ ప్రయాణములో అనుకున్నాడు. అయినా విక్రం తెలిసినవాడు, తెలివైనవాడు. వీటిని తట్టుకోగలడని ధైర్యం తెచ్చుకున్నాడు. అయినా ఒకసారి విక్రంను వేరే పిలిచి ఏకాంతంలో మీ ఆరోగ్యం బాగులేకపోతే postpone చేసుకొండి అన్నాడు.

విక్రం అవసరంలేదు. నేను పోగలనని విశ్వాసంతో చెప్పినాడు రఘునాథరాయలతో. సరే అన్నాడు మామగారు. మీకు అక్కడ యే కష్టాలు రాకుండ మీరు చూసుకోవలె. మేమెవ్వరము వుండముగదా. మీకేమైన అవసరమైతే మీరు వుత్తరాలద్వారా తెలపండి. నా జీవితం వున్నంత వరకు నేను ప్రయత్నిస్తాను అన్నాడు. సరే అన్నాడు విక్రం. విక్రం అమెరికా వెడుతున్నాడని సాగనంపుటకు జిల్లా నుండి కలెక్టర్ సునిత్, మద్రాసు నుండి సుమన్ వచ్చినారు.

రేపు విక్రంను plane యెక్కించి మరునాడు పోబోతున్నారు యిద్దరు బావమరుదలు. sept 8వ నాడు సాయంకాలం నాలుగు గంటలకు హైద్రాబాదు విమానాశ్రయం నుండి అందరు వీడ్కోలు చెపుతారు. రాత్రంత యింటిలో విక్రం parents తమ్ముడు వున్నారు. విక్రంకు నిద్ర రాలేదు. చాలా వీక్‌గా వున్నాడు. ఆకరు డిన్నరు తిన్నాక మళ్లీ అన్నము ముట్టలేదు యీ విరోచనాలవల్ల అందుకే ముఖమంత తగ్గి చాలా బలహీనతగానున్నాడు. అందరు పడుకోమన్నారు విక్రంను. సరే అని ప్రమద రూంలో పడుకున్నాడు. అర్ధరాత్రి ప్రమద బాబుతో వచ్చి పడుకుంది. నిద్రపొండి అంది ప్రమద. నిద్రకూడ రావటములేదు అన్నాడు విక్రం. ప్రయత్నించండి యింక బలహీనత వస్తుంది అంది ప్రమద. యిద్దరు పండుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. బాబు యిద్దరి మధ్యనున్నాడు. ప్రమద యేదేదో చెబుతుంది. ఈ మాటలు వినుకుంటూ విక్రం నిద్రపోయినాడు.

మరునాడు 2 గంటలకు మెలకువ వచ్చింది. ప్రమదను లేపినాడు. బాబుకు పాలిచ్చి పరుండబెట్టింది. పిమ్మట విక్రంకు టీ తెచ్చింది. కానీ ఆ టీ కొంచెం త్రాగి యింక త్రాగలేను అని కప్పును వదలి మళ్లీ మందు వేసుకున్నాడు. వచ్చిన మిత్రులతో బంధువులతో కలిసి మాటాడుతున్నారు. అందరూ యింత weak గానున్నావే యీ ప్రయాణాన్ని చేయగలవా అని ప్రశ్నిస్తున్నారు. ఇప్పుడు ఆ confidence వచ్చింది నాకు అని జవాబు చెబుతున్నాడు. మూడు గంటలకు అందరూ కార్లలో బేగంపేట విమానాశ్రయానికి బైలుదేరినారు. వీరిలో బంధువులు, మిత్రులు రఘునాథరాయలు, collegues, విక్రం collegues వున్నారు. ఆనాడు యేర్ travel చాల తక్కువ. బేగంపేట విమానాశ్రయము చాల చిన్నది. waiting roomలో రెండు సోఫాసెట్లు. 20 మందికన్న యెక్కువ కూర్చుండుటకు చోటు లేకుండె. కాని, విక్రంను సాగనంపుటకు 160 మంది వరకు వచ్చినారు. నన్ను మాత్రము కూర్చుండబెట్టినారు. అందరూ పాపం నిలబడి వున్నారు.

నేను New Yorkలో దిగగానే నన్ను recieve చేసుకొనుటకు మామగారి collegue అల్లుడు వస్తారని మామగారు చెప్పి అయన పేరు మరి టెలీఫోను నంబరును యిచ్చినాడు. ఆ నంబరును జాగ్రత్తగ దాచుకున్నాడు విక్రం. ఒకనాడు

N.Y.rest తీసుకొని మరునాడు హార్వార్డు వెళ్లితే బాగుంటుందని అనుకున్నాడు. సరిగ్గా నాలుగు గంటలకు విమానము బయలుదేరుతుంది. మూడున్నరకే బొంబాయి నుండి వచ్చిన విమానము దిగింది. ఇది చిన్నవిమానము. అనాడు మనదేశంలో jet విమానాలు మచ్చుకు లేకుండెను. ఈ విమానము propeller తో నడిచే విమానము. విమానము దిగిన కొన్ని నిమిషాలకే బొంబాయికి వెళ్లే ప్రయాణీకులు రండి విమానంలోకి అని announce చేశారు. అప్పుడు సుమిత్ సరే బావ యిక బయలుదేరాలి అని లేపినాడు. బాబుకు యిప్పుడు ఆరునెలలే. వచ్చిన కన్నీటిని ప్రమద ఆపుకొంది. నేను కూడ అట్లా చేయుటకు ప్రయత్నిస్తున్నాను. నేను విమానంవైపు నడుచుటకు ప్రయత్నిస్తున్నాను. నామాతృమూర్తి నన్ను ఆపి ముద్దు పెట్టుకుంది. ప్రమద కన్నులు పచ్చిగా యెర్రగానున్నవి. ఇది సంతోషసమయము కాని అనుకోకుండ క్షీణించిన ఆరోగ్యంవల్ల యీ కన్నీళ్లన్నీ. అందరూ నేను విమానం మెట్లు యెక్కుతుంటె వీడ్కోలు అన్నట్లుగా చేతులు గాలిలో వూపుతున్నారు. నేను విమానంలో కూర్చున్న 10 నిమిషాలకే విమానం రన్‌వేపైకి మరలింది. ఇప్పుడు యెవరూ కనబడడం లేదు విమానం కిటికీల నుండి. కొద్దిసేపట్లో విమానం గాలిలోవుంది.

నేను హైద్రాబాదుకు ఆ సిటీలోనున్న నాబంధువులకు దూరమైపోతున్నాను. నాకు, ఆరోగ్యం గురించే బాధగావుంది. కాకపోతే నేను తొందరలో నా ph.D చేసి తిరిగి రావలెనని వేడుచున్నాను. 90 నిమిషాలలో బాంబే చేరుతాము అని Air hostess announce చేసి పిమ్మట refreshments యిస్తున్నారు అందరికి. విమానము చిన్నది అందులో propeller driver కాబట్టి కిందికి మీదికి యెగురుతున్నది. అది అంత సౌకర్యమైన ప్రయాణముకాదు. కాని యిది లేకపోతే 20 గంటల train ప్రయాణమే గత్యంతరం లేకుండ. ప్లేన్ బొంబాయి విమానాశ్రయములో దిగింది. అందరము అందులో నుండి బయటకు నడచినాము. మా luggage మేము తీసుకొనవలసిన అవసరము లేదు అన్నాడు. దాన్ని AI వాళ్లు తీసుకొని వారి విమానాలలో యెక్కించుకుంటారు. అనాడు యీనాటివలే security checkings అవసరం లేకుండె. Indiaలో యింకా చెప్పకోదగ్గ పరిశ్రమలు యేవి లేకుండె. అన్నీ యింగ్లాండు అమెరికా నుండే import చేసుకోవలసినుండె.

ఆ విషయములో భారతదేశము యే నాడు ఒక అభివృద్ధియైన దేశములో పరిగణించవచ్చు. కాని జనాభా ఒత్తిడివల్ల యింక దీనిని మనము బీదదేశమే అనవలసివుంటుంది. కాని అనాడు మాత్రము మనము అన్ని విధాలుగ వెనుకబడిన బీదదేశస్తులమే. బొంబాయిలో దిగగానే యేరుపోర్టులో విక్రంను lounge లో నున్న అతిపరిశుభ్రమైన dining hallలో డిన్నర్ తినమని ఆహ్వానించినారు. సరే అని bathroomలో చేతులు కడుగుకొనుటకు వెళ్లినాను. మనయిండ్లలో, హైద్రాబాదు యేరొడ్రొంలోనున్న bathroomల కంటె చాల నీట్‌గాను మాడ్రన్‌గా నున్నవి. మొఖం కడుక్కొని తల దువ్వుకొన్నాక కొంచెం fresh గా అనిపించింది. వచ్చి dining roomలో కూర్చున్నాను.

మామగారు phone చేసినారు. ఆనాడు యిదివరకు చెప్పినట్టుగా యేయిద్దరో ముగ్గురో అమెరికాకు వెళ్లేవాళ్లు. విక్రం పేరుపైన ఫోను వచ్చినందుకుగాను అక్కడ పనిచేస్తున్నవారిలో ఒకరు నాబల్లవద్దకు వచ్చి సార్ మీకు హైదరాబాదు నుండి ఫోను వచ్చింది రండి అని పిలిచినాడు. పోయి హాల్లో అనగానే ఫోన్‌పైన మామగారు రఘునాధరాయలున్నారు. యెలావుంది మీ ఆరోగ్యం అన్నారు పరవాలేదు కొంచెం మెరుగేనన్నాడు విక్రం. మీ ఆరోగ్యం బాగలేకపోతే ఆపెయ్యండి risk తీసుకోకు అన్నాడు. అయితే ప్రమదతో మాట్లాడండి అని ప్రమదకు phone యిచ్చినాడు. ఆమె కూడ మామగారన్నట్టె అంది. లేదు నాకు నిజంగ యిప్పుడు బాగుంది హార్వార్డు చేరగానే వుత్తరం వ్రాస్తాను. బాబు భద్రం. నే వెళ్లగానే కొన్ని నెలలకు నిన్ను పిలిపించుకొంటాను అన్ని సిద్దం చేసికొని వుండు అన్నాడు విక్రం.

సరే మీ ఆరోగ్యం జాగ్రత్త! పెట్టేస్తున్న అంది. సరే అని receiver ను పెట్టేసినాను. పిమ్మట విక్రం యిదివరకు కూర్చున్న బల్లవద్దకు వెళ్లి కుర్చీలాగి కూర్చున్నాడు. విక్రం పోయేవరకే యింకో అతను విక్రం కుర్చీకి ముందుగా కూర్చొని భోంచేస్తున్నాడు. విక్రం కూడ కూర్చున్నాడు. Hello అన్నాడు ఆ కూర్చున్న మనిషికి విక్రం. Hello అని జవాబిచ్చినాడు. ఇంతలో సర్వరు వచ్చి యేమి తింటారుసార్ అని మెనూను విక్రం ముందుంచినాడు. అన్ని చాల మంచి తిండి వస్తువులున్నాయి ఆ మెనూలో. విక్రం కూడా ఆ కూర్చున్న మనిషివలె సంపూర్ణ ఆరోగ్యంగ వుంటే dinner enjoy చేసేవాడు. కాని అతని అనారోగ్యం మరి బలహీనతవల్ల యేమి తినే పరిస్థితిలో లేడు. కాబట్టి విక్రంకు యిష్టమైన, బాగా తిని sick అయిన fruit salad నే తెమ్మన్నాడు. thatsall sir అన్నాడు ఆ waiter. Yes thatsall అన్నాడు విక్రం. ఆ waiter meno తీసుకొని వెళ్లిపోయినాడు. విక్రం ముందు కూర్చున్న వ్యక్తి యేమిమీకు ఆకలి లేదా అన్నాడు. లేదు అన్నాడు విక్రం.

అంటె మీరు sick గా నున్నారా అన్నాడు. అవును అన్నాడు విక్రం. యేమి sickness అంటె విక్రంకున్న జబ్బునంత వివరించాడు. మందు తీసుకుంటున్నారా అన్నాడు. అవును అన్నాడు. యేమిమందు తీసుకుంటున్నారు అన్నాడు ఆ వ్యక్తి. విక్రం జేబులో నుండి తను తీసుకుంటున్న మాత్రలు తీసి చూపించాడు. యెన్ని తీసుకుంటున్నారు అన్నాడు. నాలుగు అన్నాడు విక్రం. సరే అయిదు తీసుకొండి అన్నాడు. పిమ్మట విక్రం అడిగినాడా వ్యక్తిని. మీరేం చేస్తుంటారని. నేను డాక్టర్ని. రెండు సంవత్సరాల క్రిందట పాసైనాను. నాపేరు కందస్వామి. మేము మద్రాసులో వుంటామని చేతినందించినాడు. అప్పుడు విక్రం, నాపేరు విక్రం. నేను యిప్పుడు deputy secretary గా leaveపై హార్వార్డుకు వెడుతున్నాను higher studies కి అన్నాడు. సరే యిప్పుడు జబ్బు ముదిరితే ఒక బడ్డింగ్ డాక్టరున్నాడు నావెంట అనుకున్నాడు విక్రం. ఇంతలో ఆ waiter fruit salad మరి మంచినీళ్లతో వచ్చి table పైవుంచి any other thing sir అన్నాడు. No thank you అనగానే అతడు వెళ్లిపోయినాడు. ఇప్పుడు fruit salad సగము తిని నీళ్లు త్రాగినాడు.

అప్పుడు కొంతసేపటికి శరీరంలో కొంచెం బలం వచ్చినట్టు అనిపించింది విక్రంకు. తిని table పైన tip వుంచి కందస్వామి విక్రం సోఫాలపైన కూర్చున్నారు.

కందస్వామి సిగరెట్టు ముట్టించినాడు అనారోగ్యంతోనున్న విక్రంకు సిగరెట్టు పొగవాసన రోతపుట్టిస్తుంది. ఆ సిగరెట్టు అయిపోగానే మీరెందుకు పోతున్నారు U.S.కు అన్నాడు విక్రం. నాకు residency దొరికింది N.Y.లో అందుకే అన్నాడు కందస్వామి. ఆ కాలంలో ECFMG పాస్ అవుట చాల సులభము. కాని మెడికల్ పట్టభద్రులు చాలకొద్ది మంది కాబట్టి చాల తక్కువ graduates U.S.A.కు వెళ్లేవారు. పోయినవారు visa మీదనే అంటె అక్కడవుండకూడదు. రెసిడెన్సీ పూర్తికాగానే వారి స్వంతదేశాలకు వెళ్ళిపోవాలి. అంటె కందస్వామి J వీసా మీద వెడుతున్నాడన్నమాట. విక్రం మాత్రం F వీసా మీద వెడుతున్నాడు.

ఇతని residency N.Y పట్టణములోని ఒక హాస్పిటల్ లోనున్నది. అంతె N.Y. పోగానే తన గమ్యానికి చేరుకుంటారు. కాని విక్రం మ్యాసెచుసెట్ స్టేటుకు వెళ్లాలి. విక్రంకు Harvard చేరుటకు N.Y. నుండి బాస్టినుకు వేరే విమానం పట్టాలి. ఇతన్ని బాస్టన్ లో కలియుటకు యెవరో యూనివర్ సిటీకి సంబంధించినవారు వస్తారట. కందస్వామి విక్రం యిప్పుడు స్నేహితులు. రాత్రి 12 గంటలకు విమానము బొంబాయి నుండి బయలుదేరుతుంది. ఇప్పుడు విక్రం ఆరోగ్యం కుదుటబడినట్టు విక్రంకు అనిపించింది. కాని యింక చాల weakness వుంది. చూస్తుండగానే 6 గంటలయ్యింది రాత్రిపూట. అప్పుడు చాలకొద్ది మంది ప్రయాణించేది security checkups లేవుకాబట్టి యిప్పుడున్నన్ని కట్టుదిట్టాలు అప్పుడు లేవు. ఇక గంటలలో మాతృదేశానికి వీడ్కోలు అనుకుంటున్నాడు విక్రం. అతనిలో యేదో బాధగా వుంది. అయినా హైద్రాబాదు వీడినప్పుడే ధైర్యం తెచ్చుకున్నాడు. యేమైన తిరుగులేదు అనే అందరితో సెలవు తీసుకున్నాడు. ఇప్పుడైతే సాగనంపెవాళ్లే లేరుకదా.

ఒకసారి హైద్రాబాదు వాతావరణము, స్నేహితులు, బంధువులు, భార్య, కొడుకు కండ్లముందుకు వచ్చినారు. కృష్ణమోహన్, తల్లి, తండ్రి జ్ఞాపకం వస్తున్నారు. ఇతని luggage Hyderabad నుండే N.Y.కు checking అయ్యింది. యేర్ బ్యాగ్ పదిలంగ తన సంకకేవుంది. అందరు passengers కొద్దిసేపట్లో విమానంలో కూర్చోవాలి. పాస్ పోర్టులను వీసాలను చూస్తున్నారు. యేర్ యిండియా అధికారులు. ఆనాడు కొద్ది planes వుండేవి. చాలకొద్ది మంది ప్రయాణము చేసేదికాబట్టి అన్ని సౌకర్యాలు బాగా అనిపించేవి.

ఈ విమానాలలో సర్వ్ చేసే యేర్ హూస్టెస్ చాలా అందగత్తెలుగా వుండేవారు. ఎందుకంటె competition బాగా వుండేది ఈ సెలెక్షన్ లో. ఇక యేర్ యిండియాలో పనిచేసే యేర్ hostess చాలా అందగత్తెలు. వీరిని చూడగానే విక్రం ఆరోగ్యం యింక నయమయ్యిందనే చెప్పాలి. క్యూలో కందస్వామి విక్రం ఒకరి వెనుక మరొకరు నిలబడ్డారు. అన్నీ చెక్ చేసారు. పిమ్మట విమానంపైకి యెక్కినారు యిద్దరూ. ఇద్దరూ ఒకేచోట కూర్చున్నారు. కూర్చున్న కొద్దిసేపట్లోనే విమానము బయలుదేరింది. విమానము యెగురుటకు పరుగెత్తుతుంది. గాలిలో లేవగానే విక్రం కందస్వామి బైబై O, my country అన్నారు యిద్దరూ. విక్రంకు మాత్రం కంట్లో తడి వచ్చింది. మళ్లీ యెన్నాళ్లకో తిరిగి వచ్చుట అనుకున్నాడు. విక్రం మనస్సులో యివన్ని తలచుకుంటుంటేనే విమానం గాలిలో చాలపైకి వచ్చింది.

విక్రం కందస్వామి హిందూదేశాన్ని వదలి అరేబియా సముద్రంపైకి వచ్చినారు. బొంబాయి పట్టణము కనబడటములేదు. ఇప్పుడు అంత చీకటి. గాలిలో ప్రయాణించిన గంటసేపటికో యేమొ breakfast serve చేసినారు. ఇప్పుడు సూర్యుడు కనబడుతున్నాడు. కొన్ని గంటలు ప్రయాణించిన పిదప క్యాప్టెన్ మనము ఒక గంటలో బేరూట్‌లో దిగబోతున్నాము అన్నాడు. సరిగ్గ గంటసేపైనాంక విమానము భూమి ముఖము పట్టింది. కొంచెంసేపట్లో బేరూట్ యేర్‌పోర్టులో దిగింది. అక్కడ దిగగానే మీరు బైటికి వెళ్లే ప్రయత్నము చేయవద్దు అని యేర్‌యిండియా officials చెప్పినారు.

కొందరు దిగి ప్లేన్‌వద్దనే తిరుగుతున్నారు. చుట్టుముట్టు arab soldiers యెవరిని లోనికి పోనీయకుండ కాపలా కాస్తున్నారు. కందస్వామి విక్రం మళ్లీ ప్లేన్‌లోనికి వచ్చి కూర్చున్నారు. కూర్చున్న 40 నిమిషాలకే విమానం గాలిలోకి యెగిరింది. ఇప్పుడు lunch serve చేస్తున్నాము అని announce చేసినారు. బేరూట్‌కు లండన్‌కు మధ్యన వున్న దూరము యెన్ని గంటల ప్రయాణమో చెబుతున్నారు. కొంచెంసేపట్లో యేర్ hostess వీరిద్దరివద్దకు వచ్చి యేమి తింటారు అని అడిగింది.

కందస్వామి తనకు నచ్చిన తిండి చెప్పినాడు. విక్రం మాత్రం యేమి తినటంలేదు. water please అన్నాడు. Nothing to eat అంది హూస్టెస్ no అన్నాడు విక్రం. ఆమె కందస్వామికి tray తెచ్చి యిచ్చింది. విక్రంకు మాత్రం మంచినీళ్లు. అదికూడ త్రాగడంలేదు. పాపం విక్రం పరిస్థితి విషాదంగానుంది. ఇప్పుడు చాల బలహీనతగా feel చేస్తున్నాడు. కందస్వామి యేమైన యిష్టం చేసుకొని తినండి అంటాడు. లేదు డాక్టర్ నాకు తిండంటె అసహ్యంగ వుంది అన్నాడు.

కందస్వామి చేయునదిలేక వూరకున్నాడు. విక్రం విమానంలో పడుకొనుటకు ప్రయత్నిస్తున్నాడు. కాని నిద్ర కూడ రావటము లేదు. అయినా కండ్లు మూసుకొని సీటు మీద ఒరిగినాడు. విమానం గాలిలో ప్రయాణిస్తూనేవుంది. చాలతక్కువ మంది వున్నారు ఆ విమానంలో. కాబట్టి వెనుకకు వెళ్ళి మూడు సీట్లు ఒకటి చేసి పండుకోండి అంటాడు కందస్వామి. లేదు యిది సరిగానే వుందని కండ్లు మూసుకొని తన సీటుమీదనే ఒరిగినాడు విక్రం. కొన్ని గంటలు గడిపిన పిమ్మట విమానము క్యాప్టెన్ మనము లండన్‌కు ఒక గంట దూరాన మాత్రమే వున్నాము అన్నాడు.

అచ్చట దిగేవారంత customs forms పూర్తి చేయాలి యిది ముఖ్యము.

ఫారాలు మీకు మా విమాన అధికారులు త్వరలోనే అందచేస్తారు అన్నారు. ఈ ఫారాలు మీకు కావలెనా మీరు లండన్‌లో దిగుతున్నారా అని మా యేర్‌హూస్టెసు అడిగింది. లేదు మేము N.Y. దిగుతాము అన్నాము మేము. లండన్‌రానే వచ్చింది. విమానము దిగిన పిమ్మట యేర్ పోర్టుకు వెళ్లేవారు పాస్‌పోర్టు మరి టికెట్ తీసుకొని దిగండి అని హెచ్చరించినారు. కందస్వామి దిగినాడు. విక్రంకుగూడ దిగాలని వుండె. కాని దిగి నడిచే శక్తిలేదు. అందుకే విమానంలో నున్నాడు. కందస్వామి 40 నిమిషాల పిమ్మట వచ్చి నా పక్కన కూర్చున్నాడు. మళ్లీ విమానం గాలిలోనుంది.

యిక యెనిమిది గంటల్లో చేరుతాము అనుకుంటున్నారిద్దరు. మళ్లీ lunch serve చేస్తున్నారు విమానంలో.

కందస్వామి తనకు కావలసింది చెప్పినాడు. విక్రం మాత్రం మళ్లీ వాటర్ అన్నాడు. కందస్వామి చప్పుడు చేయలేదు. కొన్ని గంటలు విమానము గాలిలో ప్రయాణం చేసింది. ఇంక N.Y కు యెన్ని గంటలుందని కందస్వామి యేర్‌హూస్టెస్‌ను అడిగినాడు. మూడు గంటలు అంది యేర్‌హూస్టెస్. విక్రం చాల బలహీనతగా వున్నాడు. సీట్‌పై నీరసంగ వరిగినాడు. N.Y. బాస్టన్ plane యెలా యెక్కాలి?

ఈ కందస్వామి తనకు సహాయపడునట్లు తోచలేదు విక్రంకు. మొదటిసారిగా విక్రం I.A.S. అంత నిస్సహాయుడునిగా యెప్పుడు feel చేయలేదు. మామగారి friend అల్లుడే దేవునివలే వచ్చి సహాయం చేస్తే తప్ప. N.Y. రానే వచ్చింది. plane దిగగానే సరాసరి అందరు దిగి కస్టంవైపు వెళ్ళినారు. నా documents అన్ని check చేసినారు. U.S. immigration official మళ్లీ customs కు వచ్చినాము. యేముంది మీ పెట్టెలో అన్నారు customs వారు. యేమీలేవు. కట్టుకునే బట్టలు అన్నాను.

సరే వెళ్లండి అని నా పెట్టెపైన గీత గీసినారు. బైటికిరాగానే కందస్వామి సరే జాగ్రత్తగ వెళ్లండి అని తెలిపి వెళ్లిపోయినాడు. విక్రంకు తన పెట్టెను లేపే బలం యేమాత్రము లేదు. ఒక నల్ల porterను పిలిచి నేను బాస్టను వెళ్లాలి. ఎక్కడ ప్లేనును పట్టాలి అన్నాడు విక్రం. రండి అని నాపెట్టె బండిలో మోస్తు నన్ను బస్ యెక్కించి యేదో terminalలో దింపమని బస్‌వాడికి తెల్పినాడు.

పాపం ఆ పోర్టరుకు రెండు డాలర్లు యిస్తే సంతసించినాడు. పిమ్మట బస్‌వాడు నేను యెక్కవలసిన యేర్‌లైన్ టెర్మినల్ రాగానే దిగండి అని నా పెట్టెను నన్ను దింపినాడు. మళ్లీ ఒక porter సహాయంతో checking counter కు వెళ్లినాను. మళ్లీ రెండు డాలర్లు తీసుకుని thanks అని చెప్పి porter వెళ్లిపోయినాడు. counter వద్ద యేమంత rush లేదు. నాటికటు చూసినా baggageను తీసుకున్నారు.

నాకు ఒక boarding card యిచ్చినారు. యెక్కడ ప్లేన్ వుంటుందో కూడ తెల్పినారు. ఎట్లా వెళ్లాలి అచటికి కూడ వర్ణించి గురుతులతో సహా చెప్పినారు. వారు చెప్పిన ప్రకారమే వెళ్లి కూర్చున్నాను. ఇక ఒక గంటలో గమ్యస్థానము చేరుకుంటానన్న ధైర్యం వచ్చింది. కాని చాల బలహీనతగా వున్నాడు విక్రం. మూడు రోజుల నుండి తిండిలేదు. ఆకలి అసలే లేదు. విపరీతంగ నీరసం. కాని గమ్యస్థానానికి చాల దగ్గరగానున్నానన్న ధైర్యంతో వున్నాడు విక్రం. ఇప్పుడు విక్రం వేరే ప్రపంచంలో బ్రతుకుతానా చస్తాన అన్న అనుమానం తనలో మొదటిసారిగా ప్రవేశించింది. ధైర్యంతోనున్నాడు. చస్తే అందరికి దూరమౌతాను. ప్రమదకు బాబుకు చాల కష్టం. బ్రతికితినా తాను తలచుకున్న దానిని సాధిస్తాను. జయమో మరణమో అంతా ఆ ఈశ్వరుని యిచ్చ అనుకుని పట్టుదలతో బాస్టిన్ ప్రయాణం చేసే planeకై వేచియున్నాడు.

విక్రంకు New York దిగగానే ఒక cultural shock. ఇతడు హైద్రాబాదు యేర్‌పోర్టుతో యీ New York విమానాశ్రయాన్ని పోలిస్తే హైద్రాబాదు యేర్‌పోర్టు

మన యింట్లోనున్న డ్రాయింగ్‌రూంలా వుంది. మరి బాంబే యింకా కొంచెం పెద్దది. కాని New York విమానాశ్రయం మన హైదరబాదు పట్టణమంత విస్తారము అనిపించింది. ప్రజలు కూర్చొనుటకు సోఫాలు. గుంపులు గుంపులుగా విమానాలలో మంది యెక్కుతు దిగుతూనే వున్నారు. రాత్రి పగలనేది లేనేలేనట్టు యెప్పుడూ ప్రజలతో క్రిక్కిరిసివుంది. ఇది సెప్టెంబరు నెల 8వ తేది రాత్రి 8 గంటలు దాటింది. plane రానె వచ్చింది. అందరు యెక్కుతున్నారు. విక్రం కూడ క్యూలో వున్నాడు. లోనికి ప్రవేసించగానే హూస్టెస్ యితని సీటులో కూర్చోపెట్టింది. ఇతని ప్రక్కన ఒక అమెరికన్ కూర్చున్నాడు.

విక్రంని చూచి మీరు యిండియా నుండి వస్తున్నారా అన్నాడు. అవునని విక్రం సమాధానం చెప్పినాడు. నెహ్రూపండితుని రాజకీయాలు మాటాడినాడు. అయన దానికి నేను తెలిసినంత చెపుతూపోతున్నాను అతనికి. అపుడు కెనడీగారు వైట్‌హౌస్‌లో ప్రెసిడెంట్‌గానున్నాడు. అతని స్వయం పట్టణము బాస్టను. అందువల్ల నెహ్రూ అంటె కొంచెం గౌరవంగానే మాటాడినాము. అరగంట గడచిపోయింది ఈ మాటలలో. యేం పనికి వచ్చినారు ఈదేశానికి అన్నాడు నాప్రక్కన కూర్చున్న అమెరికన్. చదువటానికి అన్నాడు విక్రం. యే స్కూల్లో అన్నాడు. విక్రంకు ఆశ్చర్యం అయ్యింది. స్కూల్ అనగానే లేదండి స్కూల్‌కు కాదు హార్వార్డు యూనివర్‌సిటీలో అన్నాడు విక్రం.

ఓ చాలా మంచి స్కూల్ హార్వార్డ్ అన్నాడు ఆ అమెరికనుడు. అప్పుడుగాని విక్రంకు అర్థం కాలేదు college, universities ని వీళ్లు స్కూల్ అంటారు అని. విక్రం యిది మంచి సమయమని నేను ఈ రాత్రి యేదైన హూటలులో గడపాలి. మీ వూరులో యేది బాగుంటుంది అని అడిగినాడు. ఒక చీటి మీద అయన హూటల్ పేరు వ్రాసి నాకు యిచ్చినాడు. అది నాజేబులో వుంచుకొన్నాను. మరి కొన్ని నిమిషాలకు నేను యిచ్చిన చీటిని యిటివ్వండి అని అడిగినాడు. తీసి యిచ్చినాను. ఆ చీటీలో వున్న hotel పేరు కొట్టివేసి దాని బదులు ప్రెసిడెంటు hotel అని వ్రాసినాడు. ఎందులకని నేనడుగలేదు. చూస్తుండగానే బాస్టన్ సమీపించినాము. విమానపు క్యాపిటెన్ యిక కొద్దిసేపట్లో దిగడము ప్రారంభమౌతుందని. పది నిమిషాలలో బాస్టన్‌లో దిగినారు.

చీటి వ్రాసిచ్చిన అమెరికన్ good luck. hope you will have nice time in U.S. అని వెళ్లిపోయినాడు. విక్రం యింక బలహీనంగానే వున్నాడు. ప్లేను దిగగానే luggage తీసుకునేటందుకు వెళ్ళినాడు విక్రం. నా లగేజు పెద్దది. లేపలేక లేబట్టినాడు విక్రం. ఇంక హూటలుకు పోవాలి అందుకే అన్నాడు శక్తిని ఆ హూటలకు చేరుటకు ఉపయోగించాలని. యిటు అటు చూస్తుండగానే ఒక పోర్టరు కనపడ్డాడు విక్రంకు. రమ్మని పిలిచినాడు. అతడు విక్రం luggage తీసుకున్నాడు. యేర్‌బ్యాగు విక్రం సంకకే వుంది. ఆ పోర్టరుతో అడిగి యీ హూటలుకు యెలా వెళ్లాలి అని. అతడు ఒక టాక్సీ వానిని పిలిచి వీరిని ప్రెసిడెంటు హూటలుకు తీసుకుపొమ్మన్నాడు. అతనికి రెండు డాలరలివ్వగానే టాక్సీ కదిలింది. 15 నిమిషాలలోగానే ఆ హూటల్ చేరుకుంది టాక్సి. హూటల్‌లోని వరకు ఆటాక్సి అతను నా పెట్టి హూటల్

loungeలో పెట్టినాడు. నా యేర్ బ్యాగ్ తో కౌంటరు వద్దకు వెళ్లి నాకు యీ రాత్రికి ఒక రూం కావాలి అన్నాను. ఆ కౌంటర్ క్లర్కు సరేనని ఒకరాత్రికి యిరువది డాలర్లు అన్నాడు. సరేననగానే డబ్బు యివ్వమన్నాడు.

సరేనని ఒక ట్రావలర్స్ చెక్కు వ్రాసి యిచ్చాడు విక్రం. అతడు అది తీసుకొని రూం తాళపు చెవి యిచ్చి room no. 220 అని బెల్ బాయ్‌ను పిలిచినాడు. వాడు చక్కగా 220 గదికి తీసుకెళ్లి తేంక్యు సర్ అన్నాడు. విక్రం కొత్త కాబట్టి అతనికి తెలియదు. రెండు డాలర్లు అతనికి టిప్ యివ్వవలసి వుండెనట. అది సామాన్యంగ అందరు చేస్తారని విక్రంకు పిమ్మట తెలిసింది. ఆ దేశపు మర్యాదలు విక్రంకంతగా తెలియకుండె. కావున టిప్పింగ్ చేయలేదు. అయినా ఆ బెల్‌బాయ్ యేమనకుండ have nice time అనుకుంటు వెళ్లిపోయినాడు. స్నానం లేక మూడు రోజులయ్యింది. రూంలకు పోగానే మొదలు బాత్‌రూంలకు వెళ్లినాడు. విక్రం అప్పుడు అమెరికా యేమిటో తెలుసుకున్నాడు. మనదేశంలో ఆనాడు హైద్రాబాదులోనున్న చాలామంది భాగ్యవంతుల యిండ్లకు వెళ్లినాడు. యెవరి యింట్లో అంతమంచి నీట్ బాత్‌రూంలను చూడలేదు అని అనుకున్నాడు విక్రం.

ఇప్పుడున్నవేమొ కొందరి యిండ్లలో కాని ఆనాడు మాత్రం అతడు చూడలేదట. విక్రం యీ బాత్‌రూంలకు కొత్త మొదటిసారి అమెరికన్ బాత్‌రూంలో స్నానం చేయాలి. బట్టలు విడవకముందే బట్టలు వీడి టబ్‌లోకి దిగినాడు. షవర్ స్విచ్‌ను on చేసాడు. వుడుకు నీళ్లు జర్‌మనుకుంటు పడుతున్నవి. ముందుకు నడచి తలను ఆ షవర్ క్రింద వుంచి నిలబడ్డాడు. సబ్బు కూడ ప్రక్కకేవుంది. బాగా సబ్బు శరీరమంత రాసుకొని మళ్లీ షవర్ క్రిందికి నడచినాడు. ఇంక కొంచము వుడుకునీళ్లను యెక్కువ చేసినాడు. స్పీడ్ యెక్కువయ్యింది. 20 నిమిషాలపాటు షవర్ క్రింద నిలబడి శరీరమంత వ్రాసుకున్నాడు. ఇప్పుడుగాని ఆ బలహీనత కొంచెము దూరమయినట్టు అనిపించింది. ప్రమద చాల జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడు ప్రమద విక్రంకు మధ్య పదివేల మైళ్లకు మించిన దూరము. అదియే కాకుండ రెండు మూడు మహాసముద్రాలు యిద్దరి మధ్యన. యేమి చేస్తున్నదో తన ప్రేయసి తన బాబు అనుకొన్నాడు. టవల్ తీసుకొని శరీరాన్నంత పొడిగా తుడుచుకొన్నాడు.

రూంలోనికి వచ్చి పైజామ వేసుకున్నాడు. బెడ్‌మీద ఒరిగినాడు. విక్రంకు అటువంటి springing బెడ్స్ హైద్రాబాదులో కనిపించలేదు. మన పడకలే వేరు అనుకున్నాడు. పడుకున్న పదిహేను నిమిషాలలో నిద్రపట్టింది. ఎ.సి. రూం కనుక బ్లాంకెటు కప్పుకున్నాడు. రాత్రంత స్పృహ తప్పిపడుకున్నాడు. తెల్లవారి లేచిచూచె వరకు యెనిమిది గంటలు. లేచి బ్రష్ చేసి ముఖము కడుక్కున్నాడు. టీ త్రాగాలనిపించింది. ఆ హూటల్‌లో కాఫీ వుంది లౌంజ్‌లో. కాఫీ ఒక కాగితపు గ్లాసులో పోసి క్రీం, షుగర్ కలిపి ప్రక్కనున్న సోఫాపైన కూర్చున్నాడు. తీరికగా కాఫీని పూర్తి చేసినాడు. ఇంక ఆకలి లేదు. కాఫీని కొంచెం హాట్‌గా వున్నందున enjoy చేసినాడు. పిమ్మట కౌంటరు వద్దకు వెళ్లి నేను హార్వార్డుకు వెళ్లాలి యెలాగ వెళ్లాలి అన్నాడు. అచ్చటనున్న కౌంటర్ క్లర్కు యెలా వెళ్లాలో తెల్పినాడు.

పిమ్మట విక్రం తన రూంలోకి వెడుతుండగా ఒక యిండియన్ లౌంజు లోనికి

ప్రవేశిస్తున్నాడు. ఆ భారతీయుడు విక్రంను చూచినాడు. విక్రం ఆ భారతీయున్ని చూచాడు. ఇద్దరూ మాటాడుకున్నారు. అతడు బొంబాయి పట్టణవాసియట. యెమ్.యెస్. చదువుట కొరకు హార్వార్డుకు పోవాలట. నేనుకూడ అంతే అన్నాడు విక్రం. నా రూంకు రండి అన్నాడు విక్రం. వీళ్లేమనుకోరా అంటె మీ బ్యాగేజ్ యీ హొటల్ సెక్యూరిటీకి యిచ్చి వస్తే యేమనుకోరు అన్నాడు విక్రం. సరేనని తన పెట్టెను సెక్యూరిటీకిచ్చి విక్రం రూంకు వచ్చినాడు. కుర్చీపైన కూర్చున్నాడు. విక్రం మొఖం కడుక్కొని ఫ్రెష్‌కాండి అన్నాడు. థేంక్యు అని చెప్పి తన సూట్‌కోటును విడచి బాత్‌రూంలోకి వెడలినాడు. కొంచెంసేపట్లోనే మొఖం తుడ్చుకొంటు బయటకు వచ్చాడు. రాగానే విక్రం అన్నాడు యెవరైన మీకు తెలుసా హార్వార్డులో అన్నాడు విక్రం. ఆఁ తెలుసు మా కసిన్ ఒకాయన సంవత్సరం నుండి అక్కడేనున్నాడు అన్నాడు.

మీపేరే చెప్పలేదే అన్నాడు విక్రం. నా పేరు రామన్‌శ్రీనివాస్ అన్నాడు. నాపేరు విక్రమసింహారావు అన్నాడు విక్రం. మీరు యేమి చదువుటకు వచ్చినారు అన్నాడు రామన్. ఎకనామిక్స్ అన్నాడు విక్రం. గుడ్‌సబ్జెక్టు అన్నాడు రామన్. మీరు పడుకుంటారా అన్నాడు విక్రం. లేదు నేను రాత్రి బాగానే నిద్రించాను అన్నాడు రామన్. అయితే మరి హొటల్‌కు యెందుకొచ్చారన్నాడు విక్రం. వీళ్లతో హార్వార్డుకు పోయే విధానాన్ని తెలుసుకుందామని పిమ్మట యివ్వాళ్ల వీలుకాకపోతే యిచ్చట యీరాత్రి వుండి రేపు వెడదామని. యిద్దరూ మాటాడుకొని బ్రేక్‌ఫాస్టు యిక్కడ దొరుకుతుందా అన్నాడు రామన్. తెలియదు వెళ్లి తెలుకుసుందాం పదా అన్నాడు.

అర్రకు తాళం వేసి లౌంజులోకి వచ్చి కౌంటరు క్లర్క్‌ను అడిగినాడు విక్రం. దొరుకుతుంది అని హోటల్ డైనింగ్‌హాల్‌కు యెలా వెళ్లాల్సిందీ చూపించినాడు. యిద్దరూ కలిసి వెళ్లినారు. పోగానే హోస్టస్ వచ్చి వాళ్లను తీసుకెళ్లి మెనోకార్డ్సుని యిచ్చి కాఫీ తీసుకొచ్చింది. రామన్ కాఫీ తీసుకున్నాడు. కాని విక్రం నాకు ఆరెంజ్‌జూస్ తెండి అన్నాడు. యింక విక్రంకు ఆకలి లేదు మూడు రోజులు తినకున్నా మూడురోజుల క్రితము బొంబాయి యేర్‌పోర్టులో కొద్ది ఫ్రూట్‌సలాడు తప్ప యింతవరకు యేమి తినలేదు. ఉదయం త్రాగిన కొద్దిపాటి కాఫీ తప్ప అతడేదీ ముట్టలేదు పాపం. రామన్ కాఫీ ముగించి తనకేమి కావాలో చెప్పినాడు. విక్రంని మీరేం తింటారని అడిగినాడు.

పిమ్మట తన ఆరోగ్యం గురించి చెప్పినాడు రామన్‌కు I am sorry to hear this అన్నాడు రామన్. విక్రం అగ్లాస్‌లోనున్న జూస్‌ను త్రాగుటకు ప్రయత్నిస్తున్నాడు. రామన్ తన బ్రేక్‌ఫాస్టు పూర్తి చేసి ఆ జ్యూస్‌నయిన పూర్తిగా త్రాగండి అన్నాడు. విక్రం త్రాగలేక త్రాగలేక మూడవ వంతు పూర్తి చేసి సరేనని డబ్బు చెల్లించి వెడుతున్నారు. వీరు బయటికి వెడుతుంటే ఓ చైనాదేశపు విద్యార్థి వీళ్లిద్దరిని చూచి. హలో మీరు యిండియా నుండా అన్నాడు. అవునన్నారిద్దరు. నాపేరు చాంగ్. నేను హార్వార్డులో చదువుతున్నానన్నాడు. విక్రంకు దేవుడు పంపిన దూతలాగ అనిపించాడు ఆ చైనా దేశపు విద్యార్థి. అలాగా మేము కూడ అక్కడికే

వెళ్లాలి అన్నారు. అయితే రండి నా వెంట నేను బ్రేక్‌ఫాస్ట్ తీసుకొని హార్వార్డుకే వెడుతున్నానన్నాడు.

సరే అని యిద్దరూ సంతోషంగ అతనితో వెళ్లి కూర్చున్నారు. అతడు తినగానే సరే మీపెట్టేబేడా యెక్కడుందనగానే మా రూంలోనని అతనితో 220 నంబరు రూంకు వెళ్లినారు. విక్రం పెట్టెను చాంగ్ రామన్ పెట్టెను రామన్ తీసుకొని బయటకు రాగానే రూంలో యేమి మరవటంలేదు గదా అని రూం అంతా చూచి రూంకు తాళం వేసి లౌంజ్‌లోనికి వచ్చి చెక్ out చేస్తున్నానని తాళం చేయినీయగానే కట్టిన డబ్బుకు రసీదిచ్చినాడు కౌంటర్‌క్లర్క్. పిమ్మట ముగ్గురూ బయటకు వెళ్లి పెట్టెలను కారు ట్రంకులో పెట్టి దానిని వేసి మూసినారు.

రామన్ చాంగ్ ముందు కూర్చున్నారు. విక్రం ఒకడే వెనుక సీటులో కూర్చున్నాడు. చాంగ్ కారు కొత్తదికాకున్న మంచి కండిషన్‌లోనున్నది. అప్పుడు 75 మైళ్లు గంటకు పోతుంది కారు. కొద్దిసేపట్లోనే గమ్యస్థానం చేరుకున్నాము. రామన్ వాళ్ల కజిన్ దగ్గరకు వెడుతున్నాడు. మిమ్ముల్నెక్కడ విడచిపెట్టాలి అన్నాడు చాంగ్. నేను కొత్త నాకెవ్వరూ తెలియదు. ఇక్కడ చదివి ఒక విద్యార్థి అడ్రసు టెలిఫోన్ నంబరు అని చాంగ్‌కిచ్చినాడు. ఓ యితడు నాకు తెలుసు అని అతడు యింట్లో వున్నాడో లేడో తెలుసుకొనుటకు టెలీఫోన్ చేసినాడు. కారువద్దకు వచ్చి యింట్లోనే వున్నాడు మీ స్నేహితుడు. ఈ రామన్‌ని విడచి మిమ్ములను విడుస్తాను అన్నాడు చాంగ్. సరే థేంక్యు అన్నాడు విక్రం. అన్నట్టుగా రామన్‌ను విడచి నన్ను నేనిచ్చిన అడ్రసుకు తీసుకెడుతున్నాడు చాంగ్. ఇతను యెవరో విక్రంకు తెలియదు. విక్రం I.A.S. collegue కు చుట్టమట. నేను వచ్చేముందు యితని అడ్రసు టెలిఫోను నంబరు యిచ్చాడు. విక్రం సరేనని తనవద్ద జాగ్రత్తగా పెట్టుకున్నాడు.

అది యిప్పుడు చాంగ్‌కిచ్చినాడు. చాంగ్‌కు అదృష్టవశాత్తు అతడు పరిచయము. అందువల్ల అతనికి ఫోనుచేసి అతని Apt కు తీసుకువెడుతున్నాడు విక్రంను. ఆ Apt చేరగానే పాపం చాంగే విక్రం పెట్టెను ట్రంక్ నుండి తీసి విక్రం స్నేహితుని చుట్టం యింట్లో పెట్టినాడు. పిమ్మట విక్రం చాంగ్‌కు చాలా చాలా కృతజ్ఞతలు తెలిపినాడు. చాంగ్ పరవాలేదు అని అతని టెలిఫోను నంబరు మరి యింటి అడ్రసు విక్రంకు యిచ్చి వెళ్లిపోయినాడు. ఈ పరిచయస్థుని పేరు సుబ్బారావు. నన్ను ఆహ్వానించినాడు. బడలిక తీర్చుకొమ్మన్నాడు feel free అన్నాడు. విక్రం తన అనారోగ్యాన్ని గురించి అతనితో ప్రస్తావించాడు. భోంచేస్తారా అన్నాడు. లేదు అని విక్రం అన్నాడు. అయితే మరి పడుకోండి అని అతని bed చూపించినాడు. విక్రం థేంక్సు అని బట్టలు మార్చుకొని అతని bed పై ఒరిగినాడు. కొంచెంసేపట్లో నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయినాడు. అప్పుడు మూడు గంటల టైము. అప్పుడు పడుకుంటె మళ్లీ తెల్లవారి ఎనిమిది గంటలకు కళ్లు తెరిచినాడు.

సుబ్బారావు యెలా వుంది మీ ఆరోగ్యము యిప్పుడు అన్నాడు. పరవాలేదు అన్నాడు విక్రం. ఏమైన భోంచేయండి అన్నాడు సుబ్బారావు. సరేనన్నాడు విక్రం. సుబ్బారావు నారింజరసం అందించినాడు గ్లాసులో. విక్రంకు నారింజరసం తాగుతుంటె రుచిగానుంది. అంటె యిప్పుడు ఆరోగ్యం కుదుటపడింది అని

అనుకున్నాడు విక్రం. పిమ్మట సుబ్బారావు విక్రం బ్రేక్ఫాస్టు చేసినారు. toast eggs మరి సీరియల్ విక్రంకు టోస్టుగ్రుడ్లు నచ్చినవి. సీరియల్ తను యిండియాలో తిన్నట్టులేదు యెప్పుడూ. కాని అమెరికాలో సీరియల్ ఉదయం breakfast గా తినుట సర్వసాధారణం. విక్రం ఒక టోస్టు ఒక గ్రుడ్డు అన్నాడు. దాంతో అతనికి శరీరంలో శక్తి ఉత్పన్నమైనట్లు తోచింది. పరవాలేదు నేనిప్పుడు సాధారణ మనిషిగా మనగలను. ఇంతవరకు ఒకరోగిగానే గడిపినాను.

నిజంగా New York యేర్పోర్టులో తను తన జన్మభూమిని తనబాబును, తన ప్రమదను చూడలేను అని చాల దుఃఖించినాడు. ఇప్పుడు అవి జ్ఞాపకమొచ్చి నిజంగ నా పరిస్థితి నాలుగు రోజులలో యెంత క్షీణదశ నుండి యింత మంచి దశకు చేరిందని సంతోషించినాడు. బ్రేక్ఫాస్టు కాగానే అపార్టుమెంటు సంగతి మాట్లాడినాడు. సరే మీ ఆరోగ్యము సామాన్యస్థితికి రాగానే తిరిగి చూద్దాం అన్నాడు. ఇప్పుడు మీ బ్రేక్ఫాస్టుతో నా ఆరోగ్యం కుదిరినట్టనిపించింది.

చాలా thanks మీ యీ సహాయానికి అన్నాడు విక్రం. ఇంత చిన్న సహాయానికే మీరు నన్ను పొగిడివేస్తున్నారు విక్రంగారు. నేను దీనికి అర్హుణ్ణి కాను సుమా. ఇది నామానవధర్మము. ఒకవేళ మీ చోట నేనుండి నాచోట మీరుంటె మీరు కూడ యిదే చేసేవారు కదా అన్నాడు. విక్రం అవునండి అని వూరకున్నాడు.

సుబ్బారావు విక్రం బ్రేక్ఫాస్టు పిమ్మట చాలాసేపు మాటాడుకున్నారు. సుబ్బారావు యిక్కడ ph.D biochemistry చేయుచున్నాడు. ఇతడు ఆంధ్ర విశ్వవిద్యాలయములో లెక్చరర్గానున్నారు. study leave పై యిక్కడనున్నాడు. హైదాబాదు సంగతులలో politics విషయములో నన్ను చాల అడిగినాడు. నాకు తెలిసినంత వరకు తెల్పినాను. పిమ్మట lunch time కాగానె నాకు యిచ్చటి అలవాట్లు అలవడ్డాయి. మీకు యీ అలవాట్లు రావడానికి కొన్ని వారాలు పట్టును. అందులో మీరు యింక అనారోగ్యంగ వున్నారు కాబట్టి మీరు తినే భోజనం విషయమై తెల్పండి. నాశాయశక్తుల మీకు చేసిపెడతాను అన్నాడు సుబ్బారావు.

సరే thanks అండి. నాకు అన్నం యేదో ఒకకూర లేదా పప్పు వుంటె చాలు అన్నాడు. అయితె మీకు కూర మరి అన్నము చల్ల బాగుంటుందా అన్నాడు సుబ్బారావు. బ్రహ్మాండంగా వుంటుంది. కాని నేను మీకు సహాయపడవచ్చా అన్నాడు విక్రం. మీ ఆరోగ్యం పూర్తిగా కుదుటపడ్డాక అలానే చేద్దురులెండి. ప్రస్తుతానికి నేను చేస్తాను అన్నాడు సుబ్బారావు. విక్రం చప్పుడు చేయలేదు. విక్రం అనాటి పత్రిక చదువుకుంటూ కూర్చున్నాడు. సుబ్బారావు వంట చేసి విక్రంను రమ్మన్నాడు. టేబిల్పై వున్న అన్నం కూర చల్ల యిద్దరు కలిసి భోంచేసినారు. విక్రం బాగ భోంచేసినాడు. పిమ్మట సుబ్బారావు మిగిలిన వంట fridge లో పెట్టి అంతా clean చేసినాడు. ఇద్దరూ చాలాసేపటివరకు మాట్లాడుకుంటు కూర్చున్నారు.

మరునాడు పొద్దున్నే లేచి సుబ్బారావు విక్రం Apt. కొరకు వెతకటం మొదలుపెట్టినారు. సుబ్బారావు వున్న Apt buildingలోనే ఒక Apt. వుంది. కాని భారతదేశం నుండి I.A.S.కు leave పెట్టిన విక్రం ఒక్కడు మొత్తం Apt.

తీసుకొంటె నెలకు 140 డాలర్లు అంటె భారతదేశపు రూ. సుమారు 720. అంటె ఒక సీనియరు I.A.S.కు దొరికె నెల జీతం. ఇంత డబ్బుకు అనాడు హైదాబాదులో ఓ మంచి బంగలా అద్దెకు తీసుకొనవచ్చు. అందుకె విక్రం ఒకడే ఆ అద్దెను భరించలేదు.

సుబ్బారావు, విక్రం కలిసి ఓ Apt. mate కొరకు ఆలోచిస్తున్నారు. ఒకసారి విక్రంకు అసిస్టెంటుషిప్ లేదా ఫెల్లోషిప్ దొరికితే అప్పుడు డబ్బుకు అంత బాధ చింత వుండదు కాని భారతదేశం రూపాయలను డాలర్లకు మారిస్తే చాల ఖర్చుతో కూడుకున్నపని. పాపం విక్రం పదివేలరూపాయలను మిగిల్చి వాటిని ఫారెన్ యెక్చేంజికు మార్చి వాటితో యిచ్చట వున్నాడు. అంటె యిరువది ఒక వంద డాలర్లే అతని వద్దనున్నా యన్నమాట. అందులో ఫీసు అతని భోజనము మరి Apt. అద్దె. ఎన్నిరోజులు సరిపోగలవని అతనికి బెంగగానే వుంది. ప్రమదకు మరి ఆమె కుటుంబానికి విక్రంకు తప్ప యెవరికి తెలియదు. ప్రమద కూడ భగవంతునిపై భారం వేసి సరే అని ఒప్పుకుంది. ఇప్పుడు ఆమె తలితండ్రుల వద్ద తన చిన్నారిబాబుతో వుంది. కాబట్టి విక్రంకు ప్రమద బాబు విషయమై యే చీకు చింత లేదు. దీన్ని సాధిస్తానన్న ధైర్యం తనకు వున్నది. విక్రంకు చదువు అంటె యెప్పుడూ కష్టంగా లేదు.

తన దేశంలో యెప్పుడూ అతను చదువంటె భయపడలేదు. చదువులో అనుకున్నవన్ని సాధించినాడు. ఇప్పుడు యిది ప్రపంచంలో ప్రసిద్ధికెక్కిన దేశం. ఒకసారి స్థిరపడి చదువు సాగిస్తే దేనినైనా సాధించగలనన్న ధైర్యం తనకున్నది. ప్రస్తుతం ఒక Apt.లో తనతో వుండగల ఒక మంచి విద్యార్థి కావలెనన్న ఆలోచనలో వున్నాడు. సుబ్బారావు కూడ సహాయపడుతున్నాడు. విక్రం అంటె సుబ్బారావుకు చాల వినయవిధేయతలు యెందుకంటె భారతదేశం నుండి ఒక I.A.S. పై చదువుకు తన స్వంత డబ్బుతో వచ్చినాడంటె యెంత పట్టుదల ధైర్యం అని ఆయన వూహించగలిగినాడు. అందుకై ఆయనకూడా తనశాయశక్తులా విక్రంకు తోడ్పడుతున్నాడు. సుబ్బారావు విక్రం అచ్చటనున్న భారతదేశీయులకు ఫోన్ చేసి తమకు ఒక మంచి Apt. mate కావలెనని పరిచయమున్న వారికి తెలిపినారు. పిమ్మట అయింటి లాండ్‌లార్డుతో మరే Apt. కావలె మీరు మమ్ముల నడగండి వేరేవాళ్లకీయకండి అని చెప్పినారు. ఆ land lord భారతీయ విద్యార్థులంటె మంచి అభిప్రాయమున్నవాడు కాబట్టి సరేనన్నాడు. ఆనాటికి వీళ్ళు చేయగలిగిందంతే. సుబ్బారావు వంట చేసినాడు. విక్రం అతనికి తోచిన సహాయం చేసినాడు. యిద్దరూ సాయంకాలం భోంచేసి కొంచెంసేపు పేపరు పుస్తకాలు చదివి నిద్రాదేవి ఒళ్లో ఒరిగిపోయినారు. పాపం రాత్రంత విక్రం ఒక మంచి Apt. mate దొరికితే సమస్య పరిష్కారం అవుతుందని ఆలోచించినాడు. రాత్రి కలలో ప్రమద మరి తన చిట్టిబాబు కనబడ్డారు. ప్రమద బాబు యీ దేశం వచ్చినాతో కలుసుకునే వరకు యిదే తృప్తి అనుకున్నాడు విక్రం. తెల్లవారగానే లేచి కాలకృత్యాలు తీర్చుకొని మొఖం కడుక్కొని విక్రం టీ చేసుకున్నాడు. పాపం సుబ్బారావుకు కాఫీ అలవాటు విక్రంకు టీ. యేదియెటైనా యిద్దరూ తమ తమ hot drinks ని తీసుకున్నారు. సుబ్బారావు నిన్న

చేసిన పరిచయస్తులకు phone చేసినాడు. Apt. mate కు. ఒకరిద్దరు ఆశాజనకంగా మాటాడినారు. తక్కిన వారంత యెవరూ కనబడడంలేదన్నారు. కాని ఒకతను మాత్రం చాల అశ కల్పించినాడు. తన cousin ఒకాయన యింజనీయరు రేపు బయలుదేరివస్తున్నాడు. అతనికి ఒక Apt. అన్న లేక accommadation కావాలట. అతడు రాగానే మీతో కలుపుతాను అన్నాడు సుబ్బారావు విక్రంతో. కొంత శాంతి కల్గింది. అతడు రాగానే సుబ్బారావుతో కలిసినాడు.

Apt. చూసి బాగుంది అన్నాడు. విక్రం విషయమై తెలుసుకొని చాలసంతృప్తి పడ్డాడు. అతడు కూడ విక్రంవలెనే accommadation విషయమై చింతగా వుండెను. ఇప్పుడు అతనికి కూడ Apt. మరి అందులో విక్రంవంటి partner దొరికినందున తృప్తిగానున్నాడు. Apt. బాగానే వుంది. రెండు రోజులలో shift అవుతానని చెప్పి విక్రంకు $100.00 డాలర్ల advance యిచ్చివస్తానని చెప్పి వెళ్ళిపోయినాడు. విక్రం సుబ్బారావుకు చాలా thanks చెప్పి అనాడు సాయంకాలం తన పెట్టె మరి చిల్లర సామానులు ఆ Apt.కు మార్చినాడు. సుబ్బారావుతో కలిసి వంటపాత్రలు మరి యింటికి కావలసిన చిల్లర సామానులను కొనుటకు వెళ్లినాడు. విక్రం యిండియాలో వున్నప్పుడు కారులోనే వుండినాడు. అతనికి ఒక Govt chauffer వుండేది. ఇక్కడ మాత్రం అతనికి కారు లేదు. సుబ్బారావుకు కారుంది. ఇండియాలో అతనికి లేకుండెను. ఇచ్చటికి వచ్చిన అరునెలలకు కారు కొన్నాడు. విక్రం సుబ్బారావు, సుబ్బారావు కారులో వెడలి విక్రంకు కావలసిన సామానంత కొని తెచ్చినారు. విక్రం అరాత్రి ఆ Apt. లోనే వుంటానన్నాడు. లేదు రేపు మనమిద్దరం కలిసి దీన్ని శుభ్రం చేద్దాము. యీరాత్రికి నావద్దనే భోంచేసి అక్కడే వుండమన్నాడు. విక్రం సరేనన్నాడు.

తెల్లవారి లేచి సుబ్బారావు విక్రం Apt.ను clean చేసినారు. భారతదేశంలో వలె అమెరికాలో Apt. layoutలు వేరే. ఈ Apt.లో రెండు బెడ్‌రూంలు, కిచెన్ మరి చిన్న living room (drawing room) వున్నవి. ఆ Apt.లో అందుకే విక్రం ఓ బెడ్‌రూంలో మరి కొత్తగా వస్తున్న భగవత్‌స్వరూప్ యింకో బెడ్‌రూంలో వుంటున్నారు. రెండు రోజుల పిమ్మట భగవత్‌స్వరూప్ తన సామానుతో వచ్చాడు. సుబ్బారావు భగవత్‌స్వరూప్‌తో విక్రం గది తట్టినాడు. విక్రంగారు యిదుగో మీ Apt. mate వీరి పేరు భగవత్ స్వరూప్ అని విక్రంకు పరిచయము చేసినాడు. ప్రస్తుతానికి నేను దీనిని bed roomగా తీసుకున్నాను. మీకు రెండవ bed room యిష్టం కాకపోతే యిందులోకి మీరు మారండి. అందులోకే నేను వెడతాను అని ఖాళీగావున్న bed roomను చూపించాడు విక్రం. ఇది బాగానే వుందినాకు. మీరు మీ రూంలోనే వుండండి అన్నాడు భగవత్‌స్వరూప్. విక్రం, సుబ్బారావు, భగవత్‌స్వరూప్ వాళ్ల living roomలో కొంచెంసేపు కూర్చున్నారు. భగవత్‌స్వరూప్ తన ప్రయాణ విషయమై తెలుపుకున్నాడు. విక్రం వెళ్లి టీ చేసి ముగ్గురికి తెచ్చాడు. సుబ్బారావుకు టీ యిష్టం లేకున్న sip చేస్తున్నాడు. ముగ్గురు రాబోయే course registration గురించి మాటాడుతున్నారు. ఇందులో సుబ్బారావుకే యెలా register చేయాలి. Courses యెలా select చేయాలి అనేది చెపుతున్నాడు. విక్రం

భగవత్‌స్వరూప్ ఆయన చెప్పింది వినుకుంటు మధ్యమధ్యన ప్రశ్నలు వేస్తే వాటికి సమాధానమిస్తున్నాడు. అన్ని ప్రశ్నలకు సమాధానమైన పిమ్మట సరే యివ్వాళ్ల లంచ్ మాయింట్లోనే చేస్తాము అన్నాడు విక్రం. సరేనన్నాడు సుబ్బారావుగారు. పాపం విక్రం యెప్పుడూ వంటచేయలేదు. సుబ్బారావుగారు యేవో కొన్ని simple lunch prepare చేసే విధానాలను చూపించినాడు. ఇవి తొందరగా తయారు అవుతాయి. మనదేశంలో చేసినట్టుగా చేస్తే మనకు చదువుటకు time దొరకదు అన్నాడు సుబ్బారావుగారు. అందుకే 1st lesson గా quick methods అంటే sandwhich యెలా చేయాలో. Serial యెలా తినాలి అనే అన్ని American foods గురించి చెప్పి పండ్లు మాత్రం రోజూ తింటె మంచిదన్నట్లుగా చెప్పినాడు. విక్రం సరే అనుకున్నాడు. రాత్రి భోజనం ముగ్గురూ సుబ్బారావు Apt. లోనే తిన్నారు. రాత్రి 11 గంటలకు విక్రం, భగవత్‌స్వరూప్ తమ Apt. కు వచ్చి తమ గదులలో నిద్రించినారు.

తెల్లవారి alaram చప్పుడుతో 6 గంటలకే లేచినారు. మొఖాలు కడుక్కొని serial breakfast చేసి కాలకృత్యాలు తీర్చుకున్న పిదప యిద్దరూ university కి నడచి బయలుదేరినారు. పోగానే వారివారి advisors దగ్గరికి వెళ్లినారు. మొదటిరోజు కాబట్టి అన్ని విచిత్రంగానున్నవి విక్రంకు. cultural shock యెందుకంటె అన్ని కొత్తగానున్నవి. ఇతని advisor room కు పోగానే యేం courses తీసుకుంటావనగానే నాకేమి తెలియదు అంతా కొత్త అన్నాడు విక్రం. అప్పుడు advisor కొన్ని ప్రశ్నలడిగినాడు. వాటికి విక్రం సమాధానమివ్వగానే ఒక కాగితం మీద కోర్సుల జాబితా వ్రాసి యివి తీసుకో యీ semester లో అన్నాడు. పిమ్మట registration grounds కు పొమ్మన్నాడు. నేనచ్చటే వుంటాను నాదగ్గరికి రా మధ్యాన్నము అన్నాడు. సరే అని పోయినాడు. విక్రంకు క్యాంపస్ అంతా కొత్తనే september నెల కాబట్టి యింకా weather warm గా వుంది. ఎటు చూచినా పచ్చని చెట్లు lawns కనపడుతున్నవి. buildings అంత అకర్షణీయంగ బైటికి కనిపించవు. కాని లోపల అన్ని సౌకర్యాలతో బాగా వుంటాయి. ప్రతి గదికి నంబరో లేక మరేదైన గుర్తు వుంటుంది. అన్ని గదుల తలుపులు వేసి వుంటాయి. విక్రం మెల్లగా advisor గది నుండి బయటకు వచ్చి యెవరినో అడిగినాడు. registration grounds కు యెలా వెళ్లాలి అని. అతను అన్నీ వివరంగా తెల్పి కాగితం మీద చిన్న map వ్రాసి యెలా వెళ్లాలి తెలిపినాడు. అక్కడ కుర్చీలు tables వేసివున్నవి. విద్యార్థులంతా que లో నిలబడివున్నారు. ప్రతి కుర్చీ మరి బల్ల వద్ద యెవరూ suit లో లేరు. విక్రం మాత్రం సూటులో వున్నాడు. ఎవరో కడుకొద్ది మంది suite లో వున్నారు. కాని వారు యిక్కడ పనిచేస్తలేరు. వారు యిక్కడ పనులెట్లా నడుస్తుంది చూచుటకొచ్చారన్నట్లు వుంది. వారు తప్ప అందరూ shirts & T shirts మీదనే వున్నారు. స్త్రీలు కూడా అలాగె. విక్రంకు మొదటిదినము కాబట్టి చూస్తూ అర్థం చేసుకొనుటకు ప్రయత్నిస్తున్నాడు. అబ్బ యెంత వ్యత్యాసము మన విద్యావిధానానికి యిచ్చటికి అనుకుంటు నిలబడ్డాడు. పిమ్మట యితని advisor కనబడగానే అతనివద్దకు వెళ్లినాడు. అతడు విక్రంతో యెలా course register

చేయాలి అని తెల్పగానే అచటి నుండి బయలుదేరి ఆ courses registration పూర్తి చేసినాడు. పిమ్మట advisor దగ్గరికి వచ్చినాడు. సరే యిక ఫీసుకట్టు నీ course registration పూర్తి అయినట్లే అన్నాడు. పిమ్మట course timings యిస్తారు. అది నోటు చేసుకొని రేపు క్లాసెస్‌కు attend చేయమన్నాడు. విక్రంకు ఫీసు యెక్కడ కట్టాలో యీ advisor గారు చూపించారు. సరేనని ఫీసు కట్టి course schedule and timings sheet తీసుకొన్నాడు. అప్పటికి మూడు గంటల time ఆకలి వేస్తువుంటే canteen యెక్కడ అని యెవరినో అడిగితే ఆ student union అని చూపి అచ్చటికి యెలా వెళ్లాలో చూపించాడు ఓ విద్యార్థి.

విక్రం వెదుకుతు వెదుకుతు student union చేరుకున్నాడు. అచ్చట అన్ని systematic గా వున్నవి. అందరూ క్యూలో నిలబడివున్నారు. మొదట trays, న్యాప్‌కిన్స్, చెమ్చాలు, fork లు, పిమ్మట నీళ్లు tea, coffee pops తర్వాత తిండిపదార్థాలు యిలా వరుసగా గ్లాసు cabins లో నున్నవి. ఒక ఈగ, దోమ, యీ మొత్తం తిండి పదార్థాలున్నచోట కనబడలేదు. ఈ క్యూలోవున్న అడమగ అంత తనకవసరమగు తిండి పదార్థాలు త్రాగుడు పదార్థాలు తీసుకొని చివరలో డబ్బు కట్టినారు. విక్రం యింకా cultural shock లోనే వున్నాడు. ఎంత efficient వీళ్ల పనులు.

ప్రతిదానికి ఓ చిన్న machine. వీళ్లు యెక్కువగా machines operate చేస్తారు. అందుకే వాళ్లు యింత తొందరగా యింతమందికి సర్వ్ చేస్తారు అనుకున్నాడు. విక్రంకు యేవి తినాలో యెందులో మాంసముంటుందో యెందులో వుండదో యేమి తెలియదు. మొదలు నీళ్లు తీసుకున్నాడు గ్లాసులో. పిమ్మట కొంత జెల్లి మరి వెన్న మరి రొట్టె తీసుకున్నాడు. bill యేమంత పెద్దగా కాలేదు. డాలరు కన్న తక్కువే కాని యింకా విక్రం మన రూపాయలలో convert చేసి చూస్తున్నాడు. అప్పుడు యెక్కువగానే తోచింది. అయినా ఈ దేశం కరెన్సీలో యిది చాలా చౌక కాని మన డబ్బుతో చూస్తే యిది యెక్కువగానే అని అనుకున్నాడు. విక్రం యేర్ టికెట్ పోగా రూ. 5000 వేల డాలర్లను కొన్నాడు. ఫీసు కట్టినాక రెండు నెలలు గడిచే బత్తెం ఉంది. పిమ్మట చూద్దాము అని అనుకున్నాడు. క్యాంటిన్‌లో ఒక బల్లవద్దనున్న కుర్చీపై కూర్చొని తన భవిష్యత్తు విషయమై ఆలోచించుకుంటు మెల్లగా తింటున్నాడు. ఆ మొత్తం హాల్‌లో యింక యెంతో మంది యిలాగే తింటున్నారు.

ఇతడు యిలా తింటున్నప్పుడు ఒక తెల్ల అమెరికన్ విక్రం టేబుల్ వద్దకువచ్చి may I join you sir అన్నాడు.

విక్రం ఓ yes, please అన్నాడు. అతను తన తిండి tray ను బల్లపై పెట్టి కూర్చొని nice weather today is it not అన్నాడు. విక్రంకు యిదేమిటి అనుకొని తక్షణమే yes అన్నాడు. America లో ప్రతివాడు మందలించాలంటే ఏదో ఒకమాటతో మాటాడుతాడు. ఆనాడు weather బాగుంది. అందువల్ల అది సంభాషణకు ప్రధానోత్సవంగ విసిరినాడు. పిమ్మట కొంచెంసేపటి వరకు తన తిండి tray లో సదిరి తినుకుంటు I am Jhon wilson I work in this university అని

చేయి అందించినాడు. విక్రం కూడ తనచేయితో కరచాలనము చేసినాడు. పిమ్మట అతడు సంభాషణ ప్రారంభించాడు.

Is it your first semester అన్నాడు Jhon wilson. Not only 1st semester but my first day in America అన్నాడు విక్రం. Is that right అని ఆశ్చర్యంగ అన్నాడు wilson. అవును అన్నాడు విక్రం. What if your area of studies అన్నాడు wilson. విక్రంకు Area of study అంటే తక్షణం అర్థంకాక ఆలోచిస్తున్నాడు. విల్సన్ కనుక్కొని I mean what are you planning to study అన్నాడు. O, sorry economics అన్నాడు విక్రం. Is that right. what is the speciality in economics అన్నాడు wilson. I am not sure right now అన్నాడు విక్రం. Good you will decide I am sure after your 1 st semester అన్నాడు wilson. ఇలాగే విల్సన్ విక్రంలు యేవేవో మాటాడుకుంటు అరగంట గడిపినారు. పిమ్మట విల్సన్ లేచి it is nice talking to you, take care I have to go to work అని లేచి కరచాలన చేసి వెళ్లిపోయినాడు. పిమ్మట తెలుసుకుంటె ఈయన vice president for accademic affairs అని తెలిసింది. విక్రంకు ఆశ్చర్యమయ్యింది. అబ్బ యెంత నిరాడంబరజీవి అనుకున్నాడు. కాని కొంత కాలమైన పిమ్మట విక్రంకు అర్థమయినదేమిటంటే యిక్కడ మనదేశంలోనున్నట్లు ఆడంబరాలుండవని యెవరి బాధ్యతలను వారు నిర్వర్తిస్తారు. అంతేకాని personal level లో అందరూ సమానంగ వుంటారు అని తెలుసుకున్నాడు. విల్సన్ వెళ్ళిపోయిన పిదప తనుగూడ తిని tray ను తీసుకొని ఆ moving belt పైన అందరు వుంచినట్టు విక్రం కూడ వుంచి నడచుకుంటు Apt. త్రోవపట్టి Apt. చేరుకున్నాడు. తాళం తీసి తన రూంలో మంచంపై ఒరిగినాడు.

ఇప్పుడు ప్రమద మరి అనుపమ్ జ్ఞాపకమొస్తున్నారు విక్రంకి. యేమిచేస్తున్నాడో నా చిన్నారి అనుపమ్ అనుకొంటు ప్రమద అనుపమ్ కలిసి దిగిన చిత్రపటాన్ని చూస్తున్నాడు విక్రం. వాళ్లిద్దరు జ్ఞాపకమొచ్చినప్పుడు ఆ చిత్రాన్ని చూస్తాడు విక్రం. పిమ్మట అతని feelings అన్నిటిని ఒక ఉత్తరం రూపంలో మార్చి mail చేస్తాడు పాపం. ఆనాడు కూడా తన కాలేజీలోని అనుభవం ప్రమదకు వ్రాసి mail చేసినాడు. ఇంతలోనే యితని Apt. mate భగవత్‌స్వరూప్ వచ్చినాడు. అతడు వచ్చినదే తడవుగా విక్రంసాబ్ యెలా జరిగింది మీ registration యివ్వాళ అన్నాడు. బాగానే జరిగింది అన్నాడు విక్రం. నేను coffee చేసుకుంటున్నాను మీకు కూడా కావాలా అన్నాడు భగవత్‌స్వరూప్. నేను కూడా వస్తున్నాను పద అని యిద్దరు kitchen లోకి ప్రవేశించినారు. భగవత్‌స్వరూప్ మరి విక్రంలు కలిసి coffee ని యీ వేడినీళ్లలో కలిపి కొంచెం పాలు పంచదార కలిపితే coffee సిద్ధం. మనదేశంలోవలె పొయ్యి అంటించి కష్టపడి కాఫీచేసే పని వుండదు ఈ దేశంలో. ప్రతిదీ చాలా easy. Stoves రెండు విధాలవుండేవి ఆనాటి అమెరికాలో ఒకటి గ్యాస్‌తో నడిచేది. రెండవది electricity తో. ఆనాడు మన భారతావనిలో gas stoves & electric stoves ను విక్రం మాత్రం చూడలేదు. కాని అమెరికాలో ప్రతి యింట్లో యివి standard అందుకే విక్రంకు

ప్రతిదీ విచిత్రంగా కనపడింది. అందుకేనేమో అమెరికా ప్రపంచంలో అన్నిటికన్నా శ్రీమంతమైన, భాగ్యవంతమైన దేశం అంటారు ప్రపంచవాసులంతా అనుకున్నాడు విక్రం. భగవత్ స్వరూప్ విక్రం coffee ముగించి living room లో కూర్చున్నారు. భారతదేశాన్ని గురించి నెహ్రూగారి socialistic pattern of society విషయమై మాటాడుతున్నారు. భగవత్ స్వరూప్‌కు యీ socialism విషయమై యెక్కువగా తెలియదు. విక్రం మాత్రం యీ విషయమై చాలా చదివినాడు భారతదేశంలో వుండగానే. అందుకే దానిని ఖండిస్తున్నాడు. కాని పాపం భగవత్ స్వరూప్ వూఁకొడుతు వింటున్నాడు. వీరిద్దరూ యిలా మాటాడుతూ కూర్చుండగానే సుబ్బారావు తన Apt. తలుపుతీసిన శబ్దం వినబడింది భగవత్ స్వరూపుకు మరి విక్రంకు. ఇద్దరూ కలిసి సుబ్బారావు Apt. కు వెళ్లినారు. ఆనాటి అనుభవాన్ని గురించి చర్చించుకున్నారు 9గంటల వరకు. పిమ్మట ఇద్దరు తమ Apt. కు చేరుకుని చదువుకుంటున్నారు తమతమ గదులలో. America లో course registration కాగానే పుస్తకాలు కొంటారు. మనదేశంవలె కాకుండ university book store లోనే ఆ కోర్సు పుస్తకాలుంటాయి. వాళ్లన్నీ లెక్క ప్రకారంగ అన్ని విద్యార్థులకు కావలసిన పుస్తకాలు మొదలే తెప్పించి వుంచుతారు. కాబట్టి registration కాగానే పుస్తకాలు కొంటారు విద్యార్థులు. classes attend చేయగానే పుస్తకాలు చదువుతారు. తమ lecture నోట్స్‌తో కంపేర్‌చేసి చూసుకుంటారు. మనదేశం చదువు పద్ధతివేరు. professors text books నుండే lectures యిస్తారు లేదా notes prepare చేసి విద్యార్థులచే వ్రాయిస్తారు. కాని America లో subject పై prepare చేసిన lectures యిస్తారు. అవి ఒక text book లోనేకాక వేరే పుస్తకాలలో వుంటాయి కాబట్టి వాటి reference అవసరము. అందుకే university quality maintain చేయాలంటె library చాలాబాగా వుండాలి. చాలామంది విద్యార్థులు library లోనే చదువుతారు. అందులో graduate students (మనము post graduate students అంటాము.) చాలామటుకు library లోనే చదువుతారు. వారికి library లో cubics desk వాటిలో దానిపై lamp అన్నీ చాల సౌకర్యంగా వుంటాయి. వాటిని graduate students allot చేయించుకొనవలె. విక్రంకు యివన్నీ కొత్తఅయినా తెలివైనవాడు కాబట్టి అందరిని అడిగి తెలుసుకున్నాడు. ఇతనికి కూడా యిప్పుడు library లో desk మొదలగు సౌకర్యాలున్నవి. Graduate students కే కాకుండ undergraduate students కు కూడా lamps అమర్చిన desk లుంటాయి చదువుకొనుటకు. కేవలం ఒక్క మాటలో చెప్పాలంటె వాళ్లకున్నన్ని విద్యాసౌకర్యాలు మనకే వుంటె మనవిద్యార్థులు యెంత చదివేవారో అనిపిస్తుంది. కాని విద్యకు కావలసింది పట్టుదల, విద్య నేర్చుకోవలెనన్న ఆపేక్ష కాని యీ రెండింటికి తోడు ఆధునిక సౌకర్యాలుంటే బహుశః విద్యను యింక బాగా అభ్యసిస్తు న్నారేమో! అమెరికాలో విద్యార్థులు ప్రత్యేకంగ technical కళాశాలలో ప్రొఫెసర్స్‌కు చాలా భయపడతారు. వినయవిధేయతవేరు, భయమువేరు. భయముంటె విద్యా ర్థులు తమకున్న అనుమానాలను ఆచార్యులతో నిర్భయంగ చర్చించలేరు. కాని అమెరికాలో

ఆచార్యులు విద్యార్థులు స్నేహితులుగా మాటాడుతారు, చర్చిస్తారు. నేర్చుకొనుటకు యిది యెంతో దోహదము చేస్తుందనుకుంట.

ఇద్దరూ చాలా రాత్రివరకు చదివి పడుకున్నారు. తెల్లవారగానే లేచి coffee సేవించి cerial పాలతో తిని తమతమ classes attend చేయుటకు బయలు దేరినారిద్దరూ. అమెరికాలో 8 గంటలకు మొదలవుతాయి. సామాన్యంగ నాలిగింటివరకు అన్ని classes పూర్తిచేస్తారు ఎక్కువ classes రెండు గంటలవరకు సమాప్తం. పిమ్మట classes చాలాతక్కువ. విక్రంకు 5 గంటలకు ఒక class వుంది. అటుపిమ్మట 10 గంటలకు. ఒకటివరకు అన్ని classes సమాప్తం. పిమ్మట యేదో part time job తన professor వద్ద చేసి $4\frac{1}{2}$, 5 వరకు Apt. చేరుకుంటాడు. భగవత్స్వరూప్ కూడ అంతే. ఇంటికి రాగానే coffee , చదువు, నిద్ర. ఇవి ఒక routine గా మారిపోయినవి. ఇప్పుడు వీరిద్దరికి తీరిక week ends లోనే. అందుకే విక్రంకు ప్రమద అనుపమ్ ఎక్కువ జ్ఞాపకం రావడంలేదు. రోజూ వుత్తరాలకై పాపం ఎదురు చూస్తుంటాడు. ప్రమద వారానికి ఒక వుత్తరం వ్రాస్తుంది. కృష్ణమోహన్ రెండు మూడు వారాలకొకసారి వ్రాస్తుంటాడు. పిమ్మట ధర్మారావు, శ్రీలత అప్పుడప్పుడు వ్రాస్తుంటారు. కాబట్టి ప్రమద వుత్తరాలకై విక్రం వేయికళ్లతో వేచియుంటాడు. ఆ వుత్తరాలు regular గా వ్రాసిన ఒక్కొక్కసారి ఆలస్యంవలన రెండు వుత్తరాలూ ఒకేసారి వస్తాయి. విక్రం చదువులో నిమగ్నుడైన home sickness తో బాధపడుతునే వుంటాడు. ప్రమదని ఒకతనే రమ్మని వ్రాస్తాడు. శ్రీలక్ష్మమ్మ కూడ ప్రమదతో అనుపమ్‌ను నావద్ద వీడివెళ్లవే తల్లి నేను నీకొడుకుకు యే లోటు రాకుండ చూసుకుంటాను అని యెన్నియోసార్లు చెప్పిచూసింది. కాని అనుపమ్‌ను విడచివెళ్లనంటే వెళ్లను అని పట్టుపట్టింది. అందుకే శ్రీలక్ష్మమ్మ రఘునాధరాయలు చేయునది లేక వూరకున్నారు పాపం. విక్రం కూడ నిజమే నేను లేకున్న ప్రమద వుంది అనుపమ్‌కు అమెవస్తే తల్లిదండ్రులు వీడిన పిల్లవాడౌతాడు అని సరే యిద్దరిని ఒకేసారి పిలిపిస్తాను అని బాగా చదువుతున్నాడు. ఈ మొదటి semester లో top grades సంపాదించినా యేదో ఒక ఆర్థిక సహాయం లభించవచ్చునని కొందరు విద్యార్థులు యితనితో అన్నారు. అందువలన పట్టుదలతో చదువుచున్నాడు. ఇతనికి పుస్తకాలు, classes తప్ప యిప్పుడు యేముంది. రాత్రింబవళ్లు దీక్ష వహించినవానివలె ఒకటే library లో కూర్చుంటున్నాడు. 12కి library మూసివేస్తారు. అంతవరకు విక్రం అచటే చదివి యింటికివచ్చి పడుకుంటాడు. ప్రొద్దున్నే లేచి class కు వెళ్లుతాడు. విక్రం ఆరు గంటలకన్నా ఎక్కువ నిద్రించడు. week ends లో మాత్రం కావలసినంతసేపు నిద్రిస్తాడు. పిమ్మట leisure గా లేచి coffee మెల్లగా enjoy చేస్తాడు. అప్పుడు కాని classes మరి course పుస్తకాల విషయం ఆలోచించడు. భగవత్స్వరూప్ కూడ week ends లో అంతే. అట్టే చూస్తుండగానే మూడువారాలు దాటినవి. విక్రంకు $I^{st}$ text declare చేసినాడొక professor అమెరికాలో professor కు పూర్తిగా స్వేచ్ఛ. అతడు చదివించే course contents అతడు నిర్ణయిస్తాడు. class లో పరిపూర్ణస్వేచ్ఛ. అతనికి చెప్పేవారెవరుండరు విద్యార్థులు కూడ

స్వేచ్ఛగా ఆచార్యులను ప్రశ్నలు వేస్తారు. వీలైతే ఆచార్యుని మీరు చెప్పేది సరికాదని ప్రశ్నించవచ్చుకాని దానికి subject పై విద్యార్థికి పూర్తి పరిజ్ఞానముండాలి. అప్పుడప్పుడు తెలివైన విద్యార్థులు ఆచార్యుల తప్పులను చూపించవచ్చు. ఆచార్యులు అప్పుడు విద్యార్థికి thanks చెబుతారు. కాని భారతదేశంలో నాకన్న యెక్కువ జ్ఞానమా నీకు అని విద్యార్థిపై పగబట్టవచ్చు. కాని అమెరికాలో సామాన్యంగా అలా జరుగదు. దీనినే వారు accademi freedom అంటారు. పూర్తి స్వేచ్ఛ వుంటె మనదేశంలో దుర్వినియోగం చేస్తారో లేదో కాని మన విద్యార్థులకు పరిపూర్ణ స్వేచ్ఛలేదనియే చెప్పాలి అనాడు. ఇక ఆచార్యులు కొంతమంది మంచి పరిజ్ఞానము వున్నవారు వున్నారు. కొంతమందికి అసలే విజ్ఞానముండదు. వారు కేవలము వారి influence వల్ల యీ పదవులలో వుంటారు. జ్ఞానము మాత్రం శూన్యం. ఇట్టివారు ఆ దేశాలలో చాలతక్కువ. ఎందుకంటె ఆ దేశాలలో యే పనిచేసియైన జీవనోపాధిని సంపాదించవచ్చు. కాని మనదేశంలో అసాధారణమైన జనాభావల్ల యెన్ని వుద్యోగాలైన చాలవు. కాబట్టి కొందరు ఉద్యోగాలను, యే వుద్యోగమైన పరవాలేదని minimum qualification తోనైన influence వలన యీ ఆచార్య పదవులలో చేరుతారు. వారు తమకు రానిది విద్యార్థులకు మరేమి చెబుతారు. ఏదో నామమాత్రమైన ఒకడిగ్రీ కాగితపుముక్క plus influence తో యీ అతిముఖ్యమైన ఆచార్యపదవులలో చేరి వారికే కాకుండా ముందు రాగల తరాలకు అన్యాయం చేస్తారు పాపం. అమెరికాలో నున్నంత academic freedom వుంటే విద్యార్థులే యిటువంటి ఆచార్యులను మనవిశ్వ విద్యాలయాల నుండి గెంటివేసేవారు. కాని అంత స్వాతంత్రము మన విద్యావిధానములో లేదు.

విక్రం యిప్పుడు యింకా బాగా చదువుచున్నాడు పరీక్షకి. పరీక్ష యిచ్చినాడు. ఇది యితని మొదటి పరీక్ష అమెరికా విద్యావిధానములో. అంటె యీ పరీక్ష course కు మొదటిది. ఎన్ని పరీక్షలు ఆ course అయ్యేవరకు అనేది కేవలం ఆ course ను చదివించే ఆచార్యునిమీద వుంటుంది. 0 నుండి రోజుకు ఒకటి చొప్పున కూడ వుండవచ్చు. అంటే ఒక పరీక్ష అంతమంచిగా వ్రాయకపోతే మునిగిపోయిందేమి లేదు. ఒకవేళ ఆ కోర్సుకు 4 పరీక్షలున్నవనుకో ఒకటి బాగా వ్రాయకపోతే final grade effect 25% మాత్రమే. Top grade తేవాలంటే యింకను 75% chance వుందన్నమాట. విక్రం మాత్రం బాగానే వ్రాసాడు. పరీక్ష యిచ్చిన మరునాడే professor papers ను విద్యార్థులకిచ్చి కొంత comments చేసినాడు class లో. విక్రంకు మాత్రం 97% మార్కులు సంపాదించాడు. అంటె A అన్నమాట విక్రం ఆ పేపరు చూచుకొని సంతోషించాడు. Class కాగానే యింటికి పోదామనుకొన్నాడు కాని యింకో క్లాసుంది. అందుకై తన graduate room లో desk పైన తలవాల్చి rest తీసుకుంటున్నాడు. నిద్రవస్తుంది కాని ఒక గంటలో యింకో class కు వెళ్లాలి. కాబట్టి మెలకువతో కూర్చొని ఉన్నాడు ఏదో పుస్తకము తిరగేసుకొంటు. పిమ్మట class time కాగానే note book తో class కు వెళ్లినాడు. class లో అంత attentive లేదు. ఎప్పుడు bell అవుతుందా అని యెదురుచూస్తు ఆచార్యుడు చెప్పేవి వినుటకు ప్రయత్నిస్తున్నాడు.

Bell కాగానే యింటికి వెళ్లి ప్రక్కపై పరుండి నిద్రించాడు రెండు గంటలు బాగా నిద్రలోనున్నప్పుడు అతనికి విశ్రాంతి బాగా లభించింది. పాపం మంచి grades సంపాదించాలని బాగా చదివాడు. ఫలితం లభించింది. పడుకున్నాడు. మేలుకున్న పిమ్మట కూడ అలాగే ప్రక్కపైన నిద్రావస్థలో నుండి లేచి bath room కు వెళ్లి కళ్లు, మొఖము కడుక్కొని fresh అయినాడు. పిమ్మట కాఫీ చేసుకొని sofa పైన sip చేస్తు వూహాలోకంలో భారతదేశాన్ని దర్శిస్తున్నాడు. తన జీవితమంత నెమరు వేసుకొంటున్నాడు. ఉద్యోగం వదలి వచ్చినానె అనుకున్నది సాధించకపోతె యెంత ఓటమి అనుకొన్నాడు. అతని మొదటి అమెరికన్ course పరీక్షలో బాగాచేసినందుకు తన్నుతాను మెచ్చుకున్నాడు. ఆరంభం బాగానే జరిగింది. అంతా కూడా అలాగే జరగగలదన్న ఒక ధైర్యం అతనిలో వుదికింది. ఈ వూహాప్రపంచంలోనే కాఫీ ముగించినాడు. ఇంతలోనే భగవత్‌స్వరూప్ లోనికి ప్రవేశించాడు. రావడంతో మీ పరీక్ష ఫలితాలెలాగున్నాయి విక్రంగారు అన్నాడు భగవత్‌స్వరూప్. పరవాలేదు బాగున్నాయి అన్నాడు విక్రం. congrats అన్నాడు భగవత్‌స్వరూప్. భగవత్‌స్వరూప్ తన రూంకు వెళ్లినాడు. బట్టలు మార్చుకొని కాఫీ చేసుకొనుటకు kitchen come living room లోనికి వచ్చినాడు. కాఫీకప్పును చేకొని విక్రంతో కూర్చున్నాడు. ఇద్దరూ ఏవో మాటాడుకొన్న పిదప వంట ప్రారంభించినారు. ఆనాడు విక్రమే వంట బాధ్యత వహించినాడు. ఇద్దరూ భోంచేసి మళ్లీ తమ గదిలోకి వెళ్లినారు. విక్రం మాత్రం యివ్వాళ course పుస్తకాలను చదవడములేదు. ఏవో తనకు వచ్చిన కొన్ని general పుస్తకాలు చదువుతున్నాడు.

అమెరికాలో యిప్పుడు విక్రంకు నాలుగవ మాసము. అన్ని course లలో బాగానే grades వచ్చినవి. ఇక finals కూడ బాగనే వ్రాస్తాను అన్న ధైర్యం విక్రంలో వుంది. అన్ని finals అయిపోయినవి. అనుకున్న ప్రకారం అన్ని courses లో A grade లు వచ్చినవి. ఇతని Major professor i.e chairman of his committee విక్రం విషయమై ఆనందంగా వున్నాడు. విక్రంకు యిది చాలా ముఖ్యము. ఒక semester గడిచిపోయింది. ఇప్పుడు semester break. విక్రం యెక్కువ Apt. లోనె వుంటాడు. సాయంకాలం campus లో walk మాత్రం చేస్తాడు. తక్కిన సమయంమంత వేరే India students తో మాటాడుటయో చదువుటయో తప్ప మరేమి పనిలేదు. కొందరు AID మీద వచ్చినవారు U.S. లో కొన్నిచోట్లను చూచుటకై వెళ్లినారు. వాళ్లకు AID డబ్బు యిస్తుంది. డబ్బు విషయమై వారికి చింత వుండదు. కాని చాలమంది చదువులో అంతమంచిగా లేరు. very poor performance. కొంతమంది యిచ్చిన డబ్బులో చాలా మిగులుస్తారు. ఒక అతను చాలమట్టుకు తన కూతురు వివాహమునకై, నెలకు $50 డాలర్లు మాత్రమే ఖర్చు చేసి తక్కిందంత మిగిల్చినాడు. వేరేవారు $ మిగిలించి యిండియాకు తీసుకెళ్లితే అయిదింతలు యెక్కువ డబ్బు. ఎన్నియో పనులు యీ డబ్బుతో సాధించవచ్చు అనుకొని డబ్బు కూడబెడుతున్నారు. వారు American standard ను మేంటెను చేయడములేదు. ఇది AID వారికి తెలుసు కాబట్టి వచ్చే సంవత్సరం వచ్చే batch కు తగ్గిస్తున్నారు. విక్రం యిదంతా గ్రహిస్తాడు. కాని యెవరితోను అనడు. తనకు

Assistant ship రాగలదన్న ఆశతో కూర్చున్నాడు. ఇంతవరకు యిండియా నుండి తెచ్చిన డబ్బుతోనే సర్దుకున్నాడు. కాని ఆ డబ్బుఅయిపోవస్తుంది. ఇంకో Indian డాక్టరు వద్ద రెండువందల డాలర్లు తీసుకున్నాడు. ప్రమద పిత్రుమూర్తి యీ డాక్టరు family కి రూపాయలలో డబ్బు చెల్లించినాడు. ఆ రెండువందలు చాలా మట్టుకు ఫీజుకే అవుతాయి. యిక Apartment rent మరి food expenses కావాలి అని ఆలోచిస్తున్నాడు. Semester తెరవగానే తన major professor తో కలిసి financial Assistance విషయమై మాటాడాలి అనుకున్నాడు. Semester brake రెండురోజులలో పూర్తికాగలదు. పిమ్మట తన professor తో కలిసినప్పుడు యేం మాట్లాడాలి అన్నసంగతిపై ఆలోచిస్తు కూర్చున్నాడు. Semester మొదటిరోజు యే courses తీసుకోవాలి అన్నది తన professor తో చర్చించాలి. అదే సందర్భములో Assistant ship విషయమై మాట్లాడాలి. ఉదయం లేవగానే coffee తాగి professor ను కలియుటకు అతని office కు phone చేసి appointment తీసుకున్నాడు. Appointment ప్రకారము అతని office గదితట్టి may I comein Dr. Hartly అన్నాడు. Yes విక్రం come in అన్నాడు professor. లోనికి ప్రవేశించగానే కుర్చీ చూపించి కూర్చోమన్నాడు. course schedule మీద సంతకం చేయుటకై విక్రం అతనిచేతికి అందించినాడు. Professor ఒక నిమిషంపాటు చూసి సంతకం చేసినాడు. పిమ్మట విక్రంతో I am very happy with your performance in the fall semester అని నేను ఒక project ను fall లోనే submit చేసియుంటిని అది యిప్పుడు మంజూరు అయినది. దానికి నాకు నీ సేవలు అవసరం. నీకిష్టమైతే నీకు యీ ప్రాజెక్టు మీద పనిచేయుటకు ఒక Assistant ship యివ్వాలనుకున్నా నీకు అంగీకరమేనా అన్నాడు professor. విక్రంకు యీ మాటలు శ్రవణానందములుగానున్నవి. అబ్బ దీనితో నాకు డబ్బు బాధ వుండదు అనుకొన్నాడు. I have no objection Dr. Hartly. I am thankful to you for providing me this opportunity అన్నాడు. O.K. then let me take you to the main office అని విక్రంను తీసుకొని Head of the Dept. office కు తీసుకువెళ్లాడు. విక్రంగారు నా project పైన పని చేస్తున్నాడు యీనాటి నుండి. ఇతనిని pay roll పై చేర్చండి అని చెప్పి వెళ్లిపోయినాడు. ఆ office లో పనిచేస్తున్న ఒక secretary నిమిషాలలో paper work పూర్తిచేసి అతని పనియేమిటి అతని రూం డెస్కు మొదలైనవన్నిటిని arrange చేసి congratulations అని కరచాలనచేసి good luck అంది. అంతటితో విక్రం ఆర్థిక problem solve అయ్యింది. మీరు నాటినుండి ఆ project కి కావలసిన primary data విక్రం collect చేయడం ప్రారంభించినాడు. ఇది research assistant ship. Teaching అయితే under graduates కు చదివించాలి. Subject విషయమై విక్రంకు బాధలేదు. తన Indian accent ను under graduates follow చేయలేరన్న బాధతప్ప. ఇప్పుడు యేబాధ లేకుండ research చేయవచ్చు. తన professor తో data collection యెలా జరుగుతుందని అప్పుడప్పుడు కలిసి తెల్పాలి. లేదా professor అడిగినప్పుడైన చెప్పాలి. ఇదితప్ప తక్కిన సమయమంత చదువుకు వినియోగించవచ్చు. డాలర్లు యిండియా నుండి రావలెననే బెంగ మాత్రం విక్రంకు లేదు. ఈ Assistatn ship

తో తను మరి ప్రమద బ్రతకవచ్చు. కాని ప్రమద అనుపమ్‌ను వీడిరాలేనన్నది. అందువల్ల యింకా కొంతకాలం ఒంటరి బ్రతుకే సాగించవలెనని నిశ్చయించుకున్నాడు విక్రం.

ఇప్పుడు spring semester అన్ని చెట్లు పచ్చటి చిగుళ్లతో కళకళలాడుచున్నవి. చలి చాలమటుకు తరలిపోయినది. campus చాల pleasant గానున్నది. అచ్చటచ్చట కొన్నిపూలు కూడ కనిపిస్తున్నాయి. మంచు అంతా కరిగి మాయమైనది. Winter లో యెటుచూసిన మంచుతప్ప. పచ్చటి ఆకులు చెట్లు buildings లో తప్ప బయట కనబడకపోయేవి. అందరు విద్యార్థి, విద్యార్థినుల బట్టలు కూడ మారినవి. thick over coats store లో పడవేసినారు. ఇప్పుడు అప్పుడప్పుడు sweaters తప్ప వేరే యేమీ వుండవు. యువతీయువకులంతా చాల స్వేచ్ఛగా ఆనందగా వుంటారు. ఆ దేశంలో university లోనున్న ప్రతివారు ప్రత్యేకంగ బాలికలు యెదురుగా వచ్చిన ప్రతివారికి ఒక నవ్వు కురిపిస్తారు. ఇది అచారమేమో. విక్రంకు యెదురైనవారంత Hi అని నవ్వుకుంటె అనేవారు. మొదలు అంటె fall semester లో విక్రంకు అంతగా అర్థంకాకుండె. ఇప్పుడైతె యిది వీరి మంచి అచారము అనుకుని యీాయన కూడ ఒక నవ్వు వారిపై విసిరేసి Hi అంటుంటారు. విక్రంకు అమెరికన్ యువతుల అందం ఆనందం యీస్ప్రింగ్ semester లోగాని తెలిసిరావటము లేదు. చాలామంది యీాయువతుల freedom ను వాళ్లు మాటాడే విధానాన్ని చూసి తప్పర్థం చేసుకుంటారు. ఎందుకంటె ప్రతిదానిలో వీరు పురుషులకు సమానము. అందుకని మొగవారు యేమిచేస్తారో ఆడవారు కూడ అది చేస్తారు. ఇచ్చట ప్రతి యువకునికి యువతికి ఒక girl friend, boy friend తప్పకుండ వుంటారు. యుక్తవయస్సు రాగానే వారికి girl friend లేదా boy friend లేకపోతే తలితండ్రులు బాధపడతారు. బహూశః యిది ప్రకృతికి విరుద్ధమని వీరి వూహ. ఏదియెటులైన విక్రంకు వీరి ఆచారాల ప్రకారమే మసలుతాడు. అందులో Assistant ship దొరికినాక బెంగ పూర్తిగా మాయమైనది. ప్రమదకు యీా విషయమై వ్రాసినాడు. ఆమె చాల సంతోషపడింది. కొడుకు ముద్దుమాటలను యిక చేసేవన్నీ వుత్తరాలలో చిత్రించినట్లుగా వ్రాస్తుంది. త్వరలోనే నీవు నన్ను చేరుతావు. ఒక సంవత్సరంలో M.S. పూర్తిచేస్తాను. Ph.D చేసినప్పుడు నీవు అనుపమ్ నాతో వుంటారు. అంతవరకు యేమి నేర్చుకొనవలె మొదలగు విషయాలను విక్రం తను వ్రాసె వుత్తరాలలో వ్రాస్తూవచ్చాడు. ప్రమద తన జననీజనుకులకు విక్రం progress విషయమై చెప్పుతుంటె వారు అమితానందాన్ని పొందేవారు. ధర్మారావు మరి రఘునాధరాయల కుటుంబాలలో పాశ్చాత్యదేశాలకు వెళ్లిన మొదటి వ్యక్తి యీా విక్రం. ఆనాడు చదువులకై పాశ్చాత్య దేశాలకు యేకొద్దిమందో వెళ్లేది ఈ వెళ్లినవారిలో చదువు పూర్తికాగానే మరలి దేశానికి వచ్చి ఏ పెద్దపదువులనో ఆక్రమించేది. మొత్తం అమెరికాలో ఆనాడు కొన్నివేల మంది భారతీయులే వుండేది. అందులో నూటికి 96 మంది విద్యార్థులే. ఈ Harvard లో కూడా చాలామంది భారతీయ విద్యార్థులున్నారు. ఒకచిన్న India Association కూడవుంది. అప్పుడు చాల తక్కువమంది భారతీయులున్నందువలన ఒకరిని చూచినప్పుడు మరొకరు నిలబడి

మాటాడేవారు. హిందూదేశస్థులంటే Harvard professors లో కొంతమందికి, విద్యార్థులలో కొంతమందికి చాల గౌరవభావమేర్పడి ఉండెను. graduate Dept లో చాలామటుకు వేరే దేశస్థులు వుండేవారు. అందులో భారతీయులు కూడ వుండేవారు. భారతీయులు తెలివైనవారని Harvard కు రావాలంటే చురుకుగానే వుండాలి. లేనిచో Harvard లో చేరుట అంత సులభమా?

ఇప్పుడు విక్రం రెండవ semester అంటె spring semester లోనున్నాడు. చదువు అంత కష్టమనిపించుటలేదు. అదీగాక అర్థిక యిబ్బందులు అసలేలేవు. కాకపోతే ప్రమద అనుపమ్‌లు లేనిలోటు తప్ప. ఇప్పుడు దానికి కూడ అలవాటుపడ్డాడు. కాని చాల కాలం వారులేంది యితనీదేశంలో వుండలేడు. తొమ్మిదినెలలో M.S. పూర్తిచేసి ప్రమద అనుపమ్ రాకపోతే అవసరమైతే మళ్లీ తిరిగి దేశం వెళ్లిపోదామన్న option కూడ తన plan లో చేర్చినాడు. కాని Ph.D. చేయనిది తిరిగిపోతే సిగ్గుచేటు అనుకొన్నాడు. అందువలన spring semester లో course work పూర్తి చేయాలని యెక్కువ course లను తీసుకొన్నాడు. రాత్రింబవళ్లు చదువుతు thesis పైన work మరి research Assistantship responsibilities పైన concentrate చేస్తున్నాడు విక్రం. చూస్తుండగానే May నెలవచ్చింది. చెట్లన్నీ చాల పచ్చగానున్నవి. అమెరికాలో spring ను చాలమంది enjoy చేస్తారు. పిమ్మట summer లో యేకొద్దిమందో courses తీసుకొని చదువుతారు. కాని అధికసంఖ్యాకులు summer jobs చేసి మళ్లీ fall semester లో చదువుటకు డబ్బు కూడబెట్టుకుంటారు. May లో spring semester finish కాబోతుంది. విక్రం అన్ని courses లలో grades బాగానే తెచ్చినాడు. spring అంతంలో యెన్ని 'A' grades యెన్ని 'B' grades తెలుస్తుంది. ఎక్కువగా 'A' grade తప్పవని అయన విశ్వాసము. యేవో ఒకటి రెండింటిలో తప్ప. చూస్తుంటే final exams రానేవచ్చినవి. Finals బాగాచేసినాడు విక్రం. ఏది యెట్లైన మొదటి రెండు 'B' లు యితనికి తప్పలేదు. ఐదులో తక్కినవి 'A' grades. ఇప్పుడు చదివేదిలేదు. తన thesis పై concentrate చేస్తున్నాడు అది summer లో. Summer end కు Thesis approve చేయించి oral తీసుకొని M.S. పుచ్చుకోవలెనని యితని దీక్ష. అనుకున్న ప్రకారము thesis 1st draft తన committee chairman కు review కోసమై యిచ్చినాడు. అతడు thesis ను చదివి కొన్ని మార్పులను suggest చేసినాడు. దాని ప్రకారము మార్పులు చేసి తన professor వద్దకి తీసుకువెళ్ళినాడు. అతడు చూసిసరే నేను committee members కు review కొరకై యిస్తాను అని ఆ thesis ను తనవద్దనే వుంచుకున్నాడు. ఒకవారంలో మొత్తం committee members review చేసి సంతకాలు చేసినారు. మార్పులు ఏమీలేవు. విక్రం chairman ఒకనాడు విక్రంను పిలిచి యిదిగో నీ approved draft. దీనిని final గా type చేయించి, మూడు కాపీలు తీయించు అన్నాడు. ఆనాడు యీనాడున్న copying technology లేదు. అప్పుడు carbon copies వుండెను. విక్రం ఒక అనుభవమున్న typrist కిచ్చి 1 + 2 చేయమన్నాడు. అన్నప్రకారంగా విక్రం చెప్పినట్టుగా 1 + 2 తయారుగానున్నవి. ఒకటి విక్రం వద్దనుండగా రెండు

committee ముందున్నవి. Oral date నిర్ణయమైనది. వారం రోజులలో M.S. oral పూర్తిచేసి M.S. పట్టా పుచ్చుకుంటాడు విక్రం. ఈ M.S. కై విక్రం చాలా కష్టపడ్డాడు మొదటి semester అంటె fall semester లో చాల home sick వుండెను. ఇది ప్రతి foreign విద్యార్థికి సహజమే. కొందరు చాలా home sickness కు గురి అవుతారు. కొందరికి కొంచెమే వస్తుంది. ఈ sickness. కొందరు తీవ్రమైన home sickness తో బాధపడలేక వచ్చిన వెంటనే స్వదేశము తిరిగి వెళ్లినవారు కూడా వున్నారు. కాని చాలామందికి యీ జబ్బు రోజురోజుకు తగ్గుతుంది. విక్రం యీ తెగకు చెందినవాడు. అతడు అమెరికాలో అడుగుపెట్టగానే యీ sickness severe గా నుండెను. పిమ్మట ప్రతివారం కొంత తగ్గుతూ వచ్చింది. ఇంక యీ sickness కొంచెం వుంది. బహుశః ప్రమద అనుపమ్ రాకతో యిది తొలగిపోతుందని ఆశిద్దాం. అనుకున్న ప్రకారం oral and thesis defence రోజురానే వచ్చింది. విక్రంకు defense చేయలేనన్న బాధవేలేదు. Head of the Dept కొన్ని తీవ్రప్రశ్నలు వేశాడు విక్రం తికమికపడుతుంటె తన professor విక్రంను encourage చేసి ఆ head ప్రశ్నలను సులభమైన శైలిలో విక్రంకు తెలిపినాడు విక్రం సమాధానమిచ్చినాడు. ఇవి తప్ప అందరి ప్రశ్నలకు సరియైన సమాధానాలు యిచ్చి వారి మెప్పును బడసినాడు. oral పూర్తికాగానే విక్రంను ప్రక్కగదిలో వేచియుండమని పంపించినారు. అరగంట విక్రం ఒకడే గదిలో కూర్చున్నాడు. అబ్బ యింతసేపా result కు యేదో ఘోరంరానున్నదని విక్రం అనుకుంటున్నాడు. పాపం చెమటలు వచ్చినంత పని అయ్యింది. ఇంతలో యితని professor గదిలో ప్రవేశించినాడు. విక్రం లేచినిలబడ్డాడు. congratulations విక్రం అన్నాడు professor. అప్పుడు కాని విక్రంకు అర్థంకాలేదు. అంటె అతని M.S. పూర్తి అయ్యింది అని. అప్పుడు విక్రం చెమటలు మాయమైనవి. అమితానందం అతనిని ఆవరించింది. Thank you Sir అని professor కు చెప్పి అతనితో గది బయటకు వచ్చినాడు. తక్కిన members కూడా congrats అని కరచాలన చేసి యెవరిదారిని వారు పోయినారు. విక్రంతో professor కొంచెం దూరం నడిచి O.K. విక్రం we will see you buye అని వెళ్లిపోయినాడు. విక్రం student union కు వెళ్లి ఒక cool drink తో ఒకబల్లపైన ఏకాంతంగ కూర్చొని cool drink త్రాగుతు తన వూహా ప్రపంచంలో మునిగి తేలుతున్నాడు. ఆ ప్రపంచం నుండి బయటపడి drink ను పూర్తిచేసి యింటి ముఖం పట్టినాడు. రాగానే ఒక వుత్తరం వ్రాసి ప్రమదకు mail చేసినాడు. పిమ్మట విశ్రాంతి తీసుకున్నాడు తన Apt. room లో.

ప్రమద విక్రం వుత్తరం చదివి చాల సంతసించింది. త్వరలోనే తన భర్త ఒడిలో తూలిపోతానన్న కలలు కంటున్నది. అనుపమ్‌కు చెప్పినా అర్థంకాదు తనయున్ని కౌగిలించుకొని నాన్నా మనము త్వరలోనే dady ని చేరుకుంటాము నాన్న అన్నది. తండ్రితో తల్లితో యీ వుత్తరంలో వ్రాసివున్న శుభవార్త తెలిపింది. వారు చాలా సంతసించినారు. అయితే మెల్లగానే shopping యేదో చేసుకొని సర్దుకో అమ్మా

అన్నాడు రఘునాథరాయులు. యేమైనా ప్రత్యేకమైన తొక్కులు కావలస్తే చెప్పు తల్లీ, సిద్ధం చేయిస్తాను అంది తల్లి. యేమో పోయేటప్పుడు యెంతలో సర్దుకోవచ్చునమ్మా ముఖ్యంగ తను sponsership papers మరి income certificate పంపాలిగద అమ్మ అవి రాగానే American consulate generals కు అర్జీ పెట్టుకొని యీ సర్టిఫికెట్లు పంపితే వారు వీసా యింటర్వ్యూకు రమ్మంటారు. వీసా రాగానే యివన్నీ సిద్ధం చేసుకోవచ్చునమ్మా అంది. అవునాతల్లి నాకు యివన్ని తెలియవమ్మ నీవు పోయే కొద్ది రోజులకు ముందు చెపితే అన్నీ సిద్ధంచేయిస్తాను తల్లీ అంది శ్రీలక్ష్మమ్మ. ప్రమద సరేనమ్మా అంది. అబ్బ సంవత్సరం నుండి నేను విక్రంను miss చూస్తున్నానే యిప్పటికైన అతనితోవుండే భాగ్యాన్ని ప్రసాదించు భగవాన్ అని లోలోన ఆ భగవంతున్ని వేడుకుంటుంది ఇప్పుడు ప్రమదలో ఒక వుత్సాహం మొలకలెత్తింది. చాల సంతోషంగ తిరుగుతుంది. తన దగ్గరి స్నేహితులకు phone చేసి యీ శుభవార్త తెల్పుకుంది. వారంతా ప్రమదా నీవు అదృష్టవంతురాలివమ్మ. ఎంతమందికి యీ అదృష్టం వస్తుంది అన్నారు.

ఈ సంతోషంలోనే విక్రంకు వుత్తరం వ్రాసింది. తన తలితండ్రులెంత సంతోషంగనున్నారో తన స్నేహితులెంత మురిసిపోయినారో అన్ని విషయాలు క్లుప్తంగ వ్రాసి sponsorship letter మరి income certificate పంపమని వ్రాసింది. అప్పుడు technological facilities యీనాడు వున్నంత మంచిగాలేకున్న వుత్తరాలు U.S.A. నుండి Indiaకు వారంరోజులలో ముట్టేది. కాని యిప్పుడైతే అతితొందరగా ముట్టితే కనీసం పదిరోజులైన కావాలి. దీని కారణమేమిటో ఆ భగవంతునికే తెలియాలి. అప్పుడప్పుడు ఒక వుత్తరం యిండియా నుండి అమెరికాకు చేరాలంటె నెల కూడపట్టును. ఉదాహరణలు లేకపోలేదు. కాని 1960 లో వారంరోజులలో సామాన్యంగ వుత్తరాలు చేరేవి కాని అనాడు టెలిఫోనులు U.S. నుండి Indiaకు చేయాలన్నా India నుండి U.S.కు చేయాలన్నా చాలా ఖర్చు మరి సమయంతో కూడుకున్నపని. ఇప్పుడైతే seconds లో మాటాడుకోవచ్చు. ప్రత్యేకంగా U.S. నుండి India కు phone చేస్తారు. అంటె telephone talk నిమిషాలమీద పూర్తి అవుతుంది. అందువల్ల వుత్తరాలు U.S. లోనున్నవారు వ్రాయుట చాలా తక్కువ. అప్పుడు భారతదేశంలో telephones కూడ చాల తక్కువ. గొప్ప వుద్యోగస్థుల యిండ్లలో భాగ్యవంతులైన వారి యిండ్లలో తప్ప సాధారణ మధ్యేతర కుటుంబీకుల యిండ్లలో చాలా చాలా అరుదు. ఇప్పుడైతే ప్రతి మధ్య తరగతి కుటుంబాల యిండ్లలో telephones వున్నాయి. ఈ భారతావనిలో యిది ప్రగతి. కొన్ని వుత్తరాలు ముట్టడంలో ప్రగతి reverse direction తీసుకొంది.

వారంరోజులలో విక్రంకు ప్రమద వుత్తరం ముట్టింది. ప్రమద తనముందు నిలిచి అన్ని విషయాలు తనే చెప్పుతున్నట్టు అనిపించింది విక్రంకు మరీమరీ చదువుతున్నాడు.

తెల్లవారి టీ త్రాగి తన professor తో కలిసి యీ విషయాన్ని ప్రస్తావించి యేమి వ్రాయవలెనో draft చేసి యివ్వమన్నాడు. విక్రం దీనికి చాల సంతసించినాడు. draft professor కు యివ్వగానే విక్రం వ్రాసిన దానిలో యే మార్పులేకుండ

initial వేసి secretary ని పిలిచి type చేసితెమ్మన్నాడు. Why dont you come after 5 minutes it will be ready అన్నాడు professor. సరేనని విక్రం తన office గదిలోకి వెళ్లిపోయి పిమ్మట పదినిమిషాల పిమ్మట వచ్చినాడు. రాగానే సంతకం చేసిన income certificate ను చేతికిచ్చి hope this will do. If you need any other help see me anytime అని కరచాలన చేసి good luck అన్నాడు. ఇప్పుడు విక్రం main hurdle అయిపోయింది తన వ్రాతతోనే Dept. letter head మీద ఒక affidavit వ్రాసి notary public తో noterise చేయించి తగినంత stamp అంటించి ప్రమదకు వ్రాసిన వుత్తరంతో సహా mail చేసినాడు. సరిగ్గా వారంరోజుల పిమ్మట తపాళ బంట్రోతు ఆ వుత్తరం ప్రమదకు ఇ దించినాడు. ఆ వుత్తరం విక్రంది కావున ప్రమద చాయ్ త్రాగు అని ఒక రూపాయి ఆ బంట్రోతుకు అందించింది. అతడు వంగి ఒక సలాము కొట్టి మరీ వెడలిపోయినాడు. ప్రమద వుత్తరం తెరచి విక్రం పంపిన income certificate మరి sponsoring affidavit చూసింది. విక్రం వ్రాసిన వుత్తరం చదువుకుంది. ఎలా రావాలి New York కు. తను సరిగ్గా ఫలానినాడు ఫలాన time కు New York దిగుతున్నానని తంతియిస్తే తనే స్వయంగవచ్చి receive చేసుకొంటానని వ్రాసినాడు. ఇకకొద్ది వారాలలో విక్రంను తన చిన్నారి తండ్రితో కలుసుకుంటానని మురిసిపోయింది. Madras లోనున్న U.S consulate general కు తనకు వీసా యివ్వవలసిందిగా కోరుతు ఒక వుత్తరం వ్రాసి దానితో విక్రం పంపిన sponsoring affidavit మరి income certificate పంపింది పంపేముందు తండ్రిగారితో యీ విషయం తెల్పి తను C.G. వ్రాసిన వుత్తరం చూపించింది. తండ్రి కొన్ని చిన్న మార్పులు వుత్తరములో చేసి గుమాస్తాతో type చేయించి ఆ documents ను జతపరిచి mail చేయించినాడు. ఇప్పుడు ప్రమద రోజా America కలలు విక్రంను కలిసినట్టుగా వూహిస్తూ దినాలు గడుపుతున్నది. ఇకపోతానన్న నమ్మకం ప్రమదలో కలిగింది. అందువలన తండ్రితో ప్రస్తావించి passport తనకు అనుపమ్‌కు తెప్పించమన్నది. రఘునాధరాయలు అప్పుడు హైద్రాబాదులోనున్న ఒకేఒక Travel Agency తో మాటాడి Regional passport office Madras కు అర్జీపత్రం వ్రాసి దానితో కావలసిన documents పంపించినాడు. మనదేశంలో ప్రభుత్వపనులు యేవీ తొందరగా కావు. యేవేవో అనవసరమైన ప్రశ్నలు అడిగి సమాధానాన్ని కోరుతారు. అంతేకాకుండ కావాలనుకొని delay చేస్తారు. ఎంతో delay చేసి లేనిపోని అనవసరమైన అడ్డంకులు పెడతారు. గుర్తుంటే, స్నేహితులు మరి బంధువులుంటె త్వరలో మనపని అవుతాది. కాని ఎవరూ తెలియకుండ వుంటే అవి యేళ్లు తీసుకొనవచ్చు. కాని రఘునాధరాయలు పదవిలోనున్న హైకోర్టు న్యాయమూర్తి. అతనికి మద్రాసులో కొందరధికారులతో పరిచయము కలదు. కాబట్టి ప్రమద, అనుపమ్ (passports) కు అంత యిబ్బందికాలేదు. (passport) లు రాకముందె (Madras U.S. consulate) నుండి ప్రమదను (interview) కు ఫలాన తేదినాడు ఒక నిర్ణీత సమయానికి రమ్మని పిలుపువచ్చింది. ఆనాడు చాల తక్కువమంది (America) కు వెళ్లేవారు. ఇలా వెళ్లగలిగే అదృష్టము యేకొద్ది మందికో లభించేది. అందువల్ల

మద్రాసు consulate లో యేమాత్రము rush వుండకుండెను. నిర్ణయమైన తేదీకి ఒకనాడు మొదట రఘునాథరాయలు ప్రమదతో మనుమడితో మద్రాసు plane లో బయలుదేరినాడు రాత్రిపూట ఒక బంధువుల యింట్లో గడిపి తెల్లవారు రెండు గంటలకు U.S. consulate కు చేరుకున్నాడు ప్రమద పోగానే కొన్ని నిమిషాలకు రెండు గంటలయ్యింది. సరిగ్గ అదే సమయానికి ప్రమద అనుపమ్‌ను consulate general office లోనికి రమ్మని పిలుపు వచ్చింది. రఘునాథరాయలు waiting room లో కూర్చొని నిరీక్షిస్తున్నాడు. పోయిన 16 నిమిషముల పిమ్మట ప్రమద అనుపమ్ వీసాతో సహా బయటికివచ్చి waiting room లోనున్న జనకునితో వాళ్ల బంధువుల కారులో యెక్కి బంధువుల యింటికి చేరుకున్నారు. ప్రమద అమెరికాకు వెళ్లుతుందని మరి రఘునాథరాయలు చాలాకాలం తర్వాత వచ్చినారని ఆ సాయంకాలం ఒక విందు ఏర్పాటు చేసినారు. విందారగించుకుంటు అమెరికా విషయమై మాటాడుకుంటు అందరూ ఆనందంతో గడిపి ఆ రాత్రి నిద్రించినారు. మరునాడు పది గంటలకు మద్రాసు నుండి హైద్రాబాదు వెళ్ళే flight కు సిద్ధమైనారు. రఘునాథరాయల బంధువులు కారులో వీరిని Air port కు తీసుకొచ్చి flight లో యెక్కించినారు. ఒక గంటలో begampet విమానాశ్రయంలో plane దిగింది. plane నుండి దిగగానే driver మరి car యేర్‌పోర్టు బయట సిద్ధంగానున్నది. ముగ్గురు car వద్దకి వెళ్లి దాంట్లో సరాసరి యిల్లు చేరుకున్నారు. యేమైందని శ్రీలక్ష్మమ్మ దిగగానే భర్తను అడిగింది. ఏమికాలేదు అని రఘునాథరాయలు శ్రీలక్ష్మమ్మతో నవ్వుతు అన్నాడు. యేమయ్యింది తల్లి అంది ప్రమదతో శ్రీలక్ష్మమ్మ. నవ్వుతూ వీసా దొరికిందమ్మా అంది ప్రమద. చాలా సంతోషం తల్లి అంది శ్రీలక్ష్మమ్మ. అందరూ living room లో కూర్చున్నారు. వంటమనిషి టీ తెచ్చినాడు. అందరూ టీ త్రాగుతూ యిక ప్రమదను అనుపమ్‌ను అమెరికా పంపే ప్రయత్నాల విషయమై మాటాడుతున్నారు. ఇంతలో టపాల బంట్రోతు ఒక registered letter ప్రమదదేవి పేరుతో వచ్చిందని సంతకంచేసి తీసుకొమ్మన్నాడు. ప్రమద వరండాలోకెళ్లి యెక్కడి నుండి అని చూచింది. అది మద్రాసు regional passport office నుండి వచ్చిందని సంతకంచేసి తీసుకొని బంట్రోతుకు బహూమతి యిచ్చి పంపించింది. drawing room కు రాగానే రఘునాథరాయలు యెచ్చటి నుండి అమ్మా అన్నాడు, మద్రాసు regional office నుండి నాన్నా అంది తెరచి చూసింది అందులో passport మరి covering letter వుంది. అబ్బ యిది కూడ వచ్చింది. ఇక ticket book చేయాలి నాన్నగారూ అంది. సరేనమ్మా అన్నాడు. మీరు పోయేతేది నిర్ణయించాలి. పిమ్మట మీ ticket కొనాలి అన్నాడు రఘునాథరాయలు. సరే అంది ప్రమద కాని లోలోన యెప్పుడు విక్రంను చూడాలా అనుకుంటుంది.

తెల్లవారుజామున లేచినాడు రఘునాథరాయలు. లేవగానే శ్రీలక్ష్మమ్మతో మంచిరోజెన్నడో మన పురోహితునితో తెలుసుకొని నాకు తెల్పు. అమ్మాయి ticket reserve చేయించాలి అన్నాడు. సరే అని శ్రీలక్ష్మమ్మ ఒక పనిమనిషిని ఆచార్యులవారిని నేను రమ్మన్నానని చెప్పిరా అంది. పనిమనిషి వెళ్లి ఆచార్యులవారికి ఈ వార్తనందించి వచ్చినాడు. సాయంకాలము $5\frac{1}{2}$ గంటలకు ఆచార్యులవారు

రానేవచ్చినారు. రఘునాధరాయలు court నుండి అప్పుడేవచ్చి living room లో కూర్చొని paper చూస్తున్నారు. ఆచార్యులవారిని చూచి రండీ ఆచార్యులవారు అని లేచి ఆహ్వానించారు. ఆసీనులుకండి అన్నట్టు కుర్చీవైపుకు చూపించినాడు. ఆచార్యులు కూర్చున్నారు. రఘునాధరాయలు కూడ కూర్చున్నాడు. పిమ్మట రఘునాధరాయలు పనిమనిషిని పిలిచి అమ్మగారిని రమ్మను అన్నాడు. కొంచెంసేపట్లో శ్రీలక్ష్మమ్మ వచ్చి ఆచార్యులవారికి నమస్కరించి కూర్చుంది. రఘునాధరాయలు మరియెన్ని రోజుల పిమ్మట కూతురుని మనుమణ్ణి పంపిద్దాము అన్నాడు. ఓ పదిరోజులన్న అమ్మాయి వుండాలి యింక. మళ్ళీ యెప్పుడు వస్తుందో నా తల్లి అని కంటతడి పెట్టుకుంది. సరే అలానే చూడండి రెండు రోజులు యిటో అటో పది రోజులలో యేరోజు మంచిదో అమ్మాయి ప్రయాణానికి అన్నాడు రఘునాధరాయలు. ఆచార్యులవారు తనులెక్కలు చేసి ఫలాన దినమునాడు మంచి ముహూర్తము అమ్మాయి ప్రయాణానికి అన్నాడు. సరే అని రఘునాధరాయలు, లక్ష్మమ్మ ఒప్పుకున్నారు. పిమ్మట ఆచార్యులవారిని సాగనంపి రఘునాధరాయలు, లక్ష్మమ్మ లోనికి వచ్చికూర్చున్నారు. ఒకవైపు కూతురు మనుమడు అమెరికాకు వెళ్ళి భర్తను కలుసుకుంటున్న సంతోషము, మరొకవైపు మళ్ళీ యెన్నాళ్ళకు చూస్తానో అన్న బెంగ శ్రీలక్ష్మమ్మలో మొలకలెత్తినవి. రఘునాధరాయలకు కూడ అదే feelings. ఇద్దరూ కొంచెంసేపు మాటాడకుండ కూర్చున్నారు. ఈ నిశ్శబ్దాన్ని break చేస్తున్నట్టుగా అనుపమ్ గబాలున వచ్చి రఘునాధరాయల వడిలో కూర్చున్నాడు. రఘునాధరాయలు అన్నీ మరచి మనుమడితో నాన్నా మీనాన్నను చూడాలని వుందా నీకు అన్నాడు. అవును అన్నట్టుగా తలవూపినాడు అనుపమ్. మరి మీ అమ్మమ్మను నన్ను చూడాలని లేదా అన్నాడు రఘునాధరాయలు. మనము అనుపమ్‌ను వుంచుకుందాము. ఒక ప్రమదనే పంపిద్దాం, ఏమంటారు మీరు? అంది శ్రీలక్ష్మమ్మ తాతగారిని సంబోధిస్తూ. సరే అన్నాడు రఘునాధరాయలు. మళ్ళీ బాబును లాలిస్తూ అవును కదనాయన నీవు మావద్దే వుంటావుకదూ, అన్నాడు రఘునాధరాయలు లేదు అన్నట్టుగా తలవూపాడు అనుపమ్ దిక్కుమొఖంతో. అమ్మా! చూచినావా! ఎన్నాళ్ళు పెంచినా వీడు ఇంతేనండి. మనవద్ద వుండడంట తల్లిని వీడి అంది శ్రీలక్ష్మమ్మ నవ్వుకుంటు. ఇంతలో ప్రమద అనుపమ్‌ను చూచి అటు living room లో ప్రవేశించింది. చూచావా తల్లీ నీ కొడుకు కధనం. వీడు మావద్ద వుండిపోరా అంటె లే మా అమ్మతోటే వుంటానంటున్నాడు అంది నవ్వుకుంటు. అప్పుడు ప్రమద నవ్వుతూ అనుపమ్, నీవు తాతయ్య అమ్మమ్మతో వుండిపోనాన్న నేను వెళ్ళి నాన్నను తీసుకొని వస్తాను అంది. ఆc అని యేడుపు మొదలుపెట్టిండు అనుపమ్ లే నాన్నా sorry నిన్ను కూడ నాతో తీసుకెళ్ళుతాను నా బుజ్జితండ్రిని వీడి నేనొకనాడు కూడ వుండగలనా అన్నది ప్రమద. లేదునాన్నా నీవు కూడ మీ అమ్మతోనే వెడుతావు కదండీ అంది లక్ష్మమ్మ రఘునాధరాయలను సంబోధిస్తూ. అవును అనుపమ్ ప్రమదతోనె వెళ్ళుతున్నాడు అన్నాడు రఘునాధరాయలు. అప్పుడుగాని అనుపమ్ యేడ్పుమానలేదు పాపం. మరునాడు రఘునాధరాయలు ఆచార్యులు చెప్పిన రోజున reservation fix చేయమని ticket Hyd. నుండి Boston

వరకని చెప్పినాడు. అప్పుడు వున్న ఒకేఒక Travel agency తో సరే అన్నారు అందులోని మేనేజరు రావుగారు. వెళ్లే సమయం కూడ హైదరాబాదు నుండి మరి బొంబె నుండి యెప్పుడో కూడా తెల్పినారు. సరే అని రఘునాథరాయలు phone పెట్టేసినారు. Phone పెట్టి తనపెద్దకుమారుడగు సుమిత్‌కు phone call book చేసినాడు. కొన్ని గంటలు పట్టింది ఆ call పోవుటకు. సుమిత్ phone పైకి రాగానే ప్రమద వెళ్లుతున్న తేది సమయం చెప్పి రెండురోజులు ముందే రమ్మన్నాడు. సరేనన్నాడు సుమిత్. రఘునాథరాయలు తన close బంధువులకు తెలిపి ప్రమదను సాగనంపుటకు రమ్మన్నాడు. అందరూ వస్తామని చెప్పినారు. ప్రమద యేమంత shoping చేయలేదు. ఆమెకున్న చీరెలు, కొన్ని నగలు పెట్టెలో సర్దుకుంది. కొన్ని చీరలు మరి అవసరమగు వస్తువులే సర్దుకున్నది. అనుపమ్‌కు మాత్రము కొన్ని బట్టలు ఖరీదైనవి కొన్నది. ఇకపోవుటకు రెండేరెండు రోజులు. మళ్లి అందరిని ఎప్పుడు చూస్తానో అన్న భయము. పోయేగడువు దగ్గర వస్తుంటె, యీ భయము తనలో యెక్కువయ్యింది. అయినా ధైర్యంతో వుంది పాపం ప్రమద. అందరు బంధువులు యింటినిండ వున్నారు. ఎవరికి తోచింది వారు మాటాడుతున్నారు. ప్రమద మాత్రం అందరికి ఒక చిరునవ్వుతో సమాధానం చెపుతోంది. ఇక యీనాడే ఆమె అమెరికా ప్రయాణము. Flight రెండు గంటలకు హైదరాబాదు నుండి. భోంచేసి తల్లిదండ్రుల పాదాలకు నమస్కరించి అనుపమ్‌తో ప్రమద మరి వారి బంధువులు తలిదండ్రులు నాలుగు కార్లలో బయలుదేరినారు. Airport (బేగంపేట విమానాశ్రయం చాల చిన్నది)కు అందరు స్నేహితులు బంధువులు sendoff చేయటానికి వచ్చినారు. ఇంతమందికి వీడ్కోలు చెప్పి కడసారి తల్లి శ్రీలక్ష్మమ్మను కౌగిలిడి కంటనీరు పెట్టుకుంది ప్రమద. శ్రీలక్ష్మమ్మ కూడా చాల జాగ్రత్తగా కప్పి పుచ్చుకున్న కన్నీరు ప్రవాహంలా కండ్ల వెంబడి వచ్చినవి. సుమిత్ ప్రమద వెంబడి బొంబాయికి పోతున్నాడు. ప్రమదను Air India కు వెళ్లి N.Y. కు వెళ్లే విమానంలో యెక్కించివస్తాడు. రఘునాథరాయలు కడసారిగా ప్రమదకు వీడ్కోలు చెప్పి అనుపమ్‌ను యెత్తుకొని ముద్దెట్టుకొని ప్రమదకు యిచ్చినాడు. అనుపమ్‌కు యేమి తెలియదు. నాన్నగారివద్దకి పోతున్నామన్న మాటతప్ప. ఇక departure కు 16 నిమిషాలున్నవి. అందరు విమానము యెక్కుతున్నారు. అప్పుడు యీ security problems లేకుండె. రఘునాథరాయలు శ్రీలక్ష్మమ్మ విమానం యెక్కే మెట్లవరకు ప్రమద అనుపమ్ మరి సుమిత్‌తో నడచినారు. మెట్లు పైకి ముగ్గురు యెక్కినారు కొంతసేపట్లో లోనికి ప్రవేశించినారు. అప్పుడుగాని రఘునాథరాయలు శ్రీలక్ష్మమ్మ విమానమువద్ద నుండి యేర్‌పోర్టుకు నడవలేదు. వీరిద్దరు యేర్‌పోర్టులోకి రాగానే flight కదిలింది. కొద్ది నిమిషాలలో విమానం గాలిలో మాయమైంది. చాలా మంది వారివారి యిండ్లకు వెళ్లిపోయినారు. రఘునాథరాయలు శ్రీలక్ష్మమ్మ మరి బంధువులంతా వచ్చిన నాల్గుకార్లలో యింటికి వెడలిపోయినారు. వీళ్లు యింటికి వచ్చిన రెండు గంటలకు వీళ్ల phone మ్రోగింది. సుమిత్ బొంబాయి నుండి మాటాడుతున్నాడు. తనువున్న హోటల్ పేరు phone number యిచ్చి New York వెళ్లే విమానము రాత్రి రెండు గంటలకు బయలుదేరుతుందని, రాత్రి ఒంటి గంటకే

విమానాశ్రయములో వుంటామని చెప్పి phone పెట్టేసినాడు. రఘునాథరాయలు శ్రీలక్ష్మమ్మ బంధువులతో 12 గంటలకు రఘునాథరాయలు ఆ హోటల్‌కు pp book చేసి ప్రమద అనుపమ్‌తో కడసారిగా మాటాడి అనుపమ్‌ను జాగ్రత్తగా చూసుకొమ్మని చెప్పి phone పెట్టివేసినాడు. పిమ్మట అందరు పడుకొన్నారు. ఇక్కడ బొంబాయిలో సుమిత్, ప్రమద అనుపమ్‌లు నిద్రించే ప్రయత్నం చేస్తున్నారు. కాని అనుపమ్‌కు తప్ప యెవరికి నిద్ర రాలేదు. హోటల్ wake up వారికి మాత్రం 12 గంటలకు లేపమన్నారు కాని పదకొండున్నరకే అన్నీ సర్దుకొని క్రిందికి దిగి వచ్చినారు. సుమిత్ hotel బిల్లు చెల్లించి taxi యెక్కేవరకు పన్నెండు గంటలయ్యింది. 10 నిమిషాలలో Airport చేరుకున్నారు. ఇప్పుడున్న బొంబాయి local Airport ఆనాడు international flights కు కూడ అదే Airport. అప్పుడు Boiny 707 విమానాలె. ఇది 1967 వ సంవత్సరం యింకా. కొంచెంసేపు waiting room లో వేట్‌చేస్తు కూర్చున్న పిదప New York కు వెళ్ళే ప్రయాణీకులంత boarding కు సిద్ధంగా boarding pass లతో రండి అన్నారు. ఇప్పుడు సుమిత్ అన్నయ్య కూడ తనకు తోడులేదు అనుకుంది ప్రమద. తానే అనుపమ్‌ను తనను చూచుకొనవలె అనుకుంది ప్రమద. అందరూ boarding cards తో que లోనున్నారు. ప్రమదా! బావను అడిగినానని చెప్పమ్మ అని చెల్లినిను కౌగిలించుకొని, అనుపంను లేపి ముద్దెట్టుకొని సరేనాన్నా buye అని అచ్చటే నిలుచున్నాడు. కొంచెంసేపట్లో అందరూ waiting రూం దాటి flight కు అందించే బస్సులో యెక్కుతున్నారు. waiting room దాటుతూ చెయ్యిలేపి కడసారిగా అన్నకు వీడ్కోలు చెప్పింది. సుమిత్ కూడ చేయిలేపి wave చేసినాడు. బస్సు యెక్కేవరకు చూచి పిమ్మట హోటల్ చేరుకున్నాడు. మరునాడు ఉదయం తొమ్మిది గంటల flight తీసుకొని Hyderabad చేరుకున్నాడు. రాగానే Hyd Airport లో తన నాన్నగారి కారులో యింటికి చేరుకున్నాడు. అన్ని సంగతులు క్లుప్తంగ తెలిపి నిద్రించాడు సుమిత్.

ఇక ప్రమద AIR India విమానం యెక్కిన పది 'నిమిషాలకే విమానం యెగిరింది. క్రింద మేఘాలు తప్ప యేమీ కనబడవు. తనయుని హత్తుకొని కొంతసేపు కూర్చుంది. తన ఊహా ప్రపంచములో తన తండ్రి తల్లిని చూస్తుంది ఒకవైపు, మరి యింకోవైపు తన ప్రాణేశ్వరుడు New York లో తనను receive చేసుకోగలడని అప్పుడు అతని ఒడిలో దూరి ఆ అలసటనంతా తీర్చుకుంటానని మరోవైపు వూహించుకుంటు కూర్చుంది విమానంలో. కొంతసేపైన పిదప అనుపమ్‌ని పక్కసీటులో కూర్చుండబెట్టి Seat belt తో బంధించి తనసీటులో నిద్రపోయింది. అనుపమ్ కూడ అంతే. మేమ్ we are serving dinner అని ఆ air hostess మేల్కొలిపే వరకు మెలకువ రాలేదు. అనుపమ్‌ను లేపి నాన్నా డిన్నరు తింటావా అంది. లేదు మమ్మీ అన్నాడు నిద్రలోనున్న అనుపమ్. కొంచెం [illegible] అంది ప్రమద వూఁ వూం అంటాడు అనుపమ్. ఎలానో అలాగు అనుపమ్‌ను లేపి టవల్‌తో మొఖం తుడిచింది. అనుపమ్ ముందున్న tray ను తీసి తన tray ను కూడ తీసి కూర్చుంది. Hostess యిద్దరికి భోజనాలు వడ్డించిపోయింది. ప్రమద

ఏదో నచ్చింది తిన్నది. అనుపమ్ కూడా అంతె. Hostess ఆ వడ్డించిన రెండు trays ను తీసుకెళ్ళింది. ప్రమద తనది మరి అనుపమ్ trays సీటుకు అమర్చి, మరి పడుకుంది. విమానము రెండు గంటలలో లండన్‌లో దిగుతుందని విమానపు captain announce చేశాడు సరే వచ్చినప్పుడు మేల్కో వచ్చునని ప్రమద మళ్లీ సీటుపై నిద్రించింది. అనుపమ్‌కూడ అంతే. విమానం లండన్ చేరుకుంది. అందరిని దిగి waiting room లో కూర్చోమన్నారు. పిమ్మట విమానమును శుభ్రపరచి fuel నింపుకునేవరకు రెండు గంటలు కావచ్చు అప్పుడు మళ్లీ మీరు వచ్చి మీమీ సీట్లలో కూర్చోవచ్చు అని announce చేశారు. అందువల్ల అందరూ తమ airbags, boarding cards, tickets pasports తీసుకొని విమానం దిగినారు. చాలామంది duty free shop లో తిరిగి కొనవలసినవి కొంటున్నారు. ప్రమదకు మాత్రము కొనేది యేమిలేదు. ఆనాడు ప్రతి విదేశం వెళ్లే భారతీయులకు యెనిమిది డాలర్లే యిచ్చేవారు. అంటె మన ఆనాటి భారతప్రభుత్వం ప్రమద, అనుపమ్ విమానంలో వెళ్ళినప్పుడు పదహారు డాలర్లను మాత్రమే యిచ్చింది భారతప్రభుత్వం. కాని ప్రమద విక్రం వద్దనుండి వేరే విధంగా యాభైడాలర్లను తెప్పించుకుంది. అయినా ఆమె యిప్పుడు shopping చేసే mood లో లేదు

ప్రమద అనుపమ్‌లు waiting room లో రెండు గంటలకు పైగా కూర్చున్నారు ఇంకా రమ్మని పిలువరు. అయితే ప్రమద దగ్గరగావున్న Air India attendent తో విమానము యెప్పుడు బయలుదేరుతుందని ప్రశ్నించగ we will announce please wait for a while అన్నది. ఇంతలో Air India announce చేసింది అప్పటి ప్రయాణీకులకంత ఏమంటె తాము వచ్చిన విమానము New York వెళ్లలేదని దానికి కొన్ని repairs కావాలని అందుకని మీరంత British Airline విమానంలో యింక మూడు గంటల తర్వాత New York బయలుదేరగలరు. అంతవరకు please నిరీక్షించండి. ఇలా జరిగినందుకు Air India మిమ్ముల క్షమించమంటుందని తెల్పి సమాప్తం చేసింది. ఈ announcement కాగానే ప్రమదకు యెటూ తోచలేదు. విక్రం New York యీ విమానం దిగే సమయానికి వస్తాడు. నేను రాలేదని బాధపడతాడేమోనని. వెంటనే AIR India representative వద్దకి వెళ్లి తన భర్తకు యీ విషయమై తెల్పి మీ విమానం దిగే సమయానికే రమ్మనమని టెలిఫోన్ చేయమన్నది. సరేనని వారు phone no. తీసుకొన్నారు. పిమ్మట AIR India passenger ను అయిదు గంటలకు gate number 16 వద్దవుండమన్నారు. AIR India తిండి coupans కూడ యిచ్చింది. కాని ప్రమద వాటిని వాడలేదు. Gate 16 కు సమీపముననే కొన్ని Snacks తీసుకొని నీళ్లు తాగినారిద్దరు. పిమ్మట అనుపమ్ ప్రక్క సీటులో పండుకున్నాడు. ప్రమద మాత్రం సీటులోనే కూర్చొని యేదో పత్రిక తిరుగేస్తుంది. పాపం యీ పేపరు చదువుతు అయిదు గంటల వరకు కాలం వెళ్లబుచ్చింది. అప్పటికి గాని విమానంలో ప్రవేశించమని పిలుపురాలేదు. తక్షణమే అనుపమ్‌ను లేపి రా నాన్నా మనము నాన్న దగ్గరికి వెళ్లాలి అని అనుపమ్ చేయిబట్టుకొని విమానంలో యెక్కింది. Air hostess యేమి త్రాగుతారు అని అడిగింది ప్రమదను. మాకు apple juice యివ్వమంది. సరేనని రెండు apple

juices cans మరి రెండు కాళీగ్లాసులను తమ సీటుముందున్న tray లలో వుంచింది. ఇద్దరూ juice enjoy చేస్తున్నారు. ఈ juices serve చేసిన అరగంటకే dinner serve చేసినారు. ఇది అంతా ఆంగ్లేయుల తిండి. అందువల్ల beef ని ముట్టలేదు ప్రమద. Bread cheese మరి dessert నే మాత్రం తింది. అనుపమ్ కూడ beef యెప్పుడూ తినలేదు. అందువల్ల అమ్మ యిదేమిటి అన్నాడు. అది గొడ్డుకూర నాన్నా అంది. యెట్లుంటది అమ్మా అన్నాడు. అలవాటు చేసుకున్న వారికి బాగానే వుంటుంది అన్నది ప్రమద. అయితే నేను తిననా అమ్మా అన్నాడు అనుపమ్. సరేనాన్న అంది. అనుపమ్ fork వాడలేదు. కత్తిని అసలేవాడలేదు. చేతితో కొంచెం తీసి నోటితో కొరికినాడు. అమ్మా నాకు తినబుద్ది కావటంలేదు అన్నాడు. తినకు నాయన bread, salaad, cheese, ice cream నీ యిష్టమొచ్చింది తిను అని ఒకటొకటి చూపించింది. అనుపమ్ ఒకటొకటి అన్నీ తిని అమ్మా నీ ice cream కూడ తిననా? అన్నాడు. ఓ తప్పకుండ అని తన ice క్రీమ్ dish ని అతని tray లో పెట్టింది. దానిని కూడ పూర్తిగా తిన్నాడు అనుపమ్. మానాన్న ఎంత ఆకలితోనున్నాడని. అంతబాగా తిన్నందుకు ప్రమద చాల సంతసించింది. పిమ్మట అనుపమ్ అమ్మా నాకు మూత్రం వస్తుంది అన్నాడు. అలాగా నాయన అని air hostess తో తమ tray లు తీయవలసిందని కోరగా ఆ air hostess తక్షణమే ఆ trays ను తీసుకెళ్లింది ప్రమద అనుపమ్‌ను తీసుకొని bath room లోకి వెళ్లింది. అనుపమ్‌ను మూత్రం చేయించి నాన్నా నీవిచ్చటే వుండమని తను bath room లోనికి వెళ్లి కాలకృత్యాలను తీర్చుకొని, మొఖం కడుక్కుంది. పిమ్మట అనుపమ్‌తో తమసీటులో కూర్చొని belts బిగించుకున్నారు. కొంతసేపైన తర్వాత నిద్రలో మునిగిపోయినారు.

చూస్తుండగానే New York వస్తుంది వందమైళ్లకు దూరంగా వుండగానే captain సీట్ బెల్ట్స్‌ను బంధించుకొని seats ను strait గా చేయమని announce చేసినాడు. ఇంక అరగంటలో మనము New York లోనుంటామన్నాడు నిద్రలోనున్న ప్రమదను అనుపమ్‌ను air hostess లేపి సీటుబెల్ట్స్‌ను కట్టుకొమ్మని చెప్పింది. New York లో కొద్దిసేపట్లో దిగబోతున్నామని తెల్పింది. ప్రమదకు యిప్పుడు చాల సరదాగా వుంది. మనము కొద్దిసేపట్లో నాన్నను కలుసుకుంటాము అనుపమ్ అంది. ఓ అలాగ అమ్మా. నాన్నను చూడక యెంతకాలమయ్యింది అన్నాడు అనుపమ్. ఇంతలో విమానం భూమిపైన వ్రాలింది. మెల్లగా terminal వైపు పోతుంది. అందరు seat belt sign off అయ్యేవరకు సీట్లపైన కూర్చోమని విమానాధికారులు announce చేసినారు. తుదకు విమానము terminal వద్ద ఆగింది. అందరూలేచి తమ సామానును పైనుండి తీస్తున్నారు. ప్రమద తన air bag ను కాళ్లవద్ద seat క్రిందనే వుంచింది. ఆ air bag ను సంకకు వేసుకొని అనుపమ్‌ను ఒకచేతితో పట్టుకుని que లో immigration వైపు నడిచింది. ఒకరి పిమ్మట మరొకరు immigration clearence చేసుకుంటున్నారు. ప్రమద $F_2$ వీసాపైన వచ్చింది. అనుపమ్ కూడా అంతే. immigration officer అన్నీ check చేసేచోటుకు వచ్చింది. ఒక cart ను తీసుకొంది. అనుపమ్‌తో తన bags (suit cases) కొరకు చూస్తు

వుంది. ఇంకను తనవిరావే అని అనుకుంటువుంది. కొంచెంసేపైన పిమ్మట మొదటి suitcase వచ్చింది. రాగానే దానిని లేపుటకు ప్రయత్నం చేసింది. ప్రక్కనేవున్న ఒక అమెరికన్ దాన్ని తీసి క్రిందబెట్టినాడు. ప్రమద thanks చెప్పిందాతనికి. ఈ విధంగా అరగంటలో ఆమె రెండు suit cases ను తీసుకొని customs clearance కొరకు que లో నిలబడ్డది. ఇంతలో ఒక immigration officer ఈమెవద్దకు వచ్చి మీరు మొదటిసారి ఈదేశానికి వస్తున్నారా అన్నాడు. అవునంది ప్రమద. మరి యీపెట్టెలలో ఏమేమి వస్తువులున్నాయన్నాడు. ఏమి లేవు నావీ నాతనయుని బట్టలు తప్ప అంది. అయితే మీరు యిలా వెళ్లండి బైటకి అని ఆ boxes మీద X గీతలు గీసినాడు. అనుపమ్‌తో తన traley ని నెట్టుకుంటు customs దాటి బయటకు వచ్చింది. విక్రంకై అటుయిటు చూస్తోంది. విక్రంకూడ వచ్చే వాళ్లనంతా చూస్తూ నిలబడ్డాడు తన బెంగాలి మిత్రునితో. ఇంతలో ప్రమద విక్రంను చూసి అనుపమ్‌తో అతనివైపుకు నడుస్తుంది. విక్రం కూడ వీళ్లవైపుకు నడుస్తున్నాడు. అది మధుర క్షణం ఆ ముగ్గురికి. ప్రమద విక్రంను కౌగిలించుకొంది. విక్రం అనుపమ్‌ను లేపి ముద్దిడికున్నాడు. ఎలావున్నావు నాన్నా. ప్రయాణమెలా వుంది ప్రమద. చాల అలసిపోయి వుంటారు. పదండి అని తన బెంగాలీ మిత్రునితో she is my wife and this is my son అని యిద్దరిని పరిచయంచేసి యీయన నా మిత్రుడు విజయసేన్ యీయన Ph.D. candidate అన్నాడు. ప్రమద నవ్వుతు నమస్కరించింది. ఆయన కూడ నమస్కరించాడు. నలుగురు నడచి parking lot లోకి పోతున్నారు. విక్రం అనుపమ్ చేయి ఒకచేయితో పట్టుకొని traley ని మరొకచేతితో నెట్టుతు parking lot లో park చేసిన car వైపుకు వెళుతున్నారు. కొంచెంసేపైన పిమ్మట vijaysen car వద్ద ఆగినారు అందరు. car trunk లో suit cases మరి air bags ను పడవేసి విక్రం వెనక తలుపులు తెరచి ప్రమదను అనుపమ్‌ను కూర్చుండబెట్టి తను ముందు సీటులో కూర్చున్నాడు. విజయసేన్ మాత్రం driving seat లోనున్నాడు. కారు start అయ్యింది. parking lot నుండి బయలుదేరి రోడ్డు మీదబడింది కారు. మనము కొన్ని గంటలలో మనయింట్లో వుంటాము. అంతవరకు మీరిద్దరు నిద్రపొండి అన్నాడు విక్రం. కొంతసేపైన పిమ్మట Highway మీద గంటకు 75మైళ్ల వేగంతో పోతుంది కారు. ప్రమద, అనుపమ్‌లు విక్రంతోనున్నారు. వారికేమి బాధ్యత భయము లేదిప్పుడు. నిశ్చింతగా వెనక సీటులో పడుకున్నారిద్దరు. కొన్ని గంటలు నిద్రించిన పిమ్మట "ప్రమదా లే మనం యిల్లు చేరుకున్నాం" అన్నాడు విక్రం. కళ్లు నిమురుకుంటు చిరునవ్వు ముఖంతో ప్రమద కారు దిగింది. దిగగానే యిద్దరిని తమ Apt. కు తీసుకొని living room లో కూర్చోబెట్టి నేను suit cases తెస్తాను అని వెళ్లి రెండింటిని తీసుకొచ్చి living room లో పడవేసి బయటికి వెళ్లి vijay sen ను లోనికి రమ్మని ఆహ్వానించాడు. కాని విజయసేన్ "లేదు. మళ్లి వస్తా. సంవత్సరం తర్వాత నీభార్య బిడ్డను కలుసుకొన్నావు. You deserve to be alone with your family. మళ్లీ కలుస్తాను తర్వాత" అని చెప్పి కారులో మాయమైనాడు విజయసేన్.

విక్రం leisure గా సోఫాపైన కూర్చున్నాడు కొడుకుని వళ్లో కూర్చుండబెట్టుకొని.

ప్రమద విక్రంపై వ్రాలి కూర్చుంది. మీ ప్రయాణమెలా జరిగింది అన్నాడు విక్రం ఒక flight break తప్ప యేమి problems కాలేదు అంది మీకు Airline వారు telephone చేసినారా అంది చేస్తేనేకదా ఆగింది అంతేకాకుండ AIR India counter లో కనుక్కుంటె యిదే సమాచారమందింది అన్నాడు విక్రం ఫోంచేస్తారా అన్నాడు విక్రం

లేదు అంది ప్రమద. రేపు నేను వంట చేస్తాను అప్పుడు అందరం తిందాము అంది. సరే అన్నాడు విక్రం. నేను జ్ఞాపకం వచ్చినానా అంది ప్రమద Every day అన్నాడు విక్రం.

పాపం ఆ శ్రీరామచంద్రుడెంత విరహబాధ ననుభవించినాడో సీతమ్మగారు లంకలో నున్నప్పుడు, నాకు అర్థం అయ్యింది అన్నాడు విక్రం. నేనుకూడ ఆ సీతమ్మ అనుభవించిన బాధనే అనుభవించాను. కాని నాకు ఆమెకు బేధమేమిటంటే ఆమెను రావణాసురుడు యెత్తుకవెళ్లి అశోక వనములో రాక్షసి కాంతలమధ్య వుంచినాడు. కాని నేను మీరు లేకున్న కొరత తప్ప అటువంటి నరకయాతనను అనుభవించలేదు అని అతని వక్షస్థలం మీద వ్రాలింది.

చూ! బాబు లేస్తాడు సుమా జాగ్రత్త అన్నాడు విక్రం. బాబు పడుకున్నాడు bed మీద పండబెడుతాను తెండి అని కొడుకును bed మీద పండబెట్టి వచ్చి విక్రంపై ఒరిగింది. పిమ్మట అర్ధనేత్రాలతో విక్రం తొడలపై పడుకుంది. ఒక సంవత్సరము బడలిక అంతా తీరిపోయింది రాజా అని గారాబంగ అంటుంది అతని దేహాన్ని నిమురుతు యెన్నియో రాత్రుళ్లు మిమ్ములను తలయుచు మీ రూపాన్ని చూసుకుంటు గడిపాను.

ఈ బాధ భరించినవాళ్లకే తెలుస్తుంది వేరేవాళ్లకు తెలియదు అంది ప్రమద. అవును ప్రమద! నిన్ను యిక యెప్పుడూ వీడి వుండను అన్నాడు విక్రం. ఇద్దరూ తన్మయులైనారు. Bed room లోకి వెళ్లినారు అనుపమ్ గాఢనిద్రలో నున్నాడు. ఇద్దరు ఆ చిరంజీవిని మెల్లగా తీసుకెళ్లి వాని రూంలో పడుకోబెట్టి తమగదిలోకి వచ్చి పడుకున్నారు. ఒక సంవత్సరము వేరుగావున్న దంపతులు వీరు. ఒకరి ఒడిలో ఒకరు వొరిగిపోయినారు. తన్మయత్వంతో చివరకు final act తో వారి శరీరాలు పూర్తిగా relax అయి మంచం మీద ఒరిగినవి. రాత్రంత నిద్రించింది ప్రమద. ఆమె యిప్పుడు స్వర్గలోకంలో నుంది ఎనిమిది గంటలకు విక్రం మేల్కొన్నాడు. ప్రమద పడుకొనివుంది అనుపమ్ కూడ అంతె

Brush చేసి coffee సేవించినాడు living room సోఫాపై కూర్చొని విక్రం యిప్పుడు అమితానందంతోనున్నాడు. Coffee ముగించి ప్రమద పడుకున్న గదిలోనికొచ్చి మెల్లగా లేపి అర్ధ నిద్రతోనున్న ప్రమదతో పడుకోబాగా, నేను మూడు గంటల పిమ్మట మళ్లా వస్తానని చెప్పి తన కారులో Dept కు వెళ్లిపోయినాడు.

పదకొండు గంటలకు అనుపమ్ లేచి అమ్మా! అమ్మా! అని పిలుస్తుంటే కాని ప్రమదకు మెలకువ రాలేదు. వెంటనే అనుపమ్ రూంలోకెళ్లి యెత్తుకొని తెచ్చి తనవద్ద పండబెట్టుకొంది. అనుపమ్ మళ్లి నిద్రించాడు. కాని ప్రమదకు నిద్రరాలేదు. లేచి తన brush కొరకు air bag తెరిచింది తక్కిన make up వస్తువులన్ని తీసి bath room లో సర్దింది. brush కు paste అంటించి బాగా brush చేసుకొంది.

రెండురోజులు plane ప్రయాణములో అంతగా పట్టించుకోలేదు. కాని ఇప్పుడు శుభ్రంగా పళ్లు brush చేసి నోరు మొఖము కడుక్కొంది. పిమ్మట దువ్వుకొని hair style గా చుట్టుకొంది. ఇక కాఫీతాగాలని వంట యింట్లోకి వెళ్లింది. ప్రమదకు refregater తప్ప యేది యెలా operate చేయాలో అంతగ తెలియదు. ఎందుకంటె అప్పుడు మనదేశం చాలా వెనుకబడి వుండె. ఫ్రిజ్‌లు యేకొద్ది భాగ్యవంతుల యిండ్లలోనే వుండేవి. ఎలక్ట్రిక్ లేదా gas ranges ప్రమద తలితండ్రి యింట్లో మాత్రం లేవు అందువల్ల యీ stove ను యెట్లా వాడాలో తెలియదు. కాఫీ యెచ్చటుంది తెలియదు. Refrigator లో milk cartin మాత్రము చూసింది. దానిమీద 2% మిల్క్ అని వుండటం వల్ల పాలు అని తెలుసుకుంది. ఇంక యిలాగే వెతుకుతుంటే టీ bags డబ్బ, అవి యెట్లా వాడవలెనని చదివిన పిమ్మట చాలా easy అనిపించింది. కాని coffee త్రాగాలనివుంది. ఒక సీసాపై instant coffee అని వుంది. తీసి చదివింది

మసలిన నీళ్లలో ఒక spoon వేసి cream కలుపుకొని అవసరమైన sugar కలుపుకొనైన లేదా, ఒకకప్పు కాగిననీళ్లలో సగము చెమ్చా పొడుము వేసి black coffee అయిన చేసుకోవచ్చు అని ఇంగ్లీషులో వ్రాసివుంది. ఈ black coffee యేమిటి ఛా! అనుకుంది ప్రమద. తను పాలు కాచి ప్రక్కన వుంచింది. పిమ్మట నీళ్లను కాసి mug లో పోసింది దాంట్లో పాలను కలిపి పంచదార కలుపుకుంది coffee ready గా వుంది. శుభ్రంగా mug ను చేతబట్టుకొని సోఫాపై కూర్చొని coffee తాగుతుంది ప్రమద ఇంతలోనే విక్రంలోనికి వచ్చాడు. ప్రమదా! నిద్ర సరిపోయిందా? అన్నాడు

ఆc సరిపోయింది అంది మందహాసంతో. సరే నేను యీామధ్యాహ్నాము యింట్లోనే వుంటాను. ఫోంచేసి grocery shop వెడదాము అని ప్రక్కనే కూర్చొని ముద్దిడుకున్నాడు.

మీకు తెలుసా నేనెంత ఆనందంగానున్నానో యిప్పుడు. సరే కాని ఒక టెలిగ్రాము యివ్వండి నాన్నగారికి, వారు యెదురుచూస్తుంటారు. దానికై అంది. నేను రాగానే మొదటి పని చేసింది అదే. don't worry they will get it pretty soon అన్నాడు విక్రం. Really, good అంది ప్రమద. విక్రంను లేపి వంట యింట్లోకి తీసుకెళ్లినాడు. మొదలు Range అంత explain చేసినాడు. ఆ నంబర్స్ intensity of heat ను చూపిస్తాయి. off అంటె చెప్పనక్కరలేదు no 10 lowest heat no.1. highest అన్నాడు నీవంటను బట్టి heat adjust చేయాలి తెలిసిందా అని బుగ్గ గిల్లినాడు. తెలిసింది రాజగారు. పిమ్మట అచ్చట grocery గురించి చెప్పినాడు.

సరే refrigator విషయము చెప్పే అవసరములేదు మీ అమ్మ ఇంట్లో మనయింట్లో చూసావు గనుక.

ఇకపోతే shower లో వుడుకునీళ్లు చల్లనీళ్లు మనకు కావలసిన వేడితో మిశ్రమము చేసి ఆ liver ను పైకి లాగితే shower మనమీద నీళ్లు కురిపిస్తుంది. నాకు తెలుసు నీకీ విషయం తెలుసని అయినా చెబుతున్నాను. ఒకే నీరువస్తే అలివుష్ణంగ వుండి శరీరం బొబ్బలెక్కవచ్చు. చలినీళ్లే వాడితె మన రక్తం గడ్డకట్టినంత

పనికావచ్చు అందుకే చెబుతున్నాను. సరే you are not a country girl. Let us get ready for grocery shoping అన్నాడు విక్రం. ప్రమద అనుపమ్‌కు పాలు త్రాగిస్తుంటె ప్రమద యిచ్చట cereal తింటారు. breakfast కు ప్రత్యేకంగా పిల్లలు కాబట్టి రేపటి నుండి అనుపమ్‌కు అదే తినిపించు పాలతో అన్నాడు విక్రం.

సరేలెండి కొద్ది సమయం యివ్వండి. మీకే నేర్పిస్తాను అంది నవ్వుకుంటు. నాకు తెలుసు. ఇప్పుడే కొత్త కాబట్టి చెపుతున్నాను. sorry యేమనుకోకు అన్నాడు విక్రం ప్రమద చెంప నిమురుతూ. పరవాలేదు మీరు చెప్పకుంటె యింకెవరు చెబుతారు అంది ప్రమద. ప్రమద అనుపమ్‌ను లేపి brush చేయించి పాలలో కలిపిన cereal ను తినిపించింది. పిమ్మట బట్టలు వేసింది. ముగ్గురు తన Apt. కు తాళంవేసి కారు దగ్గరికి వెళ్లినారు ఇది ఇంపాల కారు. ఆనాడు ఇంపాల కారంటే భారతదేశంలో చాల demand వుండె. అందుకే ప్రమద వచ్చేముందే యీ used car కొన్నాడు. కారు బాగుందే యెంతకు కొన్నారు అంది ప్రమద. ఇక్కడ కార్లు మరి petrol చాలచౌక ప్రమద. ఈ కారును ప్రతీవాడు ఈదేశంలో కొనజాలుతాడు. అందులో పెద్ద గొప్పేమీలేదు. repair charges చాలా యెక్కువ అన్నాడు. అనుపమ్‌ను వెనుకసీట్లో కూర్చుండబెట్టి యిద్దరు ముందు కూర్చున్నారు. కూర్చోగానే విక్రం car belts ను పెట్టుకున్నాడు. ప్రమద కూడా పెట్టుకోబోయింది. కాని రావటంలేదు. విక్రం తన belts ను తీసి ఆమెకు మొదలు belts వేసి పిమ్మట తను వేసుకున్నాడు. కారు కదిలింది

మొదటిసారిగా ఈదేశంలో grocery shoping కు వెడుతుంది ప్రమద. పదిహేను నిమిషాల పిమ్మట కారు ఒక parking lot లో ఆగింది. అక్కడ వేలాది కార్లు వున్నవి. విక్రం ఒకచోట car park చేసి seat belt తీసి దిగిపోయి ప్రమద seat belt ను తీసి ఆమెను దింపినాడు. పిమ్మట అనుపమ్‌ను వెనుకనుంచి దింపినాడు. అనుపమ్‌ను తనచేత్తో పట్టుకున్నాడు. ప్రమద విక్రం ప్రక్కన నడుస్తుంది. నిమిషాలలో grocery store లోనికి వెళ్లినారు. అంతా ప్రమదకు విచిత్రంగ కనిపిస్తుంది.

ఇంకా ఆమె cultural shock లోనే వుంది. New York లో దిగగానే ఆమెకీ cultural shock తగిలింది. plane దిగగానే అనుపమ్ అమ్మ యీ plane direct గా యీ బంగళాలోకి దిగిందేమిటి అన్నాడు. ఆ store మన కిరాణ కొట్టువలె లేదు. ఇక్కడ ప్రపంచంలో ప్రతి దేశీయులు తినే పదార్థాలు ఇంచుమించుగా నున్నవి. ఒక fresh fruits తప్ప ప్రతీది packages లోనున్నవి. పాలు paper cartin లోను, బియ్యం plastic bag లలోను, అన్ని pack చేసివున్నవి ఒక fresh fruits కూరగాయలు తప్ప store లోకి వెళ్లగానే అచ్చట చిన్న grocery carts వుంటాయి. విక్రం ఒకటి తీసుకొని నెట్టుతు ముందు నడుస్తున్నాడు. అనుపమ్ ఆకారులో కాళ్లు విక్రం వైపుకు పెట్టి కూర్చున్నాడు

ప్రమద కారు ప్రక్కన నడుస్తుంది. వరుసగా అన్ని సామానులు section లలో పెదపెద్ద స్టీలు frame లతో అమర్చిన open almarah లో అమర్చివున్నవి. Frozer section లో అన్ని freeze చేసినవే. సబ్బులు వుతుకుకునే బట్టల పౌడర్లు

మరి dish washing liquids మరి అనేక విధమైన detergents సబ్బులు, బట్టలు వుతుకుకునే పౌడర్లు ఒక సెక్షన్‌లో పాలు, చల్ల మరి తక్కిన dairy products యింకో section లో యీవిధంగ యెన్నో విధములగు గృహాలలోవాడే వేలాది వస్తువులు ఈ store లో వేరువేరుగా అమర్చి వున్నాయి. మొదటి దినము కాబట్టి విక్రం తమకు కావలసినవన్నీ ప్రమదను అడిగి, చూపించి బండిలో పడవేస్తున్నాడు. పండ్ల section లో ప్రమద apples, oranges ను చూచి సంబరపడింది. ఎంత పెద్దగా నున్నవి విక్రం. అందుకు విక్రం ప్రమద యీదేశం ప్రపంచంలో అగ్రశ్రేణికి చెందిన దేశం. ఇచ్చట అన్నీ చాల బాగుగానుంటవి అని అన్ని పండ్లను cart లో వేసినాడు. Dairy section కు వెళ్ళి పాలు, చల్ల, వెన్న మరి ice cream తీసుకొన్నారు. మనవెన్నకు యీవెన్నకు చాలా బేధముంది ప్రమద. ఇవన్నీ తీసుకొని bill pay చేయుటకు counter వద్ద que లో నిలిచినారు. ప్రమదను చూచిన అమెరికన్ స్త్రీలంత smile యిస్తున్నారు. ఈమెకు అర్థం కావటంలేదు.

మెల్లగా విక్రంతో వీరంత మీకు తెలుసా అంది. విక్రం లేదు అన్నాడు. మరినాకు smile యిస్తున్నారెందుకు వీరంత. ఇది వీరి ఆచారము. అందరు యెల్లప్పుడు ఒక క్రొత్త మనిషిని చూసినప్పుడు Hi అని smile చేసి యేదైన మందలించుటకు ప్రయత్నం చేస్తారు. మనము కూడా వారివలెనే మళ్లీ బదులు Hi అని smile యివ్వాలా? అంది ప్రమద. అవును అన్నాడు విక్రం.

ప్రమదా యీ దేశస్తులు మనదేశస్తుల కన్న మంచివారనుకుంటాను. ఎందుకంటె వారికి చిననాటి నుండి యిదే నడవడిని వారియిండ్లలో నేర్పుతారు. ప్రత్యేకంగ చాలామంది ఆడపిల్లలు smile యిచ్చుట పరిపాటి. మగపిల్లలు కూడ చాలమంది వేరే వ్యక్తులతో మాటాడుటకు, మందలించుటకు ప్రయత్నిస్తారు. కాని ఆడపిల్లలంత యెక్కువగా కాదు. మనవద్ద ఆడవాళ్లు ప్రత్యేకంగ మగవారితో కరచాలన చేయరు. కాని ఈ దేశంలో ఆడవారు మగవారు అందరూ కరచాలన చేస్తారు అన్నాడు విక్రం. ఇవన్ని నీకు అలవడేవరకు కొంత సమయం పడుతుంది. పిమ్మట నీవే నాకు నేర్పుతావు ప్రమద అన్నాడు.

ఇంతలో విక్రం తను కొన్న వస్తువులన్ని counter పైన పెట్టినాడు. అక్కడ అమ్మాయి వాటి అన్నింటి ధరలను టకటకమంటు మిషన్‌లో యెంటరు చేసింది. పిమ్మట ఒక switch నొక్కింది. ఇన్ని డాలర్లని machine మీద కానవచ్చింది. విక్రం చెక్ వ్రాసి ఆ అమ్మాయికిచ్చాడు. ఈమెకొట్టి ప్రక్కకు వేస్తుంటె మరో కుర్రోడు వాటినన్నిటిని brown bags లో సదురుతు బండిలో పెట్టినాడు. check యివ్వగానె మళ్లీ switch నొక్కింది. చిట్టిని rip చేసి విక్రంకు యిచ్చింది. ముగ్గురూ బండినెట్టి పిల్లవానితో కారు దగ్గరికి వచ్చినారు. విక్రం కారు తెచ్చినాడు. దిగి trunk తెరచినాడు. ఆ grocery boy అన్ని trunk లో సదిరి have a nice day అని తన ఖాళీ బండితో వెడలిపోయినాడు. కారు కదిలింది. ఇంటికి రాగానే బండినాపి trunk లోనున్న bags అన్ని యింట్లోకి తీసుకువెళ్లినాడు. అన్ని వస్తువులను friz లోను మరి యితర స్థలాలలో సర్దినాడు. ప్రమద కూడా తోచిన సహాయం చేసింది. ఆమెకు యిదంతా క్రొత్తగదా.

పిమ్మట ముగ్గురు సోఫాపై కూర్చొని విశ్రాంతి తీసుకుంటున్నారు విక్రం అనుపమ్‌తో నాన్నా యెట్లా వుంది నీకిచ్చట అన్నాడు చాలబాగుంది అన్నాడు విక్రంతో. మరి తాత అమ్మమ్మ నిన్ను మళ్లీ పంపించమంటున్నారు పోతావా అన్నాడు విక్రం. లేదు అన్నట్లుగా తలవూపినాడు అనుపమ్ T.V. చూస్తావా అన్నాడు విక్రం. అదేంటి అన్నాడు అనుపమ్ తమముందుగా ఒక అద్దంతోనున్న డబ్బావైపు చూపిస్తు అదే T.V. అన్నాడు విక్రం. ఏముంటుంది అందులో అన్నాడు అనుపమ్. చూడు on చేస్తాను అని ముందుకు నడచి T.V switch ను on చేసినాడు విక్రం.

T.V. లో picture రానే వచ్చింది అప్పుడేదో Wagon Train అనే serial నడుస్తుంది. అనుపమ్ తీవ్రంగా ఆ T.V. ని చూస్తున్నాడు ఆ programme పిమ్మట combat అనే మరో programme నడుస్తుంది. దానిని కూడ చూస్తున్నాడు. ఇంతలో ప్రమద వంట ఏమి చేయాలి అంది. నీ యిష్టము కారము, ఉప్పు, నూనె, బియ్యము, పిండి కావలసిన పదార్థములున్నవి. Range వుంది. దాన్ని operate కూడ చేయగలవు. నీ యిష్టమొచ్చింది చేయుము అన్నాడు విక్రం. ప్రమద వంట యింట్లోకి వెళ్లింది. ఒక కూర, పప్పు చేసింది గంటలో అవి చేసి dining table మీద పెట్టింది. చల్ల కూడవుంది ఆటేబుల్ పైన. ఇద్దరికీ ఆకలిగా వుంది. అనుపమ్‌ను కూడ రమ్మన్నారు తినుటకు. వాడు T.V. ని ఏకగ్రీవంగ కనురెప్ప వాల్చకుండ చూస్తున్నాడు. రానాన్న తిందువుగాని అన్నాడు విక్రం. ఇదికాగానె వస్తాను. అటువంటివి ఎప్పుడూ వుంటాయి ఆ T.V. పైన రా భోంచేసి మరి చూడు అని T.V. ని ఆపి యెత్తుకొని వచ్చి కుర్చీమీద కూర్చుండబెట్టినాడు.

ప్రమద యిద్దరికీ వడ్డించింది అనుపమ్‌కు కూడ వడ్డించింది. కాని వాడు యింకను సరిగ్గా తినుట అలవరుచుకోలేదు. అందుకే తను తొందరగా తిని అనుపమ్‌కు తినిపిస్తుంది. విక్రం మెల్లగా మాటాడుకుంటు తింటున్నాడు. అబ్బ యెన్నాళ్ల తర్వాత మనం ముగ్గురము కలసితింటున్నాము అన్నాడు విక్రం అవునుకదు అంది ప్రమద. విక్రం తిని చేతులు కడుక్కుంటున్నాడు bath room లో. ప్రమద అనుపమ్‌ను మెల్లగా బుజ్జగిస్తు తినిపిస్తుంది. వాడు చాల మెల్లగా తింటున్నాడు. ఎట్లో అట్ల కంచంలో నున్నదంత తినేవరకు వూరుకొనలేదు. పిమ్మట ice cream ఒక గిన్నెలో పెట్టి అనుపమ్‌కిచ్చింది. ఆ పసివాడు అమ్మ నేను అచ్చట కూర్చొని T.V. చూడవచ్చా మళ్లీ అన్నాడు of course అంది ప్రమద అనుపమ్‌ను sopha పైన కూర్చుండబెట్టి ice cream ఇచ్చి T.V. on చేసింది మెల్లగా తినుకుంటు T.V. చూస్తున్నాడు అనుపమ్.

ప్రమద అమెరికాలో మూడవరోజు. ఇంక యెన్నియో తెలుసుకోవాలి, ఎంత మందితోనో కలవాలి. ఈమె మూడు రోజులనుండి తన Apt. లోనె వుంది. ఇది university housing. Families తో వుండే విద్యార్థులకే యిస్తారు. ప్రమద వస్తుందని తెలియగానే ఒక Apt. కావలెనని అర్జీ పెట్టుకున్నాడు University housing Dept. కి తెల్లవారె telephone లో ఫలానా times కు రమ్మని పిలువు వచ్చింది. నియమిత సమయానికి వెళ్లినాడు. ఎంతమంది family లో అని ప్రశ్న అడిగింది ఆ office లో వున్న ఆమె. నేను నాభార్య మరి నా మూడు

సంవత్సరాల కొడుకు అన్నాడు. అయితే అవన్ని యీ form లో నింపి సంతకం చేయమంది. అలాగేనని కూర్చొని అయిదు నిమిషాలలో నింపి సంతకం చేశాడు. అంతకు మొదలు విక్రం ఒకడే University dorm లో ఒక అమెరికన్ graduate students తో నుండేవాడు. ఇతని roommate చాల మంచివాడు. ప్రమద యింక పదిహేనురోజులకు వస్తుందనగానే యీ married student Apt. కు మారినాడు తన సామానుతో ఇప్పుడు అతని వద్ద ఒక పాత యింపాల కారువుంది ప్రమద అనుపమ్ రాగానే తిరుగవలె కదా shopping కి అందుకే మూడు నెలల క్రితమే కొన్నాడు అమెరికాలో used car లను అమ్మేవారు చాల మోసగిస్తారని యీనాడు కూడ అంటారు. అందుకే వున్నవారు used car కొనరు. మళ్లీ చాల repair ఖర్చులు వస్తాయి. కాని విక్రంకు అటువంటిది యేమి ఇంతవరకు రాలేదు. చిన్నచిన్న problems వస్తే యితను gas (petrol) కొంటున్న gas station యజమాని charge లేకుండానే బాగుచేసేది. అతడు 50 యేండ్లకు పైగానుండెను. చాలమంచివాడు. University విద్యార్థులంటె అతనికి చాల యిష్టము. అందులో వేరే దేశీయులకు చాల మంచివాడు. వారు తమకు కావలసిన వారినందరిని వీడి, యెంతో కష్టపడుకుంటు చదువుతారు కాబట్టి వారిని ప్రత్యేకంగా treat చేసేది. వారి పాతకార్లకు యేమైన major problems వస్తే parts కు మాత్రం ధరకట్టి తీసుకొనేది అతని labour free. అతను విక్రంకు చాల సహాయం చేసేది. తన పాతకారు repair కు. అందుకే విక్రంకు కారు నడుస్తలేదన్న బాధనే లేకుండెను ఇప్పుడు ప్రమద, అనుపమ్‌తో సాయంకాలం అలా drive చేయుటకు వెళ్లేది. ఇలా రోజూ వెళ్లుతుంటే సరదాగ నేవుండేది. కాని రోజూ అదే పనిచేస్తుంటె కొంచెం bore కూడా. ఇంటికి రాగానే ముగ్గురు కలిసి కొంచెంసేపు T.V. చూసి అనుపమ్‌ను నిద్రపుచ్చేది. వాడిని sopha మీదనే పరుండబెట్టి యిద్దరు చాలాసేపు T.V. చూస్తు కూర్చుండేది. మధ్యమధ్య commercial వచ్చినప్పుడు విక్రం హైద్రాబాదు సంగతి మరి వారిద్దరి స్నేహితుల సంగతి గురించి మాటాడుకొనేవారు. విక్రంకు చాల తక్కువ స్నేహితులు. అయన స్నేహితులను వేళ్లమీద లెక్కించవచ్చు ప్రమదకు కూడ limited friends circle అందువల్ల రెండు మూడు రోజులు వారి గురించి మాటాడుటలో గడిచింది. రోజు యేముంది చెప్పండి మాటాడుటకు స్నేహితుల గురించి

చూస్తుంటె ప్రమద అనుపమ్‌తో U.S. లో ప్రవేశించి రెండు వారాలయ్యింది. ఒకనాడు విక్రం తన office కి పోగానే ప్రక్క Apt. లోనున్న అమెరికన్ విద్యార్థి భార్యతో పరిచయం చేసుకోవాలనుకొన్నది. ఎనిమిది గంటల పిమ్మట సామాన్యంగా మగవారు వారి dept. కు వెళ్లిపోతారు. 4 యేండ్లకన్న పెద్దగానున్న పిల్లవాళ్లు school కు పోతారు. ఇది ప్రమదకు తెలుసు. విక్రం రోజూ యెనిమిదికి మొదలే వెళ్ళిపోతాడు గదా. అందుకే తన యింటి ముందువున్న ఆమె Apt. తట్టి తలుపుకొట్టింది. ఒక నిమిషములో ఆ యువతి తలుపు తెరిచింది. Hi comon in అంది. ప్రమద ఆమెతో నేను మీముందున్న Apt. లో నుంటాను అంది. తెలుసు నేను రోజూ చూస్తుంటాను నీ husband office కు పోతుంటే నేనే

వచ్చి నిన్ను కలవాలనుకున్నాను sorry రాలేదు. ఇప్పుడు నీవే వచ్చినందుకు చాల సంతోషము అంది. కూర్చోండి అని ఒక చిన్న మూడేండ్ల పాపను చూపుతు యీామె నా రెండవ కూతురు marion అంది పెద్దమ్మాయి ఆరేండ్లది school కు పోయింది సాయంకాలం వస్తుంది అంది ప్రమద కూర్చుంది నా పేరు Julie మరి నీపేరు అంది. 'ప్రమద' అంది ప్రమద. అమెరికన్‌లకు తమ western పేర్లు తప్ప వేరే దేశస్తులపేర్లు కఠినంగ వుంటాయి. అందుకే ప్రమద పేరు Julie కి అనుటకు రాలేదు. ప్రమదకే కాదు మనకెవరికి కష్టంకాదు కాని అమెరికన్‌లకు మనపేర్లు పలుకుట కష్టంగానే వుంటాయి కాబట్టి మనవారు కొందరు తమ Indian పేరులను మార్చి వారి పేర్లు పెట్టుకుంటారు కాని విక్రం యెప్పుడు అలా చెయలేదు. ప్రమదకు అసలే యిష్టం లేదు తన పేరును మార్చుటకు. కాబట్టి Julie కి కొన్నిసార్లు జాగ్రత్తగా చెప్పితే యిప్పుడు ప్రమద అని కొంచెం అమెరికన్ accent లో అంటుంది యిప్పుడు ప్రమదకు పొద్దుపోదన్న సమస్యేలేదు. విక్రం పోగానే అనుపమ్‌ను చూసుకొనవలె అంటె brush చేయించి పిమ్మట స్నానం చేయించాలి. అటు పిమ్మట బట్టలు వేసి బయటికి పంపితే Julie బిడ్డ marion మరి విక్రం Apt. పైనవున్న ఇద్దరు అమ్మాయిలు ఇంక చాలా మంది పిల్లలు అనుపమ్‌తో ఆడుకుంటారు. మగపిల్లలు సామాన్యంగ cowboy and Indian ఆటలు ఆడుకుంటారు. ఆడపిల్లలు కూడ ఒక్కొక్కసారి యీా cowboy Indian ఆటలనే ఆడుతారు. కాని యెక్కువగా ఆడవారు చేసే పనుల ఆటలే ఆడుకొంటారు. వీళ్లు baby dolls తో యెక్కువగా ఆడుకొంటారు. ఇప్పుడు అనుపమ్‌కు చాలామంది స్నేహితులు. అప్పుడప్పుడు అ friends తో వచ్చినప్పుడు ప్రమద వాళ్లకు coolaid drink యిచ్చి అప్పుడప్పుడు ice cream కూడ యిచ్చేది. ఈ దేశపు పిల్లలు aunty, uncle అని మనదేశపు పిల్లలు పిలిచినట్లుగా పిలవరు వారు first name తోనే పిలుస్తారు సామాన్యంగా కాని అట్లా పిలుచుట ప్రమదకు యిష్టంలేదు కాబట్టి ఆమె Mrs.Rao అని పిలుపించుకునేది Julie ని అందరు పిల్లలు జూలీ అని పిలిచేది. కాని ప్రమదను Mrs. Rao అనే పిలిచేది పెద్దవారు యెట్లా చెబితే అట్లా నడచుకొంటారు అనుపమ్ వద్ద యిప్పుడు toy guns చాలనున్నవి. వీటితో ఇంటను బయటను ఆడుకొంటాడు

ఒకనాడు Julie living room లో ప్రమద Julie కూర్చొని మాటాడుతుండగా Julie ఇంటిపైన వుంటున్న మరొక ఆమె తలుపుతట్టి Julie అని పిలిచింది. Julie వెళ్లి తలుపు తీసి ఆమెను లోనికి ఆహ్వానించింది. ఆమె లోనికి రాగానే Julie ప్రమదతో ప్రమద she is Suzen she lives upstairs అంది Sue తో she is pramada she lives opposit to my Apt. అంది. Hi అని ఇద్దరు కరచాలన చేసుకొన్నారు. Sue Julie తో I am sorry to disturb you both అంది Julie no, it is no disturbance. It is a pleasure. Where is Micheal (Sue భర్త) అంది Julie. He is with my kids. So I got some chance to get out of the house. Sue ప్రమదతో I see your husband living this building almost every day but never had the opportunity to meet you. Sue పిమ్మట again how do you pronounce you name అనగానే ప్రమద Julie కి నేర్పినట్లే

తనపేరును యెలాపలుకవలెనో నేర్పించింది అయినా యీమె కూడ ప్రమదను అమెరికన్ accent తోనే పిలిచేది. కాని ప్రమద Sue అని మంచిగా అనేది ఇప్పుడు ప్రమదకు యిద్దరు neighbourers friends గానున్నారు. వాళ్లతో ఈమె మైత్రి పెరిగింది. ఒకనాడు విక్రంతో వీళ్ల రెండు కుటుంబాలను మనయింటికి భోజనానికి రమ్మనంది. ఆనాడు ఆదివారం. శుక్రవారంనాడే ఆదివారంనాడు కాబోయే యీ విందుకు అన్ని సామాన్లు తెచ్చింది ప్రమద. ఆదివారంనాడు ఉదయం లేచి అన్ని Andhra pradesh వంటలే చేసింది. కారం కొంచెం తక్కువ వేసింది. కోడికూర, గుడ్లకూర, పప్పు, గోబిపువ్వు మరి రెండు తీయటి పదార్థాలను తయారుచేసి పెట్టింది. వారిని 5 గంటలకు భోజనానికి రావలసిందిగా కోరింది. సరిగ్గా 5 గంటలకు రెండు కుటుంబాలు పిల్లలతో వచ్చినారు. పిల్లలకు ముందుగా భోజనాలు పెట్టి ఆడుకొనుటకు బయటకు పంపినారు. అది చలికాలం కాదు కనుక బయట shirts skirts తోనే ఆడుకొంటున్నారు పిల్లలు Julie husband పేరు Robert. Sue husband పేరు Micheal. అరుగురు టేబుల్ పైనవున్న పదార్థాలను చూస్తూ యివి యేమిటి అవి యేమిటి అని అడుగుతుంటే వివరించి చూపిస్తున్నారు విక్రం మరి ప్రమదలు ఇద్దరు అమెరికన్ దంపతులు వాటిని తమప్లేట్లలో పెట్టుకొని sopha పైన మరి sopha chairs పైన కూర్చొని తింటున్నారు Forks నే use చేస్తున్నారు. Rice చేయలేదు ప్రమద. చపాతీలు చేసింది. వాటిని తింటు కూరలను నోట్లో పెట్టుకుంటున్నారు పూరీలలో కూరలను పెట్టి అక్కడి sandwhich ను తిన్నట్టుగా తింటున్నారు. ప్రమద విక్రం తినుకుంటునే వాళ్లకు యేమికావలెనో చూస్తూ ఆ వస్తువులను అందిస్తున్నారు ఎంత కారం తక్కువ వేసినా యిద్దరు Robert & Micheal హో హూ అంటు very tasty అని తింటున్నారు. పిమ్మట పెరుగు చూపించి యిది తినండి అని అందించినాడు విక్రం. అది కారం లేకుండ మంచిగా వుంది యేమిటిది అన్నారు. దీన్ని curd అంటాము అన్నారు విక్రం, ప్రమద. lost item డబుల్ కా మీరా మరియు Gulab Jaman వీటిని కూడా తిని అందరూ యెంతో బాగానున్నవి అని పొగడుతున్నారు. ఈ పొగడ్తలు హృదయపూర్వకమైనవా నోటినుండి వస్తున్నవా తెలుసుకొనుట కష్టము. అమెరికనులు మనవలె వున్నది వున్నట్టు చెప్పరు. తమకు బాగనిపించకున్న మనలను సంతోషపెట్టుటకు బాగుంది అంటారు. అందువలన వాళ్లకు నచ్చిందా లేదా చెప్పుట కష్టం. ఏదియేట్లైనా ప్రమద విక్రంలు సంతోషంగానున్నారు. తాము కృషిచేసి వారికి వడ్డించాము అంతే చాలు అనుకున్నారు. తిన్న పిమ్మట president కెన్నడి విషయమై అయన పరిపాలన విషయమై మాటాడుకుంటున్నారు అయన కూడ Haward విద్యార్థి. అందువల్ల అయన పరిపాలన విధానంపట్ల యేమాత్రం విమర్శ లేకుండె. వీళ్లంతా Harvard విద్యార్థులు కావున అంతాబాగానే మాటాడినారు. రాత్రి పదికాగానే అందరూ లేచి thanks Mr. Rao Mrs. Rao అని లేచినారు.

విక్రం ప్రమద you are very welcome అని తలుపుదాక సాగనంపినారు. అమెరికాలో ప్రతిదానికి ఓ సమయం వుంటుంది. సోమవారం నుండి శుక్రవారం వరకు బాగా పనిచేస్తారు. అందువలన weekend కై వేచియుంటారు. శుక్రవారం

వారికి పండగదినం. ఎందుకంటె ఆనాడు సాయంకాలం నుండి మళ్లి సోమవారం ఉదయం వరకు వారు పని విషయమై ఆలోచించరు. చేసుకునేవారు వారి యింటి పనులు చేసుకుంటారు లేదా relaxation కోసము యెచటికైన వెడతారు. Spring మరి summer అయితే park లకు సముద్రతీరాలకు దగ్గరగా నున్నవారు, అచటికి వెడతారు. ఎటూపోనివారు ఇంట్లో కూర్చొని యేమైన పని చేసుకుంటారు. ఆదివారం సాయంకాలం కాని సోమవారం నాటి పని గురించి ఆలోచించరు. ఈ విధంగ వారు అయిదు రోజులు పూర్తిగా పనిలో నిమగ్నులవుతారు రెండురోజులు free గా వుంటారు. వీరు పోగానే విక్రం రేపటి office పని అంటె research గురించి ఆలోచించుచున్నాడు. కొద్దిసేపు ఆలోచించి రేపు యేమి చేయాలో తన schedule పుస్తకంలో యెక్కించుకున్నాడు. పిమ్మట ప్రమదతో కొంచెంసేపు కూర్చొని T.V. చూసిన పిమ్మట ప్రమదకు ఆవలింతలు వస్తున్నవి. రండి పడుకొందాము అంది యీ programme చూసికాని నేను రాను అన్నాడు విక్రం. అయితే నేను మీమీద పడుకొంటాను అంది. సరే పద bed మీదనే పడుకుందువు అని ప్రమద చేతులు పట్టుకొని bed room లోకి పోయినారు. లోనికి పోగానే యిద్దరూ bed పైన వొరిగినారు ప్రమద విక్రం చేతులు గుంజుకొని తన వక్షస్థలంపై వుంచుకుంది విక్రం కొద్దిసేపట్లో ప్రమదను తన బాహుబంధాలలో బంధించినాడు. అనుపమ్ గాఢనిద్రలో తన bed room లో పడుకున్నాడు. విక్రం లేచి తన bed room గడియ వేచినాడు. మళ్లి ప్రమదను తన రెండు చేతులతో బంధించి పట్టుకుని పడుకున్నాడు ఎలా వుంది ఇప్పుడు అంది ప్రమద విక్రంతో. స్వర్గలోకంలో వున్నట్టుంది అన్నాడు నాకు కూడా అంతే అంది అరగంటసేపు యిద్దరు ఈ సుఖాల ననుభవించి తుదకు final act కాగానే నిద్రపోయినారు ఆనాడు.

తెల్లవారి యేడు గంటల alarm అయ్యేవరకు యెవరికి మెలకువ రాలేదు. అలార్మ్ కాగానే విక్రం లేవలేక లేచినాడు ప్రమద పడుకొంది యింక కొంచెంసేపు అంది. నాకు కూడా చాల వుంది ప్రమద. శనివారం ఆదివారం ఆలస్యంగ యిష్టమొచ్చె వరకు పండుకున్నాముకదా. ఈ దేశంలో work కు timelines కు చాల ప్రాముఖ్యత. అందుకు నేను లేవక తప్పదు. నీకు అనుపమ్‌కు అటువంటి బాధ్యతలులేవు. మీరు యిష్టమొచ్చినంతసేపు పడుకోండి అంటూ విక్రం లేచినాడు. Brush చేసుకొని cerial తిన్నాడు పిమ్మట coffee తాగి కాలకృత్యాలు ముగించుకొని బయటికి వెళ్లి car లో dept. కు చేరుకున్నాడు.

ప్రమద public relation లో చాల talent గల మనిషి చాల స్నేహభావం కలది. విక్రం ఆమెకు విరుద్ధమైన స్వభావము కలవాడు. అందుకే భారతదేశంలో నున్నప్పుడు I.A.S. గా చెలామణి కాగలిగినాడు. కాని ప్రమదకు హైద్రాబాదులో చాలమంది స్నేహితురాండ్రు. ఆమెకు చిన్నవారు పెద్దవారనే తారతమ్యాలు అసలేలేవు. రఘునాధరాయలు justice కాకముందు లాయరుగా చాలకాలం పనిచేసినాడు అప్పుడు ఆయన successful లాయరు. ఆయన talent ఈమెకు వచ్చిందని విక్రం అనుకుంటాడు ఈమెకు గర్వమనేది అసలే లేదు. ఎవరితోనైనా కలిసిపోయే స్వభావము ప్రమదది. Julie, sue ల సహాయంతో neighbourhood లోనున్న చాలమంది

స్త్రీలతో పరిచయము చేసుకొంది. అందువల్ల యెప్పుడు చూచినా యెవరో ఆడవారు ఆమె Apt. లో వుంటారు. విక్రం రాగానే వారిని పరిచయం చేస్తుంది పిమ్మట వాళ్లులేచి we will see you again అని వెళ్ళిపోతారు. మనదేశీయ స్త్రీలవలెనె అమెరికన్ స్త్రీలు భర్తలు రాగానే వారికి privacy కావలెననియో మరియేమొ మాటాడుతు సగం మాటలలోనే విడిచిపోతారు. ప్రమద వాళ్లను సాగనంపి విక్రంకు మధ్యాహ్న భోజనం వడ్డించి office కు పంపిస్తుంది. అనుపమ్ కొంతసేపు తల్లివద్ద కాని యెక్కువగ అప్రక్క యిండ్లలోనున్న పిల్లలతో ఆడుతువుంటాడు. ఏకైక పుత్రుడు అందుకే ప్రమద కొంచెం అప్పుడప్పుడు కఠినంగ ప్రవర్తించినా విక్రం మాత్రం చాల సున్నితం. కనుక విక్రంతోనుంటాడు యెప్పుడూ గద్దించడు. తల్లే ఆపని ఇచేస్తుంది. school కు పంపిద్దామంటే అక్కడ అయిదేళ్లుదాటి 6వ యేడు నడుస్తుంటేతప్ప public school లలో చేర్చుకోరు. ఇప్పుడు అనుపమ్‌కు మూడవయేడు పూర్తి అయ్యి నాలుగవయేడు నడుస్తుంది. ఇంకా రెండేళ్లు ప్రమదనే వాని teacher అప్పుడప్పుడు కూర్చుండబెట్టి చదివించుటకు ప్రయత్నం చేస్తుంది ప్రమద. కాని అనుపమ్ అమ్మా నేను ఆడుకుంటానమ్మా అని వెళ్లిపోతాడు. ప్రమద యేమనకుండ వూరుకుంటుంది. విక్రంతో చూడండి మీరు అనుపమ్‌ను మందలించండి వాడు నేను చదివిద్దామన్నా చదవడు మీ భయం అసలు లేదు వానికి అనేది. విక్రం, ప్రమద ఒక సంవత్సరం వాన్ని యెంత miss చేసినానో నీకు తెలియదు అయిదేళ్లు నిండగానే వాడు బడిలో వుంటాడు. ఇప్పుడు నీకు తీరికయినప్పుడల్ల నేర్పుతుండు వాడు, నేర్చినంతనే చాలు. వాడు యింక పసివాడు. మనవలె పెరిగినంక వాని బాధ్యతలను వాడు స్వీకరిస్తాడు అన్నాడు విక్రం.

విక్రం office కు పోగానే యేదో ఇంగ్లీషు పుస్తకము ముందేసుకొని చదువుతుంది. ఇంతలో అనుపమ్ వచ్చి అమ్మా నా friend నన్ను వాళ్ల ఇంట్లో తినమంటున్నాడు తిననా అన్నాడు. సరే నాన్న తిను అంది ప్రమద పుస్తకం చదువుతు. అమ్మా మరి నువ్వు వాళ్లు గొడ్డుకూర తింటారన్నావు. నీవు తినవు కదా. నేను తినవలెనా అన్నాడు. అప్పుడు ప్రమదకు జ్ఞాపకం వచ్చింది. ఇండియాలో తన తల్లికి చేసిన వాగ్దానం. శ్రీలక్ష్మమ్మ తల్లీ నీవు మాత్రము ఆగొడ్డుకూర తినకు వాళ్లు త్రాగే సారపదార్థాలు త్రాగనని నాకు ప్రమాణం చేసి చెప్పు అని promise చేయించుకుంది అదే యేవో మాటల సందర్భములో అనుపమ్‌తో యెప్పుడో అన్నట్టు జ్ఞాపకం. అనుపమ్‌ను పిల్చి హత్తుకొని ముద్దిడుకొంది. నాన్నా నేనన్న మాట నిజమే నేను తినను. కాని నీవు తినవచ్చు బాబు యేమి తప్పులేదు నీ స్నేహితుని యింట్లో యిస్తే తిను అంది. అప్పుడు అనుపమ్ గబుక్కున బయటికి పరిగెత్తి వెళ్లినాడు ప్రమద ఆ పుస్తకంపై కేంద్రీకరించి చదువుతోంది ఇది యెవరో అమెరికను తన ఇండియా అనుభవాలనీ పుస్తకంలో వ్రాసినాడు. ప్రమద ఆ పుస్తకాన్నంతా చదివింది. అందువల్ల వ్రాసింది యేది నచ్చలేదామెకు. అమెరికన్లు తాము యే దేశమైన పర్యటించినపుడు, ఆ కాలంలో, ఆ దేశాలలోని కొన్ని photoes తీసి వారి అనుభవాలను కూర్చి ఆ దేశంపై ఒక చిన్న పుస్తకం వ్రాసి ప్రచురించి కొంత డబ్బు చేసుకునేది. అందువల్ల యెంతో మంది అమెరికన్‌లు భారతదేశాన్ని దర్శించినప్పుడు భారతదేశం british colony

గా నుండెను. అతి బీదదైన భారతదేశాన్ని దర్శించినప్పుడు ఆ దేశపు బీదత్వంతో సహా వారికి నచ్చిన పాములనాడించు వారిని గురించి, మనదేశం, పశువుల పేడను పిడకలుగా గోడలకు కొట్టిన దృశ్యాలు, tiger వేటలు, బిచ్చగాళ్ల వాళ్ల యినుప ముండ్లపై పడుకున్న దృశ్యాలు, మన మంకీ గాడ్స్ అంటే ఆంజనేయస్వాముల వారి పూజ. ఇంకయెన్నియో ఇతర విషయాలు వ్రాసి ప్రచురించేది. అటువంటి పుస్తకమే ఇప్పుడు ప్రమద చదువుతున్న పుస్తకము. ఆ పుస్తకము చదివి విక్రం రాగానే ఆ పుస్తకం గురించి చాలకోపంతో చెప్పింది అప్పుడు విక్రం చూడు ప్రమద ఈదేశంలో పూర్తిగా వాక్ స్వాతంత్ర్యముంది ఎవడు యేమి వ్రాయాలన్నా వ్రాసి ప్రచురిస్తారు. నీవు కోపం చల్లార్చుకొని వాటి సత్య అసత్యాలను ఖండించి మనదేశంలో మంచిగానున్నవి కొన్నింటిని నీవ్యాసంలో వీలైతే pictures తో వ్రాసి పత్రికలకు పంపు అని విక్రం చెప్పినాడు సరే అని ప్రమద వారంరోజులు అనుపమ్‌ను తీసుకొని గ్రంథాలయానికి వెళ్లి అచ్చట కొన్ని పుస్తకాలు ఇండియా మహోన్నత గతాన్ని గురించి బ్రిటీషువారు చేసిన అన్యాయాన్ని గురించి చదివి notes తీసుకుంది ఇట్లు వారం రోజులు కృషిచేసి ఒక వ్యాసాన్ని వ్రాసి దాని శీర్షిక "Half Truths about India" అని తన అభిప్రాయాలు ఇండియా గురించి ఆ పుస్తకం వ్రాసిన author పేరుతో సహా పత్రికలలో ప్రకటించింది ఈ వ్యాసము Boston Globe లో ప్రచురించినారు ఇందులో ప్రమద పిడకలు snake charmers లేవని వాదించలేదు ఇది వున్నమాట నిజమే. అవిగాక యింకెన్నో మంచి విషయాలు కూడా ఉన్నాయని Tajmahal నుండి మొదలుకొని ఈ దేశములోనున్న నదీనదాలు అడవులు వాటి beauty ని గురించి యెవ్వరు వ్రాయరెందుకు అని ప్రశ్నించింది. అమెరికా ఒక భాగ్యవంతమైన దేశము దీనిని కాదని ఎవరు అనరు. కాని యిక్కడ కూడ బీదత్వము లేదని ఎవరైన చెప్పగలరా అని; ఇచ్చటి పురాతనం నుండివున్న అమెరికన్స్ గురించి నల్లవారిని గురించి మరి యింకెందరో మైనారిటీలలో కూడ బీదత్వం వుంది కాని ప్రపంచంలో అమెరికా అంటె ప్రపంచంలో శ్రీమంతుల పుట్టినిల్లని పేరు పొందింది. అదే తీరుగా ఇండియాలో యెన్నియో మెచ్చుకోదగ్గ విషయాలున్నా బీదదేశమని ప్రపంచంలో పేరుకెక్కింది. ఎవరైన ఇండియా లేదా అమెరికా విషయమై వ్రాసినప్పుడు ఒక balanced view ను వ్రాస్తే బావుంటుంది అని వ్రాసింది. ఈ ప్రచురణ Boston పత్రికలో ప్రచురించబడింది కాబట్టి చాలామంది హార్వార్డ్‌కు చెందిన విద్యార్థులు కూడ చదివినారు చాలామంది (ఈ రాష్ట్రానికి చెందినవారు) ప్రమద అభిప్రాయముతో ఏకీభవిస్తు ఎడిటరుకు ఉత్తరాలు వ్రాసినారు. విక్రం యిదంతా చూసి ప్రమదతో చూశావా ప్రమద యెవరో వ్రాసినారని కోపగించి వూర్కోనే దానికంటే దానిలోనున్న వాస్తవికత యెంతమట్టుకు వున్నదో ప్రజలకు తెల్పితే వారు సంతసిస్తారు. facts తో వుంటుంది కాబట్టి కాదనలేరు. అవును ఈ దేశంలో మనదేశాన్ని గురించి కొన్ని set ideas వున్నాయి. కాని వాటిని కాదని, నిజాన్ని చూపేవారు తక్కువ. అందుకే ఇక భవిష్యత్తులో కోపాన్ని వీడి light ను ప్రసాదించు ఈ పాఠకులకు సుమా అన్నాడు ప్రమదతో అవునండి మీరు చెప్పింది చేసినాను చాలా బాగుంది మీ సలహా. చాలచాల కృతజ్ఞతలు అంది కృతజ్ఞతలు

నాకు కాదు నీవు చెప్పేది నీ వ్యాసాన్ని చదివి వాటి విషయమ్మై editor కు ఉత్తరాలు వ్రాసిన వారికి నీ కృతజ్ఞతలు ఇంకో వుత్తరం ద్వారా editor కు తెల్పు అని విక్రం అన్నాడు విక్రం సలహా ప్రకారము ప్రమద ఓ ఉత్తరంలో అందరికి thanks వ్రాసి పంపింది

ఇప్పుడు ప్రమద ఒక writer. తను చూచిన వాటిని వ్రాసి హైద్రాబాదు పత్రికలకు వ్రాసేది వారు ప్రచురించినారా లేదా తెలియకుండెను అందువలన తన family కి వ్రాసి అవి ప్రచురిస్తే వాటి copies తనకు పంపమని వ్రాసేది. కొన్ని ప్రచురించిన paper clippings ఈమె చెల్లెలు సరిత ఈమెకు పంపిస్తువుండేది. ఇప్పుడు అనుపమ్ అయిదు సంవత్సరాల వయస్సు బాలుడు. చాల బుద్ధిమంతుడు. మమ్మీ అని పిలుస్తు అమ్మ అను మాట చాలవరకు మరచినాడు. పోని బాలుడు అనుకున్నారు విక్రం ప్రమదలు. విక్రంను నాన్న ప్రమదను మమ్మీ అంటున్నాడు అనుపమ్ యిప్పుడు అమెరికాలో పిల్లలకు అయిదు సంవత్సరాలు నిండి ఆరవ సంవత్సరము నడుస్తుంటెగాని 1st standard లో చేరనివ్వరు. ఇప్పుడు అనుపమ్ 4 సంవత్సరాల పది నెలలు. ఇంక అయిదేళ్ళు దాటుటకు రెండు నెలలు కావాలి కాబట్టి ఆ స్కూల్ అధికారి 1st standard లో చేర్చుకొనుటకు వీలులేదన్నారు. విక్రం వెళ్లి ఎన్నియో విధాల వాదించినాడు. కాని అనుపమ్‌ను K.G. లోనే చేర్చుకున్నారు. రోజూ ఉదయం లేవగానే coffee త్రాగి అనుపమ్‌కు పాలు త్రాగించి బడికి పంపించేది ప్రమద. విక్రం తను dept. కు పోయేముందు అనుపమ్‌ను school లో విడిచివెళ్లేవాడు. ఇది రోజూ routine అయిపోయింది విక్రంకు, ప్రమదకు. భర్త కుమారుడు పోగానే ఆమె యింటిలో ఒక్కతే. ఎక్కువ సమయాన్ని T.V. చూచియో, పుస్తకాలు చదివియో గడిపేది అప్పుడప్పుడు Sue లు Marion లతో గడిపేది. అయిదు గంటలు కాగానే విక్రం అనుపమ్‌ను తీసుకొని యిల్లు చేరుకొనేది. ప్రమద విక్రంకు టీ యిచ్చి పిమ్మట అనుపమ్‌కు snack తో ఒకపాల గ్లాసు ముందుంచేది. అనుపమ్ మెల్లగా snack తింటు పాలు త్రాగేది పిమ్మట ఆడుకొనుటకు వెళ్లి చీకటికాగానే వచ్చి తలిదండ్రులతో భోంచేసి హోంవర్కు చేయుటకు కూర్చునేది. ప్రమద ముఖ్యంగా అనుపమ్ హోంవర్కు పూర్తి చేయుటకు సహాయపడేది. ప్రమదకు తెలియనిదానిని విక్రంని అడిగి అనుపమ్‌కు బోధించేది ఈ విధంగా ఈ ఇండియన్ family అమెరికనులమధ్య కాలం గడుపుతుంది. ఆ Married students Apt. లో యింకో ముగ్గురు Indian families కూడ వుండేవి. అందులో యిద్దరు మహారాష్ట్రకు, ఒకరు గుజరాతుకు చెందినవారు. తెలుగువారిలో వారొక్కరే ఆనాడు అమెరికాలో మొత్తం భారతీయులు యిరవైవేలకు తక్కువగానే వుండేవారని అంచనా. అందులో నూటికి తొంబది అయిదుగురు విద్యార్థులే. తక్కిన అయిదవవంతు విద్యార్థులు కానివారు కాని ఈనాడు పన్నెండు లక్షలకు పైగానే ఉన్నారని అంచనా. New York, Chicogo వంటి పెద్ద నగరాలలో వేలకు వేలు వుంటారు ఎటుచూచిన మనవారు కనబడతారు. వారు అన్ని రంగాలలో ముఖ్యంగ డాక్టర్లుగా business people గా చాలా ముందుకేగినారు మనవారు. ఈ జనాభివృద్ధి 1965 నుండి జరిగింది. అంతకు ముందు ఒక భారతీయుడు స్వర్గంలో settle

కావచ్చుకాని అమెరికాలో settle కాలేదని ఒక joke వుండేది 1965కు పూర్వము immigration in favour of Western Europe కు వుండెను ఇంగ్లాండు నుండి ఒక cook or maid కు సునాయాసంగా అమెరికాకు వచ్చే అవకాశముండె కాని ఒక డాక్టరుకు Greece or Italy నుండి రావాలంటే చాల కష్టంగ వుండేదట ఇక మన Aisian ప్రత్యేకంగా భారతీయులకు వచ్చే అవకాశమే లేకుండె చదువుకై వెడితె చదువుకాగానే మనవారు మనదేశం రావలసిందే అందువల్ల మనదేశస్థులు అమెరికాలో చాలా తక్కువ అందువలన ప్రమద విక్రంలు అమెరికన్‌లతోనే ఎక్కువగ social contact లో ఉండేవారు. Home sick గా feel అయినప్పుడు ఒక గుజరాతి, మరి ఒక మహారాష్ట్ర దంపతులవద్దకి వెళ్ళేవారు. week end లో వీరైనా వారిని భోజనాలకు రమ్మనేది లేదా వారైన వీరిని పిలిచేది అప్పుడు భారతదేశము గురించి వీరు మాటాడుకునేది. ఇప్పటివలె అప్పుడు భారతదేశం గురించి వ్రాసే పత్రికలు T.V. programms లేకుండె విక్రం Hindu overseas editing మరి, భారతి, అనె తెలుగు పత్రిక తెప్పించేది. ఈ రెంటిలో వచ్చిన news వీరికి తెలిసేది. వీరి బంధుమిత్రులు వ్రాసిన ఉత్తరాలలో వీరి బంధుమిత్రుల గురించి తెలుసుకొనేది. ఇది తప్ప వీరికి India గురించి ఏమి తెలియదు. India China మధ్య జరిగిన యుద్ధం వీరు అమెరికన్ T.V. news లో చూచేది, వినేది కొద్దిరోజులలోనే చైనా భారతభూమిని పట్టుకొంది ఆ ఆక్రమించిన భూమి ముప్పై యేండ్ల పిమ్మట కూడ చైనాలో భాగంగ వుంది. భారదేశము శాంతితో దీనిని పరిష్కరించాలని యింక ప్రయత్నిస్తూనే వుంది. ఇకముందు కూడ ఎంతకాలం వరకు సంప్రదిస్తుందో ఆ భగవంతునికే తెలియాలి. మన నెహ్రూ పండితుడు చేసిన Chinee Hindi Bhai Bhai ఈ విధంగా పరిణమించింది నెహ్రూగారు దేశానికి చేసిన మహోపకారమిది. అనాడు మేము అమెరికాలో నుండి అంత యుద్ధాన్ని T.V. screen పై చూస్తుంటే భారతీయులకు ప్రభుత్వం యిచ్చే news ప్రభుత్వ రేడియోపై భారతప్రజలు వినేది అప్పుడు మనకు T.V. కలలోని వస్తువు రేడియోలే చాలతక్కువ. ఇక T.V. లా మన సామర్థ్యానికి? ఈనాటికి అనాటికి పోల్చుకుంటే భూమికి ఆకాశానికున్నంత తేడ. కాని అనాటి ధరలకు ఈనాటి ధరలకు పోల్చిచూస్తే, ఈనాటి ధరలు అనాటి ధరలకంటె ఎన్నివేలరెట్లో అధికం అనాడు ప్రభుత్వం అతివున్నత ఉద్యోగులకు నెలకు వేయిరూపాయల జీతం యిస్తే మహాఘనత peon లకు రూ.60లు ఉండేది. గజిటెడ్ officers చాలకొద్దిమంది. వారి జీతం రూ 250 నెలకు. ఈనాడు peon కే కొన్ని వేలజీతం. రూపాయికి విలువే లేదు. ఇక పైసలకు విలువేమిటి రోజుకు వేయిరూపాయలు ఇట్లా ఖర్చు అవుతాయి జీతాలు వేలకువేలు నెలకు అంటే ధరలు విపరీతంగ పెరిగిపోయినవి. ఉదాహరణకు డాలరు రూ.4 75 exchange rate విక్రం ప్రమద అమెరికాలో నున్నప్పుడు విక్రం ఒక private Apt లో వున్న మిత్రునితో అడిగినాడు ఈ complex వెలయెంత వుంటుంది అని అడిగినాడు. అతడన్నాడు దీనికి 24 నుండి ముప్పదివేలు కావచ్చు అన్నాడు అప్పుడు ఆ డాలర్లను రూపాయలకు మార్చి యీయింటికి రూ.1,42,500.00లా అనుకునేది. ఇంత డబ్బు వెచ్చిస్తే ఓ రాజభవనాన్ని కొనేయవచ్చు అనుకునేది విక్రం. కాని ఈనాడు అది

తలక్రిందులుగా మారింది. ఆ రాజభవనానికి ఈనాడు మూడు నాలుగు కోట్లు కావాలి Hyderabad లో Jublee hills లో ఎవ్వరూ రూపాయికి కొనని భూమి యీ Jublee hills 3 నుండి నాలుగువేలట ఒక చదరపు గజానికి ఈనాడు అంటే ధరలు నాలుగువేల నుండి ఎనిమిదివేల రెట్లు పెరిగిపోయినవి. అబ్బ యెంత మార్పిప్పుడు అనిపిస్తుంది. అదే మూడు నాలుగు కోట్లు చేసే భవనము అమెరికాలో అంతకు చాలా తక్కువలో కొనచ్చు ఈనాడు. అది మన ధరల పెరుగుదల వారి ధర పెరుగుదలకు వున్నభేదము. మన భారదేశానికన్న అమెరికానే నయమనిపిస్తుంది. అచ్చట ధరలు అదుపులో ఉంటాయి. మనదేశంలో ధరలు అదుపులో లేకుండ రోజురోజుకు పెరుగుతునే వుంటాయి. ఇక జనాభా పెరుగుదల 1951కి యిప్పటికి చూద్దాం అనాడు 30 కోట్లు అనుకుంట. ఈనాడు అది 82కోట్లకు పెరిగింది. అనాడు అంధ్రకవులు ముక్కోటి అంధ్రులని వారి కావ్యాలలో పేర్కొనేది. దాశరది అనే కవి మా తెలంగాణ కోటి రత్నాలవీణ, అని అన్నాడు. అంటె తెలంగాణాలో ఒక కోటిమంది అనాడు. అయితే ఇప్పుడు అంధ్రప్రదేశ్‌లో మూడుకోట్ల అంధ్రులు కారు. ఈనాడు ఏడుకోట్లకు పైగానున్నారు. ఇంకా పెరుగుతూనే వున్నారు. అనాడు బీదలు వున్నారు ఈనాడు బీదలు వున్నారు. అయితే నెహ్రూగారి నుండి ప్రతి రాజకీయనాయకులు బీదత్వం రూపుమాపుతాము అంటారు. కాని అది సాధ్యమా అనిపిస్తుంది ఈ పెరిగే జనాభా పెరిగే దారిద్రం యెలా నిర్మూలిస్తాము. ఈ బీదత్వాన్ని అసరా తీసుకొని కొంతమంది స్వార్థపరులైన రాజకీయనాయకులు, బీదలు నాదేవుళ్లు, సమాజం నాగుడి అంటారు. కాని వారు బీదలతో వారి యిండ్లలో వారి జీవితవిధానములో యెన్నాళ్లు పాలుపంచుకొనగలరు. అంటె మన రాజకీయము యింతవరకు దిగజారిపోయిందన్నమాటె. ఇండ్లు కట్టిస్తాము. బియ్యము ఉచితంగ యిస్తాము అంటారు. అంటె అకాశం నుండి వూడిపడుతున్నాయా. జీవిత ప్రమాణాలు పెరుగుతున్నాయా. ఉద్యోగాలు పెరుగుతున్నాయా. రాజాజీ అన్నట్లు మనము బీదలను పెంచుతున్నాము. ఉన్నవారిని దోచి బీదవారికిస్తే అందరు బీదవారవుతారు ఒక రాజకీయనాయకులు తప్ప. ఈనాడు MLA అంటె చాల influential ఒక ప్రభుత్వ ఉన్నత ఉద్యోగి అంటె యేమంత గౌరవంలేదు. వారు స్వతహా చట్టాలను అమలు చేయలేరు. ఎందుకంటె అడుగడుగులో రాజకీయవాదులు మరి వారి అనుచరులు జోక్యం చేసుకుంటారు. Rule of law లేదు. మనదేశంలో పాసుచేసిన లాలు అన్యాయాన్ని అరికట్టలేవు ఎందుకంటె ప్రతి పాసు చేసిన లా రాజకీయవాదులకు మళ్లీ ఓట్లు తెచ్చుటకే కాని అవి న్యాయాన్ని రక్షించేటివి కావు.

అనాడు విక్రం dept. నుంచి రాగానే ప్రమద సంతోషంతో ఒక శుభవార్త అంది విక్రంతో ఏమిటా శుభవార్త అన్నాడు విక్రం. సుమిత్ అన్నయ్య పెళ్లి కుదిరింది వచ్చే నెలలో పెళ్లిఅట అంది ఓ అలాగ ఎవరితో పెళ్లి అన్నాడు విక్రం అమ్మాయిపేరు ఉమనట అమ్మాయి యేదో college లో lecturer గా పనిచేస్తుందట. తండ్రి retired IAS అట అని చెప్పింది. సరే శుభం. ఇన్నాళ్లకైన పెండ్లి చేసుకుంటున్నందుకు సంతోషం అన్నాడు విక్రం. మరి నన్ను

అనుపమ్‌ను పంపించరా అంది ప్రమద. సరే అది మాటాడుకొందాము పిమ్మట ప్రస్తుతానికి నాకేమైన coffee, tea యిస్తారా అమ్మగారు అని ప్రమద బుగ్గను గిల్లినాడు విక్రం. ప్రమద నవ్వి ఓరచూపులతో ఇప్పుడేయిస్తాను కూర్చొని విశ్రాంతి తీసుకోండి అని వంట యింట్లోకి ప్రవేశించింది. విక్రం అనుపమ్ T.V. on చేసి sopha పై కూర్చొని T. V. చూస్తున్నారు. ఇంతలో ప్రమద tray లో రెండు కప్పుల coffee మరి గ్లాసులో పాలు తీసుకొనివచ్చి పాలు అనుపమ్‌కు, coffee విక్రంకు యిచ్చి మిగిలిన కప్పు coffee సేవిస్తు ఆ T.V. programme ను చూస్తుంది. ఇంతలో తలుపుపై ఎవరో కొట్టినట్టు శబ్దం వినరాగానే ప్రమద తలుపుతీసింది. వచ్చినవారు యింటి యెదురుంగానున్న Marion. ఆమెను లోనికి ఆహ్వానించింది ప్రమద. Marion లోనికి రాగానే విక్రం లోనికి వెళ్లిపోయినాడు. ప్రమద అంది how are you Marion. I am fine అంది Marion. కొంతసేపు నిశ్శబ్దం. పిమ్మట ప్రమద అం I got a letter from my folks in India అంది. What are the news అంది Marion. My brother is getting married next month అంది ప్రమద. Oh! how nice అంది Marion. Give me the date we will celebrate అంది Marion. O.K. అంది ప్రమద. ఇంతలో Marion ప్రమద రేపు రెండు గంటలపాటు మధ్యాన్నం నాచిన్న కూతురుని పెట్టుకోగలవా? అంది Marion. O. తప్పకుండా అంది ప్రమద. Thank you అని Marion వెళ్లిపోయింది. విక్రం మళ్లీ ప్రమద అనుపమ్‌లతో కలిసి T.V. చూస్తున్నాడు.

విక్రం ప్రమదలకు రోజూ యిది ఒక అలవాటుగా మారింది. ఉదయం లేవడం coffee త్రాగడం. పిమ్మట అనుపమ్‌ను స్కూల్‌కు పంపడం. విక్రం office కు వెళ్లడం. పిమ్మట మధ్యాన్నం యింటికి రావడం. పిమ్మట నాలుగు గంటలకు మళ్లీ అనుపమ్‌ను యింట్లో వీడి coffee యో మరి యేదియో సేవించి పని వత్తిడివుంటె dept. కు వెళ్లడం లేనిచో యింట్లోనే ప్రమద అనుపమ్‌లతో వుండిపోవడం ఇదిరోజు routine. ఇంక ప్రమద తన స్నేహితులతో telephone లో మాటాడం లేదా Sue మరి Marion లతో కొంచెంసేపు visit చేయడం పిమ్మట వంట మరి రాత్రికాగానే నిద్రపోవడం. అనుపమ్ ఆడుకుంటాడు స్కూల్ నుండి రాగానే పిమ్మట చీకటి పడగానే యింట్లో చేరి home work చేసి T.V. చూస్తాడు. పిమ్మట నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోతాడు. అందరి పిల్లలకు వచ్చినట్లు అనుపమ్‌కు అప్పుడప్పుడు జ్వరం వచ్చేది ఆజ్వరంలో high temperature వుండేది. విక్రంకు high temperature అంటే చాల భయం. కాని ప్రమద అంత భయపడేదికాదు. నుదుట నీళ్లు పిండిన తడిబట్ట నుంచి అంతగా అనుకుంటె డాక్టరు చెప్పిన ప్రకారము rubbing alchohol తో శరీరానికంత వ్రాసేది దీనితో temperature control అయ్యేది. ఇలా రెండు మూడు రోజులలో జ్వరం దిగి అనుపమ్ మళ్లీ మామూలు స్థితికివచ్చేది. ఇలా మూడు నాలుగుసార్లు జరిగింది. అందుకే ప్రమదకు ఒక విధంగ విక్రంకు కూడా అనుపమ్ అనారోగ్యం పరిపాటైపోయినది. అట్లే మరొకనాడు అనుపమ్ స్కూల్ నుండి జ్వరంతో యింటికి వచ్చినాడు. ప్రమద జ్వరాన్ని పరీక్షించింది. 103 F వుంది. ఇదివరకుమల్లె అనుకొని మందులిచ్చి పరుండబెట్టింది. రాత్రి కొంచెం

coke మాత్రం త్రాగినాడు అనుపమ్ తెల్లవారి అది కూడలేదు. ఈ విధంగా రెండురోజులు జ్వరంతో బాధపడుతున్నాడు మూడవరోజు శరీరమంతట సన్నని కురుపులు శరీరమంతట ఉదయించి శరీరమంత యెరుపెక్కింది ఎటు తోచక తన యింటిముందున్న Marion ను పిలిచింది ప్రమద. ఆమెవచ్చి అనుపమ్ శరీరాన్ని తిలకించి ప్రమద అనుపమ్‌కు robilla Measle వచ్చినవి అంది ప్రమద మొదటిసారి ఈ శబ్దం వింది. ఇవి యేమిటి అని Marion ను అడిగింది. అప్పుడు Marion యివి ఈదేశంలో పిల్లలకు వచ్చే ఒకవిధమైన జబ్బు యివి సరియైన treatment దొరకకపోతే ప్రమాదానికి దారితీస్తుంది. నీ నుంచి అనుపమ్‌ను పట్టుట కష్టము. నీకు అభ్యంతరము లేకపోతే నేను అనుపమ్ రూంలో పడుకొంటాను. నీవు నిశ్చింతగా నీరూంలో పడుకో అవసరమైతే నిన్ను పిలుస్తాను అంది. ప్రమద మెరియాన్‌లు 12గంటల వరకు అనుపమ్‌తో వుండి, పిమ్మట ప్రమద తనగదిలో పడుకుంది. ఈ అనుపమ్ అవస్థ చూచి విక్రం చాల నొచ్చుకొన్నాడు. ప్రమద మొదటిసారిగా జీవితంలో అనుపమ్‌ను గురించి భయపడింది. తెల్లవారగానే Marion లేచి ప్రమదతో చెప్పి యింటికి వెళ్లి coffee మరి breakfast చేసి అరగంటలో హాజరయ్యింది ప్రమదా అనుపమ్‌ను Hospital లో చేర్చాలి తప్పదు. ఇది ప్రమాదమైన జబ్బు అని చెప్పి అనుపమ్‌కు బట్టలు మార్చి మెరియాన్ ప్రమద విక్రం అనుపమ్‌ను తీసుకొని విక్రం కారులో Hospital కు చేరినారు. Marion కు అంతా తెలుసు, కాని ప్రమదకు అమెరికన్ hospital కు రావటం మొదటిసారి విక్రంకు కూడ అంతె రాగానే reception desk కు చేర్చింది విక్రంను మెరియాన్. విక్రం తన అడ్రసు యిన్‌శురెన్స్ నెంబరు అక్కడ వున్న మనిషికి యిచ్చినాడు. పిమ్మట ఆమె admission చేసుకుంది అనుపమ్‌ను. ఒకనర్సు వచ్చి అనుపమ్‌ను wheel chair లో కూర్చుండబెట్టి అతనికి నిర్ణయించిన గదికి తీసుకువెళ్లింది. అక్కడినుండి అన్ని పరీక్షలు మొదలైనవి. మెరియాన్ చెప్పిన ప్రకారము రుబెల్లా మీజిల్స్ అని తేలింది. ఆగదిలో ఒక్క అనుపమ్‌ను వుంచినారు చిన్నపిల్లవాడగుట వలన ఖాళీ వున్న మంచంపై రాత్రికి ప్రమద వుండవచ్చన్నారు హాస్పిటల్‌వారు మెరియాన్ ప్రమద విక్రంలు చాలాసేపు ప్రమదతో నున్నారు. 10గంటలకు యింటికి పోయినారు ప్రమద మొదటిసారి అమెరికాలో విక్రం లేకుండ ఒకతే పడుకుంది. బాబుకు చేసేవన్ని హాస్పిటల్‌వారు చేస్తున్నారు. ఇంటికి పోయిన పిమ్మట మెరియాన్‌ను తన యింట్లో వదిలి తన యింట్లోకి పోయినాడు విక్రం. ఇల్లంత చిన్నబోయినట్లుంది. ప్రమద అనుపమ్‌లు రాకముందున్న జీవితం యిది. నిస్సారమైనది అనుకున్నాడు విక్రం. 11 గంటలకు ఫోన్‌చేసి room no. కు phone యివ్వమన్నాడు. ప్రమద మాట్లాడింది. పరవాలేదు మనబాబుకు ఏమికాదు మీరు నిశ్చింతగ పడుకోండి అంది ప్రమద. సరే ఉదయం వస్తాను అని phone పెట్టివేసినాడు విక్రం. చాల ఆలస్యంగ నిద్రపట్టింది విక్రంకు తెల్లవారి మేలుకొని అనుపమ్ సంతోషించే యేదైన ఒక present కొనాలని shopping center కు వెళ్లినాడు. వెతుకుతున్నాడు ఆ బొమ్మలలో ఏది వాడికిష్టమో తెలియదు విక్రంకు కాని అనుపమ్‌కు toy guns అంటె చాలా యిష్టము cowboy గా నడుముకు యెప్పుడూ రెండు చిన్న

తుపాకులు గల బెల్టును కట్టుకునేవాడు. అందువల్ల యేదైన మంచి toy gun వెదుకుతున్నాడు విక్రం. చూడగా ఓ toy stengun మీద విక్రం కన్నుపడ్డది దాన్ని తీసి యెట్లా operate చేయాలి అని ఆ దుకాణములోనున్న sales girl ను అడిగినాడు. ఆ అమ్మాయి అన్నీ చూపించింది. ఎంత ఖరీదు దీనికి అన్నాడు విక్రం. $ 9 95 అంది సరే అని $ 10.0 tax తో కలిపి యిచ్చినాడు. pack చేసి విక్రంకు యిచ్చింది అమ్మాయి. విక్రం అది తీసుకొని కారులో పెట్టినాడు. కారును hospital parking lot లో pack చేసి ఆ package ను తీసుకొని అనుపమ్ రూంలోకి పోయినాడు. నీరసంగా పడుకొని వున్నాడు ఒక్కడే మంచం మీద. ప్రమద bathroom లో వుంది. విక్రం అనుపమ్‌తో నాన్నా నీకేమి తెచ్చానో చూడు అని ఆ package మంచం మీద వుంచినాడు. ఏముంది dady యిందులో అన్నాడు. విక్రం తెరచి చూడు అన్నాడు మెల్లగా లేచి ఆ package ను తెరచినాడు. అందులోని stengun ని చూడగానే ప్రాణం లేచివచ్చింది అనుపమ్‌కు. దానితో అనుపమ్ జబ్బు సగం నయమైనట్టనిపించిందతనికి మమ్మీ, మమ్మీ, చూశావా నాన్న నాకేం తెచ్చాడో అని కేకలు వేస్తుండు అనుపమ్. ప్రమద లోపల నుండి "వస్తున్నా నాన్నా" అంటు త్వరలోనే బయటకు వచ్చింది. రాగానే ఆ toy stengun తో టటటట .ట అని ప్రమదను గురిచేసి కాలుస్తున్నాడు. ఓ నే చచ్చిపోతాను నాన్న please ఆపు నీ కాల్పులు అంటు ముందుకొచ్చి అనుపమ్‌ను కౌగిలించుకొని గట్టిగ ముద్దిడుకుంది పిమ్మట అనుపమ్ విక్రంతో thank you dady అన్నాడు. You are welcome అనుపమ్ అన్నాడు విక్రం. విక్రం యిప్పుడు చాల సంతోషంగ నున్నాడు. ప్రమద కూడా విక్రంతో బాబు జబ్బు సగం నయమయ్యింది. రాత్రి బాబు జబ్బు చూసి ఏడుపొచ్చిందండి అని విక్రంను కౌగిలించుకొంది గద్గదకంఠంతో. విక్రం ఆమెను నిమిరుతూ పరవాలేదు బాబుకు నయమౌతుంది అన్నాడు. coffee త్రాగినారా అంది. అవును అన్నాడు. పరవాలేదు నాతో మళ్లీ త్రాగండని బైటి నుండి రెండు paper గ్లాసులలో coffee కలిపి తెచ్చింది. ఇద్దరు కాఫీ త్రాగుతుంటె టుటుటు...టు అంట stengun తో ఆడుకొంటున్నాడు ప్రమద విక్రంలు బాబు విషయమే మాటాడుకుంటు కూర్చున్నారు. చాలసేపు గడచిన తర్వాత మేరియాన్ ఒక నర్సుతో వచ్చింది ఆనర్సు temperature మరి యితర signs అన్ని చెక్ చేసి పరవాలేదు యిప్పుడు బాగుగావున్నాడు రాత్రికన్నా అని మందు మ్రింగించి వెళ్లిపోయింది. డాక్టరు మధ్యాహ్నము వస్తాడని చెపుతూ నర్సు పోయిన కొన్ని నిమిషాలకే విక్రం వెళ్లిపోయినాడు. మేరియాన్ ప్రమదలు కొంతసేపు కూర్చున్నారు అనుపమ్ గదిలో. పిమ్మట మేరియాన్ ప్రమదతో సెలవు తీసుకొని వెళ్లిపోయింది. ప్రమద యిప్పుడు అనుపమ్‌తో ఒంటరిగా ఉంది. అనుపమ్‌ను పరుండబెట్టి తను కూడ మంచంపై ఒరిగి యేవో ఆలోచిస్తుంది. మేము హైద్రాబాదులో వుంటె అమ్మా, నాన్న, అన్నయ్య, తమ్ముడు, చెల్లెలు తన సుఖదుఃఖాలలో పాల్గొందురు గదా. ఈ దేశంలో ఒక మేరియాన్ తప్ప యెవరు కూడ రాలేదు బాబును చూచుటకు అనుకుంది పాపం ప్రమద చాల సున్నిత హృదయం కలది. ఇవన్ని తలచుకొనగానె కంటిలో నుండి కన్నీళ్లు రాలుతున్నవి. మళ్లీ తనకు తాను ధైర్యం

చెప్పకొని ఛీ బాబు జబ్బుగానున్నప్పుడు యీ కన్నీళ్లు కార్చుట అశుభము అని కన్నులు తుడుచుకొని bathroom లోకి వెళ్లి కళ్లు కడుగుకొనివచ్చి కుర్చీపై కూర్చుంది. అనుపమ్ లేచి అమ్మా ఆకలిగా వుందే hamberger యివ్వగలవా అన్నాడు. డాక్టరును అడుగుతాను బాబు అని మంచానికంటుకొని ఉన్న bell button నొక్కింది. వెంటనే నర్సు వచ్చి May I help you Mam అంది. Can he eat a regular hamberger అంది ప్రమద. డాక్టరుతో అడిగి చెబుతాను. వారు సరే అంటే బాబుకు లంచ్‌లో ఈనాడు hamberger నే అని నర్సు వెడలిపోయింది. కొంతసేపట్లో రూంలోని telephone మ్రోగింది. టెలిఫోనులో బాబు కోరికను డాక్టరు సరే అన్నాడు అంది నర్సు. లంచ్‌కు hamberger యిస్తున్నాము అంది. Thanks అని ప్రమద phone పెట్టివేసింది.

అనుపమ్‌కు, రెండు రోజులు హాస్పిటల్‌లో వుండగానే, జబ్బు నయమయ్యింది. మూడోనాడు డాక్టరు పరీక్ష చేసి మీరు యింటికి పోవచ్చు. He is fine అన్నాడు డాక్టరు. ఆ దేశంలో hospitals అన్నీ private లోనే వుంటాయి. మనదేశంవలె ప్రభుత్వము ఎందులో జోక్యము చేసుకొనదు. Health care కూడ ఒక పరిశ్రమగానె నడుపుకుంటారు అందువల్ల Hospital లో చేరకముందే రోగులకు Health insurance వుందా లేదా చూస్తారు. Insurance లేకుంటె డబ్బు కట్టేవరకు Hospital లో చేర్చుకొనరు. విక్రంకు university insurance వుంది ప్రతి విద్యార్థికి నెలకు యింత ప్రీమియం కడితే వీరిని యిన్సురెన్స్ cover చేస్తుంది. విక్రం అనుపమ్‌ను చేర్చినప్పుడు ఆ కార్డు చూసిన పిమ్మటనే hospital లో చేర్చుకున్నారు. మనదేశానికన్న వాళ్ల ఆరోగ్యసౌకర్యాలు చాల బాగుంటాయి. అక్కడ బీద గొప్ప అనకుండ యీ health insurance వుంటుంది. అందువల్ల అందరికి సమానంగా యీ health సౌకర్యాలు లభిస్తాయి ఆ యిన్సూరెన్సు లేకుంటె యెంతవాడికైన ఆ ఖర్చులు భరించలేక చావు మేలనుకుంటారు. కాని ఆనాడు ఆ insurance కొద్దిపాటి premium తో లభించేది. రానురాను యిది చాల పిరియమైంది. అంతేకాదు. అన్ని cover కావు. ఇన్సూరెన్స్ premiums నెలనెలకు కట్టినంక కూడా యెన్నియో మన చేతి నుండి కట్టవలె కాని ఆనాడు విక్రంకు అంత కష్టం కాలేదు. Discharge సమయానికి ఓనర్సు రానె వచ్చింది. అనుపమ్ బొమ్మలు వాని toy guns నన్నింటిని ఓ సంచిలో పెట్టి వాడిని wheel chair లో కూర్చుండబెట్టి యెలవేటర్ వద్దకు బండిని నడిపింది. ఆ నర్సు వెంట ప్రమద ఆ బొమ్మలున్న సంచిని పట్టుకొని నడిచింది ఆ wheel chair ను యెలెవేటర్ లోనికి నడిపింది. పిమ్మట ప్రమద, అనుపమ్ wheel chair ప్రక్కన నిలుచున్నారు. క్రిందికి యెలెవేటర్ రాగానే నర్సు అనుపమ్ wheel chair ను నర్సు accounts clearance section కు తీసుకువెళ్లింది. అక్కడ అన్ని bills సిద్ధంగానున్నవి అన్ని cover కాగా యింక రెండువందలు చేతినుండి కట్టవలసి వుంది. ప్రమద రెండు వందలకు చెక్కు వ్రాసి యిచ్చింది. అప్పుడు నర్సు బయటికి చైరును మళ్లించింది. విక్రం కారుతో సిద్ధంగా portico క్రిందనున్నాడు car ను park చేసి చేర్ రాగానే కారు తలుపులు తీసి మొదలు అనుపమ్‌ను కూర్చుండబెట్టినాడు వెనుక సీటులో.

పిమ్మట ప్రమదను ముందువైపు తన right side తలుపు తీసికూర్చుండబెట్టి ఆ బొమ్మలసంచిని అనుపమ్ కాళ్లవద్ద నుంచి కారు start చేసి thank you సర్స్ అని కారును కదిలించినాడు. అరగంటలో యిల్లు చేరుకున్నారు ఇప్పుడు బాబు మామూలు మనిషిగానున్నందుకు సంతసించినారు. ఇంటికి రాగానే అనుపమ్ సంచిని తెరచి తన toy guns తో ఆడుచున్నాడు. అనుపమ్‌ని చూసి ప్రమద విక్రం అమితానందంతో నున్నారు. విక్రం కొంతసేపు అనుపమ్‌తో ఆడుకొని మంచిది ప్రమదా, బాబు జాగ్రత్త నేను Dept. కు వెళ్లి వస్తాను. ఇచ్చట పనిచేస్తేనే అన్ని వుంటాయి లేకుంటె యేదీ వుండదు అని వెళ్లిపోయినాడు. ప్రమద తన వంట యింట్లో busy గా వంట చేసిపెట్టింది. విక్రం రాగానే అనుపమ్‌ను దగ్గరకు తీసి యెలా వున్నావు నాన్నా అన్నాడు. I am fine dady అన్నాడు అనుపమ్. I see that నాన్నా అని గట్టిగ ముద్దిడుకొని news వింటున్నాడు. "dinner is ready" అని ప్రమద కూడ విక్రంతో కూర్చుంది. ఇద్దరూ సోఫాపైన కూర్చొని T.V. చూస్తున్నారు అనుపమ్ వాని ప్రపంచంలో నున్నాడు News కాగానే రండి వడ్డిస్తా అంది. సరే అనే విక్రం లేచి dinner table పైకి వచ్చినాడు. అన్నీ రుచిగా ఉన్నాయి అన్నాడు. ఇదంత అనుపమ్ యిచ్చిన ఆరోగ్యకానుక అన్నాడు విక్రం మరి నా చతురత యేమి లేదంటారా అంది ప్రమద. నీ చతురత లేంది యీ జీవితమే నీరసము ప్రమద. కాని మన ఇద్దరికి అనుపమ్ ప్రాణం యెక్కువకదా. వాడు లేంది మనము జీవించగలమా అన్నాడు విక్రం. వూరకే అన్నానండి. అనుపమ్ ముఖ్యం, నిజం అంది ప్రమద. ఇంతలో మెరియాన్, సూలు తలుపు కొట్టినారు. ప్రమద తలుపుతీసి come in అని యిద్దరిని ఆహ్వానించింది. ఇద్దరు చిన్న gift packets ను అనుపమ్‌కిచ్చి How are you Anupam అన్నారు. fine అన్నాడు అనుపమ్ I bet you are అన్నారు మెరియాన్, సూలు యిద్దరు ఒకేసారి O.K. ప్రమద we leave you alone we will see you some other time అంటు వెడలిపోయినారు. మెరియాన్, సూలు యిద్దరు మంచి స్నేహితురాండ్రు ప్రమదకు. ఎప్పుడు అవసరమనిపించినా వారి అభిప్రాయాన్ని తీసుకొంటుంది ప్రమద. చాలారాత్రి వరకు ప్రమద, విక్రంలు అనుపమ్ ఆడుకుంటుంటే T.V. చూసుకుంటు కూర్చున్నారు. రాత్రి పదకొండు కావస్తుంది. ఇంక అనుపమ్ ఆడుతునే వున్నాడు సంతోషంగా. ప్రమద మెల్లగా అనుపమ్‌ను సమీపించి నాన్నా you have to sleep now. రేపు స్కూలికి వెళ్లాలికద కన్నా అని బుజ్జగించి అతనిని bed పై పరుండబెట్టి కప్పి light ను ఆర్పివేసి బయటకు వచ్చింది. బయటికి రాగానే విక్రం వడిలో ఒరిగి నాకెట్లుందో తెలుసా ఈనాడు అని తన బాహువులతో విక్రంను బిగించింది. విక్రం ఆమె ఆ స్పర్శతో లోకాన్ని మరుస్తున్నాడు. ఇప్పుడు వాళ్లిద్దరు పార్వతి పరమేశ్వరులవలె, రతిమన్మధులవలె ఆనందాన్ని అనుభవిస్తున్నారు పిమ్మట తన bed room లోకి వెళ్లి ఒకరి బంధాలలో మరొకరు పడుకున్నారు కొంతసేపటి వరకు ఈ ప్రపంచాన్ని మరచి పిమ్మట యిద్దరూ నిద్రాదేవి ఒడిలో వ్రాలిపోయినారు.

కాలం దొర్లుతుంది. విక్రం Ph.D work సాగుతునే వుంది. ప్రమద చదవాలి అనుకుంది. కాని ఏమి చదవాలి అనే ప్రశ్న. ఆమె యిప్పుడు AAUW లో

చేరింది. local chapter లో చాల active గా వుంది. అంటె local American Association of university woman తో చాలా పాపులర్. ఎంతో మంది ప్రొఫెసర్ల భార్యలు ఈమెకు స్నేహితురాండ్రు. వారందరితో కలిసి తిరుగుతుంది. ఇప్పుడు అమెకు సమయం తక్కువ. అందుకే T.V. చాల తక్కువ చూస్తుంది. ఏవో programms suggest చేస్తుంది. Local chapter లో international programm కు ఈమె convencer. ఇండియా గురించి ఈమెకు తెలుసుకాబట్టి ఇండియన్ cultural programm కొన్ని చేసింది. మరి Argentina నుండి ఒకామె Mr. Artera వుంది కాబట్టి ఆ దేశానివి కూడ ఓ రెండు programm లు చేసింది. తనశక్తి సామర్థ్యాలను బట్టి యేవో కొన్ని programm లను చేసింది. ఈమె అందరి faculty wives కు తన చీరలు కట్టించి group photo తీసింది ఈ photo చాలామందికి నచ్చింది. అందరూ ఒక copy తీసుకున్నారు. ఒక వనిత అను నామె మరియు peggy అనునామె, ఇద్దరు ప్రమదకు ప్రాణస్నేహితులు వనిత అంటే భారత స్త్రీ అనుకున్నాడు విక్రం. కాదు ఈమె Mexican దేశస్థురాలు అందుకే పేరు వేరేవిధంగా వుంది కాబట్టి మన వనిత పేరుకు దగ్గరగా కనిపిస్తుంది. ఈమె భర్త చాలా పేరుపొందిన physics ప్రొఫెసరు. పెగ్గి భర్త ఎకనామిక్స్ ప్రొఫెసరు. ఇతను విక్రంకు తెలుసు. పెగ్గి వనితలు family friends గా మారినారు కాబట్టి విక్రంకు కూడ స్నేహితులైనారు. వారి ఇంటికి వీరు వీరు యింటికి వారు visit కి వస్తూపోతూ వుంటారు. తక్కినవాళ్లు కూడ స్నేహితులే కాని వీరిద్దరివలె అంత close కాదు. ప్రమద చేసిన AAUW activitities local papers లో వచ్చినవి. అవి అన్నింటిని clips లను విక్రం తీసిపెట్టినాడు. ఇలా వుండగా ఒకనాడు ప్రమద ఇంట్లో మధ్యాన్నము ఒక భారతస్త్రీతో మాటాడుతోంది. అమె వయసు ప్రమద వయసు కంటె కొంచెం తక్కువ అనుకుంటాను అమె సుమారు ఆరు అడుగుల యెత్తు గులాబిరంగు దేహము నిడుపైన కళ్లు ఆ కళ్లలోనుండి బయటికి రాలుతావా అన్నట్లు కన్పిస్తున్న కనుగుడ్లు ఓ మాటలో చెప్పాలంటె తెలుగులో అమెను అతిలోకసుందరి అనవచ్చు. రాగానే యిద్దరూ లేచి నిలబడ్డారు. విక్రం అశ్చర్యచకితుడై hello అన్నాడు ప్రమద యీపాటికి అమెరికన్‌ల ఆచారానికి అలవాటైంది కాబట్టి ఇంగ్లీషులో ఆమెతో యీామె పేరు నీల యీామె మహారాష్ట్ర నుండి. ఈమె భర్తగారు మీ యునివర్సిటీలో Math Dept లో ప్రొఫెసరుగా యీ సంవత్సరమే చేరినారట అని పరచియం చేసింది ఓ అలాగా nice to see you Madam అని విక్రం dining table వద్దనున్న chair ను గుంజుకొని వారిద్దరి ముందు కూర్చున్నాడు. అంతలో మళ్లీ కలుస్తాను అని ఆ నీల లేచింది. పరవాలేదు నా భర్తగారు తినివెళ్లిపోతారు కాబట్టి ముగ్గురం కలిసి తిందాము అంది ప్రమద. సరే అంది నీల. ప్రమద చేసిన పదార్థాలన్నీ table పైన పెట్టింది ముగ్గురు టేబుల్ చుట్టు కూర్చున్నారు. 14 నిమిషాలలో భోజనాలు పూర్తి అయినవి కాగానే desert యిచ్చింది ప్రమద desert ను తినగానె విక్రం మంచిది ప్రమద నేను వస్తాను అని నీలతో nice to see you అని బయటపడ్డాడు. విక్రం వెళ్లగానే నీల ప్రమదలు చాలాసేపు మాటాడుకుంటు కూర్చున్నారు. నాలుగు గంటలు దాటిన పిమ్మట

నీల భర్త వచ్చి ఆమెను తీసుకువెళ్లినాడు. ప్రమద కొంచెంసేపు యేకాంతంగా వుంది. ఇంతలోనె అనుపమ్‌ను తీసుకొని విక్రం వచ్చేసినాడు.

ఆనాడు ప్రమద అన్న వివాహము. ప్రమద ఎవరు యేమి చేస్తున్నది ఊహించుకుంటు తను వుంటె యెంత సంబరముతో ఈ హడావుడిలో పాలుపంచుకొంటు వుందునుగదా అనుకుంటు వూహాలోకంలో తిరుగుతు సోఫాపైన కూర్చుంది. ఇప్పుడు యెన్ని గంటల సమయము బారత్‌తో చూసింది తనచేతి గడియారంలో యింక కొన్ని గంటలకే అన్నయ్య పెండ్లి అనుకుంది. తల్లి శ్రీలక్ష్మి, చెల్లెలు సరిత చాల జ్ఞాపకానికొచ్చి కండ్లు కన్నీటితో నిండుతున్నవి. అయినా కన్నీళ్లనాపి సంతోషాన్ని తనలో కలుగచేసుకొనుటకు ప్రయత్నిస్తుంది ఇంతలో మేరియాన్ తలుపుకొట్టింది. ప్రమద తలుపుతెరిచి మెరియాన్‌ను లోపలికి ఆహ్వానించింది. మెరియాన్, మా అన్న పెళ్లి ఈనాడు అంది ప్రమద మెరియాన్‌తో. అవును ప్రమదా నాకు తెలుసు మన టైమ్ ప్రకారము యెన్ని గంటలకు అంది మెరియాన్. యింక మూడు గంటలకు పెళ్లి అయిపోతుంది అంది ప్రమద. సరే మంచిది మళ్లి కలుస్తా మూడు గంటల పిమ్మట అని వెళ్లిపోయింది. ఇంక విక్రం అనుపమ్ వచ్చుటకు కనీసం గంటసేపైన కావాలి. అందుకనే లేచి వంట చేసింది. వంటకాగానే విక్రం అనుపమ్ వచ్చినారు. విక్రం రాగానే telephone వద్ద కూర్చొని ఒక phonogram మామపేరున యిచ్చినాడు. ప్రమద యిదియెన్ని గంటలకు ముడుతుంది అచ్చట అంది. పెళ్లి అయిన మూడు గంటలకు ముడుతుంది అన్నాడు విక్రం. సరే అంది ప్రమద. ముగ్గురూ టేబుల్‌పై కూర్చొని భోంచేసినారు. పాత్రలన్నీ కడిగి ప్రమద వంటయింటి సింక్‌లో వేసి విక్రం అనుపమ్‌తో కూర్చొని పెళ్లి scenes అన్నీ చిత్రిస్తుంది విక్రంకు. విక్రం వినుకుంటు కూర్చున్నాడు ఇంతలో మళ్లీ తలుపు కొట్టినచప్పుడు విన్నది ప్రమద. తలుపులు తెరిచింది ఈసారి మెరియాన్ ఒక tray లో యేదో త్రాగుడుపదార్థము నాలుగు గ్లాస్‌లలో నింపి తెచ్చింది. ప్రమదా let us celebrate your brother's marriage అని. Tray ముందుంచి ముగ్గురిని మూడు గ్లాసులు తీసుకొమ్మంది. మెరియాన్ కూడ ఒక గ్లాసు తీసుకుంది. పిమ్మట ప్రమద అన్న మరి ఆయన ధర్మపత్నికి ఒక toast propose చేసింది. ఆ గ్లాసులు పైకెత్తి అనుపమ్‌తోసహా నలుగురు This is for the health and prosperity of your brother అని గ్లాసులోనున్న ద్రవాన్ని త్రాగుచున్నారు. చాలా బాగుంది. దేనితో చేసినావీ పానీయము అంది ప్రమద It is a great secret pramada but how is it అంది మెరియాన్ చాలబాగుంది అన్నారు విక్రం ప్రమదలు. Wel it is nothing but ice cream mixed with coke. Simple isn't it. అంది మెరియాన్. It is simple but delicious అన్నాడు విక్రం Thank you అంది మెరియాన్. పిమ్మట అయిదు నిమిషాలు సుమిత్ పెండ్లి విషయమై మాట్లాడి మెరియాన్ లేచి I will let you enjoy your brother's marriage అని మెరియాన్ వెళ్లిపోయింది. ప్రమద విక్రంలు సుమిత్ పెండ్లి విషయమై మాటాడుకుంటు చాల సేపటివరకు కూర్చున్నారు. ప్రమద అనుపమ్‌తో నాన్నా నీకు నిద్రాసమయం రా పరుండబెడతాను నీ bed లో

అంది. Mummy యివ్వాళ్ల మామయ్య పెండ్లి దినము కొంచెముసేపు మీతో వుంటానమ్మ అన్నాడు. సరే అన్నారు విక్రం ప్రమదలు.

ప్రమద అమెరికాకువచ్చి ఆరునెలలయ్యింది. ఇప్పుడు ఆమెకు యిచ్చటి ఆచారవ్యవహారాలతో చాలమట్టుకు acquaintence అయ్యింది. మెరియాన్, peggy, vanita వారు ముగ్గురు చాల close friends అయినారు. ఆమెకు తీరిక వుంది అన్న సమస్యేలేదు. కొడుకు భర్తతా గడిపాక వున్న సమయాన్నంతా స్నేహితులతో గడుపుతుంది. ఆమెకు చీకుచింతలేదు. అర్జుననివంటి భర్త అభిమన్యునికి తీసిపోని కొడుకు వుండగా ఈ సుభద్రకేమి లోటు అనుకుంటు ఆమె జీవితం గడుపుతుంది. ఒకనాడు విక్రం సాయంకాలం రాగానే గట్టిగా కౌగిలించుకొని మీకు శుభవార్త చెబుతాను యేమి యిస్తారు నాకు అంది. నన్ను నీకిచ్చుకున్నప్పుడు యింక యిచ్చేది యేముంది ప్రమదా నావద్ద అన్నాడు మరిచెప్పమంటారా అంది. అవును అని అన్నాడు విక్రం. అయితె వినండి. మీకు కూతురు కావాల మరి కొడుకా అంది. ఓ అదా. నీకెలా తెలుసు అన్నాడు. నాకు తెలువకుంటె మరెవరికి తెలుస్తుంది అంది ప్రమద. ఇది రెండవనెల అనుకుంట అంది ప్రమద. అయితే రేపే నిన్ను డాక్టరువద్దకి తీసుకెళ్లుతాను అన్నాడు విక్రం. సరే అంది ప్రమద. తెల్లవారగానే విక్రం dept. కు పోయి పదిగంటలకే మళ్ళీ వచ్చినాడు. Dept. నుండే phone చేసి "ప్రమదా పదిన్నరకు డాక్టరు appointment నేను పదిగంటలకు సరిగా యింటి కొస్తాను సిద్దంగ వుండ"మన్నాడు. ప్రమద విక్రం రాగానే పోదామా అని తయారయివుంది. ఆమెకు నచ్చిన చీరకట్టుకొని విక్రం ప్రక్కన కూర్చుంది కారులో. పదిగంటల యిరవై నిమిషాలకు డాక్టరు clinic కు చేరుకున్నారు. పోగానే డాక్టరు secretary కి వారిపేరు వారి యిన్సురెన్సు కార్డు నెంబరు యిచ్చి ఆమె అర్రలో కూర్చున్నారు. అమెరికాలో చాలమంది డాక్టర్లు తమ speciality అయిన పిదప తన practice కై office తెరుస్తారు. ఈయన office లో ఒక నర్సు ఒక Accountant మరియిద్దరు నుండి ముగ్గురివరకు aids వుంటారు. డాక్టరు temperature, blood pressure యేదీ చూడడు. ఇవన్నీ నర్స్ లేదా డాక్టరు aids చూస్తారు. పోగానే విక్రం మరి ప్రమద కూర్చొని యేవో పత్రికల పుటలను త్రిప్పుతున్నారు. ఇంతలోనె అని అనరాని pronounciation తో ప్రమద అని intercom లో చప్పుడు రాగానే ప్రమద విక్రంతో యింకో రూంలోకి వెళ్లినారు. అచ్చట వున్న నర్సు ప్రమద నోట్లో Thermameter పెట్టి temperature check చేసింది. పిమ్మట ఆమె బరువును note చేసి అటు పిమ్మట blood pressure చూసి note చేసి ప్రమదను తనవయస్సు మొదలగు medical information అడిగి ఆ folder లో నింపింది. అమెరికాలో ప్రతి డాక్టరువద్దకి మొదటిసారి వెళ్లినప్పుడు వారి health విషయమైన పూర్తి వివరాలు వ్రాసి ఒక folder తెరుస్తారు. మనము యెప్పుడు పోయిన ఆ డాక్టరు ముందు యీ folder చూసిన అవన్ని ఆ folder లోనే వుంటాయి మనదేశంలోవలె తీసిన Xray లను చేసిన tests లను మనకివ్వరు. ఈ information డాక్టరు తప్ప మరెవ్వరు court అనుమతి లేంది చూడలేరు. ఇది patient మరి డాక్టరు మధ్యనే వుంటుంది. దీనిని డాక్టరు తన భార్యకు

కూడ legally చూపలేదు. విక్రంకూడ ఈ information folder ను చూడలేదు. ఇవన్ని చూచిన పిమ్మట ప్రమదను వేరే ఒక రూంలో కూర్చోబెట్టినారు. విక్రంను కూడ పోనిచ్చినారు ప్రమదతో. ఒక యిరవై నిమిషాలు ఆరూంలో నుండగా డాక్టరు వచ్చినాడు రాగానే I am Dr. Raman అని ప్రమదతో చెప్పి. మీరు ఈమె భర్త అనుకుంటాను అన్నాడు Raman. అవును అన్నాడు విక్రం. యేమిచేస్తారు అని అడిగి ప్రమద folder చూసి ఆమెను పరీక్షించ మొదలుపెట్టినాడు. ఓ పదినిమిషాలు పరీక్షచేసి యిప్పుడు ఈమె రెండునెలల గర్భవతి అని కొన్ని మందులు వ్రాసి రోజూ యేమి చెయ్యాలో మొదలగు విషయాలు యిద్దరితో చర్చించి. మళ్లీ సుమారు రెండునెలలకు చూడవలసిందని చెప్పి వెడలి యింకో patient ను చూచుటకు వదలిపోయినాడు. ప్రమద ఆ examination table పైనుండి లేచి విక్రంతో కలిసి ఆ room బయటికి వచ్చి ఆ office ను మ్యానేజ్ చేస్తున్న aid వద్దకు వెళ్లినారు. ఆమె examination fees అంత యిప్పుడే యిస్తారా insurance settle అయిన పిదప bill పంపమంటారా అంది. విక్రం insurance payment settle అయినాక bill పంపండి అన్నాడు. సరే అని మళ్లి ఈ దినంనాడు యిన్ని గంటలకు మీరు డాక్టరును చూడవచ్చు అని ఓ కార్డుపైన వ్రాసి యిచ్చింది. అది తీసుకొని parking lot లోకి వెళ్లి కారుపై యిద్దరు తమ గృహాన్ని చేరుకున్నారు

ప్రమద యిప్పుడు గర్భవతి. విక్రం ఆమెను అన్యోన్యంగ చూస్తున్నాడు. అంటె యింతకుముందు చూడలేదనికాదు. విక్రంకు ప్రమద అంటె చాలప్రేమ. ఆమె లేనిదినాలు అమెరికాలో సంవత్సరాలుగా నుండె. కాని ఆమె వచ్చినప్పటి నుండి దినాలు క్షణాలుగా మారిపోయినవి చూస్తుండగానే ఆరునెలలు యిట్లా గడచినది. ఇన్నాళ్లకు ప్రమద మళ్లీ గర్భాన్ని ధరించినందుకు చాల సంతోషంగా ఉన్నాడు. అనుపమ్‌కు యివన్ని యేమి పట్టిలేవు. తనస్కూల్ స్నేహితులతో కాలాన్ని సునాయాసంగ గడుపుతున్నాడు. అమెరికాలో స్కూళ్లలో చదువు మనదేశపు చదువుకంటె బాగా వుంటుందనియే చెప్పాలి ప్రత్యేకంగా అనుపమ్ వెళ్లే school లో అధికంగా faculty మరియు విద్యార్థుల పిల్లలవుట వలన మంచి standard వుందని విన్నాడు విక్రం. అది అనుపమ్‌లో చూస్తున్నాడు విక్రం. ఇచ్చట మనవలె uniform చాలతక్కువ. పిల్లలు తనకు యిష్టమైన దుస్తులను ధరించి స్కూల్‌కు వెడతారు. Rigid dressing అని వుండదు. కానికొన్ని సైనిక స్కూళ్లలో వేరే విషయం. ఇక్కడ సైనిక శిక్షణవలెనే చాలా డిసిప్లిన్‌గా వుంచుతారు. ఇవి residential schools. అనుపమ్‌కు ఏ చీకుచింత లేదు. విక్రం ప్రమదల జీవితము కూడ అంతె. నెలకు వచ్చే ఆదాయం సరిపోతుంది. కొద్దిపాటి ఆదాయము నెలనెలకు వెనుకేస్తుంది ప్రమద. ఈ దేశములో ఆర్థిక యిబ్బందులున్న వారు చాలామంది వున్నారు. అమెరికనులు యెక్కువగా అప్పులు చేసి బ్రతుకుతారు. ప్రతిది వారు credit పైననే కొంటారు. car credit పైననే యిల్లు కూడ అట్లే ప్రతిదీ వారు credit పైన కొని నెలనెలకు కిస్తులు కడుతూవుంటారు. ఆ credit అనే శబ్దము తీసివేస్తే వారి ఆర్థిక అవస్థ కూలిపోతుంది. అయితే వీరి ఆర్థికవిధానమే వేరు. మనవలె socialism పైన నమ్మకములేదు. వీరికి socialism అంటె గిట్టదు కూడా. చాలామంది

శ్రీమంతులు అనుకునేవారు, ఒకప్పుడు బీదలే వారి స్వయంకృషితో పైకి వచ్చినవారే చాలామంది. మనవలె వారు కూడా నూటికి తొంబైశాతం కన్న యెక్కువ రైతులే వుండిరి. కాని రైతుబిడ్డలంత చదువుకొని పట్టణాలకు చేరుకున్నారు. డాక్టర్లుగా, లాయర్లుగా teachers గా మరియెన్నియో professionals గా చేరిపోయినారు రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వము వీరు కూడా మనవలెనే వుండేవారు. కాని ఆ యుద్ధం తర్వాత వీరి సామాజికవ్యవస్థయే మారింది. మనకు వారికి భేదమేమిటంటే వీరు స్వేచ్ఛా జీవులు, మనము బానిసలము. వీరి ప్రజాస్వామ్యము మనవలెనే అల్లరిదిగా వుండేది. కాని వీరికి కావలిసినన్ని వనరులు, ప్రకృతి సంపద లభించింది. వీరు ఈ దేశానికి ఐరోపా ఖండము నుండి వచ్చినప్పుడు యిచ్చటి నివాసులు వీరిని ఆహ్వానించి వీరికి చాల తోడ్పడినారు. రానురాను వీరిని చంపి వీరి భూమినంత రెండు వందల సంవత్సరాలలో ఆక్రమించుకున్నారు. వీరిని బూడిద పూచిపనికి రాని భూములలో నిర్బంధించారు. ఇచ్చట నివసించేవారు ప్రకృతి మనుషులు వీరు జంతువులను వేటాడి మాంసాన్ని భుజించేవారు. వారు అడవులలోనున్న దుంపలు కాయగూరలను తిని జీవించేవారు. వీరి ఆయుధాలు విల్లు అమ్ములే కాని యూరప్ నుంచి వచ్చినవారు తుపాకులు కత్తులను యుద్ధములో ఉపయోగించనేర్చినవారు అంతే కాకుండ వీరిలో రాజకీయ awareness కూడా వుండె. కాబట్టి వీళ్ళు వారిని వారు ప్రజాస్వామ్య పద్ధతితో పాలించుకునేవారు. కాని యిచ్చట నివసించేవారు ఒక tribal cheif మాట వినేవారు. వీరి పరిపాలన విధానము కూడా బాగానే వుండేది. కాని యూరప్‌ను పోల్చి చూస్తే వీరి ఆయుధాలు యూరప్‌వారి ఆయుధాలకన్న చాల తక్కువ బలీయమైనవి. అదిగాక యూరోపియన్లు, చాలమటుకు బీదవారు. యూరప్‌లో వాళ్లకు భూమి యే మాత్రము లేకుండె. ఇచ్చట యెటు చూచినా ప్రకృతి సంపదే. అంతేకాకుండ యూరప్ నుండి వచ్చినవాళ్లకు ఆశయెక్కువ. కాని యిచ్చటి నివాసులకు ఆశ, మరి నాసంపద అనేదే లేకుండె. వీరి philosophy యూరోప్ నుండి వచ్చినవారి philosophy పూర్తిగా వేరు కాబట్టి ఓడలు దిగగానే ఈ ప్రకృతి సంపదనెట్లా కొల్లగొట్టాలె యెలా ఈ దేశపు నివాసులను యిచ్చటి నుండి తరిమివాయాలి అనియే వచ్చినారు. కాని పాపం ఈ దేశస్థులు వీరి కుట్రలను గ్రహించలేదు ప్రతి సంవత్సరము వారి భూమిని ఆక్రమించుకొని వీరిని దూరదూరానన్నున్న భూములకు తరిమికొట్టినారు. యూరోపియనుల జనాభా పెరుగుతువచ్చింది దానితో వీళ్ల దురాశ కూడా పెరుగుతూపోయింది దాంతో ఈ దేశస్థుల బాధలు కూడా పెరిగినవి. చేయనది లేక ఈ దేశస్థులు ఈ తెల్లవారితో యుద్ధాలు చేశారు. ఫలితం ఓటమి దాంతో పేరునకు ఒక ఒప్పందం. ఈ ఒప్పందం జరిగిన కొన్నిరోజులకే ఆ ఒప్పందం ఉల్లంఘన, యుద్ధం, పరాజయం, మరో ఒప్పందం. ఈ విధంగా కొన్ని వందల ఒప్పందాలకు ఈ యూరోపియన్‌లు ఉల్లంఘించి యిరువదవ శతాబ్ద ప్రారంభం వరకు వారి భూమినంత నాక్రమించుకొని యేదో కొంతపనికి రాదనుకున్న రాళ్లురప్పలుగల భూమిని వీళ్లకు దయాదాక్షిణ్యాలకు మళ్లే యిచ్చిరి. అమెరకన్ ప్రభుత్వం వారికి జంతువులవలె తిండితిప్పల యేర్పాటు చేసింది. అరాళ్లు రప్పలుగల భూములను కూడ చాలామట్టుకు గుంజుకొని భారతదేశానికన్నా

మూడింతలు గల భూఖండంలో ఈ అమెరికా అనే ప్రపంచ ప్రఖ్యాతికెక్కిన civilization ను సృష్టించారు. ఇది వీరికథ. ఒకసారి యూరోపియన్‌ల సంఖ్య పెరిగి వీరి రాజ్యాన్ని స్థాపింపగానే వీరు ఒక జాతిగా మనగలిగినారు. ఇంగ్లాండు నుండి మాకు ముక్తి కావలెనని నినాదాలు లేవదీసినారు. బ్రిటిష్ ప్రభుత్వము దీనిని oppose చేసింది. సైన్యంతో వీరిని అణగదొక్కింది కాని అమెరికనులు బ్రిటిష్ ప్రభుత్వానికి భయపడలేదు, లొంగలేదు. అనాడు ప్రతివాడు (అంటె native Americans తప్ప) తుపాకులు యెప్పుడు తనవెంట నుంచేది. ఈనాటికి కూడ రాజ్యాంగ ప్రకారము ప్రతివానికి ఆయుధాన్ని ధరించే హక్కు వుంది. అందుకే తుపాకులు చాలనున్నాయి ఈదేశంలో. అగ్గిపెట్టెలు మనదేశంలో కొన్నట్టు ఈదేశీయులు తుపాకులను అదేవిధంగ కొనవచ్చు.

ప్రమద ఇప్పుడు మూడు నెలల గర్భవతి. డాక్టరు చెప్పినట్టుగా నడుచుకుంటుంది. కాని దురదృష్టవశాత్తు ఈ గర్భము నిలవలేదు. ఒకనాడు అనుకోకుండ ఈమెకు రక్తప్రవాహము ప్రారంభమై కొన్ని గంటలలో గర్భం పోయింది. ఇది ప్రమదకు ఒక గొప్ప నిరాశ. విక్రం కూడ కలలుగంటున్న రెండవ బిడ్డ రాదన్న నిరాశ కలిగింది. సరే మళ్లీసారికి నిలుస్తుందన్న ఆశతో యిద్దరు వూరుకున్నారు. చేసేదేముంది వూరుకొనకపోతే. దైవనిర్ణయాన్ని మనము మార్చగలమా చెప్పండి ప్రమద ఎప్పటివలె కొడుకు భర్తలతో కాలం గడుపుతు వస్తుంది. ఈ గర్భం పోయిన ఆరునెలలకు మళ్లీ ప్రమద గర్భం ధరించింది ఒకసారి నిస్పృహ చెందిన దంపతులు ఇప్పుడు అంత సంతోషాన్ని వెలిబుచ్చలేదు. రెండవసారి గర్భం నాలుగునెలలు నిలిచి విచ్ఛిన్నమైనది. రెండవసారి అంత నిస్పృహచెందలేదు మూడవసారి గర్భాన్ని ధరించింది. ఈసారి ఆరునెలలు నిలచి మళ్లీ విచ్ఛిన్నమైనది. ఈసారి డాక్టరును చూసి నూటికి నూరుపాళ్లు ఆయన చెప్పినట్టే నడచుకున్నారు. కాని ఆరునెలల పిండం పోయింది. ఇక లాభంలేదని విక్రం ప్రమదను వేరే మరో డాక్టరుకు చూపించాడు. ఆ డాక్టరు curatis చేస్తానని ఏదో procedure చేసాడు. ఈసారి గర్భం విచ్ఛిన్నం కాకూడదు అన్నాడు. కాని గర్భం కానప్పుడు గర్భవిచ్ఛిన్న సమస్య ఎచ్చటి నుండి వస్తుంది. ఈ procedure పిదప మళ్లీ గర్భం రాలేదు ఇద్దరు దంపతులు సరే అనుపమ్ ఆరోగ్యంగ వుంటే అంతే చాలు అనుకొని వూరడించుకున్నారు తమకు తాము. మూడవగర్భం పోయినంక మళ్లీ ప్రమద గర్భం ధరించలేదు. మునుపటివలె ఆమె తన జీవనయాత్రను భర్త కొడుకు సాంగత్యము సాగిస్తువస్తుంది. వూరకవుండి యేమి చేసేది. M.S. పూర్తి చేస్తే బాగుంటుంది అని అనుకుంటుంది గాని Harward లో admission వస్తుందా అని భయపడుతుంది. ఈ విషయం విక్రంతో సంప్రదించింది. అతడు ఇద్దరము చదివితె అనుపమ్ Neglect అవుతాడేమో! అన్నాడు ప్రమదతో. సరే వాడికి ఇంకా కొన్నాళ్ళు నిండితే చూద్దాంలెండి అని వూరుకుంది. అయితే ఈమె ఒక మంచి బాలికతో AAuW లో పనిచేస్తున్నప్పుడు స్నేహం కలిసింది. ఆమె భర్త Harward లో Asst. professor. ఈ అమెరికన్ బాలిక (ప్రమద వయస్సు) ప్రమద తాను scholarship కు ఎందుకు దర ఖాస్తు పెట్టవు అని కొన్ని సంస్థల పేర్లను తెచ్చి ఎలా దరఖాస్తు వ్రాయాలో చెప్పి ప్రమదతో

దరఖాస్తు పెట్టించింది కొన్ని సంస్థలలో. అనుకోకుండ ప్రమదకు interview కు రమ్మని పిలుపువచ్చింది. రాగానే ఈ అమెరికన్ బాలిక lidya కు phone చేసి చెప్పింది. ఆమె ప్రమద యింటికి వచ్చి ఆమెను ఏ ప్రశ్నలు అడుగగలరో వాటికి సమాధానాలెట్లు ఇవ్వవలెనో మొదలగు విషయాలలో coach చేసింది. ప్రమద ఆమె చెప్పినవన్నీ బాగా గుర్తు పెట్టుకుంది. ఇంటర్వ్యూకు వచ్చింది. స్కాలర్‌షిప్పును సంపాదించింది.

రెండవ సమస్య ఈమె admission regular admission అంటె కష్టం కాగలదేమొ కాని part time గా courses తీసుకొనవచ్చునని lidya చెప్పింది. స్కాలర్‌షిప్ దొరికిందని కొన్ని sociology course కు register చేయాలని ప్రమద నిర్ణయించుకొంది Fall నుండి. ఇది వేసవి semester కాబట్టి Fall కై వేచివుంది registration కై. ఇప్పటికే ఒకామె Mrs. Davis ఆమెపేరు. ప్రమదను తనకూతురుగా చూసుకొంటుంది. ఈమె ప్రమదకు God mother. వీళ్లిద్దరు మంచివారు. వీరికి ఒక కూతురు ఒక కొడుకు. ఆ అమ్మాయికి ప్రమద సోదరి. చాలమంచి అమ్మాయి. అపురూప అమెరికన్ సుందరి అనియే చెప్పవచ్చు. Mrs. Davis తో ప్రమద ఒకనాడు తను Sociology లో M.S. చేయాలనుకుంటున్నానని మాట వరుసగా తెల్పింది. ప్రమదా your dad is a professor in that dept. Why don't you discuss this with him అంది Davis. ప్రమద సరే ఈ week end లో మీరిద్దరు మాయింటికి భోజనానికి రండి మాటాడుదాము అంది ప్రమద. We love to do that అంది Mrs. Davis. ఈ మాటల పిమ్మట ప్రమద God mother ఇంటి నుండి వెళ్లిపోయింది. ప్రమద ఈ విషయము విక్రంకు తెలిపింది. సరే అన్నాడు విక్రం. week end లో భోజనానికి రానే వచ్చినారు ఆ Davis దంపతులు వారి కూతురు కూడా వారితో వచ్చింది. భోంచేసిన పిమ్మట Mrs. Davis ప్రమద విషయమై Mr. Davis తో ప్రస్తావించింది. ఓ అలాగ నానుండి ఏ సహాయం ఐన నేను చేస్తాను. Fall లో రా అమ్మ Pramada అన్నాడు. సరే daddy అంది ప్రమద. ఇద్దరు డేవిసు దంపతులు మురిసిపోయినారు. భోంచేసినంక చాలసేపటివరకు మాటాడుకుంటు పదిగంటల వరకు కూర్చున్నారు. పిమ్మట Mrs. Davis కూతురుతో వెళ్లిపోయినారు పోయేటప్పుడు Mrs. Davis ప్రమదను కౌగిలించుకొని ముద్దాడింది. Mr. Davis కూడ ప్రమద నుదుట ముద్దిడుకొని సెలవు తీసుకున్నారు. ప్రమద చాల సంతోషంగ వుంది. ఆనాడు రాత్రి తన మనస్సు నెమలివలె నాట్యం చేసింది. అనుపమ్‌ను పరుండబెట్టి యిద్దరు తమ పాన్పుపై పవళించినారు

ప్రమదకు మూడవ గర్భస్రావం miscarriage జరిగిన పిమ్మట మళ్లీ గర్భం ధరించలేదు. సరే అనుపమ్ వున్నాడు చాలులే అనుకున్నారు కాని విక్రంకు ప్రమదకు యింకను యిద్దరు పిల్లలను కనవలెనని కాంక్షకాని దైవేచ్ఛలేంది యిది జరుగని పని యేమొ అనుకొన్నారు ప్రమద fall లో M.S. courses తీసుకుంటుంది. ఈ Fall లో రెండు courses తీసుకుంటుంది. ఇప్పుడు car ను తానె పెట్టుకుంటుంది. ఉదయము ప్రమద విక్రంను అనుపమ్‌తో సహా కాలేజికి వెళ్లుతుంది

పన్నెండు వరకు classes ముగించుకొని కారులో ఒక్కతే ఇంటికి వస్తుంది. భోజనం సిద్ధం చేయగానె విక్రం వచ్చి భోంచేసి కారును తానె తీసుకువెళ్లుతాడు. ప్రమద యింట్లో కూర్చొని ఇంటి పనిచేసిన పిమ్మట తన class పనిని చేస్తుంది. ఇప్పుడు మెరియాన్, సూ లతో కలయుటకు సమయము చిక్కదు. అయినా అప్పుడప్పుడు కలుసుకుంటు వుంటుంటారు. week ends లో తన AAuW members తో కలుస్తాది. Peggy మరి Vanita తో week ends లోనే కలుస్తుంటుంది. జీవితం సాగిపోతుంది యేదో విధంగ. తండ్రి రఘునాధరాయలు అన్ని విషయాలను వివరంగ వ్రాస్తువుంటాడు తీరినప్పుడల్లా. వాటిని చదివినప్పుడల్ల యింకా home sick అవరిస్తుందామెను. విక్రం మాత్రం తన doctorate thesis మీద పని చేస్తున్నాడు. ఇంకను యెన్నేళ్లు కావాలి అంది ప్రమద. యెన్నేండ్లో కాదు. ఇక రెండేళ్లలో doctorate పట్టం పుచ్చుకుంటానులే ప్రమద అన్నాడు విక్రం. అబ్బ ఆ దినానికై వేయికళ్లతో వేచియున్నాను అంది ప్రమద. ప్రమద యిప్పుడు ఓ విద్యార్థిని. అందువల్ల ఆమెపైన సంసారభారమే కాకుండ విద్యాభారం కూడవుంది. రెండింటిని తెలివిగా లాగుకొస్తుంది ప్రమద. ఒక సంవత్సరం scholarship ను వాడింది కాబట్టి 1/3 courses ని పూర్తి చేసింది. పిమ్మట scholarships renew కానందున రెండవ సంవత్సరం కాలేజికి వెళ్లలేదు అంటె ఆమె M.S.ను పూర్తి చేయలేదు. ఆమె M.S. కలగానె మిగిలిపోయింది. అయినా అంత చింతించలేదు. విక్రం మాత్రం తన డాక్టరేటు course లను పూర్తిచేసి యిప్పుడు కేవలం తన సమయాన్నంత dissertation పైన కేంద్రీకరించినాడు. ఇప్పుడాతడు నిర్ణీత సమయానికి class కు పోయె అవసరంలేదు. ఎప్పుడు అవసరమైతే అప్పుడే పోతాడు. class కు నియమానుకూలంగ వెళ్లేవాడు అనుపమ్ ఒకడే. కాని విక్రంకు వేరే బాధ్యతలు పెరిగినవి. ఇప్పుడతడు primary research data కొరకై వేరే పట్టణాలకు week days లో వెళ్లుతాడు. కాబట్టి చాలమట్టుకు week days లో ప్రమద అనుపమ్ యిద్దరే వుంటారు యింట్లో. ప్రమదనే యిప్పుడు అనుపమ్‌ను బళ్లో వదిలిపెట్టడం తీసుకురావడం జరుగుతుంది. విక్రం శుక్రవారంనాడు సాయంకాలం వరకు ఇంటికి వస్తాడు. విక్రం, ప్రమదలు అనుపమ్‌తో గడుపుతారు. ఇప్పుడు ఇదో కొత్త జీవితం ప్రమదకు అలవాటైనది. కొద్దినెలలే ఈ travelling జీవితం. పిమ్మట data collection పూర్తికాగానే మళ్లి week days మరి week ends ఇంట్లోనే గడుపుతాడు విక్రం.

చూస్తుండగానె data collection పని పూర్తి అయినది. ఇక దాని analysis చేసిన పిమ్మట ఆ results ను dissertation లో అమర్చాలి. అది ఒకవేళ తృప్తికరంగా వుంటె వ్రాయుటకు కూర్చోవాలి. Anyway data collection పూర్తి అయినది కాబట్టి దానిని పరిశీలించి యింక collect చేయాలా సరిపోతుందా ఈయన తన committee chairman తో మాటాడిన పిమ్మట కాని తెలియదు దీనికై అతనితో appointment యివ్వమని ఆయన secretary తో కోరినాడు విక్రం టెలిఫోన్ పైన. ఆ secretary ఫలాన దినమునాడు మధ్యాహ్నము యెలా వుంటుంది అని విక్రంను ఫోనులో అడిగింది. సరే బాగానే వుంటుంది అని దానిని calander

లో note చేసుకున్నాడు. ఆ appointment ప్రకారము అనాడు కలిసి అతనికి తాను collect చేసిన data దాని priliminary analysis ను చూపించినాడు professor కు సరే బాగానే కనబడుచున్నది పూర్తిగా analysis ప్రారంభించమన్నాడు professor. విక్రం ఆ data analysis పైన రోజూ పనిచేస్తున్నాడు. కొద్దిరోజులలో analysis పూర్తి అయ్యింది. కాగానే మళ్లీ professor appointment కోరి తీసుకున్నాడు. ఇద్దరు ఆ analysis results ను చూచి సంతృప్తిగా వుందన్నారు. అందువల్ల dissertation వ్రాయుటకు ప్రారంభించినాడు విక్రం. ఇంతవరకు విక్రం course వర్కులోనే నిమగ్నుడై foreign languages requirement ను పూర్తి చేయలేదు. అది పూర్తి చేసేవరకు dissertation పూర్తి అయినా degree యివ్వరు. కాబట్టి ఈ వేసవిలో వాటిపైన కేంద్రీకరించాలి అని నిర్ణయించుకున్నాడు. వేసవిలో French మరి German భాషల courses ను తీసుకున్నాడు. German అతనికి చాల కష్టంగా తోచింది. French పరవాలేదనుకున్నాడు. కాని ఈ వేసవిలో యివి పూర్తి కాకపోతే తన degree కి ఆలస్యమవుతుందని రెండింటిని ఈ వేసవిలోనే తీసుకున్నాడు. రోజుకు పారాలైన పిమ్మట పరీక్ష, రోజూ రెండు పరీక్షలు. వాటిలో నెగ్గకుంటె ఫలితముండదు కాబట్టి రాత్రింబగళ్లు కష్టపడుతున్నాడు. ఇంట్లో వుండి కూడ లేనట్టే వుంది ప్రమదకు. విక్రం మాటాడటానికి కూడ ఈ French, German కోర్సులతో తీరికలేదు. ప్రమద అతని ఈ చదువు చూచి భయపడిపోయింది విక్రం ఆరోగ్యం పాడవుతుందని. week days లో రాత్రి నాలుగు గంటలకన్న నిద్రవుండదు. week ends లో చాలవరకు నిద్రిస్తాడు. ఇవన్ని చూసి ప్రమద భయపడిపోయింది పాపం. ఈ డిగ్రీ లేకున్న సరే మీరింత కష్టపడకండి అంది విక్రంతో ఒకనాడు. చూడు ప్రమద Ph.D. అంటె వూరకరాదు ఈదేశంలో ఈసారి ఈ courses పూర్తి చేయకపోతె నా degree కి ఒక సంవత్సరం ఆలస్యమౌతుంది. అందుకే నేను చదవాలి కొంచెం ఓపికతో వుండు ఇంక అరువారాలలో ఈ రెండు పూర్తికాగలవని ప్రమదను వూరడించినాడు. అనుకున్న ప్రకారము అరువారాలు గడచినవి. రెండింటిలో పాస్ అయినాడు. అనాడు కాని విక్రం హాయిగా నిద్రపోలేదు. ఇక తెల్లవారి నుండి మునుపటివలెనే తన సామ్రాజ్యలక్ష్మి ప్రమదతో తనగారాబు కుమారుడైన అనుపమ్‌తో గడుపుతున్నాడు. రోజూ campus లో సాయంకాలము open theatre లో మూవి చూచుటకు ముగ్గురు వెడలి తొమ్మిది గంటలకు యిల్లు చేరుతారు. ఈ విధంగా జీవితమంత మిగిలిన summer లో గడిపినారు. మళ్లీ Fall semester వచ్చింది. ఇప్పుడు ఏ కోర్సెస్‌లు లేవు. Research credits కే Register చేసినారు. ఇప్పుడు dissertation వ్రాయుటంలోనె నిమగ్నుడై వున్నాడు విక్రం. ప్రతిరోజు తీరికగాలేచి తీరికగా coffee త్రాగి వెళ్ళుతున్నాడు dept. కు ఎప్పుడు phone చేసి యేమైన పనివుంటె రావడానికి అభ్యంతరముండదు విక్రంకు తన office లో కూర్చొని యిప్పుడు కేవలం dissertation మీదనే కేంద్రీకరించి పని చేస్తున్నాడు. వ్రాసిందె కొట్టి మరోతీరుగ వ్రాస్తు అతనికి నచ్చినట్టు రాగానే దాన్ని మళ్లీ కొట్టివేయడు. ఈ విధంగా రోజుకు కొన్ని పేజీలు తప్ప యెక్కువగా వ్రాయలేదు. సమయం

చాలా తీసుకుంటుంది ప్రమదా ఈ dissertation ఒక్కొక్కసారి పిచ్చి లేస్తుందంటే నమ్మలేవు నీవు. కాని ఈ వ్రాత French, German పరీక్షల కంటె చాల మెరుగు కాకపోతె సమయం చాలా తీసుకుంటుంది అంటాడు విక్రం. ప్రమదకు ఈ విషయంలో అనుభవం లేనందున విక్రం అన్నదానికి యేమి suggestion యివ్వదు.

విక్రం ఈ dissertation మొదటి draft ను పూర్తి చేసినాడు. దీన్ని type చేయించి దీని copy లను కమిటీ సభ్యులకు యివ్వాలి. ఈ dissertation type చేయుటకు అనుభవముగల typist లు కావలె. అట్టి typist లు campus లోనో campus బయటనో వుండవచ్చు. అనుభవమున్నవారితో మాటాడి ఒక typist ను కలసినాడు. ఆమె సరేనని ఒప్పుకుంది. ప్రతి page కు ప్రతి copy కి యింత అని ఒప్పందం కుదిరింది విక్రం తన freehand draft ను ఆమెకిచ్చి చదవమన్నాడు. తెలియనివి mark చేస్తే తను తెలియచేస్తానని చెప్పినాడామెకు. సరేనని ఈ మొదటి draftను తీసుకొంది. రెండు రోజుల పిమ్మట విక్రంకు phone చేసిరమ్మంది. విక్రం వెళ్లగానే తనకు అర్థంకానివన్నీ అడిగి తెలుసుకుంది. రెండు వారాలలో మీ మొదటి ప్రతిని అందిస్తాను అన్నది. సరే అని విక్రం వెడలిపోయినాడు. అనుకున్న ప్రకారం రెండు వారాలు కాగానే ఆమె మొదటి draft విక్రంకు యిచ్చివేసింది. దాంతో మూడు కాపీలు కూడ యిచ్చింది. విక్రం original కాపిని తన professor కు తక్కిన మూడు కాపీలను members కు యిచ్చినాడు వారంరోజుల పిమ్మట అందరిని కలిసి వారి అభిప్రాయాలను తెలుసుకున్నాడు. ఎవరు యేవి objections లేదా suggestions పెద్ద మార్పులను చేయలేదు. విక్రం chairman అయితె it is good we will luye it అన్నాడు. విక్రంకు వేయి ఏనుగుల బలం వచ్చింది. తాను జాగ్రత్తగా చాల సమయాన్ని వినియోగించిన దానికి ఫలితం బాగుంది అనుకున్నాడు. విక్రంకు తెలుసు యెన్నిసార్లో వ్రాసిన వారున్నారని. తనకుకూడ అదే ఖర్మ పడుతుందని అనుకున్నాడు. కాని అలా జరుగనందున చాల తృప్తి సంతోషం కలిగింది. అప్పుడే యింటికి వెళ్లి ఈ శుభవార్తను ప్రమదకు తెలిపినాడు. ఆమె యెగిరి విక్రం చెంపను ముద్దిడుకుంది. అబ్బ యెంత శ్రమపడ్డారు మీరు. దాని ఫలితం దక్కింది మీకు అంది. విక్రం అవునన్నట్టుగా తలవూపినాడు. విక్రం doctorate orals యీపాటికే వ్రాసినాడు. ఇక dissertation final copy తయారుకాగానే dissertation defense చేయాలి. అది విక్రంకు అంత కష్టం కాదు. ఎందుకంటె ప్రతి విషయంలో బాగా ఆలోచించియే ఆ dissertation లో చేర్చినాడు. ఇది అతని creation కాబట్టి ఆ defense విషయమై ఆయనకు యేమాత్రము భయములేదు. defense తర్వాత యితని డాక్టరేటు పట్టము పూర్తి అయిపోతుంది.

ప్రమద యిప్పుడు ఆలోచించేదేమిటంటె విక్రం డాక్టరేటు కాగానే దేశం వెళ్లవలెనా లేక యిచ్చట job చేసేదా? ఒకనాడు అనుపమ్‌తో ముద్దుగా నాన్నా యిక నాన్న చదువు పూర్తి అయ్యింది మరి యిచ్చట వుండిపోదామా? లేక హైదాబాదుకు వెడదామా అంది. యిచ్చటే వుండిపోదాము అన్నాడు. ఎందుకు నాన్న తాతయ్యను అమ్మమ్మను నీవు Miss చేయడము లేదా అంది ప్రమద. చేస్తున్నాను అన్నాడు అనుపమ్. అయితె మరి పోవుట మంచిది కాదా అంది ప్రమద. లేదమ్మ

నేను యిక్కడే వుండిపోతాను నీవు వెళ్లి అమ్మమ్మను, నాన్నమ్మను తాతయ్యను తీసుకొనిరా అన్నాడు అనుపమ్. అలాగా నాన్నా అంది ప్రమద. వూం అంటు తలవూపినాడు అనుపమ్. ఇంతలో విక్రం వచ్చినాడు. అతనితో అనుపమ్ అన్న మాటలు చెప్పింది ప్రమద. విక్రం నవ్వినాడు. అవునా నాన్న అన్నాడు విక్రం. అవునన్నట్టుగా తలవూపినాడు అనుపమ్. ఇచ్చట అంతగాయేముంది నాన్నా నీకు అన్నాడు విక్రం T.V. వుంది నా స్నేహితులు వున్నారు. ఇక్కడ చాల ice cream వుంది. Hambergers వున్నాయి. మనదగ్గర యివిలేవే అన్నాడు అనుపమ్. ఓ అలాగా బాబు సరే మరి యిచ్చటే వుండిపోదాము అన్నాడు విక్రం. అనుపమ్ చప్పట్లు కొట్టుకుంటు అమ్మా విన్నావా నాన్న యిచ్చటే వుండిపోదామంటున్నాడు అని యెగిరినాడు. పిమ్మట సంతోషంతో తన స్నేహితులతో ఆడుకొనుటకు బయటికి పోయినాడు. ప్రమద విక్రంతో నేను ఆశించలేదు అనుపమ్‌తో ఈ మాటలు అంది ప్రమద. పిల్లలు వారికెక్కడ సరదాగా వుంటె అక్కడే వుండిపోదామంటారు. మనము ఇండియా మరిలిపోతే కొన్నిరోజులలో అన్ని మరచిపోతాడులే అన్నాడు విక్రం. విక్రం ప్రమదతో మనముగ్గురికి air టికెట్లకైతే సంపాదించవలె కదా. 18 నెలలు మనము ఈ వీసా పైననే పనిచేయవచ్చు. పిమ్మట మనము వుండిపోదామన్న మనలను వుండనీయరు వీరు. మనము మనదేశము వెళ్లిపోవలసిందే అన్నాడు విక్రం. ఈ డాక్టరేటు పూర్తి కాగానే post doctoral fellowship యిస్తానన్నాడు మా professor. ఆయననే నాకు ఒక position కై ప్రయత్నం చేయుచున్నాడు. నా orals కాగానే నాకు doctorate పట్టం వస్తుంది. ఇప్పుడు ఈ దేశంలో చాలా మంది ఈ క్వాలిఫికేషన్ వున్నవారు కావాలట. అందుకే job దొరికేది యేమంత కష్టంకాదు అన్నాడు విక్రం. లేదండి నాకు మాత్రం మనదేశం వెళ్లిపోవాలనిపిస్తుంది అంది ప్రమద. సరే అయితే మరి మీనాన్నను టికెట్టుకొని పంపమను అన్నాడు విక్రం. సరే బాగుంది యింతవరకు చేసిందే చాలు ఇక మనకు టికెట్టు కూడా కొనవలెనా మానాన్నగారు మీకు. ఇక కొద్దినెలలో ఆయన retire కూడ కాబోతున్నారు అంది ప్రమద. అయితె మరి మనము పనిచేసి టికెట్టు డబ్బు మిగిలించిగాని మరీ పోవాలి అన్నాడు విక్రం సరేలెండి అంది ప్రమద. ప్రమద భోజనం వడ్డించి అనుపమ్‌ను పిలచుటకు బయటికి వెళ్లింది. విక్రం T.V. చూస్తు కూర్చున్నాడు. ఇంతలో ప్రమద అనుపమ్‌తో ప్రత్యక్షమైంది. ముగ్గురు టేబిల్ పై కూర్చొని భోంచేసినారు. అనుపంను పరుండబెట్టి మరో గంటసేపు ప్రమద విక్రంలు T.V. చూస్తు కూర్చున్నారు. రెండు గంటలు T.V. చూసి యిద్దరు పడుకున్నారు.

ఇక విక్రం thesis defence రెండు రోజులకే. అందరిక మేటి మెంబర్లకు chairman గారు notice పంపి telephones చేసికూడ చెప్పినారు. శుక్రవారంనాడు పదిగంటల నుండి thesis defense మొదలవుతుంది. ఎప్పుడు ముగింపో మాత్రము తెలియదు. విక్రం ఈ డిఫెన్స్‌కై భయపడడములేదు. కాని dissertation లో వ్రాసిన ideas అన్ని defense చేసుకొనవలెగదా. అందుకే ఆ dissertation ను చూస్తున్నాడు. బేస్తవారంనాడు రెండుసార్లు పుటలన్నింటిని మరల్చి చూసినాడు. పన్నెండు గంటలకు నిద్రించినాడు. తెల్లవారుజామున లేచి కాలకృత్యాలు తీర్చుకొని

కాఫీ త్రాగుతు కూడ ఆ dissertation కమ్మలనే తిరుగవేస్తున్నారు. తొమ్మిది గంటలకే ఆనాడు office కు బయలుదేరినాడు. పదిగంటలకు అందరు meeting room లో నున్నారు. విక్రం professor విక్రంను formal గా introduce చేస్తు అయన data collection procedure నుండి అయన finish చేసిన dissertation గురించి brief గా మెంబర్లకు తెల్పి. He is your's now. అని కూర్చున్నాడు. అందరూ వారికి తోచిన ప్రశ్నలను అడిగినారు. విక్రం అన్నింటికి తగిన సమాధానాలిచ్చుటకు ప్రయత్నించినాడు. విద్యార్థికి ఆచార్యులకుండే బేధమే యిది. విద్యార్థి నేను సమాధానాలు సరిగ్గా యిచ్చినాననుకుంటాడు. కాని ఆచార్యులు తమ దృక్పథంతో అవి లోపించి వున్నవని అనుకోవచ్చు. మూడుగంటల కాలవ్యవధిలో అందరూ ప్రశ్నలను కురిపించినారు విక్రంపై. ఈ ప్రశ్నలను భీష్మ, ద్రోణాచార్యులు అర్జునునిపై కురిపించిన శరాలా అనుకొన్నాడు విక్రం. తానుకూడ అర్జునునివలె ధైర్యంతో వాటికి సమాధానమిచ్చినాడు. అన్ని ప్రశ్నలైన పిమ్మట chairman thank you విక్రం. You can wait in your office అన్నాడు. విక్రం thanks అని అందరికి తెల్పి తన office లో కూర్చొని తన professor రాకకై నిరీక్షిస్తున్నాడు. పదిహేను నిమిషాల పిదప విక్రం office తలుపుకొట్టిన చప్పుడు కాగానే professor గారే అయివుంటారు యేమి news అనుకున్నాడు. professor లోనికి ప్రవేశించి విక్రంతో congratulations. You can go home and rest Doctor విక్రం అన్నాడు. Thank you Sir అని విక్రం కూడా ఆచార్యునితో బయటపడ్డాడు parking lot లోనున్న car start చేసి ప్రమదకు ఈ good news చెప్పాలన్న కుతూహలంతో యింటికి వచ్చినాడు. ప్రమద కూడ good news సా, bad news సా అనుకుంటు తలుపుతీసింది. విక్రం నవ్వుతూ లోనికి ప్రవేశించినాడు. I am a doctor now అన్నాడు ప్రమదను కౌగిలించుకొని. I am so glad everything is over now అంది ప్రమద. Your life aim is achieved అని లోనికి వెళ్లి దేవునికి దీపం ముట్టించి అగరుబత్తులను కాల్చింది. ప్రమదకు దేవుడంటె చాలనమ్మకము. యేకొద్ది కష్టమొచ్చినా దేవునికి దండం పెడుతుంది. స్వామి ఈ గండం నుండి గట్టెక్కిస్తే నీకు యిది చేస్తాను అది చేస్తాను అని మ్రొక్కుకుంటుంది. కాని విక్రం అలా కాదు. to begin with దేవుడున్నాడా అనేది అతని ప్రశ్న. ఉంటే ఈ సుఖదుఃఖాలెందుకు. ఈ రోగపీడన యెందుకు, ఈ బీద ధనికులు యెందుకు అని ప్రశ్నలు వేస్తాడు. ప్రమద దీనికి సమాధానం చెప్పదు. నాభక్తి నాది. నానమ్మకం నాది అంటుంది. విక్రం మాత్రం ఈ విగ్రహాలన్ని దేవుళ్లు కారు. ఈ సకలసృష్టికి మూలకారణమైన యేదో మహాశక్తివుంది. దానికి ఆకారంలేదు రూపంలేదు యేదిలేదు. అది ఒక mystery దానిని చూచినవారెవ్వరూ లేరు. ఇదంత అపోహ. దేవునిపేరుతో మతాలపేరుతో మారణహోమంగా మారుస్తున్నారీ జగత్తును. దేవుని పేరుతో కొందరు దోచుకొంటున్నారితర మానవులను అంటాడు విక్రం. ప్రమద మాత్రం మీనమ్మకం మీది మానమ్మకం మాది అంటూ రండి దేవునికి నమస్కరింతురు అని తీసుకువెళ్లింది. విక్రం కనులు మూసుకొని నీవున్నావో లేదో నాకు తెలియదు. లేవని నిర్ధారణ చేయలేను. ఉన్నావని నిరూపించనులేను. నీవే వుంటె నాకు

జ్ఞానాన్ని ప్రసాదించు దానికితోడు దీర్ఘాయువును ఆరోగ్యాన్ని ప్రసాదించు నాకు నా కుటుంబానికి అని కోరుకున్నాడు. ఇతని భక్తి యింతె వేరే దేవాలయాలకు యితడు వెళ్లడు ప్రతిరోజు తనలోతానె భగవంతుడు వుంటె నమస్కారాన్ని చేసి ఆయన ప్రార్థనను స్వీకరించమని కోరుతాడు Hindu philosophy పైన ఈయన ప్రగాఢ విశ్వాసముకాని దేవుడున్నాడా అనే సంశయము మాత్రము యితని నుండి తొలగిపోలేదు ప్రమద అనాడు చాల సంతోషంగ వుంది.

విక్రంకు Dean of the Arts & Sciences నుండి ఒక letter వచ్చింది. ఇది మొదటిసారి Dean యితనికి వ్రాసింది ఏముంటుందిలే యేవోపనికిరాని మాటలుంటావని అనుకొని letter తీసిచదివినాడు. Let me have the opportunity to call you first as doctor విక్రమసింహరావు అంటు నాకృషిని వర్ణిస్తు తుదకు hearty congratulations అని ఉంది ఓస్ ఇంతేనా అనుకున్నారు విక్రం. తెల్లవారి Duty కు పోగానే యితని తోడి graduate విద్యార్థులు professors అంతా congratulations అంటూ shakehand యిస్తు పలకరించినారు. అందరికి thanks అని బదులు పలికినాడు విక్రం. ఇప్పుడు యితనికి చేయుపనియులేదు. ఏమి చేసేది మునుముందు ఆలోచిస్తువుండగానే యితని professor లోనికి ప్రవేశించి విక్రం would you please come with me అన్నాడు sure అని విక్రం అతనితో నడచి అతని office లోకి వెళ్లినాడు. Before you get any regular job I have a post doctoral fellowship for you అన్నాడు విక్రం professor. Are you interested in it అన్నాడు professor. Sure sir అన్నాడు విక్రం. అయితె పని వివరాలు జీతం చెప్పి if these are acceptable then I will ask my sceretary to send you a regular contract అన్నాడు professor. O.K. అని కూర్చునే అన్నాడు విక్రం ఇద్దరూ తన కృషిని మాటాడుకుంటు కొంతకాలయాపన చేసినారు. పిమ్మట విక్రం thank you Sir అని లేచివెడలిపోయినాడు బయటికి నడుస్తు. ఎంతమంచివాడీ professor అనుకున్నాడు. నాకు శ్రమలేకుండనే నాకు job యిస్తున్నాడు అనుకున్నాడు. ఇప్పుడు విక్రంకు ఒకసమస్య పరిష్కారమైనది. Longrun planning చేయాలి అని library కి వెళ్లి ఇండియన్ పత్రికలను చూస్తున్నాడు. Times of India లో కొన్ని positions గురించి advertisements వున్నవి కాని అతడు యూనివర్సిటి position కే చూస్తున్నాడు. చూస్తుచూస్తుంటె ఒకపేజిలో ఒక యూనివర్సిటీకి reader పదవిలోకి అర్హుడైన వ్యక్తి తగిన క్వాలిఫికేషన్‌తో కావాలనివుంది. అది తనకు సరియైన పదవే అనుకొని తెల్లవారే ఒక దరఖాస్తు పంపుకొన్నాడు. ప్రమద అంది ఈ పదవి మీ I.A.S. పదవికన్న మంచిదా అని ప్రశ్నించింది. యేదో పోగానే పనిచేయుటకు బాగానే వుంటుంది పిమ్మట చూద్దాము అన్నాడు విక్రం. ఆ పదవికి ఒక ఉత్తరం application వ్రాస్తు ఆ vice chanceler కు post చేసినాడు. పిమ్మట దాని గురించె మరచిపోయినాడు. ఎందుకంటె ఇండియాలో ఈ పదవులు ఒట్టి దరఖాస్తులతో రావు. connections సిఫారుసులుంటెనే ఇండియాలో ఈ positions వస్తాయి. ప్రమద అన్న మాటనిజం రీడర్ position collector కన్న పెద్దదికాదు అయినా విక్రంకు academic life లో interest

వుంది కాబట్టి fresh Ph.D. కి యిది సరిపోతుంది అనుకొన్నాడు అందువల్లనే ఈ దరఖాస్తు పంపుకున్నాడు. ఇప్పుడు విక్రం professor post doctoral fellowship offer చేసినాడు. అందువల్ల ఈ reader పదవిని అంతగా పట్టించుకొనటములేదు ఇంటికివచ్చి ప్రమదతో ప్రమదా యివ్వాళ్ల నాకు post doctoral fellowship offer చేసినాడు మా professor. ప్రస్తుతము నాకు సరియైన ఉద్యోగము వచ్చేవరకు ఈ post doctoral fellowship బాగానే వుంటుందని ఒప్పుకొన్నాను. I hope you will agree with me అన్నాడు విక్రం. Yes I will agree with you అంది ప్రమద. What is the present you are giving me for this good news అంది ప్రమద. I already presented myself to you. You want more than this అన్నాడు విక్రం. ofcourse you are mine now and forever. But apart from this you should present me some other material things అంది ప్రమద. సరే రేపు నేను నిన్ను shopping center కు తీసుకువెడతాను. నీయిష్టమైంది కొనుక్కో అన్నాడు విక్రం Thanks for the offer అంది ప్రమద. ఇంతటితో వారి సంభాషణ ఆగిపోయింది అనుపమ్ డాడి I am happy for me buy a walkie talkie అన్నాడు Sure అనుపమ్ రేపు మీ అమ్మ నేను నీవు వెళ్లికొందాం తప్పకుండ నీకో చిన్న camera కూడ కొంటాను నాన్నా అన్నాడు విక్రం. అనుపమ్ గెంతులువేస్తు thank you నాన్నా అని తన friends తో చెప్పుకొనుటకని యేమొ గంతులువేస్తు బయటికి వెళ్లిపోయినాడు

విక్రంకు యిప్పుడు చదివే బాధలేదు. ఈ నాలుగేండ్లు అమెరికాలో బాగా కష్టపడి చదివినాడు. ఇప్పుడు దినమంత research చేసి సాయంకాలం ప్రమద అనుపమ్‌లతో గడుపుతుంటాడు. పరీక్షల బాధలు లేవు. చదివే బాధ్యతలేదు. Research అంటె పుస్తకాలు చదవవలె కాని వాటిని పరీక్షలకై కాదు. ఏదైన క్రొత్త material వుందా తన research కు పనికివచ్చేది అని చూచుటకే General పుస్తకాలు చదవడమంటే విక్రంకు చాల ఆసక్తి Research చదువుతూ bore అయినప్పుడు తనకు యిష్టమైన జనరల్ పుస్తకాలు recreationకై చదువుతువుంటాడు. ఏది యెటులైన విక్రం యిప్పుడు జీవితమాధుర్యాన్ని చవిచూస్తున్నాడు తనని గౌరవించి ప్రేమించిన భార్య తన dady తన సర్వస్వమను కొన్న చిన్నారి అనుపమ్ తనతో వున్నారు ఏ చీకుచింతలేదు. I.A.S. ఉద్యోగంలో authority power వుండేవిగాని వాటితో head aches కూడ వుండేవి. అప్పటి I.A.S. ఉద్యోగాలు యిప్పటి I.A.S. ఉద్యోగాలకంటె వందరెట్లు మేలు. అప్పుడు నెహ్రూ ప్రధాని ఈ చోటానాయకులకు అంత విలువ లేకుండెను I.A S. officers కు చాలా అధికారాలుండేవి. ఇప్పుడైతే politicians కు mafia కు పొత్తు కుదిరింది ప్రతిదానిలో ఈ రాజకీయవాదులు జోక్యము కల్గించుకొని I.A S. officers విలువలను తగ్గించివేసినారు. వీరు కూడ తమ లాభాలకై వారికి దాసోహం చేస్తువుంటారు చాలవరకు. కాని విక్రం I.A.S. గా వున్నప్పుడు ఈ వృత్తి ఇంత ఛండాలంగ లేకుండెను ఇప్పుడు I.A.S. ల సంఖ్య పెరిగింది వారి విలువకూడ తగ్గినవి ఇప్పుడు తెలివైనవాళ్లు I.A S. కు అంతగా ప్రాముఖ్యత యివ్వడములేదని వదంతి విక్రంవంటి యేకొద్దిమందో ఆనాడు

జ్ఞానాన్ని ప్రసాదించు దానికితోడు దీర్ఘాయువును ఆరోగ్యాన్ని ప్రసాదించు నాకు నా కుటుంబానికి అని కోరుకున్నాడు. ఇతని భక్తి యింతె వేరే దేవాలయాలకు యితడు వెళ్లడు. ప్రతిరోజు తనలోతానె భగవంతుడు వుంటె నమస్కారాన్ని చేసి అయన ప్రార్థనను స్వీకరించమని కోరుతాడు. Hindu philosophy పైన ఈయన ప్రగాఢ విశ్వాసముకాని దేవుడున్నాడా అనే సంశయము మాత్రము యితని నుండి తొలగిపోలేదు ప్రమద అనాడు చాల సంతోషంగ వుంది.

విక్రంకు Dean of the Arts & Sciences నుండి ఒక letter వచ్చింది. ఇది మొదటిసారి Dean యితనికి వ్రాసింది. ఏముంటుందిలే యేవోపనికిరాని మాటలుంటావని అనుకొని letter తీసిచదివినాడు. Let me have the opportunity to call you first as doctor విక్రమసింహారావు అంటు నాకృషిని వర్ణిస్తు తుదకు hearty congratulations అని ఉంది. ఓస్ ఇంతేనా అనుకున్నారు విక్రం. తెల్లవారి Duty కు పోగానే యితని తోడి graduate విద్యార్థులు professors అంతా congratulations అంటూ shakehand యిస్తు పలకరించినారు. అందరికి thanks అని బదులు పలికినాడు విక్రం. ఇప్పుడు యితనికి చేయుపనియులేదు. ఏమి చేసేది మునుముందు అలోచిస్తువుండగానే యితని professor లోనికి ప్రవేశించి విక్రం would you please come with me అన్నాడు sure అని విక్రం అతనితో నడచి అతని office లోకి వెళ్లినాడు. Before you get any regular job I have a post doctoral fellowship for you అన్నాడు విక్రం professor. Are you interested in it అన్నాడు professor. Sure sir అన్నాడు విక్రం. అయితె పని వివరాలు జీతం చెప్పి if these are acceptable then I will ask my sceretary to send you a regular contract అన్నాడు professor. O.K. అని కూర్చునే అన్నాడు విక్రం. ఇద్దరూ తన కృషిని మాటాడుకుంటు కొంతకాలయాపన చేసినారు. పిమ్మట విక్రం thank you Sir అని లేచివెడలిపోయినాడు బయటికి నడుస్తు ఎంతమంచివాడీ professor అనుకున్నాడు. నాకు శ్రమలేకుండనే నాకు job యిస్తున్నాడు అనుకున్నాడు. ఇప్పుడు విక్రంకు ఒకసమస్య పరిష్కారమైనది. Longrun planning చేయాలి అని library కి వెళ్లి ఇండియన్ పత్రికలను చూస్తున్నాడు. Times of India లో కొన్ని positions గురించి advertisements వున్నవి కాని అతడు యూనివర్సిటి position కే చూస్తున్నాడు. చూస్తుచూస్తుంటె ఒకపేజిలో ఒక యూనివర్సిటీకి reader పదవిలోకి అర్హుడైన వ్యక్తి తగిన క్వాలిఫికేషన్‌తో కావాలనివుంది. అది తనకు సరియైన పదవే అనుకొని తెల్లవారే ఒక దరఖాస్తు పంపుకొన్నాడు. ప్రమద అంది ఈ పదవి మీ I.A.S. పదవికన్న మంచిదా అని ప్రశ్నించింది. యేదో పోగానే పనిచేయుటకు బాగానే వుంటుంది పిమ్మట చూద్దాము అన్నాడు విక్రం. ఆ పదవికి ఒక ఉత్తరం application వ్రాస్తు ఆ vice chanceler కు post చేసినాడు పిమ్మట దాని గురించె మరచిపోయినాడు. ఎందుకంటె ఇండియాలో ఈ పదవులు ఒట్టి దరఖాస్తులతో రావు. connections సిఫారుసులుంటెనే ఇండియాలో ఈ positions వస్తాయి. ప్రమద అన్న మాటనిజం రీడర్ position collector కన్న పెద్దదికాదు. అయినా విక్రంకు academic life లో interest

వుంది కాబట్టి fresh Ph D. కి యిది సరిపోతుంది అనుకొన్నాడు. అందువల్లనే ఈ దరఖాస్తు పంపుకున్నాడు ఇప్పుడు విక్రం professor post doctoral fellowship offer చేసినాడు. అందువల్ల ఈ reader పదవిని అంతగా పట్టించుకొనటములేదు. ఇంటికివచ్చి ప్రమదతో ప్రమదా యివ్వాళ్ల నాకు post doctoral fellowship offer చేసినాడు మా professor. ప్రస్తుతము నాకు సరియైన ఉద్యోగము వచ్చేవరకు ఈ post doctoral fellowship బాగానే వుంటుందని ఒప్పుకొన్నాను. I hope you will agree with me అన్నాడు విక్రం. Yes I will agree with you అంది ప్రమద What is the present you are giving me for this good news అంది ప్రమద. I already presented myself to you. You want more than this అన్నాడు విక్రం. ofcourse you are mine now and forever. But apart from this you should present me some other material things అంది ప్రమద. సరే రేపు నేను నిన్ను shopping center కు తీసుకువెడతాను. నీయిష్టమైంది కొనుక్కో అన్నాడు విక్రం. Thanks for the offer అంది ప్రమద. ఇంతటితో వారి సంభాషణ ఆగిపోయింది. అనుపమ్ డాడి I am happy for me buy a walkie talkie అన్నాడు. Sure అనుపమ్ రేపు మీ అమ్మ నేను నీవు వెళ్లికొందాం తప్పకుండ నీకో చిన్న camera కూడ కొంటాను నాన్నా అన్నాడు విక్రం. అనుపమ్ గెంతులువేస్తు thank you నాన్నా అని తన friends తో చెప్పుకొనుటకని యేమొ గంతులువేస్తు బయటికి వెళ్లిపోయినాడు.

విక్రంకు యిప్పుడు చదివే బాధలేదు. ఈ నాలుగేండ్లు అమెరికాలో బాగా కష్టపడి చదివినాడు ఇప్పుడు దినమంత research చేసి సాయంకాలం ప్రమద అనుపమ్‌లతో గడుపుతుంటాడు. పరీక్షల బాధలు లేవు. చదివే బాధ్యతలేదు. Research అంటె పుస్తకాలు చదవవలె కాని వాటిని పరీక్షలకై కాదు. ఏదైన కొత్త material వుందా తన research కు పనికివచ్చేది అని చూచుటకే General పుస్తకాలు చదవడమంటే విక్రంకు చాల ఆసక్తి. Research చదువుతూ bore అయినప్పుడు తనకు యిష్టమైన జనరల్ పుస్తకాలు recreationకై చదువుతువుంటాడు. ఏది యెటులైన విక్రం యిప్పుడు జీవితమాధుర్యాన్ని చవిచూస్తున్నాడు తనని గౌరవించి ప్రేమించిన భార్య తన dady తన సర్వస్వమును కొన్న చిన్నారి అనుపమ్ తనతో వున్నారు ఏ చీకుచింతలేదు I.A.S. ఉద్యోగంలో authority power వుండేవిగాని వాటితో head aches కూడ వుండేవి అప్పటి I.A.S. ఉద్యోగాలు యిప్పటి I.A.S. ఉద్యోగాలకంటె వందరెట్లు మేలు అప్పుడు నెహ్రూ ప్రధాని ఈ చోటానాయకులకు అంత విలువ లేకుండెను I.A S. officers కు చాలా అధికారాలుండేవి. ఇప్పుడైతే politicians కు mafia కు పొత్తు కుదిరింది. ప్రతిదానిలో ఈ రాజకీయవాదులు జోక్యము కల్గించుకొని I.A S. officers విలువలను తగ్గించివేసినారు. వీరు కూడ తమ లాభాలకై వారికి దాసోహం చేస్తువుంటారు చాలవరకు. కాని విక్రం I.A.S. గా వున్నప్పుడు ఈ వృత్తి ఇంత ఛండాలంగ లేకుండెను ఇప్పుడు I.A.S. ల సంఖ్య పెరిగింది వారి విలువకూడ తగ్గినవి. ఇప్పుడు తెలివైనవాళ్లు I A.S. కు అంతగా ప్రాముఖ్యత యివ్వడములేదని వదంతి. విక్రంవంటి యేకొద్దిమందో ఆనాడు

I.A.S. కు స్వస్తిచెప్పి Ph.D. కి వచ్చేవారు పిచ్చివారని అనుకొనని వారులేరు. ఎందువల్లనంటె ఆనాడు I.A.S. అంటె ఒక రాజరీవి. అందుకే ప్రమదకు విక్రం I.A.S. ఉద్యోగం విడిచి అమెరికాకు రావడం యిష్టం లేకుండె. కాని భర్త అభీష్టమే తన అభీష్టమనుకొని భర్తననుసరించి వచ్చిన భారతనారీమణి ఈమె. చదువుకున్నది సాంప్రదాయమైన కుటుంబ ఆడబడుచు, అందానికి ఆమెకు ఆమెయే సాటి. ఆనాడు ఆమె నిజాం కళాశాలలో చదువుచున్నప్పుడు ఎందరో నవనాగరికతగల యువకులు ఈమె అందాన్ని గురించి మాటాడుకునేవారు. ఈమెను యెంతమందో తనదానినిగా చేసుకొనాలి అనుకున్నారో కాని ఈమె వరించింది విక్రంను. అందుకే marriages are made in heaven అన్నారు కొందరు.

విక్రం యిప్పుడు తన professor project మీద రిసర్చ్ చేస్తున్నాడు. భారతదేశంవలె ప్రతిమాటకు research fellows ను పిలిచి యేవో పనిలేని ప్రశ్నలు వేయరు. ఇన్‌స్ట్రక్షన్స్ అంతకన్నా యివ్వరు. అమెరికాలో నీ బాధ్యతలను నీవు నిర్వర్తిస్తున్నప్పుడు వారు నిన్ను మందలించరు. అందరి బాధ్యతలు వారు సక్రమంగ నిర్వర్తిస్తుంటారు అట్లు నిర్వర్తించనినాడు మంచి మాటలతో మందలించి మీరు వేరే చూసుకొండి అని మర్యాదగ చెప్పి పంపిస్తారు. ఈ ఘట్టాలు అమెరికన్ అకడమిక్ ప్రపంచంలో చాల తక్కువ. ఈదేశంలో చిన్న పెద్ద అనే positions బట్టి భేదాలుండవని యిదివరకే వివరించినాను కదా. ఒక జానీటర్ ఒక professor తో చెలిమిగా వుండవచ్చు అంతేకాదు first name తో పిలువవచ్చు. వాడు పని చేసినప్పుడు జానీటరు అనుకొనవలె. official dinners లో వాడుకూడ సూటువేసి మనతోటే భోంచేస్తాడు. తెలిసినవారికే యితడు జానీటర్ అని అనుకొంటారు. తెలియనివారు యితడు కూడా ఒక ప్రొఫెసరే కావచ్చునని అనుకొనే పరిస్థితులో వుంటారు. నిజమైన ప్రజాస్వామ్యమంటె అమెరికాలోనే వుందనుకుంటాడు విక్రం. మన భారతదేశంలో ప్రజాస్వామ్యము పేరుకే. ఇంకా officesలో చెప్రాసి, Attender, Ldc., Udc. మరి యింక యెన్నియో మెట్లు. చప్రాసి నిజంగ అందరికి లొంగి వుండవలె udc officer గదిలోకి వెళ్లినప్పుడు చెప్పులు బయటవిడిచివెళ్లవలె. officer ముందు నిలుచుండాలి. సమస్కులైనవారినే కూర్చోమంటారు. ఏవైన మీటింగ్స్ అయినప్పుడు గుమాస్తా ఉద్యోగాలు చేసేవారంత చిన్నతరహా officers తో నేలపైన కూర్చోవలె. పెద్ద officers అంతా కుర్చీలపై కూర్చుంటారు. ఇది మన ప్రజాస్వామ్యము. మరి సమానత్వము. మనవద్ద కులాలు, మతాలు, పెద్ద చిన్నల తారతమ్యాలకు చాల పట్టింపు. అయినా మనది democracy. కాని అమెరికాలో యెవడూ పెద్దకాడు, యెవడు చిన్నకాడు. తన శక్తినిబట్టి తన ఉద్యోగ ధర్మాలను నిర్వర్తిస్తారు ఒకసారి office నుండి బయటపడ్డారంటె అందరు సమానులే యిక్కడ నిజమైన ప్రజాస్వామ్యము వుందని చెప్పటకు ఏమాత్రము శంకించవలసిన అవసరములేదు. ఈ దేశములో capitalism ఆర్థిక విధానము. ఎవడైన ఆకాశాన్ని అందుకొనవచ్చు. నీశక్తి తెలివి పట్టుదలతో నీవు పైకి రాగలవు. చాలమంది ప్రపంచ ప్రఖ్యాతికెక్కిన అమెరికన్‌లు ప్రారంభంలో సామాన్యులువారి కృషి తపస్సువలన వారు పైకి వచ్చి ప్రపంచ ఖ్యాతిని గడించినారు. దీనికి యెన్నియో ఉదాహరణాలు

వున్నవి. వీరి కృషివల్లనే కార్లు Mass scale లో తయారుచేసి ప్రతి పౌరుడు కారుకొనే వాతావరణాన్ని సృష్టించినాడు Ford మహాశయుడు. అతడు ఒకసామాన్య auto mechanic జీవితంలో. పిమ్మట White brothers వాయు విమానాన్ని కనిపెట్టినారు. ఈ విధంగా వందలాది అమెరికన్‌లు తన స్వయంశక్తితో కార్యదీక్షతో ప్రపంచంలో పేరు సంపాదించినారు. ఈ దేశంలో కష్టపడ్డవాడు యెప్పటికైన పైకిపోయే అవకాశముంది. విక్రం ఇప్పుడు యిక్కడే వుండిపోవాల లేక మాతృదేశం వెళ్లిపోవలెనా అని ఆలోచిస్తున్నాడు. ప్రమద అభిప్రాయాన్ని ఈయన అడిగినాడు. మీకు యెచ్చట యిష్టం వుంటె అచ్చటే వుండండి. భార్యగా తల్లిగా నేను మీ యిద్దరితోనే వుండిపోతాను అని జవాబు చెప్పేది. అందుకే ఈ నిర్ధారణ బాధ్యత తనపైననే వుంది. తండ్రి ధర్మారావు తల్లి శ్రీలత తన పెద్దకుమారుడు దేశం తిరిగి వస్తాడని అనుకుంటున్నారు. ఎప్పుడు వచ్చేది వారికి తెలియదు. రఘునాధరాయలు మాత్రము ప్రమదకు తమదేశం తిరిగి వస్తే బాగుంటుందని ఉత్తరాలలో వ్రాసేది. ఆ ఉత్తరాలను ఆమె విక్రంకు యిచ్చేది. దానితో ఆమె బాధ్యత తీరిపోయిందని అనుకునేది.

అమెరికాలో jobs కావాలంటె రెండు విధాలుగా పొందవచ్చు. ఒకటి తన qualifications వి సంస్థలకు కావలెనో చూసి అన్నింటికి దరఖాస్తులు పంపుకొనవలె. లేదా యిచ్చట private employment agency లు వుంటాయి వాటికి వ్రాసి తమ అర్హతలను పంపుకొనవలె. వీరు మన అర్హతలుగల వ్యక్తి కావలసిన వారితో సంప్రదించి మనకు వ్రాస్తారు లేదా టెలిఫోను చేస్తారు. మనకు ఈ సంస్థల కృషివల్ల job వస్తే కొంత డబ్బు వాళ్ల కృషికి ఫలితంగ మనము ముట్టజెప్పవలె. job రానిచో యేమియిచ్చేది వుండదు. విక్రం professor కొన్ని విశ్వవిద్యాలయాలకు విక్రం గురించి వ్రాసినాడు. కొంతమంది విక్రంకు టెలిఫోన్ చేసి మాట్లాడినారు. కాని విక్రంకు ఇదంత కొత్తకాబట్టి అంత చాకచక్యంగ మెలగలేదు. అందువల్ల ఈ private agencies లకు తన అర్హత పత్రాలను పంపుకున్నాడు. రెండు వారాలలో యెన్నియో కళాశాలలు విశ్వవిద్యాలయాలు వీరిని పిలిచి ఇంటర్‌వ్యూకు రమ్మన్నారు. కాని యివి యెచ్చటనున్నవి యెటువంటి విశ్వవిద్యాలయాలు వీటిని గురించి యితనికి తెలియవు. ఇప్పుడు post doctoral fellowship వుంది కాబట్టి ప్రతిదీ easy గా తీసుకుంటున్నాడు ఇక్కడ వుండిపోవాలని అనుకుంటె regular job వెతకవలసిందని అనుకుంటున్నాడు విక్రం యేపనియైన చాల ఆలోచించి చేస్తాడు decision తీసుకొని కూడా immediate గా implement చేయడు. ఎంత time యిస్తే అంతమంచిదని ఇతని విశ్వాసము. అందువలన job search లో అంతగా నిమగ్నుడై లేడు.

ఉంటు వుంటుంటె post doctoral Fellowship పైన కొన్ని నెలలు గడచినవి. ఇక regular position కు ప్రయత్నించుటకు సమయమాసన్నమైనదని భావించినాడు విక్రం. అందుకే కొన్ని University departments కు applications పంపుకొన్నాడు. అమెరికాలో లేవు అని యెప్పుడూ వ్రాయరు తమ జవాబులో. జవాబు మాత్రము తప్పక యిస్తారు ఆ జవాబులో చాల polite గా ప్రస్తుతానికి యేమిలేవు భవిష్యత్‌లో యేమైన positions వెలువడితే మీకు తెల్పుతాము. Good luck

in your search అని వ్రాస్తారు. అంటె లేవు మాదగ్గర అని అర్థము. కాని మనదేశస్తులు మొదటిసారి ఈ ఉత్తరాలను చదివినప్పుడు యింక ఆశ వుందనే భావిస్తారు. వీరి ఉత్తరాల జవాబులు అలాగ వుంటాయి. మనదేశంలో advertise చేయని పదవులకు దరఖాస్తులు యెవరూ పంపరు. Advertise అయినవాటికి కూడ నిర్ణీతమైన ఫారములలో ఫీసుతో సహా లెక్కలేనన్ని సర్టిఫికెట్లతో పంపమంటారు. పంపిన పిదప వాటికి జవాబు వుండదు. మెరిట్ మీద ఉద్యోగాలు దొరికేది చాలకష్టమైన పని. కాని ఈదేశంలో మెరిట్ లేంది ఉద్యోగాలు దొరకుట కష్టము. ఇచ్చట కూడ connections తో చాలమంది ఉద్యోగాలు సంపాదించుకుంటారు. కాని మనదేశంలో ఉన్నంతగా కాదు. మనదేశంలో అకాలంలో ప్రభుత్వ ఉద్యోగాలు తప్ప వేరే ఉద్యోగాలు లేనందువల్ల అన్ని ఉద్యోగాలు చాలమట్టుకు connections పైననే లభించేది. కాని ఇచ్చట మెరిట్ లేంది ప్రైవేటు సంస్థలలో ఉద్యోగాలు లభించుట కష్టము. విక్రంకు యింకా ఈ విషయంలో అనుభవము లేదు. కొన్ని ముఖ్యమైన Universities నుండి polite ఉత్తరాలు లేవని వచ్చినవి. రెండు మూడు universities కొంచెం ఆశాజనకంగా వ్రాసినవి. ఒకటి మాత్రము మీ impressive credential చూసిన పిమ్మట మేము మిమ్ములను interview కు పిలవాలనుకుంటున్నాము. త్వరలోనే మిమ్ములను contact చేయగలమని వ్రాసినారు. దీనిని ప్రమదకు చూపించినాడు. ఆమె కూడ సంతోషపడింది. ఇక యీ university యెలా వుంటుందో తెలుసుకొనుటకు విక్రం ప్రయత్నిస్తున్నాడు. అన్ని తెలుసుకున్న తరువాత మంచి university అనియే తేలింది. కాని చలి Harvard కన్నా యెక్కువ వుంటుందని తెలిసింది

ఈ యూనివర్సిటీ మిన్నానోటా అనె state లో ఉంది. ఇది స్టేట్ university. విద్యార్థుల సంఖ్య నలభైవేల వరకు వుంటుందని తెలిసింది సరే interview కు వెళ్లినప్పుడు అన్ని సంగతులు చూడవచ్చు అనుకున్నాడు. ఈ interview రాకముందే మరికొన్ని interview లకు పిలుపు వచ్చింది అనుభవము లేదు అంతా కొత్త కాబట్టి చుట్టుప్రక్కల వున్న సమీపస్థలాలలో car లో వెళ్లిచూసినాడు దూరప్రదేశాలకు విమానములో ప్రయాణించి చూచినాడు. ఆ దేశంలో interview కు రమ్మంటె మేము హోటలు మరి విమానపు ఖర్చులను యిస్తామన్న మాటె. విక్రంకు యే తేది convenient గా వుంటుందో తెల్పుమని మిన్ననోట యూనివర్సిటీ వాళ్లు ఉత్తరం వ్రాసినారు ఆ వుత్తరం విక్రం ప్రమదలు చదువుకొని యే తేది అనుకూలమో నిర్ణయించి వారికి తెల్పినారు. ప్రమద అనుపంలు ఆక్సుఫోర్డులోనె వుంటున్నారు. విక్రం మాత్రం ఒకనాడు మొదలు సాయంకాలం అక్కడికి చేరి మరునాడు వారితో కలిసి మాట్లాడి ఆనాడు సాయంకాలమే బయలుదేరి ఆక్సుఫోర్డుకు చేరుకుంటున్నాడు. అనుకున్న ప్రకారము విక్రం మినియాపొలిస్ పట్టణము చేరుకున్నాడు. వాళ్లు నిర్ణయించిన హోటలులో విక్రం బస. యేర్‌పోర్టుకు ఆ department ప్రతినిధి వచ్చి విక్రంను కలిసి అతనికి చేసిన ఏర్పాట్లు అన్నీ తెల్పి విక్రంను అతని కారులో ఆ హోటల్ గదిలో విడచి మళ్లీ తెల్లవారి ఎనిమిది గంటలకు వస్తానని వెళ్లిపోయినాడు. విక్రం ఆరాత్రి ఆ హోటలులో గడిపి తెల్లవారి ఆరు గంటలకు లేచి స్నానం చేసి

breakfast తీసుకొని సిద్ధంగా వున్నాడు university కి వెళ్లుటకు. అన్న ప్రకారము సరిగ్గ ఎనిమిది గంటలకు ఆ department representative విక్రం హోటల్ గది తలుపుపైన knock చేసినాడు. తలుపుతీయగానే నిన్న వస్తానన్న వ్యక్తిని విక్రం చూసాడు తను సిద్ధంగ వున్నాడు కాబట్టి brief case ను తీసుకొని అతని వెంబడి నడిచినాడు. ఇద్దరూ మాటాడుకుంటు పార్కింగ్‌లాటులోకి వెళ్లి ఆ వచ్చిన వ్యక్తి కారులో university ఆవరణలోనికి వెళ్లినారు. కారుని ఆపి యిద్దరు బిల్డింగ్‌లోకి నడచి ప్రవేశించినారు. ప్రవేశించి యెలివేటర్‌లో రెండవ అంతస్తుకు వెళ్లి అచ్చట యెలివేటరు దిగి department head office లోకి వెళ్లినారు. విక్రంతోనున్న వ్యక్తి head of the Dept. తో వీరు Dr. విక్రంసింహారావు అని పరిచయం చేసినాడు ఆ head of the Dept. విక్రంతో కరచాలనము చేసి please have a chair అన్నాడు విక్రం thank you అని కూర్చున్నాడు. ఆ head యెట్లా వుండె మీ ప్రయాణము అని మెల్లమెల్లగా యితని వృత్తాంతమంత మెల్లగా అడిగి తెలుసుకున్నాడు. పిమ్మట మళ్లి మీరు అడ్మినిస్ట్రేటివ్ service నుండి యెందుకు వైదొలిగినారు అన్నాడు నాకు మొదటినుండి academic జీవితమంటెనే యిష్టము. కాని అవకాశాలు లభించునంతవరకు వేచియున్నాను అన్నాడు విక్రం. ఈ సమాధానంతో తృప్తిపడి వేరే ప్రశ్నలు తన interested area లో వేసినాడు. వాటిన్నింటికి విక్రం సమాధానమునిచ్చినాడు. ఒక గంటవరకు విక్రం ఈ Head of the Dept. తో గడపిన పిమ్మట విక్రంను యిచటికి తీసుకొని వచ్చిన మనిషి మళ్లీ ఈ గదిలోకి ప్రవేశించి విక్రంను వేరేవారితో కూడ కలవవలయును అని తీసుకవెళ్లినాడు ఈ Dept. ను చూడాలని మీరు మళ్లీ రమ్మంటారా అన్నాడు ఆ head of the Dept. తో. నేను lunch ఇతనితోనే చేస్తాను లంచ్‌కు Dr. Rao (విక్రం)ను యిచ్చటికే తీసుకొని రమ్ము అన్నాడు సరేనని ఆ వ్యక్తి విక్రంను తీసుకొని గది బయటికి వెళ్లినాడు త్రోవలో ఒక యిద్దరు ప్రొఫెసర్లను విక్రంకు పరిచయం చేస్తు క్యాంపస్ చూచుటకు బయలుదేరినారు. క్యాంపస్ అంత యిద్దరు కలిసి ఒక గంటసేపు తిరిగి చూచినారు అన్ని బిల్డింగ్స్ విషయమై. Mr. Brooks తెలిపినాడు అది agronomy యిది Mechanical యింజనీరింగ్ యిది computor science అని చెప్పుతు క్యాంపస్ అంత చూచి పిమ్మట Head of the dept. తో lunch చేయుటకు వచ్చినారు. వీరిరాకకై నిరీక్షిస్తున్న Head of the Dept. Dr. Norton Brooks మరి విక్రంతో కలసి students union కు వెళ్లి lunch చేసినారు. ఇక్కడ లంచ్ breakfast dinner అన్నీ buffet అన్నమాట అంటె వంటలన్ని అద్దం frame లలో ఉడుకుడుకుగా వుంటాయి ఒకవరుసలో అన్ని అమర్చివుంటాయి ఏది కావలసినవారు అవి తీసుకొని వరుస ఆఖరులో కౌంటర్‌వద్ద ఒక మనిషికి ఎంత అయ్యింది మిషన్ చెప్పగానే అంత మనము చెల్లించి ఆ విశాలమైన హాల్‌లో యెచ్చటో అచ్చట కూర్చీలను చూచి కూర్చొని ఆ టేబుల్‌పైన భోంచేయాలి. అచ్చట విద్యార్థులు ఆచార్యులు అనే భేదాలు వుండవు అయినా గుర్తున్నవాళ్లతో సామాన్యంగ కలసి భోంచేస్తారు. గుర్తులేనివారు కూడ ఒకటేబుల్‌పై కూర్చొనివున్నారు కాబట్టి ఒకరినొకరు పరిచయం చేసుకొని యేదో అది మాటాడుకుంటు కూర్చొని

భోంచేస్తారు. విక్రం డా॥ నార్టన్ మరి Mr. బ్రూక్స్ వరుసగా క్యూలో నిలబడ్డారు. వారికి ఇష్టమొచ్చినవి ట్రేలో పెట్టుకున్నారు. మొత్తం బిల్ మాత్రం డా॥ నార్టన్ చెల్లించినాడు. పిమ్మట ముగ్గురు ఒకమూలకు ఖాళీగానున్న టేబుల్ పై కూర్చొని మాటాడుకుంటు భోంచేసినారు ఈ భోజన సమయంలో కూడ Dr. Norton విక్రంతో మరికొన్ని విషయాలను అడిగి తెలుసుకొన్నాడు. అమెరికాలో మనదేశంవలె formal interview ఒకరూంలో వుండదు. వీళ్ళు candidate ని అన్ని విధాలుగా పరీక్షిస్తారు. భార్యపిల్లల విషయమై కూడ తెలుసుకొంటారు. ఎందుకంటె ఇది వీరికి ముఖ్యము. కుటుంబ గొడవలుంటె పనిసరిగ్గా పని నడవదని వీరికి తెలుసు. క్యాండిడెట్ యెంత ముఖ్యమో క్యాండిడేట్ family కూడ అంత ముఖ్యము వీరికి. తిన్న తరువాత ముగ్గురు Head office కు వచ్చినారు. Dr. Norton మరి విక్రములు యిద్దరే వున్నారు. Norton విక్రంకు యిచ్చె మొత్తము బాధ్యతలు తెల్పి సరే formal contract మా ప్రెసిడెంట్‌తో మాటాడి మేలులో పంపుతాము. Hope you will have a fruitful career with us అని వీడ్కోలు చెప్పి Mr. Brookes పిలిచి వీరిని హోటలునుండి యేర్‌పోర్టుకు తీసుకువెళ్ళు అని చెప్పి విక్రంను Brooks ను తలుపు బయటివరకు వచ్చి సాగనంపినాడు. Mr. Brooks విక్రం హోటల్‌కు వచ్చినారు. విక్రం తనసామాను సర్దుకొని suitcase తో Mr. Brooks ను వెంబడించాడు. Brooks విక్రంను air port లో వదలి సెలవు తీసుకొని వెళ్లిపోయినాడు. విక్రం ప్లేను అరగంటలో మినియా పిలిస్ విమానాశ్రయం నుండి బయలుదేరి రాత్రి ఎనిమిది గంటలకు న్యూయార్క్ విమానాశ్రయ నికి చేరుకుంది. అచ్చటినుండి Boston plane తీసుకొని విక్రం Boston చేరుకున్నాడు. Boston లో ప్రమద అనుపమ్ విక్రంకు స్వాగతం పలికినారు. విక్రం తన కుటుంబ సభ్యులను చూచి చాల సంతసించినాడు. ముగ్గురు కలిసి oxford లోని తన బసకు చేరుకున్నారు. కారులో మినియాపిలిస్‌లో జరిగినదంతా చెప్పినాడు విక్రం ప్రమదతో. ఈ position ఒప్పుకుంటే బాగానే వుంటుంది. పరిశుభ్రమైన సిటి. మనదేశస్తులు చాలమంది వున్నారు. Boston కన్న పెద్ద పట్టణమనుకుంట. ఇచ్చటివారు స్నేహశీలురు. మంచివారుగా నున్నారు. అందుకే నీకిష్టమయితే మనము అచటికి వెడదాము. Harward, Prinston Yale అని కూర్చుంటె కాదు. వీటి సమానము కాకపోవచ్చు కాని వీటికి తీసిపోకుండ వుంది అన్నాడు విక్రం. సరే మీయిష్టప్రకారమే కానివ్వండి అంది ప్రమద.

విక్రం యిప్పుడు తన research మీద అంత యెక్కువగా concentrate చేయడములేదు. వచ్చే september లో ఈ fellowship కు స్వస్తి చెబుతామని అనుకుంటున్నాడు అయితె మిన్ననోటా యూనివర్సిటీ కంట్రాక్టు వస్తే తన professor తో ఈ విషయము ప్రస్తావించాలని అనుకుంటున్నాడు వాళ్ల contract కు యెదురుచూస్తూ తోచినకాడికి తన research ను చేస్తున్నాడు. ఒకటి రెండు papers పబ్లిష్ చేయవచ్చుననుకుంటున్నాడు. యింతవరకు చేసిన research work తో. ఒకనాడు మిన్ననోటా యూనివర్సిటి నుండి ఉత్తరం కంట్రాక్టు వచ్చింది. విక్రం ఆ head తో మాటాడినవన్ని అందులోనున్నవి. salary కూడ సం॥ యింత

అని వుంది. ఈ post doctoral fellowship కంటె చాల మెరుగ్గా వుంది. అది ప్రమదకు చూపించి అమెతో ఏమంటావు సంతకం చేసి పంపనా అన్నాడు. తప్పకుండ చేసి పంపండి అంది ప్రమద. ఈ దేశంలో యెచ్చటున్న మనకేమి వ్యత్యాసముండబోదు ఒకసారి స్వదేశాన్ని విడిచినప్పుడు యెచ్చటనున్న ఒకటేకాని నాలుగు సంవత్సరాలు హార్వార్డు వాతావరణంలో వున్న పిమ్మట కొంచెము కష్టమే అనుకొంది. ప్రత్యేకంగ అనుపమ్ తన friends నంత వీడాలి. వానికేకాదు మనకు కూడ కష్టమే కాని విధిలేదు. హార్వార్డులో మీకు నచ్చే positions యివ్వరు కదా అంది ప్రమద. అవును ప్రమద నీతో నేను ఏకీభవిస్తాను. ఇంత enjoyment మనకు వేరేచోట బహూశః దొరకకపోవచ్చు అన్నాడు విక్రం. ఇదంత వింటున్న అనుపమ్ తండ్రిని కౌగిలించుకొని dady నేను స్నేహితులను వీడగలను but I feel sorry for mother అన్నాడు. అవునా నాన్నా అంది ప్రమద అనుపమ్‌ను హత్తుకొని ముద్దుల వర్షం కురిపించుకుంటు. ఇది జరిగిన కొద్దిసేపటికే అనుపమ్ dady don't forget my walki talki అన్నాడు. అమ్మ వీడు అసాధ్యుడే అని నవ్వుకున్నారు ప్రమద విక్రంలు. ఇవ్వాళ విక్రం ప్రమద అనుపమ్‌లకు ఒక పర్వదినము. వీరి అమెరికా జీవితానికి పునాదిరాయి ఈ మిన్ననోటా యూనివర్సిటీ job offer. ఇంతవరకు భారతీయులు చదువులకు వచ్చి అవి ముగియగానే మరలి భారతదేశం పోవలసిందె కాని 1965 లో కొత్తచట్టం ప్రకారం IIIrd preference అనేదానితో వీరు ఈదేశంలో permanent residency ని చేపట్టవచ్చు అంటె వీరు green card holders కావచ్చు. ఇప్పుడు వీరు మాత్రం student visa పైననున్నారు. విక్రం F1 visa మరి ప్రమద అనుపంలు F2 visa లపైన వున్నారు. ఈ వీసానె యింకా పదునెనిమిది నెలలు పొడిగించవచ్చు. పిమ్మట immigration visa కన్న లేక H లేద మరేదైనా వీసాకై వీళ్లు apply చేయాలి. దీనికి యెన్నియో formalities పూర్తి చేయాలి. అయినా మనదేశంలో వున్నన్ని అడ్డంకులు ఆటంకాలు వుండవు. విక్రంకు ఈ వీసా విషయమై భయంగానే వుంది. సరే మొదలు job తీసుకొని పిమ్మట ఆలోచిద్దాము అనుకొన్నాడు. ఈ విషయమై మిన్ననోటా university అధికారులతో ప్రస్తావించినాడు. దానికై మీరంత భయపడవలసిన అవసరము లేదు. మేము దానికై ప్రయత్నిస్తాము. మీరు పనిలో నిశ్చింతగా చేరండి అని అన్నారు. ఆ ధైర్యం విక్రంకు వుంది. అందువలన salary విషయములో వాళ్లు యిచ్చింది సరే అన్నాడు. ఆ వచ్చిన contract sign చేసి ప్రమద చేతులతో post చేయించినాడు. ఇప్పుడు తన professor కు తెల్పాలి పిమ్మట august లో బసమార్చాలి. తెల్లవారె professor secretary కి phone చేసి appointment తీసుకొన్నాడు. తన contract copy ని తీసుకొని professor తో కలసినాడు. professor కు ఆ ప్రతి నిచ్చినాడు. professor అమితానందంతో hearty congratulations అన్నాడు. మిన్నినోటా యునివర్సిటీ మంచి యునివర్సిటి. I am happy for you అన్నాడు professor. Thank you అన్నాడు విక్రం. నీకేమైన నా సహాయం అవసరమైతే don't hesitate. Good luck God speed అని లేచి కరచాలనం చేసినాడు professor. విక్రం నిలుచుండె we can publish two papers out

of my work sir అన్నాడు. Is that right. I am very happy for you Vikram అన్నాడు professor. Thank you very much sir, I will always remember your kind help and guidence అని గదిలో నుంచి బయలుదేరినాడు విక్రం. professor కూడ గది అవలివరకు సాగనంపి మరోసారి Good luck చెప్పి కరచాలన చేసి గదిలోకి పోయినాడు. అబ్బ ఒక ముఖ్యమైన పని అయిపోయింది అన్నాడు విక్రం ప్రమదతో. ఇక ఈనాటి నుండి మన సామానంత అమ్మేది అమ్మి కావలసినవి తీసుకొని వెడదాము అన్నాడు విక్రం ప్రమదతో. మీరు ఈ విషయమై నిశ్చింతగా వుండమని మరునాటినుండె సామాను అమ్ముట మొదలుపెట్టింది Air conditioner September లో వీరుపోగా తీసుకుపోయే కరారుతో అమ్మివేసింది. పిమ్మట T.V. ఇంక చిల్లర సామానులన్ని అమ్మివేసింది. ఇక బట్టలు అన్ని pack చేస్తుంది వీటిని movers తో పంపవచ్చు. ఇక మిగిలినవి కారులో సర్దుకోవచ్చు అనుకుంది. పుస్తకాలు చిన్న card board డబ్బాలలో సర్ది tape చేసింది. అగష్టు 15వరకు కారులో తరలుటకు సన్నాహాలు జరుగుతున్నవి. టెలిఫోనులో అచ్చటి real estate వారితో మాట్లాడి యూనివర్సిటీ దగ్గరగా ఒక Apt. two bed rooms ది మాటాడింది ప్రమద విక్రం Dept వాళ్లతో దానిని చూచి రమ్మని కోరినాడు అది convenient గా వుంటుంది ఇష్టం కాకపోతే వేరేది చూడవచ్చు. మీరు రండి మీకు మేము సహాయపడతామన్నట్లు కొంతమంది విక్రం colleagues మాటాడినారు. ఇది చాలా ఆశాజనకంగ తోచింది విక్రంకు. ప్రమద ఈ విషయమై యేమీ చింతించలేదు. ఆమెకు అప్పుడే అమెరికాలో యెలా జీవించాలి అనేది అర్థం అయ్యింది. అంతగా మనకు మంచి అనిపించకుంటె హోటల్‌లో రెండు రోజులు వుండి వేరే మంచిది అనుకూలమైనది చూచుకొనవచ్చునన్నది. విక్రంకు ప్రమద వుండడంవల్ల యెంతో ధైర్యంగ వుంది. ఆమె లేకపోయినచో యెంత కష్టంగా వుండేదో అనుకున్నాడు విక్రం. ఆమె తన జీవితాన్ని అన్ని విధాల సుఖమయం చేస్తుంది. ఆమె తన జీవిత భాగస్వామి నయినందుకు గర్విస్తున్నాడు విక్రం.

అగష్టు మాసము తుదిభాగంలో బయలుదేరినారు విక్రం, ప్రమద ముందు కూర్చున్నారు. కారులో వెనక అనుపమ్ పండుకొన్నా, ఆడుకొన్నా ఒకడే. వారి కొంత సామాను Movers తో పంపివేసినారు. వెళ్ళే రెండురోజుల ముందు అందరి స్నేహితులకు ఒక విందు చేసినారు. అందరూ వచ్చినారు. మళ్ళీ యేనాటికి కలుస్తామో అని. అందరితో సెలవు తీసుకొన్నారు. ప్రమద అమెరికన్ మమ్మీ కంట నీరు పెట్టుకుంది. ప్రమద కూడా అంతే. ప్రమద ముఖ్య స్నేహితులందరూ ప్రమదను కౌగిలించుకొని ఏడ్చినారు. Keep in touch with us అన్నారు. సరేనంది ప్రమద గద్గద కంఠంతో. మరునాడు ఉదయం లేచి మిగిలిన సామానులన్నీ కారులో సర్దినారు మెరియాన్ వారి భర్తలు వారు అంత సహాయపడ్డారు. కారును సర్వీసింగ్‌కు యిచ్చినావా విక్రం. వారం రోజులకు ముందే అన్నీ బాగున్నవి. మీకు త్రోవలో ఏమి ప్రొబ్లంసు రావు అన్నాడు విక్రంకు సహాయపడే మెకానిక్. అన్ని సామాన్లు పెట్టినాక Apartment కు తాళంవేసి తాళపు చెవులు Apartment manager కు యిచ్చివేసి విక్రం ప్రమద కారులో ఎక్కినారు. యింతకు ముందే కూర్చున్నాడు

అనుపమ్ కారులో. అందరికి bye చెప్పి విక్రం కారు కదల్చినాడు. కొంచెం సేపట్లో వీళ్లున్న బసను దాటి బోస్టన్‌వైపు కారు బయలుదేరింది. యిప్పుడు సమయం ఉదయం 9 గంటలు. కారు బోస్టన్ దాటి Baffellow మీదుగా వెళ్లే రోడ్డు పట్టినారు ఆ రోడ్డు Hiway 90 యిది West coast వరకు వెళ్ళే Interstate Hiway. ఒకసారి Hiway 90 మీద పడ్డ తర్వాత speed 70 miles per hour ప్రయాణము చేయవచ్చు, కాని విక్రం మాత్రము 75, 80 మధ్యలో ప్రయాణిస్తున్నాడు త్రోవలో ఒకచోట అగి 11 గంటలకు breakfast చేసినారు అరగంటలో పిమ్మట బయలుదేరినారు. ప్రమద breakfast తర్వాత ప్రక్కకు కూర్చొని నిద్రపోతుంది. విక్రం స్టీరియోలో ఒక తెలుగుపాటల cassette ను పెట్టి పాటలు వింటున్నాడు. అప్పుడప్పుడు ప్రమద కళ్లు తెరిచి కొంచెంసేపు పాటలు వినుకుంటూ కళ్లు మూస్తుంది. విక్రం మాత్రం పాటలు వినుకుంటూ కారు నడుపుతున్నాడు. త్రోవలో ఎన్నియో చిన్ని పట్టణాలను దాటుతున్నాడు. యిప్పుడు రెండు గంటలు కావస్తుంది. ప్రమద ఆకలి వేస్తుందా? అన్నాడు విక్రం. కొంచెం వేస్తుంది, యింక గంటసేపయినంక ఆపుకొంటాను. అనుపమ్‌కు కారులో కావలసినంత తిండి ఉంది. అప్పుడప్పుడు కొంచెం తింటాడు, నీళ్లు తాగుతాడు, ఆడుకొంటాడు. ఒంటరిగా ఉండుటకు వానికి అలవాటు ఇప్పుడు. అనుపమ్ యిప్పుడు typical అమెరికన్ boy వాడికి అమెరికన్ తిండి ప్రత్యేకంగా hambergers అంటె ఇష్టము. విక్రం కూడా అమెరికన్ తిండి తింటాడు కాని ఆయనగారికి ఇండియాలో చేసినట్టే చేసి పెడుతుంది ప్రమద. ఇక ప్రమద మాత్రము ఇంట్లో కోడి లేదా mutton కైమా దొరికితే ఇంట్లో వండుతుంది, మాకు పెడుతుంది, తనుకూడా తింటుంది యీ రెండూ యింట్లో వండితే తప్ప వేరే మాంసము ప్రత్యేకంగా బయట తినదు బయటకూడా ఆ కోడి మాంసము అప్పుడప్పుడు తింటుంది. భారతీయులు మాంసము తింటారు. విక్రం భారతదేశమునుండి బయలుదేరునప్పుడు చాలామంది మాంసాహారులు. సామాన్యంగా గొర్రె, మేక మరియు కోడిమాంసము తప్ప అవు మాంసము మరే ఇతర మాంసాలను తినేవారు కారు. ప్రమదకూడా అదే తెగలోకి చేరిన మనిషి. అందులో తల్లి Hyderabad యేర్‌పోర్టులో దుఃఖంతో వీడ్కోలు చెప్పినప్పుడు అవు మాంసము మరియు వేరే మాంసాలు తిననని ప్రమదతో ప్రమాణము చేయించుకుందట. అందుకే ఆమె కోడి మాంసము తప్ప యే మాంసము ముట్టదు. మేము సామాన్యంగా ఇంట్లో వంటచేసుకుంటాము కాబట్టి ప్రమదకు ఆ తిండి విషయమై ఏ problem లేకుండెను. విక్రంకు కూడా ఆ తిండి విషయములో బయట తిన్నప్పుడు కొంచెం problem ఉండెను కాబట్టి hamberger తినటము అలవాటు చేసుకొన్నారు. మరి వేరే అమెరికన్ తిండి ఎప్పుడూ తినలేదు. hamberger low quality మాంసముతో తయారుచేస్తారట. తినేటందుకు బాగానే ఉంటుంది. మరియు ప్రతిచోట దొరుకుతుంది. అందువల్ల విక్రం తినేవాడు. కాని ప్రమద ఎప్పుడూ ముట్టలేదు. అనుపమ్‌కు అన్నీ అమెరికన్ dishes నచ్చుతవి. వాడు typical అమెరికన్ boy

చూస్తుండగానే మూడు అయ్యింది. కారు అరు గంటలు నడిపి అలసిపోయినాడు

పాపం విక్రం. మధ్యాహ్నం మూడు గంటలు దాటింది. యింక బఫెల్లో (Buffellow) రాలేదు. త్రోవలో అలసట తీర్చుకొని భోంచేయుటకు Hiway exit తీసుకున్నారు. కారు ఒక restaurant వద్ద ఆపినాడు. ప్రమద కళ్లు తెరిచింది ఎక్కడున్నాము అంటు. యిది ఒక ఎగ్జిట్ Hiway 90 పైన దిగుతున్నాము. ఇక్కడ భోంచేద్దాము అన్నాడు విక్రం తన కారు బెల్టును తీసుకొని. ప్రమద కూడా safety belt ను తీసుకొంది. అనుపమ్‌ను లేపింది. విక్రం, "నాన్నా ఇక్కడ భోంచేద్దాం లే" అని లేపినాడు అనుపమ్‌ను. అనుపమ్ కళ్లు నలుపుకుంటు లేచినాడు. ముగ్గురు కారువద్దనుండి ఆ restaurant లోకి నడచినారు. అక్కడ seating కొరకై లోపల వేచియున్నారు.

ఇంతలో hostess వచ్చి smoking or non-smoking అంది. Non-smoking అన్నాడు విక్రం. Follow me అని నడచింది hostess . ఆమెను ముగ్గురు అనుసరించినారు. టేబుల్ పైన యిరుప్రక్కల కూర్చున్నారు. అనుపమ్ ప్రమద ఒకవైపు విక్రం మరోవైపు.

Waitress menu తో వచ్చి నీళ్లు పెట్టింది మూడుగ్లాసులలో. విక్రం give us some time అన్నాడు. OK అని వెళ్లిపోయింది waitress ప్రమద rest room కు పోతున్నాను అంది. సరే మేము కూడా ease అవుతాము అని విక్రం అనుపమ్‌ను తీసుకొని rest room లోకి వెళ్లినారు. Rest room లో ease అయ్యి ముఖం కాళ్లు, చేతులు కడుకున్నారు. Paper towels తో తుడ్చుకొని మళ్లీ తమకు అమర్చిన టేబుల్ పై కూర్చొని menu చూస్తున్నారు విక్రం అనుపమ్. ఇంతలో ప్రమద కూడా వచ్చి కూర్చుంది ఏమి తింటున్నారు మీరు అంది ప్రమద విక్రంతో. ఇంకా చూస్తున్నాను అన్నాడు విక్రం. సరే అని తనుకూడా మేను పైన కేంద్రీకరించింది. నేను chicken preperation తింటాను అంది ప్రమద.

సరేనని విక్రంకూడా చూస్తున్నాడు ఆ dish ను. సరే బాగుంటుంది నేనుకూడా ఇదే తింటాను అన్నాడు విక్రం. అనుపమ్ తనకు నచ్చిన dish order చేసినాడు Hostess రాగానే. విక్రం ప్రమదలుకూడా తమకు నచ్చిన dishes చెప్పినారు. What do you want for drinking అంది waitress. Water అన్నారు విక్రం ప్రమదలు. అనుపమ్ మాత్రం coke please అన్నాడు. Hostess సరేనని ఆమె మెనూ కార్డ్సు తీసుకొని వెళ్లిపోయింది.

అమెరికాలో యీ Hiway ల పైన కొన్ని మైళ్ల దూరాలలో ఇటువంటి restaurants వుంటవి. మనదేశం వలె కాకుండా ఇచ్చట ఆ తిండిపదార్థాలు పెట్టుచోట్లు చాలా పరిశుభ్రంగా ఉంటాయి. ఈగలు అసలు ఉండవు. ఎప్పుడో అప్పుడు తప్ప అవి కనపడవుకూడా. విక్రంకు ఈగలంటే చాలా అసహ్యం. అందుకే భారతదేశంలో ఉన్నప్పుడు బయట తినాలంటే అతనికి ఇష్టముండేదికాదు. అందువల్ల అమెరికాలో కూడా బయట చాలా తక్కువ తినేది. ప్రమదకు మాత్రము అప్పుడప్పుడు బయట తినాలని ఉన్నా, పాపము ఇక్కడ beef లేని తిండి చాలా అరుదు.

అందుకేనేమో కూడా విక్రంతో ఇంట్లోనే భోంచేసేది. ఇక అనుపమ్‌కు మాత్రం

బయట తినాలంటే ఇష్టం, hambergers taco లు అంటే చాలా ఇష్టం అనుపమ్‌కు. అందుకే, సాయంకాలం బయటికి వెళ్లినప్పుడు అనుపమ్ తనకు నచ్చినవన్నీ తినేది కాని ప్రమద విక్రంలు మాత్రం ice cream తో కడుపు నింపుకునేది. ఇంటికి వచ్చి మళ్లీ వంటచేసుకొని తినేది ఆకలి ఉంటే లేదా నిద్రపోయేది. Harvard community లో ఎప్పుడూ ఏదో ఒక dinner ఉండేది. ఆ University community లో మన దేశస్థులు చాలామంది ఉన్నందువల్ల ఇండియాలో ఉన్నట్టుగానే వుండేది. ఇక ఇప్పుడు పోయేచోటు కొత్తది. జీవితము ఎలాగుంటుందో తెలియదు. ఇవన్నీ ఆలోచించుకుంటూ కూర్చున్నాడు విక్రం. ఇంతలో వీళ్లు order చేసిన dishes తెచ్చింది waitress.

అన్నింటిని టేబిల్‌పై ఎవరివి వాళ్ల ముందుంచి, is everything OK అంది. Yes everything is OK అన్నారు ముగ్గురు. ఆ waitress thank you అని వెళ్లిపోయింది. విక్రం నీళ్లు తాగి కొంచెంసేపు కూర్చొని తిండిని తినవారంభించినాడు. ప్రమదకూడా అంతే. అనుపమ్ ఒక బుక్క నోట్లో పెట్టగానే మమ్మీ మమ్మీ అన్నాడు. I am happy నాన్న అంది ప్రమద me too అన్నాడు విక్రం. ముగ్గురు భోంచేసినారు తృప్తిగా. పిమ్మట ముగ్గురు ఏదో dessert order చేసినారు వారికి నచ్చినవి. అనుపమ్ మాత్రం apple pie తెప్పించుకున్నాడు. అవి తిని సరేనని లేచి మళ్లీ rest room కు పోయి నోరు, చేతులు కడుక్కొని బయలుదేరినారు. ఇంకా మనదేశపు అలవాట్లు మానలేదు ఆ దంపతులు.

అనుపమ్‌కు కూడా ఆ అలవాట్లే నేర్పుతున్నారు. కాని వాడు మెల్లమెల్లగా తెలుగు మరచిపోయినాడు. ఇక యిక్కడి అలవాట్లే నేర్చుకుంటున్నాడు. ఇక్కడివారు సామాన్యంగా తినగానే చేతులు కడుక్కోరు. ఎందుకంటే తిండిని చేతులతో ముట్టరు. Forks Knives & spoons లనే వాడుతారు. నోరు చాలా కొద్దిమంది మాత్రమే కడుగుతారు. అందుకే తినగానే వెళ్లిపోతారు. అలాగే రాగానే తిండి తింటారు. కాని మన దేశస్థుల అలవాట్లే వేరు. ఒకటి మాత్రం విక్రంకు నచ్చలేదు. తిన్న పిమ్మట నోరు కడుగకుంటే ఆ తిన్న పదార్థము కొంత నోట్లోనే ఉండి పళ్లు పాడయ్యే అవకాశము ఉందని ఇక్కడి పళ్ల డాక్టర్లే చెబుతుంటారు. అందువల్ల కొంతమంది అమెరికనులు తినగానే నోరు కడుగుతారు. కాని చాలామంది అలా చేయరు. రాత్రి పడుకొనేముందు పండ్లను brush చేసి పడుకుంటారు

ఏమి మరువలేదు గదా? తిన్న table వద్ద అని, ఒకసారి check చేసి waiter tip table మీద వుంచి table మీదనున్న bill తీసుకొని bill చెల్లించుటకు విక్రం వెళ్లినాడు. ప్రమద, అనుపమ్ కారుదగ్గర వేచియున్నారు. విక్రం రాగానే కారు తలుపులు తెరచి అనుపమ్‌ను వెనుక ఎక్కించి యిద్దరూ ముందు కూర్చున్నారు. కారు start చేసి ఏమీ మరువలేదు గదా? ప్రమద అన్నాడు విక్రం. లేదండి ఏమీ మరువలేదు, నిశ్చింతగా కారు నడపండి అంది. Belt పెట్టుకున్నావా అన్నాడు. అవును అంది ప్రమద. కారు మళ్లీ Hiway 90 ఎక్కింది. మళ్లీ శరవేగంతో కారు నడుస్తుంది. కొద్దిసేపు విక్రం ప్రమద తాము భోంచేసిన చోటు గురించి పిమ్మట ఏదేదో మాటాడుతున్నారు. అరగంట పిమ్మట సంభాషణ ఆగిపోయింది.

విక్రం sterio start చేసినాడు. Select తెలుగు పాటలు వింటున్నాడు. ప్రమద కొద్దిసేపు పాటలు వింటూ ఆనందించింది. పిమ్మట నిద్రపోయింది. ఇక విక్రం ఒక్కడే పాటలు వింటూ కారు నడుపుతున్నాడు కారు ఒక్కొక్కసారి గంటకు 80 మైళ్ల వేగంతో పోతుంది కాని 79 దాటనీయడు. విక్రం కారు చాలా భద్రంగా నడుపుతాడు. ప్రత్యేకంగా Hiway మీద నున్నప్పుడు అతడు కారుమీదనే కేంద్రీకరించుతాడు. ఏమైనా అయితే తనకు తన ప్రమదకు అనుపమ్‌కు చేయరాని అపరాధాన్ని చేస్తాను. ఈ దేశం వచ్చింది మంచిగా బ్రతుకుతానని కాని ఇచ్చటే చనిపోవుటకు కాదు అని ఎప్పుడూ అనుకునేవాడు. ఇలా ఆలోచిస్తూ తన energy నంత కారు driving పైన కేంద్రీకరించినాడు. ఇక కొద్దిసేపట్లో Buffellow పట్టణము వస్తుంది అయినా అచట ఆగడములేదు Cleve land లో కాని ఆగడములేదు.

బోస్టిన్‌ను వదిలేముందు Holiday inn లో ఆనాటి రాత్రికి reserve చేసినాడు ఒక రూం. ఇతని అంచనా ప్రకారము చీకటి కాకమునుపే Cleve land చేరుకొనవలె. ఇది వేసవి. Eastern U.S. city సుమారు తొమ్మిది గంటలకు కాని సాయంకాలం కాదు. Minnesota లోనైతే 10 లేదా $10\frac{1}{2}$ వరకు ప్రొద్దు ఉంటుందని విన్నాను. Cleve land లో చీకటి పడకముందే చేరుకుంటామని విక్రం estimation. Casset పాటలు enjoy చేస్తూనే ఉన్నాడు.

కారు 75–79 మధ్యలో పోతుంది. Cruise 79 మైళ్లమీద పెట్టి స్టీరింగ్ control తో నున్నాడు విక్రం. చూస్తుండగానే ఏడు కావచ్చింది. ఇంకా Cleve land ముప్పైమైళ్ల దూరంలో ఉంది. చూస్తుండగానే Cleve land చేరుకున్నాడు. Holiday Inn అన్న exit తీసుకున్నాడు. కష్టంలేకుండా Holiday Inn parking lot లో కారు ఆగింది. Main gate వద్దనున్న office కు వెళ్లి తన పేరు తెల్పగానే ఆ Clerk Room 380 అని తాళపు చేతులను చేతికిచ్చినాడు.

కొన్ని formalities మరి సంతకాల పిమ్మట ఆ రాత్రికయ్యే bill కూడా ఇదివరకే credit card మీద చెల్లించినాడు కాబట్టి తాళపు చెవులు తక్షణమే దొరికినవి. ముగ్గురూ మూడు suitcase లతో room లో ప్రవేశించినారు. రెండు double మంచాలున్నవి. సూట్‌కేస్ ఆ stand పైన పడవేసి విక్రం bed మీద పడినాడు. అనుపమ్ మాత్రం TV వేసినాడు. వానికి కొన్ని ప్రత్యేకమైన programmes ఉన్నవి. వాడు వాటిని చూచుటలో నిమగ్నుడైనాడు. ప్రమద విక్రం ప్రక్కనే మంచంపైన ఒరిగింది

చాలా అలసి ఉంటారు టీ త్రాగుతారా అంది ప్రమద. కొంచెం rest తీసుకొని పోదాము వీళ్ల canteen కి అన్నాడు. సరే అంది ప్రమద. విక్రంకు Hiway అంత కనులలో పారుతుంది. కండ్లు మూసుకొని పడుకున్నాడు. ప్రమద నెత్తి నొస్తుందా వత్తనా అంది. లేదు ప్రమద అవసరము లేదు అని కళ్లు మూసుకున్నాడు. నిద్ర రావటము లేదు కాని పూర్తిగా కళ్లకు నెత్తికి rest ఇస్తున్నాడు. కొంచెంసేపు అచటే వరిగి పిమ్మట అనుపమ్‌తో కలసి T.V. చూస్తుంది ప్రమద. విక్రం మాత్రం మంచంమీద ఒరిగి ఉన్నాడు.

హాలీడే యిన్ అనాడు మంచి Istrate inn గా నడిపేవారు. హోటల్‌లో

ఇది మొదటి తరగతి హోటల్ అనియే చెప్పాలి. అమెరికాలో అన్ని మోటెల్స్ శుభ్రంగా ఉంచుతారు. అన్నింటిలో ఇది ప్రథమశ్రేణికి చెందినదని వాడుక. గదిలో రెండు Luxurious మంచాలు మంచివి రెండు మ్యాట్రెస్ వాటిపైన. ఉతికి ఇస్త్రీ చేసిన bed sheets dry clean చేసిన రెండు blankets ఇవన్నీ యింత మురికి లేకుండా శుభ్రంగా ఉంటవి. గదిలోనే bath room ప్రతి మోటల్‌లో ఉంటవి కాని హోలీడే యిన్‌లో మాత్రము ఆ బాత్‌రూమ్స్ చాలా శుభ్రంగా ఉంటాయి. విక్రంకు హోలీడే యిన్‌లో తన family తో ఉండుట మొదటిసారి.

కొంచెంసేపటి పిమ్మట విక్రం మంచంపైనుండి లేచి bath room లో కళ్లు కడుగుకొనుటకు వెళ్లినాడు. తువ్వాల్‌తో మొఖం తుడుచుకొని బయటికి వచ్చి ప్రమదతో నీవుకూడా మొఖం కడుక్కొని తయారు కావచ్చు గదా? బాబు నీవు తయారుకాగానే dining హాల్‌కు వెళ్లి భోంచేద్దాము అన్నాడు.

సరే అని ప్రమద అనుపమ్‌తో నాన్నా నీవు మొఖం కడుక్కో అంది. సరే అమ్మా మీరు కడుక్కోండి please పిమ్మట నేను వెడతాను అన్నాడు. సరే అని ప్రమద మొఖం కడుక్కొని, తల దువ్వుకొని చీర, బ్లౌజు మార్చుకొని I am ready అని బయటకు వచ్చింది. ప్రమదను చూచి as usual you are so beautiful darling అన్నాడు విక్రం. అనుపమ్ కూడా yes మమ్మీ you are beautiful అన్నాడు ప్రమద నవ్వుతూ తండ్రి కొడుకులు బాగా దొరికినారు అంది. ఉన్నది వున్నట్టు అంటున్నాడు నా నాన్న అన్నాడు విక్రం. అనుపమ్ అమ్మా నేను సిద్ధం ఇక నీ ఒక్కడిదే ఆలస్యం T.V. off చేసి మొఖం కడుక్కొని లే! అన్నాడు విక్రం. ఇష్టం లేకున్నా T.V. ని ఆపుచేసి లేచినాడు అనుపమ్.

కొంచెంసేపట్లో bath room నుండి వచ్చి తల్లితో నెత్తి దువ్వించుకున్నాడు. పిమ్మట ముగ్గురు room lock చేసి క్రిందికి దిగి dining hall లోకి వెళ్లి entrance లో hostess కై వేచియున్నారు. Hostess వచ్చి వీరిని లోనికి ఆహ్వానించి నలుగురికి సరిపోయే ఒక table వద్ద కూర్చుండబెట్టి ఆ సాయంకాలము లభ్యమయ్యే menu ను ముగ్గురికి మూడు అందించి వెళ్లిపోయింది. ప్రమద మాంసము తినదు. అందువల్ల ఆమె selection simple . విక్రం అనుపమ్‌లు మెనో త్రిప్పుతున్నారు కాసేపట్లో hostess వచ్చి "ready to order" అంది. ప్రమద yes అంది, get me potato strings, toast with cheese and milk అంది. Yes Madam, అంది hostess. What about you sir? అంది విక్రంతో. విక్రం తనకు నచ్చినవి చెప్పినాడు.

అనుపమ్‌ను సంభోదించి What do you want dear? అంది వాడికి నచ్చినవి వాడు తెమ్మన్నాడు. ఆ ముగ్గురి orders తీసుకొని ఆ menu cards ను తీసుకొని వెళ్లిపోయింది ఆ waitress . ముగ్గురు వారి Harvard జీవితం friends విషయమై మాట్లాడుతూ కూర్చున్నారు. Waitress ముగ్గురికి కావలసినవి తీసుకొని వారి ముందుంచి anything more అంది. No right now, if we need we will call you అని చెప్పగానే ఆ waitress వెళ్లిపోయింది. ముగ్గురూ తృప్తిగా leisure గా భోంచేస్తున్నారు. అనుపమ్ ఆశకొద్దీ అన్నీ తెమ్మన్నాడు కాని

తినుటకు కష్టపడుతున్నాడు. వాడి అవస్థను చూడలేక ప్రమద నాన్నా ఇష్టం కాకపోతే విడిచిపెట్టమ్మ అంది. విక్రంకూడా ప్రమదను బలపరిచాడు. లేదు నేను తింటాను మమ్మీ అని మెల్లగా అన్నీ పూర్తిచేసినాడు. Waitress వచ్చి బిల్ ఇచ్చింది. బిల్‌ని తీసుకొని టిప్ బల్లమీద ఉంచి ready to go అన్నాడు విక్రం. Yes అన్నారు ప్రమద మరియు అనుపమ్.

ముగ్గురూ మెల్లగా బయట కొంచెం stroll చేసి తన రూంకు వెళ్లి T.V. చూస్తున్నారు. విక్రం మళ్లీ రేపు long drive నేను పడుకుంటాను స్నానంచేసి అని ఉతికిన బట్టలు తీసుకొని bath room లోకెళ్లి shower క్రింద చాలాసేపటివరకు నిలబడ్డాడు. పిమ్మట fresh towel తో శుభ్రంగా తుడుచుకొని పైజామాలు వేసుకొని బయటికి వచ్చి good night అని bed మీద పడి నిద్రించినాడు. పిమ్మట ప్రమద అనుపమ్‌లు స్నానాలుచేసి T.V. off చేసి వారు కూడా bed light on చేసి నిద్రించినారు.

తెల్లవారి 7 గంటల 15 నిమిషాలకు ప్రమద మేలుకొంది. ఏమండీ 7–15 అయ్యింది లేవండీ ఇవ్వాళ్ళ ఎలాగైనా Minneapolis చేరాలి గదా అంది విక్రంతో. విక్రం నిద్రలోనే ఇంకా 15 నిమిషాల తర్వాత లేపు dear అని పడుకున్నాడు విక్రం. సరే అని ప్రమద brush చేసుకుంటూ బాత్‌రూములోకి వెళ్లింది. మొహం కడుక్కొని వచ్చి విక్రంను మళ్లీ లేపింది. చేసేదిలేక సరేనని లేచి brush తో పళ్లు తోముకుంటూ bath room లోకెళ్లి మొఖం కడుక్కొని బయటికి వచ్చినాడు. ఇంతలో అనుపమ్ లేచి good morning daddy అన్నాడు.

సరే నాన్న తొందరగా పళ్లు తోముకొని మొఖం కడుక్కో తొందరగా బయలుదేరాలి అన్నాడు విక్రం. సరేనని bath room లోకెళ్లి స్నానం చేసి వచ్చినాడు అనుపమ్. రాగానే మాతృమూర్తి ప్రమద తొడుక్కునే బట్టలు ఇచ్చింది. బట్టలు వేసుకొని I am ready అన్నాడు అనుపమ్. We are also ready అని అన్ని పెట్టెలు ఒకచోట bed ప్రక్కకు జమచేసినారు. ఇంకా ఏమైనా మరువలేదు గదా? అని రూంలోని closet మరియు bath room లో చూచినారు. ఇద్దరు ఏమి మరువలేదని నిశ్చయించిన పిమ్మట breakfast కై క్రిందికి వెళ్లినారు Dining hall కు. వీళ్లు ముగ్గురు హాల్‌లో wait చేస్తున్నారు వేరే అమెరికన్స్‌తో.

అందులో ఒకతను are you from India? అన్నాడు. Yes please అన్నాడు విక్రం. Where are you going అన్నాడతను. Minneapolis అన్నాడు విక్రం. What do you do there అన్నాడు విక్రంతో.

I am accepting a teaching position in the University అన్నాడు విక్రం.

ఓ! అన్నాడు ఆ అమెరికన్. ఇంతలో hostess విక్రంతో would you please follow me అంది. Sure, అని excuse me అని ఆ అమెరికన్‌తో తెల్పి ముగ్గురూ ఆ hostess తో నడచినారు. ఆమె వీళ్లను కూర్చుండబెట్టి menu చేతికిచ్చి వెడలిపోయింది. అయిదు నిమిషాలలో తిరిగివచ్చి can I take your order అంది. విక్రం breakfast చేయడు వట్టి వేడి వేడి టీయే ఆయన breakfast. మధ్యాహ్నము 12, 1 కి కాని భోంచేయరు.

I want very hot coffee please అన్నాడు విక్రం. పిమ్మట ప్రమద వైపు మళ్లీ What interests you dear? అన్నాడు విక్రం. O.K. omlet and toast అంది ప్రమద. What do you want little fellow? అంది hostess అనుపంతో.

Pan cakes please అన్నాడు అనుపమ్. Hostess O.K. అంది నవ్వుకుంటూ. పిమ్మట ఆ మెనో కార్డ్సు తీసుకొని వెళ్లిపోయింది. ప్రమద విక్రంలూ ఏదో మాటాడుకుంటున్నారు. అనుపమ్ ఏదో అటూ యిటూ చూస్తూ కాలక్షేపం చేస్తున్నాడు. ఇంతలో hostess వీళ్లిచ్చిన orders ను తీసుకొని వారి టేబుల్ పైన పెట్టి Is coffee hot enough అంది విక్రంతో. Yes thank you అన్నాడు విక్రం.

Enjoy your breakfast అంటూ వెళ్లిపోయింది. పిమ్మట 20 నిమిషాల పిమ్మట బిల్ ఇచ్చి వెడలిపోయింది. బిల్ తీసుకొని ఒక డాలరు టిప్పు బల్లపైన పెట్టి లేచినాడు విక్రం. బిల్ చెల్లించి ముగ్గురు పైకి వెళ్లినారు. ఆఖరుసారిగా ఇంకా ఏమైనా మరచినామా? అని గదిలో వెతికి suitcase తో బయటపడ్డారు. Room key మేనేజరుకు ఇచ్చి బయటికి నడచినారు. కారు తెరిచి ప్రమద అనుపమ్‌లు కూర్చున్నారు.

విక్రం tire లలో గాలి ఉందా చూచి కారు start చేసి మళ్లీ Hiway 90 పైకి కారు నడిపినాడు. రెండు మూడు నిమిషాలలో కారు speed 75-80 కి చేరింది. ప్రమద విక్రం కొంచెంసేపు మాటాడుకుంటూ కారు నడిపినారు. అరగంటలో అలవాటు ప్రకారము ప్రమద కండ్లు మూసుకుంటుంది. అనుపమ్ వాని cartoon పుస్తకాలు చూస్తున్నాడు. విక్రం యధాప్రకారం తెలుగుపాటల casset ను on చేసినాడు. ఇక అతనికి కారు నడపడంపై పాటలపై ధ్యానం కేంద్రీకరించినాడు. పాటలు (తెలుగు) ఉంటే రోజుకు 6 నుండి 7 వందల మైళ్లను సునాయాసంగా ఒక్కడే నడపగలడు. ఇప్పుడు Minneopolis కూడా రమారమి అంతే దూరం ఉంటుంది. అందువలన సూర్యుడస్తమించకముందే చేరుతాము అనుకొన్నాడు.

కారు శరవేగంతో Hiway 90 మీద వెడుతుంది. చూస్తుండగానే Cleveland మాయమయ్యింది. ఇక Chicago ఎప్పుడు రాగలదని చూస్తున్నాడు విక్రం. కాని Chicago అంత తొందరగా రాదు. కొన్ని గంటలు కారు నడుస్తేగాని Chicago రాదు పిమ్మట ఒక నాలుగువందల మైళ్లు పోతేగాని మినియాపిలస్ రాదు అనుకున్నాడు విక్రం. Cleveland నుండి ఉదయం తొమ్మిది గంటలకు బయలుదేరినారు. Chicago కు పోయేవరకు 10 కాగలదు మరి అచ్చటినుండి Minneopolis 400 మైళ్లు అంటే ఎనిమిది గంటలు కావచ్చు. అంటే ఎనిమిది గంటల తర్వాత చేరుతాము. అంటే ఇంకా పొద్దు ఉంటుందని అంచనా వేసినాడు విక్రం.

Chicago పిమ్మట Hiway 90 విడచి Hiway 94 మీద వెళ్లాలి Minneapolis కు. Any way యివ్వన్ని ఆలోచించుకుంటూ కారు నడుపుతున్నాడు విక్రం. తెలుగు పాటలు వినుకుంటూ అన్ని మరచి రోడ్డుపైననే కన్నుంచినాడు. అమెరికాలో divided Hiway లు అంటే పోయేటందుకు వేరే వచ్చేటందుకు వేరే ఒకదానికి రెండవదానికి మధ్యలో పచ్చని గడ్డి ఉంటది. ఆ Hiway network అంత Eisonhower కాలంలో

వేసినారట. ప్రపంచంలో ఎచ్చటకూడా ఇంత వైభవమైన రహదారులు లేవు

Europe లో కొంచెం ఆ Hiways close గా వుంటాయని అంటారు కాని American Hiways are the best . మొత్తం దేశంలో East to West, South to North కు విశాలమైన Hiway లను వేసినారు. అందుకే కారు ప్రయాణము చాలా చురుకైనది. రోజుకు 7, 8 వందల మైళ్లు సునాయాసంగా పోతారు ఇచ్చటి ప్రజలు. కొందరైతే 24 గంటలు ప్రయాణము చేస్తారట. అంటే ఒక డ్రైవరు పడుకున్నప్పుడు మరి ఒక driver drive చేసి రాత్రింబవళ్లు కారు నడుస్తూనే వుంటుందట. అందువల్ల రోజుకు 1200 వందల మైళ్లు వెడతారట.

ఇవన్నీ ఆలోచించుకుంటూ నడుపుతున్నాడు విక్రం. విక్రంకు మరియు తన కుటుంబానికి ఇంత దూరం కారులో ప్రయాణము చేయుట యిది మొదటిసారి. కొన్ని వందలు ఒకరోజులో ప్రయాణం చేసినారు. కాని యింత దూరం కారులో వెడలుట మొదటిసారి. ఆ దేశం వచ్చి అయిదేళ్లు కావస్తుంది. స్నేహితులవద్దకి చాలాసార్లు వెడలినారు. కాని ఇంతదూరం కారులో వెడలుట ఇది మొదటిసారి విక్రం కారు నడుపబట్టి రెండు గంటలు దాటింది. కొంచెం దాహం అయ్యింది. ప్రమదా అని పిలిచినాడు. ఆమె పలుకలేదు. ప్రమద dear అన్నాడు మేలుకొనలేదు. మూడవసారి ప్రమద అని వీపు కదల్చినాడు. అఁ, అని లేచింది. కొంచెం మంచినీళ్లు ఇస్తావా? అన్నాడు విక్రం. సరే అని thormas తెరచి paper glass లో చల్లటి నీళ్లు పోసి ఇచ్చింది. నీళ్లు త్రాగి పాటలు వినబుద్ది కాదా నీకు? అన్నాడు.

నిద్ర వచ్చిందండి, నాకు తెలుగు పాటలంటే మీకువలెనే ఇష్టము కాని కారు కదలగానే నిద్ర వస్తుంది ఏం చేయాలే? అని అంది. ఫరవాలేదు ప్రమద ఇంతసేపు పడుకున్నావు కదా? ఇక విను. పాటలు చాలా బాగున్నవి అన్నాడు విక్రం. సరేనని ప్రమద straight గా కూర్చొని పాటలు వింటుంది. మధ్యమధ్యలో మాటాడుతుందికూడా పాటల గురించి. ఎవరు పాడింద్రు ఏ సందర్భములో పాడింది చెబుతూ కూర్చుంది.

ఇంకా రెండు గంటలలో Chicago లో ఉంటాము అన్నాడు విక్రం. అలాగా అంది ప్రమద. Yes dear అంటూ చేతితో ప్రమద చెంపను నిమిరినాడు విక్రం. ప్రమద విక్రంవైపు చూచింది నవ్వుకుంటూ. ఇంత speed లో ఇవన్నీ వద్దండీ అని. అనుపమ్, నాన్నా అని వెనకకు మళ్ళి అనుపమ్‌ను చూచింది. వాడు హాయిగా పడుకున్నాడు. లేపకు వాణ్ణి అన్నాడు విక్రం. సరే అని ఇద్దరూ పాటలతో పాటు వాళ్ల స్నేహితుల విషయాలను స్వదేశములోనున్న బంధువుల విషయాలను మాటాడుకొనుచున్నారు. ఇది August నెల ప్రకృతి చాలా అందంగా కనిపిస్తుంది. Hiway ప్రక్కన రెండువైపుల మైళ్లకు మైళ్లు పచ్చని చేలు చెట్లు కనుపిస్తున్నాయి.

ఎంత అందంగా ఉంది ప్రమద ఈ దేశము. ప్రపంచములో భగవంతుడు ప్రకృతి సంపదనంత ఆ అమెరికాకే ప్రసాదించినట్టుంది. ఇక మనదేశానికి మనుషులను, మరీ మనుషులను ప్రసాదించినాడు. అందుకే మన దేశంలో ఎటూచూచిన మనుషులు మనుషులు మనుషులే. ఈ దేశంలో ఎటుచూచిన పచ్చటి చేలు, కంచెలు, చెట్లు మరి కార్లు. ఎంత శుభ్రంగా ఉన్నవి ఈ Hiway లు ఇంత చెత్తనేకాని, మరియేవిధమైన

మురికి వెతికితే కూడా దొరకదు ఈ Hiway లపైన అన్నాడు విక్రం. నిజమండీ, కాని మనము వీరికి సరితూగలేము అంది ప్రమద.

అవును ప్రమద! ఇంకా వందయేళ్లకు కూడా జరగదీ పని ఎందుకంటే మనదేశపు పునాదులే తప్పుడు principles పై వేయబడ్డవి. మనదనే వ్యవస్థ లేదు మనకు. మనమంతా పాశ్చాత్య సమాజ, రాజకీయ పునాదులపై, సిద్ధాంతాలపై వేసినాము. 100 కి 40 మందికి తక్కువ అక్షరాస్యులున్న దేశంలో democracy ని స్థాపింప జూచిన మన బుద్ధిలేని నాయకులు చేసిన తప్పును మనమింకెన్నాళ్లు భరించాలనో, ఒకసారి ఓటు హక్కును ఇచ్చిన పిమ్మట దానిని మళ్లీ వాపసు తీసుకొనుట కష్టము. వ్యక్తిగతంగా దీన్ని ఎవరూ వదలుకోరు. అంతేకాకుండా, వీళ్లను బెట్టుకొని రాజ్యాలనేల గలిగిన నాయకులు ఒక విప్లవము అరాచకమును లేవదీస్తారు.

ఎందుకంటే ఓటుహక్కు కలిగిన వాడికంటే ఆ ఓట్లను కొని గద్దెలెక్కి మళ్లీ ఆ గద్దెల బలంతో అధికారాన్ని చెలాయించి, కోటానుకోట్లు సంపాదించి మళ్లీ ఎన్నికలలో ఆ ధనాన్నే ఉపయోగించి గద్దెనుండి దిగకుండా కూర్చున్న నాయకులకు మరియొక వృత్తియేది. దేశవిభజనకు ఒప్పుకొని దేశానికి శాశ్వతంగా ముప్పు తెచ్చిపెట్టిన నాయకులది తప్పుకాదంటారా? వాళ్లేదో ఇంగ్లాండులో చదువుకొని వారి భాష, సిద్ధాంతాలను ఓనమాలు రాని నిరక్షరాస్యుల నెత్తిపైన రుద్దిన నాయకులను వీమనలేము కదా? మున్ముందు వచ్చే నాయకులు మొదటితరం నాయకులు చేసిన మహా తప్పులను సవరించి విభజించిన దేశాన్ని పటిష్టంగా చేస్తారా లేక బలహీనంగా చేసి దేశాన్నే అస్తమింపచేస్తారా? కాలమే యి ప్రశ్నకు బదులు చెప్పాలి అంటాడు విక్రం.

ప్రమద వినుకుంటూ కూర్చుంది పాపం ఇట్లు మాట్లాడుతూ పాటలు వింటూ drive చేస్తున్నాడు విక్రం. చూస్తుండగానే Chicago 95 మైళ్లు అని board చూచినాడు, Hiway పైన ఇక రెండు గంటలలో Chicago లో ఉంటాము ప్రమద అన్నాడు విక్రం. అంటే watch చూసుకొని ఒకటికి Chicago లో ఉంటాము. మూడు గంటల సమయానికి భోంచేద్దామా అన్నాడు విక్రం రెండు రెండున్నరకు తిందామండి అంది. సరేనన్నాడు విక్రం.

దారి ప్రయాణానికై కొన్ని ఫలహారాలు చేసి వెంట ఉంచుకొంది ప్రమద అవి తీసి విక్రంకు ఇచ్చి తనుకూడా తింటూఉంది. ఇంతలో Chicago 50 miles అని ఉంది సరే Chicago లో ఆగి కొంచెం coffee తాగుదామా అన్నాడు విక్రం సరేనంది ప్రమద చూస్తుండగానే Chicago వచ్చింది. Hiway 94 మరి Hiway 90 కలసిపోయినవి రెండు Chicago నుండి పోతున్నవి. Traffic ని avoid చేయుటకు Chicago బయటినుండి వెడుతున్నారు. Chicago దాటేవరకు రమారమి 30 నిమిషాలయింది.

పిమ్మట Chicago దాటి కొంచెం దూరం వెళ్లగానే Wisconsin సరిహద్దుల్లోకి వెళ్లినవి ఆ రెండు రహదారులు కొంచెం దూరం వెడలిన పిమ్మట 94 మరి 90 విడిపోయినవి. 94 Minneopolis వెడుతుంది కాబట్టి Hiway 94 పైన వెడలుతున్నారు. అప్పుడు సమయం 2 గంటలు కావస్తుంది. ఇకమంచి restaurant రాగానే ఆగుదాము, భోంచేద్దాము అన్నాడు విక్రం. సరే అంది ప్రమద. విక్రం food & gas combination కై చూస్తూ కారు నడుపుతున్నాడు కొంచెంసేపట్లో ఆ బోర్డు

కనపడింది. కారును exit లోకి నడిపినాడు. కుడికి, ఎడమకు రెండువైపుల నున్నవి gas stations మరి restaurants. Right కు కారు మలపినాడు. కొద్దిదూరంలో గ్యాస్ station లో ఆపి గ్యాస్ అంటే petrol నింపినాడు. పిమ్మట బిల్లు చెల్లించి ప్రక్కనేవున్న restaurant కు కారు మలపి parking lot లో park చేసి, కారు lock చేసి ముగ్గురూ దిగి లోనికి ప్రవేశించి hostess కై వేచియున్నారు. అంత rush లేదు hostess తక్షణమే వచ్చి మమ్ములను తీసుకవెళ్లి కూర్చుండబెట్టి How are you all today అంది.

Fine, అని మేమన్నాము. What do you want to drink అంది. Coke for me అన్నాడు అనుపమ్. ప్రమద diet coke for me అంది. What about you Sir అంది. Coffee please with cream and sugar అన్నాను. సరేనని మేమడిగిన మూడువిధాల drinks తెచ్చి table పైన పెట్టి menu cards ముందుంచి order కై వేచివుంది. మాకు నచ్చినవి order చేసినాము. సరేనని ఆ menu cards తీసుకొని వెళ్లిపోయింది. 10 నిమిషాలలో మేము order చేసిన పదార్థాలను తీసుకొని మా ముందుంచి. Every thing is fine! అంది. Yes please అన్నాము అంతలో ఆ waitress వెడలిపోయింది. ముగ్గురము మాటాడుకుంటూ తృప్తిగా భోంచేసినాము. Waitress వచ్చి anything more అంది. అనుపమ్ icecream please అన్నాడు. ప్రమద నీకేమి కావలె? అన్నాడు విక్రం. మీరేమి తింటారు అంది. Apple పై అన్నాను. సరే నాకు కూడా అదే తెప్పించండి అన్నది. అదే hostess కు చెప్పిన. తిన్న ప్లేట్లు అన్నీ తీసి మేము అడిగిన disserts తెచ్చింది. వాటిని తిని బిల్ చెల్లించి rest rooms కు వెళ్లి మళ్లీ వచ్చి టిప్ బల్లపైన ఉంచి బిల్లు తీసుకొని counter వద్దకి వెళ్లి బిల్లు చెల్లించి అచ్చట ఉన్న pepper mints మూడు కొని ప్రమదకొకటి అనుపమ్‌కొకటి ఇచ్చినాడు విక్రం. మిగిలింది తను నోట్లో వేసికొని ఏమైనా మరవలేదు కదా? అన్నాడు విక్రం. యేమి తెచ్చినామని అంది ప్రమద. సరే Let us go అన్నాడు విక్రం. ఇప్పుడు మూడయ్యింది ఇక అయిదు గంటలలో Minneopolis చేరాలె అన్నాడు విక్రం. మీరు రథసారథి అంది ప్రమద. అవును చేరుతాములే అన్నాడు విక్రం. ముగ్గురు కారువద్దకు చేరగానే doors ను unlock చేసినాడు విక్రం. ముగ్గురూ కారులో ఎక్కినారు. విక్రం belts వేసుకున్నాడు. ప్రమద please belt వేసుకో అన్నాడు. సరేనని seat belts వేసుకొంది. అనుపమ్ వెనుక పడుకుంటాడు, ఆడుకుంటాడు కాబట్టి వేసుకోడు. అంత ప్రమాదముండదు వెనుక కూర్చున్నవాళ్లకు అని safety experts చెబుతుంటారు కాబట్టి వాన్ని belt వేసుకొమ్మని విక్రం ఎప్పుడు గట్టిగా చెప్పలేదు. మళ్లీ కారు Hiway 94 పైకి వచ్చింది. రెండు నిమిషాలలో గంటకు 80 మైళ్లు వేగంతో పరుగెడుతుంది. ఇంతవేగంగా పరుగెత్తుతున్న ఝుం అనె చప్పుడు తప్ప కారు ఎగురవెయ్యడు ఎందుకంటె ఇచ్చటి Hiways అంత నున్నగా కార్లు అంత బాగా వుంటాయి. కారు ఇరుప్రక్కల పచ్చటి చెట్లు. ఎంతో హాయిగా ఉంది ప్రకృతి. కారు ఇరువైపుల మైళ్ల కొలది దూరం ఆ పచ్చటి చెట్లు అలసట రానీయవు ప్రయాణీకులకు.

గంటకు 80 మైళ్ల వేగంతో వెళుతోంది కారు. విక్రం పాటలు వినుకుంటూ కారు నడుపుతున్నాడు. రోడ్లవైపు 5 మైళ్లకు ఇంక మినియాపెలిస్ ఎంతదూరం ఉందని boards వుంటాయి Hiway పైన. ఇప్పుడు ఇంకా 350 మైళ్లని ప్రమద చూచింది. ఇంకా మూడున్నర గంటలలో ముట్టగలమనుకుంది. అనుకున్న ప్రకారము ఎనిమిది గంటలకు మినియాపెలస్ సమీపంలోనున్నాము. Mississippi నదిపైనున్న వంతెనను దాటి సిటీలో speed తక్కువగా ఉంటుంది. పట్టణంలోకి చేరగానే Hiway 94 కు bye చెప్పి ఒక exit తీసుకున్నాడు.

పిమ్మట University వైపుకు మరలినాడు. University కి సమీపంలో ఒక హోటలువద్ద car park చేసి reception desk కు వెళ్లినాడు. వేసవిలో ఆలస్యంగా వెళ్లితే హోటల్‌లో reservation దొరుకుట కష్టం. అదృష్టవశాత్తు వీరికి room లభించింది. అబ్బ అదృష్టం అనుకున్నారు విక్రం ప్రమదలు. కారులోనున్న suitcases తీసుకున్నాడు. Room కు వెడలగానే కన్నులు మూసుకొన్నాడు bed పైన పడుకొని. పట్టణము బాగానే ఉంది అంది ప్రమద. సరే rest తీసుకో ప్రమద, ఇది మన home ఎన్నాళ్లవరకు మనకు ఈ పట్టణానికి సంబంధమో అన్నాడు విక్రం. ఫరవాలేదు లెండి రేపు ఆలోచిద్దాం.

ఇప్పుడు మీరు అలసట తీర్చుకోండి మన గమ్యస్థానం చేరుకున్నాం safe గా అంది ప్రమద తన ప్రక్కకు ఒరిగి. అనుపమ్ కారులో బాగా పడుకున్నాడు వాడికి T.V. ఉంటే అన్నీ మరచిపోతాడు. T.V. ని గట్టిగా వేసి చూస్తున్నాడు. నాన్నా కొంచెం sound ను తగ్గించు నాన్న పడుకునే ప్రయత్నం చేస్తున్నాడు అంది.

సరే మమ్మీ అని sound ను తగ్గించి T.V. ని చూస్తున్నాడు అనుపమ్. ప్రమద విక్రంతో నెత్తి ఒత్తుమంటారా? చాలాదూరం drive చేసినారు ఇవ్వాళకూడా అంది లేదు ప్రమద, కొంచెంసేపు కళ్లు మూసుకొని పడుకుంటే నా అలసట అంతా తీరుతుంది. నీవు నా ప్రక్కన ఉంటే నాకు ఏ అలసట ఉండదు సుమా! అని చెంపగిల్లినాడు.

అనుపమ్ మన రూంలోనున్నాడని మరువగూడదు సుమా! అని చేయి తీసివేసింది. సరేలే dear నీవు కూడా అలసిపోయినావు ప్రయాణంలో పడుకో అని కనులు మూసుకొన్నాడు విక్రం. కొంచెంసేపటి తర్వాత లేచి ముఖాలు కడుక్కున్నారు ఇద్దరు దంపతులు. అనుపమ్ fresh కా పో తండ్రి అంది ప్రమద.

సరే మమ్మీ అని టవలు తీసుకొని bath room లోకి వెళ్లినాడు అనుపమ్. ఇప్పుడేమంటావు dear అని ప్రమదను ముద్దాడుకొన్నాడు. ఇంకా చిలిపిపనులు మానుటలేదండీ మీరు అంది ప్రమద.

అవును, అన్నాడు విక్రం తలదువ్వుకొంటూ. ఇంతలో అనుపమ్ bath room నుండి మొఖం తుడుచుకొంటూ బయటికి వచ్చి మమ్మీ, డాడీ నేను సిద్ధం. Let us go for eating అన్నాడు. కొంచెం ఉండు అనుపమ్ అని ప్రమద bath room లోకి వెళ్లి మొఖం కడుక్కొని, తలదువ్వుకొని, బొట్టుపెట్టుకొని బయటికి రాగానే ముగ్గురు dining room లోకి వెళ్లినారు. వాళ్లకి కావలసినవి order చేసి తిని తమ రూంలోకి వచ్చి పడుకున్నారు.

తెల్లవారగానే లేచి మొఖాలు కడుక్కొన్నారు. ఎనిమిది గంటలకు విక్రం బట్టలు వేసుకొని duty మీదికి రిపోర్టు చేయుటకు వెళ్లినాడు. పోయేముందు ప్రమదతో report చేసి మొదటిరోజు పనిచూసుకొని పని కాగానే వచ్చేస్తాను ఓ వసతిగల గృహాన్నో, అపార్ట్‌మెంటునో చూద్దాము అని కారులో వెడలినాడు. అనుకున్న ప్రకారము head of the department కడకు వెళ్లినాడు.

ఆ head of the department విక్రంను చూచి లేచి కరచాలనము చేసినాడు వెంటనే తన secretary ని పిలిచి ఆ కాగితాలు మరియు విక్రం ఫైలును తెమ్మన్నాడు. Secretary తక్షణమే విక్రం సంతకాలకై తయారుచేసిన కాగితాలను తీసుకొని వచ్చి సంతకాలు పెట్టవలసిన అన్నిచోట్ల × మార్కును పెట్టి అన్ని × మార్కులపైన సంతకాలు చేయించుకొని ఆమె వెడలిపోయింది. ఆమె పోగానే ఆ head of the department, Dr. Norton విక్రంతో తన (విక్రం) office కు తీసుకెళ్లి దానిలో ఏమన్నా కొదువ ఉందా అని చూచి I hope it is satisfactory and convenient అని చెప్పి if you need any additional facility please feel free to contact me or my office secretary అని చెప్పి సెలవు తీసుకొన్నాడు Dr. Norton .

విక్రం Harvard లో చదువుతున్నప్పుడు graduate room లో ఒక cabin office మరి library లో కూడా ఒక cabin desk with florecent light ఉండెను. ఇది మొదటి independent office తన ఒక్కడికే. విక్రం తలుపుమూసి పనిచేసే అలవాటు. ఇప్పుడు అలవాటుకు తగ్గట్టుగా అన్ని సౌకర్యాలతో ఒక office గది లభించినందుకు సంతసిస్తున్నాడు. అందులో అన్ని సౌకర్యాలున్నవి. Desk పైన ఒక adjustable florecent light. Desk ప్రక్కనే రెండు file cabins, మరి రెండు పెద్ద size book cases. Desk కు సరిపోయె moveable chair with cushion ఉన్నవి. ఆ chair పైన కూర్చొని అతడు office లో ఎచ్చటికైన తరలవచ్చు. ఈ విధంగా చదువుటకు, వ్రాయుటకు చాలా మంచి physical facilities ఉన్నవి అని తృప్తిపడ్డాడు.

Book shalves లో తను వెంట తెచ్చిన పుస్తకాలు note books అమర్చవచ్చు సావధానంగా అనుకున్నాడు. File cabin మరి desk keys ను తీసుకొని ఒక Key chain లో వేసుకున్నాడు. ఇవన్నీ చేసేవరకే 12 గంటలయ్యింది పాపం. ప్రమద మరియు అనుపమ్‌లు తనకోసమై ఎదురుచూస్తుండవచ్చని ఆ హోటలుకు బయలుదేరినాడు. Hotel room లోకి రాగానే ప్రమదకు తన office వాటిలోనున్న సౌకర్యాలను గురించి తెల్పి ప్రమదా మనం భోంచేసి ఒక Apartment కొరకై వెడదాము

నా colleague brooks వస్తాడు అతనితో మనము Apartments చూచుటకు వెడుతున్నాము. Let us go to eat అని ముగ్గురూ ఆ హోటలు ప్రక్కనేనున్న restaurant కు బయలుదేరి భోంచేసి Hotel కు వచ్చి విశ్రాంతి తీసుకుంటున్నారు. కొంతసేపు rest తీసుకున్నాడో లేదో Dr. brooks వస్తాడు.

ప్రమద మనమందరము Apartment hunt కు వెళ్లాలి సిద్ధమేనా అన్నాడు

విక్రం. అవును, వారు రాగానే వెడదాము నేను సిద్ధమే అంది ప్రమద. వీళ్లు మాటాడుతుండగానే తలుపు తట్టి తలుపుకొట్టినాడు brooks. అదిగో brooks వచ్చియుంటాడని విక్రం తలుపు తెరవగానే hello Dr. Rao అన్నాడు brooks. Are you ready to see some apartments అన్నాడు Dr. brooks. Oh! We are ready but please come in అన్నాడు విక్రం. Brooks లోనికి రాగానే ప్రమదకు Brooks ను పరిచయం చేస్తూ this is Dr. Brooks. I will be working with him. We are colleagues. అని ప్రమదకు చెప్పి పిమ్మట ప్రమదను పరిచయంచేస్తూ, This is my wife ప్రమద & this is my son అనుపమ్ అన్నాడు విక్రం.

It is nice to see a distinguished family Dr. అన్నాడు Brooks. If you are ready I have few apartments to show. Are you ready to go. We are అన్నాడు విక్రం, ప్రమద. నలుగురు హోటల్ బయటకు వెడలి Brooks కారు వద్దకి చేరుకున్నారు. విక్రం, Brooks ముందు కూర్చున్నారు. ప్రమద, అనుపమ్ వెనుకసీటులో కూర్చున్నారు. Brooks car start చేసి main street పైకి కారుని తోలినాడు. కొంచెంసేపట్లో nearly built apartment complex కు తీసుకవెళ్లినాడు. రెండో Apartments లోకి తీసుకెళ్లినాడు. ఒకటి మూడు bed room లు కలది, రెండవది రెండు bed room లు కలది. Apartments క్రొత్తవి ఇంకా ఇప్పుడే lawn వేస్తున్నారు.

ప్రమదకు మూడు bed room లు రెండు full baths గల Apartment నచ్చింది. విక్రంతో తెలుగులో మెల్లగా అంది. విక్రం Brooks తో Fred my wife likes the three bed room apartment అని brooks తో అన్నాడు. O.K. We will talk to complex manager వెంటనే Dr. Brooks ఆ ముగ్గురిని ఆ కాంప్లెక్స్ మానేజరు వద్దకి తీసుకెళ్లినాడు. ఆ apartment no. తెల్పి ఇది available గా ఉందా లేక మీరెవరికైనా promise చేసినారా అని అడిగినాడు.

ఇంతవరకు ఎవరు అడ్వాన్సు మనీ ఇవ్వలేదు కాని ఆసక్తి చూపిస్తున్నారు. ఒకవేళ మీకు అదే కావాలంటే అడ్వాన్సు ఇవ్వవచ్చు, నేను మీకొరకై అట్టే పెడతాను అన్నాడు. ప్రమద సంతసించి, విక్రంతో బాగుందండి అడ్వాన్సు ఇవ్వండి ప్లీజ్ అంది.

సరే ప్రమద అని Fred I didn't open my bank account, so I don't have checks if he accepts travel checks I can pay his advance అన్నాడు. ఆ మేనేజరు సరేనన్నాడు. అన్ని ఒప్పందాలు మాటాడుకున్న పిమ్మట విక్రం ప్రమదలు అడ్వాన్సు ఇచ్చి అపార్ట్‌మెంటుకు తాళం వేసుకున్నారు. హోటలుకు మరలిపోయి కారును తమ అపార్టుమెంటుకు డ్రైవ్ చేసినారు. తమ పెట్టెలు ఇతర సామానంత కారు ట్రంకులోనుండి తీసి అపార్ట్‌మెంటులో పెట్టుకున్నారు. అపార్టుమెంటులో ఫర్నీచరు లేదు. Dr. Brooks అచ్చట ఉండగానే ప్రమద కొంచెం టీ చేసి ఓ స్నాక్‌ని ఇచ్చి టీ ఇచ్చింది విక్రంకు, Dr. Brooks కి.

వాళ్ళు క్రొత్తగానున్న లివింగ్ గది కార్‌పెట్ పైననే కూర్చున్నారు. స్నాక్ తిని టీ త్రాగి home sweet home అన్నారిద్దరు. Yes I am happy without any hassle. I got a good apartment అన్నాడు విక్రం. Ya! You are lucky

అన్నాడు Dr. Brooks . కొంచెంసేపు ఆగి O.K. I will take leave. If you need any thing just give me a call అని Dr. Brooks సెలవుతీసుకొన్నాడు. తప్పకుండా, అన్నాడు విక్రం. Dr. Brooks వెడలిపోగానే విక్రం వేరేగదిలో కూర్చొని ఉన్న ప్రమద దగ్గరకు వెళ్లి ఎలా ఉంది నీ కొత్త ఇల్లు? అన్నాడు విక్రం. చాలా బాగుంది, ప్రశాంతినిలయం యీ మన అపార్టుమెంటు అంది ప్రమద. సరే నీ తృప్తి నా తృప్తి, నీ సంతోషం నా సంతోషం అన్నాడు విక్రం. చూస్తుండగానే అయిదు గంటలయ్యింది. సామానంత సర్దుతుంది ప్రమద. ఆమెకు సహాయపడుతున్నారు తండ్రి కొడుకులు. తెచ్చిన సామానంత సర్దుకున్నారు.

తమ ఫోర్వార్డు నుండి వెడలిన సామాను రాగానే కొత్త ఫర్నీచరు కొనవలె. ప్రస్తుతం రెండు పడక గదులకే కొందాము. మూడో గదికి మెల్లగా కొందాము అనుకున్నాడు. రాత్రికి ముగ్గురు కార్పెట్ పైననే పడుకోవాలి. మినియాపిలిస్ చాల ఉత్తర U.S.A. లో కెనడాకు తాకి ఉంటుంది. Winters చాలా చలిగా ఉంటాయి, కాని ఇది spring ప్రొద్దునంత చాలా ప్రశాంతంగా ఉంటుంది, కాని రాత్రి మాత్రము చలిగా ఉంటది. వారు ఒట్టి కార్పెట్ పైన పడుకొంటే చలిగా ఉంటుంది తన వెంబడి కొన్ని చద్దర్లు మరి రెండు బ్లాంకెట్లు తెచ్చుకొన్నారు. వాటితోనే ఆ చలిని తట్టుకోవలె. ప్రమద విక్రంలు వెళ్లి ఒక సమీపంలోనున్న grocery store కు వెళ్లి కొన్ని పళ్లు కూరగాయలు ప్రత్యేకంగా కొన్ని స్నాక్స్ కొని తెచ్చినారు. Refrigirator, stove ఉంది. కరెంట్ వీళ్లు చేరిన సాయంకాలమే ఆన్ చేసినారు గ్యాస్ కూడా ప్రారంభం. అందువల్ల అపార్టుమెంటు heat చేసినారు. తెచ్చిన గ్రోసరీని రిఫ్రిజిరేటర్లో అమర్చింది ప్రమద. కాఫీ, టీకి కెటిల్ కొన్నారు. స్టౌమీద టీ, కాఫీని చేసుకొని సేవిస్తున్నారు.

ఇప్పుడు తమ ఇంట్లో ఉన్నామన్న తృప్తి ప్రమదకు ఉంది. వారి సంసారములో మొదటిరోజు ప్రమద విక్రంకు. రాత్రి కొంత అన్నము ఓ కూర చేసుకొని హాయిగా భుజించి, వారి జీవితము ఆ పట్టణములో ఎలా నడిపించాలెనని మాటాడుకుంటూ కూర్చున్నారు. అలసి ఉన్నందువలన రెండు చద్దర్లు పరచి రెండు బ్లాంకెట్స్ కప్పుకొని హీటర్ థర్మోస్టాట్ను 74° F కు చేసి పడుకున్నారు తెల్లవారి శుక్రవారము, ఆ ఒకనాడు కాలేజికి వెళ్లితే శని, ఆదివారము సెలవులు. అప్పుడు ఫర్నిచరు స్టోర్సుకు వెళ్లి ఫర్నిచరును చూడవచ్చు అనుకున్నారు. విక్రం లేచి బ్రష్ చేసుకున్నాడు పళ్లను, ప్రమద టీ చేసి ఇచ్చింది, విక్రంకు. టీ త్రాగుతు ప్రమద నేను వెళ్లి త్వరలోనే వస్తాను జాగ్రత్తగా ఉండు అని బట్టలు వేసుకొని తలుపు గడియ వేసుకొని జాగ్రత్తగా ఉండండి అని చెబుతూ వెళ్లిపోయినాడు ఆఫీసుకు విక్రం. విక్రం పోగానే ప్రమద మరికొంతసేపు హాయిగా బ్లాంకెట్స్ కప్పుకొని పడుకొంది. ఆనాడు టెలిఫోను కనెక్షన్ సాయంకాలంవరకు తప్పక వస్తుంది అని అపార్టుమెంటు మేనేజరు వాగ్దానం చేసినాడు.

అన్నప్రకారమే ఒక టెలిఫోను కనెక్షన్ ఇచ్చునతను తలుపు బెల్ నొక్కినాడు. అనుపమ్ తలుపు తీసి Yes please! అన్నాడు. I am here to connect your telephone అన్నాడు ఆ వచ్చిన టెలిఫోను కంపెనీవాడు. ప్రమద ఇంకా

సైటీలోనే ఉంది. అమ్మ టెలిఫోన్ కంపెనీవాడు వచ్చాడమ్మ అన్నాడు. ప్రమద వచ్చి తలుపు తీసింది. టెలిఫోను వాడు టెలిఫోను కనెక్షన్ కొన్ని నిమిషాలలో ఇచ్చి, your telephone is on now అని ఏదో కాగితాలమీద సంతకం చేయించుకొని వెడలిపోయినాడు. ఇప్పుడు వాళ్లు ప్రపంచంలో ఎవరితోనైనా మాటాడవచ్చు. ఆ కాలంలో డైరెక్ట్ డీలింగ్ లేకుండెను. Long distance మాటాడవలెనంటే every call has to go through operator. పిమ్మట డైరెక్ట్ డైలింగ్ వచ్చినది కాని 1967లో ఆ వసతి లేకుండెను.

అప్పుడు ఇండియా కాల్ చేయాలంటే మినిమమ్ 16 గంటలైనా కావాలి, సామాన్యంగా 16 గంటలలో రాదు. ఏ 24 గంటలైన కావాలి. భారతదేశంలో మాటాడాలంటే U.S.A. లో కూడా telephone long distance calls minimum మూడు నిమిషాలకు ఛార్జీ చేసేవారు. ఆ ప్రకారము మనము కొన్ని సెకండ్స్ మాట్లాడిన మూడు నిమిషాలకి బిల్ కట్టవలసిందే. ఇండియాకు మూడు నిమిషాలు మాటాడితే పదహారు డాలర్లు అయ్యేది. టెలిఫోను సౌకర్యాలు అంత బాగా లేకుండెను అనాడు. ఇండియాలోనైతే టెలిఫోనులు చాలా తక్కువ. భాగ్యవంతులైన వారి ఇండ్లలోను, మరి ఉన్నత ప్రభుత్వ ఉద్యోగులవద్ద తప్ప చాలా ఇండ్లలో టెలిఫోను సౌకర్యాలు లేకుండెను కాని U.S.A. లో మాత్రము అప్పటికే ప్రతి ఇంట్లో లేట్ ఫోన్స్ ఉండేవి. అప్పటికి ఇప్పటికి U.S.A. లో ఫోను ధరలు చాలా చౌక కాని మన దేశములో అవేమి తగ్గినట్టులేదు. Telephone రాగానే ప్రమద విక్రంకు ఫోను కలిపింది, హెలో! అన్నాడు విక్రం ఆఫీసునుండి. హెలో విక్రం! నేను మాటాడుతున్నాను అంది ప్రమద.

ఎప్పటినుండి అన్నాడు ఆశ్చర్యంతో. మన ఇంటినుండి అంది ప్రమద. ఫోను వచ్చేసిందా? అన్నాడు విక్రం. అవును అంది ప్రమద. వెరీ గుడ్! అన్నాడు విక్రం. ఏం చేస్తున్నారు అంది ప్రమద. ఏమీలేదు? ఆఫీసు అంతా సర్దుతున్నాను. ఇంకా నాలుగురోజుల వరకు ఏమంత పని ఉండదు కొన్ని faculty meetings తప్ప. ఒక మీటింగ్ ఉదయం అయిపోయింది అన్నాడు విక్రం. అయితే ఏమి చేస్తున్నారు ఆఫీసులో? రండి! ప్లీజ్ అంది. సరే! ఇంకో స్టాఫ్ మీటింగ్ ఉంది. అది కాగానే వచ్చేస్తాను అన్నాడు విక్రం.

సరేనని ఫోను పెట్టివేసింది ప్రమద. పిమ్మట టీ చేసుకొని లివింగ్ రూమ్‌లో కూర్చుంది టీ త్రాగుతూ. అనుపమ్ కూడా ప్రమద దగ్గరికి వచ్చి కూర్చున్నాడు. నా స్కూలు ఎప్పటికి తెరుస్తుందమ్మా! అన్నాడు. నాన్న రాగానే తెలుస్తుంది బాబు. త్వరలోనే నీవు స్కూలుకు వెడతావు నాయనా అన్నది ప్రమద. ఇద్దరూ కొంతసేపు మాట్లాడుతూ కూర్చున్నారు. ప్రమద టీ త్రాగి కప్పును తీసుకొని వంటింట్లోకి వెళ్లింది. అనుపమ్ మాత్రం అచటనే కూర్చొని కలలు కంటున్నాడు. పిమ్మట లేచి ఏదో బయటికి వెళ్లి ఒకడే ఆడుకుంటున్నాడు. ప్రమద లంచ్ తయారుచేయడములో లీనమైంది. విక్రం, అనుపమ్‌లకు సమయానికి లంచ్ ఇవ్వాలి. లంచ్ తయారుచేస్తూ ఉండగానే విక్రం వచ్చి బెల్ నొక్కినాడు అనుపమ్ పరుగెత్తి ఎవరు? అన్నాడు. నేను అనుపమ్ అన్నాడు విక్రం.

డాడీ! అంటూ తలుపు తీసినాడు. డాడీ లోనికి రాగానే గట్టిగా హత్తుకొని Mummy is in the Kitchen అని కిచెన్‌లోకి నడచినాడు విక్రంతో. ప్రమద lunch is ready తిందామా అంది సరేనని విక్రం ప్లేటులో పెట్టుకొని తిన్నాడు. అనుపమ్‌కూడా తన లంచ్ తీసుకొని నిలబడియే తిన్నాడు. పిమ్మట Dr. Brooks తో ఫర్నిచరు విషయంలో మాటాడినాను, అతను ఇప్పుడే రావచ్చు. ఇవ్వాళ ఫర్నిచరు కొంటే మన సామానురాగానే సెటిల్ అయిపోతాము.

నీవు తొందరగా తయారై ఉండు అన్నాడు విక్రం ప్రమదతో. నేను పదిహేను నిమిషాలలో తయారవుతాను అనుపమ్‌ను తొందరగా బట్టలు మార్చుకొమ్మనండి ఇంకను పైజామాలోనే ఉన్నాడు అంది. సరే! Daddy I will be ready in 10 minutes అని తన రూమ్‌లోకి వెళ్లి తయారౌతున్నాడు అనుపమ్. ప్రమదకూడా ఇంకో గదిలోకి వెళ్లి 15 నిమిషాలలో తయారయి విక్రం ముందు నిలబడి ఎలా ఉన్నాను అంది. అప్సరసలా ఉన్నావు నీవెట్లున్నా, ఏ బట్టలు కట్టుకున్న నాకైతే ఎప్పుడూ నీవు దేవలోకంనుండి దిగివచ్చిన రంభవో, మేనకవో అనుకుంటాను ప్రమద. నీవు నా అర్ధాంగివి. I didn't have enough of you even today అన్నాడు.

ప్రమద చిరునవ్వు నవ్వింది కొంటెచూపులతో. అనుపమ్ అని కేకవేసినారు విక్రం. Yes daddy అన్న అనుపమ్ గొంతు వినబడింది. Are you ready అన్నాడు విక్రం. Yes dad అని బైటికి వచ్చినాడు అనుపమ్ ముగ్గురూ ఇప్పుడు Dr.Brooks రాగానే ఫర్నిచరు షాపుకు వెళ్లుటకు సిద్ధంగా ఉన్నారు. కొంచెంసేపట్లో Brooks గారు రానేవచ్చాడు. రాగానే Are you guys ready to go అన్నాడు.

Yes అన్నాడు విక్రం. Then let us go అని Brooks బయటికి నడచినాడు. విక్రం Brooks ను అనుసరించాడు. పిమ్మట ప్రమద అనుపమ్‌లు నడచినారు. అందరూ కారులో ఎక్కి వెడలినారు ఆ ఫర్నిచరు స్టోరుకు. లోనికి ప్రవేశించకముందు విక్రంతో ask your wife to select anything and I will negotiate the prices అన్నాడు Brooks. O.K. అన్నాడు విక్రం.

లోనికి పోయి చూచినారు పెద్ద ఫర్నిచర్ దుకాణమది. సుమారు రెండు ఎకరాల విస్తీర్ణములో ఉంది. ఎన్నియో స్టైల్‌లో క్వాలిటీలో వివిధ రకములైన ఫర్నిచరు ఉంది ఆ స్టోరులో. Brooks తో తిరిగి విక్రం మరియు అయన కుటుంబం ఒకసారి సర్వేచేశారు ఆ స్టోర్ అంత. పిమ్మట ప్రమద తనకు కావలసిన బెడ్ రూములు మరియు లివింగ్ రూమ్ మరియు కిచెన్ సామగ్రులు అంటే, మంచాలు వాటిపైకి మేట్రెస్సెస్ మరియు లివింగ్ రూమ్‌కు కావలసిన సోఫాలు, కుర్చీలు చూసింది. ఆఖరున ఒక టి.వి. కూడా చూసింది. వీళ్లతో కలసి తిరుగుతూ వీళ్ల ప్రశ్నలకు సమాధానమిస్తున్న సేల్స్ పర్సన్ ప్రమద అడిగిన ప్రశ్నలకు సమాధానాలిస్తున్నాడు. టి.వి. ఆఖరు ఐటమ్. అది కాగానే, Is that all Madam అన్నాడు ఆ Sales person. Yes please! అంది.

Brooks & Vikram ఆ సేల్స్ పర్సన్‌తో వెళ్లి బేరంచేసి కొంచెం తగ్గించినారు. పిమ్మట పేమెంట్ విషయం రాగానే, don't worry he is our faculty member. He will pay every month అన్నాడు Brooks . సరే, సర్! అని తయారుచేసిన

బిల్ మరియు నెల వాయిదాల అగ్రిమెంట్ పై విక్రంతో సంతకాలు చేయించుకొని, మీకు రెండు గంటలలో మీ ఇంటికి పంపిస్తాను అన్నాడు ఆ మేనేజరు. సరే అని విక్రం మరియు కుటుంబం Brooks తో కలసి అవతలకి వెళ్లి కారులో కూర్చొని ఇంటికి వెళ్లినారు. దిగగానే ప్రమద విక్రంతో మీ స్నేహితుణ్ణి కాఫి త్రాగి వెళ్లమనండి అని చెప్పింది. విక్రం అహ్వానించగానే Brooks సరే అని వీరితో లోనికి వెళ్లినాడు. విక్రం మరియు Brooks లివింగ్ రూములో కార్ పెట్ పై కూర్చున్నారు. ప్రమద, అనుపమ్ లోనికి వెళ్లినారు. రాగానే అనుపమ్ బ్లాక్ కాఫీ Brooks కు, పాలు కలిపిన కాఫీ విక్రంకు చేసి అనుపమ్‌తో పంపి నిమిషంలో తనుకూడా కాఫీ కలుపుకొని వచ్చి వారితో లివింగ్ రూములో కూర్చొంది. కాఫీ త్రాగేసి Brooks వెళ్లిపోయినాడు. విక్రం, ప్రమద, అనుపమ్‌లు లివింగ్ రూములో కూర్చొని ఫర్నిచరు ట్రక్ కై ఎదురుచూస్తున్నారు.

చూస్తుండగానే ఒక ఫర్నిచరు ట్రక్ అపార్టుమెంటు కాంప్లెక్స్‌లో వీరిచ్చిన అపార్టుమెంటు నంబరుకై వెతుకుతున్నాడు. ఇదిచూచి అనుపమ్ రివ్వున పరుగెత్తి తామున్న అపార్టుమెంటును చూపినాడు. ఆ ట్రక్ అపార్టుమెంటు ముందు అగింది. ఆ ట్రక్ డ్రైవర్ ఒకడే లోనికి వచ్చి ఆ ఫర్నిచరు ఏయే స్థలంలో పెట్టాలో చూసుకొన్నాడు. పిమ్మట ఒకడే అంత ఫర్నిచరు ఒక చిన్నపాటి ట్రాలీతో అంతా లోనికి తెచ్చి అన్ని రూములలో ఆ ఫర్నిచరుని అమర్చినాడు. గంటసేపట్లో రెండు పడక గదులు, లివింగ్ గది మరియు వంటగదులన్నీ సామానుతో నిండిపోయినవి. ముగ్గురు వాటిపైన కూర్చొని సరిగ్గా పొందినవా అని చూచుకున్నారు. పడక గదులలో బట్టల బీర్వాలు, మంచాలు మదిరియు అద్దాలతో అమర్చిన బీర్వాలు night stands light stands అన్నీ అమర్చి పోయినాడు. లివింగ్ రూములో సోఫాలు, లాంప్స్, కాఫీ టేబిల్ మరియు చిన్న టేబిల్స్ అన్నీ అమర్చినారు. ఇప్పుడు గాని ఉండుటకు యోగ్యంగా లేదు అంది ప్రమద. Yes, అన్నాడు విక్రం. ఇప్పుడు వాళ్లకు కావలసిన సౌకర్యాలన్నీ ఉన్నాయి. ఒక గెస్ట్ రూము ఫర్నిచరు కావాలి. మెల్లగా వాటినికూడా కొందామనుకున్నారు. అనుపమ్ తన బెడ్ పైన పడుకున్నాడు కొంతసేపు, కొంతసేపు తన డ్రెస్సింగ్ టేబిల్ ముందు నిలుచుని దువ్వుకున్నాడు. మరికొంతసేపు స్టడీ టేబిల్ పైన కూర్చొని పుస్తకాలు తెరచినాడు. విక్రం ప్రమదలు తమ బెడ్ పైన ఒరిగినారు. వారికిప్పుడు కావలసిన సౌకర్యాలన్నీ వాళ్ల పడక గదులలో ఉన్నవి. ఒక ప్రక్కన ఆ రూములలో ఒక స్టడీ టేబిల్ మరియు ఒక కుర్చీకూడా ఉంది. ఇద్దరు కొంచెంసేపు తమ King size bed పైన విశ్రాంతి తీసుకున్నారు హాయిగా. ఇంతలో అనుపమ్ వీరి గది తట్టి తలుపుపైన నాక్ చేసినాడు. అది వినగానే విక్రం Who is it అన్నాడు. నేనే, నాన్నా అన్నాడు అనుపమ్ తలుపవతలినుండి. I want to come in dad అన్నాడు sure నాన్నా you can come in అన్నాడు విక్రం. అనుపమ్ లోనికి వచ్చి యిద్దరిమధ్య ఇరికినాడు. I am very happy dad అన్నాడు అనుపమ్. Yes son me too అన్నాడు విక్రం. O.K. dad you can rest now I will go and rest in my own room అని లేచినాడు. సరే నాన్న అన్నాడు విక్రం. Close the door అన్నాడు విక్రం. సరేనని అనుపమ్ తలుపు వేసి వెళ్లి

తన రూములో ఏవో సర్దుతున్నాడు. ఇప్పుడు విక్రం ప్రమదలు ఇద్దరే ఆ రూములో ఉన్నారు. ప్రమద ఇప్పుడు ఎలా ఉంది నీ ఇల్లు అన్నాడు. ఇది మన ఇల్లంది నా ఇల్లు కాదు అంది. సరే ఎవరిదైనా మన అందరి ఇల్లు ఎలాగుంది అన్నాడు విక్రం. బాగుంది, అన్నది ప్రమద. ఇక లివింగ్ రూములో ఒక స్టీరియో కావాలి మళ్లీ నెలలో ఒక మంచి స్టీరియో కొందాము అన్నాడు. సరే అంది ప్రమద అప్పటికి అయిదు కావస్తుంది. ఇద్దరు ఒకరి బాహుబంధాలలో మరొకరు బంధింపబడి ఉన్నారు పడుకొన ప్రయత్నించినారు. కాని నిద్ర రాలేదు. ఇద్దరు లేచి ఆ రూముకు అంటుకొనున్న బాత్‌రూములోకి వెళ్లి కండ్లు, మొఖము కడుక్కొన్నారు. పిమ్మట ప్రమద వంటగదిలోకి వెళ్లి టీ చేసింది రెండు కప్పులలో టీ తీసుకొని వచ్చింది. కాఫీ టేబిల్ పైన టీ ని విక్రంకు ఇచ్చి తనొక కప్పు తీసుకొని మెల్లగా ఏవో లోకాభిరామాయణము మాట్లాడుచూ కాఫీ పూర్తిచేసినారు. అప్పుడు అయిదు గంటలు సరే మీ యూనివర్సిటీలో తిరిగి వద్దాము పదండి అంది ప్రమద. సరే తయారుకండి వెడదాం అన్నాడు. అరగంటలో అనుపమ్ ప్రమద తయారై మేము రెడీ అని లివింగ్ రూములోకి వచ్చినారు. సరే పదండి అని ముగ్గురూ కారెక్కినారు. విక్రం కారును యూనివర్సిటీకి పోయే రోడ్డుకు మరలించినాడు. అర గంటలోనే కారు కాంపస్‌కు చేరుకుంది. అన్ని కాలేజీలు, డిపార్టుమెంటు బిల్డింగ్స్ చూపినాడు కాంపస్ చాలా పెద్దది. అన్నీ మూసివేసినారు ఆ దేశంలో నిర్ణీత సమయాల్లో అందరూ పనిచేస్తారు, టైము కాగానే అందరూ వెడలిపోతారు సాయంకాలం ఏమైనా social activities కు తప్ప మరేమీ ఉండవు అటువంటి activities లేకపోతే అంత నిశ్శబ్దంగా ఉంటుంది మొత్తం క్యాంపస్. పెద్ద క్యాంపస్ కాబట్టి ఏ కాలేజీలోనైన ఏదో ఒక activity వుంటుంది. కారులో క్యాంపస్ అంతా విక్రం, ప్రమద – అనుపమ్‌లకు చూపించినాడు, పిమ్మట సిటీ చూపించుటకు ప్రమదను తీసుకవెళ్లినాడు ఆ పట్టణములోని shopping centers ను మరియు down town కు తీసుకవెళ్లినాడు. ఏడు, ఎనిమిది గంటలవరకు తిరిగి ఇంటికి చేరుకున్నారు ముగ్గురు మొఖాలు కడుక్కొని, పైజామాలు వేసుకొని లివింగ్ రూములో పెద్ద సోఫాపై కూర్చొని టి.వి. చూస్తున్నారు ముగ్గురు విక్రంకు ఏవో కొన్ని కార్యక్రమాలు తప్ప టి.వి. అంత ఇష్టం ఉండదు. అప్పుడప్పుడు కొన్ని మంచి సినిమాలు ఉంటే చూస్తాడు, సీరియల్స్ మాత్రము అంతగా చూడడు. ప్రమద పాపం వంట చేస్తూ, వంటచేసిన పిమ్మట కూడా సీరియల్స్‌ను చూస్తూనే ఉంటుంది. ప్రత్యేకంగా ఆమె "Days of our lives" తప్పకుండా చూస్తుంది. అది ఆమెకు అలవాటుగా మారిపోయినది. అమెరికాలో ఇంకా కొన్ని కార్యక్రమాలుకూడా చూస్తుంది. అనుపమ్‌కు శనివారము మరియు ఆదివారము కార్టూన్స్ చాలా ముఖ్యము. పని రోజులలో ఉదయం లేవమంటే అం , వూం , అనుకుంటూ ప్రమదను వేసార్పుతాడు కాని శని, ఆదివారాలలో ఎవరూ లేవకముందే లేచి సోఫాపైన ఒరిగియే కార్టూన్స్ చూస్తుంటాడు. విక్రం, ప్రమదలు మాత్రం పూర్తి స్వాతంత్ర్యంతో ఇష్టమొచ్చినంతసేపు నిద్రిస్తారు. మెల్లగా లేచి మొఖాలు కడుక్కొని టీని ఇద్దరు సేవిస్తారు. హాయిగా మాటాడుకుంటూ

చాలాసేపటివరకు టీ సిప్ చేసుకొంటూ leisure గా లోకాభిరామాయణము మరియు వారి బంధువుల గురించి మాటాడుకుంటూ కూర్చుంటారు. ఆదివారం మాత్రం విక్రం కొన్ని టి.వి. కార్యక్రమాలు తప్పకుండా చూస్తాడు. అతనితో ప్రమదకూడా వీటిని చాలాసార్లు చూస్తుంది. ఇవి వార్తలకు సంబంధించినటువంటివి. కాబట్టి మన ప్రపంచ జ్ఞానాన్ని పెంపొందిస్తావని విక్రం నమ్మకం. కాని ప్రమదకు అంత ఇష్టం ఉండదు. కాని భర్తతో పాటు చూసుకుంటూ అప్పుడప్పుడు కొన్ని ప్రశ్నలు వేస్తుంటుంది. కొన్నిసార్లు స్నేహితులతో టెలిఫోనుపైన చాలాసేపటి వరకు మాట్లాడుతుంది. ఆదివారము long distance phone లో చాలాసేపటివరకు తన పాత స్నేహితులతో మాటాడుతుంటుంది. ఆ విధంగా శని, ఆదివారాలు తొందరగా గడచిపోతవి. చూస్తుండగానే Minneapolis లో రెండు నెలలు గడచిపోయినవి. ఇది నవంబరునెల చలికాలం రాబోతుంది. ఇక్కడ చలికాలంలో చాలా తీవ్రమైన చలి ఉంటుంది. ఉత్తర U.S.A. అంత 5 నుండి 6 నెలలు చలి కొన్ని కొన్నిసార్లు విపరీతమైన చలి ఉంటుంద. మరి దక్షిణ అమెరికాలో చలి చాలా తక్కువ ఇక మధ్య U.S.A. లో ఆ రెండు ప్రాంతాలలోనున్న వాతావరణాన్ని కలిపితే ఎలా ఉంటుందో అలా అంటే ఒక రెండు నెలలు తీవ్రమైన చలి. నాలుగు నెలలు pleasant wealther మరి ఆరు నెలలు బాగుంటుంది. కాని ఆ ఉత్తర U S.A. లో నున్న మినియాపిలస్‌లో మాత్రము ఆరు నెలలు చలియే అని చెప్పాలి ఏప్రిల్ నుండి సెప్టెంబరు వరకు వాతావరణము బాగానే ఉంటుంది. ఇప్పుడు నవంబరు మాసము. Thanks giving vacation శని, ఆదివారము కలుపుకొని నాలుగురోజుల holidays University కి. నాలుగు రోజులలో కొత్తగా పరిచయమైన అమెరికన్ మరియు ఇండియన్ స్నేహితులను కలుసుకున్నాము. నాలుగు రోజులు అట్లే గడచిపోయినవి. డిసెంబరు నెలాఖరుకు X-mas vacation. ఆ vacation లో నాలుగైదు రోజులు చికాగో స్నేహితులు రమ్మంటే పోయినాము. అచ్చట కొన్న స్థలాలను చూపించినారు మా స్నేహితులు. అవన్నీ చూచి మళ్లీ మినియాపొలిస్ చేరుకున్నాము. ఇట్లే మా X-mas vacation పూర్తి అయినవి ఇప్పుడు మేము 1967 లో అడుగుపెట్టినాము. నూతన సంవత్సరము ఏమి తెస్తుందో? ఎలాగుంటుందో అని ఆకాంక్ష . అనుపమ్ రెండవ తరగతిలో చదువుతున్నాడు స్కూలులో కొంతమంది స్నేహితులతో పరిచయమయ్యింది కాని కొందరు వీడు వేరే దేశస్థుడు అన్న భావనతో చూస్తారు అనుపమ్‌ని. అనుపమ్ మాత్రం వాళ్లతో చాలా స్నేహభావంతో వుంటాడు. ఇంతవరకు వానికి ఏమి ప్రాబ్లెమ్స్ లేవు. పేరెంట్స్–టీచర్స్ మీటింగులలో అచ్చటివారు తప్పకుండా హాజరు అవుతారు. మొదలు మొదలు ప్రమద విక్రంలు హాజరు చేసేవారు కాని రాను రాను విక్రం మానివేసినాడు. ప్రమద కొన్ని వారాలు హాజరుచేసి మానుకుంది. ఇందుకు కారణము వారి కల్చర్‌ను అర్థంచేసుకొనక పోవడమే. అనుపమ్‌కూడా పేరెంట్స్‌ను ఫోర్స్ చేయలేదు. ఆయన ఇవి హాజరు చేయక ప్రమద విక్రంలు తప్పు పని చేసినారో ఏమో తెలియదు.

రోజూ విక్రం తను ఆఫీసుకు వెళ్లేముందు మొదలే అనుపమ్‌ను స్కూలులో

విడిచి పిమ్మట తన ఆఫీసుకు వెళ్లేది. రోజూ $6\frac{1}{2}$ గంటలకు లేచి అనుపమ్‌ను విడచి ఎనిమిది గంటలకు ఆఫీసులో ఉండేది. ఇతని క్లాసు తొమ్మిది గంటలకు. రోజూ ఒక గంటసేపు class lecture notes తయారుచేసుకుంటూ తొమ్మిదికి తన లెక్చర్ పూర్తిచేసి మళ్లీ ఆఫీసులో 10 నుండి 11 వరకు పనిచేస్తూ కూర్చుండేది. పిమ్మట 11 నుండి 12 వరకు రెండవ లెక్చర్ పూర్తిచేసి ఇంటికి వెళ్లి లంచ్ చేసి ఆఫీసుకు వచ్చి తన పనిలో నిమగ్నుడై $4\frac{1}{2}$ కాగానే ఏమైనా పని ఉంటే బ్రీఫ్‌కేస్‌లో పెట్టుకొని ఇంటికి వచ్చేది అప్పటికే అనుపమ్ ప్రమద ఇంటిలో ఉండేది. రాగానే ప్రమద విక్రంకు కాఫీ ఇచ్చి తనుకూడా కాఫీతో విక్రంతో కూర్చొని వార్తలు వినేది. పిమ్మట కొంచెంసేపు టి.వి.తో కాలక్షేపం చేస్తూ ఉండేవారు.

చూస్తుండగానే తొమ్మిది నెలలు గడచిపోయినవి. విక్రం final exams ఇచ్చినాడు. రిసల్ట్స్ డిపార్టుమెంటులో సబ్‌మిట్ చేసినాడు ఇక ఇప్పుడు వేసవి సెలవులు ఉత్తర అమెరికాలో వేసవిలో ప్రజలు చాలా ఎంజాయ్ చేస్తారు. అగస్టులో నూటికి 60 శాతము దేశస్థులు ప్రయాణిస్తుంటారు. ఉత్తర ప్రాంతములో మంచు నవంబరునుండి మొదలయి ఏప్రిల్ వరకు పడుతూనే ఉంటుంది. అంటే, మే నుండి గాని బయట పచ్చగా అవదు ఒక్కొక్కసారి లేదా సామాన్యంగా సెప్టెంబరులో కూడా ఒకటి రెండు మంచుజల్లులు పడవచ్చు. అక్టోబరు ప్రతి సంవత్సరం ఒకసారైన మంచు పడుతుంది. అట్లే ఏప్రిల్‌లో కూడా ఒకసారి మంచు పడవచ్చు. కాని నవంబరునుండి మార్చివరకు మంచు పడే అవకాశాలు చాలా ఉంటాయి. ఉత్తర మిన్నసోటాలో నవంబరులో పడిన మంచు మార్చి చివరివరకు ఉంటుందంటే ఆశ్చర్యపడవలసిన అవసరము లేదు. కాని పూర్తిగా దక్షిణభాగంలోనున్న టెక్సాస్, లూసియానా, మిస్సిస్సిప్పి, అలబామా, జార్జియా, ఫ్లోరిడాలో మంచు పడదు, పడితే అదొక వింత. ఇక మధ్య U S.A. లో మంచు మామూలుగా పడుతుంది. అందుకే ఉత్తర U.S.A. ను winter లో deep freezer అంటారు కొందరు ఇప్పుడు ఉత్తరంలో ఉన్నవారు దక్షిణంలో బ్రతుకుదెరువు చూచుకోవలెనని January మాసంలో ఆ చలికి మంచుకు తట్టుకోలేము అనుకుంటారు. చాలామంది తాము రిటైర్ కాగానే దక్షిణాది వెళ్లిపోవాలని చూస్తుంటారు. విక్రం భారతీయుడు, భారతదేశమంటే గౌరవం. ఏదో ఒకప్పుడు స్వదేశం వెళ్లిపోవాలని ఆయన కాంక్ష. ప్రమదకు తన భర్త ఎక్కడ ఉంటే అయనతో నేనుంటానంటుంది కాని అనుపమ్ మాత్రం U.S.A. లోనే ఉంటానంటాడు. అందులో అంత అతిశయోక్తి ఏమీలేదు. రెండేళ్ల ప్రాయముననే ఇచ్చటికి వచ్చినాడు. ఇక్కడే చదువుతున్నాడు. వాడి స్నేహితులంత ఇక్కడే ఉన్నారు కాబట్టి ఆ బాలుడట్లనుటలో ఆశ్చర్యమేమియు లేదు. కాని విక్రంకు స్వదేశం వెళ్లిపోవాలని ఉంది. కాని I.A.S. వదలి వచ్చిన వ్యక్తి స్వదేశానికి పోవాలంటే అంతకన్న పెద్ద ఉద్యోగం వస్తేనే పోతాడు. లేనిచో పోడని ప్రమద నమ్మకం. కాని భర్తతో ఆ సంగతి చర్చించదు. ఎపుడైన విక్రం అడిగితే మీరెక్కడుంటే నేనక్కడుంటాను అని సమాధానమిస్తుంది. ఇప్పుడు వేసవి సెలవులు వెకేషన్‌లో ఎచ్చటికి పోవాలంటావు ప్రమద అన్నాడు విక్రం. మీరాలోచించండి అంది. నీకెక్కడికి

పోవాలని ఉంది అన్నాడు విక్రం. మీకెక్కడికి పోవాలని ఉంటే మీతో నేను వస్తాను అంది. అనుపమ్‌ను అడిగితే I don't know dad. It is upto you ఇక vacation plan విక్రం పైననే పడింది. విక్రం ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నాడు ఇక్కడికి సమీపంలోనున్న 700–800 వందల మైళ్లు ఇచ్చట అంతదూరం కాదు. Black Hills & Yellow stone park లను చూచి కాలిఫోర్నియాలోనున్న ప్రమద స్నేహితురాలును కలుయుటకు పోదామనుకొన్నారు. ఒక చిన్నపాటి పతకాన్ని తయారుచేశారు. ఆ పతకం ప్రకారం కొన్ని హోటల్లలో రిజర్వేషన్ చేయించారు. ప్రమద ప్రయాణంలో తినుటకు కొన్ని తినుబండారాలు చేసి వెంబడి పెట్టుకుంది Minneapolis రాగానే ఒక కొత్త యింపాల కొన్నారు. అందులో A.C. మరియు స్టీరియో ఉంది. ఆనాడు అదే సౌకర్యమైన కారు. ప్రత్యేకంగా భారతీయులంతా యింపాల అంటే మంచి కారని కొనేవారు. కారు కొత్తదుంటే త్రోవలో ఏ సమస్యలు రావు. అంతేకాకుండా అనుకున్న టైములో మన గమ్యస్థానం చేరవచ్చు. త్రోవలో కారుకేమైన అయితే చాలా inconvenience కాకుండా రిపేరు ఖర్చులుకూడా మోసం చేసి చాలా వసూలు చేయవచ్చు అందుకే ఉన్నవాళ్లలో తెలిసిన రిపేర్ కంపెనీలలో తప్ప వేరేచోట అందులో ప్రత్యేకంగా మన కారు అగిపోతే కారు రిపేరు చేసే మోసకారుల చేతులలో చిక్కుకొనవలసి ఉంటుంది ఇప్పుడు విక్రంది కొత్త కారు కాబట్టి అట్టి ప్రాబ్లెమ్స్ రావు అనుకున్న ప్రకారం గమ్యస్థానం చేరవచ్చు. అనుకున్న ప్రకారం మన ఇంట్లో ఉండవచ్చు.

ఇప్పుడు తీసుకునే వెకేషన్ రెండు వారాలది. ఆ రెండువారాలకు కావలసిన బట్టలన్నీ ప్రమద మూడు సూట్‌కేస్‌లలో సర్దింది. పిమ్మట వేరే బ్యాగులలో విక్రం షేవింగ్ సెట్ అనుపమ్ ఆటవస్తువులు పెట్టింది. ఒక చిన్న బాస్కెట్‌లో కొన్ని ఫలహారము, పండ్లు పెట్టుకుంది త్రోవలో తినేటందుకు. ఒక పెద్ద నీళ్లు పోసె ధర్మాస్ డబ్బాలో నీళ్లు పోసుకొంది. ఆ రెండు ముందర తన కాళ్లవద్ద ఉంచింది. అనుపమ్ ఆడుకునే వస్తువులున్న సంచిని వెనుకసీటు కిందపెట్టింది. మూడు సూట్‌కేస్‌లను కారు డిక్కీలో పెట్టినాడు విక్రం. కొన్ని పేపర్ టవలులు, పేపర్ కప్పులు, గ్లాసులు కారు ముందు భాగంలో పెట్టినాడు. ఇప్పుడు వీరు సిద్ధంగా ఉన్నారు వెకేషన్‌కు. ఉదయం పది కావస్తుంది. ప్రమదా ఏమైనా మరచినామా? టేప్స్ తీసుకున్నారా అంది ప్రమద. అవి ఎప్పుడూ కారులోనే ఉంటాయి. ఇండ్లకు లాక్ వేసినాము సరే ఇక బయలుదేరుదామా dear అన్నాడు విక్రం. సరే అంది ప్రమద. కారు స్టార్ట్ చేసేముందు కొద్ది క్షణాలు విక్రం కళ్లు మూసుకొని పిమ్మట కళ్లుతెరచి కారు స్టార్ట్ చేసి గేరేజ్‌నుండి వెనుకగా తీసినాడు. పిమ్మట కారును street మీదికి నడిపి అక్కడినుండి మెయిన్ రోడ్డుకు తీసినాడు. బెల్ట్ వేసుకున్నావా ప్రమదా అన్నాడు. అవునంది ప్రమద. O.K. We are in vacation అని కారు వేగంను 30 మైళ్లకు సాగించాడు. అటునుండి Hiway 94 West signs కు చూస్తున్నారు కొద్దిసేపట్లో Hiway 94 West sign వచ్చింది. కారును Hiway 94 West కు తరలించినాడు. జాగ్రత్తగా Hiway 94 West మీదికి పోగానే కారు వేగం 75–80 మైళ్లకు సాగించినాడు. క్రూస్ మాత్రము 79 మైళ్ల వేగంమీద ఉంది. స్టీరియో

ఆన్ చేసినాడు. 'ధర సమీరె యమునా తీరె' అనే పాటతో టేప్ మొదలయింది ప్రమదా ఆ పాటలు లేకుంటే నేను డ్రైవ్ చేయలేను సుమా! అంతేకాదు, యీ దేశంలో ఉండిపోదునో లేదో అన్నాడు ప్రమదకూడా, నాకు కూడా హోమ్ సిక్ నెస్ పోతుందండి ఆ పాటలవల్ల అని పాటలు వింటుంది. అనుపమ్ వాడి ఆటవస్తువులతో వాడి ప్రపంచంలోకి దిగినాడు. విక్రం కారు స్టీరింగ్ పై ఏకాగ్రత చేసి ఉంచినాడు. Hiway మిన్నసోటాలో ఎన్నియో పెట్టినాల exits ను దాటి వెడుతుంది. వీళ్ల ప్లాను ప్రకారము ఆ రాత్రి Dickenson అను పట్టణములో ఒక హోటల్లో ఆ రాత్రికి రిజర్వేషను చేసినారు. క్రెడిట్ కార్డుతో రిజర్వేషన్ అయి ఉంది రాత్రి 9 గంటలకు ముందే చేరుతామని అంచనావేసినాడు విక్రం. కారు శరవేగంగా ప్రయాణం చేస్తుంది విక్రం మంచి డ్రైవర్ ఏకాగ్రత ఉంది కారుపైన అక్కడి Highway లో కొద్ది జాగ్రత్త తీసుకుంటే Highway లో కారు ప్రమాదాలుండవు అన్ని కార్లు ఒకేవైపు వెడుతుంటాయి. వేగంగా వెళ్లాలంటే left hand line లో పోతారు మెల్లగా. అంటే సుమారు 40 మైళ్లకు పైగా వెళ్లేవారు right hand line లో వెడతారు అందుకే భారతదేశాన్ని పోల్చిచూస్తే డ్రైవింగ్ U.S.A. లో చాలా తేలిక. యధావిధిగా ప్రమద కునుకుతీస్తుంది విక్రం కారుపైన ఏకాగ్రత చేసి నడుపుతున్నాడు పాటలు వినుకుంటూ. ఒంటి గంట సమయం. ఆకలి వేస్తుందా ప్రమద అన్నాడు విక్రం. ఆఁ , అని లేచింది. ఏమిలేదు, ఆకలివేస్తుందా అన్నాను, అన్నాడు విక్రం మీకు అంది ప్రమద. లేదు అన్నాడు విక్రం. సరి లేచినావు కదా ఒక కప్పు కాఫీ ఇవ్వగలవా అన్నాడు విక్రం. సరే అని ధర్మాస్ నుంచి కాఫీ ఒక కప్పులోకి పోసి అందించింది. విక్రం కాఫీ అందుకొని సిప్ చేస్తున్నాడు. నీవుకూడా తాగు అన్నాడు సరేనని ఆమెకూడా ఒక పేపరు కప్‌లో పోసుకుంది ఇద్దరూ కాఫీ సేవిస్తూ తమ ఇండియా జీవితాన్ని నెమరువేస్తున్నారు

విక్రం· ప్రమదా నేను కొన్ని ప్రశ్నలు వేస్తా హోనెస్ట్ జవాబిస్తావా. ఇవి పొద్దుపోవుటకే కాని వేరేవిధంగా కాదు అన్నాడు సరే అడగండి అంది ఏమనుకోవు కదా అన్నాడు. నో, ఏమనుకోను అడగండి అంది నీవు ఎవరినైనా జీవితములో ప్రేమించినావా అన్నాడు. అవును, ప్రేమించినాను అంది. ఎవరిని అన్నాడు విక్రం. మా తల్లిని, మా తండ్రిని, నా తోడబుట్టిన వారిని అంది. పక్కున నవ్వినాడు విక్రం. నేనన్నది కాలేజిలో ఉన్నప్పుడు, అన్నాడు అవును, కాలేజిలో ఉన్నప్పుడు ప్రేమించినాను తల్లిదండ్రులను అంది. అది కాదు ప్రమద, ఎవరినైనా అబ్బాయిలను అన్నాడు. No, never అంది మా నాన్న ఈ విషయములో ఎప్పుడు పరోక్షంగా మేము వినునట్లు దీనికి విరుద్ధంగా అమ్మతో ఎవరెవరి గురించో మాటాడేవాడు. అందుకే నాకు అటువంటి ఆలోచనకూడా రాలేదు. మీ విషయమై మాటాడుతున్నప్పుడు విన్నాను.

ఇంకా కొందరి విషయంకూడా మాటాడినాడు. కుటుంబమన్నాక ఇవి జరుగుతుంటాయి. అమ్మ, నాన్నలు మాటాడుతుంటే వినేదాన్ని అంతేకాని, నేనెవరిని ప్రేమించలేదు. ప్రేమ పెళ్లయినాకనే అనుకునేదాన్ని. మన దేశము పాశ్చాత్య దేశముకాదు. మన సంప్రదాయము అంతకంటే కాదు. అందువల్ల నాకు ఆ

సమస్యలే రాలేదు. నా స్నేహితులు అందరుకూడా అంతే. మాకు ఏ మగపిల్లలతో సంబంధము, స్నేహము లేకుండెను మా స్నేహితులంతా ఆడపిల్లలే. అన్నయ్య స్నేహితులెవ్వరైనా వస్తే డ్రాయింగ్ రూములో కూర్చొని అన్నయ్యతో మాటాడి పోయేవారు. వారున్నప్పుడు మేము మా రూములలోనే ఉండేది అంది ప్రమద. అలానా ప్రమద అన్నాడు విక్రం. ఇప్పుడు మూడు కావస్తుంది. అని మాట మార్చినాడు విక్రం. ఆకలి వేస్తుందా అన్నాడు విక్రం. ఆకలి వేసినా, వేయకున్నా లంచ్ చేయుట మంచిది, అని కారు వెనుక సీటులోనున్న అనుపమ్ దిక్కుకు మళ్లి నాన్నా ఆకలివేస్తుందా 'అను' అంది ప్రమద Yes, మమ్మీ ఇక లంచ్ తీసుకుందాం మమ్మీ అన్నాడు అనుపమ్. సరే నాన్న next exit తీసుకుంటా ఏవైనా రెస్టారెంటులు ఉంటాయి అన్నాడు విక్రం. ప్రమద విక్రంతో exit sign మరియు ఏమేమి తినేచోట్లు ఉన్నవా అని చూస్తున్నారు. పదిహేను నిమిషములు డ్రైవ్ చేయగానే Gas food signs కనిపించినవి ఇది ఫార్గోకు ఆవల కొన్ని మైళ్లు ఆ exit కు తీసుకున్నాడు విక్రం కుడివైపుకు కారును నడిపి గ్యాస్ స్టేషన్లో ఆపినాడు. గ్యాస్ నింపుకొని, ఒక 'నేషనల్ ఛెయిన్ రెస్టారెంట్' వద్ద ఆపినాడు. ముగ్గురు దిగి లోనికి వెళ్లినారు. మొఖం, చేతులు కడుక్కొని వచ్చి భోంచేసే బల్లపై కూర్చున్నారు. వారికి ఇష్టమొచ్చినవి ఆర్డర్ చేసి భోంచేసినారు. పిమ్మట కొంచెంసేపు లాబిలో విశ్రాంతి తీసుకున్న పిమ్మట కారు ఎక్కి బయలుదేరినారు Hiway 94 పైకి రాగానే విక్రం 75-80 మైళ్ల మధ్యన కొంచెంసేపు నడిపి 76 మైళ్లపైన cruise adjust చేసి stearing wheel ను చూస్తూ కూర్చున్నాడు. అనుపమ్ వాని ప్రపంచంలో ప్రవేశించినాడు. ప్రమద మేల్కొని ఏవో విక్రంకు చెబుతుంది. విక్రం వూం కొడుతూ స్టీరింగ్ను కంట్రోల్ చేస్తున్నాడు. చూస్తుండగానే ఏడు గంటలు కావస్తుంది. Bismark దాటినారు. Bismark North Dakota కు ముఖ్య పట్టణము. మొత్తము జనాభా ఆ స్టేటులోన 8 లక్షలమందికి ఎక్కువ వుండరు. ఆ పట్టణము అమెరికాలో ఉన్న చిన్న పట్టణాలవలెనే ఉంది. ఇండస్ట్రీ ఏమంతలేదు ఎటుచూచినా మైళ్లకొలది దూరము పచ్చటి చేలు తప్ప ఇంకేమీ కానరావు. ఇది గోధుమల ఉత్పత్తిలో మొత్తం U.S.A. లో రెండవ స్థానాన్ని ఆక్రమించింది. మొదటి శ్రేణిలో Kasas State కు చోటట. ఇక్కడ ఒక పెద్ద పట్టణము లేదట. అన్నిటికన్న పెద్ద పట్టణము ఫార్గో అట. అంటే, ఫార్గో, బిస్మార్క్ రెండు పెద్ద పట్టణాలు. ఆ Highway 94 మీదనే ఉన్నవట. Any way Minneapolis దాటగానే చాలా తక్కువ జనాభా. ఫార్గో దాటినంక అతి తక్కువ జనాభా. ఎంత దూరము చూచిన పచ్చటి బయల్లే కాని మానవులు కానరారు. ఇక బిస్మార్క్ దాటితే వట్టి పచ్చిక బయళ్లు తప్ప మానవుల వాసనకూడా ఉండదు. బిస్మార్క్ నుండి డికెన్సన్కు 100 మైళ్లకు పైగా ఉంటుంది. కాని త్రోవలో పట్టణాలే కనుపించలేదు. అచ్చటచ్చట మనదేశంలో లంబాడి తండాలున్నట్లు ఇచ్చట Native peoples reservation లు ఆ N.D. లో కనబడుతావి. సాయంకాలం తొమ్మిదివరకు డికెన్సన్ చేరుకున్నాము. డికెన్సన్ ఎక్జిట్ తీసుకొని వూరి బయటకు చేరుకున్నారు. వీరు రిజర్వ్ చేసిన హోటల్ ఈ ఊరు బయటనే ఉంది. కారును అటువైపు మరలించినాడు. Parking

space లో పార్క్ చేసి హోటల్ కౌంటరువద్దకి వెడలినారు. పేరు చెప్పగానే Yes sir, yours is room 125 అని ఒక అబ్బాయిని మా సామానును రూములో పెట్టవలసిందిగా ఆజ్ఞాపించాడు. మా సామానంత రూముకు చేరుకుంది అనుపమ్, ప్రమదలను రూములో ఉంచి కారువద్దకి వెళ్లి అంతా చూసి తాళాలువేసి రూముకు చేరుకున్నాను రాగానే రూములో ఉన్న బెడ్ పై ఒరిగినాడు. అనుపమ్, ప్రమద టి.వి చూస్తూ కూర్చున్నారు. విక్రం మాత్రం మంచంపై ఒరిగి కళ్లుమూసుకొని పడుకున్నాడు, అయిదు నిమిషాలపాటు. పిమ్మట లేచి తనుకూడా టి.వి. చూసినాడు కొంచెంసేపు. పిమ్మట బాత్ రూములోకి వెళ్లి కండ్లు, మొఖం కడుకొని వచ్చి let us eat something అన్నాడు ప్రమద, అనుపమ్‌లతో సరేనని వాళ్లన్నారు టి.వి. ఆఫ్‌చేసి ఆ హోటల్ ప్రక్కనే ఉన్న రెస్టారెంటులో తిన్నారు మళ్ళీ వచ్చి పడుకుని తెల్లవారి లేచి కాఫీ సేవించి హోటలు బిల్లు కట్టేసి కారెక్కి మళ్లీ Hiway 94 పైన బడ్డారు డికెన్‌సన్ దాటిన కొంచెంసేపటికి mountain time zone లో చేరినారు అందువల్ల మా గడియారాలు ఒక గంట ముందుకు చేసినాము U.S.A. లో అయిదు time zones ఉన్నాయి. నాలుగు మాత్రము ముఖ్యమైనవి న్యూయార్క్ నుండి చికాగో వరకు ఒక time zone. Chicago to Dickenson వరకు మరో time zone. Dickenson నుండి Utah వరకు అనుకుంటా ఇంకో time zone and Utah to California వరకు ఇంకో time zone. డిక్కెన్‌సన్ వారి Hiway 94 మీద వెడుతుంటే నిర్జీవపు ప్రదేశము చాలా తక్కువమంది, పట్టణాలైతే కనపడవు. అచ్చటచ్చట raanch ల పైన కొన్ని పశువులు మేస్తుంటావి కొన్ని మైళ్లు దాటగానే మంటానలో చేరినాము. ఆ మంటానలలో స్పీడ్ లిమిట్ లేదు మీ ఇష్టమైనంత స్పీడ్‌లో వెళ్లవచ్చు. విక్రం మాత్రం 90 మైళ్లకు ఎక్కువ వెడలటంలేదు. ఎందుకంటే ఎంత ఎక్కువ స్పీడ్ ఉంటే అంత ప్రమాదానికి అవకాశాలు ఎక్కువ అవుతాయి. Cruise మాత్రము 80 మీద పెట్టినాడు. ప్రమద ఆ విశాలమైన మైదానములు మరియు చిరు గుట్టలు చూస్తోంది ప్రకృతి సౌందర్యము చాలా నున్నది ఆ మంటానలో. ప్రపంచ ప్రఖ్యాతికెక్కిన Yellow stone park ఎక్కువ భాగము ఆ మంటానలోనే ఉంది. మరికొంత భాగము Wyoming లో నున్నది. Highway 94 లో డిక్కెన్‌సన్ దాటిన పిదప మొదటి పట్టణము మైల్స్ సిటీ అనుకుంటా. అది తూర్పు U.S.A. లో ఉన్న చిన్న పట్టణాలంతకూడా ఉండదు. కాని ఆ స్టేటులో ఇదొక పెద్ద పట్టణమే. Minneopolis దాటిన పిమ్మట San Francisco వరకు గొప్ప పట్టణాలే కన్పించవు. అంతట విశాలమైన పచ్చికబయళ్లు, పచ్చని చేలు, మనుషులు చాలా తక్కువ ఆ మధ్య ప్రాంతంలో. ఇప్పుడు విక్రం Highway 94 మీద మంటానలో కారును రమారమి 80–85 మైళ్ల వేగంగా నడుపుతున్నాడు, కారు స్టీరియోలో సెలెక్టెడ్ తెలుగు పాటలు వినుకుంటూ. ఇంకా బిల్లింగ్స్ వంద మైళ్లకు పైగానుంది. ప్రమదా కొంచెం కాఫీ తాగుదామా, బోర్ కొడుతోంది అన్నాడు విక్రం. సరేనని ప్రమద ఫ్లాస్క్‌లో నుండి ఒక పేపరు కప్‌లో కాఫీ వంచి విక్రంకు అందించింది. కాఫీ త్రాగుకుంటూ, ప్రమదా నీ అందాన్ని

ఆ మాంటానా ప్రకృతి అందానితో పోలిస్తే నీ అందమే ఎక్కువనిపిస్తుంది నాకు అన్నాడు విక్రం. O, come on drive the car. Don't be silly అంది ప్రమద నేను పరిహాసానికనుటలేదు ప్రమదా నా feelings ని నీతో చెబుతున్నాను అన్నాడు విక్రం. O.K. concentrate on driving please అని నవ్వింది ప్రమద. దాంతో విక్రం మాటలాపి ప్రమద చేతిని తన కుడిచేతితో పట్టుకున్నాడు. What do you want, to stop in some motal అంది ప్రమద no no, you misunderstood my dear అన్నాడు విక్రం. ఇంతటితో ఎవరూ మాట్లాడలేదు విక్రం స్టీరింగ్ పైననే ఏకాగ్రత చేసినాడు. ఇప్పుడు కారు 95 మైళ్ల వేగంతో వెడుతోంది. వెనుక అనుపమ్ కొంతసేపు నిద్రించి లేచినాడు. Dad where are we? అన్నాడు. మాంటానాలో. కొద్దిసేపట్లో Bigtimber పట్టణము చేరుకుంటున్నాము అచ్చట ఆగి గ్యాసు నింపుకొందాము పిమ్మట you can ease off and can have some refreshments అన్నాడు విక్రం. O.K. Dad! అన్నాడు అనుపమ్ Mom give me some water please అన్నాడు అనుపమ్ సరేనని ప్రమద గ్లాసులో కొన్ని మంచినీళ్లు అందించింది. అనుపమ్ త్రాగి థాంక్యూ మామ్ అని పేపరు గ్లాసును మళ్లీ అందించినాడు చూస్తుండగానే Bigtimber వచ్చింది ఎక్జిట్ తీసుకున్నారు. ఒక గ్యాస్ స్టేషన్‌లో ఆపి గ్యాస్ నింపుకున్నారు అచ్చట కొంచెం కోక్ త్రాగి ప్రయాణపు బడలికను తీసుకొన్నారు ఆ పట్టణము దాటితే Hiway 94 అప్పుడప్పుడు గుట్టల మీదగా వెడుతుంటది. నిర్మానుష్య ప్రదేశము

ఉత్తర అమెరికాలో 10 గంటలవరకు సూర్యుడు అస్తమించడు. ఇప్పుడైతే ఇంకా ఏడుకూడా కాలేదు. ఆ Hiway 94 మీదనే Livingston అనే ఒక పట్టణం వస్తుంది. అచ్చట ఆ రాత్రికి పడుకొని తెల్లవారగానే గుట్టలలో నున్న Yellow stone park కు డ్రైవ్ చేయాలి. ఆ పార్కు ఒక నేషనల్ పార్కు. U.S A లోని ప్రతిచోటునుండే కాక ప్రపంచంలోని చాలా దేశాలనుండి ఆ పార్కును చూచుటకు వేసవిలో వస్తుంటారు. Hiway 94 మీద లివింగ్‌స్టోన్ పట్టణానికి కొంచెం దూరంలో ఉన్నాము. ఇక్కడ మేము రిజర్వేషను చేయించుకోలేదు. అందుకే కొంచెం తొందరగా చేరి హోటల్ ఎకామిడేషన్ వెతుక్కోవాలనుకున్నాము. సిటీని చేరుకున్నాము Highway పైననే హోటల్స్ ఉన్నవి. మొదలు Holiday inn కు వెళ్లినాము. ఏమైనా రూమ్స్ ఉన్నాయా ఒక రాత్రికి అన్నాము. ఎంతమందికి అన్నాడు ఆ హోటల్ క్లర్కు. Wife husband and a kid అన్నాడు విక్రం. సరే We can accomodate. There is a room with two beds అని అన్నాడు. అన్నట్టే తడవుగా follow me అని ఆ రూమువద్దకి తీసుకవెళ్లి తాళంతీసి this is the room. If you are interested you can pay at the counter అన్నాడు. విక్రం ప్రమదలు రూమును చూశారు. రూము బాగుంది. Holiday inn కాబట్టి We will take it అన్నారు. ఆ రాత్రి రెంట్ కట్టి ముగ్గురు, కారును ఆ రూము ముందుకు నడపారు. సామాను రాత్రికి కావలసింది తీసుకొని రూములోకి వెళ్లి తలుపేసుకున్నారు. అలవాటు ప్రకారం అనుపమ్ టి.వి. ఆన్ చేసి ఛానెల్స్ ఛేంజ్ చేస్తున్నాడు. ప్రమద విక్రంలు బెడ్‌పై ఒరిగినారు ఇంకా పొద్దుంది అన్నది

ప్రమద అవునన్నాడు విక్రం. అట్లా డ్రైవ్ చేసొద్దాం పదా అని ముగ్గురు వెళ్లినారు. ఎచ్చట చూచిన పచ్చని చెట్లు ఉన్నవి. ఆ చిరుపట్టణానికి సమీపంలో గుట్టలుకూడా కనిపిస్తున్నాయి. కొంచెంసేపు ఆ సిటీలో డ్రైవ్ చేసి పిమ్మట ఒక రెస్టారెంటులో భోంచేసి మళ్లీ హాలీడే ఇన్ రూములోకి వచ్చి పడుకున్నారు. తెల్లవారగానే కాఫీ తాగి హోటల్ ఖాళీచేసి బయలుదేరినారు. Hiway 94 మీద కొంచెం దూరం వెడలి కారును Yellow stone park కు వెళ్లే రోడ్డుకు నడిపించినాడు విక్రం. ఆ రోడ్డు గుట్టలమీదుగా వెడుతోంది. కారు వేగం Hiway 94 మీద వెళ్లిన వేగంగా పోలేదు గుట్టలు ఎక్కుతూ, దిగుతూ yellow stone park main office కు చేరుకున్నారు. ఇక్కడ అపుకొని పార్కులో ప్రవేశించుటకు టికెట్ కొన్నాడు విక్రం. పిమ్మట పార్కులో ప్రవేశించినారు ఆ పార్కు కాలినడకతో చూడలేరు ఎందుకంటే, దీని విస్తీర్ణము కొన్ని వందల మైళ్లు పార్కులో ప్రతి చూడదగిన స్థలాలకన్నిటికి తారు రోడ్లున్నవి. విక్రం ఆ రోడ్లవెంట కారు నడుపుతున్నాడు. అనుపమ్ ఇప్పుడు పార్కును చూడడం తప్ప వాడి ఆటవస్తువులతో ఆడడంలేదు. Oh! What a beautiful park అంటున్నాడు ఆ ప్రకృతిని చూస్తూ. ఎటుచూచినా చెట్లు మరియు వాటిలో విచ్చలవిడిగా విహరించుచున్న జింకలు మొదలగు మృగాలు, జంతువులు, నీటి జారులు. ఆ yellow stone ఇంకో ప్రత్యేకత ఏమిటంటే భూమినుండి పైకి ఉష్ణజలము అచ్చటచ్చట పైకి చిమ్ముతుంటాయి. ఆ పైకి చిమ్మే జలము ఉష్ణమైనది. కొన్నిచోట్ల బురద తుక తకమని బుడ బుడ కాస్తున్నట్లుగా బుడగలను కక్కుతుంది. దీని ఉష్ణమెంత ఉందో తెలియదు కాని అందులో పడిన జంతువులే కాని, మనుష్యులేకాని బ్రతకరు. ఇటువంటి విచిత్రమైన దృశ్యాలు ఆ yellow stone park లో చాలా ఉన్నవట. ఇవి ఆ పార్కులోని ప్రత్యేకతలు. వీటన్నిటికన్న పెద్దదైన old faithful అనె ఒక నీటిఝరి. ఇందులోంచి ప్రతి గంటకోసారి ఒక మహా ప్రళయమువంటి నీటి తుంపరులు వెడలి నూటికి ఎక్కువనే అడుగుల పైకి లేచి 15 నిమిషాల నుండి 20 నిమిషాలవరకు ఉంటాయి. దీనిని ప్రత్యేకంగా చూచుటకు దేశదేశాలనుండి టూరిస్టులు వస్తారు. అది వచ్చేవరకు నిరీక్షిస్తూ, అది రాగానే ఆ ప్రకృతి వైచిత్రాన్ని చూచి మరి పోతారు విక్రం వెళ్లేటప్పటికి అది వచ్చి పోయింది దానికై ముగ్గురూ వేచియున్నారు. కారును పార్కింగ్ లాట్‌లో పార్కుచేసి పక్కనే ఉన్న బిల్డింగ్‌లో కూర్చున్నారు. వందలాది ప్రజలు అలాగే బిల్డింగ్‌లోను మరియు బయట ఆ వింత దృశ్యానికై వేచియున్నారు. ఇటువంటి ప్రదేశాలలో టూరిస్టుల సౌకర్యానికై అన్ని ఉంటాయి. అనుపమ్ ఏదో ఐస్‌క్రీమ్ కొని మెల్లగా తింటూ ఎంజాయ్ చేస్తున్నాడు. ప్రమద, విక్రం ఆ సీన్స్ విషయమై మాటాడుకొంటున్నారు. వీళ్లు వచ్చి సుమారు 45 నిమిషాలు కావస్తుంది ఇంకను అది పైకెగయుటలేదే అని వేచియున్నారు. ఇట్లా వేచియున్న సమయంలో అందరూ ఆ తుంపరులనుండి తప్పించుకొనుటకు వెనుకకు జరుగుచున్నారు. ఏమిటా అని చూస్తే ఆ ఉష్ణనీటి తుంపరలనుండి తప్పించుకొనుటకు అందరూ వెనుకకు వస్తున్నారు ఒక నిమిషములో మెల్లగా భూమినుండి వెడలిన ఆ నీటి తుంపరులు గగనాన్నందుకొంటున్నవా అన్నట్లు తెల్లగా, గర్జిస్తూ పైకుబియుచున్నవి విక్రం, ప్రమద

మరియు అనుపమ్ వాటిని చూస్తున్నారు. ఆ ఎగసిన తుంపరులు నూరడుగులకన్న ఎత్తునకు ఎగసి పది, పదునేను నిమిషములపాటు ఉండి పిమ్మట మాయమైనవి. ఆ ప్రకృతి అద్భుతాన్నే కాక వీరు ముగ్గురు ఎన్నియో సంబరాలు చూసి కారులో ఎక్కి బయలుదేరినారు. అచ్చట ఎలుగుబంట్లు, కుందేళ్లు కూడా ఉన్నవి. పెద్ద పెద్ద కొమ్ములతో అలంకరించుకున్న దుప్పులవంటి మృగాలను కూడా చూడగలిగినారు. ఇంతేకాకుండా ఎన్నియో ప్రకృతి వైభవాలను చూచి రాత్రి కాకముందే వీరు ప్రవేశించినచోటికి వెడలినారు. విశ్రాంతి చేసిన హోటల్‌లో ఆ రాత్రి ఉండి తెల్లవారి మరికొన్ని చిత్రాలు ఆ పార్క్‌లో చూచి సాయంకాలం లివింగ్ స్టోన్‌కి చేరుకున్నారు. ఆ సాయంకాలం అచ్చట ఉండి, మరునాడు తెల్లవారు ఝామున లేచి Hiway 94 మీదుగా రాపిడ్ సిటీకి four presidents చెక్కడము తిలకించుటకు బయలుదేరినారు. Hiway 94 పైన ఇప్పుడు తూర్పుదిశకు వెడలుచున్నారు. ఆ రాపిడ్ సిటీకి వెళ్లుటకు నార్త్ డకోటాలో ప్రవేశించిన కొంచెంసేపటికి వేరే చిన్న రోడ్డుపైన రాపిడ్ సిటీకి వెళ్లవలసి ఉంటుంది. Hiway 94 నుండి ఆ రోడ్డు ఎక్జిట్ తీసుకునే వరకు 12 గంటలయ్యింది. ఇంకా ఎవరికీ ఆకలి వేయడములేదు. ఆ రోడ్డుపైన సుమారు 4 గంటలు డ్రైవ్ చేసిన పిమ్మట రాపిడ్ సిటీకి వచ్చినారు. ఇది ఆ ప్రదేశానికి ఒక పెద్ద పట్టణమేకాని తూర్పు U.S.A. లోనున్న పట్టణాలతో పోలిస్తే ఇది చాలా చిన్నది. సిటీకి వెళ్లి సిటీ అంతా డ్రైవ్‌చేసి ఆరు గంటలకు ఇచ్చటనున్న హోలీడే ఇన్‌లో ప్రవేశించి భోజనంచేసి నిద్రించినారు.

తెల్లవారగానే లేచి మొఖాలు కడుక్కొని హోలీడే ఇన్ నున్న రెస్టారెంటుకు వెళ్లి Scrambled eggs, toast, coffee తో కడుపు నింపుకొన్నారు ప్రమద, విక్రంలు. అనుపమ్ మాత్రం కాఫీకి బదులు పాలు త్రాగినాడు. అది విధిలేని పని అనుపమ్ చేస్తుంటాడు పాపం. బిల్ చెల్లించి బయటపడ్డారు ముగ్గురు.

కారులో కూర్చొని map చూపించే ప్రకారంగా ఆ 'బ్లాక్ హిల్స్' వైపు వెడుతున్నారు. కొన్ని మైళ్లదూరం పోయిన పిమ్మట ఆ రోడ్డు కొండలపైకి వెడుతుంది. ఆ కొండలు ఎక్కగానే ఆ నలుగురి ప్రెసిడెంటుల విగ్రహాలు (చెక్కడులు) గుట్టల రీతిగానే కనబడుచున్నవి. అవి మంచిగా కనపడేచోట కొన్ని బిల్డింగ్స్ మరికొన్ని టూరిస్టుకు కావలసిన సౌకర్యాలు ఉన్నవి. ఆ విగ్రహాలు చాలా పెద్దవి. ఆ విగ్రహం ముక్కుపైన అప్పుడే ఏదో పని జరుగుతుండే. దానిపైనున్న మనిషి ఒక చీమ, లేదా ఈగవలె కనిపిస్తుండెను మాకప్పుడు. అంటే, కొండలను తొలిచి ఒకే శిల్పి వీటిని చెక్కినాడట. ఆ విగ్రహాలు వాషింగ్‌టన్, లింకన్, జెఫర్‌సన్ మరియు రూజ్‌వెల్ట్‌లవట. ఇవి చూచి వాటివి కొన్ని బొమ్మలు తీసుకున్నారు. ఇవి చూడడంతో ముఖ్యమైన పని అయిపోయింది

చూసిన పిమ్మట అచ్చటే వేసి ఉంచిన బెంచీలపై కూర్చొని ఆ సీనరీని చూసినారు. పిమ్మట ఇంకేవో చిల్లర చిల్లర ప్రదేశాలున్నవట కాని వాటిని చూడాలని విక్రంకు ఆసక్తిలేదు. అచ్చటేనున్న అమెరికన్, ఇండియన్ తండాలోని (రిజర్వేషన్) ఒక ఇండియన్‌తో అనుపమ్ ఫోటో దిగినాడు అతను ఆ సేవకు ఒక డాలరు తీసుకున్నాడు. పాపం తెల్లవారు రాకముందు వీరిదే ఆ ఖండం. ఇప్పుడు వీరి

దుస్థితిని చూస్తే ఏ హృదయమున్న మానవుడు కూడా రక్తాశ్రువులను రాల్చక మానడు. వీరి చరిత్ర ఒక శోకపూరితమైన చరిత్ర. యూరపులో మతకలహాలను తట్టుకోలేక ఆ దేశంవచ్చిన తెల్లవారిని ఆ సహృదయులు ఆహ్వానించి వారిని దేశంలో ఉండనిచ్చినారు. కాని కుటిల విషపురుగులైన ఆ అనాటి యూరోపియనులు క్రమంగా వీళ్ల భూములను ఆక్రమించుకొని ఏమిటికి పనికి రావన్న భూములపై వీటిని పశువులను ఉంచినట్టుగా ఉంచినారు.

యూరపునుండి వెంట తెచ్చి ఎన్నియో రోగాలు వీరిలో విస్తరించి మొత్తము ఆ ఇండియన్ జనాభా నశించిపోయింది. యూరోపియన్లు పడమటనుండి, తూర్పువరకు అంత భూమినాక్రమించుకొని దీనిని ఇప్పుడు U.S.A. అనబడే ఒక మహా సామ్రాజ్యాన్ని స్థాపించినారు. అది క్లుప్తంగా వీరవిషాదగాథ. అనుపమ్ అతనితో తీసుకున్న ఫోటో చాలా సంవత్సరాలవరకు వాని గదిలో వ్రేలాడుతు ఉండెను. 'బ్లాక్ హిల్స్' నుండి బయలుదేరి వేరే కొన్ని చిన్న చిన్న విచిత్రాలు చూచినాము. కాని ఆ నలుగురి ప్రెసిడెంట్స్ విగ్రహాలకన్న మించి చూచుటకేమీ లేదు ఆ 'రాపిడ్ సిటీ'లో. సాయంకాలంవరకు Holiday Inn చేరుకున్నారు. ముగ్గురు కలిసి టి.వి. చూచినారు, భోంచేసినారు, పడుకున్నారు. తెల్లవారు ఝామున లేచి breakfast ముగించి కారులో సామాను సర్దుకొని Minnosota కి బయలుదేరినారు.

చాలా దూరపు ప్రయాణము. Bismark N.D. చేరుకున్నారు. అక్కడ భోంచేసి మళ్లీ బయలుదేరి ఫార్గోలో ఒక హోటలు 6 అనబడే హోటల్‌లో ఆగినాము. తెల్లవారే లేచి 12 గంటల లోగానే మా ఇల్లు చేరుకున్నాము. మేము వెళ్లింది సెలవులు సరదాగా గడపటానికి. కాని డ్రైవింగ్‌లో మరి నడకలో మనకు తెలియకుండానే అలసిపోతాము. అలాగే విక్రం, ప్రమద బాగా అలసిపోయినారు. కాలిఫోర్నియా వెళ్లలేదు ప్రమద స్నేహితులను చూచుటకు, అనుపమ్ మాత్రం fresh గానే కన్పిస్తున్నాడు. ఆనాడు వంటచేయలేదు. విక్రం గ్రోసరీ స్టోర్‌కు వెళ్లి పళ్లు మరియు ఇతర స్నాక్స్ తెచ్చినాడు. వాటితో కడుపు నింపుకొని రాత్రంతా నిద్రించినారు.

తెల్లవారి ప్రొద్దుపోయినంకా లేచి, "Home sweet Home" అన్నారు ఆ దంపతులు వారి కుమారరత్నము. Leisure గా లేచి ప్రక్కపై దొరలుతూ ఆవలిస్తున్నారు ప్రమద, విక్రంలు. నేను చాలా అలసిపోయినాను ప్రమదా అన్నాడు విక్రం.

నాకు తెలుసు, ఇంత డ్రైవ్ చేసినాక అలసట రాకుండా ఎలా ఉంటుంది అంది. ఇంకా Hiway నా కన్నులలోనే ఉంది అన్నాడు విక్రం. నేను లేనా మీ కన్నుల్లో అని కౌగిలించుకొని కప్పుకున్నారిద్దరు. ఆ అలసటతో కలసివచ్చిన అనురాగపు పొంగుతో పొంగుతున్నారిద్దరు. ఒకరి వడిలో ఒకరు బందీలయి ఉన్నారు. విడిపోవాలంటే ఆ ప్రణయాగ్ని చల్లారాలి.

కొంచెంసేపట్లోనే ఆ ప్రణయాగ్ని చల్లార్చుకొని దూరదూరంగా పడుకొన్నారు మెలకువతోనే. పిమ్మట ఇద్దరూ లేచినారు. ప్రమద వంటింట్లోకి వెళ్లి టీ చేస్తోంది. విక్రం లివింగ్ రూములో కూర్చొని టి.వి. ఆన్ చేసి చూస్తున్నాడు. ప్రమద రెండు

కప్పులతో సాక్షాత్కరించింది. ఒక కప్పు విక్రంకిచ్చి మరొక కప్పుతో విక్రం వద్ద కూర్చుంది. టీ సేవించుకుంటూ ఆ పోలీడే విశేషాలను మాటాడుకుంటున్నారు. ఏమి తింటారండీ మీరు ఇవ్వాళ్ల అంది ప్రమద. నిన్ను తిన్నానుగా ఇప్పుడే నాకు ఆకలి లేదు అన్నాడు విక్రం. ఛ! ఏమి మాటలవి అంది ప్రమద చిలిపి నవ్వుతో. తప్పేముంది ఇందులో నా ఆకలి చల్లార్చలేదా ఇపుడే అన్నాడు విక్రం. మీరు చాలా చెడ్డవారండీ అంది వీపుపైన ఒక దెబ్బ కొట్టి అబ్బ ఎంత తీయగా ఉంది ప్రమదా నీ దెబ్బ మీకు ఇవ్వాళ్ల పిచ్చి లేచిందా అంది. అవును, అన్నాడు విక్రం ప్రమద విక్రం కళ్లలోకి చూచి ఊరుకుంది. సారీ, ప్రమద కోపము రానివ్వకు సుమా! అన్నాడు, ఒక చేయి ఆమె మెడపైన వేసి

ఆమె చప్పుడు చేయలేదు. ఇద్దరూ అలానే టి.వి. చూసుకుంటూ కూర్చున్నారు. అనుపమ్ కండ్లు తుడ్చుకుంటూ ప్రత్యక్షమైనాడు. వచ్చేది తడవుగా ప్రమదపై తలవాల్చి కూర్చున్నాడు. తీయండి మీ చేయి, బాబున్నాడని కూడా మీకు ధ్యాసలేదా అంది సరే, డియర్! అని మెడమీది చేయిని తీసినాడు విక్రం ముగ్గురూ టి.వి. చూస్తున్నారు. ఇంతలో ఫోను మ్రోగింది. ప్రమద లేచి ఫోను లేపింది. హాలో! అంది. Pramada where did you go అనే peggy గొంతు శబ్దము వినబడింది Peggy ప్రమద చాలా మంచి స్నేహితురాళ్ళు. ఆమె భర్తా విక్రం ఒకే dept. లో పనిచేస్తారు. Rank లో కూడా సమానులే. కాని U S.A. లో ఆ ర్యాంకులకంత పట్టింపు ఉండదు.

అందరు సీనియర్స్ మరి జూనియర్స్ కలసి వుంటారు. First names తో పిలుచుకుంటారు దగ్గరి స్నేహితులవలె . కాని యెవరి బాధ్యతలను వారు మంచిగా నిర్వర్తించుటకు ప్రయత్నిస్తారు. యిది ఆ దేశస్తులలో నున్న ప్రత్యేకత. నీవు చిన్న నేను పెద్ద అనే తారతమ్యము చాలా తక్కువ ఆ విషయములో భారతదేశానికి అమెరికాకు చాల భేదము. భారతములో చిన్న ఉద్యోగస్తులు పెద్ద ఉద్యోగస్తులకు భయపడి మెలగాలి చెప్పులు తొడుగుకొని ఆఫీసర్ రూంలలోకి ప్రవేశింపని కొన్ని సంఘటనలు కూడ ఉండెడివి. ఆకాలంలో పెగ్గి, ప్రమదలు చాలసేపటి వరకు మాట్లాడుకొన్న పిమ్మట see you అని ప్రమద ఫోన్ పెట్టివేసింది. పిమ్మట వంటయింట్లోనే వంట ప్రారంభించింది. ఒక గంటసేపట్లో వంటంత పూర్తి చేసి శ్రీవారిని చిట్టిబాబును భోజనానికి ఆహ్వానించింది.

యిద్దరూ O.K. అని వచ్చి dining table పై కూర్చున్నారు. టేబుల్ పైన వున్నవి ముగ్గురూ వడ్డించుకుంటున్నారు. అనుపమ్ అన్నం వడ్డించుకుని I have to see my T.V. Program అంటూ ప్లేటుతో Living room లకు వెళ్ళి T.V చూచుకుంటూ భోంచేస్తున్నారు. విక్రం, ప్రమద ఒకరినొకరు పరిహాసించుకుంటు భోంజేస్తున్నారు.

భోజనాలు పూర్తిచేసి bed room లో bed పై ఒరిగినారు. పిమ్మట నిద్రించినారు. అనుపమ్ మాత్రం T.V. చూస్తు మెల్లగా భోంచేసి పళ్లెం వంటింటి sink లో పడవేసి మళ్ళి living room లో కూర్చొని T.V. చూస్తున్నాడు. విక్రం సామాన్యంగ పగలు నిద్రించడు. కొంచెం సేపట్లో లేచి బట్టలు వేసుకొని

అనుపమ్‌తో నాన్నా నేను Dept. కు వెడుతున్నాను అమ్మతో చెప్పు అనుకుంటు వెడలిపోయినాడు.

ఆ యెండాకాలము సెలవులో Dept. secretaries వచ్చి office లో పనిలేకున్నా కూర్చుంటారు. కాని Professor లకు మాత్రం సెలవులు. కొంతమంది ఆచార్యులు summer లో కొన్ని cources teach చేస్తున్నారు కాని విక్రం మాత్రం మూడునెలలు rest తీసుకొనవలెనని summer teaching కు ఒప్పుకొనలేదు వేసవిలో చదివిస్తున్నవారు, రిసర్చిచేస్తున్నవారు.

మరి యేమైన Dept. లో పనివున్నవారు వారి వారి office లలో నుంటారు. విక్రం కూడ తన office లో కూర్చొని యేదో పని చేస్తున్నాడు. యతని Office లో ఒక electronic type writer ఒక computer కూడా నున్నవి. యేమైన చిన్న చిన్న personal typing ఉంటే విక్రం చేసుకొంటాడు. కాని computer, research పనికి వాడుతాడు. అమెరికాలోని Professor's officer లలో అన్ని పరికరాలుంటావి అందుకే ఒక professor యెవరిపై ఆధారపడకుండ యెంతయో పనిచేయగలుగుతారు.

విక్రం యేదో పనిలో నిమగ్నుడై ఉన్నాడు యంతలో ఫోన్ మ్రోగింది. ప్రమద ఫోన్‌పై నున్నది. Hello అన్నాడు విక్రం. Hello యేం చేస్తున్నారు అంది. Office పని యిప్పుడు సెలవులలో యేం పని. పనివుంటేనే చేస్తాను ప్రమద, చేసేవారికి యెప్పుడూ యేదైన పనివుంటుంది ఆ వృత్తిలో. సరే యేమిటి సంగతులు అన్నాడు. యేం లేదు బోర్ అనిపిస్తుంది. అందుకే చేసినాను అంది.

సరే చెప్పు అన్నాడు విక్రం. మీరు రండి అంది ప్రమద. సరే యింక అరగంట పనివుంది ముగించి వస్తాను అన్నాడు సరే అని ఫోను పెట్టివేసింది ప్రమదతో మాట్లాడినాక విక్రంకు ఆఫీసులో పనిచేయబుద్ధికాలేదు వెంటనే అన్నింటికి తాళాలు వేసి, యింటికి ప్రయాణమైనాడు. యింటికి రాగానే hello ప్రమద యేమవుతుంది అన్నాడు. చిరునవ్వుతో స్వాగతం పలికింది. నేను ఒక టిఫిన్ తయారుచేసినాను తిని యెలాగుందో చెప్పండి అంది.

ఇందుకే పిలిచావా అన్నాడు. లేదండి ఒక దానికి bore అనిపించింది. అందుకే రమ్మన్నాను అంటూ తాను చేసిన dish ను నాకు అందించింది. తిని చెప్పండి యెలా ఉందో అన్నది. ఆ dish తిన్నాను. ఇంక కొంచెం పెట్టు అన్నాను. అంటె మీకు నచ్చిందన్నమాట అని మరికొంచెం వడ్డించింది. తిని ప్రత్యేకంగా తయారు చేసిన కాఫీ త్రాగినాను. యేవో కబుర్లు చెప్పుకుంటూ living room sopha పైన కూర్చొని ఉన్నారు.

యింతలో మాం అంటు అనుపమ్ వచ్చి మంచినీళ్ళు త్రాగి యేదోమించిపోతుందని బయటికి పరుగెత్తుతు వెళ్ళిపోయినాడు అనుపమ్ కిప్పుడు ఆ ప్రాంతంలోనున్న పిల్లలంత స్నేహితులే. ఎక్కువగా వాడు వారితోనే ఆడుతుంటాడు. అప్పుడప్పుడు ఆ పిల్లలతో కలసిలోనికి వస్తాడు. ఇక్కడి పిల్లలసైకాలేజివేరు. వారు చాలా ఫ్రీగా వున్నారు. తింటారు, తాగుతారు మళ్ళీ పోతారు. ఆ culture యే వేరు.

సామాన్యంగా వీరి తల్లిని తండ్రిని తప్ప వారి కుటుంబంలోనున్న వారినందరిని

పేరు పెట్టియే పిలుస్తారు. అట్లే వాళ్ళకు తెలిసిన ప్రతివారిని మొదటి పేరుతొనె సంబోధిస్తున్నారు. ఇది ఇచ్చటి ఆచారము. ఇది ఆ స్కూల్‌లో నేర్పే విధానాన్ని బట్టి ఉంటుంది. అంటే అందరూ అంతేనని కాదు. కొందరు వేరే తీరుగా ఉంటారు.

సాయంసమయం కాగానే అనుపమ్ లోనికి వచ్చి T.V. switch on చేస్తాడు. పిమ్మట పడుకుంటాడు. ఆ వేసవి అంతా యిది routine అవుతుందన్న భయంతో విక్రం ఫోంచేయగానే కొన్ని పుస్తకాలు చదువుటకై అనుపమ్‌కు అలవాటు చేసినాడు. అందువల్ల యిప్పుడు అనుపమ్ పుస్తకం కొంతసేపు చదివి నిద్రిస్తాడు. ఆ వేసవి అంతా యిలానే అలవాటు పడాలని విక్రం రోజూ అతడు చదివేటట్లు చూసేది ప్రమదకు కూడ యిలా చేయమని చెప్పినాడు. ఆ ప్రథమ మిన్న చోట వేసవిలో మూడునెలలో ఇట్లే గడిచినవి. మళ్ళీ fall సెమెస్టర్ రానే వచ్చింది. ఇంక కొన్ని రోజులలో మళ్ళీ యూనివర్సిటీలో క్లాసెస్ ఆరంభమౌతవి. ఈ ఉత్తర అమెరికాలో సెప్టెంబరు మాసమురాగానే అచ్చటచ్చట ఆకులు పసుపు పచ్చగా మారుతునే ఉంటాయి.

సెప్టెంబర్ 15 వరకు చాలవరకు చెట్లు ఆకులు పసుపురంగుకు మారి రాలిపోతూనే ఉంటాయి. అక్టోబర్ 15 వరకు అన్ని ఆకులు సాధారణంగా రాలిపోతాయి. అక్టోబరులో ఒకటి రెండు సార్లైన మంచుబడుతుంది. నవంబర్‌లో స్నో పడ్డదంటె కరుగుట చాలా అరుదు డిశంబర్‌లో పడ్డ స్నో సామాన్యంగా భూమిమీదనె వుంటుంది కనీసం మార్చి వరకు. జనవరిలో జనవంతా (Thow) అవి రెండు మూడు రోజులు ఉష్ణోగ్రత freezing ను దాటిపోతుంది. ఇది తప్పితే నవంబర్ ఆకరున పడిన స్నో మార్చి వరకు భూమిమీదనే ఉంటుంది. ఏప్రిల్‌లో పడ్డ స్నో రెండు మూడు రోజులలో కరిగిపోతుంది. మే లో గడ్డి పచ్చపచ్చగా కనబడుతుంది మే నెలాకరు వరకు.

జూన్ ప్రారంభలోనే పచ్చటి చిగురాకులు చెట్లకు వస్తుంటావి. సామాన్యంగ మేలో over coat వేసుకొనవలసి వుంటుంది. కాని జూన్, జూలై, అగస్టులో మాత్రము వట్టి షర్టు మీదనే బయట నడువవచ్చు. యిచ్చట ఇంత తీవ్రతరమైన చలివుండిన, యేమంత కష్టమనిపించదు. ఇండ్లు, పనిచేసేచోట్లన్నిటిలో central heat ఉంటుంది. కార్లు వాటిని పార్క్ చేసిన garages కూడా heated.

కాబట్టి పనిచేయుటకు వెడలే వారంత బట్టలు వేసుకొని heated garages లో నున్న కార్లలో కూర్చొని automatic garage openers తో కారులో నుండె garage doors open చేసికొంటారు. garage నుండి బయటికి రాగానే కారులో నుండి మళ్ళీ switch నొక్కగానే door మూసుకుంటుంది. ఇక ప్రతి కారులో heater ఉంటుంది. అయిదు నిమిషాలలో heater on చేసి యూనివర్సిటీ వచ్చి, పార్కింగ్ lot లో కారు వదలి ఆఫీస్‌లోకి పోగానె మళ్లి యిండ్లలో వున్నట్టే సౌకర్యంగా ఉంటుంది. కాబట్టి ఇంత చలి వున్నా యెప్పుడూ చలితో వణికిపోయే సమస్యే ఉండదు.

విక్రం ఆనాడు ప్రమదతో చాలసేపటివరకు మాటాడినాడు. మళ్ళీ సంవత్సరం హైద్రాబాదుకు వెళ్ళాలని వుంది నాకు ప్రమదా అన్నాడు. నాకు కూడా చాలా పోవాలనివుంది కాని మిమ్ములను అనుపమును విడచి వెళ్ళలేను కదా అన్నది ప్రమద.

మన immigration త్వరలో వస్తుంది రాగానే reserve చేయిస్తాను ముగ్గురికి అన్నాడు విక్రం. నిజమా అంది ప్రమద. అవును అన్నాడు విక్రం మరి మన మేలో ప్రయాణం అన్నాడు విక్రం. సరే అంది ప్రమద. మీరు professor పదవికి అప్లై చేస్తిరి కదా దాని ఫలితాలు రాలేదా అంది ప్రమద. లేదు అన్నాడు విక్రం.

ఇంత ఆలస్యమూ yes or no అనుటకు అంది ప్రమద. మన దేశపరిస్థితులు నీకు తెలియనివా ప్రమద యెవరైనా influence లేదా పైరవీ చేస్తే తప్ప యెవరడుగుతారు మనలను అన్నాడు విక్రం నాన్నగారికి వ్రాయమంటారా అంది ప్రమద. ఆయన రిటైర్ అయినాడు పాపం. యిప్పుడేమి influence ఉంటుంది ఆయనకు అన్నాడు. influence లేకున్న కలసి మాట్లాడటంలో తప్పేముంది అంది ప్రమద. సరే మీనాన్నగార్కి వ్రాస్తేవ్రాయి చూద్దాము అన్నాడు విక్రం. ఉదయం లేవగానే విక్రం టీ త్రాగి సరే నేను Dept. వెడుతాను. రెండు గంటలు పనిచూసి మళ్లీ వస్తాను అని వెళ్లిపోయినాడు కారులో. ప్రమద టీ పూర్తిచేసి తండ్రిగారికి ఉత్తరం వ్రాసి యింటి ముందర mail box కు అంటించింది.

హైద్రాబాదులో రఘునాథరాయలు శ్రీలక్ష్మమ్మ ప్రతిరోజు యేదో విధంగా ప్రమదను జ్ఞాపకం చేసుకుంటూనే ఉంటారు. ప్రమద వ్రాసిన ఉత్తరం అందగానే ఇద్దరు సంతోషంతో తెరచి చదవనారంభించారు. విక్రం ఇచ్చట prof. కై అప్లై చేసినాడని చదవగానే I A.S. కు మించి ఉంటుందా ఆ professorship అన్నాడు రఘునాథరాయలు. మరి ఆయన కిష్టమయ్యింది చేయనీయండి అది శ్రీలక్ష్మమ్మ. సరే రేపు ఫోన్ చేసి ఆ vice chanceller తో మాటాడుతాను అన్నాడు రఘునాథరాయలు. తెల్లవారె లేచి కాఫీ తాగి అప్పటి వైస్ ఛాన్సలర్ గారికి ఫోన్ కలిపినాడు.V.C. గా ఓ రెడ్డిగారున్నారు ఆయన రఘునాథరాయలకు తెలిసినవాడే సరే రాయలవారు నేను చూడలేదు. వారి Application రేపు మీకు దీని విషయమై పూర్తి వివరాలు తెలుపుతాను సరేనా take care justice గారు. అని ఫోను పెట్టివేసినాడు. అన్న ప్రకారం మరునాడే V.C. గారు ఫోన్ చేసి వివరాలన్ని చూసినాను. అతడు వస్తానంటే appointment letter రేపే పంపమంటాను మా రిజిస్ట్రార్‌తో. ఆయన highly qualified harvard Ph.D. ఇది ఆయనకు చిన్న ఉద్యోగము సుమా అన్నాడు. రఘునాథరాయలతో. Appointment letter పంపించండి. అది ఆయన అభిలాష అన్నాడు రఘునాథరాయలు. అలాగేనని ఫోన్ పెట్టివేసినాడు V.C. గారు. అన్న ప్రకారమే Appointment letter మరునాడే By registered mail లో వెళ్ళింది. ఇదే సంగతి రఘునాథరాయలు కూడ కూతురుకు అల్లుడికి వ్రాసినారు. యెనిమిది రోజులలో ఉత్తరం ప్రమదకు అందినది. చదువుకొని ప్రమద Vice chancellor వ్రాసిన appointment ఉత్తరానికై యెదురు చూస్తోంది. ఆ ఉత్తరం విక్రం పేరున Dept. కు వ్రాసినాడు ఆ V.C. గారు. కాబట్టి అది ప్రమదకు అందదు. ఉత్తరం చదవగానే విక్రంకు ఫోన్ కలిపింది. I have good news for you అంది. అదేమి good news అబ్బ అనుకున్నాడు విక్రం. యేమిటా గుడ్ న్యూస్ అన్నాడు విక్రం. చెప్పుకోండి చూద్దాం అంది ప్రమద. you are pregnent అన్నాడు విక్రం. ఛీ మీకెప్పుడూ హాస్యం అంది ప్రమద.

మరేముంటుంది అంతకన్న good news అన్నాడు. విక్రం, డాడి దగ్గరనుండ ఉత్తరం వచ్చింది. ఓ అదా విషయం. సంగతి ఏమిటో అన్నాడు విక్రం. మీకు professorship యిస్తారట త్వరలోనె మీకు appointment letter వస్తుందట అంది ప్రమద. Really then it is good news అన్నారు విక్రం. మరి పోతారా అంది ప్రమద. ఆ ఉత్తరం రాని దానిలోని conditions ను చూచి మన మిద్దరము నిర్ణయించవలిసి ఉంటుంది అన్నాడు. సరే యేం చేస్తున్నారు అంది. పనివుంటుంది. యేదో research అయితే ఉండనే ఉంది గదా. పోగా యేదో కొన్ని చిన్న చిన్న పనులు ఉండనే ఉంటాయి గదా అన్నాడు విక్రం. మీరు రాకూడదా మీ క్లాస్ మొదలైతె మీకు తీరికే ఉండదు. యిప్పుడైతే యింక సెలవులే కదా అంది. సరే ఒక గంట సేపట్లో వస్తాను అని ఫోన్ పెట్టి వేసినాడు విక్రం. ప్రమద ఫోన్ పెట్టి ఇండియా గురించి కలలుకంటోంది. అబ్బ మళ్ళీ ఇండియాలో జీవితంలే యెంత ఘనంగ ఉంటుంది అని కలలుకంటుంది.

విక్రంకు కూడ ఒక విధమైన సంతోషమే దేశం వెళ్లాలంటే. కాని అతనికి తెలుసు ఆ దేశంలో అన్ని అవరోధాలే యెదుర్కోవలసి వస్తుందని, అక్కడ అనవసరమైన ఉద్యోగాలెన్నియోనున్నవని. ప్రభుత్వము ఉద్యోగాలకు పనివున్నా లేకున్నా సృష్టించి ఉద్యోగాలు యిస్తూనే ఉంటుంది. టెక్నికల్ ఉద్యోగాలంటె అవసరమేమోకాని administrative మరియు clerical positions అంత అవసరముకాకున్నా వాటిని సృష్టిస్తూనే ఉంటారు. ఆ విధంగా 1947 నాటికి యిప్పటికి చూస్తె ఆ ఉద్యోగాలు యెన్నోరెట్లు పెరిగి పోయినవనియే చెప్పకతప్పదు. కొంతపెరుగుదల అవసరముకావచ్చు. కాని యిన్ని రెట్లు పెరుగుట అవసరమా. అంతేకాకుండ ప్రతిదీ ప్రభుత్వమే చేస్తాననుకొంటుంది. ఇండస్ట్రీ ప్రభుత్వమే తెరుస్తుంది. అందులో ఉద్యోగాలు, రవాణసౌకర్యాలు ప్రభుత్వమే తెరుస్తుంది. దాంట్లో ఉద్యోగాలు పెరుగుతవి. కాని యిందులో లాభాలువున్నా లేకున్నా ఖర్చులు మాత్రము పెరుగుతూనే వుంటాయి. కాబట్టి ఈ ప్రభుత్వపు ఇండ్రస్ట్రీలన్నింటిలో నష్టమే కాని లాభముండదు. ఇట్టి వ్యవస్థలో పని చేయాలంటే యే self respect వున్న వారికి కూడ సాధ్యముకాని పని. అందుకే ఒక వైపు మాతృదేశమని యే విధంగానైన దానికి సేవ చేయాలని ఆకాంక్ష రెండవది యిది వరకు అచ్చటపని చేసిన వాడు కాబట్టి పరిస్థితులు తెలిసి కూడ పోవుట మంచిదా అని తీవ్రంగ ఆలోచనలో పడ్డాడు విక్రం.

అయినా ఇంకా సమయము ఉంది అని తనకర్తవ్యములో తాను నిమగ్నుడై ఉన్నాడు. యధాప్రకారంగా ప్రతిరోజు Dept. కు పోవడము మళ్లి సాయంకాలము రావడము జరుగుచున్నది. నాలుగు రోజులు గడచినవి. అయిదవనాడు తనకు కూడ ఒక ఉత్తరము ఉస్మానియా యూనివర్సిటీ నుండి వచ్చింది తన డిపార్టమెంట్‌కు ఉత్తరం విప్పి చూచినాడు.

ఇది Professor of Economic పదవికి నిన్ను appoint చేస్తున్నాము. నీ జీతము నెలకు 600 రూపాయలు + few increments అన్నీ కలిపి సుమారు 1000 రూపాయలు నెలకు అని వుంది ఆ ఉత్తరములో. ఇష్టముంటే ఒప్పకొని ఆరునెలల్లోగా వచ్చి జాయిన్ కాగలవని వ్రాసివుంది.

ఆ ఉత్తరములో పంథా చూస్తేనే విక్రంకు నచ్చలేదు. ఇండియా నుండి official గా ఉత్తరాలన్నీ అలాగే ఉంటాయి. యివన్నీ బ్రిటిష్ వారు ఉన్నప్పుడు వారి subordinates కు వ్రాసే ధోరణితో ఉంటాయి. వారు భారతావనిని విడచి వెళ్ళి ఇన్ని సంవత్సరాలైనా భారత వ్యవస్థ విధానము ఆ పద్ధతులపైననే ఇప్పటికి జరుగుచున్నవి అని విక్రం విచారపడినాడు.

సుమారు ఇరువై సంవత్సరాలైనా ఇంకా యేమీ మార్పురాలేదు అనుకున్నాడు. ఇక ఆ విషయమై రోజూ ఆలోచిస్తున్నాడు. ఒకటేమిటంటే ఇచ్చట ఉన్న ఇంతమంచి ఉద్యోగానికి, ఈ స్వేచ్ఛకు, ఈ higher standard కు స్వస్తి చెప్పి మళ్లీ కుళ్లుపడిన భారత వ్యవస్థలోనే పనిచేయుటకు వెళ్లవలెనా అనుకుంటున్నాడు. ప్రతిరోజూ సాయంకాలం ప్రమదతో చర్చించుట, మళ్ళీ ఆలోచనలో మునిగిపోవుట విక్రంకు ఒక అలవాటుగా మారిపోయింది. అయిదురోజుల పిమ్మట ఒక నిర్ణయానికి వచ్చిండు. అదియేమిటంటే యిక్కడ ఉద్యోగానికి ఒక సంవత్సరము leave absense పెట్టి దేశం వెళ్లి చూసి ఇష్టం కాకుంటె మళ్లీ వద్దాము అని నిర్ణయించి ఉస్మానియా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌కు ఉత్తరం వ్రాసినారు. దానిలో తాము appointment ను వొప్పుకుంటున్నట్టు Instead ఆరునెలలకు యెనిమిది నెలల గడువుకావాలని కోరినాడు.

దీనికి ఒప్పుకొని రెండు వారాలలో మళ్ళీ విక్రంకు V.C. నుండి ఉత్తరము వచ్చింది. ఉత్తరము చూడగానే మరునాడు మా యూనివర్సిటీ ప్రెసిడెంట్‌ను చూడటానికి appointment తీసుకున్నాను. మరునాడు ఆ time కు president ను చూచినాడు. ఇక్కడ ప్రెసిడెంటుకు professor కు అంతభేదముండదు. యే ప్రెసిడెంటు పదవి professor rank కన్న పెద్దది కాదు. కాన ప్రెసిడెంటుకు మొత్తం యూనివర్సిటీపైన అధికారముంటుంది. ప్రెసిడెంట్‌గారు పోగానే లేచి కరచాలన చేసి కూర్చోమన్నాడు. యేమిటి వస్తరి అన్నాడు. నాకు ఒక visiting professor appointment వచ్చింది. మీరు యేమనుకోకుంటే ఒక సంవత్సరము జీతము లేకుండ నాకు సెలవు కావాలి అన్నాడు విక్రం.

యెచ్చట దొరికింది ఈ visiting professor పదవి అన్నాడు. ఇండియాలో ఉస్మానియా యూనివర్సిటీలో అన్నాడు విక్రం.

సరే అన్నాడు. Thank you అని కరచాలన చేసి నిలబడ్డాడు విక్రం. Hope you will enjoy your stay in India అన్నాడు. I hope so అని మళ్ళీ ఒకసారి thanks చెప్పి ఆఫీసు బయటకు వచ్చి, పిమ్మట తన ఆఫీసులోనికి వెళ్ళినాడు విక్రం. వెంటనే ప్రమదకు ఫోను కలిపి జరిగిన సంగతి తెల్పగానె ప్రమద చాల సంతోష పడ్డది. తన పని పూర్తి చేసుకొని ఇంటికి పోయినాడు విక్రం.

అన్ని details ప్రమదకు మరోసారి చెప్పినాడు. ఇక మనము మే వరకు ఫర్నిచర్ కారు అమ్మి జూన్ 1st కు బయలుదేరాలె అన్నాడు. సరే అని భారతదేశానికి తీసుకవెళ్లే సామానంతా ప్యాక్ చేస్తుంది ప్రమద. అంత ప్యాక్ చేసి March లో చాలా సామాను sea mail తో పంపినారు. తమ బట్టలు మొదలగు ముఖ్యమైన వస్తువులు పెట్టెలలో నింపుకున్నారు.

మే పదిహేనుకు Minneoples వదలి న్యూయార్క్‌కు ప్రయాణమైనారు. మొదటిసారిగా జంబోజెట్ అంటె Boing 747లో మినియాపిలస్ నుండి న్యూయార్క్ వరకు వెళ్లినారు. N.Y. లో వీళ్ళ స్నేహితులవద్ద మే 31 వరకు వుండి చుట్టుముట్టు ప్రదేశాలను చూచి జూన్ 1st కు N.Y. to Bombay వెడలే Air India jet లో యెక్కినారు.

మరునాడు రాత్రికి 12½ గంటల బొంబాయి విమానాశ్రయములో దిగి customs clearence చేసుకొని ఒక బొంబాయి హోటల్‌లో దిగినారు. తెల్లవారుజామున లేచి 8½ గంటలకు బొంబాయి నుండి హైదరాబాదు విమానానికై యేరుపోర్టుకు వచ్చినారు. కాని ప్లేన్ నాలుగు గంటలు లేట్. చేయునదిలేక నాలుగు గంటలు కూర్చున్నారు విమానాశ్రయములో. అనాడు బొంబాయిలో ఒకటే విమానాశ్రయము. అప్పటి ప్రయాణ సౌకర్యాలు చాల primitive గా వుండెను. అయినా దేశము మనది.

యెవరికి చెప్పకుంటే యేమిలాభం అని ఓర్చుకుని. ఒంటిగంటకు హైదరాబాదు విమానంలో ఎక్కి హైదరాబాదు విమానాశ్రయంలో దిగినారు. ప్రమద కుటుంబము బంధువులు, స్నేహితులు, క్రిష్ణమోహన్ మరియు ఇంకెందరో మమ్ములను ఆహ్వానించుటకై వచ్చినారు. అందరితో ప్రేమతో కలసినాము. అనుపమ్‌కు తెలుగు రాదు కాని, తాతయ్య, అమ్మమ్మను కృష్ణమోహన్‌ను గుర్తుపట్టినాడు. అందరి దృష్టి మా చిన్నారి బాబుపై మళ్ళింది. మాతో కలసిన పిమ్మట అయిదేండ్ల తర్వాత మళ్ళి అందరిని చూస్తున్నందుకు అంతులేని ఆనందంతో ఆనందబాష్పాలు నిలచినవి మా కనులలో. అప్పుడు అమెరికాకు వచ్చేవారు పోయేవారు చాలతక్కువమంది.

మొత్తం అమెరికాలో కొన్నివేలమంది భారతీయులుండేవారు. అందులో చాల యెక్కువగా విద్యార్థులే. యిప్పటి వలె అప్పుడు లక్షలు లక్షలుగా లేకుండిరి. అప్పుడప్పుడే highly qualified అయిన వారికి immigration open అయ్యింది. అందుకే విక్రంకు, ప్రమద, అనుపమ్‌లకు green card వున్నవి. డాక్టర్లకు అసలే entry లేకుండె. వున్నా రెండేండ్లకు మళ్ళీ వెడలిపోవలె అని ఒక నిబంధన ఉండెనప్పుడు. విద్యార్థులు చదువు పూర్తి చేసి దేశానికి తిరిగి వెళ్ళవలెనని వత్తిడి చేసేవారు.

కాబట్టి చాలామంది విద్యార్థులకు చదువు పూర్తికాగానే యెంతప్రయత్నించిన వీలుగా లేకుండెను. kennedy పుణ్యమా అంటూ యిప్పుడు చాలామందికి immigration అవకాశము లభించింది. ఇంతకు పూర్వము అమెరికా immigration policy racist policy గానే వుండెను. యూరప్ వాసులకే యిమ్మిగ్రేషన్ దొరికేది. తక్కిన యేదేశస్తులకు యిమ్మిగ్రేషన్ దొరికే వీలులేకుండెను. అందులో యూరోపినియన్‌లో కూడా ఇంగ్లీషు వారికి చాలా preference వుండె. greek వారికి last preference వుండెనని అమెరికాలో అనుకోగానే విన్నాను.

అమెరికాలో Rail Road వేస్తున్నప్పుడు చాలా పనివాళ్ళు అవసరమున్నప్పుడు వేలాది చైనా దేశస్తులను రానిచ్చినారు. వారిలో చాలమంది కూలీలుగా రోడ్లను వేయుటకు పనికి వచ్చినారు. వీరు చాల కష్టపడి ఆ రేల్ రోడ్డును పూర్తి చేయగానే వారిని ఉండనీయలేదట అమెరికాలో. ఇందులో చాలామంది ఆ కష్టాలకు

తట్టుకోలేక మరణించినారట. అనాడు చైనా ఇంతబలీయమైన దేశముకానందువనే వారికి అగతి పట్టిందని ఇంకా చెప్పుకుంటారు. అమెరికా అనాడు యూరపుకు సంబంధించినంతవరకు యూరపియన్ extension అన్నమాట.

నల్లవారు ఆదేశంలో వున్నవాళ్ళకు సివిల్ లిబర్టీసు లేకుండెను కదా. అందుకే నూటికి పన్నెండు శాతమున్న వారికి యేమి పలుకుబడి లేకుండెను. పిమ్మట మెగ్జికనులైతే యేవిధమైన రాజకీయ చైతన్యము లేక అబలులై వుండిరి. ఇక కొద్దో గొప్పో నున్న చైనాదేశస్తులు, జపానీయులు కూడ అల్పసంఖ్యాకులు అందుకే యూరోపియనులు ఆడింది అట పాడింది పాట కాని 1960 నుండి ఆ పరిస్థితి మారుతూవచ్చింది.

ప్రెసిడెంట్ కెన్నడి ఆ మార్పులకు పునాది వేసినాడు. అందుకే ఈనాడు ప్రతిదేశీయులు freedom ను తెల్లవారికి తీసిపోకుండ enjoy చేస్తున్నారు. అమెరిక యిప్పుడు యూరోపియన్ డామినేషన్‌లో లేదు. అన్ని మతాలవారు అన్ని దేశాలవారు ఇప్పుడు ఆ దేశంలో మైనారిటీలుగా వున్నా full freedom తో వున్నారు. ఇప్పటి అమెరికాకు గత శతాబ్దములోని అమెరికాకు చాలా వ్యత్యాసముంది. Airport అనాడు బేగంపేటలో చాల చిన్నది. వారి బంధు మిత్రులతో క్రిక్కిరిసిపోయినది. కార్లు చాలా నున్నవి. సుమిత్, సుమన్, విక్రం, ప్రమదలను తన కారులో యెక్కించుకున్నారు. అనుపమ్ తాతగారి కారులో యెక్కినాడు. తక్కిన బంధువులు, స్నేహితులు తమ తమ వాహనాలలో బయలుదేరి వెళ్ళినారు. ఇందులో కొంతమంది తమ యిండ్లకు పోయినారు. దగ్గరి వారంతా రఘునాథరాయల ఇంటికి వచ్చినారు. రాగానె అందరం living room లో కూర్చున్నాము. చాలసేపటి వరకు మాటాడినాము. కొంచెం సేపు మాటాడినాక చాలా అలసి వుంటారు. మీరు స్నానాలు చేసిరండి భోంచేసి పడుకుందురు అన్నారు రఘునాథరాయలు. సరేనని నేను, ప్రమద లేచినాము. స్నానాలు చేసి బట్టలు మార్చుకోగానే fresh అయినాము. భోజనం నాకు వద్దు ఆకలి లేదు. నేను పడుకుంటాను అన్నాడు విక్రం. అన్నదే తడువుగా సుమన్ నన్ను తీసుకెళ్ళి ఒక రూం చూపించినాడు. నేను పోగానే బెడ్‌పైన పడ్డాను. ఫ్యాన్ నడుస్తుంది, చల్లటి గాలిలో హాయిగా కన్నుమూసినాను. తెల్లవారిగాని మళ్ళి మెలకువ రాలేదు. మెలుకువరాగానే ప్రక్కనే ప్రమద వుంది బాగా నిద్రలో. యెప్పుడు వచ్చినావు అన్నాడు విక్రం. నిన్న సాయంకాలం అంది ప్రమద. అనుపమ్ యేడి అన్నాడు విక్రం. నాన్నగారితో పడుకున్నాడు. యిప్పుడు నాకు వాని చీకు చింత లేదు. మీ విషయం కూడ అంతే అంది ప్రమద చిలిపి నవ్వుతో.

చాలామంచిది. నాకు కూడ సంతోషమే. రేపు వెళ్ళి duty కి report చెయ్యాలి. ఈనాడు మాత్రము ఆ బాధలేదు. అన్నాడు విక్రం. యిక్కడ పని వత్తిడి అక్కడివలెనుండదులే అన్నది ప్రమద. అవును అన్నాడు విక్రం. లేచి మొఖాలు కడుక్కొన్నారు ప్రమద విక్రంలు. అయిదేండ్ల పిమ్మట వచ్చినాడు కాబట్టి కొంచెం cultural shock తప్ప లేదు విక్రంకి. యేది చూచిన చాల sub standard గా కనుపిస్తుంది. అయినా పుట్టి పెరిగిన దేశం కాబట్టి వారం రోజులలో adjust అయినాడు

ప్రమదకు మళ్ళీ పుట్టినింట్లో నున్నందున ఆ cultural shock ఏమిటో కూడ తెలియదు. ఆమెకు యిప్పుడు ఏ పనీ చేసే అవసరము లేదు. చేసే పని వాళ్ళున్నారు బాధ్యతవహించే తల్లి తండ్రులున్నారు. మరునాడు విక్రం రఘునాథరాయల కారు తీసుకొని పది గంటలకు ఉస్మానియా యూనివర్సిటీకి వెళ్లి రిపోర్టు చేసినాడు. అచ్చటి dean అతని గది అవి చూపించినాడు. పిమ్మట V.C. గారి వద్దకు తీసుకవెళ్ళినాడు. V.C. గారు తన ఆఫీసులో కూర్చుండబెట్టి చాలాసేపు మాటాడినాడు.

తానుకూడ economist నేనని తెల్పినాడు. Oxford England నుండి నీవు పుట్టకముందే M.A. చేసినాను అని చెప్పినాడు. విక్రంను చూచి చాలా సంతోషాన్ని వ్యక్తపరచినారు. గంటసేపు విక్రం V.C. తో కలసి బయటపడ్డాడు. బయటికి రాగానే Dean పాపం విక్రంకై వేచియున్నాడు. రాగానె విక్రంతో తన ఆఫీసుకు వెళ్ళి, మీకేమైన అవసరాలు వుంటే direct నా వద్దకి రండి. మరో వారం రోజుల వరకు రోజూ రావలసిన అవసరంలేదు. ఇంక విద్యార్థుల్లేరు. వారం రోజులైతే గాని ప్రతిదీ ఆరంభంకాగలదు. వారం రోజుల వరకు సెలవులే అని చెప్పినాడు.

విక్రం అంతా విని సరే thank you very much మళ్ళీ వారం రోజుల తర్వాత వచ్చి మిమ్ములను కలుస్తాను అన్నాడు. విక్రం యింకా I.A.S. ధోరణిలోనే వున్నాడు. యితడు resign చేసినా తన యింటి మీద యింక పేరుతో I.A.S. వుండనేవుంది. యిప్పుడు మామగారి యింట్లో నున్నాడు అందరి బంధువులతో. మామగారు అల్లున్ని కొమరులకన్న మంచిగా చూస్తున్నాడు. ప్రమద ఆయన గారాబు కూతురు ఆమె వచ్చినందుకు, మనమడు తనతో నున్నందుకు చాల సంతోషంగ వున్నాడు. యిప్పుడు రిటైర్ అయి యింట్లోనే వుంటాడు. కాని సాయంకాలం క్లబ్స్‌కు వెళ్లుతాడు.

అప్పుడప్పుడు అనుపమ్‌ను కూడ వెంట తీసుకెళుతాడు. ప్రమద మాత్రం చాల సంతోషంగ వుంది. విక్రంకు మాత్రం ఆఫీసులో పని చాల తక్కువ. యిక్కడ విద్యా విధానంలో చాల లోపాలున్నట్టు చూస్తాడు. విక్రం తన ఊహలో మనకు మనదనే విద్యావిధానం లేదనే వూహిస్తున్నాడు. ఎందుకంటే ఈ విద్యావిధానం బ్రిటిష్ వారు మననెత్తిన రుద్దిన విద్యావిధానము. ఈ విధానమునుండి వారికి కావలసిన Administrative సిబ్బందిని తయారు చేసుకున్నారు. 1947లో స్వతంత్రంగానే ఒకేసారి ముఖ్యమైన పదవులలో తెల్లవారు మాయమై భారతీయులు కనబడినారు. దేశభాషలలో వీరు తెల్లవారి వలెనే ప్రవర్తించినారు. ఇక మహానాయకులంత పాశ్చాత్యదేశాలలో తర్ఫీదు పొందినవారె. అందువల్ల వారి ఇంగ్లాండు అమెరికాలో అవలంభించిన రాజకీయ విధానమే ఈ దేశంపై రుద్దినారు.

ఇంగ్లీషు వారు పరిపాలించే వారిని I.C.S. అన్నారు. వీరు I.C.S. మార్చి I.A.S. అన్నారు. వాళ్లు పెట్టిన ప్రతి institutions ను మన నాయకులు తు.చ. తప్పకుండ పాటించినారు. యేమిటంటె తెల్లదొరలు పోయిన నల్లదొరలొచ్చినారు. పరిపాలన యిప్పుడు మనది. యిప్పుడు మనదేశము democracy. ప్రతివానికి ఓటిచ్చే అధికారాన్ని ప్రసాదించినాడు నెహ్రూ మహాశయుడు. దేశములో నూటికి 70 మంది నిరక్షరాస్యులున్నప్పుడు ఆ democracy ని యెలా వినియోగిస్తారో

తెలుసుకోవలసిన విషయం నెహ్రూ వున్నంతకాలం ఆయన Towering personality క్రింద democracy సరిగానే నడిపించాడు. ఆయనంటే ప్రజలకు భక్తి గౌరవాలు వుండేది. కాని అయన మరణించగానే ఆరునెలలు శాస్త్రిగారు బాగానే నడిపించాడు. కాని దేశ దురదృష్టమన్నట్టుగా ఆరునెలలో ఆయన మరణించాడు.

పిమ్మట దేశ పాలన నెహ్రూవంశానికి ఒక విరాసతుగా మారింది. శాస్త్రి పిమ్మట ఇంద్రమ్మగారు రాజకిరీటాన్ని ధరించింది. democracy ని హత్య చేసింది. ఆమె చాలా కాలం రాజ్యాన్ని పాలించింది పిమ్మట పెద్ద కొడుకుకు రాజ్యం లభించింది అయన కొద్ది రాజులు మంచి పేరు తెచ్చుకున్నాడు కాని సహవాస దోషంలో పాడైనాడని వదంతి. ఆయనను కూడ extremists హత్య చేసినారు. పిమ్మట దేశంలో నిజమైన democracy రాలేదు.

ఇందులో horsetrading కరప్షన్ మిళితమై పోయినాయి. దేశంలో పేరుకే ప్రభుత్వం కాని లంచం లేనిది యే పనీకాదు. యిప్పుడు మన democracy నడుస్తుంది కాని యిటువంటి విధాన్నేనా! గాంధి, నెహ్రూలు కలగన్నది అని సర్వజ్ఞులు వాదించుకుంటారు దేశము అధోగతి పాలవుతుందని Law & Order పూర్తిగా నశించిందని అనుకుంటారు సర్వజ్ఞులు. ఒక్కమాటలో చెప్పాలంటే democracy is not suited to India అన్న నిర్ణయానికి కొందరు వచ్చారు. కాని alternate ను ఇంత వరకు యెవరూ సృష్టించలేదు. Democracy is not perfect. But there in not other perfect system అనే నిర్ధారణలో నున్నారు కొందరు. యేది యెట్లైన మార్పు వస్తుంది దేశంలో కాని ఈ మార్పు మంచిదా కాదా అన్నదే చర్చించవలసిన సమస్య

విక్రం కొద్దిరోజులు ఉస్మానియా యూనివర్సిటీలో పని చేయగానే మళ్ళీ తన U.S. position కు వెళ్లిపోవాలనిపించింది. కాని ప్రమదతో ఆ విషయం మాట్లాడినాడు. కాని ఆమెకు అమెరికాకు మళ్ళీ పోవాలని అసలే లేదు. ఒక వేళ పోయినా సంవత్సరం తర్వాతనే పోదాము అని ఖచ్చితంగా చెప్పింది. విక్రం సరే అలాగే చేద్దాము అని వూరుకున్నాడు. రోజూ పది గంటలకు వెళ్లేది ఒకటి రెండు lectures యిచ్చి మూడు వరకు యిల్లు చేరుకునేది. రోజూ కారులో వెళ్లి కారులో వచ్చేది. కాని పని మాత్రము యేమీ ఉండకపోయేది. యెప్పుడు చూచినా యేదో సాకుతో strikes అంటె no classes అంతేకాకుండ అరు నెలలపాటు colleges closed due to Telangana agitation. విద్యార్థులు యెవరూ class కు రాలేదు. కాని అధ్యాపకులు మాత్రము university కి వచ్చి సంతకాలు చేయాలె. ఆ సంతకాలకొరకు నిత్యము విక్రం మారేడిపల్లి నుండి ఉస్మానియా యూనివర్సిటి drive చేసి సంతకం చేసి పోవాలె. వచ్చేది కూడ కష్టమే యెందుకంటే యెవరిని యూనివర్సిటీకి రానీకుండ విద్యార్థులు picketing చేసేవారు. ఆ పూట కుర్రాళ్లు రాళ్లు రువ్వి కార్ల అద్దాలు పగులగొట్టెడు వారు. ఈ రిస్కు తీసుకొని యెందుకు రావాలంటె ఒక సంతకం చేయుటకు. ఆ విధంగా చూస్తుండగానే యేడు నెలలు గడచినవి. ఇంకను యేడు నెలలైతె వెళ్ళిపోవచ్చునులే అనుకున్నాడు. ఇంతలో ఈ strike అయిపోయింది ఎందుకు మొదలైంది యెందుకు ముగిసింది తెలియదు.

కాని, యిది ప్రత్యేక తెలంగాణము కావాలని రెండవసారి తెలంగాణ జిల్లాలకు చెందినవి విద్యార్థులు చేసిన రెండో strike. భారతదేశము నెహ్రూ పరిపాలిస్తున్నప్పుడు భాషారాష్ట్రాలు లేవుకాని నెహ్రూ ఒక states re-organisation commission ను నియమించినాడు. వీనికి Fazal Ali అనే ఒక నిపుణ్ణి అధ్యక్షుడుగా నియమించాడు. అధ్యక్షుడితో దీనిలో ముగ్గురు సభ్యులు. ఆ commission బాధ్యత యేమిటంటే బాగా study చేసి దేశాన్ని భాషారాష్ట్రాలపై విభజన చేయాలి అని. అయితే యింతకు ముందు మద్రాసులో ఆంధ్రులు, అరవవారు ఉండేవారు. బొంబాయిలో మహారాష్ట్రులు, గుజరాతీలు వుండెడివారు. హైద్రాబాదులో తెలుగు, మరాఠి, కన్నడము మాట్లాడేవారు వుండేవారు. అయితే యెందుకో దేశాన్ని భాషా ప్రాతిపదికపై విభజించాలని నెహ్రూగారు నిర్ణయించారు. దాంతో దేశంలో అలజడి మొదలయ్యింది. commission report లో యెన్నియో సలహాలున్నవి. నెహ్రూకు నచ్చినవి ఒప్పుకొన్నాడు. నచ్చనవి కొట్టివేసినాడు. ఆ కమీషన్ హైద్రాబాదులో నున్న మరాఠి జిల్లాలను మహారాష్ట్రలో కలిపి వేయాలి, కన్నడం మాట్లాడె వారున్న జిల్లాలను కర్ణాటకు చేర్చాలే తెలంగాణాములోని తొమ్మిది జిల్లాలను ప్రత్యేక తెలంగాణముగా వుంచాలె. అలాగా విదర్భలో మరాఠి మాట్లాడెవారున్న దానిని, మహారాష్ట్రంలో చేర్చకుండ విదర్భగానే వుంచాలె అని తీర్మానించింది. కాని commission సిఫారసులను నెహ్రూ అంగీకరించక తెలంగాణ ఆంధ్రలో చేర్చి విశాలాంధ్ర లేదా ఆంధ్రప్రదేశ్‌ను సృష్టించినాడు. అలాగే విదర్భను బొంబాయి ప్రావిన్స్‌లో చేర్చి మహారాష్ట్రను సృష్టించినాడు. ఆ విధంగా మునుపున్న రాష్ట్రాల పేర్లు మారినవి. మద్రాసు రాష్ట్రంగ నున్నది తమిళనాడుగా మారింది. బొంబాయి రాష్ట్రంగ నున్నది మహారాష్ట్ర అయినది. ఈ విధంగా కొన్ని రాష్ట్రాల పేర్లు మారి భాషా ప్రాతిపదికపైన వాటి పేర్లను మార్చినారు. తెలంగాణా వారికి ఆంధ్రవారికి యిష్టం లేని పెండ్లి జరిగింది. మొదటిసారి తెలంగాణా వారిలో అసంతృప్తి అలాగా వుండి ఇప్పుడు రెండవ సారి ఒక ఉద్యమంగ మళ్లీ పైకొచ్చినది. కాని ఈసారి కూడ వాళ్లు విజయులు కాలేదు. తెలంగాణ ఉద్యమం సన్నగిల్లింది, విఫలమయ్యింది. విద్యార్థులు మళ్ళీ కాలేజీలకు వెళ్తున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం మళ్ళీ విద్యార్థులతో కళకళలాడుతోంది. classes జరుగుచున్నవి. విక్రం ఒక బి.ఎ. ఎకనామిక్స్ క్లాస్ తప్ప తక్కినవన్ని ఎమ్.ఎ. ఎకనామిక్స్‌కే చదివిస్తాడు. research యేమంత జరగడం లేదు. M.A. students thesis వ్రాస్తున్నారు. కాని అంత serious research యేమీ లేదు. M.A. విద్యార్థికి internal & external examiners వుంటారు. internal examiner గా కొంత మందికి విక్రం వుండెను. వారి ఎకనామిక్స్ knowledge కు విక్రం ఆశ్చర్యపోయేవాడు. ఉదాహరణకు ఒక విద్యార్థికి ఆడమ్ స్మిత్ యెవరో తెలవదు. ఆ విద్యార్థి ఉత్తీర్ణుడు కాకూడదని విక్రం నిశ్చయించుకున్నాడు. పాస్ అని సంతకం చేయకుండనే exam room నుండి తన ఆఫీస్‌కు వచ్చి కూర్చున్నాడు. కొంత సేపట్లో తనతో చదివినప్పుడే political science లో Ph.D. చేసి యిచ్చట professor గా నున్న ఒక మిత్రుడు తన ఆఫీసుకు వచ్చి ఆ విద్యార్థికి అన్యాయం చేసినారు మీరు అన్నాడు. నేనా అన్నాడు

విక్రం. అవును అన్నాడు. మీరు యితనికి మీ సబ్జెక్టులో పరీక్ష తప్పించినారు. యెందుకంటే మీరు అతనికి examiner కాబట్టి. కాని మరి అన్ని M.A. విద్యార్థులు అలాగే వున్నారు. వారికి మీరు examiner కానందున అందరు పాస్ అవుతున్నారు. కాని ఈ దురదృష్టవంతునికి మీరు examiner అయినందుకు అతడు ఫేల్ అవుతున్నాడని వాదించినాడు. విక్రం ఆయన argument లో సత్యం వుందని అంగీకరించి పాస్ చేసి సంతకం చేసినాడు. ఈ సంఘటన జరిగిన కొద్ది రోజులకే ఢిల్లీలో ఇతనికి ఒక position IARI నుండి offer చేయబడింది. యిది Asia లో పెద్దదని వదంతి. ఈ position Head of economic division లో ప్రమదకు చాలా ఇష్టముండె కాని సాలరీ ఒక నాలుగువందల రూపాయలె యిచ్చుట కన్న యెక్కువ అన్నాడు. అది దొరికితె మహాభాగ్యమునుకునే వారు. సాలరీ తక్కువైన fringe benefits బాగా ఉండెను. అందుకే ప్రమద నన్ను ఒప్పుకొమ్మని బలవంత పెట్టింది. అప్పుడు విక్రం ప్రమదతో చూడు ప్రమద నీవు ఢిల్లీలో వున్న మిన్నసోటాలో నున్న యేమి బేధము. హైదరాబాదులో వుంటె అది వేరు కాని ఒకసారి హైదరాబాదు విడిచితే ఢిల్లీలో నున్న Minnasota లో నున్న అంత బేధముండదు. ఎందుకంటే నా సంపాదనతో ప్రతి సంవత్సరము మనము మిన్నసోటానుండి హైదరాబాదుకు రావచ్చుకాని మనకొచ్చే జీతంతో ఢిల్లీనుండి హైదరాబాదు ప్రతి సంవత్సరం fly చేయలేము అన్నాడు. ఈ comparison ప్రమదకు నిజమనిపించింది. అందుకే సరే మీరు ఆలోచించి నిర్ణయిం తీసుకొండి అంది అది జరిగిన పిమ్మట నేను అమెరికాకు మరలిపోవుట నిశ్చయమనుకొన్నాను. చూస్తుండగానే జూలై పూర్తికావస్తుంది ప్రమదతో అగస్టు చివరకు minnasota లో ఉంటాము అన్ని సర్దుకో అన్నాను. సరే అని అన్ని సర్దుతుంది పాపం మళ్ళీ అందరికి వీడ్కోలు చెప్పాలె కన్నీళ్లతో. యిక్కడ ticket కొనాలంటె రిజర్వు బ్యాంక్ పరిమిషన్ మరింకెన్నియో complications. అనాడు అమెరికాకు పోయేవారికి ఒక యేడెనిమిది డాలర్లకు మించి ఇచ్చేవారు కారు. కాని హైదరాబాదు రిజర్వు బ్యాంకు అధ్యక్షుడు రఘునాధరాయలకు తెలుసు కాబట్టి ఒక కాగితం వ్రాయించుకొని మా టికెట్లకైన డాలర్లు మంజూరు చేసినాడు. పోగానే ఈ డాలర్లు కట్టి రూపాయలు తీసుకోమన్నాడు. ఇక పోయేదినము సమీపిస్తుంది. ఈసారి బంధువులెవ్వరూ రాలేదు యేదో దగ్గరి వాళ్లు తప్ప. family members కొంతమంది తప్ప. Airport కు అంతమందిరాలేదు. ఈసారి హైదరాబాదు నుండి ఢిల్లీ విమానంలో యెక్కినాము. యూరపునుండి పోయే బదులు బ్యాంగ్‌కాక్, హాంగ్‌కాంగ్, టోక్యో, హొవాయిమీదుగా వెళ్లినాము. త్రోవలో ఆ ప్రదేశాలలో ఆగుకుంటు, చూడదగిన ప్రదేశాలను చూస్తూ, హవాయి చేరుకున్నాము. హవాయిలో రెండు రోజులుండి california మీదుగా మిన్నసోటాకు చేరుకున్నాము. మమ్ముల్ని ఏర్‌పోర్టులో రిసీవ్ చేసుకొనుటకు మా అమెరికన్ ఫ్రెండ్స్ వచ్చినారు. Welcome home అని ఆహ్వానించారు. రెండు రోజులు వాళ్ళ యింట్లోనే వుంచుకున్నారు. పిమ్మట వాళ్ళే ఓ మంచి ఇల్లును అద్దెకు ఇప్పించినారు. ఇప్పుడు అపార్ట్‌మెంట్ నుండి ఇంటికి ప్రమోషన్ పొందినాము. ఇప్పుడైతే అమెరికాలోనే స్థిరపడుతున్నాము కాబట్టి

ఇల్లు కొనాలని నిర్ణయించుకొన్నాము. ప్రమదతో ఈ విషయం మాట్లాడినాను. ఆమె స్నేహితులతో రియల్ ఎస్టేట్ ఏజెంట్లకు ఫోన్ చేస్తునే వుంది. మాకు తెలిసిన ఒక realter కు ప్రత్యేకంగా చెప్పినాము ఇప్పుడు విక్రం ప్రతి రోజూ ఆఫీసుకు వెడుతున్నాడు. రోజుకు రెండు class lectures వుంటాయి. అవి కాగానే వాటికి సంబంధించిన పనులతో నాలుగు గంటల వరకు ఆఫీసులో పనిచేస్తుంటాడు. నాలుగున్నర ప్రాంతంలో ఇంటికి వస్తాడు. రాగానే ప్రమద ఇద్దరికి టీ సిద్ధం చేస్తూ, ఆ టీ sip చేసుకుంటు భార్య భర్తలు లోకాభిరామాయణంతో కాలం గడుపుతారు. పిమ్మట విక్రం news వింటాడు. పిమ్మట ఎచ్చటికైనా షాపింగ్ కో, స్నేహితులను కలియుటకో వెడుతుంటారు. వీళ్లు అనుపమ్‌ని యింట్లో వంటరిగా ఎప్పుడూ వదలిపోలేదు. యెక్కడికి పోయినా ముగ్గురూ కలిసి పోయేది.

కాలం గడచిపోతుంది. ప్రమద వట్టిగ ఉండలేదు. యేదో ఒక activity వుండాలి. స్నేహంగ వుంటుంది అందరితో. ఆమెది సమాజ ప్రేమ. అందుకేనేమో ఆమెకు చాలమంది స్నేహితులైనారు. యెప్పుడు ఇంటికి ఫోనుచేసినా టెలిఫోన్ బీజిగా వుంటుంది. స్నేహితులతో యిప్పుడు కాలక్షేపం చేస్తుంది. నేను కూడ మంచిదే అనుకున్నాను. అనుపమ్ స్కూల్ లో చదువుచుండగా నేను యూనివర్సిటీలో పనిచేస్తుండగా మరియేమైన చేయాలిగా. అందుకే స్నేహితులను పెంచుకొంది. అనుపమ్ నేను రాగానే మాతో time spend చేస్తుంది. మేములేనప్పుడు తన స్నేహితులతో కాలం వెళ్లబుచ్చుతుంది. ఈమె స్నేహితులు యెక్కువ faculty families. వేరే వాళ్ళు చాల తక్కువగ వుంటారు. వారితో ఇండియన్ వంటలు, వస్త్రాధరణ విషయాలు మాటాడుతుండే వాళ్ళు చాల interest తో వింటూ కూర్చుంటారు. వాళ్ళకు ఇండియన్ వంటలు చేసి వడ్డిస్తుంది. అవి తిని వాళ్లు మెచ్చుకుంటారు, నేర్చుకుంటారు కూడాను. వారు రానప్పుడు తాను కారు తీసుకొని వాళ్ల యిండ్లలోకి పోతుంది. ఇప్పుడు ఆమెకు ప్రత్యేకంగ ఒక కారు వుంది. అనుపమ్‌ను స్కూల్ లో విడచి పెట్టి మళ్ళీ సాయంకాలము తీసుకొచ్చుట ఆమె బాధ్యతే. ఇంతకు మొదలు రోజు అనుపమ్‌ను స్కూల్లో విడచి, మళ్లి సాయంకాలం తీసుకరావటం విక్రం బాధ్యతగా నుండెను. కాని ఇండియా నుండి తిరిగి రాగానే ఆ బాధ్యత ప్రమద తీసుకుంది. ఎందుకంటే ఇండియా నుండి రాగానె ఇప్పుడు రెండు కొత్త కార్లు కొన్నారు. ఒకటి ప్రమదకు మరొకటి విక్రంకు అందువల్లే ప్రమదకు ఇప్పుడు full mobility. ఈ దేశంలో యేవేవో activities జరుగుతుంటాయి. Ethnic foods అనే ఒక మేలా జరిగింది. అందులో faculty wives అంతా ఒక stall తెరచినారు Indian food stall అని అందులో అన్ని దేశాలకు చెందిన తిండి వస్తువులు చేసి వాటిని అచ్చటనే వచ్చినవారందరికీ రుచి చూపించేది. నచ్చినవారు ఆ dishes కొని అచ్చటనే తినుటకు కొన్ని కుర్చీలు వేసి ఉంచినారు. ఈ విధంగా గ్రీకు, ఇటాలియన్ మొదలగు దేశాల తినుబండారాలు చేసి రుచి చూపించేది. ప్రమద ఇండియాలో చేసే సమోసాలను introduce చేసింది. ఇవి చాలా popular అయినవి. ప్రతి సంవత్సరము వందల మంది వీటిని కొని తినేది ఈ స్టాల్ లోనే. ఆ పిమ్మట ప్రతి సంవత్సరము ఇండియన్ సమోసాలు చాలా popular అయిపోయినవి.

ఇచ్చుట జనంలో వీటి నుండి వచ్చిన ఆదాయాన్ని యేదో charitable works కు ఇచ్చివేసింది. ఆ faculty wives అనే సంస్థ. విక్రం ఇప్పుడు తన పనిలో నిమగ్నుడై వుంటాడు. ఇతనికి ఆ పని routine అయిపోయింది. పనికాగానె యింటికి రావటం. న్యూస్ వినటం, భోంచేయుటం, టి.వి. చూడడం పండుకోవటం, ఉదయం లేవటం. కాఫీ త్రాగటం, ఆఫీసుకు పోవటం, క్లాస్ తీసుకోవడం. ఈ విధంగా జీవితం routine అయ్యింది. వీళ్లకు పరిచయము కలిగిన ఒక real estate businessman తో స్నేహమయ్యింది. అతడు యెన్నో ఇళ్లను చూపించినాడు. అందులో ఒకటి ప్రమదకు, విక్రంకు చూడగానే నచ్చింది. దానిని కొనివేసినారు. దాని monthly payments విక్రం శక్తికి మించిలేవు. అది కొని దానికి రంగులు వేయించి గృహప్రవేశము చేసినారు. ఇప్పుడు విక్రం ప్రమదలు ఒక యింటికి యజమానులు. ఈ ఇల్లు full basement finished. పైన మూడు bed rooms, kitchen, dining, క్రింద ఒక bed room, bath room పెద్ద హాల్, utility room వుంది. క్రింద అంతట అనుపమ్ వాని ఆటవస్తువులు అవి వున్నాయి. పండుకునేటప్పుడు తప్ప ఎక్కువ వాడు basement లోనే ఉంటాడు వాని స్నేహితులతో. అనుపమ్ ఇప్పుడు jr. high school లో నున్నాడు. Next year senior high school కు వెడతాడు. చదువు బాగానే సాగుతుంది. కాని వెంటబడితె తప్ప చదువడు. ప్రమద వాన్ని చదివిస్తుంటుంది. week ends లో తప్ప స్నేహితులను రాకుండ discourage చేస్తుంది. అనుపంను కూర్చుండబెట్టి home work చేయిస్తుంది. పిమ్మట basement లో వాడి ఆటవస్తువులతో ఆడుకొని తొమ్మిది దాటితే తన బెడ్ పైన వుండాలి. మళ్లి ఉదయం ఏడు గంటలకు లేచి తయారై బడికి ఎనిమిది గంటలకు పోవాలి. ఇది వాని routine. ఇప్పుడు మేము ముగ్గురము routine లో వున్నాము. week ends లోనే అనుపమ్‌కు freedom. వాని స్నేహితులతో తిరుగుతాడు basement లో ఆడుకుంటాడు. మళ్లీ సోమవారం నుండి శుక్రవారం వరకు school home work అంత routine. ప్రమద week end లో మాతోనే వుంటుంది. ఎక్కడికి వెళ్లినా ముగ్గురము వెడతాము. week end మేమైన dinner కు పిలుస్తాము లేదా ఫ్రెండ్స్ వద్దకు డిన్నర్‌కు వెడతాము. week ends చూస్తుంటూనే గడచిపోతాయి. మళ్లి week అంత కష్టపడి పని చేయాలె. శుక్రవారము రాగానే అందరు విద్యార్థులు, ఆచార్యులు, ఫ్యాక్టరీస్‌లో పనిచేసే కార్మికులు, ఆఫీస్‌లో పనిచేసేవారు thank god it is Friday అంటారు. అమెరికాలోని వారు వీక్ మొత్తము కష్టపడి పని చేస్తారు week end రాగానే enjoy చేస్తారు. ఇక్కడ పని అంటే పనే. ప్రతివాడు, సామాన్యంగా పనిచేసేటప్పుడు మనస్సు లగ్నం చేసి పని చేస్తాడు. అయినంతవరకు పనిలో మనస్సును కేంద్రీకరిస్తారు. చేసిన పనిని బాగా చేస్తారు. ఇచ్చుట చాలా మంది తమ స్వయంకృషి వల్లనే పైకి వచ్చినారు. తరతరాలుగా వస్తున్న భాగ్యలక్ష్మి యేకొద్ది families లోనో అందులో కూడ వాళ్ల తాతముత్తాతలెవరో బీదగా పుట్టి కష్టపడి అర్జించిన ధనమే ఈనాడు వాండ్ల కుటుంబసభ్యులు అనుభవిస్తున్నారు. ఈ తెగకు చెందిన వారిలో, Fords, Rockfellers, Melons, 'Kennedys మొదలగువారు.

మొదటి Ford ఒక సాధారణ auto mechanic. Kennedy తండ్రి joseph kenndy. తను స్వయంగా అర్జించి president kennedy కి వారి సోదరులకు వారి సంతానానికి ధనం కొరత లేకుండ చేసినాడు. ఆ విధంగా ప్రతివాడు స్వయం శక్తితోనే పైకొచ్చినారు. భారతదేశంలో కూడ ఒక విధంగా అంతే. మోతిలాల్ తన స్వయం కృషితో పైకి వచ్చినాడు. పిమ్మట జవహర్‌లాల్ నెహ్రూకు పొట్టపోసుకొనుటకు పనిచేసే అవసరము లేకుండె. అట్లే ఇందిరాకు, రాజీవ్‌కు కూడా. జీవితం సాగిపోతుంది, అమెరికాలో ఒక చక్రంగా ఈ కాలవాహినిలో తరలి వస్తున్నాము మేము ముగ్గురము.

సరిత పెండ్లౌతుందని, కాబోయే భర్త డాక్టరని రఘునాధయులు ఉత్తరము వ్రాసినారు. మీరు వస్తే ఈ వేసవిలో పెండ్లి చేస్తాము అని అందులో వుంది. ఉత్తరము చదవగానే ప్రమద పొంగిపోయింది. విక్రంతో మనము వెడదామండి అంది. వచ్చి పదినెలలు కాలేదు పోవుట కష్టం. నేను అనుపమ్ వుండిపోతాము. నీవు వెళ్లి రా ప్రమద అన్నాడు విక్రం. లేదండి మిమ్మలను వీడి నేను వెళ్లలేను. మీరు పోతే నేను పోతాను లేకుంటే అందరము యిచ్చటనే ఉండిపోదాము అంది. విక్రం చప్పుడు చేయలేదు. నీకున్నది ఒకే ఒక చెల్లెలు పోవుట మంచిది అన్నాడు విక్రం. మీకు కూడ ఒకే ఒక మరదలు కద మీరు కూడా రావాలి అంది. లేదు ప్రమద ఈ వేసవిలో నేను ఒక National foundation research grant project మీద పనిచేయాలె. అందుకే తీరక లేదు అన్నాడు. సరే అందరముండిపోదాము సరిత పెండ్లికాగానే భర్తతో అమెరికాకె వస్తుందట అంది. అయితె మరేమి మన [illegible]ంట్లో ఘనంగ ఒక reception చేద్దాము అన్నాడు. వెంటనే ప్రమద తండ్రిగారికి [illegible]రితకు ఉత్తరాలు వ్రాసింది. మీరిద్దరు దంపతులు సరాసరి మావద్దకే రండి. మే[illegible] అన్నీ చూసుకుంటాము అని వ్రాసింది. అనాడు డాక్టరు ఈ దేశం వచ్చి యిక్క[illegible]రపడే అవకాశము లేకుండెను. వాళ్లు J visa మీదనే వచ్చేవారు. వాళ్ల [illegible]ning పూర్తికాగానే యెట్టి పరిస్థితులలోనైనా దేశం వీడి పోవలసిందే. అంద[illegible] సరిత ఆమె భర్త training కాగానె వెళ్లిపోవాలె. అయినా ఇప్పుడే అంత దు[illegible]చన ఎందుకు. వారు training పూర్తి చేసుకునేవరకు పరిస్థితులు యెలావు[illegible]యో అని అనుకొంది ప్రమద. విక్రంకూడ ఆమెతో అంగీకరించాడు. పె[illegible]దినం రానే వచ్చింది. ఇప్పుడు అందరు చుట్టాలు యింటి నిండ వుంటారని [illegible]ంచి, ఆ ఊహా ప్రపంచంలో పయనిస్తుంది ప్రమద. లగ్నం ఉదయం 5 గం[illegible]ంది. ప్రమద సాయంకాలం కొంతమంది ముఖ్య స్నేహితులను యింటికి ఆ[illegible]ంది. ఆ పెండ్లి సమయానికి వాండ్లకు cokes icecream mix చేసిన పానియ[illegible]ంది. ఎందుకిదంత అని వారడిగినప్పుడు మా చెల్లెలి పెండ్లయింది ఇండియాలో [illegible]ప్పుడు అంది. O, congratulation why did'nt you tell before అన్నారు [illegible]ంత. well అని వూరకుంది. you are missing aren't you అన్నారు అ[illegible] yes అంది గద్గద స్వరంతో. ఎందుకు పోలేదు ప్రమదా అన్నారు అందరు. [illegible]ద్దరిని విడచి యెలా వెళ్ళాలి అంది. O,.... అన్నారు. అందరు, ఆమెను కౌ[illegible]కొని ముద్దిడుకొన్నారు. కొంచెంసేపు కూర్చొని కొన్ని వివరాలు అడిగి, O.[illegible]మద

we will see you అంటు ఒకరొకరు వెడలిపోయినారు. వారు పోగానే విక్రం, అనుపమ్‌కు వడ్డించి తనుకూడా భోంచేసింది. ఆనాడు అనుపమ్‌కు చదువు చెప్పలేదు. తొందరగా పడుకుంది. విక్రం కొంచెం సేపు T.V. చూచి పోయి ప్రమద ఒడిలో నిద్రించినాడు. తెల్లవారగానే మళ్ళీ మామూలు ప్రమదను చూచినాడు విక్రం. కాఫీ త్రాగి తన డిపార్టుమెంటుకు పోయినాడు. మళ్లీ యధాప్రకారం మధ్యాహ్నం భోజనానికి వచ్చినాడు. రాగానే చేతులు కడుక్కొని భోజన టేబిల్‌పై కూర్చున్నాడు. ప్రమద వంట అంతా టేబుల్‌పై పెట్టింది. ఒకటొకటి అన్నీ వడ్డించింది. కడుపునిండ యిద్దరు భోంచేసినారు. విక్రం తన డిపార్టుమెంటుకు పోయినాడు. ప్రమద టేబుల్ క్లీన్ చేసి ఒక పుస్తకం పట్టుకొని సోఫాపై కూర్చుంది. చదువుతు, చదువుతూనే నిద్రపోయింది సోఫాపైన. అనుపమ్ బడినుండి తీసుకరావటమే మరచిపోయి పడుకుంది ప్రమద. అనుపమ్ స్నేహితుని తల్లి అనుపమ్‌ను తీసుకవచ్చి విడచి వెడలిపోయింది. అనుపమ్ లోన ప్రవేశించి మమ్మీ అని తల్లిని లేపినాడు. దిగ్భ్రాంతితో లేచింది. వచ్చినావా నాన్నా. యెలావచ్చినావు అనగానే tomy's మమ్మీ వదలిపెట్టింది అన్నాడు. అలాగా I am sorry నాన్నా యెందుకో యేమో నాకు యెచటలేని నిద్ర ఈనాడు ముంచుకొచ్చింది అంది ప్రమద. సరేలే మమ్మీ it is alright అన్నాడు. లేచి కళ్లు కడుక్కుంది. ఏమైన తింటావా అనుపమ్ అంది ప్రమద. సరే మమ్మీ అని ఒక గ్లాస్ పాలు త్రాగి మరి పిల్లలతో ఆడుకొనుటకు బయటకు వెళ్లినాడు అనుపమ్. అతడు వెళ్లిన కొంచెం సేపటికి విక్రం వచ్చినారు. ఇద్దరు కూర్చొని టీ త్రాగినారు. ఏమైన చెప్పండి అంది ప్రమద. నాకేముంటుంది చెప్పటకు. క్లాసులో lecture ఇచ్చినాను. ప్రశ్నలు యధాప్రకారంగ యెవ్వరూ వేయలేదు వేరే కొంత research పని చూచుకొని పిమ్మట నిన్ను అనుపమ్‌ను చూచుటకు వచ్చాను. అది నేను చేసింది అన్నాడు నవ్వుకుంటు. ఇక నీవేమి చేసినావో తెల్పమన్నాడు. నేను బాగా నిద్రపోయినాను అనుపమ్ వచ్చి లేపేవరకు. అనుపమ్ యెలా వచ్చినాడు? నీవు పోలేదా వాన్ని తీసుకరావడానికి అన్నాడు విక్రం. లేదండి మొదటిసారి అన్నీ మరచి నిద్రపోయాను అంది ప్రమద. అలాగా సరే ఇంకేమిటి విశేషాలు. యేమున్నవి మీరే చెప్పండి నేను వింటాను అన్నది. అయితే సరిత భర్తతో హాయిగా ఉంటుందనుకుంట అన్నాడు విక్రం. అయితే సరిత మీతో నేనున్నట్టు సరిత కూడ అంతే అంది ప్రమద. Good I am very glad for her అన్నాడు విక్రం. సరిత భర్త పేరు గజ సింహుడు.

Medical course పూర్తికాగానె పెళ్లి చేసుకున్నారు. ECFMG పాసైనాడు. అమెరికా వెళ్లాలని ప్రయత్నం చేస్తున్నాడు. ఆస్తి అంతస్తులు వున్న కుటుంబీకులే. తండ్రి chief engineer గా రిటైర్ అయినాడట. అతనికి ఇద్దరు తమ్ముళ్లు. ఒక అక్క మరి చెల్లెలున్నారట. వీరి తండ్రిగారు ప్రమద తండ్రిగారికి తెలిసినవారట. తండ్రి తల్లి ఇంక బ్రతికేవున్నారట. మీ మాటలతో కొంచెం సేపు కాలక్షేపం చేసి పిమ్మట న్యూస్ విని యధావిధిగ T.V. programs చూసి పడుకున్నారంత.

ఈ కాలమనే మహాచక్రం ఎవరికోసము ఆగదు. అది దొర్లిపోతునే వుంటుంది. చూస్తుండగానె విక్రం, ప్రమద, అనుపమ్‌లు అమెరికన్‌లై పోయినారు. విక్రం యిక్కడే పని చేసి రిటైర్‌మెంట్ పిమ్మట స్వదేశం వెళ్లిపోవాలని నిశ్చయించుకున్నాడు.

జీవితం హాయిగా ప్రమద అనుపమ్‌లతో దొర్లిపోతుంది. వేసవి రాగానే యెచటికో ఒక చోటికి స్నేహితులను కలయుటకు వెళ్లుతారు. మూడు నాలుగు వారాలపాటు పిమ్మట ఈ పట్టణములోనే వుంటారు. Minneoplies లో చాలా భారతీయ విద్యార్థులున్నారు. కొంతమంది అచార్యులు కూడ నున్నారు. ఈ విద్యార్థులదొక association కూడ వుంది. ఈ association అప్పుడప్పుడు కొన్ని కార్యక్రమాలను నిర్వహిస్తుంది. వాటిని చూచుటకు అందరు వెడతారు. ఒక్కొక్కపుడు భారతదేశము నుండి వచ్చే ప్రముఖ సినీతారలను గాయకులను రాజకీయ పార్టీలకు చెందినవారిని ఆహ్వానిస్తారు. అన్నిటికన్న dinners, picnics, వినోదకార్యక్రమాలు జరుగుతునే వుంటావి. వీటన్నింటిని ముగ్గురు attend చేస్తారు. ఇప్పుడు చాల మంది విద్యార్థులు, ఆచార్యులు విక్రంకు, ప్రమదకు తెలిసినవారే. ఈ ఇండియా అసోసియేషన్ ప్రతి మీటింగ్ వీరు అటెండ్ చేస్తునే వుంటారు. ఇవి కాక university functions కూడ అటెండ్ చేస్తారు. చాలమంది తెల్లవారు విక్రంకు తెలిసినవారు వున్నారు ఈ యూనివర్సిటీలో. వారిని విక్రం ప్రమదలు అప్పుడప్పుడు ఆహ్వానిస్తునే వుంటారు. కాని వారు చాల అరుదుగా ఆహ్వానిస్తారు. అంటే వీరినే కాదు. యెవరిని ఆహ్వానింపరు. వీరిలో ఇద్దరు, ముగ్గురు faculty members విక్రం ప్రమదలకు చాల క్లోజ్ అయినారు. వారిని తరచుగా ప్రమద విందులకు ఆహ్వానిస్తుంది. వారు కూడ వీళ్ళను ఆహ్వానిస్తుంటారు. ఇందులో ప్రత్యేకంగా stocktman `అను professor మరి అయన భార్య ప్రమదను తన కూతురుగానే చూస్తారు. యెందుకంటే వీరి సంతానము ఇద్దరు మొగపిల్లలే కాబట్టి ప్రమదను adopt చేసుకున్నామని చెబుతుంటారు. వారి స్నేహితులతో సరదాకు ofcourse. ఈ దేశంలో చిన్న పిల్లలు పెద్దవారిని వరసలు పెట్టి పిలవరు కాని అనుపమ్ మాత్రము ఈ stocktman ను grand father లేదా అప్పుడప్పుడు grandpa అని, ఆయన భార్యను grandy అని పిలుస్తాడు. యిప్పుడు ప్రమద విక్రంలు అమెరికన్స్‌తో చాలా క్లోజ్ అయినారు. సాయంకాలం వారు వీరింటికి, వీరు వారింటికి కాలక్షేపం కొరకు వెడుతుంటారు.

విక్రం ఇప్పుడు full professor. Academic life లో యింతకుమించిన ర్యాంకు లేదు. university president అయినా professor rank ను వుంచుకుంటారు. ఈ దేశంలో academic & administrative positions వేరు వేరుగా నుంటాయి. administrative పదవిని వీడితే మళ్ళీ అకడమిక్ పదవికే revert కావలె. ఈ దేశంలో ప్రతివాడు స్నేహితుడే అనుకుంటే first name తోనే సంబోధిస్తారు. ఇది informal behaviour వీళ్లది. ఇప్పుడు విక్రం యూనివర్సిటీ ప్రెసిడెంట్‌ను జాన్ అని పిలుస్తారు. అతని పూర్తిపేరు Jhon w. willson మొదలు మొదలు కొత్తగా వచ్చినప్పుడు Dr. willson అని పిలిచేది కాని యిప్పుడు మాత్రము Jhon అనే పిలుస్తారు. విక్రంను మొదటి నుండి విక్రం అనియే పిలుస్తాడు ఈ ప్రసిడెంటు. ఈ ప్రసిడెంటుకు విక్రం అంటె గౌరవం వుంది. విక్రం విషయమై విద్యార్థులనుండైన కాలేజీనుండైన యెటువంటి complaint రాలేదు Dr. willson కు. ఒకనాడు Dr. willson ను అయన భార్యను dinner కు పిలువాలని తలపెట్టినారు ప్రమద విక్రంలు. విక్రం ఈ నిర్ణయమైన మరునాడు, Dr. willson తో కలయుటకు వెళ్లి

ఫలానానాడు మా యింటికి డిన్నర్‌కు రండి అని ఆహ్వానించినాడు. నా భార్యతో మాట్లాడి మరునాడు తెల్పుతానన్నాడు. మరునాడు ఫోన్ చేసి విక్రం yes we will come to your dinner. Carlio (willson భార్య) is excited to visit with you అన్నాడు. విక్రం thank you jhon అని we look forward having you in our home అని ఫోన్ పెట్టివేసినాడు. అనుకున్న రోజుకు ఒక రోజుముందే అన్ని సామానులు మరి డ్రింక్స్ అన్ని తెచ్చి పెట్టుకున్నారు. డిన్నర్‌నాడు ప్రమద ఉదయమే లేచి వంటలు మొదలు పెట్టింది. తినేవారు అయిదుగురే అయిన varieties of dishes చాల చేసింది. ఆనాడు ఆదివారం. విక్రం యింట్లోనే వుండి ప్రమదకు సహాయపడినాడు. ఆమెకు అమెరికన్స్ రుచులేమిటో తెలుసు. కొంచెం కారం తక్కువ వేసి శుద్ధమైన హైదాబాద్ dishes మరియు desserts చేసింది. పెరుగు కూడ చేసి పెట్టింది. సాయంకాలం వారు రాగానే soft Indian music పెట్టినారు. అచ్చట గోడలకు అమర్చిన పటాలను రాగితో చేసిన పటాలను బట్టతో చేసి (Baltic) బాల్టిక్ పిక్చర్ అన్న explain చేసినాడు. డ్రింక్స్ త్రాగుకుంటు అన్నిటి విషయమై తెలుసుకొని చాల సంతోషించినారు. your's is a great and continuous civilization అని పొగడినాడు ప్రెసిడెంట్ willson. కొన్ని తెలువని విషయాలను అడిగి తెలుసుకున్నారు. ఈయన భార్య కూడ ప్రమదను యెన్నో విషయాలు అంటె, నగలు, చీరెలు మొదలగు విషయాలనడిగి తెలుసుకొంది. your people look so gargeous in those beautiful sarees, you have a good figure ప్రమద అని విక్రంతో where did you catch such a beautiful girl, you have a good taste అని నవ్వింది. Thank you అని విక్రం కూడ నవ్వినాడు. మళ్లి విక్రం drink serve చేయబోగా enough విక్రం అని నింపనీయలేదు. Dr. willson. Then shall we eat now అన్నాడు విక్రం. yes I think so అన్నాడు willson. ప్రమద, విక్రం willson, carlie నలుగురు dining table పై కూర్చున్నారు. అనుపమ్ వీళ్ళు రాకముందే తిని బయట ఆడుకొనుటకు వెళ్లినాడు. Carlie అన్ని dishes విషయము అడుగుతు వడ్డించుకొంది. అన్నీ table మీద అమర్చిపెట్టింది ప్రమద. విక్రం తనకు తెలిసినకాడికి willson కు చెబుతున్నాడు. అన్ని చాల బాగున్నవని కడుపునిండ తిన్నారు. పిమ్మట living room లో వెళ్లి కూర్చున్నారు. కొంచెం సేపైనాక ప్రమద desserts ను serve చేసింది. ఇద్దరు దంపతులు చాల బాగున్నవని రెండవ సారి తెప్పించుకొని తిన్నారు. అందరూ తృప్తిగా భోంచేసినాక, సరే విక్రం thank you very much we will see you అని కారు దగ్గరకు వెళ్లి కారు start చేసి మళ్ళీ ఓసారి bye అని చేతులు లేపి వెళ్లిపోయినారు. ప్రమద, విక్రం వారు పోగానె మరి కొంచెం dessert తీసుకొని తింటూ కూర్చున్నారు. మిగిలినవన్నీ freezer లో పెట్టేటివి, Freezer లో; refregerator లో పెట్టేటివి అందులో పెట్టి తక్కిన empty dishes and plates dish washer లో వేసి start చేసింది ప్రమద. ఇద్దరూ కొంచెం light coffee కలుపుకొని కూర్చున్నారు love seat పైన. చూస్తుండగానే తొమ్మిది గంటలు కావస్తుంది. అనుపమ్ కూడ వచ్చినాడు.

అమెరికాలో ఏదో ఒకచోట sales ఉంటునే వుంటావి. ప్రమదకు సేల్స్

అంటె కొంచెం పిచ్చి. సేల్స్‌పైన యేవైన వస్తువులుంటే అవి అవసరమున్నా లేకున్నా కొని నింపేస్తుంది. అందువల్ల ప్రతి సంవత్సరము ఇంట్లో యెన్నియో బట్టలు మరి ఇతర సామానులు జమ అయిపోతవి. ప్రమదకు బంధువులు చాలా వున్నారు. ఇండియాకు పోయినప్పుడు చాలామంది వచ్చి కలసి time spend చేసి పోతారు. ఈమె వాళ్ళను నాకు introduce చేస్తుంటుంది. అప్పుడు హలో అంటాను. పిమ్మట మరచిపోతాను. మళ్లీ కలసినప్పుడు నమస్కారము చేసి మాటాడ ప్రయత్నిస్తాను. బాగున్నారా అంటూ తప్పించుకొని సరే అని వెడలిపోతాను. పిమ్మట సాయంకాలము ఒంటరిగానున్నప్పుడు యెవరని అడుగుతె పోయిననసారి చెప్పానుగద గుర్తుపట్టలేదా అంటుంది. లేదు ప్రమద sorry అంటాడు విక్రం. ఆ వచ్చిన వారికి యేదైన ఒకటి ఈ సేల్స్‌లో కొన్ని వస్తువులను ఇస్తుంటుంది. వారు వాటిని సంతోషంగ తీసుకుంటారు. ఒకరికి పనికిరానివి మరొకరికి పనికివస్తాయి (one persons junk in another person's precious thing) అంటారు. అందులో foreign నుంచి తెచ్చియిచ్చిన యే వస్తువైనా ఆనాడు ఒక గొప్ప భాగ్యంగ చూసేవారు. ప్రమద ప్రతిసారి రెండు మూడు పెట్టెలు నిండ యిటువంటి జంకును అంటే బట్టలు, వేరే తనకు పనికిరాని వస్తువులను సేల్‌లో వచ్చినపుడల్లా కొనిపెట్టి ఇండియా ప్రయాణములో తన వెంట తీసుకొని పోవుట అలవాటుగా మార్చుకుంది. విక్రం చూసి చూడనట్టే వుండేది. ఈసారి కూడ ఇండియాకు ప్రయాణం కట్టినారు విక్రం, ప్రమదలు అనుపంతో. విక్రంకు కూడా ఇండియా పోవాలంటె సరదా కాని అతనికి మాత్రం ఒక అగస్టు నెలలో తప్ప తీరికవుండదు. అనుపమ్‌కు జూన్, జూలై అగస్టు స్కూల్ వుండదు. అందువల్ల కొన్నేండ్లు ముగ్గురూ ఒక అగస్టులోనే ఇండియాలో వుండి సెప్టెంబర్ 15 వరకు మినియాపలిస్ చేరుకునేది. ఈ విధంగా రెండేళ్లకోసారి అగస్టు నెలలో ఇండియాలో వుండటము, సెప్టెంబర్ 15 వరకు మళ్లి రావటము జరుగుతుంది. రాను రాను విక్రం తన summer job ను విడచి మే నెలాఖరకే ఇండియా చేరుట మూడు నెలలు హాయిగా హైద్రాబాదులో గడపటం, పిమ్మట మినియాపిలసుకు రావటం జరిగింది. తదుపరిగా విక్రం U.S. లో వుండడం ఇండియాలో మూడు నెలలు హాలిడే గడపడం జరుగుతుంది. ఈ arrangement ప్రమదకు చాలా నచ్చింది. కాని అనుపమ్‌కు నచ్చుట లేదు. యెందుకంటె వారిప్పుడు senior in high school. మూడు నెలలు పని చేయుట మంచిది. ఇండియాకు పోకుండ అని నిర్ధారించాడు. మొదలు విక్రం ప్రమదలు రా బాబు యెందుకు పనిచేయాలి. నీకు అవసరమైన డబ్బు తీసుకో అని బుజ్జగించేవారు. కాని వాడు వినలేదు. అందుకే విక్రం ప్రమదలు కూడ వాణ్ణి విడచి పెట్టిపోవటము లేదు. యిప్పుడు ఇండియాకు వెళ్లక రెండు సంవత్సరాలు అనుపం కాలేజిలో నున్నాడు. వాని కారు వానికుంది. యిప్పుడు పూర్తిగా స్వతంత్రుడు. మినియాపిలస్ యూనివర్సిటీలో చదవడం లేదు. వానికి ఇష్టం లేదు తల్లి దండ్రుల వద్దవుండి చదవడం. బ్రౌన్ యూనివర్సిటీలో అడ్మిషన్ తీసుకున్నాడు. ఒక సంవత్సరం pre-medicine చేసి brown విడచినాడు. ఆ credits అన్నీ చికాగోకు మార్చుకున్నాడు. సరే వానిష్టము అన్నాడు విక్రం.

చికాగోలో మూడేండ్లు చదివి pre-medicine పట్టాన్ని పుచ్చుకున్నాడు. ఇప్పుడు medical college competitive exams కు ప్రిపేరు అవుతున్నాడు. చదువుపైన శ్రద్ధ బాగా వుంది. ప్రతివారం రాకున్న అప్పుడప్పుడు chicago నుండి వస్తాడు. విక్రం ఇంట్లో అనుపమ్ రూం అలాగే వుంది. వాని వస్తువులు కూడ వాని రూంలోనే వున్నాయి. వచ్చినప్పుడల్ల వానికవసరమైనవి తీసుకవెళతాడు. ప్రమద కొడుకున్న దినాలు చాల సంతోషంగ వానికి తీరు తీరు వంటలు చేసి పెడుతుంది. యేదో కొద్దిగా తింటాడు. కాని ఈ వంటలలో వానికి మోజు లేదు. అయినా ప్రమద చేసిపెడుతుంది. వాని కారు మంచి కారే. దానిపైననే వస్తాడు. దానిపైననే పోతాడు. రానప్పుడు week ends లో ఫోను చేసి చాలా సేపు మాట్లాడుతాడు. వాడు ఇంట్లో లేకున్న యిప్పుడు ఇంట్లో వున్నట్టే వుంది. ఒక్కొక్కసారి విక్రం ప్రతిరోజూ సాయంకాలం ఫోన్ చేస్తాడు. అయినా ఇది అనుపమ్‌కు ఇష్టం కాదు. కాని విక్రం తన తృప్తికని రోజూ ఒకసారైనా చేసి హలో చెప్పి పెట్టివేస్తాడు. అనుపమ్ బాగా medical entrance కు ప్రిపేర్ చేస్తున్నాడు. మెడికల్ కాలేజిలో ప్రవేశాన్ని సంపాదిస్తానని వానికి పూర్తిగా విశ్వాసముంది. విక్రంకు కూడా అంతే. ఇప్పుడు అనుపమ్ పెద్దవాడు కాని ప్రమదకు విక్రంకు ఇంకను పసివాడే. అనుపమ్‌కు ఈ విషయము అసలు ఇష్టము లేదు. పరీక్షలయినాయి ఫలితం అనుకూలంగానే వుంది. మెడికల్ కాలేజిలో అడ్మిషన్ దొరికింది. విక్రం, ప్రమద అమితానందాలతో అందరికి చెప్పుకున్నారు. అనుపమ్‌తో మేము నీ మెడికల్ అడ్మిషన్ success తో మన స్నేహితులందరికి ఒక విందు arrange చేస్తున్నాము next week end లో రా నాన్నా అని ఫోన్‌పై చెప్పినారు. It is waste dad what is a big deal to get admission in the medicine అన్నాడు. ప్రమద విక్రంలు లే ఇది మా ఇష్టము నీవు తప్పకుండ రావలెనన్నారు. సరే అని ఒప్పుకున్నాడు అనుపమ్. విక్రం ఇంట్లో ఇస్తే పెద్ద పని ప్రమదకు, అని holiday inn లో arrange చేసి అదరికి ఫోన్ చేసి ఆహ్వానించాడు. ఇందులో ఇండియన్స్ మరి అమెరికన్స్ వున్నారు. అందరూ తప్పకుండ వస్తాము congratulation అని అన్నారు.

ఆనాడు ఆదివారము అనుపమ్ ప్రమద, విక్రంలతోనే వున్నారు. ఇప్పుడు అతడు ఒక యువకుడు. చాలా అందగాడు. తండ్రిని పోలిన ముఖము. యెర్రని శరీరచ్ఛాయ. ప్రమద విక్రం వాన్ని చూసి చాల గర్విస్తారు. ఆనాడు సాయంకాలమే అనుపమ్ honour పై ఈ విందు ఏడు గంటలకు holiday inn లో వుంది. ఏడు గంటలకు అక్కడ వుండవలె. అందుకే విక్రం, అనుపమ్ gray, blue suits వేసివారు. ప్రమద blue పట్టుచీరను కట్టింది. ఇప్పుడు అనుపమే drive చేస్తున్నాడు. విక్రం అనుపమ్ పక్కపక్కన సీట్లో కూర్చున్నాడు. Dad put your belts please అన్నాడు, తల్లిని కూడ వెనుకనున్న safty belts ను పెట్టుకొమ్మన్నాడు. ఆమె సరే అన్నది కాని పెట్టుకోలేదు. car start అయి 6.45కు holiday inn కు చేరుకుంది. కారును parking lot లో పార్కు చేసి, ముగ్గురు reception hall కు చేరుకున్నారు. ఇంక యెవరూ రాలేదు. ముగ్గురూ వచ్చే guests ను ఆహ్వానించుటకు నించున్నారు. 6.55 కు ఒకరొకరు రావడం మొదలు పెట్టినారు. 7.20 కి అందరూ వచ్చి

కూర్చున్నారు. వేర్వేరు కుర్చీలపైన dinning tables పైన తెల్లటి ప్రింట్ చేసిన కాగితాలు పరచి అన్నీ వాటిపైన అమర్చినారు ఆ హోలిడే ఇన్ పనివారలు. అచ్చటి bar tender అందరికి అడిగిన డ్రింక్స్‌ను ఇస్తున్నాడు. అందరూ కౌంటర్ వద్దకు వెళ్లి తమకు కావలసిన డ్రింక్స్‌ను తీసుకొని అందరితో కలుసుకుంటూ, తామెవ్వరో introduction చేసుకుంటు drinks enjoy చేస్తున్నారు. గంటసేపటి వరకు డ్రింక్స్ త్రాగుతునే మాటాడుకుంటున్నారు. ఈ అమెరికాలో if you are a good conversationalist you can make lot of friends and succeed కాని విక్రం పాపం చాల reserved. ఎవరైన అడిగిన దానికి సమాధానం చెబుతాడు. తానైతాను చొచ్చుకొని introduce చేసుకోనడు. కాని ప్రమద, విక్రంకు పూర్తిగా opposite. అనుపమ్ కూడ విక్రం వలెనే. అందుకే విక్రం అప్పుడప్పుడు అనుపమ్‌తో నాన్నా నీవు నావలె కాక బాగా మందితో కలవాలె నాన్నా అంటాడు. How can I dad I am your son అంటాడు. ప్రమద మాత్రం చాల social. ఒకరిని కలసిన కొద్ది సేపట్లోనే వాళ్ళకు మంచి ఫ్రెండ్‌గా అయిపోతుంది. అది ఆమెలో పుట్టకతో వచ్చిన అలవాటు, స్వభావం. విక్రం ప్రమదవలె కావాలని యెంతో ప్రయత్నించినాడు కాని కాలేక పోయినాడు. అందరి డ్రింక్స్ పూర్తి అయినవి. విక్రం mike లో ladies and gentlemen the dinner is served you can come and enjoy your dinner అన్నాడు. అందరూ వచ్చి తమ తమ కుర్చీలలో కూర్చున్నారు. విక్రం head table పై ప్రమద అనుపమ్‌తో కూర్చున్నాడు. servers dinner serve చేస్తున్నారు. అందరూ సంతోషంగా మాటాడుకుంటూ తృప్తిగా భోంచేసినారు. భోంచేసేవరకు తొమ్మిది అయ్యింది. కొంతమంది తప్ప చాలమంది వెడలిపోయినారు. ఇద్దరు దంపతులు అనుపమ్ వారికి వీడ్కోలు తెలిపినారు. తొమ్మిదిన్నర వరకు అందరూ వెడలిపోయినారు. 10 గంటల వరకు విక్రం, ప్రమద, అనుపమ్ వుండి ఆ dinner bills అన్ని clear చేసి, తమ కారులో యెక్కి ఇంటికి పోయి, brush చేసుకొని తమ తమ గదులలో retire అయినారు.

తెల్లవారె చాలామంది ప్రమదకు ఫోన్ చేసి we enjoyed thank you అని మాటాడి please convey our hearty congratulation to anupam అని ప్రమదకు తెల్పినారు. కొందరు నా స్నేహితులు నన్ను పిల్చి యిదే సంగతి తెల్పినారు. కొందరు కార్డ్సు వేసినారు. ఇప్పుడు Anupam a budding doctor no longer a small boy. కాని విక్రం – ప్రమదలకు అనుపమ్ ఒక పిల్లవాడె. కాని వారు కూడ ఇక వానిపై నున్న దృక్పథాన్ని మార్చాలె. కొద్దిరోజులు తల్లిదండ్రులతో spend చేసి chicago కు వెళ్లిపోయినాడు. చికాగో యూనివర్సిటీ మెడికల్ కాలేజిలో మొదటి సంవత్సరంలో అడ్మిషన్ తీసుకొని ఫీసు కట్టి మెడికల్ కోర్సులో చేరినాడు. U.S.A. లో మెడికల్ సీటు దొరుకుట ఇండియాలో అయినంత కష్టం కాకపోవచ్చును. కాని కష్టమే. ఇంజనీరింగ్ కాలెజీలో easy admission యెవడు apply చేస్తే వానికిస్తారు. కాని చేరగానే లాభం లేదు. Hard work background లేంది పాస్ కాలేరు. కాని ఇండియాలో మెడికల్ కాలేజి సీమ్కుట ఇంజనీరింగ్ కాలేజిలో చేరుట కష్టము కాని అమెరికాలో ఇంజనీరింగ్ చేసిన యెంతో మంది

మెడికల్ కాలేజికి పోతారు. సామాన్యంగ entrance exam లో పాసైతే సీటు దొరుకుతుంది. కాని చాలా మంది యేదైన ఒక degree minimum credits biology, maths & science లో వుంటేనే ఈ పరీక్ష పాసవుతారు. మెడికల్ కాలేజి సామాన్యంగ ఏదో ఒక డిగ్రీ తీసుకున్న పిమ్మట చదువుతారు. అమెరికాలో నాలుగేండ్లు ఈ కాలేజీ కోర్సు. మన దేశంలోవలె గాక ఒక్కొక్క semestor లో కొన్ని కోర్సులు తీసుకొని పాస్ కావాలె. పిమ్మట IIIrd year నుండి full time Hospital లో patients ను చూస్తూ, courses చదవాలి. IVth year కాగానే ఉత్తీర్ణులైనవారికి M.D. degree యిస్తున్నారు. ఇదికాగానే కొన్ని పరీక్షలు పాస్ చేసి మెడిసిన్ ప్రారంభించవచ్చు. కాని యిప్పుడు M.D. కాగానే యెవరూ practice చేయరు. ఎందుకంటే యేదో ఒక speciality చేస్తారు. ఇందుకు minimum మూడేండ్ల నుండి ఆరుయేండ్ల వరకు ట్రైనింగ్ తీసుకుంటే ఆ speciality చేసినట్లు certificate ఇస్తున్నారు. అటుపిమ్మట ఇంక super speciality చేయాలంటే ఆ super speciality లో fellowship చేయాలె ఒకటి రెండు సంవత్సరాలు. అంటె అమెరికాలో ఒక specialist కావాలంటె high school లో 12 యేండ్లు, పిమ్మట కాలేజిలో నాలుగేండ్లు, పిమ్మట మెడికల్ కాలేజిలో నాలుగేండ్లు, పిమ్మట స్పెషాలిటి లో average నాలుగేండ్లు. ఈ విధంగా జీవితంలోని ఇరువైనాలుగేండ్లు చదువులో గడపాలే. ఇది గాక ఆర్థిక ఇబ్బందులు కూడ చాలా వుంటాయి. ఇక్కడ medicine లో సీటు దొరకగానే మనదేశంవలె ఖర్చు లేకుండ చదువుటకు వీలుకాదు. ఇక్కడ ఫీసు చాల యెక్కువగా వుంటుంది. అది బీదలకు అలవిగాని విషయము. అయినా చదవాలనుకున్నవారికి అప్పులు మిత్తి లేకుండా స్కాలర్‌షిప్‌లు చాలా దొరుకుతాయి. అప్పు చేసి చదివినవారు వారు ప్రాక్టీసు చేస్తున్న మొదటి సంవత్సరం నుండి వాటిని కడుతూనే వుంటారు. అందుకే యిక్కడ ఈ limitations వల్ల చాలమంది విద్యార్థులు medicine చేయరు. ఎక్కువమంది విద్యార్థులు యేదో పట్టం పుచ్చుకొని యేదో కంపెనీలో పని చేస్తారు. ఆ కంపెనీలోనే కష్టపడి పనిచేసి పైకిపోతారు. అనుపమ్‌కు అటువంటి ఇబ్బందులు ఏమి లేవు. విక్రం ప్రమదలు వానికయ్యే ఖర్చులన్ని భరిస్తూనే వుంటారు. అనుపమ్ ఇచ్చటి విద్యార్థుల వలెనే అప్పు తీసుకొని చదువుతానంటాడు. కాని విక్రం ప్రమదలు వద్దంటే వద్దని నిరాకరించారు. ఇష్టం లేకున్న అనుపమ్ ఒప్పుకొనక తప్పలేదు. ఇప్పుడు మొదటి సంవత్సరంలో చదువుతున్నాడు. రాత్రింబగళ్లు చదవవలసి వుంటుంది. week end లో ఏదో lab లో వలదన్నా కొన్ని గంటలు పనిచేస్తాడు. అందువల్ల యిప్పుడు మిన్నాపిలిస్‌కు చాల తక్కువగా వస్తాడు. విక్రం ప్రమదలు ఏమి చేయలేరు. ఇది సహజమే. ప్రమదతో మనము వృద్ధులమై పోతున్నాము ప్రమద అని అప్పుడప్పుడు హాస్యాస్పదంగా అంటువుంటాడు. కాని అందులో నిజం కూడ వుంది. ఇప్పుడు అనుపమ్‌కు ఇరువైమూడు యేళ్ళు. విక్రం ప్రమద నెత్తులలో తెల్ల వెంట్రుకలు తొంగిచూస్తున్నాయి. విక్రం మాత్రం రంగు వేయలేదు. ప్రమద మాత్రం రంగు వేస్తుంది. తన వెంట్రుకలు, whether white hair or black hair you look the same to me ప్రమద I love you dear అని ముద్దిడుకుంటాడు విక్రం. I am

lucky విక్రం I love you too అని మళ్లీ ముద్దిడుతుంది విక్రంకు. ఇప్పుడు వీరిద్దరే. అనుపమ్ యెప్పుడో ఒకప్పుడు వస్తాడు ఆనాడు పర్వదినం ఇద్దరికి. అనుపమ్ యేకైక కుమారుడు. ఈ జన్మకంత భగవంతుడు వానికి నిండానూరేండ్ల ఆయువు ప్రసాదించవలె అని ఆదేవునికి నమస్కారించుకొంటారు. అనుపమ్‌కు డబ్బు కొదవ ఈ దేశంలో యెప్పుడూ లేదు. ఇకముందు కూడ భగవంతుని అనుగ్రహముంటే ఈ జీవితంలో వుండకూడదు. నేను ఆ భగవంతునికి చాల చాల కృతజ్ఞున్ని అని నమస్కారిస్తాడు. ప్రమద కూడ అతనితో చేతులు జోడించి నమస్కారిస్తది. ఈనాటికి కూడ తండ్రిపై అమిత వాత్సల్యము. రఘునాధరాయులు శ్రీలక్ష్మమ్మ ఇప్పుడు వృద్ధులు. రఘునాధరాయులు రోజూ సాయంకాలం క్లబ్‌కు వెడతాడు. శ్రీలక్ష్మమ్మ యింటిలో పని చేయిస్తుంది పనిమనుషులతో. సరిత ఆమె భర్త ఇప్పుడు states లో వున్నారు. సుమన్ లా పూర్తి చేసి High Court లో practice చేస్తున్నాడు. తండ్రిగారి వలె High Court లో న్యాయమూర్తి కావాలని అతని కోరిక. భార్యపేరు సుజన. B.A. చదివిన పిమ్మట ఈమె తల్లిదండ్రులు పెండ్లి చేసినారు. సుమన్‌తో తండ్రిగారి ఇంట్లోనే వుంటారు. తల్లిదండ్రికి సేవ చేస్తు, సుమిత్ ఇప్పుడు secretariat లో ఒక additional secretary గా పనిచేస్తున్నాడు. ప్రమద ఉత్తరాలతో మరి అప్పుడప్పుడు టెలిఫోన్‌తో వీళ్లతో సంబంధాలు పెట్టుకుంటుంది. విక్రం ఈ దేశంలోనె స్థిరపడిపోయినా ఇంకా కొన్ని సంవత్సరాల పిమ్మట అనుపమ్ ఈ దేశంలో స్థిరపడగానే స్వదేశంలో retire కావాలనివుంది. అమెరికాలో యూనివర్సిటీ ప్రొఫెసర్‌కు Supreme Court Justice కు retirement age అనేదే లేదు. వారు యెంతకాలమైన పనిచేయవచ్చు. The only requirement is their performance should be good. అలా చేస్తే 80 యేండ్లు, 90 యేండ్లవరకైన పనిచేయవచ్చు. కాని 65 యేండ్లవరకు పనిచేస్తే full pension దొరుకుతుంది. కాని 50 యేండ్ల పిమ్మట minimum pension తో retire కావచ్చు. విక్రంకు ఈ రూల్స్ చాల నచ్చినవి. ఒకవేళ తను తలచుకుంటె కొన్ని యేండ్లలోనే retire కావచ్చు. అప్పుడు ఇండియాకు వెళ్లి అక్కడే జీవితం గడపవచ్చు అనుకుంటాడు.

కాలం గడచిపోతుంది. కాలానికి అది అంతులేదు. యెన్నేండ్లనుండి లేదా ఎన్ని యుగాల నుండి ఈ కాలం గడచిపోతుంది ఎవరికీ తెలియదు. ఎంతకాలం ఈ సూర్యుడు, చంద్రుడు నడచి పోతుంటారో యెవరికీ తెలియదు. ఇది అంతా మానవుల వూహాకందని సమస్యలు. కాని, ప్రమద విక్రం జీవితాలు ఈ అంతులేని కాలంలో పోల్చి చూస్తే ఒక క్షణ భంగురమైనవి కూడ కావు. అయినా ఇద్దరూ ఈ లోకంలో జనించి తమ జీవిత యాత్రను ఆనందమయంగ సాగిస్తూనే వున్నారు. వృద్ధాప్యము వీరిని కనిపెట్టి చూస్తూనే వుంది. అయినా ప్రమద విక్రం ఇంక వృద్ధులమని అనుకోవడము లేదు. అది అమెరికాలో వాస్తవమైనది. ఇండియాలో నలుభై, యాభై సంవత్సరాలకే ముసలి వాళ్ళమనుకుంటారు. కాని అమెరికాలో ముసలి వాళ్ళమని యే 70, 80 యేళ్ళ పిమ్మటో అనుకుంటారు. వారి శరీర బలాలు కూడ అలాగే వుంటాయి ఇండియాలో 55 యేళ్ళు రాగానే retirement, కొన్ని సంవత్సరాల

పిమ్మట మృత్యువు కాని, అమెరికాలో 65 యేండ్ల పిమ్మటనే social security, full pension ఇస్తారు. ఇప్పుడు అది కూడా పెంచాలన్న ఆలోచనలో వున్నారు. రాగా రాగా 70 యేండ్ల పిమ్మటనే పెన్షన్ అని నిర్ధారిస్తారేమో. ఎందుకంటే ఇచ్చట 65 యేండ్లున్న మనుషులు యువకులుగా కనిపిస్తారు. భారతీయులు కాబట్టి విక్రం ప్రమదలు 50 యేండ్లకే వృద్ధాప్యము అని మాటాడుకుంటారు. కాని విక్రం దృఢకాయుడు. రెగ్యులర్ excercise చేస్తాడు. సాయంకాలం walk చేస్తాడు. కాని ప్రమద యే excercise చేయదు. వంట స్నేహితులు ఆమెకు కాలక్షేపము. అందుకే ఆమెకు కొన్ని చిన్న చిన్న జబ్బులు అప్పుడప్పుడు వస్తుంటాయి. కాని అవి మందులతో తగ్గిపోతాయి. ప్రమదకు మందులంటే భయం లేదు. చావంటె కూడ అంతే. యెంతకాలం బ్రతికినా చావుతప్పదు గదా. సరదాగా బ్రతుకు సాగుతుంటే పోవుట మంచిది. కాని నా అనుపమ్ భార్య బిడ్డలను చూచి చావాలని వుంది నాకు అని ప్రమద అప్పుడప్పుడు విక్రంతో అనేది. అట్లాగే చస్తావు ప్రమద కాని, నీవు లేనిది నేనేమి చేయగలను ఈ ప్రపంచంలో నేనొక్కన్ని. నాకు చాలా కాలం బ్రతకాలనివుంది. ఆ భగవదేచ్ఛ కాని చాల దీర్ఘకాలం బ్రతుకుటకే ప్రయత్నిస్తాను. నీవు కూడా నాతో ఈ జీవితం యెంతకాలమైతే అంతకాలం పంచుకో. నీవులేంది ఈ జీవితం వృథా ప్రమద అందుకే రోజూ ఒక గంట నువ్వు నీ ఆరోగ్యం కోసం యేదైన exercise చేయి ప్రమద అని బుజ్జగించి చెప్పి చూసేది. కాని లాభం లేకపోయేది. అనుపమ్ కూడ ఒక డాక్టరుగా తల్లికి యెన్నియో విధాల చెప్పినాడు. విక్రం స్నేహితులైన కొందరు డాక్టర్లు కూడ ఒక మెనో సిద్ధం చేసి ఇచ్చినారు. కాని ఆమె ఎవరు చెప్పినా సరే అనేది కాని, మళ్ళీ ఆమెకు తోచింది చేస్తుంది. అందువల్ల ఆమె ఆరోగ్యంతో కొన్ని సమస్యలు మొలకలెత్తినవి. విక్రంకు ఇది ఒక సమస్యగా సిద్ధమయింది. కాని యేమి చేయలేదు. మందులు వేళకు ఇస్తూ, తన నుంచి అయ్యిందంత చేస్తున్నాడు. అంతకు మించి విక్రం చేసేది యేముంది? ప్రమద కూడ తన ప్రకృతిని మార్చుకొంటుంది. కాని ఆమె ఒకనాడు చేయలేని పనిని ఇద్దరు అప్పుడప్పుడు ఈ సమస్యలను పరిష్కరిస్తారు. కాని తర్కంతో సమస్యలు పూర్తిగా మారిపోవు.

అమెరికాలో భారతీయులు ఇప్పుడు కొన్ని లక్షల సంఖ్యలో నున్నారు. విక్రం ఈ దేశం వచ్చినప్పుడు కొన్ని వేలమందే వుండేది. 1966 నుండి ఇచ్చట చట్టాన్ని మార్చినారు. చాలమంది భారతీయులు IIIrd preference తో immigration తీసుకున్నారు. వాళ్లలో చాలామంది పౌరసత్వాన్ని తీసుకొని వాళ్ల మొత్తం కుటుంబాలను పిలిపించుకున్నారు. ఈ విధంగా ప్రతివాడు పౌరసత్వాన్ని (Citizenship) తీసుకొని వాళ్ల తోబుట్టువులను వారి భార్య పిల్లలను భర్తలను sponser చేసినారు. ఈ విధంగా 1960లో కొన్ని వేలమంది భారతీయులు 1980లో కొన్ని లక్షలుగా మారినారు. అమెరికా the land of opportunity అన్నది వాస్తవము. legal గా ఈ దేశం వచ్చిన భారతీయుడు యేదైన పని చేసి జీవితం గడపవచ్చు. కష్టపడి పని చేసినవానికి ఈ దేశంలో బ్రతుకు సాగించుట అంత కష్టమైన పనికాదు. అందువలన ప్రతివాడు ఈనాడు యిచ్చటికి రావాలని తాపత్రయపడుతాడు.

కృష్ణమోహన్ మాత్రము డాక్టరుగా రాలేదు. వానికి అమెరికా అంటే అంత కుతూహలం లేకుండెను. MBBS పాసయ్యి ప్రభుత్వ డాక్టరుగా పని చేస్తున్నాడు. యెన్నిసార్లు యెంత చెప్పిన నవ్వి వూరకునేది. ప్రమద విక్రంతో ఒకనాడు అంతా విని చూడండి యెవరికి యేది ఇష్టమో అది చేస్తారు. నీకు అమెరికా వెళ్లాలని ఉండె వచ్చినారు. మంచిగా settle అయినారు. కృష్ణకు ఇష్టము లేనట్టుంది. యెందుకు బలాత్కారిస్తారు అంది. అనాటినుండి విక్రం కృష్ణమోహన్‌నుని బలాత్కారించగూడదని నిశ్చయించుకున్నాడు. క్రిష్ణమోహన్ ఇప్పుడు సుఖంగ దేశంలోనే వున్నాడు. ప్రభుత్వ వుద్యోగంతో పాటు private practice కూడ నడిపిస్తాడు. M.S. కూడ పూర్తి చేసి దేశంలో స్థిరపడ్డాడు. ఇంక కొన్నేండ్లలో retire అవుతాడు. కృష్ణమోహన్ భార్య ఇద్దరి పిల్లలతో జీవిత యాత్ర సాగిస్తాడు. ambassoder car వుంది. ఉద్యోగంలో నున్నందున ఓ జీప్ వుంది. సాయంకాలం యెవరితోనైన కలయుటకు తన కారులో పోతాడు, లేనపుడు కారు గారాజ్‌లో వుంటుంది. government jeep & driver వుంటాడు. ఉద్యోగ ధర్మానికి ఇతడు ఇప్పుడు civil surgeon rank లో నున్నాడు. యెక్కువ subordinate offices inspection లోనె కాలం గడుస్తుంది. వీరు చదివిన మెడికల్ knowledge మరచి పోతారనుకుంట. యెందుకంటే వీళ్లు సాధారణంగ office పనిలోనే యెక్కువ సమయాన్ని గడుపుతారు. మేము హైద్రాబాదు visit చేసినప్పుడు భార్య పిల్లలతో వచ్చి కలసిపోతాడు. చిన్నప్పటి కృష్ణమోహన్‌కు ఇప్పటి కృష్ణమోహన్‌కు భూమికి అకాశానికి వున్నంత వ్యత్యాసముంది. కాని విక్రంతో చిన్నప్పటివలెనే భయభక్తులతో మెలుగుతాడు. విక్రం Americanized కాబట్టి కృష్ణమోహన్‌తో equal గా వుందామనుకుంటాడు. కాని కృష్ణమోహన్ మాత్రము అవే భక్తి, భయం మర్యాదలతో వుంటాడు. శ్రీరామునికి లక్ష్మణుని వలె.

కృష్ణమోహన్ తన జీవితం భారతదేశములో ఆనందంగ గడుపుతున్నాడు. అతనికి యే కొదవలేదు. తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తిస్తూ తన కుటుంబంతో కాలయాపన చేస్తూ దేశానికి సేవ చేస్తున్నాడు. కాని విక్రం మాత్రం I.A.S. విడచి అమెరికాలో స్థిరపడ్డాడు. ఇతడు కూడ తమ్ముడు కృష్ణమోహన్‌వలె సంతోషంగానున్నాడు అమెరికాలో. ఒక తల్లితండ్రికి జన్మించిన ఇద్దరు కూమారులు మనస్తత్వాలు యెంత వేరుగా నున్నావో గ్రహించవచ్చు.

చూస్తుండగా కాలం కదలిపోతుంది. అనుపమ్ యిప్పుడు Dr. Anumpam Rao గా స్థిరపడుతున్నాడు. అమెరికాలో M.D. పూర్తి అయ్యింది. ఇక residence లో చేరవలె. యే speciality లో చేరాలనేది ఒక సమస్య. తల్లిదండ్రితో ఈ విషయమై సంప్రదించాడు. తల్లి ప్రమద యేమి చెప్పలేదు. నాకు తెలియదు నాయన నీ dady నీవు మరి వేరే స్నేహితులతో సంప్రదించమంది. సరేనని అనుపమ్ తండ్రితో సంప్రదించి ఆయన medical friends తో కలసినాడు. అందరూ Dermitalogy లో residency చేయమన్నారు. కాని అనుపమ్‌కు నచ్చలేదు. ఆ field కాబట్టి బాగా ఆలోచించి cardiology లో residency accept చేసినాడు. మూడు యేళ్లు

ఈ రెసిడెన్సి. మూడేళ్లు రాత్రింబగళ్లు కష్టంచాక Chicago North Western University Medical College లో cardiology residency program లో చేరినాడు. ఇప్పుడు యూనివర్సిటీ మెడికల్ కాలేజి సమీపంలో రెసిడెన్సి చేస్తున్నాడు. ప్రమద రోగాలు యెక్కువైనాయి. ఒకనాడు విక్రం, ప్రమదలు తన స్నేహితులను కలయుటకు సాయంకాలం బయలుదేరినారు. వారితో మాటాడి బయటకు వస్తుంటే ప్రమద మెట్లమీద పడిపోయింది. విక్రం ఆమెను లేపుతూనే వున్నాడు. ఇంతలో ఆ ఇంటివారు కూడ వచ్చి ఏమయ్యింది విక్రం అన్నారు. యేమి లేదు ప్రమద కాలుజారి పడిపోయింది అన్నాడు. ప్రమదకు మోకాలు దెబ్బ బాగానె తగిలింది. వెంటనే విక్రం hospital emergency room కు తీసుకవెళ్లినారు. తగిలిన దెబ్బలకు చికిత్స చేసి, మరునాడు detailed examination కు రమ్మన్నారు. మరునాడు విక్రం classes కాగానే ఆ hospital లోని neuro surgon తో మాట్లాడి నాలుగు గంటలకు ప్రమదతో ఆ neuro surgon తో కలయుటకు వెళ్లినాడు. ఆ surgen అన్ని చెక్ చేసి the problem is deeper than I thought. ఈమె గొంతు ప్రక్కలో నున్న రెండు రక్తనాళాలు కుడి యెడమవి మూసుకున్నావి. వకటి నూటికి 80 శాతము, రెండవది నూటికి 60 శాతము కూడ పోయినవి. అందుకే రక్తం సరిగా నెత్తిలోనికి ప్రవహించ లేదు. కాబట్టి ఒక క్షణంలో పడిపోయింది. దీనికి సరియైన చికిత్స శస్త్ర చికిత్స అన్నాడు ఆ డాక్టరు. విక్రం personal friend అయిన వేరే డాక్టర్లతో సంప్రదిస్తే శస్త్ర చికిత్సతో నయమైతే చేయుట మంచిది అన్నారు. రిస్కు అంతగా వుండదని ఆ neuro surgeon మరి వేరే డాక్టర్లు అన్నారు. కాని రిస్కు కొంచెమేనన్నారు. అందరూ తెలిసిన డాక్టర్లు యిదే సలహా నిచ్చినారు. అందువల్ల ప్రమద మంచిగా తయారై నుదుట కుంకుమ బొట్టు ధరించి చిన్న సూట్ కేస్‌లో బట్టలు సర్దుకొని కారులో కూర్చుంది. ఆ మరునాడు operation 7 గంటలకు మెళుకువ వస్తుంది. అప్పుడు రండి ఆమెను చూచుటకు అన్నాడు ఆ neuro surgeon. అలాగేనని అపరేషన్ అయ్యేనాడు హాస్పిటల్‌లో కలసినా దిగులును వెలబుచ్చి దేవుడు మనలను రక్షిస్తాడు ప్రమద అన్నాను. ఆమెకు తెలుసు యిది serious operation అని. అందులో మొదటి major operation అని కూడ తెలుసు. అందువల్ల తండ్రికి ఒక ఉత్తరము వ్రాసింది. ఆ వుత్తరములో నేను బ్రతికి బయటపడితే మంచిది ఒక వేళ బ్రతుకకపోతే యేమి చేయాలె అని క్షమాపణ కోరుతు తండ్రి పాదాలకు నమస్కరించి వీడ్కోలు తీసుకున్నట్టు వ్రాసింది. ఆ ఉత్తరము చూడగానే, నా దుఃఖాన్ని అణచుకొని ధైర్యంగా వుండు, మనకు భగవంతుడు మేలు చేస్తాడు అని తొమ్మిది గంటల వరకు ధైర్యాన్నిస్తూ యింటికి వచ్చి దుఃఖంతో నిద్రాదేవి వడిలో మైమరచినాను.

Operation పిమ్మట ఫోన్ చేసి she is ok but under sedatin by two O' clock she should be able to talk. అందుకే రెండు గంటల పిమ్మట వస్తే నాకు కూడ చూచుటకు వీలుంటుంది అని ఫోన్‌లో చెప్పినాడు. విక్రం రెండు గంటలకు క్లాస్‌కాగానే చక్కగ hospital కు drive చేసి కారు parking lot లో విడచి మూడవ అంతస్తులో నున్న ప్రమదను చూచుటకు వెళ్లినాడు.

వీధిలో ప్రవేశించగానే ప్రమద స్నేహితులలో ఒకామె వచ్చింది. Vikram ప్రమదకు left hand, left leg లో చలనము లేనందున మళ్లీ operation theatre కు తీసుకవెళ్లినారని తెల్పగానే విక్రంకు ప్రపంచమంతా తలక్రిందులైనట్లైంది. యేటూ తోచలేదు. పైకెగసి వస్తున్న దుఃఖాన్ని ఆపుకొని అన్నీ విన్నాడు. ఇంతలో ప్రమదను ఆ రూంలోకి తెచ్చినారు. ఆమె కను చూపుకూడ బాగా లేదట. నా ధ్వనిని వింటుంది కాని నన్ను చూడటము లేదు. ఎంత ప్రయత్నించిన కనుచూపు రావటము లేదు. విక్రంకు చాలా కోపం వచ్చింది ఆ surgeon పైన. కాని ఆ కోపాన్ని మ్రింగి ఫోను కలిపినాడు ఆ surgeon కు. యెందుకు ఇట్లా జరిగింది. అంటే చెప్పడు లేదు. I have done more than dozen of these procedures. This is the first case that went wrong అని అంటాడు. పిమ్మట తెలుసుకోగ యిది మొదటి తప్పు కాదు యిటువంటి వెన్నో తప్పులు ఈయన చేతులమీదుగా జరిగినవని తెలిసింది. పిమ్మట మరియేమి చేయనున్నావు అంటే ఫిజికల్ తెరపితో మళ్లీ ఆ కాలు, చేయి రాగలదు. రేపటి నుండి ఆ ప్రయత్నాలు జరుపుతానని nurse లకు యేమి చెయ్యాలని instructions వ్రాసినారు. physical therapy తో 20 రోజులకు కాలుతో నడువగలింది కాని, left hand తో యేమి చేయలేదు. యెందుకంటే వేళ్లు పని చేయడము లేదు. మెల్లమెల్లగా ఒక cane పట్టుకొని నడుపిస్తున్నారు. physical therapy staff మరి nurses పదిహేను రోజులలో బాగానే cane సహాయముతో నడుస్తుంది. అమ్మ దేవుడ బ్రతికినాను అని సరిగ్గా ముప్పై అయిదురోజుల పిమ్మట ఇంటికి తీసుకొచ్చినాను. ఇంటికి రాగానే ముఖములో ఆనంద రేఖలు గోచరిస్తున్నవి. right hand & right leg normal గానే నున్నవి. left hand వేళ్లు తప్ప మొత్తము చేయి కదలుతుంది. కాబట్టి ఇంటికి వచ్చిన నాలుగవ నాటినుండి వంట మొదలు పెట్టింది. ఒక right hand తోనే ఈ విధంగా మృత్యు ముఖము నుండి తప్పించుకొని కుంటిగా నడుస్తుంది. అన్ని పనులు చేసుకుంటుంది. కాని చీర ఇంక కట్టలేదు. యెందుకంటే left hand fingers పని చేయవు. ప్రమద ఆమె జీవితాన్నంత ఒకసారి పరీక్షించి యెంత అందగత్తె. యిప్పుడు కుంటిదానిగా బ్రతకవలసి వస్తుందనే మనోవేదన ఆమెలో ప్రవేశించింది. అంత సరదాగా, ఆనందగా జీవితాన్ని సాగించిన ప్రమద, యిప్పుడు ఓ depressed wreak. యెంత చెప్పినా సరే అంటుంది కాని మనసులో నున్న వ్యథను మాత్రము త్యజించలేదు. ఇక లాభం లేదని విక్రం ఆమెను తల్లివారింటికి (ఇండియా) పంపించినాడు. అక్కడ అందరిలో నున్నప్పుడు అన్ని మరచేది కాని ఒంటరిగా నున్నప్పుడు మాత్రం depressing లో మునిగిపోయేది. నిరాశ నిస్పృహలో కొట్టుకొని పోయేది. విక్రం ప్రతి సంవత్సరము మూడునుండి నాలుగు నెలలు ఆమెతో గడుపుటకు ఇండియా వెళ్లి మళ్ళీ సెప్టెంబర్‌లో class start కాగానే ప్రమదతో మినియాపిలస్ వచ్చేది. ప్రమద వంటచేసి వడ్డించేది. tub లో కుర్చి వేస్తే కూర్చొని మంచిగా shower విప్పి స్నానం చేసేది. విక్రం సహాయంతో tub నుండి బయటకు వచ్చి బట్టలు అంటె long gowns వేసేది యింట్లో. ఈ విధంగా డిసెంబర్ వరకు ఇద్దరం కలసి మినియాపిలస్‌లోనే వుండేది. డిసెంబర్‌లో చలి యెక్కువ కాబట్టి ఇండియాకు పంపి ఆమె తండ్రికి ఫోన్

చేసేది. ఇలాగే రెండు సంవత్సరాలు గడచినవి. వేసవిలో నేను వెళ్లినప్పుడు మన ఇంట్లో అంటే మేము కట్టుకున్న ఇంటికి మారుదాము అని రంగులు వేయించి, ఆ ఇంటికి కావలసిన furniture and window and door curtains కొంది. ఒక వంట మనిషిని, ఒక డ్రైవర్ మరి కారుతో తన ఇంట్లో తాను, నౌకర్లతో వుండటం మొదలు పెట్టింది. ఈ జీవితం ఆమెకు నచ్చింది. తండ్రి తోబుట్టువులు రోజూ కొన్ని గంటలు ఆమెతో గడిపేవారు. అందరికీ విందు చేసేది. యెక్కువ ఆమె కాలం డిన్నర్‌తో మరి స్నేహితులను కలయడముతోనే సరిపోయేది. విక్రం మేలో పోగానే ఇద్దరు 3–4 నెలలు కలసి గడిపేది. పిమ్మట సెప్టెంబర్‌లో ఇద్దరు కలసి అమెరికా వచ్చేది. మళ్ళీ డిసెంబర్‌లో ప్రమద హైదాబాదు fly చేసింది. కాని విక్రం నాలుగు నెలలు ఒంటరిగా అలాగే ప్రమద నాలుగు నెలలు వంటరిగా వేరు వేరు జీవితాలు గడపటం జరిగింది. ఇలా 6 సంవత్సరాలు జీవితాలు గడచినవి. ఒకనాడు విక్రం ఆఫీస్ పనిలో నిమగ్నుడై వుండగ ఒక American professor నా ఆఫీస్‌కు వచ్చి నీ భార్య చనిపోయింది ఇప్పుడే నీకుమారుడు మాకు ఫోన్ చేసి చెప్పమన్నాడు అని చెప్పి వెడలిపోయినాడు. వంటరిగా విక్రం చాలా దుఃఖించినాడు. వెంటనే Air India కు ఫోన్ చేసి రేపు నేను వెళ్లవలె ఒక సీటు రిజర్వు చేయమన్నాడు. సరే నన్నారు Air India Newyork వాళ్లు. ప్రొద్దున దుఃఖంతో నిండిన కళ్లతో Dept. head వద్దకు వెళ్లి నేను వెడుతున్నాను అని చెప్పగానే సరే don't worry about anything take care of yourself this unexpected thing happened అని లేచి కరచాలనం చేసి సరే వెళ్లిరండి అని సెలవిచ్చినారు 45 రోజుల కోసం. విక్రం దుఃఖసాగరములో మునిగి వున్నా బట్టలు సర్దుకున్నాడు. డబ్బు తీసుకున్నాడు బ్యాంకు నుండి. తన పెట్టెతో Airport చేరుకున్నాడు. దుఃఖంతో కండ్లు యెర్రబడినవి. మొఖం అంత ఉబ్బింది. ఆ దుఃఖంతోనే plane లో కూర్చున్నాడు. Plane మరునాడు బొంబాయిలో దింపింది. అచ్చట నుండి మరునాడు ఉదయం హైదాబాదుకు వెళ్లే ప్లేన్‌లో యెక్కి 9 గంటలకు హైదాబాదు చేరుకున్నాడు. ప్రమద తల్లిదండ్రి, బంధుమిత్రులందరు Airport కు వచ్చినారు. అందరూ దుఃఖంలో మునిగియున్నారు. నన్ను సరాసరి మాయింటికి తీసుకవెళ్లినారు. ప్రమద శవం hospital cold storage నుండి ఇంటికి తీసుకొని వచ్చారు. ఆమెను పాడెలో పండబెట్టి మా ఇంటి తోటలో ఉంచినారు. నేను చాలాసేపు ప్రమద శవం ప్రక్కనే కూర్చొని యేడ్చినాను. ఇక శవాన్ని తీయవలె అని అందరు బంధు మిత్రులు అన్నారు. సుమిత్ ఇప్పుడు హైదాబాదులో నున్నందున అన్నీ నిర్ణయించి cremetorium కు శవాన్ని తీసుకవెళ్లాలె అన్నీ హిందూ సాంప్రదాయం ప్రకారం నా చేతికి ఒకటి యిచ్చినారు. కొంత దూరం ఆమె శవం ముందు నడచిన పిమ్మట నన్ను అనుపమ్‌ను తన కారులో కూర్చొబెట్టుకున్నాడు. ప్రమద శవం ఒక పెద్ద వ్యాన్‌లో వుంచినారు. ఆ శవం వున్న కారు ముందర వెనుక సుమిత్ కారు పిమ్మట బంధు మిత్రుల కార్లతో సికింద్రాబాదు cremetorium వెళ్లినారు. మళ్లి అచ్చట శవాన్ని దింపిన పిమ్మట హిందూ సంప్రదాయ ప్రకారం కొన్ని జరిగిన పిమ్మట ఆనాడు ప్రమద భౌతిక దేహాన్ని electric cremetorium లోకి వేసినారు. కొన్ని క్షణాలలో ప్రదమ దేహం

బూడిదగా మారింది. పిమ్మట యెవరి యిండ్లకు వాళ్ళు వెళ్లిపోయినారు. సుమిత్, అనుపమ్ విక్రంతో విక్రం ఇంటికి వచ్చినారు. మాతో చాలామంది బంధువులు ఇంట్లో చాలా సేపు కూర్చున్నారు. సుమిత్ మాత్రం విక్రం మరి అనుపమ్‌తో రెండు రోజులు గడపినాడు. రఘునాధరాయలు శ్రీలక్ష్మమ్మ రోజు ఉదయం వచ్చి సాయంత్రం వరకు వుండి విక్రం దుఃఖాన్ని పంచుకునేది. అనుపమ్ మాత్రం గట్టి పిల్లవాడు. వాడు మాత్రం యేడువ లేదు. విక్రంను యేడ్చి యేమి లాభము డాడి. అమ్మ ఇక రాదు. మనము భవిష్యత్తుపై కేంద్రీకరించాలి. How about marrying again అన్నాడు. అంత దుఃఖంలో నున్న విక్రంకు నవ్వు వచ్చింది కాని అపుకున్నాడు. అనుపమ్‌పై చాల సేపు చూస్తు కూర్చున్నాడు. వీడికి ఇంక అమెరికన్ అలవాట్లె అనుకున్నాడు. చూస్తుంటే 14వ రోజు వచ్చింది. ఇంటి తోటలో శామియాన వేసి యేవేవో చేసి నన్ను అలి లేని భర్తగా చేసినారు. పిమ్మట భోంచేసి అందరు వెడలిపోయినారు. కొన్ని రోజుల వరకు ప్రమద తల్లితండ్రి, కావలసిన వారు వచ్చి వెళ్లేది. రాను రాను వాళ్ల రాక కూడ తగ్గింది. అనుపమ్ dady నేను next week వెళ్లిపోతాను అన్నాడు. సరే నాన్న అన్నాడు విక్రం. అనుకున్న ప్రకారం అనుపమ్ వెళ్లిపోయినాడు అమెరికాకు. ఇప్పుడు ఆ పెద్ద ఇంట్లో విక్రం మరి నౌకర్లు తప్ప యెవరూ లేరు. కృష్ణమోహన్ మాత్రము అప్పుడప్పుడు వస్తూ వుండేది తన familiy తో. వాడు వున్నంత సేపు వానితో మాట్లాడుతు అన్ని మరచేది. చూస్తుండగానే 45రోజులు గడచిపోయినవి. ఇక మినియోపిలస్ వెళ్లుటకు బట్టలు సర్దుకున్నాడు విక్రం. కొద్దిరోజులలోనే మినియాపిలస్‌కు చేరుకున్నాడు. ఇప్పుడు ఆ ఇంట్లో విక్రం వక్కడే. రాత్రంత ప్రమదను జ్ఞాపకం చేసుకొని దుఃఖించేది. రెండేళ్ళు ప్రమద లేని జీవితం చాల బాధగా గడిపి పిమ్మట early retirement తీసుకొని హైద్రాబాదు వచ్చినాడు. పిమ్మట అమెరికా వెళ్లి అనుపమ్‌తో నున్నాడు. మినియాపిలస్‌కు అనాటి నుండి పోలేదు. ఇల్లు అమ్మమని realter కు వప్పగించినాడు. వారు కొంత నష్టానికి ఇల్లు చౌకగా అమ్మి, mortgage taxes అవన్నీ పోగా కొన్ని వేల డాలర్లు అనుపమ్ అడ్రస్ మీద పంపినారు. విక్రం ఇప్పుడు ఒంటరి మనిషి, వయసు 58 సంవత్సరాలు. ఆరునెలలు హైద్రాబాదులో మరి ఆరునెలలు అనుపమ్‌తో గడుపుతు నిస్సారమైన ఈ జీవిత నౌకపై ప్రయాణిస్తున్నాడు. యెంత కాలం ఈ నిస్సారమైన జీవితంతో వుండాలో భగవంతుడనేవాడు వుంటే వానికే తెలియాలి, యెవరికి తెలియదు. విక్రంకు మాత్రం అసలే తెలియదు.

★ ★ ★



# రచయిత గురించి

ప్రొ॥ పి.వి. రెడ్డి గారు 1932 వ సంవత్సరంలో హైదరాబాదుకు యిరవై ఎనిమిది మైళ్ళ దూరంలో నున్న నాగారంలో జన్మించారు. 1954 లో ఉస్మానియా విశ్వ విద్యాలయం నుండి బి.ఎస్‌సి., (అగ్రికల్చర్) పూర్తి చేసి, 1956 లో ఉస్మానియా లా కళాశాల నుండి ఎల్ ఎల్.బి., డిగ్రి అందు కున్నారు. 1961 లో ఉన్నత విద్య కోసం అమెరికాకు వెళ్ళి అచ్చటే ఆచార్య పదవిలో స్థిరపడ్డారు. 1992 వ సంవత్సరంలో ధర్మ పత్ని దివంగతురాలు కాగానే ఆ పదవులకు రాజీనామ చేసి యిప్పుడు అచ్చటనే తన కుమారుడు, కోడలు, మనుమడుతో Tempo Fl. పట్టణంలో వుంటున్నారు.